milation, boḍḍannā) dugu-n-ā (23), 'silent-be' cf. Sōrā.—kaḍḍam-n-ā (kaddab-n-ā) ḍaku-n-ā.

The subjunctive or conditional mood is formed by the addition of the particle—ḍēn [cf. Sōrā.—(en) ḍēn] to verbs. Ex. iṅkā-ḍēn, *lit.* 'not-if', meaning 'if not'; tāy(i)-ḍēn (29), *lit.* 'gave-if,' meaning 'if (you) gave.' The i in tāyi is left out in rapid pronunciation.

āi at the end of some verbs denotes, as in Sōrā, (1) motion towards the person speaking in the case of verbs of motion and (2) completion of action in the case of some other verbs. Ex Wāi, 'come'; gulloṅ-āi (57), 'call hither'; doyā-ḍā-iṅ-āi (12), 'kindness-be-to me'; uṅoṅ-āi (63) 'it became dark'; tōm-iṅ-āi (3), 'keep me on'; mō-tāy-iṅ-āi (2) '(thou) give away to me'.

kī in mo-yi-ki ? (19) 'you came-what ?'; kā in nāi-kā (34, 37), 'what so ever'; ēkā in āin-ēkā (3) 'accordingly' (*lit.* thus only) and words like gorti-lōk, 'slave or serf,' sobu-lōk, 'all,' padān, 'outside,' (nōn)-uttāre, 'thereupon,' indicate the Oriya influence on this language.

There are many words common to Gutōb, Rēmō, Parēṅ and Sōrā, some of which are given below.

| *Gutōb.* | *Rēmō.* | *Parēṅ.* | *Sōrā.* | |
|---|---|---|---|---|
| (aḍu-) ōn | ōñ | aṅōn | o ? on | (=son). |
| mbōp | bōp | bāp | b ? ōb | (=head). |
| mōñ | mōñ | māñ | m ? od | (=eye). (contr-mad) |
| mi | semi | muñ | m ? ūn | (=nose) |
| lintir | lintür | lūt | l ? ūd | (=ear) |
| tummo | tummo | tōt | t ? ōd | (=mouth) |
| lāṅ | leāṅ | lāṅ | l ? āṅ | (=tongue) |
| isāl | isā | usāl | usāl | (=skin) |
| billi | bullu | bulu | bulu | (=thigh) |

| *Gutōb.* | *Rēmō.* | *Parēṅ.* | *Sōrā.* | |
|---|---|---|---|---|
| gimē | gimē | kinmēn | kimmēd | (=goat) |
| girēm | grēm | rumaṅ | rumēṅ | (=cat) |
| boṅtēl | bontē | boṅtēl | boṅtēl | (=buffalo) |
| r ? ō | (hatti) | rā | r ? ā (-n) | (=elephant) |
| iām | miām | miām | miñām | (=blood) |
| ruku | ruṅku | ruṅku | ruṅku (ruku in Jirang dialect) | (=rice) |
| illi | sal-pün | ali | ali- (sāl, contr. form) | |
| biyēr | bēra | biyō-gi | biyō | (=to-morrow) |

G. S. Press, Lino Printers, Madras.

# తెనుగు

బులుసు పాపయ్యశాస్త్రి

తెనుగుభాష ఉత్పత్తివిషయములో అనేకవాదములు వ్యాపించి ఉన్నవి. అన్నిటిలో మొదటిది మనవైయాకరణులు చెప్పేది. "ఎల్లభాషలకును దల్లి గీర్వాణంబు." "సంస్కృతము ప్రకృతి, తెనుగు దానివికృతి," అని వారివాదము. తెనుగు అరవముకు వికృతి అని అరవలవాదము. కన్నడముకు వికృతి అని ఇటీవల బయలు దేరిన 'కన్నడిగ'లవాదము. 'పులిమీాద బుట్ర' అన్నట్టు ఇప్పుడు మరొకవాదము బయలుదేరినది. తెనుగు బహుపురాతన మయినదనిన్ని, దాక్షిణాత్యభాషలయిన అరవము, కన్నడము మొదలయినవాటికే కాక ఇంగ్లీషు, జెర్మను మొదలయిన ట్యూటనిక్కు-భాషలకున్ను మాతృభాష అనిన్ని యీాకొత్తవాదము. ఈవాదమును లేవదీసినవారిమతమున 'నాకు' అనే తెనుగుక్రియకు 'లిక్' (lick) అనేయిం గ్లీషుక్రియ వికృతి. 'మేఁత' అనేతెనుగునామముకు 'మీాట్' (meat) అనే యింగ్లీషునామము వికృతి. వారు తమవాదముకు ఉపబలముగా ఇటువంటి ప్రకృతివికృతులు అనేకములు కనపరుస్తున్నారు.

పాశ్చాత్యులు పరిశోధనచేసి, అరవము, తెనుగు, కన్నడము మొదలయిన దాక్షిణాత్యభాషలు అన్నీ ఒకానొకమూాలభాషకు వికృతులు అనిన్ని, ఆమూల భాష ఇప్పుడు అంతరించినదనిన్ని చెప్పి, దానినుండి పుట్టినభాషలకు 'ద్రావిడ భాషాకుటుంబము' అని పేరుపెట్టినారు. 'ద్రవిడ' శబ్దముకు వాడుకలో అరవము అని అర్థము. అందుచేత అరవలు తమ అరవము, తెనుగు, కన్నడము మొదలయిన భాషలకు తల్లి అనిచెప్పుకుంటూ పొంగుతారు. 'ద్రావిడభాషాకుటుంబము' అనే పేరు కల్పించినవారి అభిప్రాయము తెనుగు, కన్నడము మొదలయినవాటివలెనే అరవమున్ను 'ద్రవిడము' అని తాము అన్నమూాలభాషకు వికృతే కాని తక్కిన దాక్షిణాత్యభాషలకు ప్రకృతి అని కాదు. వాడుకలో అరవముకు పర్యాయపదముగా ఉన్న 'ద్రవిడ' శబ్దమును దాక్షిణాత్యభాషాకుటుంబముకు అంతకును పేరుగా వాడడమువల్ల ఈ కలవరము కలిగినది.

ఆర్యులు దక్షిణదేశములో వ్యాపించకమునుపే - శ్రుతిస్మృతిపురాణేతిహాస రూపమయిన ఆర్యవాఙ్మయము దక్షిణదేశములో చొరకమునుపే - అరవములో వాఙ్మయము ఉండె నని కొందరు అంటారు. కాని అరవలిపి ఆర్యలిపివికృతే కనుక నున్ను, లిపి రాకముందు వాఙ్మయము పుట్టి ఉండదు గనుకనున్ను ఆమాట సంశయగ్రస్తమయి ఉన్నది. 'ఇలక్కణమ్' (= లక్షణమ్), 'కాప్పియమ్' (= కావ్యము) మొదలయిన అరవమాటలు సంస్కృతశబ్దవికృతులే అయి ఉండడము ఈ సంశయమును బలపరుస్తూ ఉన్నది.

సంస్కృతము ప్రత్యక్షముగాను, మరాటీప్రభృతిప్రాకృతములద్వారా పరోక్షముగాను దక్షిణమున అలమినది. దానితోవకు ముందుగా గురి అయిన కన్నడమునున్ను, తెనుగుకున్ను దానిదెబ్బ బాగా నాటినది. ఆరెండుభాషలున్ను ఆదెబ్బవల్ల ఎక్కువగా లాభమే పొందినవి. సంస్కృతశబ్దముల నన్నింటినీ తమలోకి గ్రహించినవి. వాటిని నిర్దుష్టముగా పలుకనేర్చినవి. ప్రాకృతశబ్దములనున్ను కొన్నిటిని తమలో చేర్చుకున్నవి. సమగ్రమయినలిపి తెచ్చుకున్నవి. అరవము ఇంత లాభము పొందలేదు. అరవలు సంస్కృతశబ్దములు తిన్నగా పలుకలేరు ; తమభాషకు సరిపడేటంతమాత్రమే లిపి తెచ్చుకోవడముచేత సంస్కృతశబ్దములు ఆలిపితో వ్రాయలేరు. వారి ఉచ్చారణలోను వ్రాతలోను 'రాధ' అనే శబ్దము 'ఇరాదై'; 'భాషితమ్' అనేశబ్దము 'పాడిదమ్'; 'లోకాయతమ్' అనేది 'ఉలగాయిదమ్'.

దాక్షిణాత్యులు సంస్కృతగ్రంథములు చదివినతరువాతనే గ్రంథరచన ఆరంభించిరి. ఆకారణముచేత వారిగ్రంథములకు సంస్కృతగ్రంథములే మాతృకలున్ను మాదిరులున్ను అయినవి. మన ఇతిహాసముకు సంస్కృతేతిహాసమే మాతృక ; మనపురాణములకు సంస్కృతపురాణములే మాతృకలు. మనకావ్యములకున్ను ప్రబంధములకున్ను సంస్కృతకావ్యములున్ను ప్రబంధములున్ను మాదిరులు. తుదకు సంస్కృతమూ తెనుగూ వేరువేరు స్వభావములు గలవి అయినా తెనుగు వ్యాకరణముకూడా సంస్కృతవ్యాకరణముపోలికనే పుట్టినది. ఈ అనుకరణముచేత తెనుగుభాష తత్వము కొన్నికొన్నిపట్ల మరుగుపడినది.

తెనుగువ్యాకరణములో పరిభాష సంస్కృతవ్యాకరణపరిభాషే. అది ఒకొక్కచోట అసంగతముగా ఉన్నది. సంస్కృతవ్యాకరణములో అక్షరసమా

మ్నాయమును చెప్పేసూత్రములలో మొదటినాలుగున్ను ' అఇఉణ్, ఋఌక్, ఏఓఙ్, ఐఔచ్ ' అనేవి. వీటిలో మొదటిదాని మొదటిఅక్షరము 'అ'; తుదిదాని తుదిఅక్షరము 'చ్'. ఆరెంటిని గలుపగా 'అచ్' అయినది. ఆనాలుగుసూత్రముల లోను చెప్పినఅక్షరముల కన్నింటికీ 'అచ్' అనే పదము సంజ్ఞగా ఆవైయాకరణులు ఏర్పర్చుకున్నారు. 'హల్' అన్న సంజ్ఞకూడా ఆలాగునే పుట్టినది. ఈహేతువుచేత 'అచ్' 'హల్' సంజ్ఞలు సంస్కృతవ్యాకరణములో ఉపపన్నములు. తెనుగువ్యాక రణములో అక్షరసమామ్నాయము ఆసూత్రములతో చెప్పలేదు. అందుచేత తెనుగువ్యాకరణములో ఆసంజ్ఞలు అనుపపన్నములు.

ధాతువులనుండి పుట్టిన 'కృత్వా', 'కర్తుమ్', 'కుర్వన్' మొదలయిన లాక్ష ణికావ్యయములకు 'క్త్వాంతములు', 'తుమున్నంతములు,' 'శత్రంతములు' అనే పేరులు సంస్కృతవ్యాకరణములో యుక్తము అనవచ్చుగాని తెనుగున 'క్త్వ', 'తుమున్', 'శతృ' ప్రత్యయములు లేవు గనుక ఆపేరులు తెనుగు వ్యాకరణములో యుక్తములు గావు.

విభక్తివిధానమందున్ను సంస్కృతానుకరణము తెనుగుకు పొసగినదికాదు. ఈ రెండుభాషలలోను విభక్తులలక్షణములు వేరు వేరు అయినవి. అయినప్పటికీ సం స్కృతములో ఏడువిభక్తులు గనుక తెనుగులో కూడా ఏడువిభక్తులు అన్నారు. సం స్కృతములో విభక్తికి వచనమునుబట్టి ప్రత్యయభేదము ఉన్నది. చతుర్థికి ఏకవచన ములో ప్రత్యయము 'ఏ', బహువచనములో 'భ్యస్'. తెనుగులో ఏవచనమైనను చతుర్థికి 'కై' అన్నదే ప్రత్యయము. వచనభేదముతో ప్రత్యయభేదము కలుగ లేదు. తక్కినవిభక్తులకున్ను ఇదేరీతి. నామముల అంత్యాక్షరమునుబట్టి సంస్కృత ములో ప్రత్యయములు మారడమున్ను కలదు. 'రామ' శబ్దముచతుర్థి 'రామాయ' 'రామశర్మన్' అనేశబ్దముచతుర్థి 'రామశర్మణే'. తెనుగున అటువంటిమార్పుల ఉండవు. తెనుగున తృతీయకు 'చేతన్', 'తోడన్' అనిన్ని, పంచమికి 'వలనన్' 'కంటెన్' అనిన్ని వేరు వేరు అర్థములు గల రెండేసిప్రత్యయములు అంటగట్టినారు సంస్కృతములో వేరువేరు అర్థములతో ఒకవిభక్తికే రెండేసిప్రత్యయములు లేవు 'వలనన్', 'లోన్' అనేవి విభక్తిప్రత్యయము లన్నప్పుడు 'క్రిందన్', 'ముందటన్' 'వెనుకన్' మొదలయినవిన్ని విభక్తిప్రత్యయములే అనవలెను. ఎందుకు అనలేదు

కారణము మరేమీ లేదు. 'వలనన్', 'లోన్' అనేవి సంస్కృతవిభక్తిప్రత్యయము
లకు సరిఅయినఅర్థము గలవి. 'క్రిందన్' ప్రభృతులు ఏసంస్కృతవిభక్తికిన్ని సరి
పడవు. ఇటువంటిభేదములు ఉండడమువల్ల సంస్కృతములో ఏడువిభక్తులు ఉన్న
వన్న కారణమునుబట్టి తెనుగునకూడా ఏడువిభక్తులు ఉన్నవి అనడము యుక్తము
కాదు.

తెనుగుకు కొన్నిపట్ల సంస్కృతసాహాయ్యము అతిమాత్ర మయినట్టు కన
పడుతుంది. వాడుకలో కొన్ని సంస్కృతశబ్దములు తెలుగుశబ్దములస్థానమును పూ
ర్తిగా ఆక్రమించినవి. కొన్ని వాటితో పోటీచేస్తూ ఉన్నవి. కొన్ని వాటితో ఉమ్మడి
కూడుతున్నవి. తెనుగుదేశము చాలాభాగము సముద్రమును ఒరసి ఉన్నది. అందు
చేత సముద్రముకు తెనుగుపేరు ఏదో వాడుకలో ఉండే ఉంటుంది. అది యిప్పుడు
వాడుకలో కనపడదు. సంస్కృతశబ్ద మయిన 'సముద్రము' అనేదే దేశమందు
అంతటనూ పండితులలోనూ పామరులలోనూ కూడా వాడుకలో ఉన్నది. అక్క
డక్కడ దానివికృతి అయిన 'సంద్రము' అనేశబ్దమున్ను వినబడవచ్చును. 'మనుష్య'
శబ్దముకు సరి అయినతెనుగుమాట యిప్పుడు ఏదీ కనపడదు. కొన్ని సంస్కృత
శబ్దములు వాటికి సరి అయినతెనుగుశబ్దములు ఉన్నప్పటికీ వాటిని పుస్తకాలలో
అణగదొక్కి తామే వాడుకలోకి వచ్చినవి. 'భయము' 'వెఱపు' ను
తోసివేస్తూ ఉన్నది. 'జ్వరము' న్నూ, 'ఉష్ణము' న్నూ 'వేకి' ని గెంటివేసి
నవి. 'కుక్క' 'నాయి'ని పారదోలినది. 'దేవుడు' 'వేల్పు'ను వినబడనీయ
లేదు. 'వ్యవసాయము' 'సేద్య'మును మూలకు నెట్టినది. 'మాంసము' 'ఎఱచి',
'నంజుడు,' 'పొలసు' శబ్దములకు తోసిరాజుచెప్పినది. 'సొమ్ము' 'విడిముడి'ని
కనపడనీయదు. 'ప్రాణము' 'ఉసురు'ను తొక్కిపెట్టినది. 'రక్తము' 'నెత్తురు'తో
పోటీచేస్తూ ఉన్నది.

ఇటువంటిపారతంత్ర్యము ఎంత అలమినా తెనుగు తనద్రావిడభాషాకుటుం
బాంతర్భూతత కోల్పోలేదు. భాషలయేకజాతిత్వము నిర్ణయించడానకు ముఖ్యాధా
రములు ఆయాభాషలలోని సర్వనామములు, సంఖ్యావాచకములు, దేహావయవ
ములపేర్లు, చుట్టరికములపేర్లు. అటువంటిశబ్దములు కొన్ని యిక్కడ వ్రాస్తున్నాను.
ద్రావిడభాషలలో తెనుగుదేశమును అంటిఉన్నదేశములభాషలు అరవము, కన్న

దము, కోదు మాత్రమే. కనుక పోలికలు చూడడానకు ఆభాషలమాటలే వ్రాస్తున్నాను. సంస్కృతము విజాతీయత తెలియడానకు సంస్కృతశబ్దములుకూడా వ్రాస్తున్నాను.

| సంస్కృతము | తెనుగు | అరవము | కన్నడము | కోదు (=కూయి) |
|---|---|---|---|---|
| అహమ్ | నేను, ఏను | నాన్ | నాను | ఆను |
| వయమ్ | మేము, ఏము | నామ్ | నావు | ఆము |
| త్వమ్ | నీవు, ఈవు | నీ | నీను | ఈను |
| యూయమ్ | మీరు, ఈరు | నీర్ | నీవు | ఈరు |
| ... | తాను | తాన్ | తాను | తాను |
| సః | వాఁడు | అవన్ | అవను | ఎవంజు * |
| తే | వారు | అవర్ | అవరు | ఎవరు |
| తద్ | అది | అదు | అదు | ... |
| ఏక | ఒక, ఒండు | ఒన్ఱు | ఒందు | రోండె |
| ద్వి | రెండు | ఇరండు | ఎరడు | రీండె |
| త్రి | మూఁడు | మూన్ఱు | మూఱు | మూంజి |
| చతుర్ | నాలుగు | నాలు, నాన్గు | నాల్కు | నల్గి, నల్ |
| పంచ | ఐదు | ఐందు | ఐదు | ... |
| షష్ | ఆఱు | ఆఱు | ఆఱు | ... |
| సప్తన్ | ఏడు | ఏఱు (ఏడు) | ఏఱు (ఏళు) | ఒడ్గి |
| అష్టన్ | ఎనిమిది | ఎట్టు | ఎంటు | ... |
| నవ | తొమ్మిది | ఒన్బదు | ఒంబత్తు | ... |
| దశన్ | పది | పత్తు | హత్తు ♦ | ... |
| శిరస్ | తల | తలై | తల | త్లాఉ |
| నేత్ర | కన్ను | కణ్ | కణ్ణు | కను |
| నాసా | ముక్కు | మూక్కు | మూగు | మూంగెలి |

* కోదుభాషలో డకారమునకు జకారాదేశము అక్కడక్కడ గలదు.

♦ కన్నడమున పకారమునకు హకారాదేశము తఱచు.

| సంస్కృతము | తెలుగు | అరవము | కన్నడము | కోదు (=కూయి) |
|---|---|---|---|---|
| దంత | పల్లు | పల్ | హల్లు * | పలు |
| శ్రవస్, కర్ణ | చెవి | శెవి | కివి † | క్రియు |
| జిహ్వ | నాలుక | నాక్కు | నాలిగె | ... |
| కర, శయ | చేయి, కై | కై | కై | కాజు |
| తాత, పితృ | తండ్రి, అబ్బ | అప్పన్ | అప్ప, తందె | అబ, తాంజి |
| అంబా, మాతృ | అమ్మ, తల్లి | తాయ్ | తాయి | ఇయ, తడి |
| అనుజ | తమ్ముండు | తంబి | తమ్మ | తంబెస, అంబెస |
| లిక్షా | పేను | పేన్ | హేను * | పేను |
| కుక్కుట | కోడి | కోటి(కోడి) | కోటి (కోళి) | కోజు |
| వరాహ | పంది | పణ్రి | హంది * | పాజి |
| (మీన) | మీను | మీన్ | మీను | మీను |
| ధనుస్ | విల్లు | విల్ | బిల్లు | విడు |
| (అంబక) బాణ | అమ్ము, అంబు | అంబు | అంబు | అంబు |
| పుష్ప | పూ, పూవు, పువ్వు | పూ | పూ, హువ్వు * | పూజు |
| క్రిమి | పురుగు, పురువు | పుఴు(పుదు) | హులు * | ప్రిఉ |
| హల | ఏరు | ఏర్ | ఏరు | సేరు § |
| అహి | పాము | పాంబు | పావు, ♦హావు | ... |
| వ్యాఘ్ర | పులి | పులి | హులి * | ... |

ఈమాటలు దిక్సూచకముగా వ్రాసినాను. ఇటువంటిమాటలు వంద లున్నవి. (పయినివ్రాసినమాటలలో 'మీన' శబ్దము ద్రావిడభాషలలోనుండే సంస్కృతములో చొచ్చి ఉండవచ్చుననిన్ని, 'అంబక' శబ్దములోను 'అంబు' శబ్దములోను గల అక్షరసామ్యము యాదృచ్ఛిక మనిన్ని అనుమానము.)

మాటలలోనేకాక ప్రత్యయములలోనూ ద్రావిడభాషలసజాతిత్వమున్ను, సంస్కృతభాష వాటికి విలక్షణమయి ఉండడమున్ను కనపడుతవి.

* కన్నడమున పకారమునకు హకారాదేశము తరుచు.

† ద్రావిడభాషలలో కకారచకారములకు పరస్పరాదేశము అక్కడక్కడ గలదు.

§ కోదుభాషలో పదాదిస్వరమునకు ముందు సకారాగమము కొన్నిచోట్ల కనపడుతుంది.

♦ కన్నడమున పదాంతమందున్న ము వర్ణమునకు వు వర్ణాదేశము తరుచు.

| సంస్కృతము | తెనుగు | అరవము | కన్నడము | కోదు |
|---|---|---|---|---|
| స్ | అండు (పుం) | అన్ | అను | అంజు |
| ఆ, ఈ | ఆలు (స్త్రీ) | అళ్ | అళు | అలి, ఆలి |
| మ్ | ము (నపుం) | మ్ | వు | ... |
| అస్ | లు,గు,కలు (బహువచన) | ర్, గళ్ | రు, గళు | ంగ,క,అరు |
| ఏ | కున్, కై | కు | ఇగె,ఇక్కె | కి |
| ఇ | లోన్, అలి | ఇల్,అళ్ళై,ఉళ్ | అల్లి | లై |

వ్యతిరేకార్థకక్రియలు ( సంస్కృతములో లేవు. )

| | తెనుగు (నడచు) | అరవము (నడ) |
|---|---|---|
| (పుం) | నడవండు - నడవరు | నడవాన్ - నడవార్ (గళ్) |
| (న) | నడవదు - నడవవు | నడవాదు - నడవా. |
| | నడవవు - నడవరు | నడవాయ్ - నడవీర్ |
| | నడవను - నడవము | నడవేన్ - నడవోమ్. |

| తెనుగు (తెలియు) | కన్నడము (తిళి) |
|---|---|
| తెలియండు - తెలియరు | తిళియను - తిళియరు |
| తెలియదు - తెలియవు | తిళియదు - తిళియవు |
| తెలియవు - తెలియరు | తిళియె - తిళియరి |
| తెలియను - తెలియము | తిళియెను - తిళియెవు |

| తెనుగు (ఇచ్చు=ఈ) | కోదు (సీ=ఈ) |
|---|---|
| ఈయండు - ఈయరు | సీయెంజు - సీయేరు |
| ఈయదు - ఈయవు | సీయే - సీయేవి |
| ఈయవు - ఈయరు | సీయాయి - సీయేరు |
| ఈయను - ఈయము | సీయేను - సీయాము |

ఈపయిని వివరించిన పోలికలనుబట్టి తెనుగు సంస్కృతానకు వికృతి అనడము యుక్తము కాదనిన్ని, అరవము, కన్నడము మొదలయినభాషలవలెనే ద్రావిడ భాషాకుటుంబములో చేరినదనిన్ని ఊహించవచ్చును.

# ఆంధ్రభాషాసంప్రదాయము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

" భాషేయ మమితా దేశ్యా తత్ర చిత్రస్వభావయుక్ "

వ్యక్తవాక్కు భాష. అనఁగా. ఒకరియభిప్రాయ మొకరికిఁ దెలియుటకై మానవు లేర్పఱుచుకొని విస్పష్టముగా నుచ్చరించునట్టివాగ్రూపము లైనగుర్తులు. అది యొక్కొక్క దేశమువారి కొక్కొక్క విధముగా నుండి, ఆదేశీయులపేర దేశభాష యగును. అట్టిదే ఆంధ్రభాష.

ఆర్యులు రాకపూర్వము తెలుఁగునాట ననాదిగా నున్నపాఁతకాఁపుల వాడుకలో నున్నమాటలును, ఆర్యులు వచ్చినతరువాత నందు ప్రవేశించిన సంస్కృత ప్రాకృతశబ్దములును, కలిసి ఆంధ్ర మనుపేర మనభాష యేర్పడినది. ఇది సుమారు రెండువేలయేళ్లక్రిందటిమాట. అయితే నేమి? నాఁటితెలుఁ గిట్లుండు నని, ఊహించవలసినదే కాని దానికి నిదర్శన మేమీ కనఁబడదు. కనఁబడినంతలో నాఁటి వర్ణక్రమాదికము కొంచెము తెలుపుట కెనిమిదోశతాబ్ది కీవలఁ బుట్టినకొన్ని శాసనములు తోడ్పడుచున్నవి కాని, అవి మనయుద్దిష్టార్థము విశదీకరింపఁజాలవు. అందుచేఁ బూర్వగ్రంథములే శరణము. అందు మొదట గణింపఁదగినది భారతము. అదైనా పుట్టినది పుట్టినట్టుగా దొరకితే యెంతో సంతోషించియుందుము కాని, అట్టి భాగ్యము పట్టలేదు. లభించినవ్రాఁతప్రతులలోని వివిధములైన పాఠాంతరములు చూడఁగా, లేఖకులయవివేకప్రమాదాదిదోషములవల్ల గ్రంథకర్తలప్రయోగము లనేకములు మాఱిపోయినట్లు స్పష్ట మగుచున్నది. దీనికిఁ దోడు ముద్రణములలోఁ గ్రమక్రమముగా మఱికొన్నిప్రయోగములు మాఱువేషము వేసినవి. ఇందుకుఁ గారణములు రెండే. భారతమున కెంతో తరువాతఁ బుట్టినను, ఆంధ్రశబ్దచింతామణిబాలవ్యాకరణసూత్రములకు విరుద్ధముగాఁ గనఁబడినవాటికర్మ మొకటి. ఆంధ్రభాషాసంప్రదాయ మెఱుఁగని యఱవతెలుఁగువారు పాఠపరిష్కర్త లగుట మఱియొకటి. ఆవ్యాకరణములు శాసింపనిప్రయోగము లుండరా దనెడిపరిష్కర్తలశాస

నము సుమారు ముప్పదినలువదియేళ్లకిందటఁ బుట్టినదే కాని, అంతకు ముం దున్నట్లు కనఁబడదుగాని, అంతకు వెనుకటిముద్రణములకు మఱికొన్ని యనర్థములు పట్టినవి. ఏలాగైతే నేమి ? ఇప్పటి ముద్రితాముద్రితభారతములోనికొన్నిప్రయోగములు కవిత్రియమువారినోళ్లనుండి పుట్టినవి కావు. ఈదురవస్థ భారతమునకే కాదు. చెన్నపురిలో ముద్రింపఁబడినప్రబంధముల కన్నిటికిని బట్టినది. ఇది యిట్లుండనీ! వ్యాకరణములమాట కొంచె మాలోచింతము.

నన్నయార్యుని పర్వత్రయి కాతని భాషాసవిమర్శజ్ఞానమే లక్షణము. నన్నెచోడతిక్కనాదికవీంద్రులు కొందఱి కతనిరచనము లక్షణము లక్ష్యము నై దారి చూపినది. వారిసవిమర్శవ్యవహారభాషాజ్ఞానమును వారికిఁ దోడ్పడినది. తిక్కనసమకాలికుఁడు కేతనార్యుఁడు తరువాత నాంధ్రపద్యరూపమున నాంధ్రభాషాభూషణ మనుపేరఁ జిన్నవ్యాకరణము రచియించెను. అది, ఆంధ్రభాషబహిరాకార పదిగో యని చూపించినయసమగ్రలక్షణము. అథర్వణునిలక్షణ మంతకంటె నించుక విపులమై భాషాసంప్రదాయముపై నొకింత దృష్టి నిలిపినది గాని కాలకర్మవశమున దానికి వ్యాప్తి కలిగినది కాదు. ఆంధ్రశబ్దచింతామణి పాణినీయపద్ధతి ననుసరించినను, దానివలెఁ గవిప్రయుక్తశిష్టవ్యవహృతశబ్దములకుఁ దా ననుశాసనము గాక నిరంకుశమైనప్రభుశాసన మైనది. అది పైలక్షణములకంటె హెచ్చుగా నన్నివిషయములు స్పృశించిన దైనను దననాఁటికి లభించినయనేకశబ్దములకు గతి కల్పించినది కాలేదు. అయినను సంస్కృతశ్లోకనిబద్ధ మైనయాలక్షణము దేశమందలి సంస్కృతాభిజ్ఞుల యాదరమునఁ బఠనపాఠవ్యవహారమునఁ జక్కఁగా వ్యాప్తిని గాంచినది. బాలవ్యాకరణము పుట్టువఱకును దెలుఁగున కదే వ్యాకరణ మనవచ్చును. పిదపఁ జెప్పఁదగినది దానివ్యాఖ్యాన మైనయహోబలపండితీయము. కాని,అది సంస్కృతభాషలో వ్రాయఁబడినది. అక్కడక్కడ మాత్ర మించుక వ్యాపించినది. ఇంకను మఱికొన్ని కలవుగాని, పిదప గణింపఁదగినది బాలవ్యాకరణమే. తెలుఁగున మంచిపద్ధతిని వ్రాయఁబడినతెలుఁగువ్యాకరణ మిదే. ఇది యుదయించినముహూర్తము మంచిది. ఇది పుట్టినంతనే తననాఁ డంతమాత్రపువ్యాకరణము లేకపోవుటచేతను, ఆంగ్లపాఠశాలలలోని తెలుఁగువిద్యార్థులకు ముఖ్యపాఠ్యగ్రంథ మగుటచేతను విషయముచేతను గూడఁ బ్రశస్తి గాంచి, నేఁటివఱకును దేశమున విశేషవ్యాప్తి గాంచుచున్నది. ఇపు డాం

ధ్రిదేశమం దున్న పండితు లందఱును ముందు దానిని జదివి తరువాతఁ గావలసినఁ జింతామణ్యాదులు చూచినవా రనుట సత్యము. అందుచే మన కందఱికిని గూడఁ బ్రాథమిక భాషాజ్ఞాన ముపదేశించినదానికి మ్రొక్కవలసినదే. కాని, చిన్నయసూరి లోకజ్ఞుఁడును నన్నయాదిపూర్వమహాకవులగ్రంథములు శ్రద్ధగాఁ జదివినవాఁడు నయ్యుఁ దనకాలమునకు భాష పలుతెఱంగుల మాఱుచు వచ్చినవిషయము తెలిసిన వాఁ డయ్యు నేకారణముచేతనో పూర్వమహాకవులయనేకప్రయోగముల కనుశాస నము చేయక, పైగా వారిప్రయోగములు కొన్ని యసాధువు లని కంఠోక్తిగాఁ జెప్పి, కవిత్రయమువారిప్రయోగములు గూడఁ గొన్నియసాధువు లని తోఁచునట్లు సూత్రముల సూచించి వ్యాకరణకర్తృముఖ్యకర్తవ్యమును జక్కఁగా నిర్వహింపలే దని విచారింపవలసివచ్చినది. నిజముగా నతఁడే పూర్వశిష్టప్రయోగదృష్టితోఁ బాణినికాత్యాయనులమార్గ మనుసరించెనేని యీ మధ్యకాలమున భాష కిట్టి దుర్గతి పట్టకపోవును. కాని, భగవంతుఁ డతని కాబుద్ధి పుట్టించలేదు. వ్యాకరణము లీ తీరున నున్నపుడు నిజమైనభాషాసంప్రదాయము దేశీయులకుఁ దెలియలే దన్నఁ దప్పేమి ? ఇఁక నీవిషయ మిట్లుంచి ముందు చూతము.

ఏదేశమం దయినా, పండితపామరు లందఱు "భాష ముందు పుట్టినది, వ్యాకరణము తరువాతఁ బుట్టినది" అని యేకగ్రీవముగా నంగీకరింతురు. వాడుకలో నున్న దేశభాష కాలక్రమమునఁ దప్పక మాఱుచుండు నని విశ్వసింతురు. కాని, మనయంధ్రులలో మాత్రము కొందఱీమాటలు చెవిని బెట్టరు. కావ్యయజ్ఞమందు సుశబ్దవాగపశ్వాలంభము చేయునట్టివైదికకర్మనిష్ఠు లైనయామహావిద్వాంసులు వ్యాకరణ మపౌరుషేయము నిత్యము నైనవేద మనియు, దానివల్లనే భాషాసృష్టి యైన దనియుఁ ద్రికరణశుద్ధిగా నమ్ముదురు. వారిమతములో, ఆంధ్రశబ్దచింతామణి మంత్రము. అహోబలపండితీయము బ్రాహ్మణము. బాలవ్యాకరణము కల్పసూత్రము. అంతే. తక్కినసూత్రగ్రంథమంతా కల్పితము పౌరుషేయము కావున నది కావ్యకర్త్రాచరణమున నుపాదేయము కా దని ఢంకామీద దెబ్బ కొట్టి, చెప్పుదురు. అంతే కాని 'ఇది యసమగ్రము. ఇందు లేనివిషయములు పూర్వులప్రయోగపద్ధతినిబట్టియు, పరిష్కారపద్ధతినిబట్టియు గ్రహించవలెను' అని వారికిఁ దోఁచదు. ఇతరులు చెప్పినా వినరు. వారు పట్టినకుందేటికి మూఁడే కాళ్లు. అట్లని వారు, తమ వేదశ్రౌత

ములకు, కట్టుబడి యుంటే బాగానే ఉండును. అట్లుండక, ఎందును బొందని ప్రయోగసృష్టి యారంభించిరి. దానితో సంఘము రెండు చీలికలైనది. ఆ రెండు పక్షములకు యుద్ధ మారంభమైనది. అది నేటికిని జరుగుచునే యున్నది కాని, మొదట మూఁడునాలుగేళ్ళు నిరంతరము పోరు జరుగుచున్నప్పటికి రెండుపక్షములవారికిని గాళ్ళు చల్లబడినవి. ఆపోరు వర్ణనాతీతము. దాని కేమి కాని, ఏదో స్వలాభ మపేక్షించి మొదట గ్రాంథికభాషావాదము కృత్రిమ మని చేతా వాతా చెప్పుచు, వ్యావహారికభాషాధ్వజము బుజాన వేసికొని, ఊరూర నూరేగినయిద్దఱుముగ్గురు, తమపని తీరిన వెంటనే రెండోపక్షమువల్ల లాభము కోరి బాజా మార్చి తీరగాంథిక వేషము వేసిరి. వ్యావహారికభాషావాద మసంగత మనుచు గొంతెత్తి గ్రాంథికభాషావాదము ఘోషించినపెక్కండ్రు తిరిగి వ్యావహారికభాషాపక్షమునఁ జేరిరి. రెండుపక్షములలోని మంచిచెడ్డలు పరామర్శించినకొంద ఱుభయపక్షములకు సంధి చేయ యత్నించిరి. అయిన నేమి? గ్రాంథికభాషావాదులు సర్వస్వము పోయినా సరే కాని సంధి కొప్పుకొందురా? అబ్బే! పైగా సంధి కుద్యమించినవారిని దూషింప మొదలు పెట్టిరి. చివర కీమహాసంగ్రామమువల్ల సంభవించిన దేమందురా? వినండి. మొదట భాషావిషయమున రెండుపక్షములే కాని, యిపుడు రెండువందలపక్షము లేర్పడినవి. ఎవరిసంప్రదాయము వారిదే. ఎవరిప్రయోగములు వారివే. ఎవరివ్యాకరణము వారిదే. ఎవరియిష్టము వారిదే. హద్దు లేదు. ఆజ్ఞ లేదు, ఆఁ లేదు, ఊఁ లేదు - తనసారస్వతమునకు సంభవించినయీగ్రహచారదోషమునుబట్టి, ఆంధ్రభాష తన్నుఁ దా మఱచిపోయి గంగవెఱ్ఱు లెత్తినట్లు గంతులేయుచున్నది. ఇపు డెవరి నేమంటే యేమిలాభ మున్నదో, ఆలోచించండి. ఇం తెందుకు?—

‘నాచెప్పినదే వేద’మని వాదించేవరిమత్పత్రికవంటిగొప్పమాసపత్రికయు, మాదిమడికట్టుకొన్న భాష యని యభిమానము వహించేవరిమత్సభాధ్యక్షులవంటిమహాపండితులును, మేము భాషకు మార్గదర్శకుల మనేవీరగాంథికభాషావాదులును, భాషాసంప్రదాయమునకును వ్యాకరణమునకును, పంగనామము పెట్టి తమయిష్టము వచ్చినట్లు నూతనశబ్దరూపసృష్టి చేయుచుండఁగా, ఎవరో దినవారమాసపత్రికలలోను నవలలలోను నాటకములలోను వ్రాయునది యథేష్టముగా నున్న దని విమర్శింపనేల? ఇపు డట్టివారియమూల్యప్రయోగా లన్నీ చూపవల మంటే, ఎలుఁగు

బంటికి తంటసము వేయడమే. అందుచే మచ్చు కేవో నాలుగుమాటలు చూపు
చున్నాను.

‘ఆంగీరస - దీనినంతయు-అచ్చోటునకు-ఈప్రదర్శనమును విరమించుచున్నాను-
కన్పడు - కలహమునకుఁగాలుదువ్వెదవా - ఇక్కడకు - కల్లుదేరు నెపంబు - నలుబది-
ఈరెంటికి నొక్కరినే కర్తలుగా - తొమ్మండ్రుగురు - పైనఁజెప్పిన - రమణునిదోడి
తేరుటకు - తెలుపఁగవైతివి - మీరుచెప్పిరి - చెప్పుకొనియైనతర్వాత - ఔపడు -
చాల్చాలు - శోభస్కరము - చక్కగా - ( ఇది ‘ చక్కఁగా ’ అనుదానిని తప్పుల
జాపితాలోఁజేర్చి తాను ఒప్పులజాపితాలోఁ జేరినది ) ఇట్టి వెన్ని ? రామరామా !
పదులా ? వందలా ? వేలు, వేలకువేలు. వ్రాయడ మెవరితరము ? చో టెక్క
డిది ? - సరే కాని, వీటిలో నొకటైనా పూర్వగ్రంథములలో నున్నదా ? ఏవ్యాక
రణ మైనా వీటిని సమర్థించఁగలదా ? వీటిలో నూటికి నాలు గయినా, బజారు
తెలుఁగులోఁ గూడఁ గనఁబడవుకదా ! ఆహా ! ఇ దెక్కడిప్రయోగసృష్టి ? అటు
గ్రాంథికము కాదు, ఇటు వ్యావహారికము కాదు. ఆడది కాదు, మొగవాఁడు
కాఁడు, కొజ్జా యున్నట్లున్నది. ఈయవస్థకు వచ్చినతెలుఁగున కొకసంప్రదాయ
మేమిటి ? ఐనా, ప్రారంభించినాము గనుకఁ గొంచెము ముచ్చటింతము.

—సత్కావ్యము నిర్మింపం గడంగినప్రతిభాశాలి యెవ్వండేని తెలుఁగు సంస్కృత
ముంబోనిదేవవాణి యగుఁ గాని దేశభాషగా నొప్పునే యనునంతటి గౌరవాతిశయం
బెసకమెసఁగఁ బదునొకండగుశతాబ్దిం దొలుఁదొల్త నంధ్రభూమి కవతరించిననన్న
పార్యుపర్వత్రయిం బొడసూపుతొలినుడులనొండెఁ, గాదేని కవిరాక్షసుం డానతిచ్చిన
కరణిం గవిత్రయంబునాంధ్రమహాభారతంబునం దలసూపుతెలుంగునుడువుల నొండెం
గరంబు గోర్కెమైఁ బరికించి కలతెలుం గెఱింగి యంద పద్యం బేని గద్యం బేని రచి
యించుట ప్రాచీనపద్ధతి - అట్టిసామర్థ్య మలవడనిచోఁ బదుమూఁడవశతాబ్ది పుట్టిన
నాఁటంగోలెఁ బదొమ్మిదోశతాబ్దిదాఁకఁ గలకవిచంద్రులు కవిరాక్షసునిమాట జవ
దాఁట వెఱచుచునే తమనాఁటిదేశ్యవైచిత్ర్య మంతా కాకపోయినా, కొంత యైన
నట్లో తరువాతికవులకుఁ దెలియఁజేయడపుఁదలంపుతోను, పాఠకులు జిహ్వా కింపుగాఁ
జవి చూచి దేశ్యసుధారసబిందువు లాస్వాదించి బళీ యని తమకవిత్వమును సన్నుతి
చేతురు గాక యనేకుతూహలముతోను, కాలక్రమమునఁ బ్రయోగించుచు వచ్చిన

తేట తెలుఁగుపలుకులవై చిత్రిని మనసార నోరూర నారగించియు, వారిప్రయోగ
ములను జూచి మధ్యమధ్యఁ గొందఱు వ్యాకరణకర్తలు చేసినయనుశాసనములు గాం
చియు, తెలిసీతెలియనిమాట లుపయోగించక ప్రవాహమున కెదురీదక సరళము
గాఁ గవిత్వముచెప్పుట యర్వాచీనపద్ధతి - అదీ చేత కాకపోతే, ఇపుడు గ్రాంథిక
భాషలో పుస్తకాలు వ్రాసి వాటిని పాఠశాలలలోను కలాశాలలలోను పాఠ్య
గ్రంథములనుగా పెట్టించుకొనుసుఖవృత్తికి మరగినసర్వవర్ణములవిదుషీమణివిద్వచ్ఛి
రోమణులవలె శబ్దరత్నాకరసేవ చేయుచునే అరసున్నశకటరేఫలు మొత్తముమీద
ప్రతిపుటలోను కనబడేలాగున అక్కడక్కడ చల్లి, బాలవ్యాకరణపారాయణ చేయు
చునే విభక్తులు కారకములు సమాసములు క్రియలు తాఱుమాఱు చేసి, అయ్య
వారిని చేయబోయి కోతిని చేసినట్లు పుస్తకాలు వ్రాయక, పూర్వకవులకావ్యముల
లో గాని శిష్టవ్యవహారములో గాని లేని స్వకపోలకల్పితశబ్దరూపములను ప్రయో
గించక, బాగా తెలిసినయెడల సాధ్యము లైనఅరసున్నలు బండిరాలు సంధులు
పాటించి, తెలియకపోతే ఆత్రిమూర్తులకు ఒక్కనమస్కారము చేసి, దేశాభివృద్ధి
కుపకరించులాగున పండితపామరసాధారణ మగుశైలిలో ఇంతకు పూర్వము లేనివీ
ఇపుడు కావలసినవీ ఏవో, అట్టిగ్రంథాలు రచియించుట నవీనపద్ధతి - ఇఁకనో,
శ్రావ్యము లైనగ్రాంథికములు గాక హృద్యము లైనవ్యావహారికములుగాక, ఉభయ
భ్రష్టములు కురూపములు నైనయపశబ్దము లుపయోగించి -

— ఆమె బ్రహ్మరాక్షసిని యయ్యెనని మీరానతిచ్చిరి. మీరు దేశ
భాష నిట్లే పరిత్యజింపఁజేయఁబడిరా? చేతులాఱ నోరాఱఁ దాము భాషాసేవ
సేసితిరిగదా! ఏది మీచేయి నిటుదెండు - మీమిత్రు నిచటకు రప్పించినపుడు
మఱలివత్తును - రంగనాథుఁడు సీతకు మూర్ఛను వర్ణింపక యాప్రదర్శనమును విర
మించెను. రావణుఁడు సీత నట్లు పేలుటచూచి వేఁడినిట్టూర్పులు తీయుచు మారుతి
గంపెడు కోపముతో నిక్కడకు వచ్చి యిట్లూఱకుండుట తగవా? - వీని కన్నిఁటి
కేమి? వారల కొఁపడి వచ్చెదను - ఆపాదమస్తకమువఱకు నాపైన నయిష్టము పుట్టి
నది. గౌరవాధిక్యత లేదు. నిన్నువలవని దానిని దోడి తేరుటకు నొల్లఁగ వేని
రెండు వేవురుమందితోఁ బోరునకు నేతేరుము. నే నూరునకుఁ బోయి వెనుదీక రావు
టకుఁ జూతు.

అనురీతిని గ్రంథములు రచియించుట యేపద్ధతియో యూహింపవలసినదే కాని చెప్పవలసినది కాదు. దీనిని స్మరింపనేల ? పోనిండు.

పైని జెప్పినమూఁడుపద్ధతులలో మొదటిరెండుపద్ధతులను నేను రచియించిన యాంధ్రభాషానుశాసనము సప్రయోగముగా సప్రమాణముగా నిరూపించి యున్నది. వివరములు దానివల్లఁ దెలియఁగలవు. ఇఁక నిట్లు కాలక్రమప్రాప్తము లైన త్రివిధపద్ధతులకు నాధారభూతమైన భాషాసంప్రదాయ మెట్టిదో కనుఁగొందము.

సంప్రదాయశబ్దమునకు గురుపరంపరాగతమైనయుపదేశ మని యర్థము. అది యిక్కడ, కాలక్రమమున వాడుకలో మాఱినశబ్దార్థములకు సంబంధించిన దగుటచే భాషావిషయకమై నన్నయతిక్కనశ్రీనాథాదిమహాకవిగురుపరంపరవల్ల వచ్చినయుపదేశము గావున భాషాసంప్రదాయ మనఁబడినది.

ఆంధ్రు లందఱు నొకజాతివారు కారు. ఒకచోటివారు కారు. పైనుండి వచ్చిన చతుర్వర్ణములవారు కొందఱు. ఇం దున్న కొన్నిజాతులవారు కొందఱు. అట్లే, ఆంధ్రభాషలోనిశబ్దములన్నియు నొకతెగకుఁ జెందినవి కావు. తొలుత మూలద్రవిడము నుండి వచ్చినవి కొన్ని. తరువాత సంస్కృతప్రాకృతములనుండి చేరినవి కొన్ని. పిదప హిందూస్తానీమొదలగుభాషలనుండి సంక్రమించినవి కొన్ని. అందుచేతనే, ఇట్టిబహువిధశబ్దములఁ బుష్టి చెందినయాంధ్రమును నాఁటినుండి నేఁటిదాఁకా తెలుఁగుదేశములోని వివిధజాతులవారును సమానముగానే వాడుకొనుచున్నారు కాని, ఇది యెన్నఁడును బ్రత్యేక మొకరిసొత్తు కాలేదు. ఇది దేశభాషలధర్మమే కదా! కావుననే తొల్లి క్రొత్తగా వచ్చినవారిసంస్కృతప్రాకృతశబ్దము లనేకములు క్రమముగా వాడుకలోఁ బ్రవేశించి యిందలివారినోళ్ళలోఁ బడి యుచ్చారణవైకల్యమున వికృతరూపములు తాల్చినను, అవి నింద్యములై భాషనుండి బహిష్కృతములు గాక, ఆర్యుల యాదరమునకుఁ బాత్రములై భాషలో నొకస్థాన మాక్రమించినవి. అగ్గి - జూదము - సిరి-సింగారము-మొకము-కన్నియ - మొదలగునవియే తరువాతఁ దద్భవము లనఁబడినవి. బ్రాహ్మణుఁ డెవఁడైన 'అగ్గి' యని యుచ్చరించునా? అయితే నేమి? దానియెడఁ బూర్వుఁ డెవఁ డైన నిరసనభావము చూపెనా? కవు లందఱును దానిని వాడిరి కదా! ఇట్లు మాఱినవి సంస్కృతప్రాకృతశబ్దము లేనా? శుద్ధదేశ్యములు

వందలు వేలు వివిధముగా మాఱి వాడుకలో నుండుటయే కాదు, పూర్వకావ్యములఁ బ్రవేశించినవి. అట్టివెల్ల చూపుట సముద్రమున కేతా మెత్తుటయే కావున మచ్చుకుఁ గొన్ని :—

౧. నన్నయకుఁ బూర్వము మూలద్రవిడభాషాసంప్రదాయమునుబట్టి నిర్బిందువులై శాసనములఁ గనవచ్చు - కట్టిఞ్చు - మల్లఞ్డు - ఇన్దు - మొదలగునవి నన్నయనాఁటికి కట్టించు - మల్లండు - ఇందు- అనువిధమున సబిందువులైనవి.

౨. నన్నయనాఁటిదీర్ఘములమీఁది ఖండబిందువులతోడి- వాఁడు-వీఁడు-ప్రాఁత- ఇత్యాదులు నన్నెచోడాదులకృతులలో దాక్షిణాత్యసంప్రదాయమునుబట్టి, వాండు - వీండు - ప్రాంత - అనువిధముననే నిలచినవి.

3. నన్నయనాఁటికే, ఒకండ్రు - చూఁడుము - కావలయును-చనునే-చెప్పుము- ఇత్యాదిబహురూపములు - ఒకళ్లు - చూ - కావలెను - చన్నే - చెపుము - అనువిధమున మాఱినవి. ఈమాఱినవాటి నతఁ డుపయోగించెను. తిక్కనాదులు వాటిని శిరసావహించిరి.

౪. నన్నయ ‘కన్నియ’ తిక్కన ‘కన్నె.’ అతని ‘కూఁతులు’ ఇతని ‘కూఁతుండ్రు.’ వారు ‘వచ్చినవాఁడను - వచ్చివాఁడ’ ననఁగానే శంభుదాసుఁడు ‘వచ్చినా’ నన్నాఁడు. వా రిద్దఱును ‘వెడలుదు’రనుట తెలిసియే యితఁడును శ్రీనాథాదులును ‘వెళ్లిరి’ అనిరి. వీరి ‘వలనఁ’ గానిది పెద్దన్న ‘వల్ల’ నైనది. కవిత్రియమువారి “అల్లురు చేతురో” చేయరో సందేహము కాని, తక్కినపెద్దలందఱి ‘అల్లుండ్రు చేతు’రనుట స్పష్టము. వీరందఱును “ఇంకను దనుకను దాఁక’ నంటే, మిగిలినమహాకవు లనేకులు ‘ఇంకా ఎందాఁకా’ ఈమాట లన్నారు. భారతము ‘మూఁడు నెలలు’ అనఁగా, కాదు కాదు ‘రెన్నెల్లు’ అని రామాయణాదులు, ‘ఆర్నె’ల్లని కాశీఖండాదులు గోలపెట్టినవి. ఇంత యేల ? నన్నయతిక్కనలగసడదవాదేశపద్ధతి యెఱ్ఱనాదులనాఁడగిరిపోయినది. వారి ‘ఈర్,’ ఈయుర్, ఇయ్యర్ - ఇవ్వర్ - అను రీతిని బైకి వచ్చినది. వారు పదుమూఁ డగుమాస మంటే, అప్పకవి పందొమ్మిదో ఛంద మన్నాఁడు. వారు చేయువాఁ *డంటే*, రామలింగాదులు వంద

మంది కలసి దాఁటేవాఁడు, అనేభావంబు, అనేటివాఁడు, అనురీతిని యీఁదికి వచ్చిరి. అయ్యా! దేశ్యవైచిత్రి చూపవలె నంటే యిక్కడ స్థలము చాలదు కాని, ఈసందర్భమున నొకవింతమాత్రము చెప్పవలసియున్నది.

దేశభాషలు మాఱుచుండుటయు, మాఱినశబ్దజాలము నాయాసమయములఁ గవులు వాడుటయు, అప్రయోగములను జూచి వ్యాకరణకర్తలు వానికి గతి కలిగించుటయు నైజమై యుండఁగా, ఆమార్గ మించుక సూచించినయాథర్వణాంధ్రరత్నాకరాదిలక్షణముల నణఁగఁదొక్కి బాలవ్యాకరణము పైకి వచ్చుటచేతను, సంస్కృతాంధ్రపండితు లాంధ్రశబ్దచింతామణిప్రాభవము నుగ్గడించి తద్విరుద్ధము లగుప్రయోగము లంగీకరింపఁ దగినవి కావని తలంచుటచేతను, సర్వవిధముల దానినే యనుసరించిన దనఁదగినబాలవ్యాకరణ మాయభిప్రాయమును బలపఱుచుటచేతను, మునిత్రయ మనఁదగినకవిత్రయమువారు గూడఁ గానివా రై పోయినారు. ఇందుకు నిదర్శనము:—

నన్నయార్యుఁడు 'కావలయును' వంటిప్రయోగములే యెక్కువగా వాడినను, తననాఁడు దేశమున మిక్కిలి వాడుకలో నుండుటచేతనే 'కావలెను' అనురూపమును గూడ వాడెను. దానిని శిరసా వహించిన తిక్కనార్యుఁడు 'కూఁతులు' అను రూపముగూడ వాడినను, తననాఁటికి మాఱి శ్రావ్యమగుచున్న 'కూతుండ్రు' రూపమును వాడెను. సోమనాథశ్రీనాథాదులు 'చేయుదురు' అనుదాని నెక్కువగాఁ బ్రయోగించినను, తమనాఁటికిఁ బరిశుద్ధ మైన 'చేతురు' రూపముగూడ నుపయోగించిరి. చిన్నయసూరి వీటి నసాధువులనుగాఁ జేయఁగా, అఱవతెలుఁగు పరిష్కర్త లుత్తమకావ్యములలోని పైప్రయోగము లన్నిటికి సున్నచుట్టిరి. అకటా! చూచితిరా తెలుఁగునకుఁ బట్టినదౌర్భాగ్యము!

అ దేమో కాని, గ్రాంథికభాషావాదుల మనుకొనువారి కందఱికిని దీర్ఘాంత దేశ్యశబ్దము లంటే మంట. ఏమీ లేదు. వ్యాకరణములు నవలా నేజా లకోరీలను మాత్రమే చూపినవి. తక్కినవాటిని జూపలేదు. సాహేబుకలుపుతీతకథవలె మనవా రామూఁడుమాటలు పట్టుకొని తక్కినదీర్ఘాంతము లన్నీ, అసాధువు లనుకొన్నారు. అంతేకాని, వ్యాకరణము లెప్పటివి? భాష కవి యెంతటివి? తిక్కనాదిమహాకవుల కృతు లెప్పటివి? వారివిజ్ఞాన మెట్టిది? అవి చెప్పనివానిని, తప్పు లన్నవానిని తప్పు

లనవలసినదేనా ? అని యాలోచించిరా ! ఆలోచన మెందుకు. ఆసూత్రాలవిత్రము పుచ్చుకొని కనఁబడ్డదేశ్యదీర్ఘాలు కోసివేయడమే వారిపని. సహజదీర్ఘములే కాక, వర్ణలోపాదులవల్లఁ గాని సంధివశమునఁగాని వచ్చిన వైనను వారికిఁ గిట్టవు. ఇందుకుఁ గొన్ని:—

తిక్కనార్యుఁడు - నరపతి నమ్మెనమ్మక పని గొనునది యని ప్రయోగింపఁగా (శాంతి. 2-351) అది కొంతకాలము ముద్రణములలో నున్నట్లే యుండి మఱు మాయ మైనది. వావిళ్ళవారిధర్మమా యని యది మరల 1915 లో దృగ్గోచర మైనది. ఇట్టివే కాక మఱికొన్నివిధము లయినదీర్ఘాంతప్రయోగములు తెలుఁగు జీవద్భాష యని తెలుపుటకో యన నైషధ జైమినిభారత ప్రబోధచంద్రోదయ వైజయంతీవిలాస కవిచింతామణి కాళహస్తీశ్వరశతకాదులందు-వినీవినని-చాలా-కూడా-ఇంకా-దాఁకా-చూచినా-అంతా-వెన్నామీఁగడ - ఇత్యాదిరూపముల వీనులవిందై ప్రత్యక్ష మగుచున్నవి.

-ఇట్లు ప్రయోగము లున్న వని యెఱుఁగుదురు. వారు మహాకవులనియు నెఱుఁగుదురు. తామును, ఇట్టిప్రయోగము లున్నగ్రంథములను బ్రకటించుచున్నారు- అయితే నేమి ? ఇవి గ్రాహ్యము లని గ్రాంథికభాషావాదుల మనుకొనువారు తలంతురా ? - వారిమతములో నిదంతా లక్కగేదే. పూర్వగ్రంథములలోని యిట్టిసరసప్రయోగము లంగీకరింపనివారిగ్రాంథికభాషాభిమాన మెట్టిదో చిత్తగించ వలెను.

ఒకగ్రంథకర్త ' కిటికీ ' ఉండగూడదని యూహించి, దానిపై కమ్మి, ఊడఁగొట్టి **కిటికి** చేసిపెట్టెను. ఇట్టిది మఱియొకటిచేసి దీని బహువచనరూప మాసంప్రదాయవేత్త ప్రయోగించులోపల నిది యాధారముగా-రెండుబస్తలధాన్యము-మూఁడు సీసలనూనియు- వా రిద్దరు రెండుకురిచులమీఁదఁ గూరుచుండిరి. ఇత్యాదిప్రయోగరాజము లుదయింపక పోవునా ? పాఠకోత్తములారా! ఇది కేవలగ్రాంథికభాషావాదుల మనుకొనువారిరచనలను నిందించుట యని తలంచవద్దు. మనసోదరులు పూజ్యులైనపూర్వమహాకవులప్రయోగములు నింద్యగ్రామ్యము లని నిరసించి వారియెడ నపరాధము చేసినవా రగుటయే కాక, ఆంధ్రసరస్వతికి దుర్భాష లంటఁ గట్టుచున్నారే యని విషాదము తప్ప మఱేమియుఁ గాదు. దీని కేమి? ముందు చూతము.

ఆంధ్రము జీవభాష గాని మృతభాష కా దని తలంచినచో దీనిసంప్రదాయము సులభముగా గోచరించును. జీవభాష జీవనదివంటిది. కావుననే 'ప్రవాహినీ దేశ్యా' అని పెద్ద లనిరి. నది యొకచోటినుండి యొకచోటికి సదా ప్రవహించునట్లే, భాష యొకనోటినుండి యొకచెవికి సర్వదా పోవుచుండును. అది ప్రవహించు ప్రదేశభేదమునుబట్టి దానిగుణరూపము లించుక మాఱునట్లే, ఇది వ్యాపించుమండలభేదమును బట్టి దీనిశబ్దార్థము లించుక మాఱుచుండును. అందు పాతనీటిని గ్రొత్తనీరు త్రోసి వేయునట్లే, ఇందు పాతశబ్దములను గ్రొత్తశబ్దములు త్రోసివేయును. అది వేఱువేఱు ప్రదేశములనుండి వచ్చువాఁగులను వెల్లువలను జేర్చుకొనునట్లే, ఇది యన్యజాతుల నుండి వచ్చుశబ్దములను జేర్చుకొనును. అది తన్నాశ్రయించువారికిఁ 'ప్రాణాధారము జీవనాధారము నగునట్లే, ఇది తన్నాశ్రయించువారికి జ్ఞానాధారము జీవనాధారము నగును. వే యేల? దానివలె నిదియును, పావనమై వంద్యమై వెలయును. కాని, ఒకమాట. అందలినీరు రెప్పపాటులో వడిగాఁ బోయివచ్చునట్లిందలిశబ్దము లంతలోనే పోయి యంతలోనే రావు. ఇవి మాఱుటకుఁ గొన్ని సంవత్సరములు పట్టును. ఇంతే భేదము. ఇఁకనో—

నదికి గట్టువలెనే భాషకు వ్యాకరణము రక్షకము. కాని, ఒకమాట. నది పుట్టినపు డున్నట్లే యెపుడును సన్నముగా నుండదు. క్రమక్రమముగా విశాల మగుచుండును. వడిగాఁ బ్రవహించుస్వభావము గలయది మొదట నేర్పడినగట్లమధ్యనే ప్రవహింపదు. అటు నిటు గట్లు దొలిచియు, తెగఁగొట్టియు, ఆవలికి నీవలికిఁ బోవుచుండును. అపుడు నదీరక్షకులు వెనుకటిగట్లు తప్పించి, ఆవల మరల గట్టుపోయుదురు. అట్లే, జీవభాష పుట్టిననాఁ డున్నట్లే యుండదు. పెరుగుచుండును. మొదట నేర్పడిన చిన్నవ్యాకరణమునకు లొంగక దానిని దాఁటిపోవుచుండును. అపుడు మరల భాషాసంప్రదాయవేత్తలు దానిపెంపునుబట్టి వ్యాకరణము నిర్మింతురు. నదీరక్షకులు మొదటిగట్లలోనే విశాల మగుచున్ననది నట్లాఁపలేరో, భాషారక్షకులు నట్లే తొంటివ్యాకరణముతోనే పెరుగుచున్నభాష నాఁపలేరు. గట్లు తెగితే తెగనీ నీరు పోతే పోనీ! నిలిచిననీరే చాలునని వా రెట్లూరకుండరాదో అట్లే వీరును వ్యాకరణము చాలక పోతే పోనీ! శబ్దములు పాడయితే పాడుకానీ! లొంగియున్నశబ్దములే చాలు నని యూరకుండ రాదు. ఆపక్షమందు నీపక్షమందునుగూడ నట్లూరకుం

డుట దేశమునకు హానికరమే. దీనిని బట్టి నదివలెనే భాషయు మాఱుచుండు ననియు, దానికట్టువలెనే దీని వ్యాకరణమును దగినట్లు లేర్పడుచుండవలె ననియుఁ దెలియఁగలదు. ఈసందర్భమున నదిలోని ప్రతిబిందువును బానీయ మైనట్లు వాడుక భాషలోని ప్రతిశబ్దమును గ్రంథమున నుపాదేయమేనా యని శంకించవద్దు. దప్పిగొన్నవారు నదీజల మైతేమాత్రము మురికిగా నున్నను, నలకలతో నున్నను, తేర్చుకొనియో వడఁబోసుకొనియో తాగుదురు కాని, యట్లే తాగుదురా ? అట్లే కావ్యము వ్రాయ నపేక్షించువారు, వినుటకుఁగాని చదువుటకుఁ గాని, యనువుగా నుండనిశబ్దములను వ్యాకరణజ్ఞానమున సవరించుకొని యుపయోగించుకొందురు. దీనికి విచార మేల ? కాలానుసరణముగాఁ - బ్రయోగానుసరణముగా మాఱినవ్యాకరణము చేయుసహాయ మదే కదా ! ఈపట్టున కొందఱు, శాస్త్రప్రయోగములకు విరోధము సంభవించినపుడు శాస్త్రమే బలవత్తర మనెడి నిర్ణయమునుబట్టి శాస్త్రవిరుద్ధమైనది మహాకవిప్రయోగ మైనను సమ్మతము గా దందురు. కాని, ఆనిర్ణయ మన్యవిషయకము. జీవద్భాషల కది సమన్వయింపఁ దగదు. అట్లయిన, వ్యాకరణము ప్రయోగశరణ మనియు, వైయాకరణులు ప్రయోగశరణు లనియు బోధించినయాచార్యవచనములకు గతి యేమి ?

మఱికొందఱు ప్రయోగశబ్దము కవిప్రయోగపరమే కాని, శిష్టప్రయోగపరము కా దందురు. అదియును సమీచీనము కాదు. అట్లయిన శిష్టప్రయుక్తము లయిన లౌకికశబ్దముల కనుశాసనము గావించిన మునిత్రయనుమాట యేమి? కావున జీవద్భాషలవిషయమున మహాకవిప్రయోగము శిష్టసమ్మత మైనచో నది వ్యాకరణవిరుద్ధ మైనను గ్రాహ్యమే యనియు, శిష్టప్రయుక్త మగు సముచితశబ్దరూపము గూడ గ్రాహ్యమే యనియుఁ బూర్వాచార్యమతమునఁ దెలియనగును. అట్టివైయాకరణసంప్రదాయమునకుఁ దొలఁగినవ్యాకరణము దేశభాషావ్యాకరణ మనఁదగునా? పోనిండు. ఇపు డీశాస్త్రచర్చ యెందుకు ? మహాకవిప్రయోగములే గ్రాహ్యములని యంగీకరింతము. అట్లయిన, బాలవ్యాకరణము తన కభిమతమయినభారతప్రయోగములు కొన్ని స్వీకరించి సూత్రములు రచియించి, అందలిప్రయోగములనే మఱికొన్నిటిని గ్రహింపక విడుచుటయు, మఱికొన్నిటిని నిషేధించుటయు సముచితమా ?

అథర్వణాచార్యులు ఘోషించుచున్నను, ఆముక్తమాల్యదాదులు గోలపెట్టుచున్నను వినిపించుకొనక, తత్సమాకారమునకు సంధి లేదనుటకు భారతము కావలసివచ్చినదిగాని, రాతిరెల్ల - తెలివొందె - ఇత్యాదులు భారతమునఁ గనఁబడుచున్నను, ఇకారసంధులలో నామవాచకములయికారమునకు సంధి విధించుట కది పనికివచ్చినది కాదా? తత్సమసంధులు, ఇకారసంధులు వందలకొలఁది ప్రత్యక్షమగుచుండ నవి కావ్యచిత్కములైనవా? ఇట్టినిరంకుశత్వమున కెన్నేని యుదాహరణములు కలవు. అవి యన్నియు నాయాంధ్రభాషానుశాసనమునఁ జూపఁబడినవి. వాని నందుచిత్తగింపుఁడు.

ఆంధ్రభాషాభిమానులారా! ఈవిషయ మపార మగాధము. ఇట్లు పదిమాటలతోఁ దేలునది కాదు. కావున నింతవఱకుఁ జేసినచర్చనుబట్టి, ఆంధ్రభాషాసంప్రదాయవిజ్ఞానమునకుఁ గాలక్రమమున సంభవించిన భాషలోనిమార్పులను దెలియఁజేయు నన్నయ తిక్కన యెఱ్ఱన సోమన శ్రీనాథాదిమహాకవుల కృతులలోని బహువిధప్రయోగపరంపరయే శరణ మనుట విశ్వసింతురు గాక యని మనవిచేయుచు వ్యాసము ముగించుచున్నాను.

# ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి సాధనములు

ముక్కవిల్లి సూర్యనారాయణ

ప్రస్తుతస్థితి:—

తెలుగు మాతృభాషగా గలవారిలో తగినంత సాహిత్యపరిచయము కలిగినవారు చాలాతక్కువమంది ఉన్నారనుకొనవచ్చును. కృషికి తగిన ఆర్థికప్రతిఫలము కనబడక పోవుటచేతనేమి, తీరికలేకపోవుటవల్లనేమి, వాఙ్మయములో విజ్ఞానదాయకములైన విద్యలు లేకపోవుటచేతనేమి, ఆంగ్లవిద్య అభ్యసించినవారిలో తెనుగువిషయమై కేవలము తిరస్కారభావము కాకపోయినా, ఒకవిధమైన ఉదాసీనత ఏర్పడియుండుటే ఈ దుస్థితికి ముఖ్యకారణము. ఇది ఎంత శోచనీయమో భాషాసేవకులకు విశదమైన అంశమే. ఇక భాషను కాపాడవలసిన బాధ్యత తెలుగుమాత్రమే చదివిన పండితుల పైనను, సంస్కృతాంధ్రముల రెంటినీ చదువుకొన్న పండితుల పైనను పడినది. వీరే చాలాకాలము తెలుగు మృతభాష కాకుండా కాపాడుచుండినది. వీరిపద్ధతులకు నేటి ఆంగ్లవిద్యాధికుల పద్ధతులు భిన్నములై ఉన్నవి. పైకి చెప్పకపోయినను లోలోన ఒకరిమీద నొకరికి సదభిప్రాయ ముండుటకూడ అరుదయ్యెను.

ఈసందర్భములో ఆంధ్రదేశమున కొన్ని సంవత్సరముల క్రిందట ఒకపెద్దవాగ్వివాదము జరిగినది. గ్రాంధికభాషకొరకు కొందరును వ్యావహారికభాషకొరకు కొందరును చాలాకాలము పోరాడి ఉన్నారు. మ. రా. శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు రెండవపక్షమునకు చేరినవారు.

ఈవివాదతత్వమునుగూర్చి మన మించుక ఆలోచింపవలసి ఉన్నది. వ్యాకరణము త్రోసివేయవచ్చునా? భాషాసాంప్రదాయము మాట్లాడుటవల్లనే తెలియవచ్చునా? ఈప్రశ్నలకు సరియైనజవాబు లేవి? గ్రాంధికభాషలో చాలపదముల అర్థము జనబాహుళ్యమునకు తెలియదు. గ్రంధముల ముఖ్యప్రయోజనము పాండిత్యప్రకటనము కాక చదువరులకు శీఘ్రముగ విషయబోధ కలుగజేయుటే అనుకొనువారికి క్లిష్టపదప్రయోగములు రుచించవు. ఈ కారణమునుబట్టి తెలుగు మాతృభాష గనుక

మనము మాట్లాడునట్లు వ్రాయవచ్చునని కొందరివాదము. ఈ యభిప్రాయము సరియైనదని కొంచెముమార్పుతో అంగీకరించవచ్చును. మనము మాట్లాడుభాష వ్యాకరణశుద్ధిగా నున్నచో బాధ లేదు. ఇంగ్లీషుభాషలో చూచిన నాలుగు తరగతులున్నవి. విద్యావంతులభాషలోనే ఈక్రిందిభేదములు కానవచ్చును.

1. సామాన్యసంభాషణ:—

దీనిలో కొన్ని నిరర్థకశబ్దములు కొన్ని గ్రామ్యపదములును ఉండును.

2. ఉన్నతతరగతి మనుష్యుల సంభాషణ:—

ఇది వ్యాకరణశుద్ధిని గాంభీర్యమును గలిగి చాలావరకు గ్రామ్యశబ్దములను విసర్జించును.

3. గ్రాంథికభాష:—

దీనిలోని పదజాలము మొదటిరెండుతరగతులలోకంటె మిక్కిలి ఎక్కువగా నుండును. దీనిరీతికూడా భిన్నము.

4. పద్యభాష:—

గ్రాంథికభాషలో గద్యభాషకును పద్యభాషకును కొన్నివ్యత్యాసము లున్నవి- వ్యాకరణజ్ఞాన మనావశ్యకమని ఆంగ్లేయవిద్వాంసులు కొంతకాలముక్రిందట చెప్పుచుండిరి. కాని భాషలో మార్పు లెక్కువ అయినకొలదిని ప్రాచీనభాషకును ఆధునికభాషకును దూర మెక్కువ అగుచుండును. అందుచేత ఒకభాష కాక రెండు భాషలు నేర్చుకొనవలసి ఉండునను భయముచేత గ్రంథకర్తలు, వైయాకరణులును ఈమార్పులను సాధ్యమయినంతవరకు తగ్గించుటకు ప్రయత్నించెదరు. ఎవరికి తోచినట్లు వారు వ్రాయుచో చదువరులకు వృథాయాసము తప్ప వేరులాభ మేమియు కలుగదు. ఈకారణములనుబట్టి భాషాసాంప్రదాయములు పూర్తిగా తెలిసినవారు వ్రాయునట్లే అందరును వ్రాయుటకు ప్రయత్నించవలెనని తోచుచున్నది.

ప్రాచీనపద్ధతులనన్నిటిని ఈకాలమున నుపయోగించవచ్చునా అని కొంద రడుగవచ్చును. గ్రంథరచనయొక్క ముఖ్యోద్దేశము భావప్రకటన: గ్రంథకర్తయొక్క అభిప్రాయము లితరులకు చక్కగా తెలియవలెను. దీని కుపరోధము కలిగించెడి ఉక్తిమార్గములు, శబ్దములును విడువవలెను- ఏలన, పూర్వకాలములో నుండిన చదువరుల

కును ఇప్పటి చదువరులకును భేదమున్నది. నేడు పాఠకులసంఖ్య చాలా ఎక్కువగా ఉన్నది. అందరికిని సులభముగ బోధపడు శైలిలో గ్రంథరచన గావించుట ఆవశ్యకము. వ్యావహారిక భాష నుపయోగించవలసినదని చెప్పుట కిదియే ముఖ్యకారణమని తోచుచున్నది. ఏదేశములోనైనా గొప్పగ్రంథకర్తలు ఈరెండుపక్షములలో నుండు గుణములు గ్రహించి వ్రాయుచున్నట్లు తెలియుచున్నది. ఆమార్గమే సరియయినదని చెప్పుటకు సందేహము లేదు.

ఇప్పుడు మనదేశములో గ్రంథకర్తలు చాలామంది బయలుదేరినారు; క్రొత్తత్రోవలు త్రొక్కుచున్నారు. ఇదివరలో భాషాంతరీకరణ మెక్కువగానుండెను. ఇప్పు డనుకరణ మెక్కువగానున్నది. మంచిగ్రంథము లనేకులు వ్రాయుచున్నారు. కాని గ్రంథకర్త లిప్పటికంటె ఎక్కువ వ్యుత్పన్నులగుట, కావ్యజ్ఞానము లోకజ్ఞానము ఎక్కువ కలిగియుండుట, భాషకుగాని చదువరులకుగాని ఉపకారముచేయుటయందు అకృత్రిమోత్సాహము సంపాదించుట, గ్రంథరచనయందు ఎక్కువనైపుణ్యము కనబరచుట-ఇవి అవసరమని తోచుచున్నది.

నేటి ఆంధ్రగ్రంథములలో సామాన్యముగ బుద్ధిపాటవమును మితవర్ణనపరిమాణజ్ఞానమును పాఠకలోకసౌకర్యమును గమనించుటయు, విషయబాహుళ్యమును కొరవడుచున్నవి. దీనికితోడు గ్రంథమునకు వన్నెదెచ్చు విస్పష్టత, పదపటుత్వము, కళాసౌందర్యము మున్నగు రచనాసూత్రముల విషయమైనయజ్ఞానముకూడా రచయితలలో మెండుగా కనబడుతున్నది. స్వతంత్రరచనాప్రతిభ సర్వసామాన్యముగ మందులో కలికమునకైనా కానరాకున్నది.

ఈవిషయములలో క్రమముగ కొన్నిటిని పరిశీలించుదము:—

1. కావ్యములు:—

(పద్యములు) కొన్నిటికి గంజిబిగి ఎక్కువ. మరికొన్నిటిలో పైమెరుగేకాని లోపల ఏమియునుండదు. ఇట్టిలోపములు తరచుగా కనబడుచుండును. కావ్యములలో విచాహములు చాలజరుగుచున్నవి. ఇతరవిషయములు చాలవరకదృశ్యములు. ఒకవిధముగా ఇది క్షేమమే. ఇందుకుకారణ మేమన, కవియొక్క అనుభవము నిట్టివిషయము లతిక్రమించకుండుటయే.

భావకవిత్వము:—

కొందరు వ్రాసినవి హృదయాకర్షకములుగా నున్నవి. మరికొన్ని కావ్యపద్ధతితో దాగుడుమూత లాడుచున్నట్లు కనబడుచున్నవి. ఇంగ్లీషులోనుండు ఖండకావ్యములు (Lyrics) ఆదర్శములని చెప్పక చెప్పుచున్నవి. ప్రాచీనమార్గానుసారుల కివి పల్లేరుముళ్లు.

2. గద్యము:—

వార్తాపత్రిక లన్నివిషయములగురించీ వ్రాయుచున్నవి: గద్యరచనను వృద్ధి చేయుచున్నవి. మనకావ్యములలోనుండు గద్యముల నన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించి వాటి గుణదోషములు వివర్శించి ముఖ్యముగా గద్యరచనము నభ్యాసముచేసి దానికి విశేష ప్రాముఖ్యము ఇయ్యవలెను. ఆంగ్లసాహిత్యములోనిగద్యము చూచిన క్రొత్తమార్గములు లభించును. పద్యకావ్యములును గద్యకావ్యములును భిన్నమార్గములు కల వనువిషయము మరువకూడదు.

3. నాటకములు:—

సంభాషణము, పాత్రపోషణము, కథాసంవిధానము - ఇవి నాటకములో ఏవిధముగ సంపాదింపవలెనో తెలిసికొనవలెను.

4. ఉపన్యాసములు:—

వీటివిషయములో సందర్భశుద్ధి, సంవిధానము పరిశీలించవలెను. గొప్పవక్తల ఉపన్యాసములు తెనిగించుట మంచిది.

5. చరిత్రములు:—

క్రొత్తపద్ధతులననుసరించి వ్రాసిన మిక్కిలి ఉపయోగము కలుగును. నాటకరచనకీచరిత్రరచన ఎంతయు తోడ్పడును.

6. వివిధవిషయములు:—

దేశాటన వృత్తాంతములు చాలావృద్ధిచెందవలెను. మరియు వివిధవిషయములను గూర్చి ఆంగ్లమున చిన్నచిన్న పుస్తకములెన్నో వెలువడుచున్నట్లే తెలుగులో కూడా ఆయావిజ్ఞానశాఖలయందు అధికారముగలవారు చిన్నచిన్న గద్యగ్రంథములు రచించి వెలువరించినయెడల ప్రజల సామాన్యజ్ఞాన మభివృద్ధిజెందును. ఇట్టి జనసామాన్య విజ్ఞానసంపత్తియే సర్వతోముఖమైన దేశాభివృద్ధికి ముఖ్యాధారము. విద్యాధికుల అకుంఠితభాషాసేవావిశేషమున ఆంధ్రుల కిట్టి సంపత్తి సత్వరముగ చేకూరునుగాక!

# ఆంధ్రభాషాపదములు - వాటి నిష్పత్తిక్రమము

కోరాడ రామకృష్ణయ్య

---

ఆంధ్రభాషలోని పదముల నిష్పత్తిక్రమము తెలుసుకోవలెనంటే ముందు పదమనగా నేమో తెలుసుకోవలసిఉంటుంది. పదమనగా ఒకమాట అని సామాన్యార్థము. శబ్ద మనేదానిని కూడా ఆ అర్థములోనే ప్రయోగించుటకలదు. కాని "శబ్దము" అనేదానికిని "పదము" అనేదానికిని వైయాకరణులు కొంతభేదము కల్పించినారు. శబ్దమనేది సామాన్యవాచకమంటే పదమనేదాన్ని విశేషవాచకమనవచ్చును. సామాన్యముగా అర్థప్రతిపత్తి కలిగించేధ్వనిని శబ్ద మంటారు. "తస్మాత్ ధ్వని శ్శబ్దః" అని ధ్వనియే శబ్దమని భాష్యకారుడు నిర్ధారణ చేసినప్పటికీ ఎటువంటిధ్వని శబ్దమగును అనేప్రశ్నకు సమాధానముగా, "యేనోచ్చారితేన సాస్నాలాంగూలకకుదవిషాణినాం సంప్రత్యయో భవతి స శబ్దః" అని వివరించి చెప్పినాడు. కాబట్టి అవ్యక్తధ్వనికాక, వ్యక్తధ్వని - అనగా అర్థవంతమైన ధ్వని శబ్దము కావచ్చునని తేలినది. ఇక పదమో, "సుప్తిఙంతం పదం" అని సంస్కృతవైయాకరణులు ఒక సంకేతమును కల్పించినారు. అనగా సుబంతము, తిఙంతము అయిన శబ్దము పదమనుపేర గ్రహింపబడవలెనని వారి అభిప్రాయము. ఇక్కడ సుప్, తిఙ్ అనునవి సంస్కృతవ్యాకరణసాంకేతికములే అయినప్పటికీ నామవిభక్తిప్రత్యయములు, క్రియావిభక్తిప్రత్యయములు తుదినిగల శబ్దములే పదము లగుచున్నవను సామాన్యభావమును మనము గ్రహింపవచ్చును. శబ్దములపై - అనగా ధాతు ప్రాతిపదికములపై విభక్తిప్రత్యయముల నేలచేర్చవలెను, చేర్చుటవలన గలిగే ప్రయోజన మేమిటి, ఈవిభక్తులు, విభక్తిప్రత్యయములు అనేవి భాషలో ఎట్లేర్పడినవి అనేప్రశ్నలు బయలుదేరక మానవు. కాని వీటికి తగిన సమాధానము చెప్పుటకు అవకాశ మిచ్చుట చాలదుగాని ప్రకృతమునకు సంబంధించినంత వరకు విచారింతము.

వాస్తవముగా మానవుడు తనభావములను సంపూర్ణభావములుగనే, సంపూర్ణవాక్యములలోనే వ్యక్తము చేస్తాడు. కావున పూర్ణవాక్యమే భాషకు ప్రమాణము - అనగా కొలతబద్ద. ఆవాక్యము వ్యక్తముచేసే భావములోని భాగములనుబట్టి ఆవాక్యముకూడా కొన్నిపదములక్రింద విభాగము చేయబడుతున్నా ఈవిభాగము కాల్పనికమేకాని సహజముకాదు. కావుననే ప్రాచీనవైయాకరణులు అఖండవాక్యస్ఫోటునేకాని, పదస్ఫోటు వర్ణస్ఫోటు మొదలగువాటి నంగీకరించలేదు. అనగా ఒకసంపూర్ణభావద్యోతకమగు ఒక అఖండవాక్యములోని భాగములే ఈపదములని చెప్పవలసినదే కాని ఇవి స్వయముగా సంపూర్ణార్థబోధకములు కావని భావము. ఆసంపూర్ణార్థబోధకమగు వాక్యములో నున్నపదములకుగల పరస్పరసంబంధమును వ్యక్తముచేయురీతుల విభాగమునే విభక్తిఅందురు. అట్టి విభక్తు లేడువిధములని ప్రాచీనార్యభాషావ్యాకరణకర్తలు నిర్ణయించిరి. కావుననే సంస్కృతమున విభక్తు లే డగుట తటస్థిం

చినది. వాస్తవముగా ఏభాషలోనైనా భావసంబంధము లెన్నిరీతులు గలవై ఉంటవో అన్ని విభక్తు లుండవలసినదే. అయితే ఆభావసంబంధములను తత్త్వవేత్తలు కనిపెట్టవలసి ఉంటుంది. ప్రాచీన గ్రీకుతత్త్వవేత్త లొకకాలమున మూడువిధములగు సంబంధములనే కనిపెట్టగలిగినారు. అప్పుడు వారి కాలమున మూడే విభక్తులు. ఆదేశములోకూడా కాలక్రమమున నవిపెరిగినవి. ఈదేశమున సంస్కృత వైయాకరణులు తమభాషను వ్యాకరించినపుడు ఏడువిభక్తులను కనిపెట్టినారు. విభక్తులను కనిపెట్టుట అనగా ఏమి? వక్తృరిచ్ఛావిషయభూతములగు భావసంబంధరీతులను - అనగా, కరణసంప్రదానా పాదానాది భావభేదములను వ్యక్తముచేసే వాక్యములలోని శబ్దములకు గల పరస్పరసంబంధ మెట్లు సూచింపబడుతున్నదో పరిశీలించి తెలియబరచుట. "భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః; అగ్నయే స్వాహా; మృత్యవే త్వాం దదామీతి" మొదలగువాక్యములను గ్రహించి పరిశీలించినపుడు "భిః", "ఏ" మొదలగు నర్థము తెలియని భాగములు - అనగా భాషలో స్వతంత్రార్థము కలిగి స్వతంత్రప్రయోగము లేని కొన్నివర్ణములు వాక్యములోని ఆయాశబ్దములకు గల సంబంధమును తెలుపుతున్నవని వారు కని పెట్టి వాటికే విభక్తిప్రత్యయములని పేరుపెట్టినారు. సంపూర్ణాఖండవాక్యము వ్యాకరింపబడినపుడు- అనగా ప్రత్యేకపదములక్రింద విభాగింపబడినపుడు ఆ విభాగింపబడినపదములకు గల సంబంధజ్ఞానము ను కలుగజేయు చిహ్నములు గనుక అవి "విభక్తిప్రత్యయము" లైనవని చెప్పవలసిఉన్నది. ఈఅఖండ వాక్యవిభాగము - అనగా ఆర్యభాషను వ్యాకరించుట బ్రాహ్మణములకాలములోనో, లేదా అంతకు పూర్వమో, జరిగిఉండెననుటకు తగిన నిదర్శనము మనకు శతపథబ్రాహ్మణములో కనబడుతున్నది. పూర్వము వాక్కు-వ్యాకృతమై ఉండగా దేవత లింద్రు నావాక్కును వ్యాకరింపమని కోరిరనీ ఇంద్రు డట్లు వ్యాకరించుటచేత "వ్యాకృతా వాక్" బయలుదేరినదనీ ఈక్రిందివాక్యములు సూచి స్తున్నవి.

"వాగ్వై పరాచీ అవ్యాకృతా అవదత్తే। తే దేవా ఇంద్ర మబ్రువన్। ఇమాం నో వాచం వ్యాకురు। స ఇన్ద్రః మధ్యతో వక్రమ్య వ్యాకరోత్। తేన వ్యాకృతా వా గుద్యతా॥"

శతపథబ్రాహ్మణము.

ఆర్యభాషను వ్యాకరించగావచ్చిన ఈసంబంధద్యోతక ప్రత్యయము లాయాభావరీతులను సంబం ధములను సూచిస్తున్నవని చెప్పవలసినదే కాని వాటి అర్థమేమో, ఆయాసంబంధముల నెందు కవి అట్లు సూచింపవలసివచ్చినదో అన్న విషయము ప్రాచీనవైయాకరణులకే కాక అధుని కార్యభాషాతత్త్వవేత్త లగు పండితులకుకూడా తెలుసుకొనుటకు దురవగాహముగా ఉన్నది. ఈభాషలోని విభక్తిప్రత్యయ ముల మూలస్వరూపము, పుట్టుపూర్వోత్తరములు అప్పటినుండి ఇప్పటికిన్ని తెలుసుకొనుటకు సాధ్యము కాలేదు.

ఇక ద్రావిడభాష లనబడు దక్షిణహిందూదేశభాషలను, అందును ముఖ్యముగా తెలుగుభాషను వ్యాకరించి లక్షణము ఏర్పరిచినవారు సంస్కృతభాషాపండితులును, అది దైవభాషఅని దానియెడల విశేషాభిమానముకలవారును అగుటచేత అభాషావ్యాకరణపద్ధతినే అవలంబించి వీటిని వ్యాకరించిరి.

ఆకారణముచేత ఆభాషలోని విభక్తిప్రత్యయములవంటివే ఈభాషలోకూడా కొన్ని చేర్కొనుట తటస్థించినది. అచ్చట ఏడువిభక్తులు స్థిరపడిఉండుటచేత ఆ యర్థసంబంధములనే సూచించుటకు ఈభాషలోను విభక్తు లేర్పడి వెలసినవి. అచ్చటి విభక్తిప్రత్యయముల కర్థము తెలియదు గనుక వాటి సామ్యముచేత ఏర్పడినవే అగుటచేతకాబోలు ఇచ్చట స్వతంత్రప్రయోగముగలిగి స్వతంత్రార్థ బోధకములగు శబ్దములుకూడా అర్థము తెలియని విభక్తిప్రత్యయమాత్రములుగా గ్రహింపబడుచూవచ్చినవి. చేతన్, తోడన్, వలనన్, కంటె, కొఱకు, పట్టి, లోపలన్, అందున్ మొదలగునవి తెలుగులో, అర్థము తెలియని సంస్కృతప్రత్యయములవంటివికావు. వీటి కీభాషలో స్వతంత్రార్థ బోధకత్వమూ, ప్రత్యేకప్రయోగార్హతాకూడా కలవు. అయినను వైయాకరణుల దృష్టిలో నివి ప్రత్యయములైనవి. ఏల? సంస్కృతవ్యాకరణదృష్టితో వీటిని చూచినవారుగనుక. సరే, ఇవి శబ్దములైనచో నింక మిగిలిన ప్రథమా, ద్వితీయా, షష్ఠులగతి యేమి? అవి ప్రత్యయములేకదా అని అడుగవచ్చును. కొంచెము పరిశీలించినచో నవికూడ అర్థములేని ప్రత్యయములుకావనీ, స్వతంత్రశబ్దములో, వాటి అవశిష్టభాగములో అయిఉంటవనీ నిరూపించుట దుస్సాధ్యము కాదు.

ఇక మఱియొకవిశేషమేమనగా ప్రథమఅనేదికూడా ఒకవిభక్తిగా పరిగణింపబడుట. సంస్కృతమున లింగముశబ్దగతమేకాని అర్థగతము కాదు. ప్రాతిపదిక అంత్యవర్ణమునుబట్టి ఇతరవిభక్తిరూపములు మారుచుండుటకూడా కలదు. ఈ మొదలగు కారణములచేత ఆభాషలో ప్రథమ అనేది ఒక విభక్తి కావలసివచ్చి ప్రథమారూపము ప్రాతిపదికముకంటె భిన్నమగుట తటస్థించి ఉండును. సామాన్యముగా ద్రావిడభాషలలో ప్రాతిపదికమునకు విభక్తిప్రత్యయమును - లేదా విభక్త్యర్థద్యోతకశబ్దమును చేర్చుటచేతనే విభక్తిరూపములేర్పడుటయే కాక ఇవి చేర్చబడినపుడు ప్రాతిపదిక విశేషములగు మార్పులకును లోనుగానక్కరలేదు. అంగస్వరూపమును బట్టిగాని వచనభేదమును బట్టిగాని ప్రత్యయములకును మార్పుకలుగదు. బహువచనరూపము ప్రాతిపదికకు బహువచనప్రత్యయమును చేర్చుటచేతనే ఏర్పడుచున్నది. కావున నీభాషలో సామాన్యముగా ప్రాతిపదికమే ప్రథమ అని చెప్పవలసినదిగాని ప్రత్యేకముగా ఒకప్రథమ అనేది విభక్తిగా గ్రహించుట కావశ్యకత కనబడదు. తల్లి, తండ్రి, అన్న, అక్క, చెట్టు, పుట్ట, పాలు, నేయి, కాలు, ముక్కు, కఱ్ఱ, కంప మొదలగు సామాన్యశబ్దములనుబట్టి విచారింపగా ప్రాతిపదికలకూ ప్రథమావిభక్తిరూపములకూ తక్కిన విభక్త్యర్థకశబ్దములు పరమైనపుడు వీటిరూపముల కెట్టిభేదమున్నూ కానరాకుండుటనుబట్టి ఇచ్చట ప్రాతిపదికమే ప్రథమారూపముగాని వేరుగా ప్రథమ ఈ భాషలో తోచుటలేదని స్ఫురింపకమానదు. "ప్రాతిపదికార్థలింగపరిమాణవచనమాత్రే ప్రథమా" అనుపాణినిసూత్రము ప్రథమావిభక్త్యర్థములను చెప్పుచున్నది. "నియతోపస్థితికః ప్రాతిపదికార్థః" అను వాక్యమునుబట్టి నియతముగా - ఎల్లప్పుడును-ఉపస్థితికమగు - స్ఫురించుచుండెడి అర్థము ఏది కలదో అదే ప్రాతిపదికార్థమగునని తెలియుచున్నది. నియతముగా స్ఫురించునది జాతి, వ్యక్తి, లింగము, సంఖ్య, కారకము - అనునర్థపంచకమని వైయాకరణులు తలచిరి. కాని ఈ విషయమునకు మతభేదము కలదు. కొందరు వీటిలో నొక్కటే ప్రాతిపదికార్థమనీ, కొందఱొకటికంటె ఎక్కువఅర్థములను ప్రాతిపదిక సూచించుననీ తలచిరి. చూ ;

ఏకం ద్వికం త్రికం చాథ చతుష్కం పంచకం తథా। నామార్థ ఇతి సర్వేచ పక్షాః శాస్త్రే నిరూపితాః॥ వైయాకరణభూషణసారము.

ప్రాతిపదికమే లింగమును, వచనమును సూచించే యెడల పాణిని సూత్రమున లింగ, వచన శబ్దములనావశ్యకములగును. కావున అతని అభిప్రాయమున నవి ప్రాతిపదికముచేత సూచింపబడవనీ, ప్రథమా విభక్తి ప్రత్యయమే వాటిని సూచించుననీ తలచవలసి ఉన్నది. అర్థపంచకమును ప్రాతిపదికమే బోధించుననీ, ప్రథమాప్రత్యయము కేవల ద్యోతకము మాత్రమే అనీ కొందరిమతము. ఇట్లు ప్రథమా విభక్తి లక్షణమునుగూర్చి సంస్కృతవైయాకరణులలోనే అభిప్రాయభేదము, మతభేదమును కలదు. అట్టిదానినే తీసుకొనివచ్చి భిన్న సంప్రదాయములతోగూడిన ఈ ఆంధ్రభాషా లక్షణమునకు చేర్చిరి. ఈ భాషలో తల్లి, తండ్రి, పుట్ట మొదలగు ప్రాతిపదికములే, విభక్తిప్రత్యయ మేమీ లేకయే జాతి, వ్యక్తి, లింగ, సంఖ్య కారకములను బోధించుచున్నవి. బహువచనము సూచింపవలెనంటే ఏకవచనరూపమునకు ప్రత్యేక శబ్దమో దాని అవశిష్టభాగమో అగు " కలు, " లేదా " లు, " అనునవి చేర్చబడుచున్నవి. ఇది కేవల బహుత్వ సూచకమేకాని దీనికి విభక్తి భేదముతో సంబంధములేదు. అన్ని విభక్తులలోనూ బహుత్వమును సూచించుటకిదే చేర్చవలెను. కర్తృకారకమునకూ, కర్మకారకమునకూ మొదట ఎట్టి భేదమును లేదు. అమహచ్ఛబ్దముల విషయమున నిప్పటికిని లేనేలేదు: చెట్టు పడెను, వాడు చెట్టు కొట్టెను- అన్నప్పుడు 'చెట్టు' శబ్దమునకు కారకభేదమువల్ల మార్పేమీ కలుగలేదు. కరణసంప్రదానాపాదానాధికరణకారకములు ప్రాతిపదికమునకు " చేతన్, కొఱకు, వలనన్, అందు " మొదలగుశబ్దములను చేర్చుటచేత ఏర్పడుచున్నవి. " తండ్రి, అన్న " మొదలగు మహచ్ఛబ్దముల విషయమందైనా ఇదేరీతి- అనగా ప్రాతిపదికమే మరొకశబ్దము పరమైనప్పుడు తాను విశేషణత్వమును పొందుచుండును. తండ్రి-తండ్రిచేతన్ అనగా తండ్రి (యొక్క) చేతియందు అని అర్థము. చెట్టువలననుండి - అనగా చెట్టు (యొక్క) వలనను - ప్రక్కను - ఉండి - చెట్టుమీదనుండి ఆకు రాలినది. మరికొన్ని శబ్దముల విషయములో, అనగా నేయి, నోరు మొదలగువానికి మరొకశబ్దము పరమైనపుడు వానివిశేషణత్వము ద్యోతకమగుటకు 'అత్తు,' 'ఇన్' మొదలగు శబ్దములు నడుమ చేర్చబడుట కలదు. అప్పుడు 'నేయి + చెంబు' అనునది 'నేయిచెంబు' అనికాక 'నేతిచెంబు' అనిన్ని, 'నోరు + మాట,' 'నోరుమాట' కాక 'నోటిమాట' అనిన్ని అగుట సంభవించును. నేయి, నోరు మొదలగుశబ్దముల విశేషణత్వమును వ్యక్తముచేయుటకు చేర్చబడిన " అత్తు ", " ఇన్ " శబ్దములు ప్రాతిపదికలతో కలిసిపోవుటచేత నేర్పడిన " నేతి " " నోటి " అను పదములనుండి 'టి, తి' లను విడదీసి వైయాకరణులు ఔపవిభక్తికములని వీటికి పేరు పెట్టిరి. స్థలవాచక శబ్దమైన ఈ " ఇన్ " అనేదానిలోని ఇకారమే కొన్ని తత్సమశబ్దములపై విభక్తులు పరమైనపుడు కూడా చేర్చబడుచున్నది. రాముడు + ఇ-రాముడి పుస్తకము; రామన్ + ఇ, రామని - రాముని, రామునిచేత, రామునివలన మొ॥ రాముడు అనుదానిలోని డువర్ణకముకూడా రామన్ అను ప్రాచీన రూపములోని పదాంత నకారమున కూతగా బయలుదేరిన దకారమునకు ఉచ్చారణ సౌకర్యమునకై ఒక ఉ కారము చేర్చుటచేత ఏర్పడినదే. రామున్డు, రాముఁడులోని తుదిదువర్ణము ఇతర

విభక్త్యర్థకరూపములలో కనబడక ప్రాచీన నకారము మాత్రమే విశేషణత్వద్యోతకమగు ఇ కారముతోకూడి "ని" వర్ణమై కనబడుచుండుటచేత "రాముండు"లోని "ండు" అను దానికిని, 'రాముని - చేతను' అనుదానిలోని నివర్ణమునకును గల సంబంధమును గుర్తింపని వైయాకరణులచేతులలో "డుఙ్" వర్ణకము ప్రథమాప్రత్యయమైనది, ప్రథమేతరవిభక్తులలో "ని" వర్ణకము నిగాగమమై వెలసినది.

మొత్తముమీద నీ 'డు' వర్ణక మీభాషకు సంస్కృతభాషాసంపర్కము కలిగినపిదప 'అవన్, వాన్డు' అనుసర్వనామరూపములసామ్యముచేత మహత్తులగు సంస్కృతాకారాంతపుంలింగశబ్దములలో కూడా బయలుదేరి ఉండుననీ, ఆ "డు" వర్ణకము తక్కినవిభక్తులలో గనబడకుండుటనుబట్టి ప్రథమాప్రత్యయముగా గ్రహింపబడెననీ, ఊహింపవచ్చును. ఇట్లే "ము, వు"లుకూడా, సంస్కృతశబ్దములకు సంబంధించినవే. ఇవి అమ్మంతశబ్దములు ను కారాంతశబ్దములును తుదినూతగా ఒక ఉకారమును గ్రహించుటచేత ఏర్పడిన వనమ్ + ఉ + వనము, ధేను + ఉ-ధేను + వ్ + ఉ-ధేనువు అను రూపములనుండి విడదీయబడుటచేత ఏర్పడినవేఅని అనుకోవచ్చును. ప్రథమలోనేకాక తక్కిన విభక్తులలోకూడా ఈరూపములే ప్రాతిపదికములై నిల్చి ఉండుటచేత వీటిని ప్రథమాప్రత్యయములనుట పొసగనే పొసగదు. వనము, వనముచేత, వనమువలన, ధేనువు, ధేనువుచేత, ధేనువువలన మొ॥

ఇక "లు"వర్ణము బహువచనద్యోతకమేకాని ప్రథమావిభక్తిప్రత్యయ మనుటకు వీలులేదు. అన్నివిభక్తులలోను బహువచనమున నిదే "ల" అను దీనివిశేషణరూపముతో చేర్పబడి కనబడుతున్నది. దీనిప్రాచీనరూప మెట్టిదో ఈభాషను పరిశీలించినంతమాత్రమున తెలుసుకొనుట కష్టసాధ్యమేకాని ఇతరసన్నిహితసజాతీయభాషారూపములనుబట్టి అన్వేషించి తెలుసుకొనుటకు ప్రయత్నముచేసిన సుకర మగును. ఈ 'లు' అనునది ఈభాషలోని బహువచనరూపములనుండి విడదీయబడి ఒకప్రత్యయముగా నేర్పడుట తటస్థించుటచేత అంతకుపూర్వము లేని కొత్తశబ్దములు ఈభాషలో కొన్ని బయలుదేరినవి. అట్టి పదములలో వైయాకరణులచేతకూడా ఒకవిధముగా రూపసాధనకై గ్రహింపబడినవి, "కొలఁకు, మ్రాఁకు, కలఁకు, రేఁగు, గోఁగు మొదలగుశబ్దములు. వైయాకరణులు గ్రహించిరనుటలోని ఉద్దేశ మేమనగా ఈరూపములనిష్పత్తిక్రమమును వారు వ్యాకరణమున సాధింపవలసినవారైరనుటయే. ఈబహువచనరూపములనిష్పత్తిని సాధించుసందర్భమున వారికి కొంత చిక్కు కలిగినది. ఏల యనగా ఈశబ్దము లేకవచనమున నువర్ణాంతములై యున్నవి. ఉదా : కొలను, మ్రాను, కలను, రేను, గోను, ఇత్యాదులు. వీటికి బహువచనమున 'లు' వర్ణము చేర్చగా కొలనులు, మ్రానులు, కలనులు, రేనులు, గోనులు అని కావలసి ఉన్నది. అట్లుకాక భాషలో నిష్పన్నరూపములు కొలకులు, మ్రాకులు, కలకులు, రేగులు, గోగులు అని వ్యవహారమందున్నవి. కేవలము 'లు' అనునదిమాత్రమే బహువచనప్రత్యయమైతే కొలనులు కావలసినదేకాని కొలఁకులు అగుటకు వీలు లేదు. కావున నీరూపమును సాధించుటకు వైయాకరణుడు బహువచనప్రత్యయము పరమైనపుడు ఈ శబ్దములకు - అనగా కలన్వాదులకు 'కుగ్విధానమును' రేన్వాదులకు 'గుగ్విధానమును' చేయవలసినవాడైనాడు. ఇట్లు బహువచనరూపములను సాధించినపిదప, 'లు' వర్ణముమాత్రమే బహువచన

ప్రత్యయముగా ఏర్పడిన పిదప భాషలో నతిస్వాచిత్కముగా వ్యవహరింపబడుచుండిన కొలకు, మ్రాకు మొదలగు కువర్ణాంతైకవచనరూపములనుగూడ నాదరించుచు, ఏకవచనమునగూడ ఈ 'కుక్' వికల్పముగా వచ్చునని విధించినాడు. అట్లు మ్రాను, మ్రాకు, అను రెండురూపము లేక వచనమునను, మ్రాకులు అనే దొక్కటే బహువచనమునను ఏర్పడినవి.

వైయాకరణులు విధించిన 'కుక్' అనునది సహజముగా తొలిశబ్దమునకు చెందినదా, లేక బహువచన ప్రత్యయము చేర్పబడినపుడు మాత్రమే వచ్చుచుండుటచేత బహువచనమునకు సంబంధించినదా అను సందేహము కలుగకమానదు. కొలకు, మ్రాకుశబ్దము లేకవచనమున ప్రాచీనకాలము నుండిన్ని రూఢములై ఉన్నవయితే వానియందలి "కు" వర్ణము శబ్దగతమే అనవచ్చును; కాని నువర్ణాంతరూపములకే ఎక్కువప్రాచుర్యము కలుగుటచేత ఈ 'కు' వర్ణము బహువచన ప్రత్యయమునకే సంబంధించినదేమో అను సంశయమున్ను కలుగకమానదు. ఇతరసన్నిహితభాషలగు తమిళ కన్నడములలోకూడా ఈశబ్దములు కువర్ణాంతములుగా కాక "మరమ్," "కుళమ్" అని మకారాంతములుగా ఉండుటచేతనూ, బహువచనప్రత్యయ మాభాషలలో తెలుగులోవలె 'లు' అనునది కాక కవర్ణపూర్వకమై "గళ్", "గళు" అనురూపములు గలదై ఉండుటచేతనూ తెలుగులోని "కుక్" విధానమునకు మూలమయిన ఆబహువచనరూపములలోని 'కు'వర్ణము బహువచనప్రత్యయమునకు చెందినదే అని నిశ్చయించుట కవకాశ మేర్పడుతున్నది. అట్లే అయినచో కొలను + కులు=కొలనుకులు, కొలన్కులు, కొలంకులు, కొలంకు + లు, కొలఁకు + లు అనునీరీతిని కొలఁకు అను నేకవచనరూపము బహువచనరూపముయొక్క అనుచితవిభాగముచేత (wrong splitting) ఏర్పడినరూపమని (back form) తెలుసుకోవలసినది.

బాగుగా పరిశీలించినచో ఇట్లే ప్రాచీనకాలమున "కలు","గలు" అను బహువచనప్రత్యయముతో కూడిన బహువచనరూపములనుండి ఈభాషలో "లు" అనునదిమాత్రము బహువచనప్రత్యయమను ఊహతో "లు"వర్ణము విడదీయబడుటచేత ఏర్పడి కవర్ణాంతైకవచనరూపములుగా భాషలో స్థిరపడిన శబ్దములు అనేకముగా మనము గుర్తించవచ్చును. అట్టిపదములలో కొన్నిటిని మాత్రమే ఈదిగువపట్టికలో చూపుతున్నాను. కవర్ణాంతమే తొలిరూపము కాగూడదా? దానిపై "లు"వర్ణము బహువచనమున చేర్చబడి ఉండకూడదా? అనుసందేహమును నివారించుటకుగాను ఇతరసన్నిహితభాషలలోని కవర్ణవిరహితములగు ఏకవచనరూపములు వ్యవహారములో ఇప్పటికీ ఉండుట ఈపట్టికలో వ్యక్తము చేయబడుతున్నది. వైయాకరణులు గ్రహించినరూపములలోకూడా ఏకవచనమందు నువర్ణాంతరూపములకేకాని కువర్ణాంతరూపముల కింతవ్యవహారప్రాచుర్యము లేకుండుటనుబట్టి కువర్ణాంతరూపములు భాషలో సహజములుగాని ప్రాచీనములుగాని కావని ఊహింపవచ్చును.

| తమిళ కన్నడములు | | తెలుగు | |
|---|---|---|---|
| ఏకవచనము | బహువచనము | బహువచనము | ఏకవచనకువర్ణాంతరూపము |
| తమి - ఈ | ఈ + గళ్ = ఈగళు | ఈగలు | ఈగ |
| తమి - ఎలి ; క - ఇలి | ఎలి + గళ్ = ఎలిగళ్, ఎలిగళు | ఎలికలు, ఎలుకలు | ఎలిక, ఎలుక |

| తమిళ కన్నడములు | | తెలుగు | |
|---|---|---|---|
| ఏకవచనము | బహువచనము | బహువచనము | ఏకవచనకువర్ణాంతరూపము |
| తమి - కిళి, క - గిళి, గిణి | కిళి + గళ్ = కిళిగళు | చిలుకలు * | చిలుక |
| తమి, క, మ - ఉమి | ఉమి + కళ్ = ఉమికళు | ఉమికలు, ఉముకలు | ఉముక - (ఊఁక) |
| తమి - ఎలుమ్బు, ఎన్బు, క - ఎలు, ఎలువు, ఎలుబు | ఎలుమ్బుగళ్ | ఎముకలు, ఎమ్ముకలు | ఎముక - (ఎమ్ము) |
| తమి - పిణై | పిణై + గళ్ | పీనుగలు | పీనుగ |
| తమి - ఆనై, క - ఆనె | ఆనై + గళ్ = ఆనైగళు | ఏనుగలు, ఏనుగులు | ఏనుగ, ఏనుగు, ఏనిక |
| తమి - ముటి | ముటి + కళ్ = ముటిక్కళ్ | ముక్కులు | ముక్కు |
| తమి, క - నరి | నరి + కళ్ = నరిక్కళ్ | నక్కలు | నక్క |
| తమి - కుడై | కుడైగళ్ | గొడుగులు | గొడుగు |
| తమి, క - మరమ్ | త - మరంగళ్, తుళు - మరొకొళు | మరంకులు, మ్రాంకులు, మ్రాఁకులు | మ్రాఁకు |
| తమి - కుళం, క - కొళ | కుళంగళ్ | కొళంకులు, కొలఁకులు | కొలఁకు |
| తమి - గోణ | గోంగళ్ | గోంగులు, గోఁగులు | గోఁగు |
| తమి - తుణి | తుణిక్కళ్ | తునికలు, తునుకలు | తునుక, తునక |

ఇట్టిభాషలో క, కు, గు వర్ణాంతశబ్దము లనేకములు ప్రాచీనభాషలోని బహువచనరూపముల నుండి 'లు' వర్ణము విడదీయుటచే నేర్పడినవై యుండెననుటకు సందేహము లేదు. ఈభాషలోని బహువచనప్రత్యయముయొక్క సహజస్వరూపముకూడా ఇప్పటిరూపములను ప్రాచీనభాషారూపములతో పోల్చి చూచినగాని మనకు ఎరుకపడదు. కావున మనభాషలోని ప్రత్యేకపదములయొక్కగాని విభక్తులయొక్కగాని నిష్పత్తిక్రమమును వాటిమూలస్వరూపమును తెలుసుకోవలెనంటే వాటిచరిత్రను ఆభాషలోనేకాక దానికి సంబంధించిన సన్నిహితసజాతీయభాషలలోకూడా వెనువెనుక కన్వేషించి పరిశీలింపవలసిన ఆవశ్యకత ఎంతో కనబడుతున్నది.

ఇంతవరకీభాషలోని నామవిభక్తు లనేవి సంస్కృతవ్యాకరణసంప్రదాయానుసారము ఏర్పరుపబడినవైనను వాస్తవముగా ఒకనామవాచకపదముపై మరిఒక స్వతంత్రపదమును చేర్చుటచేతనే ఆయా విభక్త్యర్థములు వ్యక్తమగుచు వచ్చినవికాని కేవల మర్థము తెలియనిప్రత్యయములు చేర్చుటచేత గాదనిన్ని, ఒకపదముపై మరొకపదము చేర్చినపుడు ఆరెంటికిని గలసంబంధము విశేషణవిశేష్యభావసంబంధమై యుండెననిన్ని, ఒకొక్కప్పుడాపదములకు గల ఈసంబంధమును వ్యక్తముచేయుటకుగాను "అత్తు", "ఇక" మొదలగుశబ్దములు చేర్చబడుచూ ఉండెననిన్ని తెలియుచున్నది. దీనినిబట్టి

* తాలవ్యేకారసాహచర్యముచేత కంఠ్యకకారము తాలవ్యచకారముగా మారినది. (The law of Palatalization)

సామాన్యముగా ఈభాషలోని వాక్యములందలి పదములకు గలసంబంధము విశేషణవిశేష్యభావరూపమై ఉండెనని స్పష్టమగుచున్నది. ఇక క్రియావిభక్తిస్వరూప మెట్టిదో పరిశీలింతముగాక. ఆంధ్రవైయాకరణులు, ముఖ్యముగా సంస్కృతభాషాభిమానులు, సంస్కృతవ్యాకరణపద్ధతి నవలంబించి ఈభాషలో నామవిభక్తులను సప్తసంఖ్యాకములుగా ఎట్లు చేసినారో అట్లే క్రియావిభక్తిప్రత్యయవిషయమున కూడా అచ్చటి లకారపద్ధతినే ఇచ్చటకూడా దింపివేసినారు. కాని అచ్చటి దశలకారములకున్నూ ఇచ్చట తావు లేకపోవుటచేత ఇచ్చట లకారపంచకమునుమాత్రమే గ్రహింపవలసినవారైనారు. ఆలకారములకు తిప్, తస్ మొదలగునవి ఆదేశముగా వచ్చినట్లే ఇచ్చటకూడా లకారములకు డుఙ్, రు, వు, ము మొదలగునవి ఆదేశము లగునట! అమహదర్థమునందు డుఙ్, రు లకు దు, వులు మరల ఆదేశము లగునట! ఉన్నానుబంధముమీద డుఙ్, రు లకు ది, వి అగునట కుఙ్, రులకు దు, వులుగాని ది, విలుగాని ఆదేశ మగుననుటలో అర్థ మేమో కనబడదు. కేశవాదులును ఆయా కాలములందు ఎడ, ఉదు, ఉరు, దును, దుము మొదలగువాటినే విధించినారుగాని లకారముల కాదేశముగా మాత్రము చెప్పలేదు. సంస్కృతక్రియారూపములతుది నున్న సర్వనామచిహ్నములకును, భాషలోని సర్వనామరూపములకును ఎట్టిసంబంధమూ అగపడకపోవుటచేతనూ, ఒక్కొక్కలకారములో వీటి రూపములు విశేషముగా మారిపోవుచుండుటచేతనూ, లకారములకు తిఙాదు లాదేశములని తిబాదుల కాయా లకారములలో ఆయాప్రత్యయములు మరల ఆదేశము లగునని తెలుపబడినది. కాని ఈభాషలలో డు, రు, ము, వు మొదలగునవి వాడు, వారు, మేము, నీవు అనుసర్వనామముల అవశిష్టభాగము లనుట స్పష్టముగ నుండుటచే లకారముల కివి ఆదేశములనీ, ఉన్నాదులు వీటికి అనుబంధములనీ చెప్పవలసిన ఆవశ్యకత కనబడదు. ఉన్న అనేది ఉండు ధాతువునుండి ఏర్పడిన క్రియావిశేషణరూపమే అనుటచేత ఉన్న + వాడు = ఉన్నవాడు, ఉన్నాడు, అని ఇట్టి రూపముల నిష్పత్తిక్రమము సులభముగా బోధపడుచునే ఉండుటచేత సంస్కృతభాషలోని క్రియారూపముల ప్రక్రియావిధాన మంతయు ఇచ్చటికి తేవలసిన ఆవశ్యకత లేదు. ఆప్రక్రియను అనుసరించుటచేతనే ప్రత్యేకశబ్దములై స్పష్టముగా కనబడుతునే ఉన్న ఉన్నాదుల కనుబంధములనిమాత్రమే చెప్పవలసి వచ్చినది. ఈభాషారూపములను ప్రత్యయములుగను అనుబంధములుగను వ్యాకరించు విధానము అవలంబించుటచేతనే ప్రాచీనవైయాకరణులేకాక ఆధునికులగు భాషాశాస్త్రపండితులలో ద్రావిడభాషాతత్త్వమును కనిపెట్టుటకై అపారపరిశ్రమచేసిన కాల్డ్వెల్ పండితునివంటివాడుకూడా ఈ భాషాస్వరూపమునూ, దానిపరిణామక్రమమునూ గుర్తింపలేకపోవుట తటస్థించినది. ఆంధ్రవైయాకరణులవలె ఈతడును ధాతువులకు ఆయానిష్పాదకములగు కొన్ని ప్రత్యయములు చేర్పబడుతున్నవని చెప్పినాడు. వీటినే ఈతడు Formative additions to the theme అని పేర్కొన్నాడు - అనగా "పోగు," "అడఙ్గు" అనువాటిలోని "గు" వర్ణమును, తమి - "ఆడైను" అనుదానిలోని "ను" వర్ణమును, "తిరున్దు" మొదలగువాటిలోని "దు" వర్ణమును, "నిరుమ్బు" మొదలగువానిలోని "బు" వర్ణమును క్రియానిష్పాదకప్రత్యయములని అతడు తలచినాడు. ధాతువులపై వచ్చునీప్రత్యయములు సకర్మకక్రియలలో పరుషత్వము చెంది ద్విరాభావమును చెందుచున్నవనికూడా తెలిపినాడు. పోగు —

వెళ్లుట, పొక్కు=పంపివేయుట ; అడంగు=అణగి ఉండుట, అడక్కు=అడచుట, అడ్డగించుట ; అడైసు=క్రిక్కిరిసి ఉండుట (to be stuffed in) ; అడైచ్చు = అణచిపెట్టుట (to stuff in); తిరున్దు=తనకుతానే దిద్దుకొనుట (to become correct); తిరుత్తు=ఒకరితప్పు దిద్దుట (to correct); నిరమ్బు=నిండుట (to be full); నిరప్పు=నింపుట (to fill). వైయాకరణులు పోగు, అడంగు, తిరుందు, నిరుంబు మొదలగువాటినే ధాతువులుగా గ్రహించి ఉండుటచేత వారికీప్రత్యయములగొడవయే లేక పోయినది. కాల్డ్వెల్ పండితు డారూపములను ఇతరద్రావిడభాషారూపములతోనూ, ఆయాభాషలలో ఆధాతువులనుండి ఏర్పడిన ఇతరనామవాచకరూపములు మొదలయినవాటితోనూ పోల్చి చూచినవాడుగనుక 'కు', 'సు', 'దు', 'ంబు', అనువాటితో గూడని నామవాచకశబ్దములుకూడా కనబడుతున్నప్పుడు ఇవి అంతమందు కలవిమాత్రమే ధాతువులని అత డెట్లు చెప్పగలడు. ధాతువు అనేదానికి సజాతీయశబ్దముల కన్నిటికిని పరమమూలమైన వర్ణసముదాయ మన్నదే అర్థమైనచో ఈ గు, దు, బు మొదలగువర్ణములే లేకుండిన కొన్ని నామవాచకపదములు భాషలో కనబడుతున్నప్పుడు వీటితోకూడినదే మూలధాతుస్వరూపమని చెప్పుట కవకాశము లేదుకదా. 'అడగు' ధాతు వైనచో 'అడ' అనునామవాచకరూప ముండుటకు కారణ మేమై ఉండును? 'కునుగు' ధాతువైనచో 'కుని', 'కుండు', 'కుంపర', మొదలగునవి గువర్ణవిరహితములైన నామవాచకరూపము లెట్లేర్పడినవి? "తిరున్దు", "నిరమ్బు" అను 'దు' వర్ణాంత, 'బు' వర్ణాంతరూపములే మూలధాతువులైనచో త్రిప్పు, తిరుల్, తిరి (చెవిలో తిరి పెట్టుట) మొదలగునామవాచకరూపములలో 'దు' వర్ణముగాని, "నిండు" "నిరై" మొదలగురూపములలో 'బు' వర్ణముగాని, కనబడుట లేదే. అట్లే 'వెలుగు' ధాతువైనచో "వెలవెలబోవు", "వెల్లి" "వెండి", "వెల్ల" మొదలగువానిలో 'గు' వర్ణముకూడా లేకపోవునా? ఆయాధాతువు లనబడువాటిలోని తుదివర్ణములు వాటికి సంబంధించిన అనేకశబ్దములలో కనబడుటలేదు. కనుక అవి మూలధాతువులకు చెందినమూలధాతువులు కావనీ, క్రియారూపము లేర్పడుసందర్భమున మూలధాతువు కేదో ఒక అర్థమును సూచించుటకుగాను చేర్పబడి ఉండెననుటే సమంజసముగా ఉండును. అట్లే అయినచో అడ్, నిర్, తిర్, వెళ్, కున్ మొదలగునవే మూలధాతువు లగునని చెప్పక తప్పదు. వీటిపైని చేరిన 'దు, బు, గు, సు' మొదలగునవి ఆధాతువులనుండి క్రియారూపములను నిష్పత్తిచేయునపుడు క్రియాత్వద్యోతకములుగను, లేదా, సహాయధాతువులుగను చేర్పబడి వాని అవశిష్టభాగములై ఉండును. ఇప్పుడు మన కివి అర్థము తెలియనిప్రత్యయమాత్రములే అయిన నగుగాక, కాని మొదట నీధాతువులను క్రియారూపములుగా ప్రయోగించినప్రాచీనజను లర్థములేనిప్రత్యయములను చేర్చి ఉండరుగదా. భాషలో అర్థములేని ప్రత్యయములు (త. కారియై) అనుబంధములు మొదలైనవి లాక్షణికులనివ్యాకరణమనే కత్తిక్రింద నలిగిపడిపోయినముక్కలే కాని వేరుకావు. ఇవికూడా భాషలో అర్థవంతములై ఒకకాలమున స్వతంత్రప్రయోజనము గలిగినస్వతంత్రశబ్దములే అయి ఉండుననుటకు సందేహములేదు. కాలప్రవాహమున బడి ఉచ్చారణవేగముచేత నలిగి నలిగి మారురూపములనూ సంక్షిప్తరూపములనూ పొందుటచేత కొంత కాలమున కానవాలుపట్టుటకు వీలులేనిస్థితికి వచ్చి ప్రత్యయములు, అనుబంధములును అగుచుండును.

ప్రవాహవేగము, లేదా ఉచ్చారణవేగము ఒక్కొకచోట - అనగా ఆభాషను వ్యవహరించుదేశమునం దొకప్రాంతమునగాని, ఆసంఘమునం దొకభాగమునగాని - అల్పమై ఆభాషారూపముల కంత నలుగుడు లేకుండుట తటస్థించినచో ఒకప్రదేశమున మార్పుచెందినరూపముల నిజస్వరూపము మరొక ప్రాంతమువారివ్యవహారములో నిలిచి ఉండి మనకు గోచరింపవచ్చును. ఒకకాలములో ఒకభాషను వ్యాకరించినవారిలక్షణమునకును అంతకుపూర్వ మేర్పడి ఉన్నలక్షణమునకున్నుకూడా కొంతభేద మేర్పడుచుండుట తటస్థించును. కనుకనే ఒక్కభాషకే కాలభేదమునుబట్టి భిన్నవ్యాకరణము లేర్పడుచుండుట. మరియు నీభేదము వారివారిదృక్పథములనుబట్టికూడా ఏర్పడుచుండవచ్చును. సామాన్యముగా ఏభాషకైనా మొట్టమొదట లక్షణ మేర్పరచినవారిమార్గమునే తరువాతిలాక్షణికులుకూడా అనుసరించిపోవుట తటస్థించుచుండును. కనుక ఏకభాషాలక్షణవిషయమున కాలమును బట్టి భేదము లంతగా కనబడకపోయినా సజాతీయము లయిన భిన్నభాషలలక్షణములను పరిశీలించినయెడల మూలభాషారూపములు, ఆయాకాలములలో ఏయేరూపములతో ఉన్నవో, అవి లాక్షణికులచే ఏయేవిధముల పరిగ్రహింపబడినవో తెలియవచ్చుటేకాక వాటిపుట్టుపూర్వోత్తరములుకూడా విశదము కావచ్చును.

ఇందుకు నిదర్శనముగా నీభాషలలోని బహువచనరూపములయొక్కయు బహువచనప్రత్యయములయొక్కయు స్వరూపము లెట్లు మార్పుచెందుతూవచ్చినవో ఇదివరకే చూపబడినది. 'ఎలికలు' అనేబహువచనరూప మొకటి ప్రాచీనద్రావిడభాషలో వ్యవహారమం దుండగా దానిలో నొకశాఖ అయినతమిళమును క్రీస్తుశబ్దమునకు పూర్వమున వ్యాకరించి లక్షణము చెప్పిన తొల్కాప్పియనార్ అనే లాక్షణికుడు 'ఎలి + కలు (కళ్)' అని ఆకాలపుభాషాప్రయోగమునందలిపరిపాటినిబట్టి విభాగించి 'కళ్' అనేదానిని అమహద్బహువచనప్రత్యయముగా విడదీయగా, మరికొంతకాలమునకు మరొకశాఖ అయినకన్నడమును వ్యాకరించినవారుకూడా అట్లే విభాగింపగా, అటుతరువాత ఆమూలభాషయొక్క మరొకశాఖ అయినమనతెలుగుభాషను ఆకాలమునందలి ఆభాషలోని వ్యవహారపద్ధతినిబట్టి వ్యాకరించినవారు 'ఎలిగళ్' అనే ప్రాచీనభాషాశబ్దము 'ఎలికలు', 'ఎలుకలు' అను రూపములు వ్యవహారములో ఉండుటచేత ఆశబ్దము 'ఎలిక + లు' అని విభాగించి, 'ఎలిక' అనేది ఏకవచనరూపమనీ 'లు' అనేది బహువచనప్రత్యయమనీ లక్షణ మేర్పరచిరని మనము తెలుసుకొనే ఉన్నాము. ఒకకాలమున వ్యవహారములో ఉన్నశబ్దము మరికొంతకాలమున కొకదేశభాగమున 'ఎలిక' అనేరూపమును గ్రహించినది. 'గళ్' అనుపదము 'లు' అయినది. ఇట్లే తమి; 'పుదర్'-తె; 'పొదరు' అనుపద మిప్పుడు 'పొద' అయినది. తెమ్ + ఎలర్ = తెమ్మెలర్, తెమ్మెరల్, తెమ్మెరలు, తెమ్మెర + లు-ఏకవచనరూపము 'తెమ్మెర' అనునదీ భాషలో ఏర్పడినది. గాలి అను అర్థముగల ఎలర్ అనుప్రాచీనశబ్దము వ్యతిపాతవిధిచే ఎరల్ అయినది. తెమ్ శబ్దముతో కలిసి తెమ్మెరలు అనురూపమును పొంది బహువచనరూపభ్రాంతిని కల్పించి 'తెమ్మెర' అనే ఏకవచనరూప కల్పనమునకు సాధకమయినది. ఇట్లు ప్రత్యేకశబ్దములలోవలెనే ధాతుస్వరూపవిషయములోకూడా క్రియావిభక్తులవిషయములోనుకూడా ఆయాకాలములం దాయాభాషాశాఖలలోని వ్యవహారపద్

పాటినిబట్టి లక్షణములో అభిప్రాయభేదము లేర్పడుతూ వచ్చినవి. లాక్షణికులు ధాతువులుగా పరిగణించినకొన్ని రూపములను గ్రహించి పరిశీలింతము. 'గు' వర్ణాంతధాతువులనుగూర్చి వెనుక కొంచెము పరిశీలించేఉన్నాము. వెలుగు, తునుగు, తిరుగు, అడగు మొదలైనవి మూలధాతువులని భావించుటకు అవకాశము లేకుండుటకు గలకారణమును గమనించే ఉన్నాము. విశేష మేమనగా, ఆంధ్రమున కొంతవరకు అర్వాచీనములని చెప్పదగిన - అనగా తద్ధర్మార్థకములని చెప్పబడేరూపములకంటె అర్వాచీనము లన్నమాట - తిరుగుచున్నాడు, తిరిగినాడు, తిరుగగలడు మొదలగు త్రైకాలికక్రియా రూపములలో 'గు' వర్ణాంతమే నియతముగా కనబడుచుండుటచేతనూ, దానిపైనే కాలసూచక చిహ్నములు చేర్పబడుచుండుటచేతనూ ఆ 'గు' వర్ణాంతమే ధాతువని ఆంధ్రవైయాకరణులు తలచినారు. ఈభావములో తద్ధర్మార్థకము లనబడురూపములుకూడా 'గు' వర్ణసహితములుగానే ఉన్నవి. ఇవి కొంతవరకు కాలభేదమూ, లింగవచనభేదమూకూడా లేకుండా ప్రయోగింపబడుతున్నవి. 'వెలుగును,' 'వెలిగెడును' అనునవి భావివర్తమానములలో లింగవచనభేదము లేక ప్రయోగింపబడుచుండుట సువ్యక్తమే. ఈరూపము లిట్టిభేదమును సూచింపకుండుటనుబట్టి అట్టి భేదమును సూచించుటకుగాను భాషలో ఏర్పడిన 'వెలుగుతున్నది, వెలుగుతున్నవి, వెలుగగలదు, వెలుగగలడు' మొదలగు రూపములకంటె ప్రాచీన మనుటకు సందేహములేదు. దీని నిష్పత్తిక్రమము తెలుపుతూ ఆంధ్రవైయాకరణులు వెలుగు అనేది ధాతువనీ, దానిపై తద్ధర్మార్థమున ఎడు, ఎడి, ను అను ప్రత్యయములు చేరుననీ చెప్పినారు. ఈకారణముచేత 'గు' వర్ణము ధాత్వవయవమే అయినది. కాని ఇంతకుపూర్వము చిరకాలము క్రిందటనే ప్రాచీనభాషలోని ఈ 'గు' మంతరూపములను వ్యాకరించిన తమిళవైయాకరణు డగు తోల్కాప్పియనార్ అనునతడు "శైగుమ్" "శెల్గుమ్" అనువాటిని ధాతువులుగా గ్రహింపక 'శై, శెల్, పో' మొదలగునవే ధాతువులనీ, 'గుమ్' అనేది క్రియారూపమునకు బహువచనమున చేర్పబడే ప్రత్యయమనీ చెప్పినాడు. కు, డు, తు, ఱు అనేవి ధాతువుల కేకవచనముననూ కుమ్, డుమ్, తుమ్, ఱుమ్ అనేవి బహువచనముననూ చేర్పబడునని చెప్పినాడేకాని ఇవి కాలభేదమునుగాని లింగభేదమునుగాని సూచించున ట్లేమీ తెలిపి ఉండలేదు. తరువాతికాలమునందలి వైయాకరణులు 'కు', 'కుమ్' ప్రత్యయములు భావివర్తమానములనూ, తక్కినవి భూతకాలమునూ సూచించునని ఒకవిభాగము చేసినారు. ఇక కన్నడభాషావైయాకరణులుకూడా తమిళవైయాకరణుని పద్ధతి కనుగుణముగానే 'కుమ్', 'గుమ్' అనేవి ధాతువుకంటె భిన్నమైన ప్రత్యయములని తెలుపుటేకాక ఇవి ధాతువునకు చేర్పబడినప్పుడు లింగ, వచన, కాలభేద మేమీ సూచింపని క్రియా రూపము లేర్పడుచున్నవని చెప్పినారు.

"సవనాగి భూతదొళ్ లిం
గవచనదొళ్ తుత్తువర్తమాన భవిష్య
ద్వ్యయవప్పుతిగళ గుం కుం స
ల్పవుతావ న్యేకవచనదొళ్ శ్నులసిద్ధం॥"

శబ్దమణిదర్పణం-అఖ్యాతప్రకరణం-228 సూత్రం.

దీనినిబట్టి చూడగా 'గుమ్,' 'కుమ్', అనువాటిలోని తుది మకారము తోల్కాప్పియనార్ తలచినట్లు వచనభేదమును సూచించు చిహ్నముగాకూడా గ్రహింపదగి ఉన్నట్లగపడదు. 'ఉమ్' అనేది సామాన్యముగా సముచ్చయార్థక మగుటచేత ధాతువుచే సూచింపబడిన క్రియ ఇంకా జరుగుతూనే ఉన్నదనిమాత్రము సూచించునని తలచుకొనవచ్చును. కనుకనే ఈరూపములు భవిష్యద్వర్తమానములందు విశేషముగా ప్రయోగింపబడుట తటస్థించి ఉండును. భూతకాలమును సూచించుటకుగాను భాషలో ప్రత్యేకరూపములు బయలుదేరకపూర్వము ఇదే త్రికాలసూచకమై ఉండెననికూడా తోచుచున్నది. ఇట్టి 'వెలుగును', 'చేయును' (శెయ్‌గుమ్) పోవును (పోగుమ్) మొదలయిన 'గు' మంతరూపములు ఈదక్షిణదేశభాషలు అరవము, తెలుగు, కన్నడములుగా విడిపోవక పూర్వము వ్యవహారములో ఉండిన ప్రాచీనద్రావిడభాషలో అతిప్రాచీనకాలమున లింగవచన కాలాది భేదము లేకుండానే కేవలక్రియాభావద్యోతకములై ఉండెనని వ్యక్తమగుచున్నది. ఆప్రాచీనభాషలోని రూపమే తెలుగులో నిల్చి ఉండగా దానికి వైయాకరణులు తద్ధర్మార్థకమని పెట్టినపేరు చాలా సార్థకమై ఉన్నదనుట నిశ్చయము. వీరు 'గు' మంతమునే ధాతువుగా గ్రహించి 'ఉమ్' అనేదాని రూపాంతరమగు 'ను' అనేదానిని ప్రత్యయముగా భావించిరేకాని 'గు' అనేది క్రియానిష్పాదక ప్రత్యయమని అయినా తలచలేదు. వాస్తవముగా 'గు' మంతము మూలధాతువు కాదు. కేవల'గు' వర్ణము క్రియానిష్పాదకప్రత్యయమూ కాదు. అది వేరొక సహాయధాతువుయొక్క అవశిష్ట భాగమే (Remnant) అయి ఉంకును. ఆంధ్రములో తద్ధర్మార్థకములనబడుతూ ఉన్నరూపములు ప్రాచీనభాషకు చెందినవై ఈదక్షిణదేశభాషలలో కనబడుచున్నవనిగదా పైని తెలుపబడినది. భూతకాలికరూపములనుగూర్చికూడా మన మట్లే భావించవలసి ఉన్నట్లు అగపడుచున్నది. ఒకకాలమున తద్ధర్మార్థకరూపములే భూతకాలమునుకూడా సూచించుచుండెనని తలచుట కవకాశము ఉన్నది కాని కొంతకాలమయిన పిదప, ఆప్రాచీనభాషలో భూతకాలమును సూచించుటకు ప్రత్యేకరూపమేర్పడిన పిదప, ఈతద్ధర్మార్థకరూపములు తరచుగా భావివర్తమానములను సూచించునవైనవి; అనగా ప్రత్యేకముగా కాలమును సూచించురూపములలో భూతకాలరూపము తొలుత ఏర్పడినదన్న మాట. ఏరూపమయినా ప్రాచీనమూలభాషకు చెందినదని మనము చెప్పగలుగుట అది సజాతీయ భాషలో ఏవిధముననైనా గుర్తింపబడుట కవకాశము కలిగినప్పుడేకదా! తత్తద్భాషావైయాకరణుల చేతులలోపడి అదెట్లునలిగినా 'గు' మంత తద్ధర్మార్థకరూపము ప్రాచీనభాషలోనిదని మన మట్లే నిశ్చయింపగలిగితిమి. కాలవాచక క్రియారూపములలో మన మన్నిభాషలలోనూ సమానముగా గుర్తింపగలిగినరూప మీభూతకాలికరూప మొక్కటే కనబడుచున్నది. అదికూడా పైతద్ధర్మార్థక రూపమువలెనే ఆయా భాషావైయాకరణులచేతులలో బడి భిన్నరీతుల వ్యాకరింపబడిన దగుటచేత దాని సహజస్వరూపమును గుర్తించుట కొంతకష్టసాధ్యమే అగును. అయినను ఈ భాషారూపముల నొకదానితో నొకటి పోల్చి చూచినప్పుడు దాని రూపమును గుర్తింపలేకపోము. తెలుగులోని చేసితిని, చేసినది మొదలగు భూతకాలికరూపములను తమిళము నందలి శెయ్‌దేన్, శెయ్‌దదు అను వాటితోనూ, గెయ్‌దెం, గెయ్‌దదు, మాడిదేను, మాడిదదు అనే కన్నడరూపములతోనూ పోల్చి పరిశీలించినప్పుడు వీటి సమానార్థకత్వమేకాక తుల్యరూపత్వముకూడా మనకు పొడ

కట్టకమానదు. కాని కొన్ని చిక్కులునూ లేక పోలేదు. చేసితిని అనుదానికి అనురూపములని చెప్ప దగిఉన్న శెయ్‌దేన్, గెయ్‌దెం అనేరూపములలో ద్వితీయాక్షరమగు యకారము పైని ఇకారము కనబడుటలేదు. కనుక వీటికనురూపత్వముగాని (Correspondence) సజాతీయత కాని ఎట్లు చెప్పవచ్చునను సందేహము కలుగవచ్చును. ఇట్లు తమిళ కన్నడములలో అనేకరూపము లందు 'ద' కారమునకు పూర్వమందు 'ఇ' కారము కనబడక పోవుటచేతనే ఆ భాషలను వ్యాకరించినవా రాభాషలలో దకారమే భూతకాలిక చిహ్నమని నిశ్చయింప వలసినవా రైనారు. తెలుగులో భూతన్యూనరూపములన్నీ 'ఇ' కారాంతములై ఉండుటచేతనే 'ఇ' కారమే భూత కాలికచిహ్నమనీ, 'చేసితిని' అను సంపూర్ణక్రియారూపములలో నగపడు 'త' కారము లేదా 'తి' కారము నడుమ నెచ్చటనుండియో వచ్చిచేరిన ఆగమమనీ చెప్పవలసినవా రైరి. తమిళ కన్నడములలో భూతకాలికక్రియావిశేషణరూపములు పెక్కింటియందుకూడా 'ఇ' కార మగు పడక 'శెయ్ద, గెయ్ద' అను దకారాంతరూపమే కనబడుచుండుటనుబట్టి కూడా 'ద' కారమే భూత చిహ్నముగా అభాషలలో గ్రహింపబడుట యుక్తమే అనితోచును. కాని త-పాడు, క-మాడు అను మరికొన్ని ధాతువులనుండి ఏర్పడిన పాడినాన్, మాడిదేను, పాడిన, మాడిద అనే ఈ మొదలయినరూపములలో 'ద' కారమూ, తత్స్థానీయమైన 'న' కారమూ కూడా తెలుగులోని చేసితిని, చేసిన అనురూపములందువలెనే ఇకార పూర్వక మగుచుండుటచేత ఈ భాషలలో కూడా 'ఇతు' అనుదానితో కూడినరూపము లొకప్పుడు ఉండినవనిన్ని, లేదా అవికూడా 'ఇతు', 'ఇదు' అనే వాటితో కూడినవే అయిఉండగా, కాలక్రమమున ఆ రెండుభాషలలోనూ, 'ఇదు' లోని 'ఇ' కారము ఉచ్చారణవేగమున జారిపోవుటచేత 'శెయిదేన్'(=చేసితిన్)=శెయ్‌దేన్ అనురూపము కలిగినదనిన్ని ఊహించవచ్చును. ఏకారణముచేతనో 'పాడు' మొదలయిన కొన్నిధాతువులరూపములలో మాత్రము ఆ 'ఇ' కారము జారిపోలేదు. మళయాళములోకూడా భూతన్యూనమే కాక భూతకాలికరూపములన్నీ ఇకారముతోకూడి ఉన్నట్లే కనబడుతున్నవి. విశేషమేమనగా పురుష, లింగ, వచనప్రత్యయములు చేర్చబడకుండానే 'పోయి' అనురూపమే పోయితిని - పోయితివి - పోయితిరి, పోయినాడు మొదలగు క్రియారూపముల అర్థమును ఇచ్చుచున్నది. ఇది ఈ భాషలోని ప్రాచీనావస్థను తెలుపుచున్నదని నిశ్చయింపగలిగినట్లయితే క్రియా రూపములలో లింగవచనాదిభేదము సర్వనామరూపములను ధాత్వంగమునకు చేర్చుటచేత కాలక్రమ మున ఏర్పడిఉండునని తలచుటకు కవకాశము కలుగును. 'పోయితి' అనురూపము సర్వనామప్రత్య యములగు ని, మి, వి, రి అనేవాటిని చేర్చుకొని పురుషవచనభేదమును సూచించుచున్నదనుట మనకు సువ్యక్తమేకదా!

ఇట్లు తెలుగుమళయాళములలోని భూతకాలిక క్రియారూపములలో 'ఇ' కారమునకు ప్రాధాన్యమెక్కువగా నుండగా తమిళకన్నడములలో ఈ 'ఇ' కారము జారిపోయి 'ద' కారము నకే ప్రాధాన్యము ఎక్కువగుటచేత వాస్తవముగాభూతకాలికచిహ్నమేదయిఉండునను విషయమున సందేహము కలుగకమానదు. ఈదక్షిణదేశభాషలవిషయమున విశేషపరిశ్రమచేసిన కాల్డ్వెల్ పండితుడు

కూడా ఈ భాషలలోని భూతకాలిక చిహ్ననిరూపణము విషయమున చాలాచిక్కుపడినాడు. ఎందుచేతననగా అతడు విశేషపరిశ్రమచేసిన తమిళభాషలోనూ, దానికి తగినట్టుగా కన్నడభాషలోనూకూడా భూతకాలికక్రియారూపములలో 'ఇ' కార మతిక్వాచిత్కముగా కనబడుచుండెనేకాని ఇకారపూర్వకముకాని 'ద' కారముమాత్రమే ప్రాచుర్యమువహించిఉన్నది. ఆకారణముచేత ఈ భాషలలో భూతకాలికచిహ్నము 'ద' కారమే అని అతడు మొదట నిశ్చయించుటలో ఆశ్చర్య మేమీ లేదు. కాని ఆభాషలలోనే 'పాడినాన్' 'మాడిదేను' మొదలగు రూపములలో 'ద' కార 'న' కారపూర్వకమై కనబడుచుండుటచేత ఆ 'ఇ' కార మేమై ఉండునో విచారించి తుద కుచ్చారణసౌకర్యముకొరకు చేర్చబడినదని తేల్చినాడు. అయితే తెలుగు మళయాళములలో 'ద' కారము క్వాచిత్కముగా కనబడుటయు, 'ఇ' కారమే ప్రాధాన్యము వహించుటయూ సంభవించుచున్నదే అను విషయమును గుర్తింపవలసివచ్చినప్పుడు 'ఇ' కారము కూడా భూతకాలికచిహ్నమే అయి ఉండుననీ, ఈరూపములలో బహుశః దకార ముచ్చారణార్థము చేరి ఉండుననీ చెప్పి మొత్తముమీద ఈభాషలలో 'ఇ' కారము, 'ద' కారముకూడా భూతకాలికచిహ్నములయ్యేనని తన అభిప్రాయమైనట్లు తేల్చినాడు. ఈభాషలలోని రూపములన్నిటినీ సమగ్రముగా గ్రహించి, ఒండొంటితో పోల్చిచూచి, వాటికన్నిటికీ సామాన్యమయినమూలరూప మేమై ఉండునని ఆమూలరూపము నన్వేషించుటకు ప్రయత్నింపక విడివిడిగా ఆభూతకాలరూపములను బట్టి వాటినుండి కాలచిహ్నమును గుర్తించుటకు ప్రయత్నించుటచేత కాల్డ్వెల్ పండితున కిట్టి చిక్కు కలిగినది. ఆంధ్రమునందలి క్రియారూపములగు 'చేసితిని,' 'చేసితివి' అను వాటిని 'పాడినాన్' 'మాడిదేను' అను వాటితో పోల్చి 'పాడిన,' 'పాడిద' 'మాడిద' 'చేసిన' 'చేసిన' అను క్రియావిశేషణములనుకూడా పరిశీలించినప్పుడు "శెయ్‌దేన్" అనునది శెయ్ + ఇత్ + ఏన్ అనిన్ని, మాడిదేన్ మాడు + ఇత్ + ఏణ్ అనిన్ని, అట్లే చేసితిని చెయ్ (స్) + ఇత్ + ఏను, (చేసిత్ + ఏను > చేసితేను > చేసితిను > చేసితిని) అనిన్ని విభాగింపబడుటకు అనువై ఉండి మొదట ధాతువు, తరువాత భూతకాలచిహ్నము, దానివెనుక సర్వనామ ప్రత్యయమున్ను స్పష్టముగా కనబడుచుండుటచేత ధాతువుతరువాత చేర్చబడిన 'ఇత్' అనేదే భూతకాలచిహ్నమని నిశ్చయింపదగి ఉన్నది. కాల్డ్వెల్ పండితుడు తలచినరీతిగా ప్రత్యేకము 'ఇ' కారముగాని 'ద' కారముగాని కాక 'ఇతు' అన్నప్రత్యేకపదమే, లేదా ధాతువే భూతకాలచిహ్నమయ్యేనని మనము భావించవలెను. మరొకవిశేష మేమనగా ఈక్రియాపదము ఈభాషలలో తక్కినరూపములన్నిటివలెనే కొన్నిప్రత్యేకస్వతంత్రములగు ధాతువులయొక్కగాని పదములయొక్కగాని కూడికచేత ఏర్పడినట్లు వ్యక్తమగుచుండుటచేత ఇది ఈభాషలయొక్క సంయుక్తపదరూపత్వమును (Agglutinative nature) స్థాపించుచున్నదివలె ఉన్నది.

ఇక నీ 'ఇతు' అనున దేమి? భూతకాలికచిహ్న మెట్లైనది అని విచారించినప్పుడు ఇది సంయుక్తపదరూపభాషలనుటనుబట్టి ఈ 'ఇతు' అనేది ఒకస్వతంత్రపదమనీ, లేదా ధాతువనీ అది దానార్థకమైన ఇచ్చుట అనే అర్థముగల ఈ (ప్రదానే) ధాతురూపమనీ ఇను, ఇచు, ఇతు మొదలయినవన్నీ దీనిరూపములే అగుటచేత ఈ 'ఇతు' అనేరూపము ధాతువులపైని అధార్వర్థక్రియాపరిసమాప్తిని

సూచించుటకుగాను చేర్చబడినదనీ మన మూహించుట కష్టసాధ్యము కాదు. చేసితిని-అనగా చెయ్ (వ్) + ఇతు + ఏన్ = చేయుట (ను) ఇచ్చి (వేసి) ననేను అని అర్థము కలుగుతున్నది. ఈభావమే ఆంగ్లభాషలోకూడా ఈధాత్వర్థప్రయోగముచేత I gave up doing అని చెప్పుటకూడా కలదు. చేయుచున్నకార్య మెప్పుడు కొనసాగక ఇచ్చివేయబడినదో, అనగా నిలిపివేయబడినదో అప్పుడే అది భూతకాలక్రియ అగుచున్నది. ఇట్టిభావముతోనే ప్రాచీనద్రావిడభాషను వ్యవహరించుజనులు ఒకధాతువుచేత సూచింపబడినకార్యము అంతటితో ఆగిపోయి ప్రవర్తింపకుండుటను తెలుపదలచినప్పుడు ఆధాతువుపైని 'ఈ' ధాతువును సహాయధాతువుగా చేర్చి చెప్పబూని ఉందురు. ఇట్లే భూతకాలక్రియాపదములు ఈభాషలో ఏర్పడినవి. తక్కినపదములన్నికూడా ఈభాషలో భిన్నధాతువులసంయోగముచేత ఏర్పడినవని బాగుగ పరిశీలించినచో మనము తెలుసుకొనలేకపోము. దీనినిబట్టి మనము తెలుసుకొనవలసిన దేమనగా ఈభాషలలోని సుబ్విభక్తులు, తిఙ్విభక్తులు చెప్పబడినవన్నీ ప్రత్యేకము స్వతంత్రముగా భాషలో ప్రయోగింపబడదగి ఉన్న అర్థవంతములగు శబ్దములను సర్వనామశబ్దముల అవశిష్టభాగములే అగుటచేత అందలిపదములన్నీ ఆయాశబ్దములకూడికచేత ఏర్పడుచున్నవే అనిన్ని సంప్రదానాపాదానాద్యవిభక్త్యర్థములను సూచించుటకే చేర్పబడుశబ్దములకునూ నామములకునూ గలసంబంధము విశేషణవిశేష్యభావసంబంధమే అనిన్ని ఇదియే క్రియావిభక్తులలోకూడా కానవచ్చుచున్నదనీ నిశ్చయింపతగి ఉన్నదనుటయే. ఈభాషలలో వాస్తవముగా క్రియావిభక్తి అనునదే కనబడదు. 'చేయుచున్నాను' 'చేయుచున్నది' అనునవి క్రియలు కావా అని ప్రశ్నించినట్టయితే సంస్కృతవైయాకరణపద్ధతినిబట్టి వాటి కాపేరు పెట్టెదమంటే ఏమో కాని ఆపదముల నిష్పత్తిక్రమమునుబట్టి చూడగా 'చేయుచున్న + నేను', 'చేయుచున్న + అది' చేయుచున్నట్టివాడనైననేను, చేయుచున్నట్టిదైన అది అని తుదినిలిచిన సర్వనామశబ్దములకు విశేషణములుగా చేర్చబడిన ధాతురూపములకంటె వేరుగా కనబడవు. అనగా వాక్యమంతా మన మిప్పుడు క్రియాపద మనుకొనుచున్నదాని తుది నున్నసర్వనామశబ్దమునకు విశేషణమై నిలుచుచున్న దన్నమాట. గ్రంథము వ్రాయుచున్నాను' అనగా గ్రంథమును వ్రాయుచున్ననేను అనిగదా అర్థము. కనుక ప్రథమాంతశబ్దబోధయే కాని క్రియారూపములనేవి ఈభాషలో ఉన్నట్లగపడదు. వాక్యములోని శబ్దములన్నీ తుది నున్నసర్వనామమునకు సామాన్యముగా విశేషణములయి ఉండుటే కాక ఆయాశబ్దములలో పూర్వమందు నిలిచినది పరమందున్నదానికి విశేషణమైకూడా ఉండును. ఇట్లీ భాషలలోని పదములయొక్కయు నామక్రియావిభక్తులయొక్కయు నిష్పత్తిక్రమమునుగూర్చి విచారించినచో అవి అన్నియు స్వతంత్రశబ్దములయొక్కగాని ధాతువులయొక్కగాని సంయోగముచేత ఏర్పడినవై ఇవి సంయుక్తపదరూపభాషలు (Agglutinative languages) అనువాదమును సార్థకపరచుచున్నట్లు అగపడుచుండుటచేత ఆయాభాషలలో ప్రత్యయము లనుకొనబడువానిమూలస్వరూప మితరసన్నిహితభాషారూపములలో పోల్చిచూచినచో కనిపెట్టుట కవకాశ మేర్పడుటయే కాక వీటి కన్నిటికిని మూలమగు ప్రాచీనద్రావిడభాషాస్వరూపమునుకూడా గుర్తింప నవకాశము కలుగవచ్చునని తోచక మానదు. కనుక ఈమార్గము సాధకమని తలచినభాషాతత్త్వజ్ఞులు లట్టి మూలభాషాస్వరూపమును గుర్తించుటకు ప్రయత్నింతురుగాక !!!

# భా ష - క వి

ఉమర్ అలీషా

భాష మానవలోకమున సహజముగా నుదయించునీశ్వరదత్తమహాశక్తియను దివ్యార్ణవమునం దొకపరమపవిత్రమైన గొప్పతరంగము. ఇది మిక్కిలి తేజోవిరాజితమై దశదిశలను మార్మ్రోయు ప్రణవస్వరూపముతోఁ గలిసి పొంగి పొరలి భావాంతర్గతమై యూసరక్షేత్రములతోఁ బోలిన మానసికపుబయళ్ళను సస్యశ్యామలము గావించుచుండును.

ఈభాష దేశవిస్తీర్ణము, సాంఘికప్రవృత్తి, పరిసరసంస్కారవిశేషములనుబట్టి పలుతెఱఁగుల మాఱేఁది. కాని దీనిగమ్యస్థాన మొక్కటేయని 'బూ అలి' అభిప్రాయపడుచున్నాఁడు. మఱికొందరు భాషాకుటుంబ మొక్కటేయని వాదించెదరు. కాని యది వితండవాదము. కేవలము అర్థశూన్యమైనది. ఏమందురా, - సంస్కృతము జనించినచోటు ద్రావిడభాషలకుఁ దెలిసియుండదు. ద్రావిడభాషలు అరబ్బీభాషాభిజ్ఞుల కపరిచయము. అరబ్బీ సురియానీలు ఆంగ్లో సారసేనీయు లెఱుంగరు. చీనాప్రాకృత మగాధమైనది. ఇట్లే తక్కినవియు తెలియవలయును.

మఱియు "లిపి" కాలమునఁ గొందఱు కొందఱకుఁ బోరాటము వచ్చినదని చెప్పుదురు. అది ఒకరు అనఁగా అరబ్బులు కుడినుండి యెడమునకు, భారతీయులు ఎడమునుండి కుడికి వ్రాయుమార్గములు తీసి తమయహంభావమును జూప నారంభించినారు. అది చూచి చీనావారు పైనుండి క్రిందకు వ్రాయు నుపాయమును కని పెట్టి తమ వ్యక్తిత్వము ప్రకటించిన ట్లగపడుచున్నది. ఈవిధానములు తరువాత నొకరి కొక రనుసరింపక తప్పనిసరి వచ్చినట్లుగఁ దోఁచుచున్నది. ఏమనిన సామాన్యముగా అంకెలువేసి కూడెడునప్పుడు హారాలుగా పైనుండి క్రిందకు వేసి కూడుచుందురు. ఇది చీనావారి లిపిమార్గము. లేక, అంకెలు చీనావారే కనిపెట్టియుందురు.

ఇంక "భాష" మహాజనులు మాటలాడుటవలన వచ్చినది. ఇది లిపిబద్ధమైనప్పుడు "ప్రయోగ" మనుపద ముపయోగపర్చినారు. ఆప్రయోగాలే వ్యాకరణాలు.

ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి వ్రాసినభారతంబులో
నేది వచింపఁగాఁ బడియె నెందును దానినెగాని సూత్రసం
పాదన లేమిచే తెలుఁగుపల్కునుగూర్చి మఱొండు చెప్పఁగా
రా దని దక్షవాటికవిరాక్షసుఁ డీనియమంబు సేసినన్.

అని అప్పకవి.

మఱియు "ప్రయోగ శరణ్యం వ్యాకరణ" మ్మని యంద రెఱింగినదే. ఇంక వ్యాకరణము భాష నెట్లు శాసింపఁగలదు? భాషాభిజ్ఞులనుబోయీలు వ్యాకరణమను శవమును పుస్తకాలనే అనంతశయనాలపైఁ బెట్టి మోయుచుంటే అది నేను జీవముతో నున్నానని తల ఆడిస్తుంది. కాని దానిని క్రిందపడవేసితే యొక్క అడుగైన సాగలేదు. కావున మనకవులు కవులమనేమాట మఱచి కవిత్వములో వ్యాకరణ బానిసత్వము తెచ్చిపెట్టి కొనఊపిరికి వచ్చినారు. కవి నిరంకుశుఁడు. విశ్వగానము చేయుకోకిలమువంటివాఁడు. ఆదికవి యగువాల్మీకి "ఆరుహ్య కవితాశాఖాం" అని కవిత్వమనేకొమ్మపై పాడు కోకిలముని వర్ణించుకొన్నాడు. కాళిదాసు వానియడుగులలోనే నడచినాఁడు.

"కవియె విశ్వాంబు విశ్వంబు కవి నిజంబు" అని నే నొకప్పుడు వ్రాసినాను. కవికి వ్యాకరణము లడ్డవు. సంస్కృతవ్యాకరణములు వ్రాసినవారిలో పాణిన్యాదులు యజ్ఞాదికములలో వ్యాకరణయుక్తభాష వాడుకొఱకు వ్రాసినామని చెప్పిరే గాని కావ్యములను కవితను శిక్షించుటకుఁ గాదని తోఁచెడిని.

కవి గణయతిప్రాసావ్యాకరణలక్షణలక్షితములు వెదకుచు కూర్చుండువాఁడు కాఁడు. కవి కవిత వ్రాయునప్పుడు యోగికివలె చిత్తైకాగ్రత రావలెను. భావము రసముతోఁ గలిసి మూర్ఛాముద్రిత మగుచుండవలయును. ఆయోగికస్థితిలోఁ బ్రపంచ మతనిమ్రోల నొకనల్లపూసగనో లేక తేజోవిరాజితమైన జ్యోతిర్మండలముగనో మాఱుచుండును. అప్పుడు వానితో భూనభోంతరాళములమధ్య దృగ్గోచరమగుచుండు చరాచరమహాపదార్థము లన్నియు నోరువచ్చి మాట్లాడుచుండును. ఆమాటలే "కవిత." అట్టి కవితలోనే "కవి" తననిజరూపమును చూచి చూచి మైమఱచిపోవుచుండును.

మ. రమణీయార్థసరాకృతిన్ బొలుచువర్ణశ్రేణి వీణానులా
షముచేతన్ గరగించి యందు నిజబింబం బొప్ప నచ్ఛామృత
త్వము నాత్మప్రతిపాదకత్వమును తద్వర్ణాళియం దెల్ల పూ
ర్ణము గావించినవాణి ... ...

అని భట్టు.

ఇట్టిరససమన్వితములే కావ్యములు. ఆకావ్యములఁగూర్చియే లాక్షణికులు "విశ్వశ్రేయః కావ్య"మ్మని నిర్వచించినారు. విశ్వశ్రేయమనఁగా నిం దగాధమైన నిజమున్నది. ఇప్పటి కెవరికిని దీనియంతే దొఱకలేదు. కావున "నాఋషిః కురుతే కావ్య" మ్మని యూరకొన్నారు. ఇంకెందుకు కేవలకావ్యములు పెక్కులక్షణలక్షిత ములే కావచ్చును. వ్యాకరణబద్ధములే కావచ్చును. శబ్దసంస్కార మెచ్చటను జారనియినుపగోడలచేఁ గట్టఁబడినవే కావచ్చును. కాని వాని నధోలోకమున నుం డుడని సరస్వతి త్రొక్కివేసి తాను బ్రహ్మయొద్దకుఁ బోయినదని కావ్యమీమాం సలో రాజశేఖరుఁడు వ్రాసివేసినాఁడు.

"కవి" అన్నివిధాలైన మానవహృదయాల్లోను దూఱిపోవురసస్వరూపుఁడు. అన్నికంఠాల్లో అతనికంఠ మున్నది. అన్నికన్నుల్లో నాతనిక న్నున్నది. అతఁడు గ్రామఫోనువంటివాఁడు. గ్రామఫోను ఏప్లేటుపెట్టితే ఆపాట పాడును. అట్లే కవి యేరసముపడితే అరసము పాడఁగలఁడు. అతఁ డొకప్పుడు గ్రామ్యము మఱియొ కప్పుడు గ్రాంథికమువ్రాసి చరాచరభూతజాలముల నూపివేసి పారము పుట్టించు చుండును. కవికి వంక లెంచువా రెవ రున్నారు? "కోవేత్తి కవితాతత్త్వం ఈశ్వరో వేత్తివా నవా" అనుమాట మఱవవలదు.

# కోదుభాష తెలుగుకు పూర్వరూపమా ?

బు ర్రా శే ష గి రి రా వు

---

కళింగమండలము (గంజాం - విశాఖపట్నం జిల్లాలు) లో చాలాతరముల నుండి వలసలేర్పరచుకొని ఉన్న కొండజాతులలో సవరలు వలెనే గదబలు, కోదులు అనువారు కలరు. వీరిమధ్యకే అయితరేయ బ్రాహ్మణము నాటియాంధ్రులు వలసవచ్చియుండిరి. మా గురువర్యులగు శ్రీరామమూర్తిపంతులుగారు సవరకు వ్యాకరణముచేసినట్లే లేటు లింగం లక్ష్మాజీపంతులుగారు కోదుకు వ్యాకరణము చేసిరి. ఇట్టి నాగరికతాసంస్కారము ఈ ప్రాంతపు కేవలవ్యావహారిక భాషలకు ఆంధ్రేతరులెవరును ఇంతవరకు కళింగములో చేసియుండలేదు. లక్ష్మాజీ పండితుల గ్రంథమును గ్రియరుసనుపండితుల లింగ్విస్టికుసర్వేలో చూడనగును. ఇటీవల సాలూరులో జర్మనుమిషనరీ రెవరెండు షుల్జుపండితులుకూడా కోదుకు వ్యాకరణము వ్రాసిరిగాని భాషాతత్త్వమును వారు సరిగా గుర్తించలేకపోయిరి. లక్ష్మాజీపండితులీకోదు భాష ఆంధ్రమునకు ( తెలుగుకు ) పూర్వరూపమై యుండుననిరి. షుల్జుపండితు లీభాషకు ఆంధ్రముతో పోలికయే లేదనిరి. కాగా ఈ భాషావిషయక వ్యవస్థనుగూర్చిన నాపరిశీలన కొద్దిగా ఈ " గురుపూజాపత్రిక" గా వ్రాస్తున్నాను.

(1) తెలుగు ' అ, ఉ, ఎ ' అచ్చులు కోదులో " ఎ " గా వినబడును.

ఉ॥ తె॥ అది = కో॥ ఎది

తె॥ కొంచము = కో॥ కొంచె

తె॥ ఇలా = కో॥ ఇలె

తె॥ ఎచ్చు = కో॥ ఎజ్జె

తె॥ ఇలాగు = కో॥ ఇలెకిహి

తె॥ నీవును = కో॥ నీను - ఎ

తె॥ ఆట = కో॥ ఎం - ది

ఇది అనాగరికుల ఉచ్చారణలోని అస్ఫుటత్వము వంటిది.

(2) అనాగరికులగు తెలుగుల ఉచ్చారణలో పదాదిని " హ " వర్ణ ఊతగా వినబడును. ఇట్టిది కోదులో పదభాగముగానే వినబడును.

కో ॥ హి = తె ॥ ఈ ( ఇచ్చు )

కో ॥ హాక్కి = తె ॥ ఆకలి

కో ॥ హిల్ల = తె ॥ ఇల్లె ( లేదు )

(3) తెలుగుపదములలో ఆది హల్లుకు బదులుగా కోదులో "హ" కార వినబడును—

కో ॥ హేర్ = తె ॥ చేరు

కో ॥ హెడు = తె ॥ చెడు

కో ॥ హెర్పు = తె ॥ చెర్పు

(4) కొన్ని కోదు ఏకాక్షరపదములు తెలుగులో రెండక్షరములపదము గా కనబడును. వీటికి ప్రాచీనాంధ్రములో ఏకాక్షరరూపము లుం నట్లు సూచన కలదు.

కో ॥ వా = తె ॥ వచ్చు ( రా )

కో ॥ హా = తె ॥ చచ్చు ( సా )

కో ॥ కీ = తె ॥ చేయు

కో ॥ హూో = తె ॥ పో, పోవు

కో ॥ ఓ = తె ॥ ఓ - డు

కో ॥ వే = తె ॥ వే - యు

కో ॥ తా = తె ॥ తెచ్చు ( తే )

(5) కోదుపదముల తుదనున్న మ్బు, వు వర్ణములు తెలుగులో ము, అను స్వారములుగా వినబడును.

కో ॥ తామ్బు = తె ॥ తాము

కో ॥ మూమ్బు = తె ॥ మూము ( మేము )

(6) స్వతంత్రపదముల నొకదానికొకటి చేర్చడముచేతనే ద్రావిడభాషలలో విభక్తిరూపము లేర్పడును. తెలుగులో నిది ఇతరరూపముల నేర్పరచుటకుకూడా ఉపయోగించును. ఉ॥ ప్రశ్నార్థకసర్వనామములు.

ఏ + వారు = ఏవారు, ఎవ్వారు, ఎవరు. ఇట్లే—

ఏ+ వారిని = ఎవ్వారిని, ఎవరిని, వేరిని

ఏ+ దాని = ఎద్దాని, దేని

వీటిలో ఏ అనేది ప్రశ్నార్థకము.

కోదులో "ఎవరి" అన్నరూపమేగాని "వేరి" అన్నది కనబడదు. ఇట్లే "ఇవరి" అన్నరూపమేగాని "వీరి" అన్నది కనబడదు. తెలుగులో "వీరి" అనురూపముకన్న కోదులో "ఇవరి" అన్నది ప్రాచీనతరమైన విభక్తినిష్పత్తిక్రమమును సూచించును.

(7) తెలుగు "ఈఁగ" అనునది "ఈగళు" అను బహువచనమునుండి లు వర్ణకమును కత్తిరించి ఏర్పరచబడిన ఏకవచనరూపముగా కనబడును. కాని తెలుగులోగల సిద్ధానుస్వారము ద్రవిడములో లేదు. కోదులో "ఈ - న్గ" అన్నదే బహువచనరూపము. "న్గ" అన్నది బహువచనార్థకము. "ఈ" అన్నదే ఏకవచనరూపము. కాగా ఆంధ్రము "ఈంగలు" అన్నది కోదు "ఈఁగ" అన్న బహువచనరూపమును ఏకవచనరూపమనుకొని "లు" వర్ణముచేర్చి యేర్పరచిన బహువచనమా అని ఊహ.

(8) మ్రాను అనుపదము ఆంధ్రములో గ్రాంధికము. వ్యవహారములో "మాను" అనియే వినబడును. సిద్ధ 'ర' కారము వినబడదు. ఇది కోదులో "మ్రాను" అనియే గలదు. "మ్రాను" అనికూడా ఆంధ్రములో ఒకప్పుడు వ్యవహారముగా వినబడియుండునని దీనివల్ల స్ఫురించుచున్నది. ఆంధ్రగ్రాంధికమును కోదుజాతివా రెరుగరుగదా !

(9) "నూరు" అనుపదమునకు కళింగములో "వంద" అను పర్యాయపదము వాడుకలో గలదు. దీనికి కోదులో "వంజె" అనురూపము

కనబడును. కోదులో "నూరు" అనుపదము వాడరు. దీనినిబట్టి యీ "వంద" అనునది కళింగాంధ్రములోనికి కోదునుండి గ్రహింపబడి యుండునని నా ఊహ.

(10) కోదులో "పాన్పు" అంటే 'రసీదు,' లేక "పుచ్చుకొనుట" అని అర్థము. ఆంధ్రములో ఇది "పర్యంకము" నకు రూఢిమైనది. వ్యుత్పత్త్యర్థములో కోదులో కనబడుచున్నది. ఇట్టి విశేషములు కోదుకును తెలుగుకును గలప్రాచీనసంబంధము సూచించును.

(11) కోదులో "ఓపు" అనుమాటకు "ఓరిమి" అని అర్థము. ఈ అర్థములో 'ఓపు' అన్నది ఆంధ్రములో శుద్ధగ్రాంధికము.

(12) అనాగరికులగు తెలుగులు లెక్కపెట్టునప్పుడు "లాభం, రొండు, మూడు......" అని అందురు. కోదులో రొ = ఒకటి, రి = రెండు. కాగా ఆంధ్రములో కూడా ఒకప్పుడు 'రొ' అంటే ఒకటి అయి యుండును. ఒరు = ఒకటి; ఒకడు; ఇరు = రెండు అనునవి ఆంధ్రములో గ్రాంథికరూపములు. గ్రాంథికమెరుగని కోదులు 'ఒరు' అను రూపమును "రొ" చేసిరనుటకన్న "రొ" అన్నది "ఒరు" అను దానికి ఆంధ్రములో ప్రాచీనరూపాంతరమనుట సమంజసము.

ఇట్టి కొద్ది సారూప్యములనుబట్టియే కోదుభాష ఆంధ్రమునకు అనాగరికరూపమేమో అని తోచును. పరిశీలన బాగా చేసినయెడల ఇదే సిద్ధాంతమని తేలగలదని నా నమ్మకము.

# సందేశము

*

శ్రీయుత గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు నాకంటె రమారమి యాఱేండ్లు పెద్ద. నా బాల్యమున మే మిరువురమును నా జన్మస్థానమైన పర్వతాల పేటలోఁ గలిసి యాడుకొన్నవారము. పట్టపరీక్షయం దుత్తీర్ణులై, యుపాధ్యాయ వృత్తిని విశేషఖ్యాతి గడించి, యసమానమైన భాషాసేవ చేసి, యాంగ్లేయప్రభువులవల్ల రావుసాహెబు బిరుదును గేసరీహిందీపదకమును మొదలగు గౌరవములను బొంది, మహోపాధ్యాయులై, వృద్ధులై యున్న యిప్పుడును జిన్నప్పటివలెనే వీరు నిగర్వచూ[illegible]లు, నిష్కపటులు, నిర్భయమానసులు, నిష్కల్మషచరిత్రులు. ఉత్తమోత్తములుగాఁ బరిగణించుచు నేను నా మనస్సున నిక్కముగా గౌరవించుచున్న కొలఁదిమందిలో వీ రొక్కరు. వీరి కున్న కార్యదీక్ష నా యెఱిఁగిన వారిలో బహుస్వల్పసంఖ్యాకులకే కలదు. దానికి బధిరత్వ మొక కారణమనియు, అది యనర్థముగాక లోకోపకారముగా భగవంతుఁడు వీరికిఁ గటాక్షించినవరములలో నొకటనియు, నేను వీరితో హాస్యమున ననుచుందును. ఒక్క యాంధ్రభాషాసంస్కరణ విషయమునఁ దక్కఁ దక్కినవీరియూహ లన్నిటితోడను నా కేకీభావము కలదు. భాషావిషయమునఁ గలభేదాభిప్రాయము వీరియందు నాకుఁ గలస్నేహభావమును గాని గౌరవబుద్ధిని గాని రవంతయుఁ దగ్గింప లేదు.

వీరికి భగవంతుఁడు చిరాయువును, ఆరోగ్యాదిసమస్తభాగ్యములను బ్రసాదించును గాక !

శ్రీవిక్రమదేవవర్మ,

జయపుర మహారాజు.

# గురుస్మరణ

భోగరాజు నారాయణమూర్తి.

ఉ. చిన్నయసూరిసూత్రములఁ జిక్కి కృశించి, విషాదమొందుతూ
వున్న తెనుంగు, శృంఖలము లూడి, సుఖంబుగ మేడమీఁదఁ గూ
ర్చున్నది; నూత్నకాంతి గనుచున్నది, హాయిగ నేడు సంచరి
స్తున్నది. రామమూర్తివిబుధోత్తమ! నీశ్రమకున్ ఫలంబుగాన్.

శా. ఇన్నీ అన్నన నేల వాడుకపదా లీనాటి గ్రంథాల? నా
యన్నింటిం గన నీదువాదమె జయం బందిం దనన్ వచ్చు; లో
న న్నీయుపదిష్టమార్గమున కానందించి వ్రాశారు వ్రా
స్తున్నా రింకను వ్రాతు రెందరొ కవీంద్రుల్ రామమూర్త్యగ్రణీ!

శా. కొమ్ముల్ దీరినపండితుల్ నిను నెదుర్కొన్నారు; మున్నాంధ్రదే
శ మ్మొక్కండయి నిన్నె దిర్చినది; భాషాయుద్ధరంగంబులన్
హుమ్మంచున్ గుమిగొన్నపండితుల కీ వోనాడు వెన్దీయకే
నెమ్మిం గెల్చి జయంబు లొందితివె కా నిత్యంబు విద్వన్మణీ!

శా. ఔనన్నా అనకున్న నీదగు నుపన్యాసాల భాషాపరి
జ్ఞానం బొంది రనేకపండితులు; మాకర్ణంబులన్ నేటికిన్
రాణించున్ సురదైత్యనిర్మథనసంరంభాబ్ధిమంథోద్భవ
ధ్వానానూనగభీరతావకవిజృంభద్వాదవాగార్భటుల్.

గీ. ఆంధ్రగీర్వాణహూణభాషార్ణవములఁ
గుంభసంభవువలె నీవు గ్రోలినావు;
శబరభాషకు వాగనుశాసనుఁడవు
గొమ్ము మన్న మోవాకమ్ము గురువరేణ్య!

# బాలవ్యాకరణము

పురిపండా అప్పలస్వామి (కవితాసమితి)

---

బాలవ్యాకరణాన్ని మనపండితులు వేదతుల్యముగా భావిస్తారు. ప్రయోగములే వ్యాకరణమునకు ఆధారమని తెలిసిఉండికూడా కొందరు బాలవ్యాకరణాన్నిబట్టి భారతము మొదలయిన ఆదిగ్రంథాలు దిద్దడానికి సాహసించారు. వ్యాకరణములు కూడా కొందరు దిద్దివేశారు. వ్యాకరణ మక్కరలేకుండానే భాష నేర్పవచ్చునన్న భావము ప్రబలముగా ఉన్న ఈదినముల్లోసైతము బళ్ళలో విద్యార్థులచేత బాల వ్యాకరణసూత్రాలే కంఠస్థము చేయిస్తున్నారు.

అయితే ఈబాలవ్యాకరణము అనేకదోషాలతోను, అసందర్భములతోను కూడి ఉన్నదనీ, అసమగ్రమైనదనీ, దీనిప్రాబల్యమువల్లనే తెలుగుభాషసొంపు చాలావరకు చెడిందనీ, విద్యార్థులకు చాలావరకు సరియైన తెలుగుభాషాజ్ఞానము అలవడడము లేదనీ, "బాలావబోధ మగుభంగి" వ్రాశానని చిన్నయసూరిగారు చెప్పుకొన్నా వృద్ధులకుకూడా అవబోధము కాలేదనీ మావాదన. మావాదన రుజువుపరచడమే ఈవ్యాసముయొక్క ముఖ్యోద్దేశము. స్థాలీపులాకన్యాయముగా ఇందులోని అసం దర్భములు కొన్ని చూపిస్తున్నాము.

మొట్టమొదటిసూత్రమే చూడండి.

"అకారాదు లచ్చులు. కకారాదులు హల్లులు. అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది."

అనిఉంది. సంస్కృతసంజ్ఞనిబట్టి సూత్రముచేశారేగాని తెలుగులో అచ్చులు, హల్లులు అనడమే అసందర్భము. ఏమంటే సంస్కృతములో అఇఉణ్, ఋఌక్, ఏఓఙ్, ఐఔచ్, అని అకారాదులకూ, హయవరలట్, లణ్, ఞమఙణనమ్, ఝభఞ్, ఘఢధష్, జబగడదశ్ ... హల్, అని తక్కినవాటికీ సంజ్ఞలేర్పరచి అకా రాదుల్లోనిమొదటిదైన అ, చివరిదైన చ్ చేర్చి అచ్ అనీ తక్కినవాటిలోని మొదటి దైన హ, చివరిదైన ల్ చేర్చి హల్ అనీ ప్రత్యాహారము చేశారు. కాబట్టి అచ్చు,

హల్లు అనడము ఆభాషలో సమంజసముగానే ఉంటుందిగాని తెనుగువర్ణాలకు ఆ పేర్లు పెట్టడము వెంకయ్యతండ్రిపేరు రామయ్యగనక పుల్లయ్యతండ్రిపేరు కూడా రామయ్యే అన్నట్టుంటుంది. ♦

ఇంక గ్రంథమునిండా పారిభాషికపదాలు ప్రయోగించారు. వాటివివరణము సంస్కృతం బాగాచదువుకొని పాణిని చదువుకొంటేనేగాని తెలియదు.* చూడండి. శతృర్థకము, బహుళగ్రహణము, ఆకృతిగణము, స్వార్థకము, విభాష, వ్యవస్థిత విభాష, వృత్తి, తపరకరణము, ఉపోత్తమేత్వము, ఉపసర్జనత్వము, పర్యుదాసము, అంగాదులు, గృహ్యాదియోగజము, మతుబర్థము, శబ్దపల్లవము, వ్యధికరణము, ఉత్సర్గ, మొదలైనవి.

మరికొన్నిటికి వివరణము లిచ్చారు. అవి చీమ అంటే పిపీలిక అన్నట్టుగా ఉన్నాయి. కొన్ని చూడండి :

" పక్షంబున సత్వం బగు; సత్వం బనఁగా ద్రితంబునకుఁ బ్రకృతిభావము. "

" నియతోపస్థితికము ప్రాతిపదికార్థము" (కారక - సూ ౧)

" క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు" (కారక - సూ ౮)

" ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారంబు భావంబు" (తద్ధిత - సూ ౧)

" భావలక్షణంబునా నన్యక్రియకు లక్షణభూతం బగుక్రియ"(క్రియా-సూ ౮౦)

---

♦ స్వరములు, వ్యంజనాలు అనికాని, ప్రాణులు, ప్రాణములు అనికాని అన్నా బాగుండేది. హిందీ, బాంగ్లా, ఉత్కలవ్యాకరణములలో స్వరములు, వ్యంజనములు, అనే వాడారు: చూ. పం, కామతాప్రసాదుగారి హిందీవ్యాకరణము - ప్రథమభాగము, ౩ వ సూత్రము.

తెలుగులో అకారాదులు అచ్చులు, కకారాదులు హల్లులు అనడం అసందర్భమని తోచడంచేతనే మండ లక్ష్మీనరసింహకవిగారు తమఆంధ్రకౌముదిలో " అఇఉక్, ఎఓజ్, ఐఔచ్, అని, హయవరల సలమణనకటతపచజయుఁగఁడదబవ్ " అని తెనుగువర్ణాలను అనుగుణ్యముగా విభజించుకొని " ఇతి చత్వారి ప్రత్యాహారసూత్రాణి" అని వ్రాసుకున్నారు. చూ॥ ఆంధ్రకౌముది, పరవస్తుప్రతి ౪-౮ పుటలు. తెనుగుమర్యాదలతో సమగ్రమైనతెనుగువ్యాకరణము వ్రాస్తున్న బ్ర॥ శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు " నిండులు, అరలు " అని వ్రాశారు.

* అందుకే కాబోలు 'ఆంధ్రభాషాప్రవీణ'కుకూడా సంస్కృతమే ప్రధానం, తెలుగు అప్రధానం అంటారు జయంతి రామయ్యపంతులుగారు.

ఇవి బాలావబోధముగానే ఉన్నాయో, మరెలా ఉన్నాయో పాఠకులే నిర్ణయిస్తారు.

అసంపూర్తిగా ఉన్నసూత్రములు కొన్ని ఉదహరిస్తాము :—

"చిన్నాదులకు ఱికవర్ణకం బగు" తద్ధిత - సూ 3.

అని చిన్నాదుల్లో చిన్న, కన్న, చుట్టము మొదలయినవి ఇచ్చారు. చిన్న + ఱికము=చిన్నఱికము, కన్న + ఱికము=కన్నఱికము అవడము బాగానే ఉంది. కాని చుట్టము + ఱికము=చుట్టముఱికము అనే పైసూత్రముచేత అవుతుందికాని చుట్టఱికము ఎలా అవుతుంది ?

"ఇక వర్ణకం బగ్గలాదుల కగు" తద్ధిత - సూ. ౭.

అగ్గలము, ఒమ్ము అగ్గలిక, ఒమ్మిక అవుతాయన్నారు. ఒమ్ము + ఇక=ఒమ్మిక అయినట్లే అగ్గలము + ఇక=అగ్గలమిక అవుతుందేకాని పైసూత్రముచేత అగ్గలిక ఎలా అవుతుంది. ?

" అరి వర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు" తద్ధిత - సూ ౧౭.

అని జాలాదుల్లో మతకము, సుంకము అన్నపదాలుకూడా ఇచ్చారు. జాల + అరి=జాలరి. చదువు + అరి=చదువరి, నేరుపు + అరి=నేరుపరి అయినవి. అలాగే మతకము + అరి=మతకమరి, సుంకము + అరి=సుంకమరి అని అవుతుందేకాని పై సూత్రంచేత మతకరి, సుంకరి అని ఎలా అవుతుంది?

ఇలాగే తద్ధితప్రకరణములోని ఓయారము మొదలైనవి కూడాను. వీటిలో ము వర్ణకము పోవడానికి సూత్రముచేయడము సూరిగారు మరచిపోయారు. ♦

తజ్, దుజ్, కలజీ, వదుజీ, కజీ, మిజీ, నజీ, ముష్, ఇలాంటివాటిలో, జ్, జీ, ష్, ఇవి పోవడానికి సూత్రా లెక్కడా కనబడవు. పాణినివ్యాకరణమర్యాదనే యిలాంటివాటిలో గ్రహించాలంటారు కొందరు. అది తెలుగువారి కెలా తెలుస్తుంది?

♦ త్రిలింగలక్షణశేషములోను, సూర్యనారాయణీయములోను దీనికి సూత్రా లిచ్చారు చూ : తద్ధిత ప్రకరణాలు.

"యకారంబును వువూవొవోలును తెలుఁగుమాటలకు మొదట లేవు" సంజ్ఞా. సూ. ౧౭ అని అన్నారు. కాని ఞ,ళలు కూడా లేవని సూరిగారు మరచిపోయారు. ‡

"కొనుధాతువు పరంబగునపు డిగాగమంబు బహుళంబుగా నగు" క్రియా. 713. సూ అని కొను ధాతువుకు ఇ రావడమే చెప్పారుగాని కూడుక, వండుక, పట్టుక, చేసుక వంటిరూపాలకు సూత్రము చెప్పలేదు.

ఇలాగే 'కూతుండు్రి' అన్నరూపానికికూడా సూత్రము లేదు. భూతభవిష్య ద్వర్తమాన కాలాలకు, తద్ధర్మకాలానికి ఆశీశ్శాపసంప్రార్థనవిధులకు వ్యతిరేకానికి వరుసగా లిట్టు, లృట్టు, లట్టు, లాట్టు, లూట్టు, లజీలు ధాతువులమీద వస్తాయన్నారు. సంస్కృతవ్యాకరణాల్లో ఈ లాట్‌లూట్‌లు ఎందుకు ఏర్పరచారో మన కక్కరలేదు. కాని మన తెలుగులో వీటిఅవసర మెందుకు వచ్చిందో చిన్నయ్యసూరి గారే చెప్పాలి. "దీనిభావ మేమి తిరుమలేశా" అనే అనవలసివస్తుంది.

ఇంక ప్రయోగాలైనా సమగ్రముగా చూడకుండా వ్రాసినసూత్రా లున్నాయి. చూడండి,

(౧) "క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు" అని సూత్రము. సంధి. ౫. కాని ప్రయోగాలు చూడండి.

"ఇతనికి దగ నెల్లపనులు నెఱిఁగించిపుడే" ఉద్యో. తిక్కన.

"చాపము నా కంది మ్మనుడు" విరాటపర్వము.

"అల్కఁజూపి నకులు డించుకంత" రాఘవపాండ. ఆ ౨. ప ౭౫.

"ఒనరిం చెదు రేగుదెంచిరన్" జైమి.

ఇంలాటిప్రయోగా లింకా ఉన్నాయి †

‡ చూ. వీరేశలింగంగారి సంగ్రహవ్యాకరణము, వర్ణపరిచ్ఛేదము 16 సూ. ఞఛలుకూడా లేవని సూర్యనారాయణీయము. సంజ్ఞా 44 సూ.

† "ఇదగవచ్చును ల్యప్పుపై నిత్యసంధి
మాత్ర మొకొక్కచోటను మట్టుమీఱఁ
గొలఁదు నఘుమదంప గోరిందు శేఖరు
నన్నయట్లు కవిజనానుమతిని."

చూ. కవిసంశయవిచ్ఛేదము. ప్రథమతరంగము ౨ లక్షణము. నేను సంపాదింపగా వావిళ్ళవారు ప్రచురించిన ప్రతి, పుట 8, 9.

(౨) " తెనుఁగులమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవలు రావు సంధి ౧౪. సూ.

ఈ సూత్రము కేవలము చింతామణి, వైకృతచంద్రికల ననుసరించి వ్రాసినదే కాని చిన్నయసూరిగారు ప్రయోగా లున్నవో లేవో చూడలేదు. † ఈ క్రింది ప్రయోగాలు చూడండి,

" నాకు మగడగునని యిట్లు దపంబుసేయుచుండెద " ని. ఉ. రా. ఆ. ౫.

" ఎవ్వండు వఠించెడు వాడు ధన్యుఁడు " కాశీఖండము.

"పెంపు వరీక్షింపఁజాలు నింపమో " వసుచరిత్ర.

"పీర గ్గోపించిన నంతకుండుఁ జెడు" ఉత్తరహరివంశము *

ప్రసస్థానములో విగనక దిద్దడానికి వీలు లేకపోయింది మన పరిష్కర్తలకు, కాని ఇంకా ప్రాచీనప్రతుల్లో యిలాంటిప్రయోగాలు చాలా ఉన్నాయనే మా అభిప్రాయం.

(3) "సర్వపర్యాయం బయినయెల్లశబ్దము ద్రుతాంతం బయిన యవ్యయము." సంధి. సూ ౨౪ వివరణము ♦

అని వ్రాశారు. ఎల్ల కళేకాని ద్రుతాంతము కాదనడానికి ఈక్రిందిభారత ప్రయోగము చూడండి.

"ఎల్లయందును దా వసియించు నెల్ల యదియు" భార. ఉద్యో.

(౪) "షష్ఠీసమాసమునం దుకారబుకారంబుల కచ్చు పరమగునపుడు నుగాగ మంబగు." సంధి. 3౪ సూ.

† " న వికృతిశబ్దా త్పరత స్సాంస్కృతికానాం భవన్తి గసడదవాః "

చింతామణి. సంధి ౨౪ సూ.

" నాసంస్కృతా త్సంస్కృతస్య "

వైకృతచంద్రిక 45. సూ. (మంచెళ్ల వాసుదేవకవికృతం)

* చూ. సర్వలక్షణసారసంగ్రహము - సంధి 85 లక్షణము.

♦ ఎల్ల - ఇది కళగాని ద్రుతప్రకృతికము కాదు. ఎల్ల-ఎల్లరు, ప్రథమావిభక్త్యంతరూపములు. ఎల్లన్ ద్వితీయ. చిన్నయసూరి యిది ద్రుతాంత మనుట పొరపాటు. చూ. సూర్యనారాయణీయము,

అని సూత్రీకరించారు. కాని, ను, రాకుండా ఉన్న ప్రయోగా లున్నాయి చూడండి. ♦

"గోకుల మిల్లిలు దవ్వకుండ" హరి. పూ ౫. ఆ.

"నిర్జరో_త్తమబింబం బొప్ప వెస( దాల్చె" ఉ. హరి. ౬ ఆ.

"కొదుకక బచ్చింట( గుదువ వైచు" పాండు. 3 ఆ.

"శిరసందం బరయుగ్ర" కళా. ౭ ఆ.

"అలర( జేసితి నిషధరాజంతవాని" నైష.

ఇలాంటి వెన్నో ఉన్నాయి.

(౫) "కూతురు, కూతుళ్లు, కూతురి నిత్యాదిరూపంబులు గ్రామ్యంబులు." అని శాసించారు. మహాకవుల ప్రయోగాలు గ్రామ్యము లనడానికి గల అధికారమేమిటో తెలియడము లేదు.

"అను(గు(గూతుళ్ళు" అనిప్రయోగము. ని. వి. రా.

(౬) "కువర్ణకంబు పరంబగునపు డుకారఋకారంబులకు నగాగమం బగు. అని తత్సమ ౫౭ సూత్రము. న, రాకుండా ఉన్న ప్రయోగాలు చూడండి.

"సీతూపు కోర్వక" కవికర్ణ. 3 ఆ. ౧౧౭ ప.

"నిషధేంద్రుబచ్చుకుగ్ర" నైషధము.

"పెచ్చుకుం దాళనేరక" కాశీఖండము.

"వాదుకుం గవిత" ప్రభా.

"వంతుకు వచ్చుసత్యగరువ మ్మెక" పారి. ౧ ఆ *

(౭) "శకటరేఫము తత్సమతద్భవంబులందు లేదు." సంజ్ఞా ౧౭ సూ. అని సూరిగారు వ్రాశారు. కాని ప్రయోగాలు చూడండి.

♦ ఆగమశాస్త్ర మనిత్యమని కొందరు వాదించవచ్చు. కాని ఇది తెనుగువారి కెలాగు తెలుస్తుంది? తెలుగుకుకూడా యిది వర్తిస్తుందని సూరిగా రేసూత్రంలోనూ చెప్పలేదు.

* "లలి తృతీయాదు లగువిభక్తులకెల్ల గలుగు మధ్యనకారంబు దొల(గుచుండు." సర్వలక్షణసారసంగ్రహము విభ. లక్షణ ౬.

పిఱికి - భీరుకశబ్దభవము.

"వెఱపెట్టిదియో యెన్నఁడు
నెఱుఁగని నీయట్టివాని కెవ్వరొకో యీ
పిఱికితన మింత యలవడ" భార. ఉద్యో 3 ఆ.

మొఱకు - మూర్ఖశబ్దభవము.

"మొఱకుండై వచ్చిన" భో. ౬. ఆ.

గోరజము - గోరోచనశబ్దభవము.

"గోరజంబు జున్ను చాఱపప్పు" మను. ౮ ఆ.

పెఱ - పరశబ్దభవము.

"పెఱచేత గజంబుఁబట్టి పెనఁచి" భార. ఆది ౨. ఆ.

(ట)„ ఇయశబ్దంబునం దికారలోపంబు కొందఱు వక్కాణించిరి.-అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు. ముత్తియశబ్దంబునందుమాత్ర మిత్వలోపంబు గానంబడియెడి - ముత్తియము - ముత్తెము - ముత్యము. " ఆచ్ఛిక. ౨3 సూత్రములో వ్రాశారు. ప్రయోగాలు మృగ్యమట! ఎంతసాహసమో చూచారా!ప్రయోగాలు పరికించండి.

" గువ్వ గ్రద్ద దివ్యాఱుపు(బు)వ్వ గూబ" భార. అను. ౮ ఆ.

„ కళ్యాలఁ బదిలంబు గాని గుఱ్ఱంబుల" భార. విరా. ౧ ఆ.

"భోజనశాలఁ బళ్యం బడినారు" కాశీ. ౫ ఆ.

" హత్తుకొల్పిరి శ్వేతపీడ్యములడాలు" పాండు. 3ఆ. 28ప. *

కవిప్రయోగాలే కాదు నిఘంటువుల్లోకూడా ప్రయోగా లున్నాయి. చూడండి.

„ పీడియము వక్కలాకులు విడెము తమ్మలంబు పీడెంబు పీడ్య మనం బురారి"
ఆంధ్రనామసంగ్రహము, మానవవర్గు.

"పీడెమన పీడియమ్మన పీడ్య మనఁగ విడియమన పీడ్యమనఁగను విడెమనంగ"
ఆంధ్రభాషార్ణవము

* ఈపద్యము రాఘవపాండవీయములోనిదని గుప్తార్థప్రకాశికకారులు వ్రాశారు. పొరపాటు

నిఘంటువులైనా సరిగా "చూడకుండా ప్రయోగము మృగ్యము" అని సూరిగారు వ్రాయసాహసించారు. ♦

(౯) నామవచనాలకు ద్వితీయా ద్యేకవచనాలు పరమైతే ఇ టి తి అనేవర్ణాలు వస్తా యనిన్నీ, ఇవి రాకుండా ఉంటాయని కొందరన్నారుకాని ఆమాట లక్ష్యలక్ష్యణ విరుద్ధమనిన్నీ సూరిగారు వ్రాశారు.

"ద్వితీయైకవచనంబు పరంబగునపు డాగమవిభక్తికంబులు రావని కొందఱు వక్కా ణించిరి. - అయ్యది లక్ష్య లక్షణవిరుద్ధం బగుటం జేసి యనాదరణీయంబు" అచ్చిక, సూ. ౨౯ అని. కాని లక్ష్యాలు చూడండి.

" కనకమయ మైనయాప్రోలునఁ దమసుతులాహవంబులో నమరులచే "

భార. అర. ౪ ఆ.

" విన్నున నేగుతామరల " యయా. ఆ ౨.

" పీడున గలమానికములు వివిధాంబరముల్ " వసు. ఆ ౬.

లక్ష్యాలే కాదు లక్షణముకూడా ఉంది. చూడండి.

" విన్ను మన్ను కేలు పీడు ప్రోలనునడ
వింట మంట కేల పీట ప్రోల
ననఁగనొప్పు మఱియు నటులె యుత్వముపైన
కార మొదవుఁ గొన్నికడల నీశ "

సర్వలక్షణసారసంగ్రహము. విభక్తి. ౧౧ లక్షణము.

(౧౦) " పూను - పాదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచార మూలకంబు " అని శాసించారు. ప్రకీర్ణ. ౧౦ సూ. వి ఈక్రిందిప్రయోగాలు చూస్తే సూరిగారి వాక్యమే 'అవిచారమూలకంబు' అనవలసివస్తుంది. చూడండి. పూనులో ఆదిలోపం.

" పూని వృకోదరార్జునులు భుగ్నులుగాఁ బెడచేతఁ గన్నునీ
రూనఁగ నత్తి కొంచుఁ జని". భార. ఉద్యో. ౩ఆ.

♦ " ముత్తియశబ్దేతరంబులయందును దరచుగ నిత్వలోపంబు గానంబడియెడి." శబ్ద. ౪౭ సూ. ప్రౌఢవ్యాకరణము.

"సానుమదారూఢుఁడు వగ
నూనఁడు దురితమనుపతితి కోడకయునికిన్" భార. శాంతి. ఆ 3,
పాదువులో ఆదిలోపము.

"ఉరవడించిన దేవిపై నుగ్రదివిజు
లోదువఁ బేరల్కఁ బెదవు లొండొండ యదర"
పాదవులో ఆదిలోపము.

"పార్థు నపమూర్థకళేబర మెదురఁగని
రోదవు శోకమునన్" జైమి. ఆ ౭ ♦

(౧౧) చేతురు, కోతు రిత్యాదు లసాధువులని యెఱుఁగునది."
క్రియా. ౧౦౮ సూ. వి

అని శాసనము. వందలకొలదికవులు చేతురు అని ప్రయోగించి ఉన్నారు. అవి చూడకుండా ఇవి అసాధువులని సూరిగారు నిర్ణయించారు. ఇది ఆధారముగా చేసుకొని అంధప్రాయంగా వారిని అనుసరించే మనపెద్దలు అంతకుముం దుండే వ్యాకరణాలుకూడా దిద్దివేశారు. * చేతురు, కోతురు అన్నరూపాలు సాధువులని చెపుతూ శ్రీ గిడుగు రామమూర్తిగారు వారి తెలుగుపత్రికలో 160 ప్రయోగాలు చూపించారు. †

కొన్ని ప్రయోగాలు చూడండి.

"కొండలు పిండిసేతుమె" అచ్చ. రా. ౭౨ పు.

"నీరై పారగ నేమిసేతు మనుచున్" ఉ. రా. ౮౫పు.

"కుడిచినచోటికి గొఱుతసేతు" భార. సభా. ౧౧౮.

"చేరి చుంబించి మోహింపఁ జేతురనియె" నైష ౨. ౮౮

"పునీతులఁ జేతురు సర్వలోకులన్" పద్మపు.

♦ "ఇట్టు లసామాన్యకవిప్రయోగంబు లుండగాఁ బరిశీలింపక కవిబ్రహ్మవాక్యాన కెదురాడిన చిన్నయసూరివచనంబు చిన్న యసూరివచనంబుగాఁ జెల్లందగు" అని గుప్తార్థప్రకాశికకర్త.

* వివరములకు చూ. తెలుగుపత్రికలోని బాలకవిశరణ్యము అనే వ్యాసము 92 పుట (సం. ౧ సంచిక 7, 8)

† చూ. బాలకవిశరణ్యము : తెలుగుపత్రిక.

"సంక్షోభింపఁగాఁ జేతు" భార. మి. ౨ ఆ. ౨౮౧.

"ఖలులజిహ్వాలు గోతురు కాలభటులు" శేష. ఆ౩. ౪౨.

"కొసరియుండంబుల గోతు రొకని" సానం. ౨ఆ.

ఇలాంటివి ఇంకా చూపించవచ్చు. ఇట్టిదీనిని విద్యార్థులచేతా, ఉపాధ్యాయుల చేతా చదివిస్తే భాష ఏస్థితికి వస్తుందో వేరే వ్రాయ నక్కరలేదు. ఇప్పటికే దీని ప్రాబల్యమువల్ల మనగ్రంథాలకు సత్యరూపము చాలావరకు పోయింది. వ్యాకరణ మెలాగుండినప్పటికీ ఇతరులగ్రంథాలు దిద్దడమునకు ఎవ్వరికీ అధికారము లేదు. వ్యాకరణమంటే అది వ్రాయబడిననాటికి ఉన్నప్రయోగాలూ, భాషాస్వరూపమూ చూపి తరువాతవచ్చేవారికి సులువుగా ఉండడానికే కాని, శాసించడానికి కాదు. ప్రయోగములో ఉండే ఏపదాన్నికూడా 'అసాధు'వని 'అగ్రాహ్య'మని 'గ్రామ్య'మని నిషేధించడము దోషమనే భావించాలి.

ఇంతతో అయినా ఈబాలవ్యాకరణాన్ని వదలి సజీవమైనభాషాస్వరూపాన్ని ఆశ్రయించాలి.

# మాత్రాచ్ఛందస్సులు

చిలుకూరి నారాయణరావు.

---

## ౧

౧. 'ఛందస్' అనేసంస్కృతపదమునకున్ను 'స్కాండో' (Scando) అనేలాటినుపదమునకున్ను సంబంధమున్నది. 'స్కాండో' అంటే ఛేదించడము, విభజించడము, అని అర్థము. కవులు కావ్యముల లోను పాటలలోను లయకున్ను శ్రుతికిన్ని అనుకూలముగా రచించినరచనలను తరువాతిలాక్షణికులు పరీక్షించి వాటినడక యారీతిగా ఉన్నది అని నిరూపించడానికి ఛేదించి కొన్నిసూత్రములను రచిస్తారు. అట్టిసూత్రములసముదాయమునకు ఛందశ్శాస్త్ర మని పేరు.

౨. కవులు రచించినపద్యములున్ను పాటలున్ను ఒకానొక లయకు సరిపోతూ ఉంటవి. లయ భేదమునుబట్టి వాటిలో భేదములు కలుగుతవి. ఆ లయవిధానములు వేర్వేరు భాషాకుటుంబములలో వేర్వేరుగా ఉంటవి. ఇంగ్లీషులో ఊతనుబట్టి (accent) పద్యములు నడుస్తవి. వైదికభాషవంటి భాషలలో స్వరముయొక్క ఉచ్చ, నీచ, సమానత్వములనుబట్టిన్ని, అక్షరసంఖ్యనుబట్టిన్ని, ముఖ్యముగా భేదములు కలుగుతవి. సంస్కృతమువంటిభాషలలో పద్యపాదములలో ఉండే అక్షరగణసంఖ్యనుబట్టి పద్యము నడుస్తుంది. దానిలో హ్రస్వదీర్ఘనియమ ముంటుంది. ప్రాకృతభాషలలో పాదములలోని మాత్రాసంఖ్యనుబట్టి ఆయాపద్యము లేర్పడుతవి. ద్రావిడభాషలలో మాత్రాగణములనుబట్టి పద్యపాదములు కలుగుతవి ; హ్రస్వదీర్ఘనియమము అన్నిపాదములలోను ఒక్కరీతిగా ఉండవలెననే నియమము లేదు.

౩. ఇట్లు ఊత, అక్షరసంఖ్య, అక్షరగణసంఖ్య, మాత్రాసంఖ్య, మాత్రాగణసంఖ్య, అనేవాటిలో ఏదో ఒకటిమాత్రమే ఏకభాషలో ఉంటుందని చెప్పడానికి వీలులేదు. ఏకభాషలో ఒకానొకప్పు డుండినప్రధాననియమ మన్నికాలములందున్ను అట్లే ఉన్నదనికూడా చెప్పడానికి వీలులేదు. భాషల సంపర్కమువల్ల, జన్యజనకభావమువల్ల, ఒకభాషలక్షణములు మరి ఒకభాషకు కలుగవచ్చును.

౪. వైదికచ్ఛందస్సులలోని ఉదాత్తానుదాత్తస్వరితములనే స్వరములజ్ఞానము నేడు సరిగ ఉన్న దనిచెప్పడము సాహసమే. ప్రాచీనకాలపు ఛందస్సులు గురుశిష్యపరంపరగా నోటిమూలముగా వస్తూఉండడముచేత వాటిస్వరములను గూర్చి కొన్నితబ్బిబ్బులు కలిగినవి. భరతవర్షములోని అన్ని ప్రాంతములలోను ఈస్వరసంప్రదాయ మొక్కతీరుగా లేదు. ఎవరికి వారు తమ సంప్రదాయమే మంచిదని చెప్పుకొనడము వింతకాదు. ఏది యెట్లున్నా సంస్కృతభాషాకాలముదాటితే ఈస్వరపద్ధతి

కేవలవైదికచ్ఛందస్సులకు విడిచిపెట్టబడినది. సంస్కృతము ప్రచారములోనికి వచ్చేసరికి సమ, విషమ వృత్తములకు ఎక్కువగాను, మాత్రాచ్ఛందస్సులకు కొంచెముగాను నిలిచినవి. ప్రాకృతములో మాత్రము మాత్రాచ్ఛందస్సులకే ప్రాధాన్య మివ్వబడినది. ప్రాకృతకావ్యములలో సమవిషమవృత్తములు కొంచెముగా ఉన్నా, ఉన్నవాటిలో చాలామట్టుకు మాత్రాచ్ఛందస్సులే. ఈమాత్రలను గణములుగా ఏర్పరుచుకొనడమున్ను ప్రాకృతములో కొంతవరకు తలచూపినది. ఆమాత్రాగణసంప్రదాయము ద్రావిడభాషలలో ఎక్కువగా ప్రచారములోనికి వచ్చినది

౫. పూర్వకాలపు పాటలకు లాక్షణికులు లక్షణమును విశేషముగా కల్పించలేదు. ఈమాత్రాగణచ్ఛందస్సులే కొన్ని భాషలలో పాటలుగాను, కొన్నిటిలో పద్యములుగాను, పరిణమించినవి. తెలుగులో షట్పదులు, అష్టపదులు మొదలయినవి పాటలుగా జనసామాన్యమందున్ను, స్త్రీలోకమందున్ను నిలిచినవి. కన్నడములో వాటిని కవులు తమకావ్యములలో వాడుకొన్నారు. అందుచేత ఈచ్ఛందస్సు మాత్రమే ఈభాషలో విశేషముగా ఉన్నదని చెప్ప వీలులేదు.

౬. భారతీయలాక్షణికులదృష్టి నాకర్షించిన ఛందస్సులు కొన్నిమాత్ర మున్నవి. అట్టివాటిలో నేటి ద్రావిడభాషలలో వృత్తములు, మాత్రాచ్ఛందస్సులుమాత్రము ప్రచారములో ఉన్నవి. వృత్తములనుగురించి విశేషముగా చెప్పవలసినదేదిన్ని లేదు. ఆయాభాషలలో అవేవృత్తములను వేర్వేరు పేళ్ళతో కవులు వాడుకొన్నారు; వాటినిగూర్చి లాక్షణికులు తమగ్రంథములలో విశేషముగా ముచ్చటించినారు; కాని, మాత్రాచ్ఛందస్సులను గూర్చినవిచారము చాలాతక్కువగా ఉన్నది. ఇదిగాక, ఒక్కొక్కభాషలోని మాత్రాచ్ఛందస్సులనుమాత్రము తెలుసుకొనడమువల్ల అంతగా లాభముండదు. అనేకభాషలలో వాటిస్వరూప మెట్లున్నదో తెలుసుకొంటే, వాటిచరిత్రము కొంతవరకు తెలియగలదు. ఆచరిత్ర మేమయినా తేలుతుందేమో చూదామనే ఉద్దేశముతో ఈవ్యాసము వ్రాస్తున్నాను. ఇట్టిప్రయత్నములలో ఇది ప్రథమము గనుక ఈవ్యాసములో విమర్శార్హములయిన విషయము లనేకము లుండవచ్చును. అట్టివిమర్శకు విద్వాంసులను పురికొల్పడానికే ఈవ్యాసము వ్రాయడమైనది. దీనివల్ల ఫలితమేమైనా ఉంటే మంచిదే: లేకపోయినా ఈవిషయమునుగురించిన ఆయాభాషాచ్ఛందోవిశేషములైనా ఒకచోట చేర్చిన ట్లవుతుందిగదా.

## ౨

## వైదికచ్ఛందస్సు.

౧. వైదికచ్ఛందస్సు అక్షరగణాత్మకమనిన్ని, ఒక అక్షరమునుంచి ఏకోత్తరవృద్ధిగాగల అక్షరసంఖ్యగల ఛందస్సులకు వరుసగా 1. ఉక్త 2. అత్యుక్త 3. మధ్య 4. ప్రతిష్ఠ 5. సుప్రతిష్ఠ 6. గాయత్రి 7. ఉష్ణిక్కు 8. అనుష్టుప్పు 9. బృహతి 10. పఙ్క్తి 11. త్రిష్టుప్పు 12. జగతి 13. అతిజగతి 14. శక్వరి 15. అతిశక్వరి 16. అష్టి 17. అత్యష్టి 18. ధృతి 19. అతిధృతి 20. కృతి 21. ప్రకృతి 22. ఆకృతి 23. వికృతి 24. సంకృతి 25. అభికృతి 26. ఉత్కృతి అనేవి పేళ్ళనిన్ని, ఆయాఛంద

స్సులను ప్రస్తరింపగా మొత్తము 13 42 17 726 సమవృత్తము లేర్పడుననిన్ని, ఇవిగాక వేర్వేరు వృత్తపాదములను ఒకపద్యములోచేర్చినయెడల విషమవృత్తములేర్పడుననిన్ని, అక్షరచ్ఛందస్సులేకాక మాత్రాచ్ఛందస్సులుకూడా ఉన్నవనిన్ని, లాక్షణికులు చెప్పినారు.

౨. సమవృత్తమనగా వృత్తములోని నాలుగుపాదములలోనిగణములున్ను ఆయాస్థానములలో అవేగణములువచ్చే వృత్తము. ఇట్టివృత్తములు సంస్కృతవాఙ్మయములో ఉన్నవిగాని, వేదములలో లేవు. వేర్వేరువృత్తపాదము లేక పద్యములో చేరితే అది విషమవృత్తమవుతుంది. పాదమునకిన్ని అక్షరములనే నియమముగలిగి, ఈ ♦ పద్యపాద మీఛందస్సుకు సంబంధించినదని సాధారణముగా చెప్పడమునకుమాత్రము సాధ్యమవుతుంది గాని, పద్యములో అన్నిపాదములున్ను వరుసగా అవేగణములుకలిగి ఉంటవని చెప్పవీలులేదు. ఇట్టి వేర్వేరుపాదములు వేర్వేరు ఛందస్సులకు సంబంధముగలవి ఏకపద్యములో వేదములందు చేరవచ్చును. కాని, వీటిలోకూడా సంస్కృతమువందువలె గణనియమము లేదు.

3. లాక్షణికులు 26ఛందస్సులను వివరించినా, వాటిలో కొన్నిటికిమాత్రమే వేదాలలో ఉదాహరణాలు కనబడుతవి. అన్నిటికంటె ఋగ్వేదములో ఎక్కువగా వాడబడినది త్రిష్టుప్పు; ఐదువంతులలో రెండువంతులఋక్కు లీఛందస్సులో ఉన్నవి. దీనితరువాత ఎక్కువగా వాడబడినది గాయత్రి. మొత్తములో నాలుగోవంతు ఋక్కు లీఛందస్సులో ఉన్నవి. ఇది సంస్కృతములో అంతరించినది. గాయత్రితరువాత ఋగ్వేదములో ఎక్కువప్రచారములో ఉన్నది జగతీఛందస్సు; దీనితరువాత అనుష్టుప్పు; ఈఛందస్సులోగల పద్యములు ఋగ్వేదములో గాయత్రీపద్యములలో మూడోవంతున్నవి. తరువాత పఙ్క్తి ఎక్కువప్రచారములో ఉన్నది. ఇవిగాక కొన్నిమిశ్రమచ్ఛందస్సులుగల ఉష్ణిక్, పురఉష్ణిక్, కకుభ్, బృహతీ, సతోబృహతీ, అతిశక్వరీ, అత్యష్టి అనేవి కొద్దిగా ఋగ్వేదములో కనబడుతవి.

౪. శుద్ధచ్ఛందస్సులలో ప్రతిపాదములోను సాధారణముగా ఎనిమిదిగాని, పదకొండుగాని, పండ్రెండుగాని అక్షరము లుంటవి; అరుదుగా అయిదక్షరములు గల పాదములు కలవికూడా కనబడుతవి. అట్టివేకాక్షరసంఖ్యగల మూడుగాని, నాలుగుగాని, అయిదుగాని, ఆరుగాని పాదములు ఒకపద్యములో చేరవచ్చును. గాయత్రిలో ఎనిమిదేసి అక్షరములుగల మూడుపాదము లుంటవి. అనుష్టుప్పులో ఎనిమిదేసి అక్షరములుగల నాలుగుపాదము లుంటవి; వీటిలో రెండేసిపాదము లొక్కొకఅర్థ మవుతవి. పఙ్క్తిలో ఎనిమిదేసిఅక్షరములుగల అయిదుపాదము లుంటవి; వీటిలో మొదటిరెండుపాదములు ఒకభాగము, తక్కినమూడు రెండోభాగమున్ను అవుతవి. కొన్నిటిలో ఎనిమిదేసి అక్షరములుగల పాదము లారున్ను, కొన్నిటిలో ఏడున్ను ఉన్నవి. వీటిలో మొదటిదానికి మహాపఙ్క్తి అనిన్ని, రెండోదానికి శక్వరి అనిన్ని పేర్లు.

♦ వేదమువిషయములో ఆయామంత్రములకు పద్యములనేమాట చెల్లదు. నాలుగుపాదములుగలది పద్యము; వేదములలోని అన్ని మంత్రములకున్ను నాలుగేసిపాదములు లేవు. కాని తెనుగుసంప్రదాయముచొప్పున ఈవ్యాసములో వైదికమంత్రములకుకూడా పద్యము, పాదము, అనేసంజ్ఞలను వాడుతున్నారు.

త్రిష్టుప్పులో పదకొండేసి అక్షరములుగల నాలుగుపాదము లుంటవి. వీటిలో మొదటి రెండున్ను ఒక భాగము, తక్కిన రెండున్ను రెండో భాగము. కొన్ని త్రిష్టుప్పులలో రెండేపాదములుంటవి; ఇట్టివాటికి ద్విపద లనిపేరు. కొన్నిటిలో మూడుపాదములుంటవి; వీటికి విరాట్టులనిపేరు. కొన్నిటిలో అయిదుపాదములు కూడా ఉన్నవి.

జగతిలో పండ్రెండేసి అక్షరములుగల నాలుగుపాదము లుంటవి. ద్విపదావిరాట్టును దానిలో పాదమున కయిదేసి అక్షరము లున్నవి.

౫. ఋగ్వేదములోగల తక్కినఛందస్సులు మిశ్రమములు. సాధారణముగా గాయత్రి జగతీ ఛందస్సులు కలుస్తవి. అట్టివాటిలో ఉష్ణిక్కు (8, 8, 12 అక్షరములుగల మూడుపాదములు); పుర ఉష్ణిక్కు (12, 8, 8 అక్షరములుగల మూడుపాదములు); కకుప్పు (8, 12, 8 అక్షరములుగల మూడుపాదములు); బృహతి (8, 8, 12, 8 అక్షరములుగల నాలుగుపాదములు); సతోబృహతి (12, 8, 12, 8 అక్షరములుగల నాలుగుపాదములు); అతిశక్వరి (8,8,8,8,8,12,8 అక్షరములుగల ఏడుపాదములు); అత్యష్టి (12,12,8,8,8,12,8 అక్షరములుగల ఏడుపాదములు);—ఇవి ముఖ్యములు. ఇవికాక (1) 12,8; (2) 12,8,12; (3) 12,12,8,8; (4) 12,12,12,8; (5) 12,12,12,8,8—మాత్రలు గల గాయత్రి జగతీ ఛందఃపాదములతో మిశ్రమములుకూడా క్వచిత్తుగా కనబడుతున్నవి.

జగతీపాదములతో త్రిష్టుప్పాదములు కలిసిన కొన్ని మిశ్రమపద్యము లున్నవిగాని, వాటిలో ఒక నియమములేదు. ఇట్లే త్రిష్టుప్పు, గాయత్రి కలిసినవి కొన్నిన్ని, త్రిష్టుప్పు, ద్విపద, విరాట్టు కలసినవి కొన్నిన్ని ఉన్నవి.

౬. పైవైదికచ్ఛందస్సులలో కేవలము అక్షరనియమమే ప్రధానమయినట్లు కనబడుతుందిగాని, గురులఘునియమముకూడా స్పష్టముగానే గోచరిస్తుంది. ఈ గురులఘునియమమువల్ల ఉదాత్తానుదాత్త స్వరితస్వరముల కెట్టిబాధయున్ను కలుగదు. కేవలము అక్షరనియమమునకు సరిపోని చాలా పాదాలు ఋక్కులలో కనబడుతవి; అక్షరనియమానికి సరిపోయేటట్లు చదువడానికి పాదములలో కొన్నిమార్పులు చేసుకోవలెను.

(1) య, వ, అనే అంతస్థములు పదములో ఉన్నా, సంధివల్ల ఏర్పడినా, సాధారణముగా వాటిని ఇ, ఉ, లుగా ఉచ్చరించవలెను. స్యామ=సిఅమ; స్వర్=సుఅర్; వ్యుషాః=విఉషాః; విదథేష్వఞ్జన్ = విదథేషు అఞ్జన్.

(2) సంధిలోకలిసిన అచ్చులను ప్రత్యేకముగా ఉచ్చరించవలెను: చాగ్నయే = చ అగ్నయే; వీన్ద్రః=వి ఇన్ద్రః; అవతూతయే=అవతు ఊతయే; ఏన్ద్ర=ఆ ఇన్ద్ర.

(3) ఏ, ఓ, ల తరువాత లోపించిన పదాద్యకారమును ప్రత్యేకముగా ఉచ్చరించవలెను.

(4) షష్ఠీబహువచనప్రత్యయమైన 'ఆమ్'ను 'ఆఅమ్' గాను, 'దాస, శూర' మొదలయిన శబ్దములను 'దఅస', 'శుఉర' అనిన్ని, 'ఏ' కారమును, ఐకారమును 'అఇ' గను (జ్యేష్ఠ=జ్యఇష్ఠ ఐచ్ఛన్ = అఇచ్ఛన్) ఉచ్చరించవలెను.

(౬) కొన్ని పదములను వ్రాతలో ఉన్నట్లు చదువకూడదు. ఉదా. పావకశబ్దమును 'పవాక' అనిన్ని, 'మృళయ'ను 'మృాళయ' అనిన్ని, 'సువాణ'ను 'స్వాన' అనిన్ని ఉచ్చరించవలెను.

౭. గురులఘువుల విషయములోకూడా కొన్ని మార్పులు చేసుకోవలసి ఉంటుంది.

(1) పాదములో మొదటిఅక్షరమున్ను, తుదిఅక్షరమున్ను గురులఘువులలో ఏదయినా కావచ్చును.

(2) ళ, ళ్హ (ఢ) లను ద్విత్వాక్షరములుగా పరిగణించవలెను; అనగా వాటికి పూర్వమందున్న అక్షరము గురువౌతుంది.

(౩) దీర్ఘాచ్చుతరువాత మరిఒకఅచ్చువస్తే, ఆదీర్ఘాచ్చు హ్రస్వమవుతుంది: ఏ, ఓ, ల తరువాత 'అ' వస్తే, అవి ఎ, ఒ, లుగా మారిపోతవి.

(౪) ఈరీతిగా అక్షరనియమానికిన్ని, అనిర్దిష్ట గురులఘునియమానికిన్ని సరిపెట్టడానికి కృత్యంలన్నీ చేసినా, అర్థభంగముకాకుండా అట్టిమార్పులు చేయ వీలులేని ఎన్నోపాదాలు మిగిలిపోతవి. ఒకప్పుడొకఅక్షరముచాలక పోతుంది: ఉదా. తమ్ తు అ పయమ్ పితో (జగతీచ్ఛందస్సు, 8 అక్షరము లుండవలెను; ఏడే ఉన్నవి.) ఒకప్పుడు ఒకటో రెండో అక్షరము లెక్కువఅయిపోతవి: ఉదా. 'అగ్నిమీళే। భుజాం యవి। ష్ఠమ్.' (జగతి; 'ష్ఠమ్' ఎక్కువ అయినది.) 'వసుం తదస్య సం భృతి। వసు' ('వసు' అనే రెండక్షరాలు ఎక్కువ అయినవి.) తా నో విద్వాంసా మన్మ వో చేత మద్య (12 ఉన్నవి; 11 ఉండవలెను.) 'త మం గిరో జన యో న పత్నీః' (10 ఉన్నవి; 11 ఉండవలెను.) 'త ఊ షు నో,[2లోపించినవి] । మ 'హో యజత్రాః' (9 ఉన్నవి; 11 ఉండవలెను.) 'అయం స హోతా, [2లోపించినవి] 'యో ద్విజన్మా' (9 ఉన్నవి; 11 ఉండవలెను) 'రథేభి ర్యాత ఋష్టి మద్భి రశ్వ పర్ణైః' (18 ఉన్నవి; 11 ఉండవలెను.)

గురులఘువులవిషయములో కూడా ఆయాపాదాలలో నియమహీనత కనబడుతున్నది. ఉదా. ఎనిమిదక్షరములుగలపాదములో సాధారణముగా ⏓ – ⏓ – । ⏓ – ⏑ ⏓ (– = గురువు; ⏑ = లఘువు) అనగా మొదటి అర్ధములోని మొదటిదిన్ని మూడోదిన్ని, రెండో అర్ధములోని తుదిదిన్ని గురులఘువులలో ఏదయినా కావచ్చును. పదకొండక్షరములుగల పాదములలో విరామమునకుపూర్వము ⏓ – ⏓ గాగాని, ⏓ – ⏓ – ⏓ గాని ఉంటుంది; మధ్యభాగమున్ను తుదిభాగమున్ను ⏑ ⏑ – గా గాని, ⏓ ⏑ గా గాని ఉంటుంది; అనగా పదకొండక్షరములపాదములలో గురులఘువులకూడిక ⏓ – ⏓ –, ⏑ ⏑ –, – ⏑ – ⏓ గా గాని, ⏓ – ⏓ – ⏓, ⏓ ⏑ । – ⏑ – ⏓ గాని ఉంటుంది.

౮. అన్ని వైదికచ్ఛందస్సులున్ను అక్షరచ్ఛందస్సులని అనుకోనడమువల్ల ఇన్నిమార్పులు చేసుకోవడము, చేసుకొన్నా ఇంకాచాలామట్టుకు కుదురక నిలిచిపోవడము సంభవిస్తున్నదేమో. వాటిలో కొన్ని మాత్రాచ్ఛందస్సు లనుకొంటే చాలాచిక్కులు విడిపోతవేమో అనితోస్తుంది. వేదములలో 'ఆర్యా, వైతాలీయ' చ్ఛందస్సులు రెండే మాత్రాబద్ధములైనవి కనబడుతున్నవని విద్వాంసులు చెప్పుతున్నారు. ఈమాట యెంతవరకునిజమయినా, మాత్రాచ్ఛందస్సులు వేదములలో ఉండవచ్చుననే మాట స్థిరపడుతుంది గదా

౧౦. మాత్రాచ్ఛందస్సులంటే పాదమున కిన్నిమాత్రలచొప్పున ఉండేవి అని కొందరి అభిప్రాయము; మాత్రాసంఖ్య నియతముగా ఉన్నా గురులఘువులసంఖ్య నియతముగాలేని పాదములుగల పద్యములు మాత్రాచ్ఛందస్సులని చెప్పుతారు. కాని, మాత్రాసంఖ్యానియమముకూడాలేని కొన్నిగణములను కొన్నిభాషలలో లాక్షణికులు ఏర్పాటుచేసుకొన్నారు. ద్రావిడభాషలలో అట్టి సంప్రదాయ మున్నది. తమిళములో నేర్, నిరై, శీర్, విభాగము; కన్నడములో బ్రహ్మ, విష్ణు, రుద్రగణములు; తెనుగులో సూర్య, ఇంద్ర, చంద్రగణములు; వీటిలో మాత్రాసంఖ్యానియమము కనిపించదు. ఈవిషయము ఆయాభాషాచ్ఛందస్సులను వివరించేటప్పుడు బోధపడుతుంది.

౧౧. వైదికచ్ఛందస్సులలోకూడా ఇట్టిగణనియమ మేమయినా కనబడుతుందేమో చూదాము.

### i. గాయత్రి: ఒకరీతి.

అగ్నిమీ । ళేపురో । హితమ్ = ర, ర, లగ

యజ్ఞస్య । దేవం ఋ । త్విజమ్ = త, మ, లగ

హోతారం । రత్నధా । తమమ్ = మ, ర, లగ.

పైపాదములలో రెండేసి కర్ణాటకవిష్ణుగణములున్ను, ఒకలగమున్ను చేరినవి.

### ii. గాయత్రి: మరి ఒకరీతి.

తు అమ్ నో అ । గ్నే మహో । భిః = మ, ర, గ

పాహి వి । శ్వస్యా అరా । తేః = ర, మ, గ

ఉతద్వి । షో మర్త్య । స్య = నల, త, ల

మొదటిపాదములో అక్షరములుసరిపెట్టడానికి 'త్వమ్,ను 'తు అమ్' గా చదువుమంటారు; కర్ణాటకగణాలకు సరిపెట్టుకొంటే అట్లు చేయనక్కరలేదు. రెండోపాదములో 'విశ్వస్యా అరాతేః' అని చదవడముకూడా అక్షరనియమమును పాటించడానికే, 'విశ్వస్యారాతేః' అని సంధిచేసేస్తే కర్ణాటకగణములకు సరిపోతుంది. మూడోపాదములో 'ద్విషో' అనేదానిని 'దివిషో' అని చదువుకొంటే పాదము మొదట నలము ఏర్పడుతుంది; ఇట్టిస్వరభక్తి వేదమునకు విరుద్ధముగాదు. పైపద్యములో పాదానికి రెండేసికర్ణాటకవిష్ణుగణములున్ను, తరువాత ఒకగురువుగాని, ఒకలఘువుగాని కనబడుతున్నవి.

### iii. అనుష్టుప్పు: ఒకరీతి

అ యస్తే । సర్పిరా । సుతే = మ, ర, లగ

అగ్నే సం । అస్తి ధా । యసే = మ, ర, లగ

ఐషుద్యు । మ్నం ఉత । శ్రవః = ర, భ, లగ

అ చిత్తం । మర్త్యేషు । ధాః = మ, త, గ

పైదానిలో రెండోపాదములో 'సమ్' వద్ద అపవలెను కాబట్టి అది గురువవుతుంది; అట్లే 'ద్యుమ్నం ఉత' అన్నప్పుడు 'ఉ' ను ప్రత్యేకముగా ఉచ్చరించవలెను. 'మర్త్యేషు' అనే

సుబ్రూపిపమును 'మ త్రి ఏషు ' అని విరువనక్కఱలేదు. ఈపద్యపాదాలలోకూడా రెండేసి కర్ణాటక విష్ణుగణములు, తరువాత ఒకలగమో, గురువో, కనబడుతున్నవి.

iv. అనుష్టుప్పు : మరిఒకరీతి.

కేశ వి । మస్య వా । త్రేణ = త, ర, గల

య దుద్రి । ణా పిబత్ । సహా = మ, గ, లల

ఋక్కులో పైది సగముభాగము ; పాదమునకు రెండేసి విష్ణుగణములు, తరువాత గలమో, లల మో, ఉన్నవి.

v. పఙ్క్తి.

ఇత్థా హి । సోమ ఇత్ । మదే = త, ర, లగ

బ్రహ్మ చ । కార వ । ర్ధనమ్ = త, ర, లగ

శ విష్ఠ । వజ్రి న్నో । జసా = సల, మ, లగ

పృథివ్యా । నిఃశశా । అహిమ్ = నగ, ర, లగ

అర్చ న్న । ను స్వరా । జ్ఞ అమ్ = త, ర, లగ

పై మూడోపాదములో 'శవిష్ఠ = శవిఇష్ఠ ' అనిన్ని, 'పృథివ్యా – పృథివి ఆ' అనిన్ని చదువుకో వలెను. పాదమునకు రెండేసివిష్ణుగణములు, ఒకలగము.

vi. త్రిష్టుప్పు : ఒకరీతి.

అనా । గా స్త్వే । అదితి । త్వే తు । రాసః = లగ, గగ, న, గల, గగ

ఇమం । యజ్ఞం । దధతు । శ్రోమ । మాణః = లగ, గగ, న, గల, గగ

పైరెండుపాదములున్ను పద్యములో అర్ధభాగము. మొదట ఒకలగమున్ను, తరువాత, నాలుగు కర్ణాటకబ్రహ్మగణములున్ను ఉన్నవి.

vii. త్రిష్టుప్పు : మరి ఒకరీతి.

అస్మా । కం సం । తు భువ । నస్య । గోపాః = లగ, గగ, న, గల, గగ

పిబం । తు సో । మం అవ । సే నో । అద్య = లగ, లగ, న, గగ, గల

పై రెండుపాదములున్ను ఒకత్రిష్టుప్పద్యములో అర్ధభాగము. మొదటిపాదము vi లో వలెనే ఉన్నది. రెండోపాదములో రెండోగణము లగముగా ఉన్నది గనుక తప్పినది ; 'తు 'ను 'తూ ' గా ఉచ్చరింపవలెనేమో ' మం అవ ' అని అకారమును ప్రత్యేకముగా ఉచ్చరించకూడదు; 'మమవ ' అని కలుపవలెను.

viii. జగతి : ఒకరీతి.

అనాను । దో వృష । భో దోధ । తో వధః = సల, భ, త, ర

గమ్భీర । ఋష్వ ఆ । సం అష్ట । కావిఅః = త, త, త, ర

పై రెండుపాదములున్న జగతీపద్యములో సగముభాగము. 'అహాను = అనఅను' అనిచదువుతే పాదమునకు నాలుగువిష్ణుగణములు ఏర్పడుతవి.

### ix. జగతి : మరిఒకరీతి.

అభ్రిప్రు । షో న వా । చా ప్రుషా । వీను = త, ర, ర, లల
హావిష్మత్యం । తో న య । జ్ఞా విజా ।నుషః = నల, భ, ర, లగ

ఇది ఒక జగతీపద్యములో సగము. రెండోభాగములో మొదటిగణము 'హావిషమం' అని చదువవలెను. పాదమునకు మూడువిష్ణుగణములు, తరువాత ఒకలలమో లగమో వస్తుంది.

### x. ద్విపదావిరాజ్.

ప । రి ప్రిధ । న్వ । ఇ । న్ద్రాయ సో । మ = ల, ర, ల, గ, ర, ల
స్వా । దు ర్మిత్రా । య । పూ । ష్ణే భగా । య = గ, మ, ల, గ, ర, ల

మొదట ఒకలఘువో, గురువో, తరువాత ఒకవిష్ణుగణము, తరువాత లఘువో, గురువో (సాధారణముగా లఘువు); ఇది ఒకపాదము; ఇట్టివి నాలుగుపాదములు.

౧౨. ఇంతవరకుచెప్పినదంతా ఒకసూచన. ఛందోలక్షణము నేర్పరిచినప్పుడు దృష్టిభేదముచేత వివిధముగా ఏర్పాటుచేయవచ్చును. వైదికచ్ఛందోలక్షణము నేర్పాటుచేసినవారు అక్షరదృష్టితో ప్రివర్తించినారు. అక్షరములకులొంగని కొన్నిటిని మాత్రాచ్ఛందస్సులుగా ఏర్పాటుచేసినారు. అక్షరములకున్ను మాత్రలకున్ను లొంగని అనేకపద్యములు మిగిలిపోయినవి. వాటిని పొందించడానికి కొన్నిమార్పులు చేసుకోవలె నన్నారు. అట్టిమార్పులు చేసుకొన్నా కుదరని పద్యము లెన్నో నిలిచిపోయినవి. పొందినవాటికీ, పొందనివాటికీకూడా సరిపోయే లక్షణము నేర్పాటుచేయవలసిన ఆవశ్యకత ఉన్నది. ద్రావిడచ్ఛందస్సంప్రదాయము వైదికపద్యములలోకూడా చెల్లుతుందేమో చూడవలెనని ఈవ్యాసములో సూచనచేయబడినది. పరిశోధనచేస్తే ఒకసూత్రము చిక్కుతుందేమో, విద్వాంసు లీసూచనను నిరాకరింపక దానినిగురించి ఆలోచింతురుగాక.

౧౩. ఛందోభేదములనుగురించి లాక్షణికులలో అభిప్రాయభేదము లున్నవి.

(1) పద్యజాతము వృత్తిజాతిభేదములచేత రెండువిధములు. నియతవర్ణవ్యవస్థచేత ఛందస్సిద్ధికలిగినది వృత్తము. నియతమాత్రావ్యవస్థచేత ఛందస్సిద్ధిపొందినది జాతి. "నాలుగుపాదములుగలది పద్యము; అది వృత్తము, జాతి అని రెండువిధములు. ఏకదేశస్థితమైనది జాతి; వృత్తము లఘుగురుస్థితము" అని హలాయుధుడు.

(2) ఛందస్సు, వృత్తము, అనేవి పర్యాయవాచకములు. వర్ణవృత్తము వర్ణచ్ఛందస్సు, మాత్రావృత్తము మాత్రాచ్ఛందస్సు.

(8) "మాత్రాక్షరసంఖ్యచేత నియతమైనవాక్కు ఛందము; గురులఘుసమవేతస్వరూపముచేత నియతమైనవాక్కు వృత్తము" అని ఛందఃపరిమళకారుడు.

(4) పద్యచ్ఛందము మూడువిధములు : వైదికము, లౌకికము, ఉభయసాధారణము అని. అందులో లౌకికము తిరిగిమూడువిధములు : గణచ్ఛందము, మాత్రాచ్ఛందము, అక్షరచ్ఛందము, అని. ఆర్య మొదలయినవి గణచ్ఛందములు ; చూలిక మొదలయినవి మాత్రాచ్ఛందములు ; ఉత్కృతి మొదలయినవి అక్షరచ్ఛందములు.

(౫) పద్యచ్ఛందము నాలుగువిధములు : అక్షరచ్ఛందము, మాత్రాచ్ఛందము, అక్షరగణచ్ఛందము, మాత్రాగణచ్ఛందము, అని. మాత్రాసంఖ్యలో ఎక్కువతక్కువలు గలిగినా అక్షరసంఖ్య సరిపోతే అక్షరచ్ఛందము. అక్షరసంఖ్యలో ఎక్కువతక్కువలున్నా, మాత్రాసంఖ్య సరిపోతే మాత్రాచ్ఛందము. అక్షర గణములు క్రమముగా నిలిచి, గురులఘువులుకూడా నియతస్థానములలో ఉంటే అది అక్షరగణచ్ఛందము. మాత్రాగణములు క్రమముగా నిలుస్తే, అది మాత్రాగణచ్ఛందము ; ఇందులో అక్షరగణములు నియతములు కావు.

(6) పై నాలుగువిధములుగాక మరిఒకరీతి పద్యజాతముకూడా ఉన్నదని చెప్పవలెను. మాత్రాగణచ్ఛందస్సులలో గణములు వరుసగా సరిపోవలెను ; పాదములోని మొత్తముమాత్రలసంఖ్యకూడా సరిపోవలెను. కాని, పాదములో మాత్రాగణములు వరుసగా సరిపోయినా, మాత్రాసంఖ్య సరిపోనక్కరలేని కొన్నిఛందస్సు లున్నవి. అవి ద్రావిడభాషలలో కనబడుతున్నవి. తమిళములో మాచ్చీరులలో మూడునుంచి ఐదువరకు మాత్రలున్నవి ; విళచ్చీరులలో నాలుగునుంచి ఆరువరకు ఉన్నవి ; కాయ్చ్చీరులలో ఐదునుంచి యెనిమిదివరకు ఉన్నవి ; కణిచ్చీరులలో ఆరునుంచి తొమ్మిదివరకు ఉన్నవి ; పాదుచ్చీరులలో ఏడునుంచి పన్నెండువరకు ఉన్నవి. కన్నడములో బ్రహ్మగణములలో మూడునుంచి నాలుగువరకు ; విష్ణుగణములలో నాలుగునుంచి ఆరువరకు ; రుద్రగణములలో అయిదునుంచి యెనిమిదివరకు మాత్ర లున్నవి. తెనుగులో సూర్యగణములకు మూడుమాత్రలుమాత్రము ; ఇంద్రగణములకు నాలుగునుంచి అయిదువరకు ; చంద్రగణములకు అయిదునుంచి ఏడువరకు, మాత్ర లున్నవి.

౧౮. వైదికచ్ఛందస్సులలో తక్కినఛందోభేదములకు లొంగక మిగిలిపోయినవేవయినా ద్రావిడచ్ఛందస్సులలో ఇమడుతవా అనేవిషయమునుగురించి ఆలోచిస్తే బాగుంటుందని సూచనచేసి యిప్పటికీవిచారమును విడిచిపెట్టుతున్నాను.

౧౯. పైవివరించినవిషయాలు మేక్డొనెల్ మొదలయిన పాశ్చాత్యపండితులు వేదములు పరిశీలించి చెప్పిన మాటలు. పింగళచ్ఛందశ్శాస్త్రములో వైదికచ్ఛందస్సునుగురించి ఈరీతిగా చెప్పబడి ఉన్నది.

(1) వేదములోవచ్చే ఛందస్సులు : గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుభ్, బృహతీ, త్రిష్టుభ్, జగతి అనేవి. వీటిలో ఒక్కొక్కటి ఆర్షీ, దైవీ, ఆసురీ, ప్రాజాపత్యా, యాజుషీ, సామ్నా, ఆర్చీ, బ్రాహ్మీ, అని ఎనిమిదేసిభేదము లున్నవి. ఆయాభేదములకు గల అక్షరసంఖ్య ఈప్రక్కపుటలోని పట్టికలో ఇవ్వబడ్డది.

| ఛందస్సు | గాయత్రీ | ఉష్ణిక్ | అనుష్టుభ్ | బృహతీ | పంక్తి | త్రిష్టుభ్ | జగతీ |
|---|---|---|---|---|---|---|---|
| ఆర్షీ | 24 | 28 | 32 | 36 | 40 | 44 | 48 |
| దైవీ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| ఆసురీ | 15 | 14 | 13 | 12 | 11 | 10 | 9 |
| ప్రాజాపత్యా | 8 | 12 | 16 | 20 | 24 | 28 | 32 |
| యాజుషీ | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| సామ్నీ | 12 | 14 | 16 | 18 | 20 | 22 | 24 |
| ఆర్చీ | 18 | 21 | 24 | 27 | 30 | 33 | 36 |
| బ్రాహ్మీ | 36 | 42 | 48 | 54 | 60 | 66 | 72 |

(2) గాయత్రీపాదములో 8 అక్షరములు; జగతీపాదములో 12; విరాట్పాదములో 10; త్రిష్టుప్పాదములో 11, ఉంటవి. ఏఛందస్సుకు ఎన్నిపాదములో, ఆపాదములకు నిర్దిష్టమైన అక్షరసంఖ్యతో చెప్పితే అట్టిదానికి 'ఉక్తపాదము' అనిపేరు. గాయత్రికి మూడుపాదములు, అనుష్టుప్పుకు నాలుగు గాయత్రీపాదములు.

(3) ఉక్తపాదమైన గాయత్రిగాక, గాయత్రిలో అనేకభేదములు కనబడుతున్నవి.

i. చతుష్పాద్గాయత్రి : ఆరేసిఅక్షరములుగల నాలుగుపాదములు.

ii. పాదనిచృద్గాయత్రి : ఏడేసిఅక్షరములుగల మూడుపాదములు.

iii. అతిపాదనిచృద్గాయత్రి : మూడుపాదములు; మొదటిపాదములో 6, రెండోపాదములో 8, మూడోపాదములో 7, అక్షరములు.

iv. నాగీగాయత్రి : మూడుపాదములు; మొదటిది 9, రెండోది 9, మూడోది 6, అక్షరములు.

v. వారాహీగాయత్రి : మూడుపాదములు; మొదటిది 6, రెండోది 9, మూడోది 9, అక్షరములు.

vi. వర్ధమానాగాయత్రి : మూడుపాదములు; 6, 7, 8, అక్షరములు.

vii. ప్రతిష్ఠాగాయత్రి : ,, ; 8, 7, 6, ,,

viii. ద్విపాదవిరాట్ : రెండుపాదములు; 12, 8, ,,

ix. త్రిపాద్విరాట్ : మూడుపాదములు; 11, 11, 11, ,,

(4) (అ) ఉష్ణిక్కులో ఉక్తపాదమునకు 2 గాయత్రీపాదములు, తరువాత ఒకజగతీపాదము; 8, 8, 12 - ఈవరుస తప్పిన ఉష్ణిక్కులున్నవి :

i. కకుభ్ = గాయత్రి, జగతి, గాయత్రి.

ii. పురఉష్ణిక్ = జగతి, గాయత్రి, గాయత్రి.

iii. పరోష్ణిక్ = గాయత్రి, గాయత్రి, జగతి.

(ఆ) ఏడేసి అక్షరములుగల నాలుగుపాదములు గలదానికికూడా ఉష్ణిక్కని పేరున్నది.

(5) (అ) బృహతిలో ఉక్తపాదమునకు వరుసగా ఒకజగతి, మూడుగాయత్రులు. ఈక్రమము తప్పిన బృహతులుకూడా ఉన్నవి. జగతి మూడోపాదముగా ఉంటే పథ్య ; రెండోపాదముగాఉంటే న్యంకుసారిణి. (దీనికి స్కంధోగ్రీవీ, ఉరోబృహతీ అనేపేర్లుకూడా ఉన్నవి); నాలుగోపాదమయితే ఉపరిష్టాద్బృహతి ; మొదటిపాదమయితే పురస్తాద్బృహతి.

(ఆ) బృహతీలక్షణమును తప్పినవికూడా కొన్ని బృహతులక్రిందనే పరిగణింపబడినవి.

i. తొమ్మిదేసి అక్షరములుగల నాలుగుపాదములు.

ii. నాలుగుపాదములు : 10, 10, 8, 8, అక్షరములు.

iii. మూడుజగతీపాదములు : 12, 12, 12 – దీనికి మహాబృహతి అనిపేరు. దీనినే సతోబృహతి అనికూడా అంటారు.

(6) (అ) పంక్తికి ఉక్తపాదములో వరుసగా రెండుజగతీపాదములు, రెండుగాయత్రీపాదములు. ఈక్రమము తప్పినవికూడా ఉన్నవి.

i. సతఃపంక్తి : జగతీ, గాయత్రీ, జగతీ, గాయత్రీ.
(గాయత్రీ, జగతీ, గాయత్రీ, జగతీ ; దీనికికూడా పేరు సతఃపంక్తి).

ii. ప్రస్తారపంక్తి : జగతీ, జగతీ, గాయత్రీ, గాయత్రీ ; పాదములు 4.

iii. ఆస్తారపంక్తి : గాయత్రీ, గాయత్రీ, జగతీ, జగతీ ; పాదములు 4.

iv. విష్టారపంక్తి : గాయత్రీ, జగతీ, జగతీ, గాయత్రీ ; పాదములు 4.

v. సంస్తారపంక్తి : జగతీ, గాయత్రీ, గాయత్రీ, జగతీ ; పాదములు 4.

(ఆ) పంక్తి లక్షణమును తప్పిన కొన్ని పంక్తుల పేళ్లు :—

i. అక్షరపంక్తి : (1) అయిదేసి అక్షరములుగల నాలుగుపాదములు.
(2) అయిదేసి అక్షరములుగల రెండుపాదములు.

ii. పదపంక్తి : (1) అయిదేసి అక్షరములుగల అయిదుపాదములు.
(2) క్రమముగా 4, 6, 5, 5, 5, అక్షరములుగల అయిదుపాదములు.

iii. పథ్యాపంక్తి : అయిదు గాయత్రీపాదములు.

(7) త్రిష్టుబ్జగతి ఉక్తపాదమునకు ఎనిమిదేసి అక్షరములుగల ఆరు గాయత్రీపాదములు. త్రిష్టుభ్జ్యోతిష్మతికి ఉక్తపాదమునకు వరుసగా ఒకత్రిష్టుప్పాదము, నాలుగు గాయత్రులు. జగతీజ్యోతిష్మతికి ఉక్తపాదమునకు వరుసగా ఒకజగతీపాదము, నాలుగు గాయత్రీపాదములు.

i. పురస్తాజ్జ్యోతి : ఒకత్రిష్టుప్పాదము, నాలుగు గాయత్రీపాదములు.

ii. మధ్యేజ్యోతి : రెండుగాయత్రీపాదములు, ఒకత్రిష్టుప్పాదము, రెండుగాయత్రీపాదములు.

iii. ఉపరిష్టాజ్జ్యోతి : నాలుగుగాయత్రీపాదములు, ఒకత్రిష్టుప్పాదము.

(8) i. అయిదక్షరములపాదము ఒకటిన్ని, ఆరక్షరములపాదములు మూడున్ను ఉంటే శంకుమతి.

ii. ఒకపాదము ఆరక్షరములుగలిగి, తక్కినపాదములు ఆయాఛందోలక్షణము ననుసరించి ఉంటే కకుబ్మతి.

iii. మూడుపాదములుగలఛందస్సులో మధ్యపాదము కొంచెమక్షరములు కలిగిఉంటే దానికి పిపీలికమధ్య అని పేరు. ఆమధ్యపాదము తక్కినరెండుపాదములకంటె ఎక్కువఅక్షరములు కలిగి ఉంటే యవమధ్య అని ఆఛందస్సుకు పేరు.

(9) ఏదయినాఛందఃపాదమునకు నియతమైన అక్షరసంఖ్యలో ఒకటి తక్కువఅయితే నిచృత్ అనిన్ని, రెండు తక్కువఅయితే విరాట్ అనిన్ని; ఒకటి ఎక్కువ అయితే భురిక్ అనిన్ని, రెండు ఎక్కువ అయితే స్వరాట్ అనిన్ని సంజ్ఞలు ఆఛందస్సులపేళ్లకు చేరుతవి.

(10) పైనిచెప్పినవికాక వేదములలో అన్నిపాదముల మొత్తము అక్షరసంఖ్యలతో ఉన్నఛందస్సులు చెప్పబడినవి :—

ఉత్కృతి 104 ; అభికృతి 100 ; సంకృతి 96 ; వికృతి 92 ; ఆకృతి 88 ; ప్రకృతి 84 ; కృతి 80. అతిధృతి 76 ; ధృతి 72 ; అత్యష్టి 68 ; అష్టి 64 ; అతిశక్వరి 60 ; శక్వరి 56; అతిజగతి 52 ; జగతి 42.

# 3

## సంస్కృతచ్ఛందస్సు.

౧. వైదికచ్ఛందఃప్రకరణములో కేవలము వేదములోమాత్రము వచ్చే ఛందస్సులను వివరించినాను. ఈ క్రిందచెప్పేవి కేవలలౌకికములు. వీటిలో గణచ్ఛందములు, మాత్రాచ్ఛందములు అని రెండు విధములైన వున్నవి.

### i. ఆర్య.

౨. ఆర్యాదులు మాత్రాగణచ్ఛందములు : ఆర్యలలో నాలుగుపాదములు ; రెండేసిపాదము లొక అర్ధము. పాదములు నాలుగున్ను సమపాదములు కావచ్చును ; లేదా, 1, 3 న్ను, 2, 4 న్ను సమ పాదములుకావచ్చును. పాదములలోచేరే గణములన్నిటిలోను నాలుగేసిమాత్రలే ఉంటవి ; అనగా నల, గగ, భ, జ, స, గణములుమాత్రి ముంటవి. ఆర్యలలోని బేసిగణములు జగణములు కాకూడదు. ఆరో గణము జగణముగాని నలముగాని కావలెను. ఆరో గణము నలమయితే ఆగణములోని రెండో అక్షరమునుంచిన్ని క్రొత్తపద మారంభమవుతుంది. ఏడో గణము నలమైతే దాని మొదటిఅక్షరము నుంచిన్ని పద మారంభమవుతుంది. రెండోఅర్ధములో నలము అయిదో గణమయితే, గణారంభము తోనే పదారంభముకూడా కలుగుతుంది.

ఆర్యలో రెండోఅర్ధము ఆరో గణము ఏకలఘువుగా ఉంటుంది. ఆర్యకు ఏడుగణములు, ఒకగురువు ఒకఅర్ధములో ఉంటవి.

౩. మొదటిమూడుపాదములతరువాత పదము సంపూర్ణమయితే దానికి పథ్యార్య అనిపేరు. అట్లు పదముతెగక నాలుగోగణములోనికి జొరబడితే దానికి విపులార్య అనిపేరు. ఆర్యార్ధములో రెండో నాలుగోగణములు జగణములు, మొదటిది సగణము, మూడోది గగము, అయిదోది భగణము, తక్కినవి యథాప్రాప్తముగా ఉంటే, దానికి చపలార్య అనిపేరు. ఈ చపలాలక్షణము మొదటిసగములో మాత్రముంటే ముఖచపల; రెండో సగములో ఉంటే జఘనచపల; రెండుసగములలోను ఉంటే మహాచపల.

౪. ఆర్యలోని మొదటిఅర్ధమువలెనే రెండోఅర్ధముకూడా ఉంటే దానికి గీతి అనిపేరు; రెండో సగమువలె మొదటిసగముకూడా ఉంటే అది ఉపగీతి; మొదటిసగము రెండోసగమువలెను, రెండో సగము మొదటిసగమువలెను ఉంటే అది ఉద్గీతి; సగములో సంపూర్ణముగా ఎనిమిది చతుర్మాత్రాగణము లుంటే దానికి ఆర్యాగీతి అనిపేరు.

## ii. వైతాలీయ.

౫. నాలుగుపాదములుగలిగి 1,3 పాదములలో 14 మాత్రలున్ను, 2,4 పాదములలో 16 మాత్రలున్ను ఉంటే దానికి వైతాలీయ అనిపేరు. దీనిపాదములతుదిని రగణ ముండవలెను. వైతాలీయలోని ప్రతిపాదముతుదను ఒకగురువుచేరిస్తే ఔపచ్ఛందసక మవుతుంది. వైతాలీయపాదములలోని తుది గణము గగ మయితే దానికి ఆపాతలిక అనిపేరు. వైతాలీయ 1,3 పాదములలో తుది ఆరుమాత్రలున్ను ప్రత్యేకపదముతో ఆరంభించవలెను. 2,4 పాదములలో తుది ఎనిమిదిమాత్రలున్ను ప్రత్యేకపదముతో ఆరంభించవలెను.

౬. నాలుగుపాదములుగలిగి, పాదమునకు 16 మాత్రలుగలది మాత్రాసమకము; పాదములు గుర్వంతములు కావలెను; పాదములో తొమ్మిదోమాత్ర లఘువు కావలెను. పాదములలో తొమ్మిదోమాత్ర, పన్నెండోమాత్రకూడా లఘువులుగా ఉంటే దానికి వానవాసిక అనిపేరు; అయిదోమాత్ర, ఎనిమిదోమాత్ర లఘువులయితే విశ్లోకము; అయిదోది, ఎనిమిదోది, తొమ్మిదోదికూడా లఘువులయితే చిత్ర; తొమ్మిదో, పదోమాత్రలు కలిసి ఒకగురువుగా ఉంటే ఉపచిత్ర; పయి అయిదు విధములలోను ఏవయినాసరే నాలుగుపాదములు గలది పాదాకులకము.

౭. పాదమునకు 16 లఘువులచొప్పున నాలుగుపాదములుగలది గీత్యార్య. ఒకసగములో అన్నీలఘువులు, రెండోసగములో అన్నీగురువులుగలది శిఖ. పూర్వార్ధము సర్వలఘుకమయి ద్వితీయార్ధము సర్వగురుకమయితే దానికి జ్యోతి అనిపేరు. పూర్వార్ధములో అన్నీ గురువులు, పరార్ధములో అన్నీ లఘువులు ఉంటే దానికి సౌమ్య అనిపేరు.

౮. మొదటిరెండుపాదములలో 27 లఘువులు ఒకగురువు, మొత్తము 29 మాత్రలును, తుదిరెండు పాదములలో 29 లఘువులు, ఒకగురువు, మొత్తము 31 మాత్రలును గలది చూలిక.

## ప్రాకృతచ్ఛందస్సు.

ప్రాకృతచ్ఛందస్సులో సంస్కృతమునందుకంటె ఎక్కువమాత్రాచ్ఛందస్సులు కనబడుచున్నవి. ప్రాకృతపైంగలములో వివరింపబడిన మాత్రాచ్ఛందస్సులను వాటిలక్షణముతో ఈక్రింద వివరిస్తాను.

### i. గాథాభేదములు.

గాథాచ్ఛందస్సుకు చేరినవాటిలో (1) మొదటిపాదములో 12 మాత్రలు; (2) ఆరోగణము ఒక ప్రత్యేకనియమము ననుసరిస్తుంది; (3) రెండో, నాలుగోపాదముల అంత్యాక్షరము గురువు; (4) బేసిని జగణ ముండదు; అనే సామాన్యనియమ మున్నది.

(1) గాహూ : మొత్తము 54 మాత్రలు; రెండుసమభాగములు, ఒక్కొక్క భాగములో 27 మాత్రలు; రెండో, నాలుగోపాదములలో పదిహేనేసిమాత్రలు; అయిదోగణము తరువాత రెండులఘువు లుండవలెను. దీనినిబట్టి ఒకసగము : (సంఖ్యలు అన్నిమాత్రలుగలగణములకు గురుతు.)

4 + 4 + 4 + = 12

4 + 4 + 1 + 4 + గురు = 15

(2) గాహా : 57 మాత్రలు. దీనిప్రస్తారము సగమునకు;

మొదటిసగము 4 + 4 + 4 = 12

4 + 4 + 4 + 4 + గురు = 18

రెండోసగము 4 + 4 + 4 = 12

4 + 4 + 1 + 4 + గురు = 15

(3) విగ్గాహా : గాహాలోని మొదటిసగము రెండోసగముగాను, రెండోసగము మొదటిసగము గాను చెప్పినది.

(4) ఉగ్గాహా : 60 మాత్రలు. ప్రస్తారము -

4 + 4 + 4 = 12

4 + 4 + 4 + 4 + గురు = 18

ఇట్లే రెండోసగము.

(5) గాహిణీ : 62 మాత్రలు.

మొదటిసగము : 4 + 4 + 4 = 12

4 + 4 + 4 + 4 + గురు = 18

రెండోసగము : 4 + 4 + 4 = 12

4 + 4 + 4 + 4 + (2 + గురు) = 20

(6) సింహిణీ : గాహిణీలోని మొదటిసగము రెండోసగముగాను, రెండోసగము మొదటిసగము గాను చెప్పినది.

(i) ఖంధ. అ : 64 మాత్రలు ; 32 మాత్రలుచొప్పున రెండుసమభాగములు.

4 + 4 + 4 = 12

4 + 4 + 4 + 4 + ( 2 + గురు ) = 20

రెండోసగమున్ను అట్లే. ఈ స్కంధకములోనుండే గురులఘువులసంఖ్యనుబట్టి పేర్లున్నవి :— నంద ( 4 ల, 30 గు ); భద్ర ( 6 ల, 29 గు ); శేష ( 8 ల, 28 గు ) ; సారంగ ( 10 ల, 27 గు ); శివ ( 12 ల, 26 గు ); బ్రహ్మ ( 14 ల, 25 గు ); వారణ ( 16 ల, 24 గు ); వరుణ ( 18 ల, 23 గు ); నీల ( 20 ల, 22 గు ); మదనతాడంక ( 22 ల, 21 గు ); శేఖర ( 24 ల, 20 గు ); శర ( 26 ల, 19 గు ) ; గగన ( 28 ల, 18 గు ); విమతి ( 30 ల, 17 గు ); స్థిర (32 ల, 16 గు ) ; సార (34 ల, 15 గు) ; నర (36 ల, 14 గు) ; స్నిగ్ధ (38 ల, 13 గు) ; స్నేహన (40 ల, 12 గు) ; మదకల (42 ల, 11 గు) ; లోల (44 ల, 10 గు) ; శుద్ధ (46 ల 9 గు) ; శ్రీ (50 ల, 7 గు) ; కుంభ (52 ల, 6 గు) ; కలశ (54 ల, 5 గు) ; శశిని (56 ల, 4 గు ) ;

## ii. దోహా.

మొదటిపాదము, మూడోపాదము : 6 + 4 + 3 = 13

రెండోపాదము, నాలుగోపాదము : 6 + 4 + 1 = 11

మొత్తము 48 మాత్రలు ; ఏపాదములోను జగణ ముండకూడదు. పద్యములోని గురులఘువుల సంఖ్యనుబట్టి దీనికి వేర్వేరుపేర్లు కలిగినవి:—

భ్రమర (22 గు, 4 ల) ; భ్రామర (21 గు, 6 ల) ; శరభ (20 గు, 8 ల) ; శ్యేన (19 గు, 10 ల) ; మండల, లేక మయూర (18 గు, 12 ల) ; మర్కట (17 గు, 14 ల) ; కరభ (16 గు, 16 ల) ; నర (15 గు, 18 ల) ; మరాల (14 గు, 20 ల) ; మదకల (13 గు, 22 ల) ; పయోధర (12 గు, 24 ల) ; చల, లేక బల (11 గు, 26 ల) ; వానర (10 గు, 28 ల); త్రికల, లేక త్రికల (9 గు, 30 ల) ; కచ్ఛప (8 గు, 32 ల) ; మత్స్య (7 గు, 34 ల) ; శార్దూల (6 గు, 36 ల); అహి (5 గు, 38 ల) ; వ్యాఘ్ర (4 గు, 40 ల) ; బిడాల, లేక విరాల (3 గు, 42 ల) ; శునక (2 గు, 44 ల) ; ఉందుర (1 గు, 46 ల) ; సర్ప (48 ల).

## iii. రసికా, లేక, ఉక్కచ్ఛా.

ఆరుపాదములు, పాదమునకు 11 మాత్రలు (4 + 4 + 3) ; మొత్తము 66 మాత్రలు. గురులఘువుల సంఖ్యనుబట్టి ఆయాభేదములకు వేర్వేరుపేర్లున్నవి:—

లోహాంగిణీ (66 ల) ; హంసీ (64 ల, 1 గు ; 62 ల, 2 గు ; 60 ల, 3 గు ; 58 ల, 4 గు) ; రేఖా ( 56 ల, 5 గు ; 54 ల, 6 గు ; 52 ల, 7 గు ; 50 ల, 8 గు) ; తాలంకినీ (48 ల, 9 గు ; 46 ల, 10 గు ; 44 ల, 11 గు ; 42 ల, 12 గు) ; కంపినీ ( 40 ల, 13 గు ; 38 ల, 14 గు ; 36 ల, 15 గు ; 34 ల, 16 గు) ; గంభీరా (32 ల, 17 గు ; 30 ల, 18 గు; 28 ల, 19 గు ; 26 ల, 20 గు) ; కాలీ (24 ల, 21 గు ; 22 ల, 22 గు ; 20 ల, 23 గు ; 18 ల, 24 గు ) ; కాలరుద్రాణీ (16 ల, 25 గు ; 14 ల, 26 గు ; 12 ల, 27 గు ; 10 ల, 28 గు.)

పైభేదములను వివరించడములో వ్యాఖ్యానకర్తలు వేర్వేరుగా వ్రాసినారు; ఈభేదములస్వరూప మిట్టిదని స్పష్టముగా చెప్ప వీలులేకున్నది.

### iv. రోలా

పాదమునకు 24 మాత్రలు ; పాదములు గురుహీనముగా ఉండకూడదు. నాలుగుపాదములు. పాదములోనిగురులఘుసంఖ్యనుబట్టి ఆయా రోలాలకు పేళ్ళుగలిగినవి ; కుంద (11 గు, 2 ల) ; కరతల (10 గు, 4 ల); మేఘ (9 గు, 6 ల) ; తాడంక (8 గు, 8 ల) ; కాలరుద్ర (7 గు, 10 ల) ; కోకిల (6 గు, 12 ల ) ; కమల (5 గు, 14 ల) ; ఇందు (4 గు, 16 ల) ; శంభు (3 గు 18 ల) ; చామర (2 గు, 20 ల) ; గణేశ్వర (1 గు, 22 ల) ; సహస్రాక్ష (24 ల) — దీనిపైగల వ్యాఖ్యానములను బట్టి యీ భేదములస్వరూప మిదమిత్థమని నిర్ణయింప వీలుకాకున్నది.

### v. గంధానా.

బేసిపాదములలో గురువులుగాని, లఘువులుగాని పదిహేడేసి అక్షరములు ; సరిపాదములలో గురువులుగాని, లఘువులుగాని పద్దెనిమిది అక్షరములు. నాలుగు పాదములు.
—ఇది వర్ణవృత్తములలో చేరవలసినది ; మాత్రావృత్తములలో ఎందుకుచేరినదో తెలియదు.

### vi. చౌపది ఆ.

పాదమునకు నాలుగేసిమాత్రలుగల ఏడుగణములున్ను, ఒకగురువున్ను కలిసి 30 మాత్రలు. ఇట్టి నాలుగుపాదములుగల ఒకపద్యమునకు 120 మాత్రలు; ఇట్టిపద్యములు నాలుగు చెప్పవలెను. మొత్తము 480 మాత్రలు.

### vii. ఘత్తా.

రెండుపాదములు ; పాదమునకు ఏడుచతుర్మాత్రాగణములు, తరువాత మూడులఘువులు ; మొత్తము పాదమునకు 31 మాత్రలు ; రెండు పాదములకున్ను 62 మాత్రలు; ప్రతిపాదములోను 10, 8, 13, మాత్రలతరువాత విరతి.

### viii. ఘత్తానంద.

ఘత్తాపాదములవంటివే రెండుపాదములు ; కాని, 11, 7, 13, మాత్రలతరువాత విరతి. గణవిభజనము 6, 4, 4, 4, 5, 4, 4, మాత్రలు గలగణములుగా చేసుకోవలెను.

### ix. (1) ఛప్పడు.

4. పాదములు ; పాదమునకు 2 మాత్రలు + 5 చతుర్మాత్రాగణములు + 2 లఘువులు ; పాద పాదమునకు 11 మాత్రల తరువాతను, పిమ్మట మరి 13 మాత్రల తరువాతను అనగా పాదాంత మందును విరతి. ఈ నాలుగుపాదములుగలపద్యమునకు రెండు 'ఉల్లాల' లు చేర్చవలెను. 'ఉల్లాల' అనేది 28 మాత్రల పాదము. దీనిలో పదుహైదో మాత్ర తరువాత విరతి ఉంటుంది,

## ix. (2) కబ్బ ( ' ఛప్పఉ ' లో భేదము. )

పాదమునకు 6, 4, 4, 4, 6 మాత్రలుగల గణములు మొత్తము 24 మాత్రలు ; ఈగణములలో మూడోది జగణముగాని, నలము గాని కావలెను. ఇట్టివి అయిదుపాదములు ఒక పద్యము. ఈపద్యమునకు రెండు ఉల్లాలలు చేర్చవలెను. గురులఘుసంఖ్యనుబట్టి దీనిలోనిభేదములకు ప్రత్యేకముగా పేర్లున్నవి :—

ఈక్రిందిసంఖ్యలలో మొదటిది లఘువులను, రెండోది గురువులను తెలుపుతుంది.

శక్ర (96 ; ల) ; శంభో (94 ; 1); సూరో (92 ;2) ; గండో (90 ; 3) ; ఖంధో(88 ; 4) ; విజఓ (86 ; 5) ; దప్పో (84 ; 6) ; తాలంకో (82 ; 7) ; సమరో (80 ; 8 ) ; సీహో (78 ; 9) ; సేసో (76 ; 10) ; ఉత్తేఓ (74 ; 11) ; పడివక్ఖో (72 ; 12) ; పరిధమ్మో (70 ; 13) ; మఅలు (68 ; 14) ; మఇందో (66 ; 15) ; దండో (64 ; 16 ); మక్కలు (62 ; 17) ; మఅలు (60 ; 18) ; మరట్ఠో (58 ; 19) ; వాసంతో (56 ; 20) ; కంఠో (54 ; 21) ; మోరో (52; 22) ; బంధో (50,23); భీమరో (48 ; 24) ; భిణ్ణమరట్ఠో (46 ; 25) ; బలహద్దో (44 ; 26) ; రాఓ (42 ; 27) ; వలిఅహో (40 ; 28); మోహవో ( 38; 29) ; మంథాణో (36 ; 30) ; బలి (34 ; 31) ; మోహో (32 ; 32) ; సహాసక్ఖో 30 ; 33) ; బాలో (28 ; 34) ; ఓలిఓ (26 ; 35) ; సరహో (24 ; 36) ; దంభో (22 ; 37) ; అహో (20 ; 38) ; ఉత్తంభో (18 ; 39) ; బలిఅంకో (16 ; 40) ; తురఓ (14; 41) ; హరిణో (12 ; 42) ; అంధో (10 ; 43) ; భింగో (8 ; 44 ).

## ix. (3) ఉల్లాల.

వరుసగా 4, 4, 4, 3, 6, 4, 3 మాత్రలుగలగణములు ; మొత్తము పాదమునకు 28 మాత్రలు ; అట్టిదే మరిఒకపాదముచేరి పద్యమవుతుంది.

' కబ్బ ' లోని భేదములప్రస్తారము ( దీనికి శాల్మలీప్రస్తారమని పేరు. )

ఈ క్రిందిసంఖ్యలలో మొదటిది గురుసంఖ్య ; రెండోది లఘుసంఖ్య.

అజయ ( 70-12 ) ; విజయ ( 69-14 ) ; బలి ( 68-16 ) ; కర్ణ ( 67-18 ) ; వీర (66-20) ; వేతాల ( 65-22 ) ; బృహన్నట (ల) ( 64-24 ) ; మర్కట ( 63-26 ) ; హరి ( 62-28 ) ; హర ( 61-30 ) ; బ్రహ్మ ( 60-32 ) ; ఇందు ( 59-34 ) ; చందన ( 58-36 ) ; శుభంకర ( 57-38 ) ; శ్వా ( 56-40 ) ; సింహ ( 55-42 ) ; శార్దూల ( 54-44 ) ; కూర్మ ( 53-46 ) ; కోకిల ( 52-48 ) ; ఖర ( 51-50 ) ; కుంజర ( 50-52 ) ; మదన ( 49-54 ) ; మత్స్య ( 48-56 ) ; తాడంక ( 47-58 ) ; శేష ( 46-60 ) ; సారంగ ( 45-62 ) ; పయోధర ( 44-64 ) ; కుంద ( 43-66 ) ; కమల ( 42-68 ) ; వారణ ( 41-70 ) ; శరభ ( 40-72 ) ; భీసల ( 39-74 ) ; జాంగల ( 38-76 ) ; శర ( 37-78 ) ; సుసర ( 36-80 ) ; సమర (35-82); సారస ( 34-84 ) ; శరస ( 33-86 ) ; మేరు ( 32-88 ) ; మకర ( 31-90 ) ; మద ( 30-92 ) ;

సిద్ధి ( 29-94 ) ; బుద్ధి ( 28-96 ) ; కరతల ( 27-98 ) ; ధవల ( 26-100 ) ; మదన ( 25-102 ) ధ్రువ ( 24-104 ) ; కనక ( 23-106 ) ; కృష్ణ ( 22-108 ) ; రంజన ( 21-110 ) ; మేఘాకర ( 19-114 ) ; గ్రీష్మ ( 18-116 ) ; గరుడ ( 17-118 ) ; శశి ( 16-120 ) ; శూర ( 15-122 ) ; శల్య ( 14-124 ) ; నవరంగ ( 13-126 ) ; మనోహర ( 12-128 ) ; గగన ( 11-130 ) ; రత్న ( 10-132 ) ; నర ( 9-134 ) ; హీర ( 8-136 ) ; భ్రమర ( 7-138 ) ; శేఖర ( 6-140 ) ; కుసుమాకర ( 5-142 ) ; ద్విప ( 4-144 ) ; శంఖ ( 3-146 ) ; వసు ( 2-148 ) ; శబ్ద (1-150) ; ముని ( 152 ల ).

### X. పజ్ఝటికా.

పాదమునకు 4, 4, 4, జగణము, మొత్తము 16 మాత్రలు ; ఇట్టివి 4 పాదములు.

### xi. అడిల్లా.

4, 4, 4, 4, మాత్రలుగల నాలుగుగణములు పాదమునకు; నాలుగోగణము జగణము కాకూడదు. నాలుగుపాదములు. మొదటిరెండుపాదములకున్ను, 3, 4 పాదములకున్ను అంత్యానుప్రాసనియమము. గురులఘునియమములేని అడిల్లాకు 'పాఅఉలఅం' అనిపేరు.

### xii. చఉబోలా.

బేసిపాదములలో 16 మాత్రలు, సరిపాదములలో 14 మాత్రలు, నాలుగుపాదములు.

### xiii. రడ్డా.

( దీనికి 'రాజసేనా, వస్తు' అనికూడా పేళ్లున్నవి. )

మొదటిపాదములో 15 మాత్రలు, రెండోపాదములో 12మాత్రలు మూడోపాదములో 15మాత్రలు, నాలుగోపాదములో 11 మాత్రలు, అయిదోపాదములో 15 మాత్రలు ; మొత్తము- 5 పాదములు, 68 మాత్రలు. దీనికి ఒక 'దోహా' చేర్చవలెను. (ii) 'దోహా' నాలుగుపాదములుకలది 'రడ్డా'కు మొత్తము తొమ్మిదిపాదములు, 68 + 48 = 116 మాత్రలు. పైపాదములలో ఒకటి, మూడు, అయిదోపాదములలో వరుసగా 3, 4, 4, 4, మాత్రలుగల నాలుగుగణములు, మొదటిపాదములో తుదిగణము జగణమో, నలమో అయిఉండవలెను ; మూడు, అయిదోపాదములతుదిని రెండులఘువు లుండవలెను. రెండోపాదములో మూడుచతుర్మాత్రాగణము లుండవలెను ; వీటిలో తుదిది నలము కావలెను. నాలుగోపాదములో వరుసగా రెండుచతుర్మాత్రాగణములున్ను, తరువాత నగణమున్ను ఉండవలెను.

'రడ్డా' లో అయిదుపాదములలోని మాత్రాసంఖ్యనుబట్టి ఏడుభేదము లున్నవి :—

కరహా ( 13, 11, 13, 11, 13 ) ; నందా ( 14, 11, 14, 11, 14 ) ; మోహినీ ( 19, 11, 19, 11, 19 ) ; చారుసేని ( 15, 11, 15, 11, 15 ) ; భద్ర ( 15, 12, 15, 12, 15 ) ; రాజసేన ( 15, 12, 15, 11, 15 ) ; తాలంక ( 16, 12, 16, 11, 16.)

వీటిలో 'రడ్డాకు' సంబంధించిన ఇతర నియమములనున్ను అనుసరించవలెను.

## xiv. హోమావృత్తి.

నాలుగుపాదములు, పాదమునకు ఎనిమిది చతుర్మాత్రాగణములు, జగణము చేరకూడదు, అంటే భ, స, గగ, నల ములను మాత్రమే వాడవలెను.

## xv. కుండలిఅ.

ఒకదోహా, తరువాత ఒకకబ్బ చెప్పితే కుండలిఅ అవుతుంది. కబ్బకు ఉల్లాలను చేర్చవలెనని వేరే చెప్పనక్కరలేదు. పాదములలో యమకముండవలె ననడము దీనికి ప్రత్యేకలక్షణము.

## xvi. గగనాంగ.

పాదములో మొత్తము వర్ణసంఖ్య 20, మాత్రాసంఖ్య 25, పాదములోని మొదటిగణము నాలుగు మాత్రలు గలదిగా ఉండవలెను. పాదాంతమందు గురు వుండవలెను. నాలుగుపాదములు.

## xvii. (1) దోఅఇ.

పాదమునకు వరుసగా 6, 4, 4, 4, 4, 6 మాత్రలుగల ఆరుగణములు, మొత్తము 28 మాత్రలు, ఇట్టివి రెండుపాదములు, వాటి తుదను గురువుండవలెను.

## xvii. (2) ఝుల్లణ.

రెండుపాదములు, పాదమునకు 10 మాత్రలు, విరతి ; 10 మాత్రలు, విరతి ; 7 మాత్రలు, విరతి.

## xvii. (3) ఖంజ.

రెండుపాదములు, పాదమునకు వరుసగా 9 నలములు, ఒక రగణము.

## xvii. (4) సిఖా.

మొదటిపాదములో వరుసగా 6 నలములు, ఒక జగణము, రెండోపాదములో వరుసగా 7 నలములు, 1 జగణము.

## xvii. (5) మాలా.

మొదటిపాదములో వరుసగా 9 నలములు, 1 రగణము, గగము; మొత్తము 45 మాత్రలు. రెండోపాదము ఒక గాహాపాదము.

## xvii. (6) చులిఆలా.

ఒకదోహాపాదమునకు జలఘువు చేర్చితే ఒకపాదము, ఇట్టివి రెండుపాదములు.

## xviii. సోరట్ఠా.

‘దోహా’ లోని మొదటిసగము రెండోసగముగాను, రెండోసగము మొదటిసగముగాను చెప్పవలెను. అనగా ఒకటి, మూడోపాదములలో 11 మాత్రలు, రెండు, నాలుగోపాదములలో 13 మాత్రలు– దీనిలో యమక ముండవలెననడము ప్రత్యేకలక్షణము.

## xix. హాకలి.

రెండుదళములు, దళమునకు మొదట సగణముగాని భగణముగాని అయిన రెండుగణములు ; తరువాత నలము, తరువాత గురువు, మొత్తము 14 మాత్రలు. మొదటిదళములో 11 వర్ణములున్ను, రెండోదళములో 10 వర్ణములున్ను ఉండవలెను.

## xx. మహాభార.

రెండుపాదములు ; పాదమునకు వరుసగా 1 నాలుగుమాత్రలగణము, జగణము, 1 నాలుగుమాత్రల గణము, 1 జగణము.

## xxi. అహార.

రెండుపాదములు ; పాదమునకు 11 మాత్రలు ; పాదముతుదిగణము జగణము.

## xxii. గండలల.

నాలుగుపాదములు, పాదమునకు వరుసగా 4, 4, 4, 4, 6, 4, 4 ; గురువు = 32 మాత్రలు.

## xxiii. దీపక్క.

రెండుపాదములు ; పాదమునకు వరుసగా చతుర్మాత్రగణము, పంచమాత్రగణము, లఘువు ; మొత్తము పాదమునకు 10 మాత్రలు.

## xxiv సింహాలోలన.

నాలుగుపాదములు; పాదమునకు 4 చతుర్మాత్రగణములు, భగణము, జగణము, గగము ఉండకూడదు. అంటే, నలమును సగణమును మాత్రమే వాడవలెను.

## xxv. పలంగమ.

పాదమునకు 20 మాత్రలు, నాలుగుపాదములు. పాదాదిని గురువుఆదినిగల ఆరుమాత్రలగణము, తరువాత చతుర్మాత్రగణములు, తరువాత ఒకలగము, మొత్తముపాదమునకు 20 మాత్రలు కావలెను.

## xxvi. లీలావతి.

నాలుగుపాదములు; పాదమునకు వరుసగా 7 చతుర్మాత్రగణములు, 1 సగణము.

## xxvii. హారిగీత.

నాలుగుపాదములు ; పాదమునకు వరుసగా 5, 6, 5, 5, 5, మాత్రలుగలగణములు, 1 గురువు ; మొత్తము 28 మాత్రలు.



## xxviii. త్రిభంగి.

4 పాదములు, పాదమునకు 8 చతుర్మాత్రగణములు, తుదిపాదము గుర్వంతమై ఉండవలెను. 10 ; 8 ; 6 మాత్రలతరువాత విరతి.

## xxix. దుమ్మిలటీ.

నాలుగుపాదములు, పాదమునకు 8 చతుర్మాత్రాగణములు సరిగణములు నలములు, బేసిగణములు గగములుగా ఉండవలెను. పాదము గుర్వంతము కావలెను. ప్రతిపాదములోను 10, 8, 14, మాత్రల తరువాత విరతి.

## xxx. హీర.

పాదములోవరుసగా గురువు + నలము ; గురువు + నలము ; గురువు + నలము ; రగణము ;— మొత్తము 28 మాత్రలు, నాలుగుపాదములు.

## xxxi. జలహరణా.

నాలుగుపాదములు ; పాదమునకు వరుసగా 7 చతుర్మాత్రాగణములు, ఒక సగణము,— మొత్తము 32 మాత్రలు. ప్రతిపాదములోను 10, 8, 6, 8, మాత్రలతరువాత విరతి. పాదముతుదిని సగణము తప్పక ఉండవలెను. తక్కినగణములలో గురులఘువులను యథేచ్ఛముగా వాడుకోవచ్చును.

## xxxii. మహాణహారా.

నాలుగుపాదములు ; పాదమునకువరుసగా 10 చతుర్మాత్రాగణములు. మొత్తముపాదమునకు 40 మాత్రలు. పాదాదిని రెండులఘువులున్ను, పాదాంతమందు గురువున్ను ఉండవలెను.

## xxxiii. మరహాట్రా.

నాలుగుపాదములు, పాదములో వరుసగా ఒక 6 మాత్రలగణము, 5 చతుర్మాత్రాగణములు, 1 గలము ; మొత్తము 29 మాత్రలు ; ప్రతిపాదములోను 10, 8, 11 మాత్రలయినతరువాత విరతి.

# ౪

## తమిళఛందస్సు.

౧. తమిళఛందస్సులో గణవిభాగమును లాక్షణికులు తక్కినభాషలలోవలె కాక వేరేవిధముగా చేసుకొన్నారు. ఆఛందస్సులకున్ను తెనుగుకన్నడఛందస్సులకున్ను గలసంబంధమును తెలుసుకొనవలెనంటే దానికిముందు తమిళఛందస్సును తమిళలాక్షణికు లెట్లు నిరూపించినారో చూడవలెను.

౨. తమిళఛందోలక్షణములో —

'కుఱిల్' అనగా హ్రస్వాక్షరము, 'నెడిల్' అనగా దీర్ఘాక్షరము: పొల్లులు అర్ధమాత్రికములు. 'అసై' అనగా ఈమూడును ప్రత్యేకముగాగాని, వాటిలో రెండుమూడు కలిసికాని ఏర్పడి ఉచ్చరింపబడేధ్వని. దీనిని ఛందోక్షరమందాము. ఈమూడింటికలియికనుబట్టి 'అసై' అనేది 'నేర్అసై' అనిన్ని, 'నిరైఅసై' అనిన్ని రెండువిధములుగా ఉంటుంది.

3. నేర్ అసై:— ఒకకుఱిల్ గాని, ఒక నెడిల్ గాని, ఒకకుఱిల్ + అర్ధమాత్రగాని, ఒక నెడిల్ + అర్ధమాత్రగాని అయిఉంటుంది. అనగా సంస్కృతపరిభాషప్రకారము ఒక లఘువో, గురువో, అవుతుంది.

నిరై అసై:— ఇది నేర్ అసైముందు ఒకకుఱిల్ నుచేర్చడమువల్ల కలుగుతుంది.

అనగా, కుఱిల్ + కుఱిల్ = లలము ; కుఱిల్ + నెడిల్ = లగము ; కుఱిల్ + కుఱిల్ + అర్ధ మాత్ర = లగము ; కుఱిల్ + నెడిల్ + అర్ధమాత్ర=లగము— అనేవాటిలో ఏదయినా నిరైఅసై కావచ్చును.

౪. నేర్, నిరై లసంయోగమువల్ల ఒక 'శీర్' లేక గణము ఏర్పడుతుంది. 'శీర్' లో 'నేర్' లుగాని, 'నిరై 'లుగాని, రెండునుగాని ఉండవచ్చును. 'శీర్' లోఉండే నేర్, నిరై లసంఖ్యనుబట్టి, ఆయా 'శీర్ లకు' ప్రత్యేకముగా పేర్లున్నవి. నేర్, నిరై లాయా 'శీర్' లలో దేనితరువాత ఏదివస్తుందో ఆక్రమమునుబట్టికూడా పేర్లేర్పడినవి. ఆయాపేర్లుసంస్కృతపరిభాషప్రకారము ప్రస్తారములో ఈక్రిందచూపబడినవి. పదాదిమధ్యములందు 'నేర్' అనేది గురువుగానే ఉండవలెను. పదాంతము గురువుగాని, లఘువుగాని అయిఉండవచ్చును. ఈక్రిందిప్రస్తారములో ఈనియమమును గమనింపవలెను.

## ౫. 'శీర్' ప్రస్తారము.

i. ఓరసైచ్చీర్ —అనగా ఒక నేర్ గాని, ఒకనిరైగాని కలిగినగణము. ఉదా. కాల్. మలర్-- 'వెణ్బా' అనే పద్యము అంతమందు దీనిని సాధారణముగా వాడుతారు. ఒకప్పుడు 'కాల్' వంటిది గాక 'కాశు' వంటిరూపముగల గణమునున్ను, 'మలర్' వంటిదిగాక 'పిఱప్పు' వంటిరూపముగల గణమునున్ను 'వెణ్బా' పద్యము అంతమందు వాడడము కలదు. అనగా నేర్, నిరైల తరువాత అర్ధ మాత్రికమైన 'ఉ'కారమును చేరుస్తారు, నిందు ఉకారమును చేర్చడము అరుదు.

ii. ఉరిచ్చీర్, లేక ఆశ్చిరియవురిచ్చీర్:- దీనిని 'అగవల్' అనేపద్యములో వాడుతారు. దీనిలో రెండు ఛందోక్షరము లుంటవి. ప్రస్తారమువల్ల ఇట్టివి నాలుగు ఏర్పడుతవి.

(∪ = గురువు ; । = లఘువు).

| పేరు | నిర్మాణము | సంస్కృతప్రస్తారము | సంస్కృతములోపేరు |
|---|---|---|---|
| తేమా | = 2 నేర్ లు | ∪ ∪ | గగము (బ్రి) |
| | | ∪ । | గలము, హగణము. (బ్రి. సూ) |
| పుళిమా | = నిరై + నేర్ | । ∪ ∪ | యగణము |
| | | । ∪ । | జగణము |
| | | । । ∪ | సగణము (బ్రి) |
| | | । । । | నగణము (బ్ర. సూ.) |

* పైవాటిలో 'తేమా', 'పులిమా' అనేమాటలకుదిని 'మా' ఉన్నది. గనుక ఈగణములకు 'మాచ్చీర్' లని పేరువచ్చినది.

| | | |
|---|---|---|
| కరువిళమ్ - నిరై + నిరై - | ∣ ∣ ∣ ∣ | నలము (వి. ఇం) |
| | ∣ ∣ ∣ ∪ | నగము (వి. ఇం) |
| | ∣ ∪ ∣ ∣ | జలము |
| | ∣ ∪ ∣ ∪ | జగము |
| కూవిళమ్ - నేర్ + నిరై - | ∪ ∣ ∣ | భగణము (వి. ఇం) |
| | ∪ ∣ ∪ | గగణము (వి. ఇం) |

(iii) వెణ్‌చీర్, లేక, వెణ్బాఉరిచ్చీర్ — ఇది 'వెణ్బా' పద్యములో వచ్చేది. దీనిలో మూడు ఛందోక్షరములుంటవి. మాచ్చీర్లకున్ను, విళచ్చీర్లకున్ను 'కాయ్' అని చేర్చడమువల్ల వీటిపేళ్లు ఏర్పడుతవి. వాటిప్రస్తారము:—

తేమాంగాయ్ - నేర్ + నేర్ + నేర్ -

| | | | |
|---|---|---|---|
| ∪ ∪ ∪ | మగణము (వి) | ∪ ∪ ∣ | తగణము (వి. ఇం.) |

పులిమాంగాయ్ - నిరై + నేర్ + నేర్ -

| | | | |
|---|---|---|---|
| ∣ ∣ ∪ ∪ | సగము (వి) | ∣ ∪ ∪ ∪ | యగము |
| ∣ ∣ ∪ ∣ | సలము (వి. ఇం.) | ∣ ∪ ∪ ∣ | యలము |

కరువిళంగాయ్ - నిరై + నిరై + నేర్ -

| | | | |
|---|---|---|---|
| ∣ ∣ ∣ ∣ ∪ | నవము (రు. చ) | ∣ ∪ ∣ ∪ ∪ | జగగము |
| ∣ ∣ ∣ ∣ ∣ | నలలము (రు. చ.) | ∣ ∪ ∣ ∪ ∣ | జగలము |
| ∣ ∪ ∣ ∣ ∪ | జలగము | ∣ ∣ ∣ ∪ ∪ | నగగము (రు. చ.) |
| ∣ ∪ ∣ ∣ ∣ | జలలము | ∣ ∣ ∣ ∪ ∣ | నగలము (రు. చ.) |

కూవిళంగాయ్ - నేర్ + నిరై + నేర్ -

| | | | |
|---|---|---|---|
| ∪ ∣ ∣ ∪ | భగురువు (రు. చ.) | ∪ ∣ ∪ ∪ | రగము (రు. చ.) |
| ∪ ∣ ∣ ∣ | భలము (రు. చ.) | ∪ ∣ ∪ ∣ | రలము (రు. చ.) |

ఈక్రిందివికూడా మూడుఛందోక్షరములు గలవే, వీటికుదను 'కని' అని చేరునుగనుక వీటికి 'కనిచ్చీర్' లనిపేరు. వీటికి 'వఞ్జియురిచ్చీర్' లేక 'వఞ్జిచ్చీర్' అనికూడా పేరున్నది.

తేమాంగని - నేర్ + నేర్ + నిరై -

| | | | |
|---|---|---|---|
| ∪ ∪ ∣ ∪ | తగము (రు. చ.) | ∪ ∪ ∣ ∣ | తలము (రు. చ.) |

* పైవాటికుదను 'విళమ్' అని ఉన్నది గనుక వీటికి 'విళచ్చీర్' లని పేరువచ్చినది.

పులిమాంగణి - నిరై + నేర్ + నిరై -

| | | | |
|---|---|---|---|
| I I U I U | సలగము (రు. చ.) | I U U I U | యలగము |
| I I U I I | సలలము (రు. చ.) | I U U I I | యలలము |

కరువిలంగణి - నిరెయ్ + నిరెయ్ + నిరెయ్ -

| | | | |
|---|---|---|---|
| I I I I I U | నలలగము | I U I U I U | జగలగము |
| I I I I I I | నలలలము | I U I U I I | జగలలము |
| I I I U I U | నగలగము | I U I I I U | జలలగము |
| I I I U I I | నగలలము | I U I I I I | జలలలము |

కూవిలంగణి - నేర్ + నిరై + నిరై —

| | | | |
|---|---|---|---|
| U I I I U | భలగము | U I U I U | రలగము |
| U I I I I | భలలము | U I U I I | రలలము |

iv. నాలుచ్చీర్ — ఇది 'వఞ్జి' పద్యములో నుపయోగపడుతుంది. వెణ్బాపద్యములో దీని నుప యోగింపరు. దీనిలో పదహారు భేదము లున్నవి. అవి తేమా, పులిమా, కరువిళమ్, కూవిళమ్ అనే పేళ్ళకు వరుసగా 'తణ్ణిటిల్, తణ్బూ, నఱుంబూ, నఱునిటిల్' అనేమాటలను చేర్చడమువల్ల ఈ పదహారింటికిన్ని పేళ్లేర్పడుతవి. ఇవన్నీ నాలుగు ఛందోక్షరములుగల 'శీర్'లు. వీటిప్రస్తారము:-

(1) తేమాతణ్ణిటిల్ - నేర్ + నేర్ + నేర్ + నిరై -

| | | | |
|---|---|---|---|
| U U U I U | మలగము | U U U I I | మలలము |

(2) తేమాతణ్బూ - నేర్ + నేర్ + నేర్ + నేర్ -

| | | | |
|---|---|---|---|
| U U U U | మగము (రు.) | U U U I | మలఘువు(రు. చ.) |

(3) తేమానఱుంబూ - నేర్ + నేర్ + నిరై + నేర్ -

| | | | |
|---|---|---|---|
| U U I U U | తగగము | U U I I U | తలగము |
| U U I U I | తగలము | U U I I I | తలలము |

(4) తేమానఱునిటిల్ - నేర్ + నేర్ + నిరై + నిరై -

| | | | |
|---|---|---|---|
| U U I U I U | తరము | U U I I I U | తసము |
| U U I U I I | తభము | U U I I I I | తనము |

(5) పులిమాతణ్ణిటిల్ - నిరై + నేర్ + నేర్ + నిరై -

| | | | |
|---|---|---|---|
| I U U U I U | యరము | I I U U I U | సరము |
| I U U U I I | యభము | I I U U I I | సభము |

(6) పులిమాతణ్బూ - నిరై + నేర్ + నేర్ + నేర్ -

| | | | |
|---|---|---|---|
| I U U U U | యగము | I I U U U | సగగము (రు.) |
| I U U U I | యగలము | I I U U I | సగలము (రు. చ.) |

(7) పుళిమానఱుమా - నిరై + నేర్ + నిరై + నేర్ -

I ∪ ∪ I ∪ ∪ యయము I ∪ ∪ I I ∪ యసము
I ∪ ∪ I ∪ I యజము I ∪ ∪ I I I యనము
I I ∪ I ∪ ∪ సయము I I ∪ I I ∪ ససము
I I ∪ I ∪ I సజము I I ∪ I I I సనము

(8) పుళిమానఱునిఴల్ - నిరై + నేర్ + నిరై + నిరై -

I ∪ ∪ I ∪ I ∪ యజగము I I ∪ I ∪ I ∪ సజగము
I ∪ ∪ I ∪ I I యజలము I I ∪ I ∪ I I సజలము
I ∪ ∪ I I I ∪ యనగము I I ∪ I I I ∪ సనగము
I ∪ ∪ I I I I యనలము I I ∪ I I I I సనలము

(9) కరువిళన్తణ్ణిఴల్ - నిరై + నిరై + నేర్ + నిరై -

I ∪ I ∪ ∪ I ∪ జతగము I I I ∪ ∪ I ∪ నతగము
I ∪ I ∪ ∪ I I జతలము I I I ∪ ∪ I I నతలము
I ∪ I I ∪ I ∪ జజగము I I I I ∪ I ∪ నజగము
I ∪ I I ∪ I I జజలము I I I I ∪ I I నజలము

(10) కరువిళన్తణ్బూ - నిరై + నిరై + నేర్ + నేర్ -

I ∪ I ∪ ∪ ∪ జమము I I I ∪ ∪ ∪ నమము
I ∪ I ∪ ∪ I జతము I I I ∪ ∪ I నతము
I ∪ I I ∪ ∪ జయము I I I I ∪ ∪ నయము
I ∪ I I ∪ I జజము I I I I ∪ I నజము

(11) కరువిళనఱుమ్బూ - నిరై + నిరై + నిరై + నేర్ -

I ∪ I ∪ I ∪ ∪ జరగము I I I ∪ I ∪ ∪ నరగము
I ∪ I ∪ I ∪ I జరలము I I I ∪ I ∪ I నరలము
I ∪ I I I ∪ ∪ జసగము I I I I I ∪ ∪ నసగము
I ∪ I I I ∪ I జసలము I I I I I ∪ I నసలము
I ∪ I ∪ I I ∪ జభగము I I I ∪ I I ∪ నభగము
I ∪ I ∪ I I I జభలము I I I ∪ I I I నభలము
I ∪ I I I I ∪ జనగము I I I I I I ∪ ననగము
I ∪ I I I I I జనలము I I I I I I I ననలము

(12) కరువిళమ్ నఱునిఱల్ - నిరై + నిరై + నిరై + నిరై -

| | | | |
|---|---|---|---|
| I U I U I U I U | జరలగము | I I I U I U I U | నరలగము |
| I U I U I U I I | జరలలము | I I I U I U I I | నరలలము |
| I U I I I U I U | జసలగము | I I I I I U I U | నసలగము |
| I U I I I U I I | జసలలము | I I I I I U I I | నసలలము |
| I U I U I I I U | జభలగము | I I I U I I I U | నభలగము |
| I U I U I I I I | జభలలము | I I I U I I I I | నభలలము |
| I U I I I I I U | జనలగము | I I I I I I I U | ననలగము |
| I U I I I I I I | జనలలము | I I I I I I I I | ననలలము |

(13) కూవిళమ్‌తణ్ణిఱల్ - సేర్ + నిరై + సేర్ + నిరై -

| | | | |
|---|---|---|---|
| U I U U I U | రరము | U I I U I U | భరము |
| U I U U I I | రభము | U I I U I I | భభము |

(14) కూవిళమ్‌తణ్‌బూ - సేర్ + నిరై + సేర్ + సేర్ -

| | | | |
|---|---|---|---|
| U I U U U | రగగము | U I I U U | భగగము |
| U I U U I | రగలము | U I I U I | భగలము |

(15) కూవిళమ్‌నఱుమ్‌బూ - సేర్ + నిరై + నిరై + సేర్ -

| | | | |
|---|---|---|---|
| U I U I U U | రయము | U I I I U U | భయము |
| U I U I U I | రజము | U I I I U I | భజము |
| U I U I I | రసము | U I I ) I U | భసము |
| U I U I I I | రనము | U I I I I I | భనము |

(16) కూవిళమ్‌నఱునిఱల్ - సేర్ + నిరై + నిరై + నిరై -

| | | | |
|---|---|---|---|
| U I U I U I U | రజగము | U I I I U I U | భజగము |
| U I U I U I I | రజలము | U I I I U I I | భజలము |
| U I U I I I U | రనగము | U I I I I I U | భనగము |
| U I U I I I I | రనలము | U I I I I I I | భనలము |

౬. ఇంతవరకున్ను 'అసై, శీర్' లనుగురించి చెప్పబడినది. ఇవిగాక తమిళ్‌ఛందస్సులో తెలుసుకోవలసినవి ఎళుత్తు, తళై, అడి, తొడై, అనేవి. ఎళుత్తులు మొదలెళుత్తు (అచ్చులు, హల్లులు), శార్పెళుత్తు ( ఆయుధమ్ ం, దుర్రితము ) అని రెండువిధములు.

'తళై' అనగా సేర్‌నిరైల కూడిక. 'సేర్' 'సేర్' తోను, 'నిరై' 'నిరై' తోనుపొందిఉంటుంది. 'సేర్' 'నిరై' తోగాని, 'నిరై' 'సేర్' తోగాని పొందిఉండదు. ఈ 'తళై' అనేది ఏడు విధములుగా ఉంటుంది.

(1) నేరొన్ఱాశిరియత్తళై - మా [తేమా, పులిమా] + నేర్ ; లేదా, నాళ్ + నేర్.

(2) నిరైయొన్ఱాశిరియత్తళై - విళ [కరువిళ, కూవిళ] + నిరై ; లేదా, మలర్ + నిరై.

(3) వెణ్శీర్ వెణ్డళై - కాయ్ [ తేమాంగాయ్, పులిమాంగాయ్, కరువిళంగాయ్, కూవిళంగాయ్ ] + నేర్ ; లేదా, పూ [ తణ్పూ, నఱుంబూ ] + నేర్.

(4) ఇయ్యర్చీర్ వెణ్డళై - మా + నిరై ; లేదా, విళ + నేర్;—లేదా, నాళ్ + నిరై; లేదా, మలర్ + నేర్.

(5) ఒన్ఱియవఞ్జిత్తళై - కని + నిరై ; లేదా, నిఴల్ + నిరై.

(6) ఒన్ఱావఞ్జిత్తళై - కని + నేర్ ; లేదా, నిఴల్ + నేర్.

(7) కలిత్తళై - కాయ్ + నిరై ; లేదా, పూ + నిరై.

౭. 'అడి' అనగా పద్యపాదము, పాదములో ఒకటిగాని అనేకములుగాని 'తళై' లు వస్తవి. 'అడి' అయిదువిధములుగా ఉంటుంది: రెండు 'శీర్' లు గలది 'కుఱళడి', ; మూడుశీర్లు గలది 'సిందడి' ; నాలుగుశీర్లు గలది 'అళవడి' ఐదుశీర్లు గలది 'నెడిలడి' ; ఆరుశీర్లుగలది 'కళినెడిలడి.'

౮. 'తొడై' అనేదానికి 'అనుప్రాసము, మైత్రి' అని అర్థములు చెప్పవచ్చును. (సెయ్యుళుకు ఉప్పినొన్ఱు.) దీనిలో అయిదుభేదము లున్నవి ; ఈ అయిదింటిలో ఒకొక్కదానిలో తిరిగి ఎనిమిదేసి భేదములచొప్పున మొత్తము నలభై, మరిమూడు చేరి నలభైమూడు భేదములను లాక్షణికులు తెలిపినారు. వాటి నీక్రింద వివరిస్తున్నాను.

I. మోనై ; మోనైత్తొడై:— పాదములలోని మొదటిఅక్షరములు మైత్రి కలిగి ఉండడము. దీనిలోని అంతర్భేదములు:—

(1) అడిమోనై, లేక, ముదల్మోనై:—పాదములోని శీర్ల అన్నిటి మొదటి అక్షరములున్ను మైత్రి కలిగి ఉండడము.

(2) ఇణైమోనై:—ప్రతిపాదములోని మొదటిరెండుశీర్ల మొదటి అక్షరములు మాత్రము మైత్రి కలిగి ఉండము.

(3) పొఴిప్పుమోనై:-మొదటిశీర్, మూడోశీర్ల మొదటి అక్షరములు తమలోతామున్ను రెండోశీర్, నాలుగోశీర్ల మొదటి అక్షరములున్ను తమలోతాము మైత్రి కలిగి ఉండడము.

(4) ఒరూఉమోనై:- మొదటిశీర్, నాలుగోశీర్ల మొదటి అక్షరములు మైత్రి కలిగి ఉండడము.

(5) కూఴైమోనై:-తుదిశీర్ తప్ప, తక్కిన అన్నిశీర్ల మొదటి అక్షరములున్ను మైత్రి కలిగి ఉండడము.

(6) మేల్గదువాయ్మోనై:-రెండోశీర్ తప్ప, తక్కిన అన్నిశీర్ల మొదటి అక్షరములున్ను మైత్రి కలిగి ఉండడము.

(7) కీల్క్కదువాయ్మోనై:-తుదిశీర్కు వెనుకశీర్ తప్ప, తక్కిన అన్నిశీర్ల మొదటి అక్షరములున్ను మైత్రి కలిగి ఉండడము.

(8) ముట్రుమోనై: అన్నిశీర్ల మొదటి అక్షరములున్ను మైత్రి కలిగి ఉండడము.

II. ఇయైపు; ఇయైపుత్తొడై :- పాదములలోని తుదిశీర్లుగాని అక్షరములుగాని మైత్రి కలిగి ఉండడము. దీనిలోని అంతర్భేదములు :-

[1] అడి ఇయైపు; మదలియైపు - ప్రతిపాదములోని మొదటిశీర్ తుదిఅక్షరముల మైత్రి.

[2] ఇణైయియైపు - ప్రతిపాదములో మొదటిరెండుశీర్ల తుదిఅక్షరముల మైత్రి.

[3] పొళిప్పియైపు - ఒకటి విడిచి ఒకటిగా శీర్ల తుదినుండే అక్షరముల మైత్రి.

[4] ఒరూఉవియైపు - మొదటిశీర్ నాలుగోశీర్ల తుదిఅక్షరముల మైత్రి.

[5] కూళైయియైపు - తుదిశీర్ తప్ప, తక్కినశీర్ల తుదిఅక్షరముల మైత్రి.

[6] మేల్ కదువాయియైపు - రెండోశీర్ తప్ప, తక్కినశీర్ల తుదిఅక్షరముల మైత్రి.

[7] కీల్ క్కదువాయియైపు - తుదిశీర్ కు వెనుకశీర్ తప్ప, తక్కిన శీర్లతుదిఅక్షరముల మైత్రి.

[8] ముట్రియైపు - అన్నిశీర్లలోని తుదియక్షరముల మైత్రి.

* ఞ, ణ, న, మ, న్, య, ర, ల, వ, ఴ, ళ, లతో పద్యములంత ముందేటట్లు రచించడానికి కూడా 'ఇయైపు' అనిపేరున్నది.

III. ఎదుగై; ఎదుగైత్తొడై - పద్యమందలి ప్రతిపాదములోని రెండో అక్షరములు పొందికకలిగి ఉండడము. దీనిలోని అంతర్భేదములు :-

[1] అడియెదుగై; మదలెదుగై- అన్నిపాదములలోని మొదటిశీర్ లోని రెండోఅక్షరము పొందిక కలిగిఉండడము.

[2] ఇణైయెదుగై - అన్నిపాదములలోని మొదటిరెండుశీర్లలోని రెండోఅక్షరములుపొందికకలిగి ఉండడము.

[3] పొళిప్పెదుగై - అన్నిపాదములలోని శీర్లలో ఒకటివిడిచి ఒకదాని రెండోఅక్షరములు పొందికకలిగి ఉండడము.

[4] ఒరూఉవెదుగై - అన్నిపాదములలోని మొదటి, నాలుగోశీర్లలోని రెండోఅక్షరములు పొందికకలిగి ఉండడము.

[5] కూళైయెదుగై - అన్నిపాదములలోని తుదిశీర్ తప్ప, తక్కినశీర్ల రెండోఅక్షరములు పొందికకలిగిఉండడము.

[6] మేల్ కదువాయెదుగై: అన్నిపాదములలోని రెండోశీర్ తప్ప, తక్కినశీర్ల రెండో అక్షరములు పొందికకలిగి ఉండడము.

[7] కీల్ క్కదువాయెదుగై: అన్నిపాదములలోని తుదిశీర్ కువెనుకశీర్ తప్ప, తక్కినశీర్ల రెండో అక్షరములు పొందికకలిగి ఉండడము.

[8] ముట్రెదుగై: అన్నిపాదములలోని అన్నిశీర్ల రెండో అక్షరములు పొందికకలిగి ఉండడము.

* ఎదుగైలో మరికొన్ని భేదములుకూడా ఉన్నవి:

[1] తలైయాగెదుగై:-పద్యములోని ప్రతిపాదములోని మొదటిశీర్ మొదటి అక్షరముతప్ప, అన్ని పాదములలోని తక్కిన అన్ని అక్షరములున్ను పొందికగలిగి ఉండడము.

[2] ఇడైయాగెదుగై:- పైదానికంటెవేకాని, పాదములలోని అక్షరములు ఒకటివిడిచి ఒకటిగా పొందికగలిగి ఉంటవి.

[3] కడైయాగెదుగై - పైరెండు విధములుగాక తక్కిన ఎట్టిపొందిక అయినా కడైయాగెదుగై అవుతుంది.

[4] ఆశెదుగై - మొదటిపాదము మొదటిఅక్షరముతరువాత య, ర, ల, ళ, అనే అక్షరము లుంటే, వాటిని తక్కిన ఎదుగైస్థానములలో కావలసినప్పుడు విడిచివేయవచ్చును. అట్టిదానికి 'ఆశెదుగై' అనిపేరు.

[5] వటియెదుగై - మొదటిరెండుపాదములలోని, ఒకప్పుడు మొదటి మూడుపాదములలోని, రెండో, మూడో అక్షరములపొందిక.

[6] నెడిలెదుగై - దీర్ఘాచ్చులతోకూడిన ఏహల్లులైనా ఎదుగైకు చెల్లుతవి. అట్టిది నెడిలెదుగై అనిపించుకొంటుంది. ఉదా. ఆవా...కూకూ...మామా...ఏగీర్...

[7] ఇనవెదుగై - పద్యములో ఒకేవర్గమునకుచెందిన హల్లులపొందిక. ఇది మూడువిధములు -

(i) వల్లినవెదుగై - క, చ, ట, త, ప, ఱ, లు తమలో తాము పొందిఉండడము.

(ii) మెల్లినవెదుగై - ఙ, ఞ, ణ, న, మ, న్, లు తమలో తాము పొందిఉండడము.

(iii) ఇడైయినవెదుగై - య, ర, ల, వ, ళ, ఴ, లు తమలో తాము పొందిఉండడము.

IV. <u>మురణ్ ; మురణ్ దొడై</u> - పరస్పరమువిరోధము గలమాటలతో పద్యము చెప్పడము ;

ఉదా : ఇరుళ్ పఱన్దన్న మానీర్ మరుఙ్గిన్
నిలవుగువిన్దన్న వెణ్ మణ లొరుశిరై.

(విస్తరించిఉన్న చీకటివలె నల్లగాఉన్న నీటిప్రక్క, వెన్నెలపోగులు పడిఉన్నదో అన్నట్లు తెల్లనిఇసుక కనబడినది.)

దీనిలోని అంతర్భేదములు :-

[1] అడిమురణ్ ; ముదన్ మురణ్ - పాదములలోని మొదటిశీర్లకు విరోధము.

[2] ఇణైమురణ్ - ప్రతిపాదములోని మొదటిరెండుశీర్లకు విరోధము.

[3] పొటిప్పుమురణ్ - పాదములలోని ఒకటివిడిచిఒకటిగాగల శీర్లకు విరోధము.

[4] ఒరూఉమురణ్ - పాదములలోని మొదటి, నాలుగో శీర్లకు విరోధము.

[5] కూళైమురణ్ - పాదములలోని తుదిశీర్తప్ప, తక్కినఅన్నిశీర్లకును విరోధము.

[6] మేల్ గదువాయ్మురణ్ - పాదములలోని రెండోశీర్తప్ప, తక్కిన అన్నిశీర్లకును విరోధము.

[7] కీళ్ క్కదువాయ్ మురణ్ - పాదములలోని తుదిదానివెనుకశీర్ తప్ప, తక్కిన అన్నిశీర్ లకును విరోధము.

[8] ముట్రుమురణ్ - అన్నిపాదములలోని అన్నిశీర్ లకున్న విరోధము.

V. <u>అళపెడైత్తొడై</u> - పద్యములోని గణములకోసము అక్షరములను పొడుగించడము :-

[ అక్షరములను రెండువిధములుగా పొడుగించవచ్చును ; (1) ఉయిరళపెడై - పదము ఆదియందుగాని, మధ్యగాని, అంతమందుగాని ఒకదీర్ఘాక్షరమునకు హ్రస్వాచ్చును చేర్చడము : ఉదా. ఈఱై - ఈఇఱై ; పడాఱై - పడాఅఱై ; కుటు - కుటుఉ ; మొద. దీనిలో i. ఇయఱ్కైయళపెడై, ii. శెయఱ్కైయళపెడై, అని రెండుభేదములున్నవి. (2) ఒట్రళపెడై - ఒకటో రెండో హ్రస్వాక్షరములతరువాత పదమధ్యమందుగాని, పదాంతమందుగాని వచ్చే ఙ్. ఞ్, ణ్, న్, మ్, న్, వ్, య్, ల్, ళ్, ం (ఆయ్దమ్,) లకు ద్విత్వము కల్పించడము : ఉదా. అరఙ్ ఙ్ గమ్ ; మురఞ్ ఞ్ జు ; మణ్ ణ్ ణు ; అమ్ మ్ బు ; కొళ్ ళ్ గ ; విల ం ం కి ; మొ. ]

' అళపెడై ' లోని అంతర్భేదములు -

[1] అడియళపెడై ; ముదలళపెడై - ప్రతిపాదములోని మొదటిశీర్ లో అళపెడై చేర్చడము.

[2] ఇణైయళపెడై - ప్రతిపాదములోని మొదటిరెండు శీర్ లలోను అళపెడై చేర్చడము.

[3] పొళిప్పళపెడై - ప్రతిపాదములోను ఒకటివిడిచిఒకటిగాగల శీర్లలో అళపెడై చేర్చడము.

[4] ఒరూఉవళపెడై - ప్రతిపాదములోను ఒకటో, నాలుగోశీర్లలో అళపెడై చేర్చడము.

[5] కూళైయళపెడై - ప్రతిపాదములోను తుదిశీర్ తప్ప, తక్కిన అన్నిశీర్లలో అళపెడై చేర్చడము.

[6] మేల్ కదువాయళపెడై - ప్రతిపాదములోను రెండోశీర్ లోతప్ప తక్కినఅన్నిశీర్లలోను అళపెడై చేర్చడము.

[7] కీళ్ క్కదువాయళపెడై - ప్రతిపాదములోను తుదిశీర్ కువెనుకశీర్ లోతప్ప తక్కిన అన్ని శీర్లలోను అళపెడై చేర్చడము.

[8] ముట్రళపెడై - అన్నిపాదముల అన్నిశీర్లలోను అళపెడై చేర్చడము.

ఇక్కడకు తొడైలో నలభై భేదములయినవి. ఇవిగాక మరిమూడున్నవి.

VI. <u>అన్దాది; అన్దాదిత్తొడై</u> - ఒకపద్యములోని తుట్టతుది అక్షరముగాని మాటగాని, మాటలుగాని, తరువాతిపద్యము మొదట తిరిగిరావడము.

VII. <u>ఇరట్టైత్తొడై</u> - ఒకటేఅక్షరముగాని, మాటగాని ప్రతిపద్యపాదములోనిశీర్లలో పదేపదే రావడము.

VIII. <u>సెన్దొడై</u>- (మోనైముదలియఒల్లాదతొడై) - ఎట్టిప్రాసముగాని మైత్రిగాని అక్కరలేనిది.

౫. తమిళములో పద్యమునకు 'పా' అనిపేరు. దీనిలో (1) వెణ్బా (2) అగవల్పా, లేక ఆశిరియప్పా (3) కలిప్పా (4) వఞ్జిప్పా (5) మరుప్పా, అని అయిదు భేదము లున్నవి. ఈ భేదము లొక్కొక్క-తుఱై, తాళిశై, విరుత్తమ్, అని తిరిగి మూడు భేదము లున్నవి.

1. వెణ్బా :— నాలుగుపాదములు ; మొదటిమూడుపాదములలోను నాలుగేసి శీర్లు. మా, విళ, కాయ్, చ్చీర్లనుమాత్రము వాడవలెను ; కాయ్ + నేర్, మా + నిరై, విళ + నేర్, అనే వెణ్డళై లనుమాత్రము వాడవలెను. తక్కిన శీర్లు, తళైలు రాకూడదు. ఈపద్యముతుదను నాళ్, మలర్ లుగాని, కాశు, పిఱప్పులుగాని తప్పక రావలెను. నాలుగుపాదములలోను ఒక్కటే ఎదుగై రావచ్చును; లేదా మొదటిరెండుపాదములకు ఒకఎదుగై, తక్కినరెండింటికి ఒకఎదుగై రావచ్చును.

వెణ్బా అయిదువిధములుగా ఉంటుంది : (1) కుఱళ్ వెణ్బా (రెండేపాదములు) ; (2) శిన్దియల్ వెణ్బా (మూడుపాదములు) ; నేరిశై వెణ్బా (నాలుగుపాదములు ; రెండోపాదములోని తుదిశీరు ఏకపదముగా ఉండవలెను ; ఈ ఆపాదములోని మొదటిరెండుశీర్లు ఎదుగైనే కలిగిఉండవలెను.) (3) ఇన్నిశై వెణ్బా (నాలుగుపాదములు ; కాని, నేరిశై వెణ్బాకు గల ప్రత్యేకనియమము దీనికి లేదు. దీనితుదను తనిచ్చొల్ (సంబంధపదము) ఉన్నా, దాని ఎదుగ యున్నా మొదటిరెండుశీర్ల ఎదుగైయున్నా ఒక్కటేఅయిఉంటవి. నాలుగుపాదములలోను ఎదుగై ఒక్కటిగాఉండకపోయినా, ఆపద్యమునకు ఇన్నిశై వెణ్బా అని పేరుంటుంది.

(4) పఃఱొడై వెణ్బా :— అయిదునుంచి పన్నెండుపాదములవరకు గల వెణ్బా.

(5) కలివెణ్బా :— పన్నెండుకంటె ఎక్కువపాదములుగల వెణ్బా.

II. ఆశిరియప్పా, లేక, అగవల్పా :— దీనిలో సాధారణముగా రెండేసిఅశైలుగల శీర్లుంటవి. ఇట్టిశీర్లు పాదమునకు ౪ యుండవలెను ; అనగా పాదము కడినెడిలడి గా ఉండవలెను.

నేరిశై ఆశిరియప్పాలో తుదిపాదమునకు వెనుకపాదములో మూడుశీర్లును, తక్కినపాదములలో నాలుగేసిశీర్లున్ను ఉంటవి.

నిలైమణ్డిలఆశిరియప్పాలో అన్నిపాదములలోను నాలుగేసిశీర్లుంటవి.

ఆశిరియవిరుత్తములో మొదటిపాదములో వరుసగా ఏశీర్లుంటవో, తక్కినపాదములలోకూడా వరుసగా అవేశీర్లు రావలెను.

III. కలిప్పా :— పాదమునకు నాలుగుశీర్లు ; అవి సాధారణముగా కాయ్‌చ్చీర్లు.

(1) తరవుకొచ్చకక్కలిప్పా : దీనిపాదములలో కాయ్‌చ్చీర్లు ఇటువంటివిగా ఉండవలెననే నియమములేదు.

(2) కలివిరుత్తమ్ :— మొదటిపాదములో వరుసగా వచ్చే నాలుగుశీర్లే వరుసగా తక్కిన పాదములలోను వస్తవి.

(3) కలిత్తుఱై :— మొదటిపాదములో వరుసగావచ్చే అయిదుశీర్లే తక్కినపాదములలోను వరుసగారావలెను.

(4) కట్టళైకలిత్తుఱై :— అయిదేసిశీర్లుగల నాలుగుపాదములు; మొదటినాలుగుశీర్లున్ను ఈ రశ్శైచ్చీర్లగాను, అయిదోది విళంగాయ్చ్చీర్ గాను ఉండవలెను. ప్రతిపాదములోను ఒకటేరీతి వెణ్డళై రావలెను. పాదాదిని నేరశై వస్తే, ప్రతిపాదములోను ఒట్రుకాక 16 అక్షరములు రావలెను. పాదాదిని రైఅశై వస్తే, ప్రతిపాదములోను 17 అక్షరము లుండవలెను; తుదిఅక్షరము ‘ ఏ ’ అయి ఉండవలెను.

VI. వఞ్జిప్పా :— ఒకొక్కపాదములో రెండుగాని, మూడుగాని శీర్లుండవచ్చును. వఞ్జివిరుత్తములో మూడేసిశీర్లుగల నాలుగుపాదములు. వఞ్జిత్తుఱైలో రెండేసిశీర్లుగల నాలుగుపాదములు.

V. మరుప్పా :— ఈ పద్యములో మొదట వెణ్బాపాదములురెండున్ను, తరువాత ఎన్నయినా ఆశిరియప్పాపాదములున్ను వస్తవి.

ఀ

## ఆంధ్రకర్ణాటకచ్ఛందస్సులు

౧. ఆంధ్రకర్ణాటకభాషలచందస్సు సాధారణముగా ఒక్కరీతిగాఉండడముచేత ఆ రెండింటిని ఇచ్చట చేర్చిచెప్పుతున్నాను. ఆయాఛందస్సుల పేర్లలోగాని లక్షణములోగాని భేదములుంటే చెప్పుతాను.

౨. సంస్కృతమాత్రాచ్ఛందములు కొన్ని ఆంధ్రకర్ణాటకచ్ఛందములలోకూడా ఉన్నవి కాని, వీటిలో కొన్ని విశేషనియమము లేర్పడినవి.

(1) సంస్కృతములోని వైతాలీయకు బేసిపాదములలో 14 మాత్రలు, సరిపాదములలో 16 మాత్రలు, పాదములఅంతమందు రగణము ఉండవలెను. కన్నడ వైతాళికలో పాదములకు మాత్రలట్లేకాని, నియమము బేసిపాదములలో 6 మాత్రలు, రగణము, లగము అనిన్ని, సరిపాదములలో 8 మాత్రలు, రగణము, లగము అనియేర్పడినవి. సంస్కృతవైతాలీయపాదములకు ఒకగురువుచేరుస్తే ఎట్లు ఔపచ్ఛందసకమనే వైతాలీయభేద మేర్పడుతుందో, అట్లే కన్నడవైతాళికకు ఒకగురువు చేరుస్తేకన్నడఔపచ్ఛందసిక మేర్పడుతుంది. సంస్కృతములో ఆపాతలిక, ప్రాచ్యవృత్తి ఉదీచ్యవృత్తి, ప్రవృత్తకము, చారుహాసినీ, అపరాంతిక, అనే మరికొన్ని వైతాలీయభేదము లున్నవి. కన్నడ ఛందస్సులో వాటిని చెప్పలేదు.

తెనుగులో అప్పకవి ‘ వైతాలీయ ’ ఔపచ్ఛందసకములు అనేపద్యములకు లక్షణము కన్నడ వైతాళిక, ఔపచ్ఛందసికములకువలె చెప్పినాడు. సంస్కృతములోచెప్పిన ప్రవర్తక (ప్రవృత్తక !), ఆపాతలిక, పరాంతిక (అపరాంతిక !), చారుహాసిక(ని), ప్రాచ్యవృత్తి, ఉదీచ్యవృత్తులనుకూడా అప్పకవి ఉదాహరించినాడు. కాని, సంస్కృతములో వైతాలీయపాదముతుదిని గగముంటే ఆపాతలిక అవుతుందనిఉంటే, అప్పకవి భ, గగము లుండవలెనన్నాడు. పాదములలో అయిదోలఘువు దానికి పూర్వమందున్న అక్షరముతోకలసి ఏకపాదమం దుంటే అది ప్రాచ్యవృత్తి అవుతుందని సంస్కృత

ప్రాచ్యవృత్తిలక్షణము ; సరిపాదములలో ఏడోమాత్రమీద, తొమ్మిదోమాత్రమీద విశ్రాంతిఉండి, సరిపాదాలలో అట్టివిశ్రాంతి లేకపోతే ప్రాచ్యవృత్తి అని అప్పకవి చెప్పినాడు. బేసిపాదములలో మూడోమాత్ర దానిపూర్వపుమాత్రతో కలసి యేకపదమందుంటే ఉదీచ్యవృత్తిఅని సంస్కృతలక్షణము; అప్పకవి దక్షిణాంతిక అనే ఒక పేరుకల్పించి దానివలె నడిచే పాదములుగలది ఉదీచ్యవృత్తిఅన్నాడు. దక్షిణాంతికకు బేసిపాదములలో స, స, జగములున్ను, సరిపాదములలో స, భ, ర, లలును ఉంటు వనిన్ని, విరతులు బేసిపాదములలో ఏడింటను, సరిపాదములలో తొమ్మిదింటను ఉండునని అప్పకవి లక్షణము.

(2) కన్నడములో జాతిగాదె అనే ఒకఛందస్సుకు లక్షణముగా అనుష్టుప్శ్లోకపాదములు మూడుంటవని చెప్పబడినది. ప్రాకృతచ్ఛందస్సులోని గాథాలక్షణమున కిది సరిపోదు. తెనుగుఛందస్సులో గాథాలక్షణమే స్మరింపబడలేదు. ఈగాథ సంస్కృతములోకూడా లేదు. జైనులు ప్రాకృతిచ్ఛందస్సును తమకావ్యములలో విరివిగావాడినారు. కన్నడములో జైనవాఙ్మయము మెక్కువగాఉన్నట్లు తొల్లింటికావ్యములవల్ల తెలియవస్తున్నది. కన్నడములోకూడా గాథాఛందస్సుకు ప్రచార మంతగా లేకపోయినా, నాగవర్మ ఆ సంప్రదాయమననుసరించి గాథను స్మరించినాడు ; కాని, దానిలక్షణమును సరిగాచెప్పలేదు. తెనుగులోకూడా నన్నయకుపూర్వము జైనవాఙ్మయమున్నప్పుడు గాథ మిక్కిలిప్రచారములో ఉండిఉంటుంది. ఈ జైనచ్ఛందస్సును నిగ్గిస్తూ పాల్కురికి సోమనాథుడు "గాసటబీసటే చదువు - గాథలు త్రివ్వ తెనుంగునా" అని చెప్పినాడు.

(3) సంస్కృతచ్ఛందస్సులోచెప్పిన మాత్రాసమకములలో చిత్ర, ఉపచిత్ర, చిత్రలత, అనే వాటిని కన్నడమాత్రాచ్ఛందస్సులుగా నాగవర్మ వివరించినాడు ; కాని ఇవి కన్నడములో మూడు పాదములు గలవి. సంస్కృతములో చిత్ర, ఉపచిత్రలు నాలుగుపాదములుగలవి. కన్నడచిత్ర, ఉపచిత్ర, చిత్రలతలు కన్నడత్రిపదిమీద ఆధారపడిఉన్నవి. కన్నడత్రిపదిలో మొదటిపాదములో అయిదేసిమాత్రలగణములు నాలుగున్ను, రెండో, మూడోపాదములలో రెండేసిగణములు బ్రహ్మగణములున్ను ఉంటవి. మొదటిపాదమునకు 20 మాత్రలు, రెండోపాదమునకు 17 మాత్రలు, మూడోపాదమునకు 13 మాత్రలు ఉంటవి. తక్కినగణములు ఆయాపాదముల మాత్రాసంఖ్యకు సరిపోయేటట్లు చెప్పుకోవలెను. ప్రతిపాదములోను త్రిపదిలోని ఆరో, పదో స్థానములలో రుద్రగణముతో బ్రహ్మగణముకూడి, తక్కినవి విష్ణుగణము లయితే చిత్ర అవుతుంది. ఉపచిత్ర, చిత్రలతల లక్షణమునుగురించి అనేకపాఠభేదము లుండడముచేత దాని లక్షణమును సరిగానిర్వచింప వీలులేకున్నది.

తెనుగులో అప్పకవి ఉపచిత్రను నాలుగుపాదములుగలదిగా చెప్పినాడుగాని మాత్రాసమకముగా చెప్పలేదు ; దానిని అర్ధసమముగా చెప్పినాడు :- 1, 3 పాదములలో మూడు సగణములు ఒకవగణము, 2, 4, పాదములలో మూడుభగణములు ఒక గగము.

(4) ఆర్యాజాతిలోచేరిన ఛందస్సులను కన్నడతెనుగులాక్షణికులుకూడా వివరించినారు. సంస్కృతప్రాకృతార్యలకున్ను కన్నడము, తెలుగుఆర్యలకున్ను లక్షణమెక్కుడే కాని, తెనుగు

కన్నడములలో మొదటిపాదము గుర్వాదిఅయితే తక్కినపాదములున్ను గుర్వాదులుగాను, లఘ్వాదిఅయితే తక్కినపాదములున్ను లఘ్వాదులుగాను ఉండవలెననే నియమమున్నది. ఆర్యలలో సంస్కృతములో ఆర్యాగీతిఅనిన్ని, ప్రాకృతములో ఖందనీ అనిన్ని చెప్పగలది మాత్రము తెనుగు కన్నడములలో కందమనేపేరుతో ఎక్కువప్రచారములో ఉన్నది; తక్కినవి కేవలము లక్షణగ్రంథ స్థితములు. అప్పకవి పథ్య, విపుల, చపల, ముఖచపల, జఘనచపలలను కందభేదములుగా వివరించినాడుగాని అతడిచ్చిన లక్ష్యలక్షణములు ఆయాఆర్యలకు తగిఉన్నవికాని, కందములకుకాదు. కన్నడములో సంకీర్ణకమనే ఒకఆర్యాభేదము చెప్పబడినది. దీనిపూర్వార్థము కందలక్షణమును అపరార్ధము ఆర్యాలక్షణమును కలిగిఉన్నది. ఇది సంస్కృతప్రాకృతాంధ్రములలో చెప్పబడలేదు.

(౫) నాగవర్మ కన్నడములో మందానిల, లలి, ఉత్సర (ఉత్సాహ) అని మూడువిధములరగడలు చెప్పినాడు. ఇవి మాత్రాగణాత్మకములు. ఇవి తాళమునకు సరిపోతవి. ఒక్కొకపాదములో లలితకు 20 మాత్రలు, మందానిలకు 16 మాత్రలు, ఉత్సాహకు 24 మాత్రలు ఉంటవి. వీటిలో మందానిలము తెనుగులోని మధురగతిరగడకున్ను, లలిత ద్విరదగతిరగడకున్ను, ఉత్సాహమునకున్ను సరిపోతవి.

అప్పకవి రగడలు వైతాళీయభేదములన్నాడు; కాని, ఈమాటకు సంస్కృతచ్ఛందస్సులో ఆధారములేదు. అప్పకవి (1) హయప్రచారము (2) తురగవల్గనము (3) విజయమంగళము (4) ద్విరదగతి (5) విజయభద్రము (6) మధురగతి (7) హరిగతి (8) హరిణగతి (9) వృషభగతి, అని తొమ్మిది విధములరగడలను వివరించినాడు. ఉత్సాహమును ప్రత్యేకముగాచెప్పినాడు.

నాగవర్మ మందానిల, లలిత, రగడలకు పాదమాత్రాసంఖ్యమాత్రము చెప్పి ఊరకొన్నాడు. అప్పకవి వాటికిసరిపోయిన మధురగతికి ఒక్కొకపాదమునకు నాలుగేసిమాత్రలగణములు నాలుగనిన్ని ఆగణములలో జగణము చేరదనిన్ని, ద్విరదగతిరగడకు పాదమునకు అయిదేసిమాత్రల నాలుగుగణములనిన్ని చెప్పినాడు.

అప్పకవిచెప్పిన తక్కిన రగడలలో పాదమునకు హయప్రచారమునకు నాలుగుసూర్యగణములు; హరిగతికిన్ని మధురగతికిన్ని లక్షణములో భేదముకానరాదు. మధురగతికి జగణముతప్ప నాలుగుమాత్రల గణములు నాలుగన్నాడు; హరిగతికి నల, స, భ, గగములలో నేవయినా నాలుగన్నాడు; ఇవే జగణముగాక మిగిలిన నాలుగుమాత్రలగణములు.

హరిణగతికి 14 మాత్రలని మాత్రము అప్పకవి చెప్పినాడు. అతడు చూపినలక్ష్యమునుబట్టి జగణముకాని నాలుగుమాత్రలగణము, ఒకసూర్యగణము, అట్లే తక్కినఅర్ధమును అయినట్లు చెప్పవలసి ఉంటుంది.

వృషభగతికి పాదమునకు 28 మాత్రలని అప్పకవిచెప్పిన ఉదాహరణమును బట్టి జగణముకాని నాలుగుమాత్రలగణములు మూడున్ను ఒకలలమున్ను ఒకపాదమునకని చెప్పవలెను.

మిగిలినవాటిలో తురగవల్గనము రెండుహయప్రచారములు చేరిన్ని, విజయమంగళము నాలుగుహయప్రచారములు చేరిన్ని కలుగుతున్నవి. విజయభద్రము ద్విరదగతిని రెట్టింపగా కలుగుతున్నది.

కవిజనాశ్రయములో రగడలనుగురించి చెప్పలేదు. అనంతుడుచెప్పిన వృషభగమన, హరిణగతి రగడ లకున్ను, అప్పకవి చెప్పిన వాటికిన్ని నడకలో భేదమున్నది. చూడండి :-

వృషభగతి.

అప్పకవి : ఇరువదియెనిమిదిలఘువులు పది - యేనిట విశ్రాంతియుఁ గూర్చిన

అనంతుడు : శ్రీమనోహర వంబుజోదరుఁ - జిత్తజాతగురుం దలంచెద.

హరిణగతి.

అప్పకవి : నరహరి పదియు - నాలుగు లములు

అనంతుడు : శ్రీనివాసు భ - జింతు నేనని.

రగడలలో కన్నడమునచెప్పబడిన ఉత్సాహము తెనుగునలేదు ; కన్నడములో దీనిపాదమునకు మూడుమాత్రలుగల 8 గణములు చెప్పబడినవి. దేశియమాత్రాగణచ్ఛందములలో కన్నడమున మరి ఒకఉత్సాహము చెప్పబడినది. దీనికిన్ని తెనుగు ఉత్సాహమునకున్ను లక్షణ మొక్కటే.

(6) సీసపద్యలక్షణము కన్నడములో పాదమునకు వరుసగా అయిదుమాత్రలగణములు ఆరున్ను, మూడుమాత్రలగణములు ( లగముతప్ప ) రెండున్ను ఉంటవి. అట్టివి నాలుగుపాదములు. దీని కొక ఆటగీతెను చేరుస్తారు. తెనుగుసీసపద్యములో ఆ రింద్రగణములున్ను, రెండుసూర్యగణములున్ను గల పాదములు చెప్పబడ్డవి. అనగా కన్నడపాదములలోని గణములలో తెనుగులోఉండే నల, భ, స, అనేవి ఉండవు ; నగ, ర, త, లు మాత్ర ముంటవి.

కన్నడములో సీసపద్యమునకు ప్రచారములేదు. తెనుగుకవులు దాని ననేకవిధములుగా వాడు కొన్నారు. తెనుగులాక్షణికులు దాని కనేకభేదములను కల్పించినారు.

తెనుగులోని సీసపద్యభేదములనుగూర్చినవిచారమును మ. రా. శ్రీ. గిడుగు వేంకటసీతాపతిగారు వావిళ్ళవారు ప్రచురించిన అనంతునిఛంధము ఉపోద్ఘాతములో (పుటలు 37-42) చక్కగాచేసినారు. చర్వితచర్వణముగా ఇక్కడ ఆవిచారము తిరిగిచేయనక్కరలేదు. పాఠకులు ఆ ఉపోద్ఘాతమును చూడవలెను.

(7) ఆటగీతిలక్షణమును కిట్టెల మొదటిపాదములో నాలుగుసూర్యగణములు, ఒక చతుర్మాత్రా గణము, ఒకసూర్యగణముగాను, రెండోపాదములో మూడుసూర్యగణములు, ఒక చతుర్మాత్రాగణము, ఒకసూర్యగణముగాను ప్రస్తరించి చూపినాడు. ఈప్రస్తారము సరియైనట్టు తోచదు. కన్నడములో తెనుగులోవలె మొదటిపాదములో మూడుసూర్యగణములు, రెండింద్రగణములు, అని చెప్పకోవలెను. రెండోపాదములోమాత్రము తెనుగుకన్నడములకు భేదమున్నది. దానిలో నాలుగోగణము కన్నడములో నాలుగుమాత్రలది, తెనుగులో సూర్యగణమే. ఆటగీతినాలుగుపాదములలోను ప్రాసముంటే నవదగీతి అవుతుందని అప్పకవిచెప్పినాడు.

సీసపద్యము నాలుగుపాదములతరువాత తెనుగులో తేటగీతినికూడా వాడుతారు. దీనిలక్షణము నాలుగుపాదములలోను ఒకసూర్యగణము, రెండింద్రగణములు, రెండుసూర్యగణములు.

గీతులలో భేదములుగా అప్పకవిచెప్పిన సమగీతి, ఉద్గీతి, ఉపగీతి ఆర్యాగీతి అనేవి సంస్కృతచ్ఛందస్సులో వివరింపబడినవే; ఆర్యాగీతియే కందము. ఈగీతులలో ఆర్యాగీతి తెనుగుకన్నడములలో స్థిరముగానిలిచి వ్యాపించినది. అప్పకవిచెప్పిన ఎత్తుగీతి, కమలనగీతులను తెనుగుకవులు వాడలేదు; తాను వ్రాసిన ఎత్తుగీతిలక్షణమును లక్ష్యములో అప్పకవి పాటించలేదు.

(8) తెనుగుద్విపదలక్షణము పాదమునకు వరుసగా మూడింద్రగణములు, ఒకసూర్యగణము; ప్రాసముగల అట్టిరెండుపాదములు, యతిగాని ప్రాసయతిగాని ఉండవచ్చును. ప్రాసముగాని, ప్రాసయతిగాని నియమములేక వరుసగా చెప్పిన ద్విపదపాదములకు మంజరి అనిపేరు. ఒకొక్కద్విపదలోని రెండుపాదములలోను సమానయతిగలిగి, అట్టి నాలుగుద్విపదల అన్నిపాదములకున్ను ప్రాసమునుపాటిస్తే అది తరువోజ అవుతుంది.

కన్నడద్విపదకున్ను తెనుగుద్విపదకున్ను సంబంధములేదు. కన్నడములోని 'దువయి' అనేదానిలోని రెండుపాదములలోను ఒకొక్కదానిలో వరుసగా ఒకఆరుమాత్రల గణము, తరువాత అయిదు కందపద్యగణములు, మొత్తము 26 మాత్రలుంటవి. కందపద్యగణములతరువాత ఒక గురువును చేర్చవలెననిన్ని, మొత్తము 28 మాత్రలనిన్ని దువయిలక్షణమునకు పాఠాంతరమున్నది. కర్ణాటకచతుష్పద అని అప్పకవిచెప్పినదిన్ని, సంస్కృతప్రాకృతమాత్రాగణచ్ఛందములలో నాగవర్మ చేర్చిచెప్పిన చతుష్పదిన్ని, చూస్తే, ఆపద్యములోని రెండు పాదములు తెనుగు ద్విపద అవుతుందని చెప్పవచ్చును. కాని, తెనుగులోని ఇంద్రగణములయిన నల, భగణములను కూడా వాడవచ్చుననిన్ని, భగురువు, నలలములను తొలగించవలెననిన్ని తెనుగులక్షణములో ఎక్కువగాచేర్చుకోవలెను. ప్రాకృతములోని 'దోఅఇ' అనేపద్యము 28 మాత్రలనిచెప్పే కన్నడ దువయిలక్షణమునకు సరిపోతున్నది ప్రాకృతములో దాని మాత్రాప్రస్తారము : 6 + 4 + 4 + 4 + 4 + 6 మాత్రలు.

(అ) కన్నడత్రిపదిలక్షణమును (3) లో వివరించినాను. తెనుగుత్రిపదికిన్ని దీనికిన్ని భేదమున్నది. తెనుగుత్రిపదిలో మొదటిపాదములో వరుసగా నాలుగింద్రగణములు, తక్కినరెండేసిపాదములలో ఒకొక్కదానిలో రెండింద్రగణములు, ఒకసూర్యగణము వేదములోని గాయత్రిచ్ఛందస్సులు మూడేసి పాదములుగలవి.

(ఇ) తెనుగుచతుష్పదలో పాదమునకు 16 మాత్రలు అనిమాత్రము చెప్పబడినది. ఇది కర్ణాటక ఛందోవతంసమునకు సరిపోతుంది. కన్నడ ఛందోవతంసలక్షణము. పాదమునకు మూడువిష్ణుగణములు ఒకబ్రహ్మగణము; తెనుగులో విష్ణుగణమున కింద్రగణమనిన్ని, బ్రహ్మగణమునకు సూర్యగణమనిన్ని చెప్పుకోవలెను.

అప్పకవిచెప్పిన విశాళచతుష్పదకుచెప్పిన లక్షణములలో చతుష్పదపాదములకు మొదటురెండు సూర్యగణములుండవలెనని ఉన్నది. కాని లక్ష్యములో పాదమునకు 15 మాత్రలే ఉన్నవి. తెనుగులోని చతుష్పద, విశాళచతుష్పదులున్ను, కన్నడములోని ఛందోవతంసమున్ను, ప్రాకృతములోని పజ్ఝటికా, అడిల్లా, సింహావలోకన, అనేవాటిజాతికి చేరినవి.

అప్పకవి కర్ణాటచతుష్పద అనిచెప్పినది కర్ణాటచతుష్పద కాదు. అప్పకవి చెప్పినలక్షణము పాదమునకు మూడుపంచలఘుగణములు, ఒక సూర్యగణము, మొత్తము 18 మాత్రలు. నాగవర్మ కర్ణాట చతుష్పదికి చెప్పినలక్షణము పాదమునకు వరుసగా ఒకవిష్ణుగణము, ఒకరుద్రగణము : నాగవర్మ సంస్కృతప్రాకృతమాత్రాచ్ఛందములలో అప్పకవి చెప్పినలక్షణమునకు సరిపోయిన చతుష్పదిని చెప్పినాడు.

పైనివివరించినవిగాక నాగవర్మ కన్నడములో మదనవతి ( అయిదువిష్ణుగణములు + ఒకగురువు ; లేదా, 4 విష్ణుగణములు + ఒక రుద్రగణము ; లేదా, మూడురుద్రగణములు + ఒకవిష్ణుగణము ) ; గీతికె ( దీనిలక్షణము స్పష్టముగాలేదు ; అనేకపాఠాంతరములున్నవి ; రెండో, ఆరో, గణములు బ్రహ్మగణములుగా ఉండవలెననిన్ని, తక్కినగణములనుగూర్చి నియమములేదనిన్ని, ఒకపాఠము ; తక్కినగణములు విష్ణుగణములుగా ఉండవలెనని ఒకపాఠము ; లక్ష్యములుగా ఇచ్చినపాఠములలో ఈ రెండులక్షణములున్నూ పట్టవు ) ; అనే రెండు వేరేచతుష్పదులనుగురించి చెప్పినాడు.

ప్రాకృతములోని చౌపదిఆకున్నూ ఆంధ్రకర్ణాటకములలోని చతుష్పదులకున్నూ ఎట్టిసంబంధమున్నూ లేదు.

(ఈ) అప్పకవిచెప్పిన పంచపది సంస్కృతసమస్తములకు సంబంధించినది. తెనుగులోని తేటగీత లొకష్పాదు పంచపాదులుగా చెప్పడము గలదు. అట్లే సీసమును కూడా చెప్పకొంటే పంచపాది అవుతుంది.

(ఉ) అప్పకవి షట్పదలక్షణమును పాదమునకు కొరిందగణములు, ఒక చంద్రగణము ; పాదములో మూడుప్రాసయతులు ; అంత్యప్రాసముతోకూడిన ఆరుపాదములు ; అనిచెప్పినాడు ; ఇంద్రగణము లుండవలెనని చెప్పినా, లక్ష్యములో అయిదుమాత్రల ఇంద్రగణములనే ఉపయోగించినాడు. కర్ణాటక కుసుమషట్పదిలో అయిదుమాత్రలగణములు మొదటిరెండుపాదములలోను రెండేసిన్ని, మూడో పాదములో అయిదుమాత్రలగణములు మూడున్నూ ఒకగురువున్నూ చెప్పబడినవి. తెనుగుషట్పదికిన్ని కన్నడ కుసుమషట్పదికిన్ని మొత్తముమీద లక్షణమొక్కటిగానే ఏర్పడుతుంది.

కన్నడములో ఆరువిధములైన షట్పదులున్నవి. వాటిలో కుసుమషట్పదిని గురించి పైనిచెప్పినాను.

(ii) శరషట్పది : మొదటిరెండుపాదములలో రెండువిష్ణుగణములు, మూడోపాదములో రెండు విష్ణుగణములు, ఒకరుద్రగణము. అట్లే మరిమూడుపాదములు. (లక్షణమిట్లున్నా, విష్ణుగణమునకుబదులుగా నాలుగుమాత్రల బ్రహ్మగణమునైనా — గగము, సగణము — వాడవచ్చుననిన్ని, రుద్రగణమునకు బదులుగా నాలుగుమాత్రలగణమున్నూ ఒకగురువున్నూ వాడవచ్చుననిన్నీ, వాఙ్మయములో ఉండే శరషట్పదులవల్ల తెలుసుకోవచ్చును. )

(iii) భోగషట్పది - మొదటిరెండుపాదములలోను నాలుగేసి మూడుమాత్రలగణములు ; మూడో పాదములో మూడుమాత్రలగణము లావు, తరువాత ఒకగురువు. ఇట్లే తక్కిన మూడుపాదములున్నూ ; మొత్తము 88 మాత్రలు. ఇది తెనుగులోని కువ్వాటమునకు సరిపోతుంది.

(iv) భామినిషట్పది - మొదటిరెండుపాదములలోను 3+4+8+4 మాత్రలగణములు; మూడోపాదములో 3, 4, 3, 4, 8, 4, 2 మాత్రలగణములు; తక్కినమూడుపాదములున్ను అట్లే. ఇది తెనుగులోని గుమ్మడిపాటకు సరిపోతుంది. ఆధునికాంధ్రవాఙ్మయములో ముత్యాలసరములనే పేర బయలుదేరుతున్న వీభామిని షట్పదులే. వీటికి నేటితెనుగుకవులు కొన్నియెడల చేర్చిన్ని మార్చిన్ని, కొన్నిమార్పులు చేస్తున్నారు. కాని, ఈపద్యములగమనిక భామినిషట్పదినే పోలిఉంటుంది.

(v) పరివర్ధినిషట్పది - మొదటిరెండుపాదములలో నాలుగేసిమాత్రలగణములు నాలుగు; మూడోపాదములో అట్టిగణములు ఆరు, ఒకగురువు. ఇట్లే తక్కినమూడుపాదములు. మొత్తము 116 మాత్రలు. తెనుగులో ఇట్టి పాటలున్నవి.

(vi) వార్ధికషట్పది: మొదటిరెండుపాదములలోను అయిదేసిమాత్రలుగలగణములు నాలుగు; మూడోపాదములో అట్టిగణము లారు, తరువాత ఒకగురువు. తక్కిన మూడుపాదములున్ను ఇట్లే. తెనుగులోను ఇట్టిపాట లున్నవి.

(9) (i) నాగవర్మ రగడలలో ఒకభేదమును చూపినాడు గాని దానిపేరు చెప్పలేదు. దానిలోని ఒకపాదము.

మగనె నీ నింతళియె సెయిప్పె నెంతో పేళెయ్ శంకరా.

దీనిని కిట్టెలు 5+5+4+3+4+5 మాత్రలుగలగణములుగా విభజించినాడు కాని దాని నడకకనుకూలముగా ఈవిభజనమున్నట్లగపడదు.

| మగనె | నీ నిం | తళియె | సెయిప్పె | నెంతో | పేళెయ్ | శంకరా. |
|---|---|---|---|---|---|---|
| 3 | 4 | 3 | 4 | 3 | 4 | 5 |

గా దానిని విభజింపవలెనేమో.

(ii) రగడలోనిదే కన్నడములోని లయగ్రాహి. అప్పకవిచెప్పిన మాలికావృత్తములలోని లయగ్రాహిలక్షణమున్ను కన్నడ లయగ్రాహిలక్షణమున్ను ఒక్కటే. నాగవర్మ ఈలయగ్రాహినే మాలావృత్తములలో లలితపద మనేపేరుతో వేరేచెప్పినాడు. నాగవర్మచెప్పినకుసుమశర మనేమాలావృత్తమునకు అప్పకవిచెప్పిన లయవిభాతి సరిపోతుంది. కాని, వారిద్దరు ఆపాదములకు చేసిన గణవిభజనములో భేదమున్నది.

అప్పకవి లయహారి, త్రిభంగి, అనేమరిరెండుమాలావృత్తములను చెప్పినాడు. లయహారిపాదమునకు 11 నగణములు ఒకసగణము, ఒకగురువు అని అతనిలక్షణమున్నదిగాని, దానినడకనుబట్టి 7 నలలములు, ఒకగగము అనిచెప్పవలెను. త్రిభంగిలక్షణము అప్పకవిచెప్పినలక్షణముబట్టిగాని లక్ష్యముబట్టిగాని సుబోధము గాకున్నది. అతడుచెప్పినపద్యములోని 3,4 పాదములనుబట్టి త్రిభంగిపాదమునకు నాలుగుమాత్రలగణములు ఆరున్ను, గగము, సగణము, గగము, సగణము, గురువు, అని గణములనుచెప్పవలెనేమో. కవిజనాశ్రయములో దీనికి న, స, న, న, స, న, న, స, న, న, స, గ, అని పాదగణము లున్నవి. అనంతుడు ఆరునగణములు, 3 షగణములు న, మ, సగ, లను చెప్పినాడు.

కన్నడములో దండకమునకు మూడు మాత్రల గణములు రెండున్ను, తరువాత ఏడు రగణములున్ను ఒకపాదమవుతుంది; అట్టివి నాలుగుపాదములు. ఇది సంస్కృతచ్ఛందస్సులో చెప్పబడిన దండక లక్షణమునకు సరిపోతున్నది. కాని తెనుగుదండకమునుగూర్చి కవిజనాశ్రయకారుడు తొలుత 'నసహ' ములతో తగణము లెన్నైనా కానీ, లేదా మొదటినుంచీ తుదివరకు తగణములే కాని చేర్చి తుదను గురువుచేర్చవలె నన్నాడు. అనంతుడు సగణము, నహము, తరువాత ఎన్నయినా తగణములున్ను గాని, మొదటినుంచి తగణములుగాని చేర్చి తుదను గురువుచేర్చవలె నన్నాడు. అప్పకవి మొదట హగణము గాని, నగణముగాని, సగణముగాని చెప్పి తరువాత ఎన్నయినా తగణములు చేర్చి తుదను గురువును పొందుపరుస్తే దండకమవుతుం దన్నాడు.

నాగవర్మ అష్టపదిని మరిఒకదాని నుదాహరించినాడు. దాని లక్షణము : పాదమునకు నాలుగేసి మాత్రలుగలగణములు రెండుచొప్పున ఎనిమిదిపాదములు, ఎనిమిదోపాదముతుదను ఒక నాలుగు మాత్రలగణమున్ను ఒకగగమున్ను చేరునవి.

పైనిచెప్పినవాటిలో చాలామట్టుకు దాసరపదములలోను, స్త్రీలపాటలలోను కనబడుతవి. వాటిలో కొన్నిటి నొకభాషలో గ్రంథములలో వాడకపోయినా, జనసామాన్యము వాటిని త్యజించలేదు.

(10) అక్కరలనుగురించి యిక విచారింపవలెను. ఇంతవరకున్ను ఆయాసందర్భములలో కర్ణాటక బ్రహ్మ, విష్ణు, రుద్రగణములనుగురించిన్ని, తెనుగు సూర్య, ఇంద్ర, చంద్రగణములగురించిన్ని ప్రస్తావన వచ్చినది. ఇవి ద్రావిడలాక్షణికులు మాత్రాగణప్రస్తారముకోసము ఏర్పాటుచేసుకొన్న కొన్ని సంకేతములు. తమిళ, కర్ణాటక, ఆంధ్రమాత్రాగణప్రస్తారసంప్రదాయ మొక్కతీరు ననుసరించి ఉన్నది. ఆయాజాతిగణములు మూడుభాషలలోను సమానముగాఉన్నవిన్ని, ఒకభాషయందుకంటె మరిఒకదానిలో అధికముగా ఉన్నవిన్ని ఈ క్రిందవివరిస్తే, వాటిపరస్పరసంబంధము బోధపడుతుంది.

I. తమిళము : తేమాగణములు - గగము, గలము.

పుళిమాగణములు - య, జ, స, న.

వీనిలో య, జ, గణములను తీసివేస్తే కర్ణాటకబ్రహ్మగణములున్ను, వాటితోపాటు గగము, సగణములనుకూడా తీసివేస్తే తెనుగుసూర్యగణములున్ను అవుతవి.

II. తమిళము : కరువిళమ్ : నల, నగ, జల, జగ.

కూవిళమ్ : భ, ర.

తేమాంగాయ్ : మ, త.

పుళిమాంగాయ్ : సగ, సల, యగ, యల.

వీటిలో జల, జగ, యల, యగ, లను తొలగిస్తే కర్ణాటకవిష్ణుగణములున్ను, వాటితో ఇంకా మ, సగ, ములనుకూడా తొలగిస్తే, తెనుగు ఇంద్రగణములున్ను ఏర్పడుతవి.

III. తమిళము : కరువిళంగాయ్ : నన, నలల, జలగ, జలల, జగగ, జగల, నగగ, నగల.

కూవిళంగాయ్ : భగురు, భల, రగ, రల.

తేమాంగణి : తగ, తల

పుళిమాంగణి : సలగ, సలల, యలగ, యలల.

తేమాతణ్ణు : మగ, మలఘు.

పుళిమాతణ్ణు : యగగ, యగల, సగగ, సగల.

వీటిలో నన, నలల, నగగ, నగల, భగురు, భల, రగ, రల, తగ, తల, సలగ, సలల, మగ, మలఘువు, సగగ, సగలములనే 16 మాత్రము కర్ణాటకరుద్రగణములు. వీటిలోనుంచి మగ, సగగ లను తొలగిస్తే తెనుగుచంద్రగణము లేర్పడుతవి.

ఈరీతిగా తమిళగణములలోనుంచి కన్నడులు కొన్నిటిని, కన్నడగణములలోనుంచి తెనుగువారింకా కొన్నిటిని తొలగించడానికి కారణమేమైఉంటుంది అని ఆలోచిస్తే ఒకఊహ తోస్తున్నది. కన్నడులకున్ను, తెనుగువారికిన్ని యగణ, జగణములుగాని, వాటితో గురులఘువులుగాని, ఇతరగణములుగాని చేరినగణములుగాని యిష్టములేదు. అట్టివాటిని తమిళగణములనుంచి తొలగిస్తే కర్ణాటక బ్రహ్మ, విష్ణు, రుద్రగణము లేర్పడినవి. సూర్యగణములలో మూడుమాత్రలకు మించినవిన్ని, ఇంద్రగణములలో అయిదుమాత్రలకుమించినవిన్ని, చంద్రగణములలో ఏడుమాత్రలకుమించినవిన్ని గణము లుండగూడదని తెనుగువారు నియమముచేసుకొన్నారు. అందుచేత ఆయాజాతులకర్ణాటకగణముల నుంచి ఆసంఖ్యానియమము నతిక్రమించినవాటిని వారు తొలగించినారు.

అసలు ఆయాగణములను తొలగించడానికి కారణము లయకు సరిపోవడమున్ను శ్రుతికి సుభగముగా ఉండడమున్ను అని నా అభిప్రాయము. మూడక్షరములగణమునధ్య గురువుచేరుతే గర్భము తాల్చినట్లుంటుంది. జగణమును గురించి ప్రాకృతపైంగళములోను, ఛందోంబుధిలోను జగణము కొన్ని మాత్రాచ్ఛందస్సులలో నిరసింపబడినది. మగడులేని స్త్రీకి గర్భమయినట్లుంటుందట జగణముచేరుతే. జగణముచేరవచ్చునన్న ఆర్యా కందములలోకూడా, ప్రత్యేకస్థలములలో జగణము నిషేధింపబడినది. ఈకారణముచేతనే అయిఉంటుంది ఆంధ్రకర్ణాటకులు యగణమునుకూడా నిషేధించడము.

తెనుగులాక్షణికులు సూర్యగణములలో తుదిని గురువుగలవాటినిన్ని, ఇంద్రగణములలో తుదిని రెండుగురువులున్న వాటినిన్ని, చంద్రగణములలో తుదిని మూడుగురువులున్నవాటినిన్ని కర్ణాటకగణములలోనుంచి తొలగించుకొన్నారు. దీనికిన్ని శ్రుతిసుభగత్వమే కారణము.

(11) అక్కరలు తెనుగుకన్నడములకు సామాన్యముగాఉన్న మాత్రాగణచ్ఛందములు. లాక్షణికులు అయిదువిధములయిన అక్కరలను చెప్పినా కన్నడవాఙ్మయములో ఒక్కపిరియక్కర(మహాక్కర) మాత్రము వాడబడినది ; అట్లే తెనుగులో మధ్యాక్కర, మధురాక్కరలనుమాత్రము కవులు వ్రాసినారు.

కన్నడ పిరియక్కర తెనుగు మహాక్కరకు సరిపోతున్నది ; కాని, దీనిలక్షణమునుగురించి కొన్ని సందేహములున్నవి. కన్నడములోని దొరెయక్కర ( రెండువిష్ణుగణములు, ఒకబ్రహ్మగణము, రెండు విష్ణుగణములు, ఒకబ్రహ్మగణము) తెనుగు మధ్యాక్కరకు ( రెండుఇంద్రగణములు, ఒకసూర్యగణము రెండింద్రగణములు, ఒకసూర్యగణము ) సరిపోతుంది. కన్నడ నడువణక్కర ( ఒకబ్రహ్మ, మూడు విష్ణు, ఒకరుద్ర) తెనుగు మధురాక్కరకు ( ఒకసూర్య, మూడుఇంద్ర, ఒకచంద్రగణములు ) సరిపోతుంది. కన్నడ ఎడెయక్కర ( ఒకబ్రహ్మ, రెండువిష్ణు, ఒకరుద్ర ) తెనుగు అంతరాక్కరకు ( ఒకసూర్య, రెండు ఇంద్ర, ఒకచంద్ర సరిపోతుంది. కన్నడ కిఱియక్కర ( రెండువిష్ణు, ఒకరుద్ర ) తెనుగు అల్పాక్కరకు ( రెండుఇంద్ర ; ఒక చంద్ర ) సరిపోతుంది.

(12) పిరియక్కర ( మహాక్కర ) లక్షణమునుగురించి కర్ణాటకసాహిత్యపరిషత్పత్రిక అంగీరస సం॥ర పుష్యమాససంచికలో విపులముగా వర్ణించినాను. ఆ వర్ణ్యాసంగ్రహము నిచ్చట పొందుపరుస్తున్నాను.

కన్నడపిరియక్కరకు నాగవర్మచెప్పినలక్షణము : 1, 3 పాదములలో క్రమముగా 1 అజ, 5 విష్ణు, 1 రుద్రగణములు ; 2, 4, పాదములలో 1 అజ, 4 విష్ణు, 1 అజ, 1 రుద్రగణములు. దీనికి కిట్టెలు ఇచ్చినపాఠాంతరములలో అజగణమనడానికి జగణమనిన్ని, 2, 4 పాదాలలో అగణము ఆరో స్థానమందుంటుందనడానికి నాలుగో స్థానములో ఉంటుందనిన్ని కనబడుతున్నది.

కన్నడవాఙ్మయములో పంపడు తనభారతములో 7 ; ఆదిపురాణములో 3 ; పొన్నడు తన శాంతిపురాణములో 5, పిరియక్కరలను వాడినారు. మరియే కన్నడగ్రంథములోను ఈ పిరియక్కరలు కనబడవు. పంపపొన్నలువ్రాసిన పిరియక్కరలకు నాగవర్మచెప్పినలక్షణము పట్టదు. సమదృష్టితో చూస్తే నాలుగుపాదములలోను ఎట్టిభేదమున్నులేక పాదమునకు 1 అజ, 5 విష్ణు, 1 రుద్రగణములుండవలెనని తోస్తుంది. పంపభారతములోను పొన్నశాంతిపురాణములోను ఈ లక్షణమునకుసరిపోయిన కొన్నిపద్యములున్నవి. తక్కిన పిరియక్కరలలో భేదమున్నా, ఆ భేదములు ఒక్క 2, 4 పాదములకుసంబంధించినవికావు ; అన్నిపాదములలోను అన్నిగణములవద్దను ఆ భేదములు కనబడుతున్నవి. పాఠాంతరములబట్టిచూస్తే నాలుగుపాదములకున్ను ఒకటేలక్షణము చెప్పవలసినట్లు కనబడుతుంది. పాఠాంతరములేనిచోట్ల సవరణలు కావలసిన స్థానములు సాధారణముగా 2, 4 పాదములలోని ఆరోగణములుకావు. ఆయాపాదముల నడక, పొందికలనుబట్టిచూచిన, 2, 4 పాదములలో ఈ విశేషలక్షణ మక్కరలేనట్లు తోస్తుంది. తక్కిననాలుగుఅక్కరలలోను నాలుగుపాదములకున్ను ఒక్కటేలక్షణముంది. ఈ పిరియక్కరకుమాత్రము 2, 4 పాదములలో విశేషలక్షణము చెప్పడానికి కారణము కనబడదు. నాగవర్మకాలమునాటికి కన్నడములో అక్కరలు ప్రచారములో నుంచిపోయినవి. ఆయాఅక్కరపద్యములకు అనేకపాఠాంతరములు కలిగిఉంటవి. ఆపాఠాంతరాలలో ఏవో కొన్నిటిని తీసుకొని నాగవర్మ లక్షణమును కల్పించిఉంటాడు.

(13) తెనుగువాఙ్మయములో కన్నడపిరియక్కరలకు సరిపోయిన మహాక్కరలు లేవు. కాని, లాక్షణికులు దానికి లక్షణమిచ్చినారు.

## అప్పకవి

సూర్యుఁ | డొకఁడును | మున్నుగా | సురేంద్రు | లేవురు | పిఱుఁద నొక్క
తార | కేశుండు | జతయైన | నిట్టిస | ప్తగణంబు | లొక్కొక్క పా | దంబునకుఁ
జేరు | రెండవ | చోటునా | లవచోటఁ | జిత్రభా | నుగణంబు | గదియుచుండు
నేర | సిలుగాల | వగణంబు | పైఁగ్రింది | యుత్పలాం | గమహాక్క | రంబునకు.

పైపద్యములో ఇచ్చినలక్షణమున కర్థమేమయినా, ఆపద్యమునకు గణవిభజనముచేస్తే, అన్నిపాదాలలోను 1 సూర్య, 5 ఇంద్ర, 1 చంద్రగణములు కనబడుతున్నవి. "రెండవచోట నాలవచోటఁ జిత్రభానుగణంబు గదియుచుండు" అనేదాని కప్పకవి ఏమి అర్థముద్దేశించినాడో తెలియదు. ప్రతిపాదములోను రెండోగణము, నాలుగోగణము, చిత్రభానుగణములుంటవని అయినా, రెండోపాదములోను, నాలుగోపాదములోను చిత్రభానుగణముంటుందని అయినా అర్థముచెప్పుకోవచ్చును. మొదటిది అసంభవముగా తోస్తుంది; రెండోదిసరిఅయితే ఏగణము చిత్రభానుగణమో స్పష్టముగాలేదు. చిత్రభానుగణమునకున్ను, భానుగణమునకున్ను అప్పకవి యేమయినా భేదమును మనసులోఉంచుకొన్నాడేమో తెలియదు. తెనుగుకావ్యాలలో మహాక్కరలు లేకపోవడముచేత అప్పకవి లక్షణమేర్పరచడాని కాధారములేకపోయినది. అందుచేత అతడు కన్నడములోని పిరియక్కరలక్షణమునే అనుసరించవలసివచ్చినది; అతని కొకతప్పులక్షణముగల కన్నడపద్యముదొరకి ఉంటుంది; లేదా అతడనంతుని అనుసరించి ఉంటాడు. అయినా, తాను వ్రాసినపద్యములో నాలుగుపాదములనున్ను ఒకటేతీరుగా రచించినాడు.

## అనంతుడు

అది | వారమా | దిగనను | క్రియమున | నన్నివా | సరముల | నొక్కొనుండు
నాది | తేయాధి | నాథులే | గురువల | రారంగ | నొక్కసు | ధాకరుండు
నాది | హరిగొల్వ | రెండును | నాలుగు | నగువాస | రంబున | నక్కుఁడైన
నాద | రంబున నెడసొచ్చు | నని [యు] మ | హాక్కరం | బలుకుదు | రార్యులెల్ల.

పైపద్యములో మొదటిమూడుపాదములలోను 1 సూర్య, 5 విష్ణు, 1 చంద్రగణములున్నవి. నాలుగోపాదములో "ననిమ" అని నాలుగోగణమున్నది; 'ననియుమ' అని సవరణచేస్తే ఆపాదము తక్కిన పాదములవలె అవుతుంది; ఇట్లుసవరణ చేయకపోతే రెండోపాదములోకూడా ఒకసూర్యగణ ముండేటట్లు సవరణచేయవలెనుగదా.

## కవిజనాశ్రయము

అమరఁ | బ్రావళ్ళు | రెండునుఁ | జెలఁగినా | ల్గగుచోట | విరతియా | దిత్యుమీఁద
నమర | పతిరెండు | మూఁడునా | ల్గైదునా | ల్గైదునా | అగుతావు | లనునిల్పి | సొబగుమీఱ
నమరఁ | జేయుచుఁ | జంద్రసే | డగుచోట | నదికిన | యేడుగ | ణములలోనఁ
గ్రమము | తప్పక | యప్పాటఁ | బెద్దయ | క్కరమొప్పఁ | గవిజనా | శ్రయుఁడుసెప్పె.

ఇందులో రెండో నాలుగో పాదములలో ప్రత్యేకనియమ మేమీలేదు నాలుగుపాదములకున్ను ఒక్కటేలక్షణము చెప్పబడినది. ఇదే మహాక్కరకు సరియైనలక్షణము; కన్నడపిరియక్కరకు కూడా ఇట్లే 1 అజ, 5 విష్ణు, 1 రుద్రగణములని నేను నిరూపించినదాని నీ విజనాశ్రయములోని మహాక్కరలక్షణము స్థిరపరుస్తున్నది.

ఇంతవరకున్ను సంస్కృతప్రాకృతములలోని మాత్రాచ్ఛందస్సులను గురించిన్ని, వాటితో సంబంధించిన ద్రావిడచ్ఛందస్సులనుగురించిన్ని చెప్పినాను. ఆయాసందర్భాలలో ఉదాహరణాలుకూడా ఇచ్చిఉంటే బాగుండేది. కాని అట్లు చేస్తే గ్రంథము పెరిగిపోతుందనే భయముచేత ఊరుకోవలసివచ్చినది.

ద్రావిడభాషాచ్ఛందస్సంప్రదాయము ప్రాకృతమార్గము ననుసరించిందేమో కనుగొనవలెననే ఉద్దేశముతో ఈవ్యాసము నారంభించినాను. ఈవ్యాసములో అట్టివిమర్శము సాధ్యముకాలేదు. నేడార్యభాషలనిపిలువబడుతూఉన్న బంగాళీ, హిందీ, మరాఠీ మొదలయినభాషలఛందస్సులను కూడా తెలుసుకొంటేనేకాని, ఈవిచారము పూర్తికాదు. అట్టే మళయాళము, తుళు, మొదలయిన ద్రావిడభాషలఛందస్సులనుకూడా తెలుసుకోవలసిఉంది. ఇదిగాక కేవలగ్రంథస్థములయిన ఛందస్సులనేకాక, పాటలరూపముగా గ్రంథస్థములైనభాషలలోను, గ్రంథములలోని కెక్కనిభాషలలోను ఉండే ఛందస్సులను గురించికూడా తెలుసుకోవలసిఉన్నది.

విద్వాంసులు పరిశోధింపదగిన ఒకవిషయమును గురించి ఈవ్యాసములో దిఙ్మాత్రముగా ఇచ్చట సూచించినాను. తగిన తీరిక, ఓపికకలిగినవారికిది పరిశోధనార్హమనితోస్తే, ఈవ్యాసములోచేయబడిన సూచన ననుసరించి పనిచేయవచ్చును.

# తాలువన దౌడ కాదు

వఝల చినసీతారామస్వామిశాస్త్రి

"శ్రీపంతులుగారివాదమునకు అనురూపముగా ఉండేటట్లు తమవ్యాసము వ్యావహారికభాషలో వ్రాయవలెను" అని యిట్లుత్సవనిర్వాహకసంఘప్రధానకార్యదర్శిగారు కోరినందున వ్యవహారవిదూరగ్రాంథికభాషానియమములు చొరకుండున ట్లీవ్యాసమును వ్రాయ యత్నించుచున్నాను.

"వ్యావహారికభాషతో నెవ్వరును గ్రంథరచనము చేయరాదని నాయభిప్రాయము కాదు. ఏవేని కొన్నినియమములను గల్పించుకొని వ్యావహారికభాషతో గ్రంథములు రచించిన రచింతురుగాక !..."

(బాలసరస్వతీయపీఠిక 23. పేరా)

ఏవో కొన్నిచోటులందుమాత్రి మరసున్నలను అకారములను సరళాదేశాదులను నియమశూన్యముగా నిల్పినంతమాత్రమున గ్రాంథికభాష కానేరదు. అట్లే యేవో కొన్నిచోటులయందు "స్తూ, తూ" ప్రభృతులను నిల్పినంతమాత్రమున వ్యావహారికభాష కాకపోదు. ఉచ్చారణత్వరాదివిలసిత మగు కేవల వ్యావహారికభాషలో వ్రాయుట యెవ్వరికిని సాధ్యముకాదు. అట్లు వ్రాసి కృతార్థులైనవారును లేరు. సామాన్యవ్యవహారమున కెక్కనిసంస్కృతపదములను ధారాళముగా వాడువా రట్టియాంధ్రపదాదులను వాడుట కేలసంకోచింపవలెనో భాషాభివృద్ధిలాలసులు పరిశీలింపవలసియున్నది - ప్రకృత మనుసరింతము !

తాలుశబ్దమునకు దౌడయర్థమని యాధునికులు వ్రాయుచున్నారు.

"తాలువు- సం. వి. ఉ. న. దవుడ, కాకుదము."

"కాకుదము - సం. వి. అ. న. తాలువు, దౌడ."

"దౌడ- దే. వి. బుగ్గలోపలిభాగము, తాలువు: సీ॥ ఆరేయికడ నున్నవారును గోటదౌడలును నల్లనిమేనుగల నెలంత ... భార. మౌస. 1. ఆ." (శబ్దరత్నాకరము).

"తాలు- ఉ. న. కాకుదమ్. తె. నోటిలోపలిదౌడ."

"కాకుదమ్- అ. న. తాలు. తె. నోటిలోపలిదవడ." (సర్వశబ్దసంబోధిని.)

ఇట్లు తాలుకాకుదశబ్దములకు దవడ యర్థమనెడి ప్రామాదికాశయము వెలయుటకు లింగాభట్టీయము మూల మనవచ్చును.

" తాలుతు కాకుదమ్. " (అమరకోశము. ద్వితీయకాండము. మనుష్యవర్గము. ౯౧ శ్లో.)

"తలతి ప్రతితిష్ఠతి జగ్ధశేష మత్రేతి తాలు. ఉ. న. తల ప్రతిష్ఠాయామ్. భుక్తశేషము దీనియందు నిల్చును. నకారాంతంబును గలదు. ౧. కాకు ధ్వనివిశేషం దదాతీతి కాకుదమ్. దా దానే. కాకుధ్వని నిచ్చునది. ౨ దవడపేళ్ళు. (లింగాభట్టీయ మనెడిగురుబాలప్రబోధిక. 406 పుట.)

పయిరీతిని ' భుక్తశేషము దీనియందు నిల్చును ' అనెడియర్థమును వ్రాయుట చేత లింగాభట్టుగారు, తాలు కాకుదశబ్దములకు బుగ్గలలోపలిభాగ మనెడిశబ్దరత్నాకరోక్తార్థమునె సమ్మతించి రనకతీరదు. ఇట్టి బుగ్గలోపలిభాగము ధ్వని (కాకు) నిచ్చున దెట్లగునో తెలియకున్నది.

ప్రామాణికము లగు ప్రాతిశాఖ్యములును వాచస్పత్యాదికోశములును మూర్ధోపరిభాగమె తాలువని నుడువుచున్నవి. ఇట్టిస్థితిలో లింగాభట్టుగారి కిట్టియర్థ మేలకలిగెనని యాలోచింపవలసియున్నది. పరిశీలింప క్షీరస్వామికృత మయిన యమరకోశోద్ఘాటమను వ్యాఖ్య యిందులకు మూల మనవచ్చును.

" తల త్యాహారోస్మిం స్తాలు ", "ఈషత్క వతే, కాకుం దదాతివా కాకుదమ్ "; (క్షీరస్వామికృతామరకోశోద్ఘాటవ్యాఖ్య). ఇది చూచియు ' తల ప్రతిష్ఠాయామ్' అను ధాతుపాఠము చూచియు మూర్ధోపరిభాగమునం దాహార మెట్లునిల్చునని తలంచి కావలయును లింగాభట్టుగా రచటియాహారశబ్దము భుక్తశేషాహారపర మని తలంచిరి.

కాని క్షీరస్వామివ్యాఖ్య కిట్టియర్థముచేయవలసిన ప్రసక్తి లేదు. నమలిన యాహారము జిహ్వామూలముపైనుండి కంఠబిలములోనికి వెళ్ళుటకుముం దట్టి మూర్ధోపరిభాగ మగుతాలువును సంబంధించియున్న జిహ్వపయినే నిల్చును. కాన క్షీరస్వామి యట్టియర్థము నుద్దేశించియె యట్లు వ్రాసియుండవచ్చును. ఇట్టిసందేహ మేలయని వాచస్పత్యాదికోశకర్త లీవ్యుత్పత్తినే యుపేక్షించి 'తరం త్యనేన

వర్ణా ఇతి తాలు ’ అని వ్యుత్పత్తి చూపఁబడినది. ఇయ్యది దీనిపర్యాయ మగు కాకు దశబ్దపు వ్యుత్పత్తికి సరియై మిక్కిలి యుక్తమై యున్నది.

“ తాలు- క్లీ. (తరం త్యనేన వర్ణాఇతి. తౄ + ‘ ఓరశ్చలః ’ ఉణామ్ ౧-౫. ఇతియుణ్. రస్య లశ్చ.) జిహ్వేంద్రియాధిష్ఠానమ్. యథాభాగవతే. “ముఖత స్తాలు నిర్భిన్నం । జిహ్వా తతో౽పజాయతే ... ... ...”

“కాకుదమ్. క్లీ. (కాకుం దదాతీతి కాకు + దా + క. ) తాలు ఇత్యమరః. ౨-౬-౯౧.” (శబ్దకల్పద్రుమకోశము)

“ తాలు - తరం త్యనేన వర్ణాః. తౄ ఇుణ్. రస్య లః. జిహ్వేంద్రియాధిష్ఠానే (తేలో) స్థానభేదే : ‘ ముఖత స్తాలు నిర్భిన్నం । జిహ్వా తతో౽పజాయతే... భాగ.. తాలుని చైక మస్తి తచ్చ కపాలాకారమ్....”

“ కాకుద. న. కాకుం దదాతి. దా-క. ఉప. స. తాలుని అమరః, తాలునా కాకూచ్చారణాత్ తస్య తథాత్వమ్.... ” (వాచస్పత్యకోశము)

“ తాలు- N. (తరం త్యనేన వర్ణాః. తౄ. అణ్ (ఉణ్?) రస్య లః cf.vn 1-5.) The Palate. తృషా మహాత్యా పరిశుష్క తాలవః... ... ”

“ కాకుదమ్ The Palate. ” (ఆప్టేకోశము)

“ తాలౌ జిహ్వామధ్యేనచ వర్గే” (తైత్తిరీయప్రాతిశాఖ్యము 2. అధ్యాయము 36. సూత్రము).

వైదికాభరణవ్యాఖ్య:— “స్పర్శయతీ త్యన్వయః”

(నాలుకయొక్క మధ్యభాగము తాలువును స్పృశించునపుడు ‘చవర్గము’ జనించును)

పయిసందర్భమునుబట్టి తాలుశబ్దమునకు - దౌడ - బుగ్గలోపలిభాగ మర్థము కాదనియు మూర్ధభాగమే యర్థమనియు విశదమగుచున్నదిగదా !

పయిరీతి నున్నప్రామాణికాశయములు చూచికొనకయె యాధునికులుసైతము ‘తాలు’ శబ్దమునకు దౌడలర్థమనియే యాకొందిరీతిని గతానుగతికముగా వ్రాయుచున్నారు.

“ ఇ ఈ ఎ ఏ ” అను నీయచ్చులతోఁ గలిసిన ‘చజ’ అనునవి తాలవ్యములు. దవుడలసాహాయ్యమున నుచ్చరింపఁబడునవి.”

(బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక. సంజ్ఞా 8. సూత్రపుటీక - ౮. పుట.)

# దేవత్వము

( ఏకాంక రూపకము )

పిలకా గణపతి

---

[ గంగానదీతీరము. ప్రభాతకాలము. దూరమున తరంగాంచలములో ఉదయించు చంద్రబింబము. తీవ్రముగా వీచు రొదగాలి. అవతలతీరమున ఉన్న సరుగుడుతోటలోనుండి " రంయి " మనుధ్వని వినబడును. చంద్రికిరణస్పర్శచే ఉన్నతతరంగములు మల్లెపువ్వులు చిమ్మినట్లుండును. కెరటాలచేత వెనుకకూ ముందుకూ లాగబడిన ఇసుకరేణువులు తళతళ మెరయును. అప్పుడు ఏటినురగలవలె తెల్లనైనదుకూలము ధరించి ఒక పసిబాలకుని ఎత్తుకొని "మందాకిని" గంగను సమీపించును. ఇసుక తిన్నెలో వెనుకనుండి త్వరగా సమీపించుపదధ్వని. మందాకిని చేలాంచలమువలె ఆమెహృదయము కూడా తటతట కొట్టుకొనుచుండగా శంతనుడు ప్రవేశించును. ]

మందాకిని

ఎవరు వారు? మహారాజా? ఏమిది ! !

రాజు

[ గంభీరముగా ] హతశేషవంశాంకుర మగు ఈబాలకుని బ్రతికించుకొనుటకై వచ్చితిని.

మందాకిని

తాము పూర్వము చేసిన ఘోరప్రతిజ్ఞ మరచితిరా?

రాజు

మరువలేదు.

మందాకిని

[కొంచె మాలోచించి బామముడితో] తమరేనా ప్రజలకు ధర్మాధర్మశిక్షకు లగు పరిపాలకులు ?

రాజు

[ నిట్టూర్చును ]

మందాకిని

పోనిండు. తమకొరకయి, మెరుపువలె, దేవలోకమునుండి భూలోకమునకు దిగి

వచ్చి తమ్మే నమ్ముకొని ఉన్నదివ్యాంగన ప్రేమపాశముకూడా ఒకవేటుతోనే ఛేదింపదలచితిరా ?

రాజు

దేవీ మందారకుసుమములవలె ఏడుగురు పసికందువులను — మొసళ్ళవలె బుస కొట్టుతూ ఉరకలువేసే ఈ కెరటములలోనికి విసిరివేసితివి. నే నొక స్తంభమువలె నిలువబడి నిశ్శబ్దముగ సహించితిని. దివ్యవూ, దయార్ద్రహృదయవూ, అగునీ వీమర్త్యునకీపుత్రభిక్ష పెట్టగూడదా ?

మందాకిని

ఏమి యీమానవులధర్మనిష్ఠ ! మహారాజా ! నశ్వర మగుపుత్రశరీరమునకై అక్షయ మగుకీర్తిశరీర మెందుకు దగ్ధమొనర్చెదరు ? మీయీధైర్యవిహీనతకు లోకము నవ్వదా ? చూడుడు, ఈ అల లెట్లు విరగబడి నవ్వుతున్నవో ! దూరమున ఆచిన్ని కెరటము లెట్లు తీరముతో గుసగుసలాడుతున్నవో! ఏడుగురు బాలకుల మరణమున కంగీకరించి, సత్యసంధులరై దేవత్వము నందినమీరీ ఒక్క బాలకునికై మనుష్యత్వమునకుగూడ కలంక మారోపించుకొనెదరా ?

రాజు

మందాకినీ ! ఎందు కీధర్మబోధ ? నిష్కారణముగ - ఎందు కీపుత్రవధ ! నీది మాతృహృదయము కాదా ? ఇంకను కండ్లు తెరువక, చీమ చిటుక్కునిన తనచిట్టిపిడికిటితో నిన్నదిమిపట్టుకొంటూ నీహృదయమందలి ప్రేమలత కొకచిగురువలె ఉన్న ఈబాలకు నెట్లు చిదిమి విసిరివేయగలవు?

మందాకిని

నే నిది అంతా మొదట చెప్పలేదా ? నా యిష్టమునకు వ్యతిరేకముగ నడచిన మన యిద్దరికిని మధ్య ఒక మహావియోగస్రవంతి ప్రవహించునని చెప్పలేదా?ఎందు కీనింద? ఎందు కీఅసత్యప్రవర్తన? అదుగో దూరమున పల్లెనుండి కోడికూత వినబడుతున్నది. తెల్లవారుతున్నది. తమకు కావలసినది బహుపుణ్యలభ్య మగు దివ్యాంగనా పరిష్వంగమా? కుమారపరిష్వంగమా? బాగా ఆలోచించుకొనుడు.

రాజు

రెండూ అడగకూడదా! నీ వీపుత్రునితో వచ్చి నాగృహలక్ష్మివి కాకూడదా?

మందాకిని

రెండూ మాత్రము పొసగవు!! కాల మతిక్రమించుచున్నది. మరల అడుగు తున్నాను. దివ్యాంగనా? పుత్రుడా తమకు కావలసినది?

రాజు

దివ్యాంగనవా? నీవు! రాక్షసీ! పిశాచీ! ... ఏమైనను నే నీకుమారుని విడుచువాడను కాను.

మందాకిని

రాజా! ఎందు కీనిష్ఠురవాక్యములు? తమరేకదా సంపూర్ణముగ నానియమ ముల కంగీకరించి నన్ను వలలో వేసికొన్నది. తిరిగి నన్నే నిందింపనేల? మీవలె నే నిక నిందింపదలచుకోలేదు. ఈ బాలకుడు సర్వధర్మవేత్తయు మహాధనుర్ధరుడును అగును. వీనిని స్వీకరింపుడు, నేటితో మీకును నాకును సరి.

[ నిష్క్రమింపబోవును ]

రాజు

[ చీరచెరగు గ్రహించి ]

దేవీ! ఏమి ఈ కాఠిన్యము. ఒకమాట వినగూడదా? ఆనాడు ఈగంగాతీరము ననే, ఈప్రాతఃకాలముననే నాకొరకు తీరమునకు దిగివచ్చితివి. అరుణకిరణరంజితము లగు ఈతరంగము లన్నీ నాడు నీచరణములకు కుంకుమపూజ చేసి స్తుతించినవి. ఆదివ్యసౌందర్యముతో భూమి కవతరించిన ఉమఃకాంతవలె న న్ననుగ్రహించితివి. అట్టిప్రేమ అంతా ఒక్క అపరాధముతోనే నశించిపోయెనా?

మందాకిని

మహారాజా! పూర్వజన్మవృత్తాంతములవలె గడచిపోయినగాథలు త్రవ్వి వ న్నెందుకు ఖేదింపజేసెదరు? ఈ బాలకుని తీసికొని నాకు సెలవుదయచేయుడు.

రాజు

దేవీ! నీవు నాజీవితపునావ కొకతెరచాపవు. ఈపసిపాప ఒకచుక్కాని. మీ ఇద్దరిలో నెవరిని విడిచిఅయినా జీవింపగలనా? ఒక్కసారి మరల ఆలోచింపకూడదా?

మందాకిని

మహారాజా! సత్యపాశములు న న్నురివేసి లాగుతున్నవి. అదుగో సూర్యుని స్వర్ణకిరణములపై నిలబడి దేవతలు పిలుస్తున్నారు!!

రాజు

చిరసహచరుడగు ఈమర్త్యుని ఈమాత్రపు ప్రణయము చెల్లింపజాలవా! దేవతలగు మీహృదయములు పాషాణనిర్మితములా ?

మందాకిని

[కన్నీళ్ళతో] అసలే దుఃఖముతో కుమిలిపోతూ ఉన్న నన్నెందుకు వేధించెదరు ? దేవతలకువలె మీకుగూడ నాపై నిర్దయయేనా ? ప్రభూ! నా కీసమావేశము నరకయాతనవలె నున్నది. ప్రసన్నవదనముతో సెలవిండు.

రాజు

ఏమి చూచుకొని యింక జీవింపగలను? నాపై కరుణ లేకపోయిన ఈబాలకుని మీదనైన కరుణలేదా! ఒక్కసారి ఈపసిబాలకునిగతి ఆలోచింపుము.

మందాకిని

రాజా! నిత్యవిలాసాన్వితయగు ఈగంగాప్రవాహమునందును ఈపసిపాపముఖమందును నన్ను స్మరించుకొనుచు ఈతనికొరకైన జీవింపుము. దేవతలసత్యము హిమాలయమువలె స్థిరమైనది. వారిదేవత్వము మానవుల కగోచరము. మీయందు దేవత్వ మున్నంతవరకును మనకు పొత్తు కుదిరినది. ఇదిగో బాలకుడు [దింపును] సెలవు! పోవుచున్నాను.

రాజు

ఈపసిపాప నొకమారు ముద్దుపెట్టుకొని పోగూడదా ? అయ్యో! ఒక్కనిమిష మాగుము !

మందాకిని

ఈజన్మమున నాకు భార్యాత్వమునకును మాతృత్వమునకును యోగ్యత లేదు! [చీరచెరగుతోగూడ జలరూపిణియై ప్రవాహములో కలిసిపోవును]

రాజు

ఇదియా మీదేవత్వము!! మీకంటె మానవులయందే ఎక్కువదేవత్వ మున్నదే!

[క్రిందదింపినపాప ఏడ్చును. దూరమున సరుగుడుతోటలోనుండి వచ్చినధ్వని పత్తులకలకలధ్వనితోను, తరంగధ్వనితోను వినబడును. అలలు ఏడ్చుచున్న బాలుని సమీపించి ముద్దిడి వెడలిపోవును. రాజు నిట్టూర్చును. తెరపడును]

# అణువులు, వాటిపరిమాణము

తెలికిచెర్ల కృష్ణమూర్తి

అనంతరూపములతోనూ అనంతవర్ణములతోనూ విలసిల్లుతున్న మన ప్రపంచ తత్వం గూర్చి ఆలోచించిన ప్రతి మనిషికిన్నీ ఒకప్రశ్న తప్పకుండా స్ఫురిస్తుంది; ఈవస్తు సముదాయాలన్నీ వేరువేరుగా కల్పింపబడినవా, లేక అన్నీ ఒకే వస్తువు యొక్క భిన్నరూపములా అని. దానికి సమాధానం తెలుసుకోవాలని అనాదినుండీ ప్రయత్నాలు జరుగుతూనే ఉండెను. ఒకొక్కరు ఒకొక్కరీతిగా ఊహిస్తూ వచ్చారు. కాని పూర్వం గ్రీసుదేశంలో డెమాక్రిటస్ అనునాతనిచే మొదట విశదంగా నిర్వచింపబడిన సిద్ధాంతం ఒకటి మిగిలింది. అదే నానాటికీ బలపడి ఇప్పుడు చాలా మార్పులతో వృద్ధిపొంది అమలులోఉన్నది. నేటివరకు తెలిసినవిషయములనుబట్టి ప్రపంచంలో ఎనభైరెండు రకాల ఎలిమెంట్లు ఉన్నాయనీ, అందులో ఒకొక్క ఎలిమెంటు ఒకొక్క రకం అణువులతో నిర్మింపబడినదనీ, ఒకే ఎలిమెంటులోని అణువులు అన్నివిధాలా ఒక్కమాదిరిగానే ఉంటాయనీ, అణువుల సంయోగమువల్లనే అన్నిరకాల వస్తువులూ తయారవుతాయనీ, ప్రతివస్తువున్నూ మాలిక్యూల్సు అనే అణుసముదాయాలతో కల్పింపబడినదనీ, ఆమాలిక్యూలుపైని ఆవస్తువుయొక్క గుణములు ఆధారపడి ఉంటాయనీ, మాలిక్యూల్సు ఎల్లప్పుడూ కదులుతూ ఉంటాయనీ, ఆకదలికవల్లనే వేడిమి కలుగుతూఉంటుందనీ ఊహించవలసి ఉంటుంది. ఈపైని చెప్పిన వాటిలో మాలిక్యూల్సుయొక్క సంచలనమునకు సంబంధించినదానికి చలనసిద్ధాంతం అని పేరు. ఈవ్యాసంలో చలనసిద్ధాంతం గురించి చర్చించి, అణువులగురించిన్నీ మాలిక్యూల్సు గురించిన్నీ తెలిసిన కొన్నివిషయాలబట్టి అణువుల పరిమాణం ఎంత ఉంటుందో పరిశీలించుదాము.

చలన సిద్ధాంతం ప్రకారం ఘనపదార్థములలోని మాలిక్యూల్సు దగ్గరదగ్గరగా ఉండి, స్థలభ్రమణము లేకుండా ఇటూఅటూ ఊగుతూఉంటాయి. ఆ ఊపులోని శక్తియే వేడిమిగా మనకు గోచరిస్తుంది. ఈ మాలిక్యూల్సుగాని, వాటిలోనుండే అణు

వులుగాని ఏరూపంకలిగిఉంటాయో నిర్ణయించడానికి తగిన ఆధారాలు లేవు. అవి కంటికి కనబడకపోవడంవల్ల వాటినిగూర్చి తెలిసినవిషయాలనుబట్టి ఊహించుకోవాలి. కాని అణువులు గుండ్రముగాను, గట్టిగాను, ఉక్కుగుండ్లవలె ఉంటాయనుకుంటే లెక్కలు వేయడం సులభం. ద్రవపదార్థములలోని మాలిక్యూల్సు ఘనపదార్థము నందువలె ఒకదానికొకటి దగ్గరగా ఉన్నా ఒకదానిపైనుండి ఒకటి జారగలదు. అందుచేతనే ద్రవపదార్థము ప్రవహించడానికి వీలుగాఉంటుంది. ఘనపదార్థములోనూ ద్రవపదార్థములోనూ మాలిక్యూల్సు దగ్గరగా ఉండి అన్యోన్యాకర్షణ కలిగి ఉంటాయి. కాని వాయుపదార్థములలోనున్న అణువులుకాని మాలిక్యూల్సుకాని దూరదూరముగాఉండి, అన్నివైపులకున్ను వడిగా పరుగెత్తుతూ ఒకదానినొకటి ఢీకొంటూ పాత్రని తన్ని వెనకకు మరలుతూ ఉంటాయి. ఒకదానితోనొకటి ఢీకొన్నప్పుడు తప్ప ఇతరసమయాలలో ఒకమాలిక్యూలుతో ఇంకొకదానికి సంబంధం ఉండదు. కాబట్టి వాయుపదార్థములోని అణువులయొక్కగాని, మాలిక్యూల్సుయొక్కగాని గుణములను పరిశీలించడం సులభం. ఆవిషయం ముందు తీసుకుందాం.

వాయుపదార్థమునకు వ్యాపించే గుణం ఉండడానికి అందులోని మాలిక్యూల్సుయొక్క పరుగే కారణం. కాబట్టి ఆపదార్థమును ఉంచుటకు మూతవేసినపాత్ర అవసరము. ఆపాత్రలోనున్న వాయువుయొక్క వేడిమికిన్ని ఆపాత్రపైనికలిగే ఒత్తిడికిన్ని కారణము ఆ మాలిక్యూల్సుయొక్క చలనశక్తియే అని చెప్పవలసి ఉంటుంది. ఒకవాయుపదార్థముయొక్క సాంద్రత, అనగా ఒకక్యూబిక్ సెంటిమీటరులో ఉండే పదార్థముయొక్క బరువునుబట్టి అందులోనుండే అణువులయొక్కగాని మాలిక్యూల్సుయొక్కగాని వేగము, తెలుసుకోవచ్చును. ఈ లెక్కప్రకారం సామాన్య స్థితిలో ఉన్న గాలిలోని ప్రాణవాయువుయొక్క మాలిక్యూలు ఒకసెకండుకు సగటున సుమారు 500 మీటర్లు అనగా 1600 అడుగులు పరుగెత్తగలదు. వాయువులన్నింటిలోనూ చులకన అయిన ఉదజనిమాలిక్యూలు ఇంతకంటె సుమారు నాలుగురెట్లు ఎక్కువ వడికలిగి ఉంటుంది. ఎందుచేతనంటే ఒకే వేడిమిగల మాలిక్యూల్సుకు సగటున చలనశక్తి ఒక్కటే. ఇంకొక విశేషం ఏమిటంటే ఒకే వేడిమిన్ని ఒకే ఒత్తిడిన్ని కల వాయుపదార్థములలో సమాన భాగములను తీసుకుంటే వాటిలోనుండే మాలిక్యూల్సుయొక్కసంఖ్య సమానంగా ఉంటుందని "ఏవగాడ్రో"

ఊహించాడు. ఆ ఊహ సరియైనదని రూఢి అయినది. దీనినిబట్టి ఏవస్తువులైనాసరే "గ్రాముమాలిక్యూలు" బరువులోనుండే మాలిక్యూల్సుయొక్క సంఖ్య ఒక్కటే అని తేలుతుంది. అంతేకాక ఒక 'గ్రాముఏటములో'నుండే అణువులసంఖ్యకూడా అంతే అని తెలుస్తుంది; అనగా సుమారు ఒకగ్రాము ఉదజనిలో ఉండే అణువుల సంఖ్య 16 గ్రాముల ప్రాణవాయువులో ఉండే అణువులసంఖ్యకు సరిపోతుంది. ఆసంఖ్యయే సుమారు 18 గ్రాముల బరువుగల ఆవిరిలోనుండే మాలిక్యూల్సు సంఖ్యకు సరిపోతుంది.

వాయుపదార్థములోని మాలిక్యూల్సు ఎల్లప్పుడూ ఒకదానితో నొకటి డీకొంటూ అన్నివైపులకూ పరుగెత్తుతూ ఉంటా యనుకున్నాం. అవి ఒక దానినొకటి కలుసుకోకముందు సగటున ఎంతదూరం పరుగెత్తుతూ ఉంటాయో తెలుసుకోవచ్చును. ఒకక్యూబిక్ సెంటిమీటరులో ఉన్న మాలిక్యూల్సుసంఖ్య పైని, వాటిపరిమాణము పైని, అది ఆధారపడి ఉంటుంది. మాలిక్యూల్సు ఎక్కువఉన్నా వాటిపరిమాణం ఎక్కువ అయినా మాలిక్యూలు స్వేచ్ఛగా తిరిగే దూరం తగ్గిపోతుంది. సామాన్య స్థితిలో ఉన్నగాలిలోని మాలి క్యూలుకు ఆదూరం సుమారు $10^{-5}$ సెంటిమీటరు, అనగా సెంటిమీటరులో ఒక లక్షవంతు ఉంటుంది. ఈదూరం కనుక్కోడానికి వాయుపదార్థాలకు ఉండే ఇంకొక గుణం తోడ్పడుతుంది. దానికి ఇంగ్లీషులో 'విస్కాసిటీ' అనిపేరు. ఒకదారం చివ రకు రాతిముక్కనుగట్టి ఊపితే కొంతసేపటికి ఆరాయి ఆగిపోతుంది దానికి గాలి యొక్క నిరోధమే కారణం. ఆనిరోధం కల్పించే గుణానికే విస్కాసిటీ అనిపేరు. ద్రవపదార్థముల విషయంలో ఇదే జిగటతనం అనవచ్చు వాయుపదార్థంలో ఉండే విస్కాసిటికిన్ని, అందులోని మాలిక్యూల్సుకిన్నీ ఉన్నసంబంధం లెక్కవేయవచ్చును. ఆలెక్కప్రకారం ఒకవాయువుయొక్క విస్కాసిటీని బట్టి అందులోని మాలిక్యూల్సు సగటున స్వేచ్ఛగా ప్రయాణం చెయ్యగల దూరం నిర్ణయించవచ్చును. అది సు మారు సెంటిమీటరులో లక్షవంతు ఉంటుందని తెలుసుకున్నాం. ఈవిధంగానే ఒక వాయువుయొక్క "ఎలక్ట్రిక్ కండక్టివిటి" విద్యుత్తును ప్రవహింపచేసే శక్తికిన్ని, మాలిక్యూల్సుకిన్నీ ఉన్న సంబంధం బట్టికూడా లెక్కవేయవచ్చును. ఈరెండుపద్ధ తులవల్లనూ వచ్చినలెక్క సరిపోయినది. వాయువుపైని ఉండే ఒత్తిడిని తగ్గించి

నప్పుడు అది ఎక్కువ విస్తరించిపోతుందని మనకు తెలుసును. సామాన్యస్థితిలో ఉండే ఒకక్యూబిక్ సెంటిమీటరు వాయువును పదివేలరెట్లు విస్తరించే టట్టుచేస్తే అప్పుడు అందులోని మాలిక్యూలు సగటున ఒకమిల్లిమీటరు స్వేచ్ఛగా ప్రయాణం చెయ్య కలుగుతుంది. కాని మనకంటికి మాలిక్యూలు కనబడదు. కాబట్టి ఆసంచారం ఊహించుకోవలసినదేకాని చూడడానికి శక్యంకాదు.

ఇంక మాలిక్యూలుయొక్క పరిమాణంగురించి లెక్కవేయవచ్చును. ఒకొక్కమాలిక్యూలు స్వేచ్ఛగా ప్రయాణంచేసే దూరమునుబట్టిన్నీ, ఒకక్యూబిక్ సెంటిమీటరులోఉన్న మాలిక్యూల్సు సంఖ్యనుబట్టిన్నీ మాలిక్యూలు అడ్డుకొలత తెలుసుకోవచ్చును. ఇది ఒకముఖ్యమైనపద్ధతి. ఈప్రకారం లెక్కవేస్తే ఒకమాలిక్యూలు యొక్క అడ్డుకొలత సుమారు $10^{-8}$ సెంటిమీటరు, అనగా సెంటిమీటరులో పదికోట్లవంతు ఉంటుందని తెలుస్తుంది. ఈలెక్కలో ఒకక్యూబిక్ సెంటిమీటరులోని మాలిక్యూల్సుసంఖ్య అవసరం. అది తెలుసుకోడానికి చాలాపద్ధతులు ఉన్నాయి. కాని వాటిలో శ్రేష్ఠమైనది ఎలక్ట్రికుపద్ధతి.

నీళ్ళతో కలిపిన గంధకద్రావకంలోనుంచి విద్యుత్ప్రవాహం పంపినప్పుడు నీటిలోని ఉదజని, ప్రాణవాయువున్ను వేరయిపోతాయి. ప్రాణవాయువు పాజిటివు దగ్గరను, ఉదజని నెగటివుదగ్గరను చేరుతాయి. ఒక "గ్రాముఏటము" ఉదజని తయారు కావడానికి 9649 కొలోంబులు ఎలక్ట్రిసిటి అవసరం. ఈఎలక్ట్రిసిటీని ఉదజనిలోని అణువులు ఒకొక్కటి ఒకొక్క చిన్నసమానభాగము చొప్పున వహిస్తాయి. ఆచిన్న భాగమునకు "అయానిక్ ఛార్జి" అనిపేరు. అది ఎలక్ట్రానునకు సమానమని నిర్ణయింపబడినది. ఆఎలక్ట్రానుపైనుండే ఛార్జిని చాలా జాగ్రత్తగా 'మిల్లికను' అనే అమెరికాశాస్త్రజ్ఞుడు కనిపెట్టినాడు. దానినిబట్టిచూడగా ఒక గ్రాముఏటములో నుండే అణువులసంఖ్య సుమారు $6 \times 10^{23}$, అనగా 600 కోటి, కోటి, కోట్లు అని తెలుస్తుంది. ఒకగ్రాముఏటము బరువు అనగా సుమారు ఒకగ్రాము బరువుగల ఉదజని సామాన్యస్థితిలో 11200 క్యూబిక్ సెంటిమీటరుల ఘనపరిమాణం కలిగి ఉంటుంది. ఒకొక్క మాలిక్యూలులో రెండేసి అణువులు ఉంటాయి. అందుచేత ఒకక్యూబిక్ సెంటిమీటరులో నుండే మాలిక్యూల్సు యొక్కసంఖ్య $2{\cdot}7 \times 10^{19}$, అనగా సుమారు 2.7 లక్షకోటికోట్లు.

ఇంతవరకు ఒకపద్ధతిప్రకారం మాలిక్యూలుయొక్క పరిమాణం తెలుసుకున్నాం. ఈప్రకారంగానే వాయుపదార్థంలోని మాలిక్యూల్సుకి ఉండే అన్యోన్యసంబంధము లనుబట్టి మాలిక్యూలుయొక్క అడ్డుకొలత కనిపెట్టవచ్చును. ఆపద్ధతులన్నిటివల్లనూ సుమారుగా ఒకే ఫలం వస్తుంది.

ఇంక ఘనపదార్థములగురించిన్నీ ద్రవపదార్థములగురించిన్నీ పరిశీలించుదాం. ఈ రెండింటిలోనూ మాలిక్యూల్సు దగ్గరదగ్గరగా ఉంటా యను కున్నాం. ఒకగ్రాము మాలిక్యూలు బరువుగల పదార్థములోని మాలిక్యూల్సుసంఖ్య $6 \times 10^{23}$ అని తెలుసుకున్నాం. కాబట్టి గ్రాము మాలిక్యూలుయొక్క ఘనపరిమాణంబట్టి అందులోని మాలిక్యూలుయొక్క అడ్డుకొలత తెలుసుకోవచ్చును. ఉదాహరణకొరకు పాదరసం తీసుకుందాం. దానిగ్రాము మాలిక్యూలు బరువు 200 గ్రాములు. దానిసాంద్రత 13 . 6 గ్రాములు; అనగా ఒక క్యూబిక్ సెంటిమీటరు పాదరసము బరువు 13 . 6 గ్రాములు. కాబట్టి ఒకక్యూబిక్ సెంటిమీటరు పాదరసంలో ఉండేమాలిక్యూల్సుసంఖ్య $4 \times 10^{22}$ అని తెలుస్తుంది. ఈమాలిక్యూల్సు అన్నీ ఒకదాన్ని ఒకటి ఆనుకొన్నట్టైతే ఒక్కొక్కదాని అడ్డుకొలత $3 \times 10^{-8}$ సెంటిమీటర్లు అని చెప్పవచ్చును. ఈప్రకారంగా ఇతర వస్తువుల గురించికూడా లెక్కవేస్తే మాలిక్యూలుయొక్క పరిమాణం సుమారు $10^{-8}$ సెంటిమీటర్లు అని తేలుతుంది. ఘనపదార్థంవిషయంలోకూడా ఇలాగే లెక్కవేయవచ్చును. ఉదజని వాయువును చల్లార్చి గడ్డకట్టించి, దాని సాంద్రతను కనుక్కొని, ఆసాంద్రతనుబట్టి ఉదజనిలోనుండే మాలిక్యూలు పరిమాణం కనిపెట్టినారు. అదికూడ $10^{-8}$ సెంటిమీటరే అయింది. ఈపద్ధతికాక ఇంకా చాలారకాలు ఉన్నాయి. ఒక మాలిక్యూలుయొక్క "ఎలక్ట్రిక్ కెపాసిటి" ని బట్టికూడ దానిఅడ్డుకొలత నిర్ణయించవచ్చును. ఆవిధంగాకూడ అంతే వచ్చింది. కాబట్టి ఈసాక్ష్యములవల్ల మాలిక్యూలుయొక్క పరిమాణం $10^{-8}$ సెంటిమీటరుకన్న ఎక్కువఉండదని రూఢిగా నమ్మవచ్చును.

చలనసిద్ధాంతమునుబట్టి వేసిన లెక్కలవల్ల తెలిసినవిషయం ఇది. మాలిక్యూలు కుండ్రంగానూ, గట్టిగాను ఉంటుందని మొదట అనుకున్నాం. ఆఊహాప్రకారం

ఒకక్యూబిక్ సెంటిమీటరు వాయుపదార్థం తీసుకుంటే అందులో సుమారు పదివేల వంతుమాత్రం మాలిక్యూల్సు ఆక్రమించిన స్థలం. మిగిలిన 9999 వంతులు శూన్య ప్రదేశమే. ఇంక ఎలక్ట్రిసిటివిషయమై చేసినపరిశోధనలవల్లనూ, వెలుతురు గురించి తెలిసినసంగతులవల్లనూ మాలిక్యూలు కుండ్రముగా గట్టిగా ఉండదనీ, ప్రతి అణువున్నూ ఒకగ్రహకూటంవలె ఉంటుందనిన్నీ చెప్పవలసివస్తుంది. ప్రతిఅణువులోనూ ఒకపాజిటివుచార్జి ఉంటుందనీ, దానిచుట్టూనూ, సూర్యునిచుట్టూ గ్రహములవలె, ఎలక్ట్రానులు తిరుగుతూ ఉంటాయనీ అనుకున్నట్లయితే, ఇంక ఘనపదార్థంలోకూడ చాలవరకు శూన్యప్రదేశమేఅని, అక్కడక్కడమాత్రం ప్రోటానులున్నూ ఎలక్ట్రానులున్నూ ఉంటాయనీ ఊహించుకోవాలి. నేటివరకు తెలిసినవిషయాలనుబట్టి ఇంకాకొన్ని చిత్రవిచిత్రమైన సంగతులూ, ఉహాలూ బయలుదేరుతున్నాయి. ప్రపంచమంతా రెండురకాల ఎలక్ట్రిసిటీ మయమనీ, దానిభిన్నరూపములున్నూ సమూహములున్నూ వస్తువుల కన్నిటికీ కారణములనీ, అసలువస్తువుకిన్నీ, శక్తికిన్నీ భిన్నప్రకృతులు లేవనీ చెప్పుతూఉన్నారు. అదంతా ఊహాప్రపంచం. ఆవిషయం ఈవ్యాసంలో అనవసరం.

# చెవి చేయు పని

విస్సా అప్పారావు

బాహ్యప్రపంచములో జరుగుచుండు విషయములను గ్రహించుటకై ప్రాణికోటికి ఇంద్రియములు నిర్మింపబడినవి. మనము పంచేంద్రియములద్వారా విషయములను గ్రహించుచున్నాము. అందు శ్రవణేంద్రియము ఒకటి. దానితో శబ్దమును గ్రహించుచున్నాము.

శబ్దస్వరూపము. ఇది తెలిసికొనవలసినవిషయముగదా. ఏవస్తువయిందైనను స్పందనము (Vibration) కలిగినచో దానివలన శబ్దము పుట్టును; అట్లు పుట్టినధ్వని మనచుట్టూ ఉన్నగాలిద్వారా మనచెవికి వచ్చిచేరును. ఆధ్వనికి ముఖ్యమగుగుణములు మూడు: (1) బిగ్గరతనము, లేక స్ఫుటత (Intensity or Loudness)-చాలాదూరమువరకు వినిపించినయెడల ధ్వని చాలాబిగ్గరగా ఉన్నదందుము. (2) తరచుతనము (Frequency)-శబ్దమును చేసేవస్తువ ఒకసెకనుకాలములో ఎన్నిపర్యాయములు కంపించునో వాటికి తరచుతనము అనిపేరు. సాధారణముగా మనము మాట్లాడునప్పుడు మగవాని గొంతుకలోనిపొరలు (Vocal chords) సెకనుకు 80 సార్లు ఆడును; ఆడవాండ్రగొంతుకలోనిపొరలు 120 సార్లు ఆడును. ఆశబ్దములకు తరచుతనములు 80, 120 అనివాడుదుము. స్వరముయొక్కస్థాయి హెచ్చినకొలది తరచుతనము హెచ్చుచుండును. అందుచేతనే స్త్రీకంఠము పురుషకంఠముకంటె హెచ్చుస్థాయికలది. (3) మేలితనము (Quality or Character or Timbre) ఏకస్థాయిలో ఇద్దరు పాడుచున్నప్పుడు ఎవరిపాట ఏదో గుర్తించుటకు ఈగుణభేదమే కారణము.

ధ్వనియొక్క తరచుతనము గాలిద్వారా వచ్చునప్పుడు మారదు. గాలి శబ్దముయొక్కతరచుతనము ననువర్తించుచు వెనుకకు ముందుకును ఆడుచు ధ్వనిని ముందుకు పంపును. ఇంక చెవివద్దకు వచ్చినతరువాత చెవి చేయుపని యేమియని విచారింతము. దీనికై చెవి యనగా నేమి, దానిభాగములు ఎన్ని, అను విషయమును మనము ముందుగా తెలిసికొనవలసియున్నది.

<u>చెవియొక్క నిర్మాణము.</u> (చూ॥ పటము 1.) వెలుపలిచెవి, మధ్యచెవి, లోపలిచెవి యనుమూడు భాగములు చెవికి గలవు. సాధారణముగా మనము చెవియనివాడు నది వెలుపలిచెవి యే. పైకి కనబడేదొప్పవంటిభాగము, లోపలికి పోవుగొట్టమువంటి బారి, దానిచివర నున్నగూబ ఈమూడున్ను వెలుపలిచెవిలోని అంతర్భాగములు. ఈగూబ పల్చటి చర్మముతో నిర్మింపబడి మధ్యచెవికి పైచెవికిని మధ్యగా ఉండును. దీనిని టింపేనమ్ అనిఅందురు. దొప్పవంటి పైభాగము జంతువులలో పొడుగుగాను, ఆడించుటకు వీలుగాను ఉండును. మనలో సకృతుగా కొందరు చెవుల నాడించు వారుకూడా గలరు. శబ్దము వచ్చుచోటును సులభముగా గ్రహించుటకును, ఎంత తక్కువ శబ్దములనైనా గ్రహింపగలుగుటకొరకును జంతువులకు అట్టినిర్మాణము ఏర్పరుప బడినది. బహుశః ఇంతగా నాగరకతలేని బహుప్రాచీనమైన కాలమందు మను ష్యునికికూడ చెవు లట్టివేఅయి ఉండి, క్రమముగా నేటిస్థితికి మార్పుజెందియుండ వచ్చును.

<u>మధ్యచెవి.</u> గూబయొక్క అవతలిభాగమునకు అంటి మూడు చిన్నఎముకలు ఉండును. ఆకారసామ్యమునుబట్టి వీటిని సుత్తి, రాయి, (గుఱ్ఱపుజీనునుండి వ్రేలాడు) లగాము అని అందురు (the hammer, the anvil and the stirrup). సుత్తి వంటిఎముక గూబ ఆడుటవలన కదలి, దానితర్వాతనున్న రాతినిమీటును. ఈమీటు లగాముద్వారా లోపలిచెవిలోని ద్రవపదార్థమును కదలించును. లోపలిచెవికి ఒకచోట చిక్కుడుగింజ ఆకారము గలద్వారము గుండ్రటిచర్మముతో మూయబడి ఈలగాము నంటిఉండును. అందుచేత లగాము ఆడినచో ఈగుండ్రటిచర్మము ఆడి లోపలిచెవిలోనిద్రవమును ఆడించును. ఈ మూడుచిన్నఎముకలు మధ్యచెవిలో ఉండును. వాటిచుట్టును కొంతఖాలీఉండి గాలిచేత నిండియుండును. ఈమధ్యచెవి నుండి గొంతుకలోనికి ఒకసన్ననిగొట్టము గలదు. మనము గుటకవేసినప్పుడల్లా గొంతుకలోని గాలికిని, మధ్యచెవిలోనిగాలికిని ఈగొట్టముద్వారా సంబంధమేర్ప డును. ఈగొట్టముద్వారానే ఏదైనా కారపువస్తువులు తిన్నప్పుడు ఆకారము చెవికి చేరి గూబ గుయ్యిమనును. ఈగొట్టమునకు (eustachian tube) అని పేరు. లావుపాటిదూలమును ఒకమనుష్యుడు కదల్పలేకున్నను, ఒకగునపమును తెచ్చి చివరభాగమును దూలముక్రిందికి పోనిచ్చి ఒకరాయో కర్రో మోపుచేసికొని

## 1-వ పటము



చెవి నిడువునే కోసినచో ఇట్లుండును

1. దొప్ప
2. మార్గము
3. గూబ - టిమ్పానమ్
4. సుత్తి
5. రాయి
6. అగాము
7. ం ద్వారము
8. ం ద్వారము
9. మూడుచుట్లుగల కాక్లియా
10. స్కాలా వెస్టిబ్యులీ
11. స్కాలా టింపేనీ
12. యూస్టేషియస్ గొట్టము

గునపముయొక్క రెండవచివరను నొక్కికదల్పగలుగుచున్నాడు. ఈసాధనముచేత, మనుష్యునిబలము చాలారెట్లు పెంపుపొందుచున్నది. ఈసాధనమునే లీవరు అందురు. అట్టిసాధనసమూహమే ఈమూడు చిన్నయెముకలగుంపున్ను. వీటివలన గూబనుండి వచ్చుశబ్దముయొక్కబలము యాభైరెట్లు వృద్ధిఅయి లోపలిచెవిలోని ద్రవమును కదల్చును.

లోపలిచెవి. ఇది చాలాచిత్రము, అద్భుతము నగునిర్మాణము. అందు ముఖ్యమైన భాగమును కాక్లియా (cochlea) అందురు. అది మొదట లావుగాను, పోను పోను సన్నముగాను ఉండి నత్తగుల్లవలె మూడుచుట్లు తిరిగి ఉండును. దీనినిండా ద్రవపదార్థ మొకటి యుండును. వెలుపలిశబ్దము పైచెవిలో ప్రవేశించి గూబను ఆడించును. గూబ ఆడుటచేత మధ్యచెవిలోని మూడు చిన్నఎముకలు ఆడును. పైన చెప్పినట్లుగా ఈఎముకలసహాయమున శబ్దశక్తి 50 రెట్లు పెరిగి లోపలిచెవిని తాకును. లగాముపంటి ఆకరుఎముక లోపలిచెవిని ఆనినచోట కోడిగుడ్డాకారమగుచిన్న ద్వారము గలదు. అదిపల్చనిచర్మముచేత మూయబడియుండును. (చూ॥ పటము 2.) ఈ ద్వారమునకు అవతలనున్నదానిని స్కాలావెస్టిబ్యులీ అందురు. దానిలోఉన్న ద్రవపదార్థము ఈ పెంపొందినశబ్దశక్తిచేత ఆడును. ఈ స్కాలావెస్టిబ్యులీకిన్ని కాక్లియాకున్ను మధ్య ఒకపల్చటి చర్మపు పొర గలదు. దీనిని రైజ్నరుపొర అందురు. శబ్దశక్తి ఈపొర ద్వారా కాక్లియాలో ప్రవేశించి అందలి ద్రవమును కదల్చును. కాక్లియాకు అవతల స్కాలాటింపాని అను ఒకభాగము గలదు. ఈరెంటిమధ్యను బాసిలారు చర్మము (basilar membrane) కలదు. స్కాలాటింపేనీయొక్క చివర భాగమున గుండ్రటి చిన్నద్వారము గలదు. అది చర్మముచేత మూయబడి ఉండి మధ్యచెవికి లోపలిచెవికి సరిహద్దున ఉండును. శబ్దశక్తి చిక్కుడుగింజఆకారమువంటి ఆకారము గలద్వారమున ప్రవేశించి ద్రవవిశేషములను ఆడించుచు. స్కాలావెస్టిబ్యులీనుండి, కాక్లియాకు, అందుండి స్కాలాటింపేనీలోనికి ప్రవేశించి గుండ్రటి ఆకారముగల ద్వారముద్వారా తిరిగి మధ్యచెవికి జేరును. ఈరెండు ద్వారముల మధ్యను ఉన్నద్రవవిశేషములు శబ్దశక్తివలన ఊగులాడుచుండును. బాసిలారుచర్మముమీద కార్టి అవయవముగలదు. (చూ॥ పటము 8.) దీనినుండి నరములగుంపు తలలోనికి పోవును. ఆనరములయొక్క చివరలు నూగువెంట్రుకలవలె సన్నముగా ఈఅవయవముయొక్కపైభాగమున తలలెత్తికొనియుండు. ఈసన్ననినరములచివరలు

కాక్లియాలోనికి ఉండును. అందుచేత శబ్దశక్తి కాక్లియాలోని ద్రవము నాడించునప్పుడు ఈనరములయొక్కతలలు ఆడును. వాటితోటి పాటు వాటిపైనున్న పెక్టోరియల్ పొరకూడ ఆడును. ఆచలనమువలన నరములద్వారా శబ్దముయొక్క స్వరూపము గ్రహింపగలుగుచున్నాము.

కాక్లియాకు, స్కాలాటింపేనీకిమధ్య, బాసిలారుచర్మ మున్నదని చెప్పియుంటిని. కాక్లియా నత్తగుల్లవలె మూడుచుట్లు తిరిగి ఉండునంటిని. సాగదీసినచో బాసిలారు చర్మము 31 మిల్లిమీటరులపొడుగు గలిగియుండును. 25 మిల్లిమీటరులు ఒక అంగుళము. లగాముపంటిఎముక తగిలియుండు ద్వారమునుండి బాసిలారు మెంబ్రేను ఆరంభమగును. (చూ॥ పటము 4) అచ్చట ఈమెంబ్రేను సన్నముగా ఉండి క్రమముగా చివరకు వెళ్ళేసరికి వెడల్పుగా ఉండును. ఇంతేకాక ఇది దాదాపాయిూని మిల్లిమీటరులో నాల్గవవంతు అడ్డపుకొలత కలిగియుండును. ఆరంభమున బింకము గలిగి క్రమముగా చివరకు పోవునప్పుడు లావుగా మారుటయేకాక బింకముకూడ తగ్గి ఈ బాసిలారు పొర ఉండును. బింకము గలచిన్నవస్తువను ఆడించినచో స్పందనపుతరచు చాలాహెచ్చుగాను బింకము తగ్గినచో తగ్గుగాను, బింకము తగ్గి లావెక్కినచో మరియు తక్కువగాను ఉండుననువిషయము సాధారణముగా ఎరిగినదే. దీనినిబట్టి ఆలోచించినచో బాసిలారుచర్మములోని మొదటిభాగముయొక్క స్పందనపురేటు మిక్కిలిహెచ్చుగాను చివరచివరకు వెళ్ళినకొలది రేటు తగ్గుగాను ఉండునని తెలియగలదు. ఒకసెకనుకు 15000 సార్లు ఆడుటవలన పుట్టినశబ్దమునకు తరచుతనము 15000, 30సార్లు ఆడుటవలన పుట్టినశబ్దముయొక్క తరచుతనము 30. మనము చెవిచేత గ్రహింప గలుగుశబ్దము లన్నియును ఈరెండింటిమధ్యను ఉండును. 30 కు తగ్గినరేటు గల శబ్దమునుగాని, 15000 కు హెచ్చినదానినిగాని చెవి గ్రహింపజాలకున్నది. దీనికి సందర్భముగా బాసిలారు చర్మముయొక్క మొదటిభాగము చివరభాగము స్పందనము చెందినప్పుడు గలిగెడితరచుతనముకూడా 15000కున్ను 30కిన్ని మధ్యనే ఉన్నది. దీనిని బట్టి హెల్మ్‌హోల్ట్సు అను జర్మనుశాస్త్రజ్ఞుడు చాలకాలముక్రిందటనే శ్రుతివాదము నొకదానిని వన్నియున్నాడు. దానిని (రెజొనెన్సు) అనురణనవాద మందురు. అనురణనము (resonance) అనగా ఏమో తెలిసికొందము. తంత్రీతీగలు రెంటిని ఏకస్వరము పలుకునటుల బిగించవచ్చును. అనగా ఒకటి, ఆధారషడ్జము (స) ను పలికినచో రెండవదియును ఆస్వరమునే పలుకును. అప్పుడు ఒకతీగను

## 4-వ పటము




‡ బాసిలారు చర్మముయొక్క అడ్డగోలతలు మిల్లీమీటర్లలో ఇవ్వబడినవి.

• ఈచోట్ల బాసిలారుపొరయొక్క స్పందనల తరచుతనము ఒక సెకను కాలములో ఇన్ని సార్లు అని చూపబడినది.

మీటినచో రెండవతీగకూడ పలుకును. కాని రెండవతీగయొక్క బిరికి కొంచెము ఇటునటు త్రిప్పినచో స్వరము భేదించును. అప్పుడు మొదటితీగను వాయించినచో రెండవతీగపలకక ఊరకుండును. అనగా రెండుతీగలును ఒకేస్వరమును పలికెడిస్థితి గలిగియున్నప్పుడు ఒకదానిని మీటిన రెండవది పలుకును. రెంటిస్పందనపుతరచు తనముఒక్కటే యైనప్పుడు అట్లుజరుగును. ఒకతీగను రెండవది అనుసరించుటను రెజొనెన్సు అందురు. అందుచేత ఎప్పుడైనను ఒకస్పందనపుతరచు ఇంకొకస్పందనపు తరచుతో సమానమైనప్పుడు ఆరెండింటికి సంబంధముగ ఏర్పడినచో రెండవది తనంతట తాను ఆడును. 400 సార్లు తరచుతనము గలశబ్దము పైచెవినుండి, మధ్య చెవిద్వారా, లోపలిచెవికి ప్రవేశించినప్పుడు ఈమధ్యనున్న గూబ, ఎముకలు, ద్రవ పదార్థములు ఆశబ్దము శక్తిచేత 400 సార్లు ఆడుచునే యుండును. పైన చెప్పినట్లుగా స్కాలావెస్టిబ్యులీలోని ద్రవముద్వారా, కాక్లియాద్వారా, బాసిలారు చర్మమునకు శబ్దశక్తి చేరును. అప్పుడు ఆచర్మములోని ఒకభాగము-400 సార్లు ఆడే స్థితి గలది - తనంతట తాను ఈశబ్దమును అనుకరించును. ఆస్థలమునంటియున్న సూక్ష్మనరములద్వారా 400 తరచుతనముగలశబ్దమును మెదడువలన మనము గ్రహించుచున్నాము. ఈగ్రహణమును చేయుమెదడులోని భాగములు ఒక్కొక తరచుతనమునకు ఒక్కొకటిచొప్పునగలవని నిశ్చయింపబడినది. అనగా బాసిలారు చర్మముయొక్క ప్రతిభాగమునకు సంబంధించి మెదడులో ఒక్కొకప్రత్యేకస్థలము ఉన్నది అని అభిప్రాయము. బాసిలారుచర్మముయొక్క భాగములు ఆడును. నరములయొక్కతలలు ఆడునుకాని ఈస్పందనము ఇంతటితో ఆగిపోవును గాని నరముల ద్వారా మెదడు చేరదు. మెదడునకు బోవునది ఈశబ్దముయొక్క స్వరూపమును గురించినసర్వసమాచారముగాని కంపముగాదు. ఈశబ్దగుణవిమర్శనకు చెందినవార్త నరములద్వారా గ్రహింపబడి మెదడును చేరును అని మనము ఈవాదమువలన గ్రహించవలసియున్నది. ఏమనగా 15000-30 ల మధ్య స్పందనపుతరచు ఉండవలెనన్న యీనరములయొక్క బింకమున హెచ్చుతగ్గులు ఉండవలెను. వాటిస్వరూపమునుబట్టి అట్టిస్పందనము వాటికి ఉండుటకు వీలులేదని నిశ్చయింపబడినది. పైన చెప్పినదానినిబట్టి బాసిలారుచర్మ మెంతసన్నమో దానియందుండు సూక్ష్మనరములెంతసన్నములో వాటిపరీక్ష యెంతకష్టమో, ఎట్టికఠినముగు నిశ్చితముగు ప్రయో

గము లనుసరించిన ఇట్టి విషయములు నిర్ధారణ కాగలవో అట్టికార్యములను చేయ గలశాస్త్రము ఎంతవృద్ధిజెందియుండవలసినదో వేరే చెప్పనవసరము లేదు.

ఈ (resonance) అనురణన (శబ్దసామ్య) వాదమునకు ప్రతివాదము లనేకములు గలవు. అందు ముఖ్యమైనది (Telephone) టెలిఫోనువాదము. దానిస్వరూపమును తెలసికొందము. టెలిఫోను అందరికిని తెలిసినదే. మనము ఒకచోట మాట్లాడినచో ఆశబ్దమువలన ఒకపల్చటిరేకు ఆడి, దానివలన విద్యుచ్ఛక్తి పుట్టును. అది తీగలద్వారా వ్యాప్తమయి తీగల ఆవలికొనను ఉన్నమరియొకపల్చటిరేకును ఆడించును. అది మొదటిరేకు ఆడినట్లే భేదములేక ఆడును. అందుచేత ఆశబ్దపరంపరలే మనము అవతలికొనను వినగలుగుచున్నాము. ఇట్లే చెవియొక్కపనికూడ ఉండునని ఈవాదము. అనగా నేమి? శబ్దముయొక్కతరచుతనము చెలియొక్కమూడుభాగములద్వారా వ్యాప్తమయి, బాసిలారుమెంబ్రేనును ఆడించి, దాని నంటియున్న నరములను సమూలముగా ఆడించును. ఆ ఆడింపు మెదడునకు అంటి శబ్దము గ్రహింపబడుచున్నది అని ఈవాదము. ఆనరములనిర్మాణపద్ధతిని గుర్తించినచో అట్లు ఆడుటకు వాటికి సందర్భము లేదని పైన చెప్పబడియున్నది. అందుచేత ఈవాదమును పరిత్యజించినారు. ఈవాదము పుట్టుటకు కారణము ఏమనగా, బాసిలారుచర్మమునుండి తలలోనికి పోవు ఈనరములపోగును గుర్తించునపుడు జటలవలె ఒకదానినొకటి అల్లుకొని, ఉండును. ప్రతినరములోను పైన సన్నటిపీచువంటిభాగము ఉండి, లోపల గట్టిపదార్థ ముండును. ఇట్టినిర్మాణవిశేషమే టెలిఫోనువార్తలకు సాధనమైన కేబిలు తీగలగుంపులోకూడ ఉండుటచేత నిర్మాణసామ్యమునుబట్టి కార్యసామ్యముకూడ ఉండవచ్చు ననుస్ఫురణచేత ఈవాదము పుట్టినది. కాని దానియందు నిజము లేదు.

ఈఅనురణనవాదము రానురాను బలీయమగుచు వచ్చినది. అనేకవిధములగు ప్రయోగములను సలిపి వాటిపర్యవసానములవలన ఈవాదమే నిజమని శాస్త్రజ్ఞులు నిశ్చయించిరి. అట్టిప్రయోగసాక్ష్యములను కొన్నిటిని విచారించి చూతము.

1. స్టీముఇంజనులోని బాయిలరులు చేయుచోట పనివాండ్రు ఎల్లప్పుడును ఒకతరచుతనముగలశబ్దమును వినుచునే యుండవలసియుండును. కాల్చిన మేకులను రేకులలోని కన్నములలో వేసి బిగించినప్పుడు విపరీతముగుధ్వని

పుట్టును. దాని తరచుతనము హెచ్చుగా ఉండును. ఈపనివాండ్రు చనిపోయిన తరువాత వారిలోపలిచెవిలోని బాసిలారుచర్మమును పరీక్షించి చూడగా ఆ చర్మమందొక భాగము తక్కినవాటికంటె చెడిపోయి ఉన్నట్లు ప్రతిపనివానిని పరీక్షించినప్పుడును గుర్తింపబడినది. ఈచెడిన స్థానమునకు సంబంధించినస్పంద నపుతరచుతనము బాయిలరుశబ్దపుతరచుతనము రెండును సమానముగానే ఉన్నవి. ఇది గొప్పసాక్ష్యము కాదా.

2. చెవులపిల్లులను ఒకచోట నుంచి, ఒకతరచుతనము గలశబ్దమును ప్రతి రోజూ కొన్నిగంటలు, ఎడతెగకుండా అవి వినునట్లు చేసి, ఇట్లుకొన్ని మాసములు జరపి, తరువాత ఆపిల్లులను చంపి, వాటి బాసిలారుచర్మము పరీక్షింపగా, అందు ఒకభాగము చెడిపోయియున్నట్లు గుర్తింపబడినది. ఆభాగము యొక్క స్పందనపుతరచుతనము ఆపిల్లులకు వినిపించినశబ్దముయొక్క తరచుతనమున్ను ఒకటే. ఇదియు ఒకపెద్దసాక్ష్యముకాదా.

ఈపైనచెప్పిన రెండువిషయములనుబట్టి బాసిలారు చర్మములోని కొన్నిభాగములు చెడినవి అని తెలిసికొంటిమిగదా. చెవుట అనగా ఉండవలసినస్థితికంటె తగ్గుస్థితిలో ఉండుట యని గ్రహింప వలెను గాని పూర్తిగా చెడి చచ్చిపోవుటగాదు. ఏలననగా ఆభాగములకు ఏర్పడిన తరచునముగలశబ్దములు ఆవ్యక్తులకు సాధారణముగా వినబడవు గాని, చాలా బిగ్గరగా ఆ శబ్దములు చేయ బడినచో కొంచెముగా వినబడును. అట్టివానికి కొన్ని ధ్వనులు బాగుగా వినుట, కొన్ని మాత్రమే కష్టముపైని వినుట తటస్థించును. చెవిటివారికి గుస గుస లాడినచో వినబడుట మామూలుగా మాట్లాడినచో వినబడకుండుట సాధారణముగా మనము గుర్తించి యుందుము. గుస గుస శబ్దముయొక్క స్పందనపుతరచుతనము మామూలుమాటలతరచుతనముకంటె చాలాహెచ్చు. అందుచేత గుసగుసశబ్దమును అనుకరించుబాసిలారుచర్మము సరియైనస్థితిలో ఉండుటచేత వారికి గుసగుసలు అందరివలెనే వినపడును. కాని మామూలుమాటలకు సంబంధించిన బాసిలారుచర్మముయొక్క భాగములు చెడుటచేత అవి అంతగా వినిపింపవు. ఇది కారణము అని సాధారణముగా మనము గుర్తించక చెవిటివాని చెవిటితనమును గూర్చి అనుమానపడుచుందుము. కాని అది నిజముకాదు. వెలుపలినుండి వచ్చుశబ్ద

మునకును మనముగ్రహించెడుశబ్దమునకును ఏమైనావ్యత్యాసము ఉండునా అనువిష యము ఆలోచింపతగినది. ఏమైనా భేదమున్నచో అది దేనివలన కలుగవచ్చును. అని ప్రశ్నించుకొనగా ఏసాధనములద్వారా శబ్దముశక్తి పైనుండి మెదడులోనికి వ్యాపిం చుచుండునో వాటివలన కలుగవచ్చును అని తోచుట స్వాభావికమేగదా. ఈశబ్దమును వ్యాపింపచేయునప్పుడు గూబ,మూడుచిన్న ఎముకలును ఆడునని చెప్పియుంటిని.ఆఆట వలనక్రొత్తశబ్దములు పుట్టవచ్చును. అవికూడ లోపలిచెవికి వ్యాపించితీరును. అందు శబ్దముయొక్క మేలితనము వికారమును చెందును. కాని ఇట్టివికారము, సాధారణ ముగా బిగ్గరగాచేయుశబ్దములు వ్యాపించునప్పుడు కలుగదుగాని మిక్కిలిబిగ్గరగా చేయబడినశబ్దమును గ్రహించునప్పుడు తప్పక కలుగును.

ఒకశబ్దముతర్వాత ఇంకొకశబ్దము అతి శీఘ్రకాలమున చేయబడుచుండును. ఈశబ్దపరంపరలు ఎంతమాత్రమును భేదములేకుండ మనము గ్రహింపగలుగుచు న్నాము. ఆశబ్దముయొక్క బిగ్గరతనము, తరచుతనము, మేలితనము అను మూడు విశేషము లున్నంతమాత్రమున మార్పు జెందకయే సాధారణముగా మనము గ్ర హింపగలుగుచున్నాము. ఇది అంతయు శాసిలారుచర్మముయొక్క నిర్మాణవిశే షము. ఏదో ఒకశబ్దమును అనుకరించునపుడు ఆశబ్దమును అతిశీఘ్రకాలమున మాత్రము పుట్టించి విరమించునేకాని తీగమోగ్రతవలె కొంతకాలమువరకు ఆ స్పంద నమును సాగింపదు. అందుచేతనే దానివెంటనే వచ్చు మరియొకస్పందనపుతరచు తనమును గ్రహించి తిరిగి ఆడుచున్నది. ఇట్టివిశేషము శాసిలరుచర్మమునకు ఏర్పా టు చేయబడియున్నది. ఇది శాస్త్రరీత్యా చర్చచేసి విశేషమంతయు శాస్త్రజ్ఞులు గుర్తించియున్నారు.

పైనచెప్పిన విషయమంతయును స్పందనపుతరచుతనమును గురించియే. ఇకబిగ్గర తనమునుగురించి చెప్పెదను. బిగ్గరతనము హెచ్చగుకొలది వార్తనుకంపు నరముల సమూహము హెచ్చుగా ఉండును.ఆగుంపుయొక్క హెచ్చుతగ్గుదలలనుబట్టి బిగ్గరతన ముయొక్క తారతమ్యము మెదడు గ్రహించుచున్నదని శాస్త్రజ్ఞులు నమ్ముచున్నారు.

శబ్దమున్నచోటు అది అని మనము చెవిసహాయమున గుర్తింపగలుగుచున్నాము. అది ఎట్లు అని విచారింతము. మనకు సరిగా ఎదుటగాని, వెనుకగాని శబ్దము చేయబడినచో రెండుచెవులకును, ఆచోటునకును గలదూరము ఒకటిగానే ఉండు

ను. రెండు చెవులకును శబ్దము సమానమైన బిగ్గరతనముతోనే వినబడును. ఈదూరము, బిగ్గరతనము, సమానముగ నుండుటబట్టి, శబ్దముచేసేచోటు గ్రహించుచున్నాము. బిగ్గరతనము తగ్గినకొలది అనుభవమునుబట్టి చోటుయొక్క దూరమును గుర్తించుచున్నాము. ఇంక ఎదుట, వెనుక గాకుండ ఒకప్రక్కను శబ్దము చేయబడినచో ఆచోటునుండి శబ్దము చెవికి చేరే దారియొక్క పొడవులో హెచ్చుతగ్గులు కలుగును. శబ్దము ఒక చెవికి త్వరగాను రెండవదానికి కొంచెము ఆలస్యముగాను చేరును. ఇదిగాక తలకాయ ఒక చెవికి అడ్డమువచ్చుటచేత ఆ చెవికి చేరుశబ్దము ఆలస్యముగా వచ్చుటయేకాక, బిగ్గరతనములో కొరతకూడ చెంది చెవినిచేరును. ఈ రెండుకారణములలోని హెచ్చుతగ్గులనుబట్టి, శబ్ద మున్నచోటు గుర్తించుచున్నాము. చోటును గుర్తించుటలో రెండుచెవులును కలిసి పనిచేయుచున్నవి. రెండుచెవులును భిన్నములగు రెండువార్తలను మెదడునకు పంపుచున్నవి. ఆవార్తలలోనిభేదములనుబట్టి మనము ఆచోటును గ్రహించుచున్నాము.

నరములద్వారా మెదడువలన శబ్దము ఎట్లు గ్రహింపబడుచున్నది అనువిషయము శాస్త్రజ్ఞులు చాలా శోధించియున్నారు. శబ్దమువలన కలుగు కంపము సన్నరముల తలలను ఆడించి నరములయందు విద్యుచ్ఛక్తిని కల్పించుచున్నది అని నిశ్చయముగా గ్రహింపగలిగిరి. ఆవిద్యుచ్ఛక్తియొక్క స్వరూపము మొదలగు విశేషములగురించి కొంతవరకు నిశ్చయములు ఏర్పరుపబడినవి కాని విషయ మింకను తేటతెల్లము గాలేదు. ఈవిద్యుచ్ఛక్తి మెదడునకు నరములద్వారా వ్యాపించి శబ్దవిశేషము లన్నింటిని ఎట్లు గ్రహింపజేయుచున్నది యను విషయము మెదడువలన గలుగు అన్ని విషయగ్రహణములవలెనే దురవగాహమై యున్నది. అది మనలోనిప్రాణముయొక్క గుణవిశేషము. దానిని గ్రహించుటకు సాధ్యమగునని తోచదు. అది ఎట్లైనను, శ్రవణేంద్రియముయొక్క నిర్మాణము అతి అద్భుతము, అతి చిత్రము, అతిసూక్ష్మము. ఎల్లప్పుడును సృష్టియొక్క వైచిత్ర్యమును ఈశ్వరునియొక్క శక్తియు స్మరణకు దెచ్చుచుండునట్టి విషయము.

# ప్రాకృత గ్రంథకర్తలూ - ప్రజాసేవానూ

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి

శ్రుతి:— సక్తుమివ తితఉనా పునంతో యత్ర ధీరా మనసా వాచ మక్రత
అత్రా సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధి వాచి. (పతంజలి.)

స్మృతి:— విద్వద్భి స్సేవిత స్సద్భి, ర్నిత్య మక్లేశకారిభిః
హృదయేనాఽభ్యనుజ్ఞాతో, యో ధర్మ స్తం నిబోధత - (మనువు)

* వ్యాసపు ఉద్దేశం. *

నేటిఆంధ్రుల్లో సారస్వతారాధనే పరమార్థంగా ఉంచుకొని గ్రాంథిక వ్యావహారికపు తగాదాలు బయలుదేరినమాస్తరే, పూర్వకాలంలో గూడా సంస్కృతప్రాకృతభాషలను గురించినవివాదలు ఉండడం అనేది స్పష్టం. నేటివలెనే నాడున్నూ మతభేదాలు ఖండనాలు మండనాలు వాదప్రతివాదాలు చర్చలు ఉండేవే. కానివాదములూ - వాదులూ వీరిపద్ధతుల్లో, ప్రవృత్తుల్లోమాత్రం తేడా వుంది. కూరజాతులకు పరపక్షసహనం అనేది సహజం కాకున్నా, సత్వప్రధానమైన సారస్వత క్షేత్రం రజస్తమఃప్లుతం కావడమనేది చాలా దయనీయమూ శోచ్యమూ అవుతుంది. నేటిగ్రాంథిక వ్యావహారికపుతగవులకూ నాటిసంస్కృతప్రాకృతాల వివాదలకూ చాలాపోలికలు వుండడంచేతా, ఆత్మపరీక్షకైనా సత్యాన్వేషణం చేయడం అవసరంగా వుండడంచాతా, దేశమంతటా సంచరించి, వ్యావహారికాంధ్రం గ్రంథప్రయోగార్హమే అని నిరూపించినపూజ్యులు రామమూర్తి పంతులు వారి జన్మదినోత్సవసంపుటానికి చేతనైనకాన్క సమర్పించమని అంతరాత్మ బోధించడంచేతా, 'ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా' అన్నట్లు నాలాంటివారికి కొందరికేనా పూర్వవృత్తం తెలియవలసివుండడంచేతా దీన్ని వ్రాస్తున్నాను. ఇందులో సామగ్రిఅంతా నాకంటె ముందు అన్వేషించి అర్జించినవారిదే; కాని పాకంమాత్రం నాస్వంతం. కాబట్టి చదువరులు సామగ్రికోసరం అపూర్వులకే నాతోబాటు కృతజ్ఞత చూపవలసి వుంది. ఇది శిష్టాచారప్రాప్తమైనధర్మం.

* సంస్కృతప్రాకృతాల్లో మాతృక ఏది ? పుత్రిక ఏది ? *

ప్రాచీనకాలంలో భారతవర్షంలో సంస్కృతం అనీ ప్రాకృతం అనీ రెండేరెండుభాషలు ఉండేవి. ఇందులో ఏది మాతృక ? ఏది పుత్రిక ?- అనే విషయం, లేక చర్చ, మొదట జ్ఞాపకంచేస్తున్నాను. ఏమంటే అవి నాటిగ్రాంథికవ్యావహారికభాష లన్నామగనక. అయితే ఆచర్చ అంతా తూచా తప్పకుండా చెప్పడం అంతప్రధానం కాదు. కాని సారం చూపెట్టాలె.

కొందరంటారూ!— అసలు సంస్కృతం అంటేనే ఆభాష సహజంగా నాటివారిభాషకు మాతృకగా వుండలేదనీ, ప్రజలలోని నానాప్రకృతుల అనియతవ్యవహారంతో వున్నభాషను సంస్కృ-

రించి కృత్రిమంగా నిర్మాణం చేయబడినట్టు తెలుపుతూ వుందనీ. మరికొందరంటారూ!- కానేకాదు. సంస్కృతం అనేది అసృష్టి-అద్యయావత్ మూలభూతంగా వస్తూ వుందనీ, కనకే అది గీర్వాణభాష అనిపించుకొన్నదనీ, విద్యాసంస్కారశూన్యులయిన ప్రాకృతులఉచ్చారణలో నలిగి రూపాంతరం పొంది ప్రాకృతం అయిందనీ, కనుకే దాన్ని అపభ్రంశమన్నారనీ అంటారు. ఈవాదాలను సౌక ర్యంకోసం సంక్షేపిస్తే ఇవి సారాంశాలు:- (౧) ఆదినుండీ ప్రాకృతమే అసలుమాతృక. దాన్ని సం స్కరించడంచాత, సంస్కృతం అన్న పేరేర్పడింది. కాబట్టి ప్రాకృతం మాతృకానూ, సంస్కృతం పుత్రికానూ. (౨) ఆద్యబ్రహ్మణః గీర్వాణం కాబట్టి సంస్కృతమే మాతృకానూ, అది ప్రాకృత వ్యవహారంలో భ్రష్టంఅయింది కాబట్టి ప్రాకృతమే పుత్రికానూ. ఈరెండువాదాలూ అసృష్టి వస్తూన్నవే కాని, అధునాతనాలు కావు. కనుక రెండుపక్షాలవారివాదాలూ కొంచెం పుచ్చుచూపి వాదారి నేను తొక్కుతాను.

* ప్రాకృతమే మాతృక అనేవారి వాదానికి నిదర్శనాలు. *

ఉత్తరదక్షిణధ్రువాలలాగా వున్న యీవాదాలకు ఆధారాలు లభిస్తవేమో చూడాలి. ఏమంటే ఇవే ఆధారాలు అవుతవి ఆనాటిగ్రాంథికవ్యావహారికభాషావాదాలకున్నూ సంస్కృతప్రాకృతాల పుత్రికా మాతృకాసిద్ధాంతాలకున్నూ. కాబట్టిన్ని, నిదర్శనాలు పరీక్షించడంచేత పాఠకులు స్వయంగా ఒకనిశ్చితానికి రావడానికి వీలు ఇస్తుందికాబట్టిన్ని - ఇదిముఖ్యం. ప్రాకృతభాషే భారతవర్షంలో అనాదినుండీ మాతృకగా వుండేది అనేవారివాదానికి ఈచెప్పబొయ్యేవి దిగ్దర్శకంగా ప్రదర్శించిన ఒకటిరెండు వుదాహరణాలుగా వున్నవి. చిత్తగించండి.

ఒకటీ:— వాక్పతిరాజు అనేఆయన పూర్వం గొప్పకవిఅనిన్ని ప్రామాణికపండితుడనిన్నీ ప్రసిద్ధి కెక్కాడు. ఆయన గౌడవధ అనేకావ్యం రాశాడు. అది అచ్చుపడ్డది. ఆయనఏమన్నాడో చూడండి.

> శ్లో. ఉమ్మిల్లఇ లాయణ్ణం పాయిదచ్ఛాయాఏ సక్కదవయయాణం, సక్కయసక్కార క్కరిసణేణ పకిదస్సవి పహావో. (౧) ణవ మత్థదంసణం సంనివేససిసిరాఓ బంధరుద్ధీ రఓ, అవిరళ మిణమో ఆభువణబంధ మిహ ణవర పయిదమ్మి. (౨) సకలాఓ ఇమం వాయా విసంతి ఏత్తో య ణేంతి వాయాఓ, ఏంతి సముద్దం చియ ణేంతి సాయ రాఓ చ్చియ జలాయిం (౩) *

ఈశ్లోకాలఅర్థం ఇది:— ప్రాకృతభాషనీడ (వుండడం) చేతే సంస్కృతపుమాటలకు లావణ్యం ఉన్మీలితమౌతుంది. ఇల్లాగే ప్రాకృతానికికూడా సంస్కృతసంస్కారపు వరిపిడి (వుండడం) చేతే

---

* సంస్కృతచ్ఛాయ ఇదీ:- ఉన్మీల్యతే లావణ్యం ప్రాకృతచ్ఛాయయా సంస్కృతవచసాం, సంస్కృతసంస్కారోత్కర్షనేన ప్రాకృతస్యాఽపి ప్రభావః, (౧) నవ మర్థదర్శనం సంనివే శశిశిరా శ్చ బంధ(సం)ఋద్ధయః, అవిరళ మేన దాభువనబంధ మిహ నవరం ప్రాకృతే. (౨) సకలా ఇమా శ్చ వాచః విశం త్యేతస్మి న్నిర్యాంతి వాచః, ఆయాంతి సముద్రమేవ నయంతి సాగరాదేవ జలాని (౩).

ప్రభావం వస్తుంది. కొత్తకొత్తఅర్థస్ఫూర్తినీ కూర్పులోచల్లదనాన్నిఇచ్చే కావ్యబంధసంపదా — ప్రాకృతంలో అభువనబంధంగా కావలసినంత వుండే కాని కొఱత ఏమాత్రమూ లేదు. (ఈనాడు) సంస్కృతాదిరూపుల్లో కనపడే ఈమాటలన్నీ దీనిలోనే (ప్రాకృతంలోనే) చేరుతాయి. దీనినుండే వెల్లడిఅవుతాయి. సమస్తజలాలున్నూ జలరాశిఅయిన సముద్రంలో ప్రవేశిస్తవి. సముద్రంనుండే నిర్గమిస్తవి ; కాదూ ?— అని.

కిందా:— మహర్షిప్రవరుడనిన్నీ † యోగశాస్త్రవ్యాకరణశాస్త్రవైద్యశాస్త్రాలు రాయడం వల్ల లోకులమనోమల వాఙ్మల శారీరమలాలు మూడింటినీ పోగొట్టిన మహానుభావుడనీ కీర్తితుడయ్యాడు పతంజలి. వ్యాకరణభాష్యంలో పస్పశాహ్నికంలో సుశబ్దాపశబ్దవిచారణసందర్భాన —

> భూయాంసోపశబ్దాః అల్పీయాంసశ్శబ్దాః. ఏకైకస్య హిశబ్దస్య బహవోఽపభ్రంశాః, త
> ద్యథా—గౌరిత్యస్య గావీ గోణీ గోతా గోపోతలికే త్యేవమాదయో బహవోఽపభ్రంశాః.

చాలాఅపశబ్దాలున్నూ కొద్దిగా(సు)శబ్దాలున్నూ(వున్నవి.) ఒక్కొక్క శబ్దానికి అనేకం అపభ్రంశ రూపాలు ఏర్పడ్డవి. ఎల్లాగంటే—గోవూ అనె శబ్దానికి గావీ, గోణీ, గోతా, గోపోతలికా—అని యీ మొదలయిన చాలా అపభ్రంశరూపాలు వున్నాయి — అని పతంజలిమహర్షి అన్నాడు.

ఈఇచ్చినవుదాహరణాలల్లో వాక్పతిరాజుచెప్పిందాన్నిబట్టి - సర్వభాషలూ ప్రాకృతంలో చేరినవే అనీ అందులోనుండే నేటివివిధభాషలూ ఏర్పడ్డాయనీ, జలములు సముద్రాల్లోంచి సూర్యకిరణాలద్వారా పైకి ఆకర్షింపబడి మేఘరూపంతో వేరైపోయినట్లే సంస్కరించుకొన్నకారణాన ప్రత్యేకంగా నాగరకభాషలుగా అయినవనీ, వాటిని ప్రజలు వాడుకచేసేకొద్దీ - మేఘరూపాన వుండే నీరు భూమిమీద వర్షింపకతప్పనట్లూ, వర్షిస్తే మరల సముద్రంలో ప్రవేశింపక విధిలేనట్లూనూ అసంస్కరింపబడిన నాగరకభాషలుకూడా ప్రజలనిరంతరవ్యవహారంచేత మరలమారి ఎప్పటిరీతి ప్రాకృతంగా ఏర్పడక తప్పదనిన్నీ, జీవద్వ్యవహారంలో వుండే భాషలరీతులన్నీ ఇంతే అనిన్నీ— మనకు స్పష్టంగా విశదమౌతూనే వున్నది. కాబట్టి ప్రాకృతమే మాతృక. సంస్కృతమే పుత్రిక.††

పతంజలిమహర్షిగ్రంథంలోని వుదాహరణాన్నిబట్టి ప్రజలు నిత్యమూ వ్యవహరించడంవల్ల ఒక్కొక్కమాటకున్నూ అనేకఅపశబ్దాలు ఏర్పడినవనిన్నీ సంస్కరించినసుశబ్దాలలో మార్పు లేకుండా వున్నవివున్నట్టు వుండే శబ్దాలు కొద్ది అనిన్నీ, ఎలాగంటే గోశబ్దం-గావీ గోణీ గోతా గోపోతలికా అనేమొదలయిన చాలా అపభ్రంశాలుగా మారినట్లే అనిన్నీ కాబట్టి ఆఅపశబ్దతాదోషపరిహారార్థం వ్యాకరణం ఆవశ్యకమే అని ఏర్పడుతూవుంది.

† యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్య చ వైద్యకేన, యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలి రానతోఽస్మి - అని నమస్కరిస్తారు ఈమహానుభావుణ్ణి పండితులూ.

†† మాతృక అనేమాటను Original Language అనే అర్థంలోనున్నూ, పుత్రిక అనేమాటను Derived Language అనే అర్థంలోనూ నేను వాడుక చేస్తున్నాను.

వీటివల్ల తేలినది ఏమిటంటే-అన్ని భాషలకూ అసలు మాతృక ప్రాకృతమే అనీ, సంస్కృతాది భాషలు ఈమాతృకకు ప్రతికలు అనీ. ఇది పైసందర్భాలచర్చచేత తేలినతాత్పర్యాంశం. కాని పూర్వుల్లో కొందరు ఈదాక్షిణాత్యామంతేకుండానే కంఠోక్తిగా చెప్పినవారు వున్నారు.

శ్లో. యదోన్యనిః కిల సంస్కృతస్య సుదృశాం జిహ్వాసు యన్మోదతే
యత్ర శ్రోత్రపథావతారిణి కటు ర్భాషాక్షరాణాం రసః
గద్యం చూర్ణపదం పదం రతిపతే స్తత్ప్రాకృతం య ద్వచః
తాఁ ల్లాటాఁ ల్లలితాంగి పశ్య నుదతీ దృష్టే ర్నిమేషవ్రతమ్.
(రాజశేఖరబాలరామాయణం)

అర్థం ఏమిటంటే- ఏది సంస్కృతభాషకు కూడా మాతృకగా (మూలంగా) వుండేదో, ఏది లలితలగు స్త్రీల జిహ్వాగ్రంగములు (తాండవిస్తూ) సమ్మోదిస్తూవున్నదో, ఏది చెవిని సోకినతరవాత, సంస్కృతభాషయొక్క అక్షర (మాధుర్య) రసంకూడా చేదుఅవుతుందో మన్మధుని పాదన్యాసం- అనదగ్గచూర్ణపదమనే ఆప్రాకృతవచనరచనను ఉచ్చరిస్తూ దృష్టికి నిమేషవ్రతం కలిగిస్తూన్న అలాటు దేశీయులను లలితాంగీ! కన్నార చూడుము—అని.

ఇల్లాగు చాలామంది పూర్వకాలపుకవిపండితుల్లో ప్రాకృతాన్నే మాతృకగానూ సంస్కృతాన్నే ప్రతికగానూ చెప్పి వున్నారు. ఇంకోవిశేషం ఏమిటంటే- అసలు ఇన్నిభాషలు లేవనిన్నీ సంస్కృతం ప్రాకృతం-అని రెండేరెండు భాషలనిన్నీకూడ వ్రాశారు. చూడండి:—

సక్కయా పాయియా చేవ్వ భణిదీయో హోంతి దోణ్ణి వా. (స్థానాంగసూత్రం)
సంస్కృతా ప్రాకృతాచేతి భాషే ప్రాధాన్య మర్హతః (సిద్ధర్షి)

అంటే సంస్కృతమనీ ప్రాకృతమనీ రెండేరెండు (సారస్వత) ఫణుతు లున్నవని మొదటిదాని కిన్నీ, సంస్కృతమూ ప్రాకృతమూ అని రెండేరెండు భాషలు ప్రాధాన్యమును పొందుతున్నవని- రెండోదానికిన్నీ అర్థము. కాబట్టి ఆనాడు ఉన్నభాషలు ముఖ్యమైనవి రెండే అనీ, అవి నేటిగ్రాంధికవ్యావహారికాంధ్రాలలాగు (సంస్కృతప్రాకృతాలు) ఉండేవనీ తేలుతున్నది.

* సంస్కృతమే అన్నింటికీ మూలం అనేవారి వాదానికి నిదర్శనాలు. *

సంస్కృతమే అన్నింటికీ మాతృకగాఉండేదీ అనేవాదానికీ ఒకటిరెండుప్రమాణాలు ఇస్తాను ఇంకను:

(౧) ప్రకృతే స్సంస్కృతాయా స్తు వికృతిః ప్రాకృతీ మతా (రూపకపరిభాష.)

(౨) తద్భవా సంస్కృతభవా సిద్ధా సాధ్యేతి సా ద్విధా (షడ్భాషాచంద్రిక.)

(౩) సంస్కృతం నామ దైవీ వా గన్వాఖ్యాతా మహర్షిభిః
తద్భవ స్తత్సమో దేశీ త్యనేకః ప్రాకృతక్రమః (దండికావ్యాదర్శ.)

ఇందులో మొదటిది ప్రాకృతం సంస్కృతపు ప్రతిక-అని స్పష్టంగా చెప్తూన్నది. రెండోది మొదటిదానిలాగా స్పష్టంగా చెప్పకున్నా, తద్భవమన్నపేరుతో సంస్కృతంలోనుండే ప్రాకృతం

వచ్చిందని సూచిస్తూ వుంది. మూడోది దండిపండితుడైన దండిపండితుడిది. కావ్యాదర్శం దశ కుమారచరిత్రా ఈయనకృతుల్లో ఇప్పుడు ప్రధానాలుగా లభించేగ్రంథాలు. సంస్కృతగ్రంథకర్త లందరూ ఈయన్ను ప్రామాణికుడుగా అంగీకరిస్తారు. పైనియిచ్చినదండివాక్యం — సంస్కృతం దైవీవాక్కని మహర్షులు అనుశాసించారనీ, [పరిశేషన్యాయంచేత ప్రాకృతం అల్లా కాదనీ] ప్రాకృత భాష—తత్సమతద్భవదేశ్యాదిభేదాలతో అనేకవిధంగా వుందనీ - చెప్తున్నది.

మరిన్నీ ఆదండిపండితుడే ఆకావ్యాదర్శంలోనే మరోమాటకూడా చెప్పాడు. అదేమంటే—

ఆభీరాదిగిరః కావ్యే ష్వపభ్రంశ ఇతిస్మృతాః । శాస్త్రేతు సంస్కృతా దన్య దపభ్రంశ తయోదితం.—అని.

అంటే-కావ్యాలభాషలలోఅయితే గొల్లలూ మొదలయిన (నీచజాతుల)వారిభాషణాలు అపభ్రంశాలన్న పేరుతో చెప్పవలె ననిన్నీ, కావ్యాల్లోగాక శాస్త్రాల్లోఅయితేమాత్రం సంస్కృతం తప్ప తక్కినభాషలన్నీ అపభ్రంశ మన్నమాటతో చెప్పవలెననిన్నీ అన్నట్లుగా ఆయన అభిప్రాయం అని-తెలుపుతుంది ఆశ్లోకం. ఇక్కడ శాస్త్రాలంటే బహుశా వ్యాకరణశాస్త్రం మీమాంసాశాస్త్రం లాంటి శాస్త్రాలని అర్థం చేసుకోవాలె కాబోలు. ఏమంటే సుశబ్దాపశబ్దాలవిచారణ చేసి, సుశబ్ద ప్రయోగానికి స్వర్గాదిఫలాలున్ను అపభ్రంశాలయిన [అపశబ్ద] ప్రయోగాలకు తద్భిన్నంగా ప్రత్యవాయాదులున్ను విధించినశాస్త్రాలు ప్రధానంగా ఆరెండే. అందువల్లనే ఇల్లా అర్థంచేసికోవాలెని అనుకుంటాను. వ్యాకరణమీమాంసాశాస్త్రాలలోని ఆచర్చలు ఈవ్యాసంలోనే స్థలాంతరాన వివరిస్తాను. మచ్చుకుగాను-

రుద్రటు డనేకవి సైతం ప్రాకృతభాషనే అపభ్రంశ మని అన్నాడు. ఆలంకారికులున్నూ తక్కినలాక్షణికులున్నూ మహర్షిభరతుని గొప్పప్రామాణికుడిగా అంగీకరిస్తారు. ఆయన నాట్య శాస్త్రం ప్రత్యేకవేదంగా ప్రసిద్ధికెక్కింది. ఆయన భరతశాస్త్రంలో అంటాడు గదా!—

ఏవం తు సంస్కృతం పాఠ్యం మయా ప్రోక్తం సమాసతః,
ప్రాకృతస్య తు పాఠ్యస్య సంప్రవక్ష్యామి లక్షణం
ఏతదేవ విపర్యస్తం సంస్కారగుణవర్జితం
విజ్ఞేయం ప్రాకృతం పాఠ్యం నానావస్థాంతరాత్మకం. - అని.

"ఈలాగా (వెనుకచెప్పినట్లుగా) సంగ్రహరీతిని సంస్కృతపాఠ్యము చెప్పాను. ఇకను ప్రాకృత పాఠ్యానికి లక్షణం చెప్పవలసిఉంది. ఈసంస్కృతపాఠ్యమే సంస్కారగుణవర్జితమై వ్యత్యయము నొందినచో నానావస్థాంతరాత్మక మగు ప్రాకృతపాఠ్యము అగునని తెలియదగ్గది" అని అంటాడు. భరతమహర్షి మాటలోని సంస్కారగుణవర్జితం - అన్నవిశేషణము ప్రాకృతాన్ని ఆనాటి గ్రామ్యముగా (వ్యావహారికభాషగా) చెప్పినట్లూహించడానికి గమక మని కీర్తివిశిష్టులగు వేంకటరాయ శాస్త్రులుగారు వ్యాఖ్యానించారు. ఇంతేకాకుండా ఆభరతమునే —

యే వర్ణా స్సంయుక్తా స్స్వరవర్ణా స్తనుతాం చాఽపి,
గచ్ఛంతి పదన్యస్తా స్తే విభ్రష్టా ఇతి జ్ఞేయాః.

అని వర్ణలోపవర్ణవ్యత్యయవర్ణాగమాదులచేత ప్రాకృతము సంస్కారపథమునుండి జారి అపభ్రంశత నొందిందని కూడా సూచిస్తాడు. నిరంతరమూ వ్యవహారంలో వుండే భాషలకే ఇట్టిభ్రంశాలు సహజంగా వస్తవి కాబట్టిన్నీ, ప్రాకృతం నాడు వ్యావహారిక భాషగా వుండేదని తేలుతూంది కాబట్టిన్నీ మనవారుద్దేశించిన అపభ్రంశనామధేయం ప్రాకృతానికే అని స్పష్టమౌతూ వుంది.

కాబట్టి సంస్కృతప్రాకృతాలలో మాతృక ఏది ?— అనే చర్చలో పూర్వులనిశ్చితమైన అభిప్రాయం ఏమిటీ ?- అంటే ద్వైధీభావం వున్నట్లు స్పష్టమే కదా ! అయినా మాధ్యస్థబుద్ధికి న్యాయ్యం ఏదో స్వతః గోచరిస్తూనే వుంది. అసలు వస్తుస్థితి ఇల్లాగు వున్నా ప్రాకృతభాషకు పెంట్టాన అపభ్రంశభాష - అని పేరు రావడంమాత్రం నిజం. నేటివ్యావహారికాంధ్రానికి గ్రామ్యత్వచిహ్నం వచ్చినట్లు ఇల్లాంటిపేరు రావడానికి ప్రధానకారణం నాడు తెలిసినంతవఱకూ, అది ఆనాడు బాలాది పరమవృద్ధపర్యంతం వ్యావహారిక భాషగా - అంటే వాడుకభాషగా ఉండడమే.

ప్రాకృతం నాడు ప్రజలవ్యవహారభాషగా ఉండేదనడానికి ఏమీ సందేహింప అవసరం లేదు. ఈవిషయం పైనిచూపిన చర్చలోనే అవగత మౌతున్నది. ఇంతే కాకుండా, సంస్కృతాలంకారికులు మొదలయిన లక్షణవేత్తలు నాటకపరిభాషలు వివరించేసందర్భంలో చెప్పిన ఆయాపాత్రలభాషానియమాలను బోధించే లక్షణవాక్యాలున్నూ జైనులూ బౌద్ధులూ మున్నగువారు జనసామాన్యాన్ని తమతమమతాలవైపుకు ఆకర్షించుటకై చేసినమతబోధలున్నూ వ్రాసినగ్రంథాలున్నూ, మహాభాష్యం-మొదలయిన శబ్దానుశాసనగ్రంథాలు అపశబ్దోచ్చారణవిచారణసందర్భంలో ప్రదర్శించిన వ్యవస్థలున్నూ స్పష్టంగా నాడు జనసామాన్యం ప్రాకృతాన్నే వాడుక చేసికొందనిన్నీ, దాన్నే అపభ్రంశమన్నారనిన్నీ వెల్లడిచేస్తున్నవి. లక్షణవేత్తలవాక్యాలు మహాభాష్యకర్తవాక్యాలను విచారణచేసేచోట చెప్పతలచుకొన్నాను; కాబట్టి జైనబౌద్ధాదులు తమతమ మతప్రచారాలను ప్రాకృతంలోనే సాగించేవారనడాన్నిమాత్రమే ఇక్కడ వుదాహరిస్తాను.

మహేశ్వరసూరి అనే పండితు డంటాడు - శబ్దభేదప్రకాశికలో -

> గా. సక్కయకవ్వస్సత్థం జే ణ జాణాంతి మందబుద్ధీయా, సవ్వాణ వి సుహబోహం తే ణేమం పాయియం రయియం. గూఢత్థదేసి రయియం సులయియవణ్ణేహిం విరయిదం రమ్మం పాయియకవ్వం లోయే కస్స న హియయం సుహావేయి. పరవువయారపరేణం సా భాసా హోయి ఏత్థ భణియవ్వా జాయయి జీయే విజహో సవ్వాణవి బాలమాయీణం.[ఛాయాః- సంస్కృతకావ్యస్యార్థం యే న జానంతి మందబుద్ధయః, సర్వేషా మపి సుఖబోధం తే నేదం ప్రాకృతం రచితం. గూఢార్థదేశిరహితం సులలితవర్ణైర్విరచితం రమ్యం ప్రాకృతకావ్యం లోకే కస్య న హృదయం సుఖయతి ?, పరోపకారపరేణ సా భాషా భవతు అత్ర భణితవ్యా, జాయతే యయా విబోధః సర్వేషా మపి బాలకాదీనాం.

అనిఅన్నాడు. అంటే సంస్కృతకావ్యపుఅర్థం తెలియని మందబుద్ధులందరికీ సుఖబోధంకోసరం ఇది ప్రాకృతంలో రచిత మైంది. గూఢార్థంలేని దేశిపదాలతో లలితాలయినవర్ణాలతో వ్రాసినఅందమైనప్రాకృతకావ్యం ఎవరికి సుఖం కలిగించదూ ? పరోపకారపరుడైనకవి పిల్లలు తల్లులు మొదల

యినవారికందరికీ తెలిసేటందుకై ఆప్రాకృతంలోనే గ్రంథరచన చెయ్యవలెనని తాత్పర్యం. వరరుచి రచించిన ప్రాకృతప్రకాశకు శ్లోకరూపమైన వ్యాఖ్య వ్రాస్తూ ఆగ్రంథకర్త అంటున్నారు కదా!

శ్లో. ప్రసీదంతు చ వాచ స్తాః యాసాం మాధుర్య ముచ్ఛ్రితం, ప్రాకృతచ్ఛద్మనా చక్రే కాత్యాయనమహాకవిః. అహో తత్ప్రాకృతం హారి ప్రియవక్త్రేందుసుందరం, సూక్తయో యత్ర రాజంతే సుధానిష్యందనిర్ఝరాః.

* ప్రాకృతమే నాటిప్రజలభాష. అందులోనే ప్రజలగ్రంథాలుండేవి. *

శ్లో. మత్తూణ దిట్ఠివాయం కాలియఉక్కాలియంగసిద్ధంతం థీబాలవాయణత్థం పాయియమయియం జిణవరేయిం [ ఛాయ-ముక్త్వా దృష్టివాదం కాలికోత్కాలికాంగసిద్ధాంతం, స్త్రీబాలవాచనార్థం ప్రాకృత ముదితం జినవరైః. ] (వర్ధమానసూరియుద్ధరించింది.)

దృష్టివాదాన్ని వదలేసి కాలిక - ఉత్కాలికాంగసిద్ధాంత మంతా స్త్రీలున్నూ పిల్లలున్నూ చదివే నిమిత్తం జైనాచార్యులు (తమతమ మతగ్రంథాలను ప్రాకృతంగానే - అంటే ప్రాకృతభాషయందే చెప్పారు - అని ఈవాక్యపు తాత్పర్యం. ప్రాకృతం ఆనాటి ప్రజలలో వ్యావహారికభాషగా ఉన్నదనడానికిన్నీ, ఆప్రజలకోసకే - అందులోనూ ఉన్నతవిద్యకు దూరమైనస్త్రీలూ బాలురూ చదివేందుకే ఆప్రాకృతభాషలో మతగ్రంథాలుకూడా వ్రాసేవారనీ ఇది చాటడం లేదా? ఈ విధంగానే హరిభద్రసూరీ అన్నాడు.

బాలస్త్రీవృద్ధమూర్ఖాణాం నృణాం చారిత్రకాంక్షిణాం,
అనుగ్రహార్థం తత్త్వజ్ఞైః సిద్ధాంతః ప్రాకృతః స్మృతః—(హరిభద్రసూరి.)

బాలురున్నూ స్త్రీలున్నూ వృద్ధులున్నూ మూర్ఖులున్నూ - అయినమనుష్యులకూ, చారిత్రాది గుణాలు అలవరచుకొనే నిమిత్తం ప్రయత్నించేవారికి - అనుగ్రహించూపేనిమిత్తమై తత్త్వవేత్తలుగా వుండే పెద్దలచేత ప్రాకృతమే (వ్రాయవలెనన్న) ఏర్పరుపబడ్డది - అని దీనిఅర్థం. ఈహరిభద్రసూరి ఎన్నోప్రాకృతగ్రంథాలు వ్రాశాడు. జైనబౌద్ధపండితుల్లో హరిభద్ర-వర్ధమాన-శీలాంక-జినపతి-సూరిప్రభృతులైన జైనాచార్యులున్నూ, మల్లవాది-శాంతిరక్షిత-కమలశీల-శీలరక్షితాదులగు బౌద్ధాచార్యులున్నూ వారివారి శాస్త్రగ్రంథాలను హెచ్చుపాళ్లు ప్రాకృతంలోను, తక్కువపాళ్లు సంస్కృతంలోనూ వ్రాశారు.

సంస్కృతప్రాకృతభాషల్లోనిపండితులిద్దరిచేతానూ దండిపండితుడని కీర్తింపబడ్డ ఆచార్యదండిపండితుడుకూడా ముక్తకంఠంతో ప్రాకృతగ్రంథమైన సేతుబంధాన్ని ప్రశంసిస్తూ—

మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః,
సాగర స్సూక్తిరత్నానాం సేతుబంధాది యన్మయం - ( దండికావ్యాదర్శ )

అని మహారాష్ట్రప్రాకృతం ఉత్తమమైన ప్రాకృతం అనిన్నీ అనేకసూక్తిరత్నాలకు సాగరమని (అంటే రత్నాకరమని చెప్పదగ్గ సేతుబంధాదికావ్యాలు ఆమహారాష్ట్రభాషలోనే వ్రాశారనిన్నీ) శ్లాఘింపక తప్పిందికాదు. ప్రాకృతమంజరిని (అంటే ప్రాకృతభాషకు వ్యాకరణాన్ని) నిర్మించినవారుకూడా - తమ గ్రంథంఆరంభంలో ప్రాకృతభాషను గురించి ఇల్లాగని ప్రశంసించారు.

శ్లో॥ అహో తత్ప్రాకృతం హారి ప్రియావక్త్రేందుసుందరం
సూక్తయో యత్ర రాజంతే సుధానిష్యందనిర్భరాః. అని.

“ఓహోహో! ఏమా ప్రాకృతభాష! ప్రియురాలిముఖచంద్రుడికిమల్లే ఎంతమనోహరంగానూ అందంగానూ వున్నది. ప్రాకృతభాషలోని మాటలన్నీ అమృతాలు స్రవించడంలో నిర్ఝరాలుగదా” అన్నాడు. సరస్వతీకంఠాభరణం అనే అలంకారశాస్త్రాన్ని వ్రాసీ, సంస్కృతవాఙ్మయానికి స్వర్ణయుగం ప్రసాదించిన విద్వత్ప్రభువని ప్రసిద్ధిపడసీ, ప్రాతస్స్మరణీయుడైన భోజరాజు తన గ్రంథంలో-

కేఽభూవ న్నాఢ్యరాజస్య రాజ్యే ప్రాకృతభాషిణః
శ్రీసాహసాంకస్య కే న సంస్కృతభాషిణః. (విశ్వనాథకవిరాజు.)

అని ఆఢ్యరాజుగారి రాజ్యంలో ప్రాకృతం మాట్లాడలేని అరసికులంటూ ఉన్నారా? అని ప్రాకృతాన్ని పోషించిన ఆమహాప్రభువు ఔదార్యాన్ని స్తుతిస్తాడు. కొందరు ఈఆఢ్యరాజు అన్నపదానికి బదులుగా నాన్యదేవస్య అని పాఠాంతరం వ్రాసి ఆపాఠమే ఉదాహరిస్తారు. వారిపాఠాంతరం ప్రకారం ఆనాన్యదేవుడు క్రమంగా నన్నెచోడదేవుడుగా మారితే ఆంధ్రులైనవారూ ఆనందమే సుమండీ!

ఇంతవఱకూ చెప్పినదాన్నిబట్టి ప్రాకృతమే నాటిప్రజలభాష అనీ, అందులోనే ఆనాటివారు ప్రజలకు విజ్ఞానభానూదయంకోసం సహృదయులై గ్రంథాలు వ్రాశేవారనీ, సంస్కృతాభిమానులు నేటికి మల్లేనే ఆనాటి ప్రజలవ్యవహారభాషను అపభ్రంశమని (నేడు గ్రామ్యం - అన్నమాటలాగ) తిరస్కరించేవారనీ సూచితమైంది. ఇంకను సంస్కృతాభిమానులు నాటిప్రాకృతాన్ని ఎల్లా నీరసభావంతో తృణీకరించేవారో, జనసామాన్యం ఉత్తమవిజ్ఞానం తమకు అందుబాటులో లేదనీ, వున్నా వ్యాకరణం అనే ఇనపగొలుసుల్తో బంధించిపెట్టుతున్నారనీ ఎల్లా వగచేదో ప్రదర్శిస్తాను.

ప్రాకృతవాఙ్మయంలో లీలావతీకథకు అగ్రస్థానం ఇస్తారు. ఆంధ్రులమైనమనం తప్పకుండా ఇయ్యాలి. ఏమంటే - అది ఆంధ్రదేశమునకు సంబంధించిన వకచారిత్రకకథఅనీ, అందులో ఆంధ్రదేశంలోని అనేకప్రాంతాలు వర్ణింపబడ్డాయనీ శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు చాలాకాలంక్రింద భారతిలో ౨, ౩ వ్యాసాలు ప్రకటించారు. గ్రంథంకూడా త్వరలో ప్రకటిస్తామన్నారు. ఆంధ్రులు ఆయనచేత త్వరలో ఆగ్రంథం ప్రకటితమయ్యేట్టు యత్నించాలి. ఈలీలావతీకథలో.

శ్లో. అయి రమణీయా రఅణీ, సరఓ వి మణోహరో తుమం చ సాహీణో
అణుకూలపరియణాయే మన్నే తం నత్థి జం ణత్థి
తా కింపి పదోసవిణోదమేత్తసుహఅం మణహరుల్లావం
సాహేయి అపువ్వకహం సురసం మహిళాయణమణోజ్జం. (౧)

---

(౧) ఛాయ- అయి రమణీయా రజనీ శరదపి మనోహరః త్వమపి స్వాధీనః, అనుకూలపరిజనాయాః మన్యే యన్నాస్తి తన్నాస్తి. తత్కిమపి ప్రదోషవినోదమాత్రసుఖదాం మనోహరోల్లాపాం సాధయ తాఽపూర్వకథాం సురసాం మహిలాజనమనోజ్ఞాం—అని.

నాయిక అడుగుతుందిగదా - రాత్రి రమణీయంగా వుంది. దానికి తగినట్టే శరత్కాలము కూడా మనోహరంగా వున్నది. ప్రేమాస్పదుడవైననీవున్నూ (నాకు) స్వాధీనుడవై వున్నావు. పరిజనులు కూడా అనుకూలురుగా వున్నారు - లేనిదంటూ లేదని అనుకుంటాను. కనుకా, ఏదేనా, మనస్సుకు ఇంపుపుట్టించే సంభావణగలదిగానూ, ఈప్రదోషకాలపువినోదానికి తగినట్టిదిగాను ఉన్నకొత్తకథ-చక్కనిరసం పుట్టిపడేదాన్నీ మహిళాజనానికి ఇంపుసంపాదించేదాన్నీ సాధించండి (అంటే-చెప్పండి)-అని.

ఇల్లాగు ఎంతో అమాయికత్వాన్ని వెల్లడిస్తూ అడిగినప్రియురాలిని చూచి ఆకథానాయకుడు అంటాడూ. కువలయదళాక్షీ! కవులు మూడురకాలైనకథలే లోకంలో ఉన్నవన్నారు. ఎల్లాగంటే - దివ్యకథఅనీ, దివ్యమానుషీకథ అనీ, మానుషీకథ అనీ. అందులో మొదటిరెండురకాలకథకు తొల్లొల్లటి కవులు ఏదో కొంచెం లక్షణం అంటూ ఏర్పరచారు. తక్కిన సంస్కృతప్రాకృతాలు కలిసిన (దివ్యమానుషీకథ) సంకీర్ణకథలు చక్కనివర్ణరచనల్లో మహాకవిపుంగవులు చెపుతారు. ఈమూడురకాలకథలున్నూ చక్కనికథలే. వాటిలో మాలాంటి అప్రాజ్ఞులు చెప్పేకథలు (లక్షణశాస్త్రాలు అనుసరించి చెప్పేవి కావుకాబట్టి) లోకంలో పరిహాసాన్ని పొందవుమరీ! కనుకా— "

శ్లో. తా కిం మం ఉపహాసేసి సుతణు అస్సుదేణ సద్ధసత్థేణ, ఉల్లవిఉం న తీరది కిం పుణ వియడ్డో కహాబంధో? [ఛాయ-త త్కిం మా ముపహాససి సుతను! అశ్రుతేన శబ్దశాస్త్రేణ, ఉల్లపితుం న తరతి (శక్యతే) కింపునః వికటః కథాబంధః]

"సుతనూ! నన్నెందుకు పరిహసిస్తావూ? శబ్దశాస్త్రాన్ని వినేనా ఎరుగనివాడికి బాగా మాట్లాడ్డానికేనా వీలుకాదంటారు కదా! అల్లాంటిస్థితిలో వికటమైనకథాబంధం-మరి చెప్పేదేమిటీ?" అంటాడు. ఈమాటల్లో లక్షణశాస్త్రాలఖనపగోలుసులు చూచి - ఎంతటిసహజచాతుర్యం వున్నా - ఎల్లా నోరు తెరవడానికి భయపడేవారో, ఆకాలంవారు!- అనేవిషయమున్నూ, వారిమనస్సులు విజ్ఞానతృష్ణతో ఎల్లా తహతహపడుతుండేవో అనే విషయమున్నూ విశదపడతాయిగదా!

తర్వాత ఆనాయికఅన్నమాట వినండిమరి !- ఏమంటున్నదో ! హృదయం చుమ్మచుడుతూవుంది.

శ్లో. భణియం చ పియతిమాయే - పియయమ! కిం తేణ సద్దసత్థేణ? జేణ సుహాసియమగ్గో భగ్గో అమ్మారిసజణస్స, ఉవలబ్భయి జేణ ఫుడం అత్థో అకయత్థి ఏణ హియయేణ, సో చేయ పరో సద్దో ఇత్థో కిం లక్ఖణేణమ్హా? ఏమేయ సుద్ధజుయఇ మణోహరం పాయియాయి భాసాయే, పవిరళదేసిసులక్ఖం కహాసు కహం దివ్వమాణుసీయం — [ఛాయః— భణితం చ ప్రియతమయా — ప్రియతమ! కిం తేన శబ్దశాస్త్రేణ? యేన సుభాషితమార్గః భగ్నోఽస్మాదృశజనస్య, ఉపలభ్యతే యేన స్ఫుటం అర్థోఽకదర్థితేన హృదయేన సఏవ పర శ్శబ్దఇష్టః కిం లక్షణేనాఽస్మాకం?, ఏవమేవ శుద్ధహృదయాం మనోహరాం ప్రాకృతయా భాషయా, ప్రవిరళదేశిసులక్ష్యాం కథయ కథాం దివ్యమానుషీయాం-అని.]

" ఇల్లా అన్నప్రియుడిమాటలకు ఆతడిప్రియురాలు అన్నదీ - ప్రియతమా! ఏశబ్దశాస్త్రం చక్కని ముద్దులుగురిసే సుభాషితందారిని పాడుచేసి వేసిందో ఆశబ్దశాస్త్రంవల్ల లాభం ఏముంది! దేనిచేత

అర్థం చాలావిశదంగానూ, దాపరికంలేని హృదయంతోనూ వెల్లడిఅవుతుందో, అదే మాపాలిటికి శబ్దం - అని నామతం, అంతేకాని అర్థంకానిలక్షణాంతో ఏమిలాభం! కనుక అల్లాగే - (అంటే రాని వ్యాకరణాది లక్షణశాస్త్రాలవైపుపోయి, చెడగొట్టుకోకుండా వుండేసంభాషణ భాషతోనే) పరిశుద్ధంగా విప్పారినహృదయంగల ఇంపైనకథను విస్తారంగా దేశిమార్గంతో ఒప్పివుండేట్టు, దివ్య మానుషులకు చెందివుండేట్టు చెప్పండి - అని ఆనాయిక అడిగింది

ఆలోచించిచూడండీ! ఈమాటలు ఆనాటిజనసామాన్యపుహృదయాలు కష్టాంతృష్ణలో ఎల్లా కుత కుత ఉడుకుతూ వుండేవో సూచించడం లేదూ! లక్షణశాస్త్రాలు ఆ ఉక్కుచట్టాలు వారిని నొక్కివేయడం లేదూ! నిరాశగలహృదయాలతో నేటివాడుకభాషావాదులలాగు తెగించి సాహసానికి ప్రవేశిస్తూన్నట్టు చాటడం లేదూ? ఏమని సెలవిస్తారు నేటిసహృదయులు? చెప్పండీ!

లీలావతీకథలోని ఈసందర్భమున్నూ ప్రాకృతమే ఆనాటిప్రజలవ్యవహారభాష అనిన్నీ, నాటి సంస్కృతజ్ఞులయిన గ్రాంథికవాదులు జటిలమైన లక్షణశాస్త్రంతో వారిని దిగదొక్కడానికి యత్నించే వారు అనిన్నీ, కానిప్రజలుమాత్రం వీలున్నంతవరకూ వారిలక్షణశాస్త్రాలను గౌరవిస్తూ - సహించడం దుర్భరం కాగానే తెగించి అందులోనే తమవాఙ్మయాన్ని ప్రత్యేకింపబూనుకొనేవార నిన్నీ కంఠోక్తిగా చెప్పకుండానే చెప్పుతూందిగదా! మఱి సందేహం ఎందుకూ!

మఱిన్నీ తమ కుందేటికి మూడుకొమ్ములన్న వనడం నాడున్నూ వున్నదే. జనసామాన్యానికి వ్యావహారికభాషగా వుండే ప్రాకృతాన్ని ఆనాటి గ్రాంథికులయిన సంస్కృతజ్ఞులు ఈసడించి కొనేవారు. ఇప్పటివాడుకభాషను ఆదరించేవారికి పెట్టినట్లే నాటివారున్నూ వికృతపుపేర్లు పెట్టడం అనేది సర్వసాధారణంగా వుండేది. ప్రభువుల్లోనూ ప్రజల్లోనూ కొందరు ఎట్లా ఈసడించేవారో ఇక్కడ కొంచెం చూపుతాను.

* ఆనాటిగ్రాంథికులు ప్రాకృతాన్ని ద్వేషించినవిధం. *

ఆంధ్రజాతికి మూలపురుషుడైన శాతవాహనుడు లేక శాలివాహనుడూ ఆబాలగోపాలం తెలిసిన వాడే కాని మఱొకటికాదు. ఈయన చరిత్రలో ప్రసిద్ధిగావాడబడే దీపకర్ణికొడుకని అంటారు. దక్షిణాపథంలోని ప్రతిష్ఠానపురం ఇతని రాజధాని అంటారు. దీన్నే నేటి పైఠణ్ అని కొందరూ, కాదు పటణ్ (గుజరాతులో) అని కొందరూ అంటారు. కాని ఇది కుంతలదేశంలోది అని మఱికొంద రంటారు. సారస్వతవిభాగంలో ఈమహారాజుపేరు శాశ్వతంగా నిలిపినగ్రంథం గాథాసప్తశతి కొన్ని గాథాసప్తశతిపుస్తకాలలో -

గా. రాయేణ విరయియాఏ కుంతలజణవయఇణేణ హాలేణ
సత్తసయీ య సమత్తం సత్తమమశ్వాసయం ఏయం.

అని వున్నదనీ కాబట్టి కుంతలదేశంవాడనీ, వాత్స్యాయనుడు పేర్కొన్న కుంతలశాతకర్ణి యితడే అనీ అంటారు. కావచ్చు. నాకిక్కడ చరిత్రచర్చతో పనిలేదు. కుమారగిరిమొదలు ద్వారకదాకా కుంతలదేశమే అని శక్తిసంగమతంత్రం చెబుతున్నది. ఈమహారాజు సంస్థానంలోనే గుణాఢ్యుడనీ శర్వవర్మఅనీ ఇద్దరు మహాపండితు లుండేవా రట. అందులో గుణాఢ్యుడనే పండితుడు బృహత్కథ

అనే పైశాచభాషాగ్రంథం రచించాడు. కథాసరిత్సాగరం ఈబృహత్కథలోని ఒకకథకు అతిసంగ్రహమైన సంస్కృతానువాదం. ఈకథాసరిత్సాగరాన్ని వేదంపండితులు సరసంగా ఆంధ్రీకరించి వెలయించారు.

అసలు బృహత్కథ పైశాచీభాషలో ఏడులక్షల శ్లోకాలు గలగ్రంథం అనీ, దాన్ని గుణాఢ్య పండితుడు శర్మవర్మతో తెచ్చుకొన్న జట్టీమూలకంగా సంస్కృతప్రాకృతాలూ దేశభాషా అనే మూడుభాషల్లోనూ తనఅవమానానికి సూచనగా ఉండేందుకుగాను గ్రంథరచనచేయకుండా మానుకొంటా ననీ ప్రతిజ్ఞబట్టి, ఆప్రకారమే, ఆమూడుభాషలూ వదలి పిశాచభాషలో వ్రాయవలసి వచ్చింది అనీ, కథాసరిత్సాగరం అనేపేరుతో దానిలోని ఒకభాగాన్నిమాత్రమే ( అంతేమిగిలింది కూడా ) సంస్కృతీకరించిన సోమదేవసూరి చెప్పినాడు.

గుణాఢ్యుడి శర్మవర్మజట్టీనిగురించి తర్వాత తెలుపుతాను. ముందు సోమదేవసూరిమాటాలతోటే శాతవాహనమహారాజు ప్రాకృతాంతర్భాగమైన ఆపైశాచికబృహత్కథకు దయచేసిన గౌరవాన్ని వివరిస్తాను. మహానుభావుడు గుణాఢ్యపండితుడు ఇల్లాగు పైశాచికభాషలో ఏడులక్షల దివ్యంగా వుండే కథాగ్రంథాన్ని వ్రాసి దాన్ని లోకంలో వెల్లడిచేయడానికని తనశిష్యులప్రోత్సాహంతో మహారసికుడని పేరు పొందినశాతవాహనుడి దగ్గరకు పంపుతాడు. తర్వాతికథ స్వయంగానే చదవండి.

ఏవం గుణాఢ్యవచసా సాఽథ సప్తకథామయీ, స్వభాషయా కథాదివ్యా కథితా కాణభూతినా, తథైవచ గుణాఢ్యేన పైశాచ్యా భాషయా తయా, నిబద్ధా సప్తభిర్వర్షై ర్గ్రంథలక్షాణి సప్త సా, మైతాం విద్యాధరా హార్షు రితి తా మాత్మశోణితైః, అటవ్యాం మష్యభావా చ్చ లిలేఖ స మహాకవిః.

♦ ♦ ♦

ప్రతిష్ఠా ప్రాపణీ యైషా పృథివ్యాం మే బృహత్కథా, అయ మర్థోఽపి మే దేవ్యా శాపాంతోక్తావుదీరితః, తత్కథం ప్రాపయా మ్యేతాం కస్మై తావ త్సమర్పయే, ఇతి చాచింతయ త్తత్ర స గుణాఢ్యో మహాకవిః. అథైకో గుణదేవాఖ్యో నందిదేవాభిధః పరః తమూచతు రుపాధ్యాయం శిష్యా వనుగతా వుభౌ, తత్కావ్య స్యార్పణస్థాన మేకశ్శ్రీ సాతవాహనః. రసికో హి వహే త్కావ్యం పుష్పామోద మివానిలః, ఏవమస్త్వితి తౌ శిష్యా వంతికం తస్య భూపతేః, ప్రాహిణో త్పుస్తకం దత్వా గుణాఢ్యో గుణశాలినా, స్వయం చ గత్వా తత్రైవ ప్రతిష్ఠానపురా ద్బహిః, కృతసంకేత ఉద్యానే తస్థౌ దేవీ వినిర్మితే.

♦ ♦ ♦

పిశాచభాషాం తాం శ్రుత్వా తౌ చ దృష్ట్వా తదాకృతీ, విద్యామదేన సాసూయం స రాజైవ మభాషత, ప్రమాణం సప్తలక్షాణి పైశాచం నీరసం వచః, శోణితే నాక్షరన్యాసో ధిక్పిశాచకథా మిమాం.

తతః పుస్తక మాదాయ గత్వా తాభ్యాం యథాగతం, శిష్యాభ్యాం త ద్గుణాఢ్యాయ యథా వృత్త మకథ్యత.

♦ ♦ ♦

తత్రాగ్నౌ పత్ర మేకైకం శిష్యాభ్యాం సాశ్రు వీక్షితః, వాచయిత్వా స చిక్షేప శ్రావయ న్మృగపక్షిణః, నరవాహనదత్తస్య చరితం శిష్యయో స్తయోః, గ్రంథలక్షం కథా మేకాం వర్జయిత్వా తదీప్సితాం. (కథాసరిత్, లంబ ౧, తరంగ ౮, శ్లో. ౧-౨౦.)

ఈశ్లోకాలఅర్థంయిదీ:— ఈరీతిగా (గుణాఢ్యుడు ప్రార్థించుటచేత) అతడిమాటచొప్పున కాణభూతి తన(పిశాచ) భాషలో ఏడుకథలతో వున్నఆదివ్యకథ చెప్పాడు. గుణాఢ్యుడున్నూ ఆయన చెప్పినట్లే ఆపైశాచీభాషలోనే ఆదివ్యకథను విని ఏడేండ్లు (కష్టించి) ఏడులక్షలగ్రంథంగా దాన్ని కూర్చాడు. ఈదివ్యకథలు విద్యాధరు లపహరింపకుందురన్న ఆశతోనూ, అడవిలో సిరా లేకపోవడం చేతానూ, తనశరీరపురక్తంతోనే ఆమహాకవి దాన్ని వ్రాశాడు. ... ... ... నేను రచించిన యీబృహత్కథ భూమిలో ప్రతిష్ఠపొందించాలిగదా. ఈవిషయమే దేవికూడా శాపాంతాన్ని అనుగ్రహించేమాటలో చెప్పింది. ఎల్లా ప్రసిద్ధిపొందిస్తాను దీన్ని ? ప్రసిద్ధిపొందించేందుకు ఎవరికి అర్పించేది ఈకథనూ ? అని మహాకవి ఆగుణాఢ్యుడు ఇల్లా చింతించాడు. గుణదేవుడు ఒకడూ నంది దేవుడనే పేరువాడు రెండోవాడూ [అతని] శిష్యులు ఇద్దరూ అన్నారు ఆవుపాధ్యాయుడితో-, ఆకావ్యానికి సమర్పణస్థానం ఒక్కడే సాతివాహనమహారాజు. పూలపరిమళాన్ని గాలివలె రసికుడే గదా కావ్యాన్ని వహిస్తాడూ ! - అని. సరే. ఇల్లాగే కానీండని ఆశిష్యులను గుణశాలులైనవారినీ ఆపుస్తకం ఇచ్చి ఆరాజువద్దకు పంపించాడు గుణాఢ్యుడు. తానున్నూ ప్రతిష్ఠానపట్నం వెలుపల దేవీనిర్మితమైన వుద్యానంలో సంకేతం ఏర్పరచుకొని వున్నాడు. ... ... ... [రాజు ఆశిష్యుల] ఆపిశాచభాషను వినిన్నీ, వారి ఆకారాలు చూచిన్నీ విద్యామదంతో అసూయాగర్భంగా ఇల్లా అన్నాడు - ఏడు లక్షలు గ్రంథపరిమాణమా ? నీరసమైనపైశాచవాక్కు ? నెత్తురుతో అక్షరాలు వ్రాయడమా ? ఛీఛీఛీ ! పిశాచపుకథా !!- అని. తర్వాత ఆశిష్యులు పుస్తకం తీసికొని వచ్చినదారినే మళ్ళిపోయి గుణాఢ్యుడికి జరిగినదంతా చెప్పారు ... ... ... అక్కడ ఆశిష్యులు కన్నీళ్లతో చూస్తూవుండగా - ఆగ్రంథంలో ఒక్కొక్క (తాటి) ఆకూ చదివి, (ఆఅడవిలోవుండే) మృగాలకూ పక్షులకూ వినిపించి, అగ్నిలో[హోమంచేసి]వేశాడు. నరవాహనదత్తుడి చరిత్రఅనేది ఒక్కటిమాత్రం, వారు ప్రాశేయపడికోరుకొన్నదాన్ని - లక్షశ్లోకాలగ్రంథపరిమితికలదాన్ని - వదలి తక్కినదంతా అగ్నిలో వేశాడు. (ఏడు—ఇల్లాక్రిందగీతదగ్గర ఒత్తిపలకవలె.]

పైని ఇచ్చినకథాసరిత్సాగరపుసందర్భంచేత వాడు ప్రాకృతానికి శాతవాహనమహారాజంతటివాడు అసూయచేత ఎల్లాంటిగౌరవం ఇచ్చాడో, తన్మూలంగా ఎంతశోభకు పాలైందో ఆగుణాఢ్యపండితుడి హృదయమున్నూ దానితోపాటు వాటిప్రజలభాగధేయమున్నూ, వేరే వివరించనక్కఱలేకుండానే చదువరులు వూహించే వుంటారు. అయితే శాతవాహనుడు మూర్ఖుడు కాడు. అది ఆనాటిప్రజలూ వారిసంతతివారమైనమనం చేసికొన్న పాపపుఫలం ! లేకుంటే కథామాత్రం శేషించిన ప్రాకృతకవుల

రచనల నెన్నింటినో కాలగర్భంలో పడిపోనీకుండ మచ్చుకైనా రుచి చూచేందుకుగా గాథాసప్త శతిరూపంలో భద్రపఱచిన ఆమహారాజు– అసూయాపిశాచం ఆవేశింపకపోతే అల్లా చేశేవాడేనా ? ఓహో ! నశించకుండా వుండివుంటేనా ! ఏడులక్షలప్రాకృతవాఙ్మయం !!, ఎన్ని చమత్కారపు కథ లుండేవో ! ఎంత సారస్వతసంపద వెల్లివిరిశివుండేదో ! ఏడులక్షలగ్రంథంఅంటే ఏడుభారతాలంత !!

* శాతవాహనమహారాజుగారి మోదకైస్తాడయకథ *

అసలు శాతవాహనమహారాజుభాష తొలుదొల్త ప్రాకృతభాషే. అంటే ఆయన ప్రాకృతం వ్యవహారభాషగా గలవాడే మనవాటి భోజమహారాజుగారివలెనే ! మోదకైస్తాడయకథ పుట్టినతర్వాతే ఆయన మహాసంస్కృతు డై పోతాడు. బహుశఃఅంతకులోపలనే అయివుంటుంది గాథాసప్తశతిని సంధానంచేయడమున్నూ, లీలావతీకథానాయకుడుగా వుండడమున్నూ. సోమదేవసూరి ఈమోదకై స్తాడయకథను ఇల్లా ఆరంభించాడు.

శ్లో. అథైకా తస్యమహిషీ రాజ్ఞః స్తనభరాలసా, శిరీషసుకుమారాంగీ, క్రీడంతీ క్లమ మభ్య గాత్, సా జలై రభిషించంతం రాజాన మసహాసతీ, అబ్రవీ న్మోదకై ర్దేవ పరితాడయ మా మితి, త చ్ఛ్రుత్వా మోదకా న్రాజా ద్రుత మానాయయ ద్బహూన్, తతో వి హస్య సా రాజ్ఞీ పునరేవ మభాషత, రాజ న్నవసరః కోఽత్ర మోదకానాం జలాంతరే, ఉదకై స్సించ మా త్వం మా మిత్యుక్తం హి మయా తవ, సంధిమాత్రం నజానాసి మాశ బ్దోదకశబ్దయోః, న చ ప్రకరణం వేత్సి మూర్ఖ స్త్వం కథ మీదృశః ఇత్యుక్త స్స తయా రాజ్ఞ్యా శబ్దశాస్త్రవిదా నృపః, పరివారే హస త్యంతర్లజ్జాక్రాంతో ఝగి త్య భూత్ [కథాసరిత్]

ఈశ్లోకాలఅర్థం ఇదీ:— “ఆరాజు (శాతవాహనుడు) గారిభార్యల్లో వక్కత్తె స్తనభరాలసగాను శిరీషసుకుమారాంగిగాను ఉన్నదై (రాజుతో జల) క్రీడ లాడుతూ, తనపైని అతిగా జల్లులాడుతూ వుండే రాజును సహింపజాలక అన్నది - దేవా! మోదకైస్తాడయ - అని, (మా + ఉదకైః + తాడయ = నీళ్ళతో నన్ను కొట్టకు - అని.) ఆమాట విని రాజు త్వరగా మోదకాలు చాలా (మోదకాలు =లడ్డూలు) తెప్పించాడు. ఆరాణి నవ్వి మళ్ళా చెప్పిందీ - రాజా ! నీళ్ళల్లో లడ్డూలకు ఏం అవసరం ! నీళ్ళతో కొట్టవద్దని అన్నాను. సంస్కృతంలో సంధిమాత్రమేనా ఎరగవు పోనీ ప్రకరణమేనా ఎరగవు. ఇల్లాంటి మూర్ఖుడవు ఎల్లా అయినావు ! శబ్దశాస్త్రవిదురాలయిన ఆరాణి ఇల్లా అనగా, దాపునవున్న పరివారజనం నవ్వగా, మితిమీరి లజ్జ రేగగా, ఒళ్లంతా మెరుపులు చుట్టుకొన్న ట్లైనాడు ఆరాజు.

దీన్నిబట్టి శాతవాహనమహారాజు అంతవఱకూ ప్రాకృతమే మాట్లాడేవాడనీ, అప్పటికింకా మడి గట్టుకొని సంస్కృతం పవిత్రంగా చేపట్టలేదనిన్నీ, విద్వాంసురాలైన ఆభార్యామూలకంగానే సం స్కృతవిద్యాభ్యాసానికిన్నీ తమ్ములంగా గుణాఢ్యశర్మవర్మలకు జట్టీ ఏర్పడడానికిన్నీ, అతర్వాత అబ్బిన సంస్కృతత్వంచేతనే గుణాఢ్యగ్రంథాన్ని అన్నివిరుపులతో అన్నిధిక్కారములకు పాల్పరచ డానికిన్నీ అనువు ఏర్పడ్డదని స్పష్టంగా తెలుస్తూ వున్నది. ఇది సాతవాహనమహారాజుగారి మోదకై

స్తాదయకథ. ఈకథతో సంబంధంకలదే కాబట్టి గుణాఢ్యపండితుడికి ఏర్పడ్డ శర్మవర్మజట్టీని కొంచెం చూపి తర్వాత మళ్ల ఎప్పటికథలోకి వస్తాను.

* శర్మవర్మతో గుణాఢ్యుడికి ఏర్పడ్డజట్టీ బృహత్కథ పైశాచీలో వ్రాయడానికి కారణంగా ఏర్పడ్డది. *

రాణిచేత అవమానింపబడ్డాననుకొన్న ఆ రాజు వెంటనే సభలోకి వచ్చి తనకు సంస్కృతభాషా పాండిత్యం అబ్బేందుకు సాధనం ఏమిటని అడుగుతాడు. అప్పుడు గుణాఢ్యపండితుడు రాజుగారికి జవాబు ఇస్తాడు. శర్మవర్మ కాదంటాడు. దానితో గుణాఢ్యుడికి కోపంవచ్చి ప్రతిజ్ఞపడతాడు. శర్మవర్మే గెలుస్తాడు. గుణాఢ్యుడు వోడిపోయి, తనపంతంప్రకారం సంస్కృతప్రాకృతాలూ దేశభాషా ఆజన్మం వదిలేసి లేచిపోయి, పైశాచీభాష నేర్చుకొని బృహత్కథ రాస్తాడు. ఇది సందర్భం. ఇక చదవండి -

శ్లో. తతో౽వా సవద వాగ్జన్మ వర్షైర్ద్వాదశభి స్సదా, జ్ఞాయతే సర్వవిద్యానాం ముఖం వ్యాకరణం నరైః, అహంతు శిక్షయామి త్వాం వర్షషట్కేన తద్విభో, శ్రుత్వైత త్సహసా సేర్ష్యం శర్మవర్మాకిలావదత్, సుఖోచితో జనః క్లేశం కథం కుర్యా దియ చ్చిరం, త దహం మాసషట్కేన దేవ త్వాం శిక్షయామి తత్, శ్రుత్వైవైత దసంభావ్యం త మవోచం అహం రుషా, షడ్భి ర్మాసై స్త్వయా దేవ శిక్షిత శ్చే త్తతో మయా, సంస్కృతం ప్రాకృతం తద్వద్దేశభాషాచ సర్వథా, భాషాత్రయమిదం త్యక్తం యన్మనుష్యేషు సంభవేత్. (కథాసరిత్సాగరం)

ఈశ్లోకాలఅర్థం - (గుణాఢ్యుడు చెబుతున్నాడు) తర్వాత నే నన్నాను - రాజా! సర్వవిద్యలకూ ద్వారంగా వుండే వ్యాకరణం మనుష్యులు పన్నెండేళ్లు నేర్చుకొంటారు. నేను తమకు ఆరేండ్లలో నేర్పుతాను. ప్రభో-అని. ఈమాట విని శర్మవర్మ అతితొందరగా అసూయతో జవాబిచ్చాడు - సుఖానికి అభ్యాసైనవాడు ఇంతకాలం ఇంతకష్టాన్ని ఎల్లా సహిస్తాడూ? కాబట్టి ప్రభూ! నేను ఆరునెల్లలోనే నేర్పుతాను-అని. శర్మవర్మమాట (నెగ్గేదే కానిదన్నమతితో) విని కోపంతో శర్మవర్మతో అన్నాను - నీవు ఆరునెల్లలోనే రాజువకు నేర్పగలిగితే, నేను సంస్కృతప్రాకృత భాషలున్నూ దేశభాషా అమూడుభాషలూ (వ్యవహరింపకుండా)వదులుకొంటాను. మనుష్యలోకంలో వ్యవహారంలో సంభవించేవి ఏవివున్నవో - అని (తర్వాతే పైశాచికబృహత్కథానిర్మాణం)

* ప్రాకృతంలో కవితచెప్పేకారణాన ఆచార్యహేమచంద్రునిపైని ఏర్పడ్డపితూరీలు, అతనిజవాబు *

ప్రాకృతాన్ని ఎల్లా ద్వేషించారో అనేది నిరూపించేకొరకు శాతవాహనుడికథ తెచ్చాను. దాని చేత చాలాచుట్టు తిరగవలసి వచ్చింది. ఈసందర్భంలోనే హేమచంద్రాచార్యుడిపైని ఆకాలంవారు చేసిన పితూరీనిగురించిన కథ ఒకటి వున్నది. దాన్నికూడా చదితేకాని సాంస్కృతికులు చూపిన ప్రాకృతద్వేషగాథ పూర్తికాదు. హేమచంద్రాచార్యుడు కలికాలసర్వజ్ఞుడనీ, బహుళగ్రంథకర్త అనీ విఖ్యాతి పొందాడు. ఈయనగ్రంథాలు ప్రాకృతులూ సంస్కృతులూ కూడా చదివేవారు. ప్రామాణికణ్ణిగా కూడా అంగీకరింపక తప్పిందికాదు. హేమచంద్రుడు కుమారపాలప్రబంధం -అని

వ్రాశాడు. అది కుమారపాలుడనే రాజుగారి చరిత్ర-వేమభూపాలీయంలాగా. ఆయన ఆగ్రంథం వ్రాసి కుమారపాలుడికి వినిపించేకాలంలో చాటుగా ఏజంఘాలుడో ఆరాజుగారికి ప్రాకృతం అప భ్రంశభాష అనీ, దాన్ని నిర్దురకేచి వినరాదనీ, శిటిగ్రాంథికంలాగా మంగళంగావుండే సంస్కృ తాన్నే ఆదరించవలసిందని వినిపించాడు. అయితే కుమారపాలుడు, మనభోజునిలాగా మతి మొఖం చూడననీ ఒట్టు పెట్టుకోలేదు. కాని, కొంచెం అనుమానించి, ఆసంగతిని హేమచంద్రుణ్ణే అడిగినాడు. ఆయన జవాబు చెప్పాడు. ఆసంగతి ఈక్రిందిపంక్తుల్లో వస్తుంది. చిత్తగించండిమరీ—

అన్యదా కోఽపి మత్సరీ శ్రీహేమసూరితేజోసహిష్ణు రేకాంతే రాజాన మిద మవాదీత్- "దేవ! ప్రాయః ప్రాకృతమేతే పఠంతి. సిద్ధాంతోఽప్యేతేషాం ప్రాకృతమయః, తత్ప్రభా తేఽశ్రోతవ్యమిదం. శ్లో. సంస్కృతం స్వర్గిణాం భాషా పైశాచం ప్రాకృతం విదుః,— సైవ మహతాం ప్రత్యూషే శ్రోతవ్యా గైర్వాణీ. శ్రేయస్కరీ చ. ఏవంస్థితే కిమర్థం ప్రథమం ప్రభాతే తచ్ఛ్రవణం విధీయతే దేవేన!"- ఇతి. ఏత దాకర్ణ్య రాజా విజ్ఞాత భాషాభేదతత్త్వోఽపి స్వయం ప్రాకృతే కించిత్కృతాదరః తత్స్వరూపం గురూణాం అకథ యత్. శ్రీగురవః ప్రాహుః - అనుపాసితసద్గురుకులస్య అజ్ఞాతవాఙ్మయతత్త్వస్య కస్యా పీదం వచో భవేత్. రాజన్, అనేకధా భాషాభేదవైచిత్ర్యేఽపి పరం యుగాదౌ ప్రథమ భూరుషేణ జ్ఞాతత్రైలోక్యస్వరూపేణ ప్రప్రథమం చతుర్దశస్వరాష్టత్రింశద్వ్యంజనరూపా ద్విపంచాశదక్షరప్రమాణా మాతృకైవ ఉపదిష్టా. సాచ ప్రాకృతిరూపా సర్వప్రాకృత లోకా ముపకారిణీ సంజాతా. తతో బాహ్య యేఽష్టత్రింశద్వర్ణా స్తై స్సంస్కారే కృతే సంస్కృతం జాతం. తత శ్చ అనేకే భాషాభేదా అభూవన్. ... ... ...

తత శ్చ తేన సకలశాస్త్రమూలం మాతృకారూపం ప్రాకృత మేవ ప్రథమం, యుగాదౌ సర్వజ్ఞైరితి లోకోపకారాయ ప్రథమం ప్రాకృత ముపదిష్టం. సర్వాక్షరసంనిపాతలబ్ధీనాం శ్రీద్వాదశాంగీనిర్మాణసూత్రధారాణాం గణధరాణాం సిద్ధాంతప్రాకృతకరణే కారణ మిదం "బాలస్త్రీవృద్ధమూర్ఖాణాం నృణాం చారిత్రకాంక్షిణాం, అనుగ్రహార్థం తత్త్వజ్ఞై స్సిద్ధాంతః ప్రాకృత స్స్మృతః - రాజన్! భాషా భవతు యాపి సాఽపి, పరంతు పరమార్థఏవ విలో క్యతే, యత్పఠంతి లోకాః,

(౧) శ్లో. అత్థనివేసో తచ్చియ సద్దా త చ్చేవ్వపరిణమంతావి,
ఉత్తివిసేసో కవ్వం భాసా జావహోయి సా హోఉ.

పరం కస్యాఽపిజ్ఞానలవదుర్విదగ్ధస్యేయం ప్రాకృతనిందా యదుక్తం. (౨) శ్లో. సోవహోయి అనుభావేయి య ఉపభుంజంతో లవోవి లచ్ఛియే, ఏసా సరస్సయీ పుణ అసమగ్గా కం ణ వినడేయి." ఇతి శ్రుత్వా రాజాదయః సర్వేఽపి ప్రాకృతప్రశంసాం కుర్వంతో విశిష్య తదర్థశ్రవణపరా బభూవుః, (కుమారపాలప్రబంధము.)

---

(౧) ఉక్తివిశేషాస్తఏవ, శబ్దా స్త ఏవ పరిణమంతోఽపి, ఉక్తివిశేషః కావ్యం భాషా యా భవతి సా భవతు. (౨) శోషయ త్యనుభావయతి చ ఉపభుంజంతో లవోఽపి లక్ష్మ్యాః, ఏషా సరస్వతీ పునః అసమగ్రా కం నాటయతి.

కుమారపాలప్రబంధంలోని యీపైబంతులతాత్పర్యం ఇల్లా వున్నది:— " ఒకమాటు ఒకఅసూయా పరుడు హేమచంద్రునితేజమును సహింపలేక, ఏకాంతంలో రాజుతో అన్నాడు — దేవా ! తరుచు వీరు (జైనులూ బౌద్ధులూనూ) ప్రాకృతం చదువుతూవుంటారు. వీరిమతసిద్ధాంతంకూడా (ఇందువల్లే కాబోలు) పాకృతమయం ! (ఇందులో అంతాప్రాకృతం అని ఒకఅర్థం, అంతా పామరజనోచితం అని రెండో అర్థం) కాబట్టి పొద్దుటే వినరానిది - " సంస్కృతం దేవతలభాష ! పిశాచాలభాష ప్రాకృతం ! ! - అని పెద్ద లంటారు. ఆ (సంస్కృత) భాషే గొప్పవారికి పొద్దుటే వినదగివుంటుంది. శ్రీయస్కరికూడాను. ఈస్థితిలో దేవరవారు పొద్దుటే ఆభాష ఎందుకు వింటారూ ? - అనీ. ఈ మాట విని రాజు తాను ఏభాషఎల్లాంటిదో తెలిసినవాడే అయినా, స్వయంగా ప్రాకృతం అంటే కొంచెం ఆదరం కలవాడు కాబట్టి దాన్ని గురువుల నడిగాడు.

" గురువులన్నారుకదా ! — సద్గురువులాన్ని వుపాసింపనివాడున్నూ వాఙ్మయతత్వం తెలియని వాడున్నూ అ్ాన ఒకడిమాట అయివుంటుంది ఇది. రాజా లోకంలో అనేకవిధాలభాషాభేద వైచిత్ర్యం అంటూవున్నప్పటికిన్నీ యుగారంభకాలంలో మొట్టమొదటి పురుషుడు ముల్లోకాలస్వ రూపం ఎఱిగివుండటంచాత, ప్రిప్రిథమం ౧౪ అచ్చులున్నూ ౩౪ హల్లులున్నూ గల - మొత్తం ౫౦ అక్షరాలున్న - మాతృకే వుపదేశించాడు. అదికూడా ప్రాకృతరూపంకలదే. సర్వప్రాకృతులకూ వుపకారకం ఏర్పడ్డదే. ఆతర్వాత పైనుండివచ్చిన ముప్పదిఅక్షరాలు వున్నవే, వాటిలో సంస్కారంచెయ్యగాచెయ్యగా సంస్కృతం ఏర్పడ్డది. ఆతరవాత చాలా భాషాభేదాలు ఏర్పడ్డాయి. ... ... ... కాబట్టి ఈ కారణంచాతా - సర్వ శాస్త్రాలకూ మూలాధారమైన మాతృకారూపం మొదట ప్రాకృతమే. యుగాదికాలంలో ఈకారణంచేతే సర్వజ్ఞులచేత లోకోపకారానికై మొదట ప్రాకృతమే వుపదిష్టమైంది. సర్వాక్షరసంనిపాతలబ్ధి గలద్వాదశాంగీనిర్మాణసూత్రధారులగు గణధరులకు మొదట తమమతసిద్ధాంతాలు ప్రాకృతంగా రాయడానికి ఇదే కారణం. ఏమంటే పిల్లలు ఆడాళ్లూ వృద్ధులూ మూర్ఖులూ చారిత్రిఘ్నలగు మనుష్యులూ వీరిని అనుగ్రహించేందుకు మత సిద్ధాంతం ప్రాకృతంగా వుండాలన్నారు - అని "

" రాజా ! భాష యేదో ఒకటి వుండనీయండి. కాని పరమార్థమే ఆలోచించాలి. ఏమంటే లోకులు చెబుతూవుంటారు - అర్థనివేశమూ అదే. శబ్దాలూ అవిగానే వున్నవి మారినాసూ. కాబట్టి ఒకవిధమైన మాటపొందికే కావ్యం అవుతుంది. భాష ఏదైతే అదేకానీండి. (వచ్చినలోపం ఏం) అయినా వక్కృక్కుడు, జ్ఞానలవదుర్విదగ్ధుడున్నూ ఖండఖండపాండిత్యంగలిగి తుండకండూతికై నోరువిచ్చే వాడున్నూ అయినవాడు ఇల్లా నిందిస్తూకూడా వుంటాడు. ఏమనిఅంటే - (దవడలు) చచ్చుకో పొయ్యేట్టు చేస్తుంది. వినడానికి అసుఖాన్ని (వినుగును) పుట్టిస్తూంది. అందంచూతామా ఓపిసరంలేశా (వుంటుందో ఉండదో) ! అల్లాంటిదీ ఈభాషాసరస్వతి ! అసంపూర్ణరాలు ! (దీన్నిచూస్తే) ఎవడికి ఎత్తికోరాదూ ! ( అంటే కోపంరాదూ అని అర్థం )

" ఈమాటలు విని రాజు మొదలయినవా రంతాకూడా ప్రాకృతభాషను ప్రశంసిస్తూ ఎప్పటి కన్నా హెచ్చుగా దానిలోని అర్థాన్నివినడానికి ఆసక్తి కలవాళ్ళు అయ్యారు " — అని.

*** ప్రభువులా, పండితులా హడావిడికి జంకిపోయి కొందరు ప్రాకృతపరిశ్రమను వదలుకొనేవారు ***

ఈసందర్భంలోనే మరోసంగతి చెప్పాలిసి వుంది. నేటివలెనే వాడున్నూ ప్రభువులూ పండితులూ చేసే ఈహడావడికి బెదిరిపోయి, కొంతమంది ఆత్మదౌర్బల్యం కలవారూ, తమకు ప్రియమే అయినానూ, స్వయంగా రసికులుగా వున్నానూ, జంకిపోయి, ప్రాకృతంలో గ్రంథాలువ్రాసే గ్రంథకర్తలు ప్రాకృతాన్ని వదలివేసికొన్నవారున్నూ వుండేవారని మనకు ఈకింది ప్రాకృతకథావళిలోని ఒకకథ వెల్లడిస్తూ వుంది. ఈగ్రంథం అచ్చైందికూడా.

(౧) ఉజ్జేణీయే నయరీయే మహావాయీ మహాకయీ య సిద్ధసేణో ణామ సాహూ, సో య కయాయి జంతో వాహిం దిట్ఠో విక్కమాయిచ్చరాయేణం చింతియం చ - ణ జాణామి ఇమేసిం కేరిసో ఆసీవాఉ త్తి. కిదో సే దిట్ఠిప్పణామో. లక్ఖియం చ తబ్భావ ముబ్భావియహత్థేణ సిద్ధసేణేణ, దిణ్ణో మహాసద్దేణ - ధమ్మలాహో హోఉ త్తి. రాయేణ తుయిల్లక్ఖణావజ్జియేణ దవ్వాయియా సే దవ్వకోడీ. భణియం చ కరావి రాయపరిగ్గహేణ విక్కమాయిచ్చస్స వాయపత్తియాయే -

ధమ్మలాహో త్తి వుత్తమ్మి దూరా దుస్సియపాణిణో, సాహుణో సిద్ధసేణస్స దవ్వకోడీ నివాహివో నివేయియా చ సా రాయదిణ్ణా దవ్వకోడీ సిద్ధసేణేణ గురుస్స. తేణావి సంఘస్స. సంఘేణావి కిదో తీయే సాహారణసముగ్గమో. అహ లజ్జంతో "జు పాయియం జిణసాసణం త్తి" లోఉత్తీయే సిద్ధసేణో విణ్ణవయి సంఘం - 'జయి భణహా తో కరేమి సక్కయం పి సిద్ధంతం' సంఘో భణయి చింతియేణావి ఇమేణ పాయచ్ఛిత్తి కిం పుణ జంపియేణ! తా చరసు తుమం పాయచ్ఛిత్తం. లజ్జియో సిద్ధసేణో. ఇదో తదోపి. తాయిమోపాయిదం, సక్కదేయ మేళావిదో (ప్రా. కథావళి.)

(౧) సంస్కృతచ్ఛాయ:— ఉజ్జయిన్యాం నగర్యాం మహావాదీ మహాకవిశ్చ సిద్ధసేనోనామ సాధుః. స కదాపి చరతా బాహ్యే దృష్టో విక్రమాదిత్యరాజ్ఞా. చింతితం చ - నజానే ఏతస్య కీదృశోఽశీర్వాద ఇతి. కృతోఽస్యదృష్టప్రణామః లక్షితం చ తద్భావ ముద్భావితహస్తేన సిద్ధసేనేన. దత్తో మహాశబ్దేన - ధర్మలాభో భవత్వితి. రాజ్ఞా చతురలక్షణావర్జితేన దాపితాస్మై ద్రవ్యకోటిః, భణితం చ కదాపి రాజపరిగ్రహేణ విక్రమాదిత్యస్య వాక్యపద్ధత్యా.

ధర్మలాభోస్త్వితి వృత్త్యా దూరా దుత్థితపాణినః, సాధో స్సిద్ధసేనస్య ద్రవ్యకోటి ర్నిర్వాహితః. నివేదితా చ రాజదత్తా ద్రవ్యకోటి స్సిద్ధసేనేన గురవే. తేనాఽపి సంఘస్య. సంఘేనాపి కృత స్తస్యా స్సాధారణసముద్గమః, అథ లజ్జంశ్చ ప్రాకృతం జినశాసన మితి లోకోక్త్యా సిద్ధసేనో విజ్ఞాపయతి సంఘం - యది కథయత తత్కరోమి సంస్కృతేఽపిసిద్ధాంతం. సంఘో భణతి - చింతితేనాప్యనేన ప్రాయశ్చిత్తి. కింపున ర్జల్పితేన. త చ్చరతు (భవాన్) ప్రా[illegible]యశ్చిత్తం. లజ్జిత స్సిద్ధసేన ఇత స్తతోఽపి. త్యాజితం ప్రాకృతం. సంస్కృతే చ మిలాపితః (ప్రాకృతకథావళి)

"ఉజ్జయినీనగరంలో మహావాదీ మహాకవీకూడా, సిద్ధసేనుడని ఒక సాధువూ. ఒకమాటు వాహ్యాళికై సంచరిస్తూ విక్రమాదిత్యరాజు అతణ్ణి చూచాడు. అనుకున్నాడుకూడా - తెలిసికోలేం, ఈయన ఆశీర్వచనం ఎల్లాంటిదై వుంటుందో! తర్వాత చూచి ప్రణామం చేశాడు. ఉద్భావితహస్తుడై సిద్ధసేనుడు అతనియింగితాన్ని గుర్తించాడు. ధర్మలాభం కలుగుతుంది అని పెద్దకంఠంతో - ఆశీర్వాదం కూడా ఇచ్చాడు. రాజతని చతురలక్షణానికి ఆవర్జితుడై ఇప్పించాడతనికి ఒకకోటిద్రవ్యం. తర్వాత ఒకమాటు విక్రమాదిత్యుని రాజోద్యోగి వాక్యపద్ధతితో అన్నాడుగదా - ధర్మలాభం కలుగుతుందని దూరాన్నుంచే చేతులెత్తికొని పరుగెత్తివచ్చినసిద్ధసేనుడనే సాధువుకు కోటిద్రవ్యం ఇప్పించాడు - అని.

"రాజు ఇచ్చిన ఆకోటిద్రవ్యమూ సిద్ధసేనుడు గురువుకు సమర్పించాడు. ఆతడున్ను దాన్ని సంఘానికిచ్చాడు. సంఘంకూడా దాన్ని పుచ్చుకొని, వారిద్దరికీసాధారణసముద్గమము ఇచ్చింది. సిద్ధసేనుడు రోజూ రాజుదర్బారుకు పోయేవాడు. ఒకమాటు జైనమతసిద్ధాంతం వట్టిప్రాకృతం-అనే లోకోక్తి వినివిని అవమానంగా భావించి లజ్జపడి సిద్ధసేనుడు సంఘంతో అన్నాడూ - మీరు ఆజ్ఞయిస్తే సంస్కృతంలోకూడా జైనసిద్ధాంతం చేస్తాను - అని. సంఘం జవాబు ఇచ్చిందీ "దీన్ని ఆలోచిస్తేనే మహాపాపంగల్గి ప్రాయశ్చిత్తం చేయించుకోవలసినవాడుగా ఏర్పడుతాడుకదా! ఈ స్థితిలో నోటబెట్టి చెప్పినవాడివిషయం చెప్పవలసింది ఏముందీ! కాబట్టి నీవు ప్రాయశ్చిత్తంచేయించుకో" - అని. సిద్ధసేనుడి [తర్వాత] రెండువేపులా లజ్జాస్పదుడయ్యాడు. ప్రాకృతం వదలివేశాడు. సంస్కృతంలో చేర్పబడ్డాడు"— అని పైదానికి అర్థంగా ఎరిగేది.

దీన్నిబట్టి ప్రాకృతంఅంటే నేటిభోజులవలెనే ఆనాటిప్రభువులున్నూ ఎల్లా ద్వేషించేవారో, అపభ్రంశాదులయిన జడ్డిపేర్లు - [నేటిగ్రామ్యం, చచ్చటిభాష, భావకవిత్వం, భావకపిష్టం-ఇత్యాదుల లాంటి పేర్లు] ఎల్లా పెట్టి సాటించేవారో, ఈమహానుభావులకు జడిసి కొందరుకొందరు ఎల్లాగా ఉభయభ్రష్టులు అయ్యేవారో వ్యాఖ్యానం ఏమీ అక్కర్లేకుండానే స్పష్టపడుతూ వుందనుకుంటాను. ఇక నాటి ప్రాకృతకవులూ గ్రంథకర్తలూ తమభాషనూ కవిత్వాన్నీ ఏమని వాడుకొనేవారో, వారికి తమఉద్యమంపైని ఎల్లాంటిఅభిమానం వుండేదో చూపుతాను.

* గ్రామ్యాదులగుపేర్లు వ్యవహారభాషావాదులు వాడనట్లే నాటివారు తమప్రాకృతభాషను అపభ్రంశ మనుకోలేదు. పైగా మధురమనీ అమృతమనీ చెప్పుకొని గర్వించారు కూడానూ. *

ఈనాడు వ్యావహారికభాషావాదులకూ వారిగ్రంథాలకూ పేర్లు పెట్టినట్లే ఇతరులు ఆనాడు ప్రాకృతభాషావాదులకూ వారిగ్రంథాలకూ అపభ్రంశపైశాచికాదినామధేయాలు అనుగ్రహించినవే గాని వేరుకాదు. పైగా వారుఅందరూ-అంటే ప్రాకృతగ్రంథాలు వ్రాసినగ్రంథకర్తలందరూనూ- తమరువాడే వాఙ్మయానికి ప్రాకృత మనీ, అది అమృతమే అనీకూడా స్వాత్మాభిమానసూచకంగా చెప్పుకున్నారు. ఒకటిరెండుదాహరణాలు:- హాలుడనే మారుపేరు గల శాతవాహనుడు (ఈయనే బృహత్కథాప్రస్తావనలోవచ్చినవాడుకూడాను.) సంస్కృతాభిమానం ముదరకముందో, ముదిరి

దుష్ఫలితం అనుభవానికి వచ్చినతర్వాతో, పశ్చాత్తప్తుడై హాలుడు గాథాసప్తశతిని కూర్చాడు. ఈసప్తశతిఅనేది ఆనాటిప్రాకృతగ్రంథకర్తలకవితలు ఏర్చి కూర్చిన ఒకరీతి సంధానగ్రంథం. ఆగ్రంథంలో తనగ్రంథప్రయోజనాన్ని ఆయనే వర్ణిస్తాడు. వినండి:—

శ్లో॥ అమియం పాయియకవ్వం పఢిఉం సోఉం చ జే ణ ఆణంతి
కామస్స తత్తతంతిం కుణంతి తే కహ ణ లజ్జంతి.

[ఛాయ- అమృతం ప్రాకృతకావ్యం పఠితుం శ్రోతుం చ యే నజానంతి
కామస్య తత్వచింతాం కుర్వంతి తే కథం నలజ్జంతి.

ప్రాకృతకావ్యం అమృతమే. దాన్ని చదవడానికిన్నీ వినడానికిన్నీ ఎవ్వరు ఎఱుగరో, వారు కాముని శృంగారచేష్టయొక్క తంత్రవార్తను ఎల్లా చేయగల్గుతారు? (ఒకవేళ ఘుణాక్షరన్యాయంగా చేసినా) ఎల్లాగా వారు లజ్జింపక వుండగలుగుతారు? తప్పక లజ్జింపవలసిందే అని తాత్పర్యం. ఇందులో హాలుడు ప్రాకృతాన్ని అపభ్రంశమనడం లేదు చూడండి! ఈవిధంగానే సేతుబంధమనే ప్రాకృతకావ్యం వ్రాసి సాగరస్యాక్రరత్నానాం అని ఆచార్యదండి అంతటివాడిచేత గౌరవం పొందినప్రవరసేనుడు లోకం అంతా ప్రాకృతాన్ని ద్వేషిస్తూందనిన్నీ, అందులో అంటే వారివాదంలో, న్యాయం లేదనిన్నీ సూచిస్తూ అన్నాడు.

శ్లో. ఉత్తివిసేసో కవ్వో భాసా జా హోయి సా హోదు.

కావ్యమంటే చమత్కారం ఉట్టిపడేట్టు కూర్చే ఒకరీతి మాటపొంకం- అనేగాని భాష యేదైతే ఏమి? - అంటున్నాడు. [తెలుగులోకి ప్రవరసేనుడి సేతుబంధం ఇంకా రాలేదు. గాథాసప్తశతి వచ్చింది. శ్రీఅనంతకృష్ణశర్మగారున్నూ (మైసూరు) శ్రీశివశంకరశాస్త్రిగారున్నూ (గుంటూరు) ఆంధ్రీకరించారు. శ్రీనాథుడిగ్రంథం అంతరించింది.] జయవల్లభుడనేపండితుడు వజ్జాలగ్గ మనే కావ్యాలంకారగ్రంథాన్ని రచించాడు ప్రాకృతంలోనే. ఆయన ప్రాకృతపు తియ్యదనాన్ని మృదుత్వాన్ని చాలా ప్రశంసించాడు.

శ్లో॥ పాయియకవ్వస్స నమో పాయియకవ్వం చ నిమ్మియం జేణ, తాహం చియ పణమామో పఢిఊణ యజే విజాణంతి. పాయియకవ్వులావే పడివయణం సక్కయేణ జో దేయి, సో కుసుమసత్థరం పత్థరేణ అబుహో పిణాసేయి, ఉజ్జఉ సక్కయకవ్వం సక్కయకవ్వం చ నిమ్మియం జేణ, వంసహారం వ పలిత్తం తటయడతడ్డత్తణం కుణయి, పాయియకవ్వం పఢివుం గుంఫేవుం తహా య కుజ్జప్పనూణం, కువియం చ ప్పసాయేఉం అజ్జ వి బహవో న యాణంతి. [ఛాయ - ప్రాకృతకావ్యస్య నమః ప్రాకృతకావ్యం చ నిర్మితం యేన, తాం శ్చైవ ప్రణమామః పఠిత్వా చ యే విజానంతి, ప్రాకృతికావ్యోల్లాపే ప్రతివచనం సంస్కృతేన యో దదాతిస కుసుమప్రస్తరం ప్రస్తరే ణాబుధో వినాశయతి. ఉజ్ఝితు సంస్కృతికావ్యం సంస్కృతకావ్యం చ నిర్మితం యేన, వంశగృహ మివ ప్రదీప్తం తడతడతిట్టుత్వం కరోతి, ప్రాకృతకావ్యం పఠితుం గుంఫితుం తథా చ కుటజప్రసూనం, కుపితం చ ప్రసాదయితుం అద్యాపి బహవో నజానంతి.]

"ప్రాకృతకావ్యానికి అనేకవందనాలు. ప్రాకృతకావ్యాన్ని నిర్మించినవారికీ, చదివి తెలిసి కొన్నవారికిన్నీ వందనాలు. ప్రాకృతకావ్యోల్లాసమునందు ప్రతివచనం సంస్కృతంతో చెప్పే అబుధులు కుసుమప్రస్తరాన్ని ప్రస్తరంతో నశింపజేశేటివారు. సంస్కృతకావ్యం వదలండి. సంస్కృతకావ్యనిర్మాణం కెదురుపాదకు అగ్గి అంటించడంవంటిది. ప్రాకృతకావ్యాన్ని చదవడానికీ కూర్చడానికీ కుటజప్రసూనమాలిక గుచ్చడానికీ, కుపితురాలైనభాయికను ప్రసన్నురాలని చేయడానికీనీ ఇంకా ఈనాటికికూడా చాలామంది బొత్తిగా ఎరుగనే యెరుగరు" - అని తాత్పర్యం.

కనకా ప్రాకృతగ్రంథకర్తలు ఎవ్వరూ తమవాఙ్మయం అపభ్రంశమని చెప్పుకోలేదనీ, వ్యాఖ్యామార్గానుసారులగు రాజశేఖరాదులుకూడా అవాఙ్మయాన్ని చాలా గౌరవంగాచూచేవారనీ ఏర్పడింది. మరి అపభ్రంశం అనే పేరు పెట్టడానికి కారణం అతిలోకసమగ్రత్వం అసూయాపరవశత్వం-తప్ప వేరేకాదు.

* పతంజలి అపభ్రంశాలుగా చెప్పిన గావీ గోణ్యాదులూ మహాకవులు ప్రయోగించినవే! *

మహర్షి పతంజలి వ్యాకరణమహాభాష్యంలో - భూయాంసో ఒపశబ్దాః అల్పీయాంసశ్శబ్దాః ఏకైకస్య హి శబ్దస్య బహవో ఒపభ్రంశాః, తద్యథా గౌ రిత్యస్య శబ్దస్య గావీ గోణీ గోతా గోపోతలికేత్యేవమాదయో ఒపభ్రంశాః - అని అపభ్రంశాలు ప్రాకృతశబ్దాలన్నా, అందులో మహాకవులు పరంపరగా వాడుకచేస్తూ వస్తూన్నవిన్నీ అయి వున్నాయి. మహాకవి దండిపండితుడు అపభ్రంశాలుగా పేర్కొన్నవి ఆభీరులుమొదలయినవారు మాట్లాడేభాష అని తెలుస్తూనే వుంది. గావీగోణీ మొదలయినశబ్దాలు పతంజలి అపభ్రంశాలని అన్నా - ప్రాకృతగ్రంథకర్తలు నిరాఘాటంగా వందలువేలుగా వాడుకచేశారు. అనుశాసనికులు వాటి అన్నిటికీ శుద్ధత నంగీకరించారు కూడా. మచ్చుకు ఒకటిరెండు ఉదాహరణాలు చూడండి. ఇవిగో!

(౧) గావీ:- గావీఏ పుణ దిణ్ణం తిణం ఖీరత్థణ ముపేఇ [ఛాయ - గవే పున ర్దత్తం తృణం క్షీరస్తనం ఉపైతి.] ఆవుకుగనుక గడ్డివేస్తే అది [అంటే ఆగడ్డే - సత్పాత్రదానం అవడంచేత క్షీరపూర్ణమైన - [పాలతోనిండిన] స్తనంగా మార్పు పొందుతుంది - అని అర్థం. (ఆవశ్యకచూర్ణి) -

ఖీరణిఏఓ గావీఓ [ఛాయ - క్షీరనిచయాః గావః,] ఆవులు పాలను పుట్టిండ్లూ - అని దీనిఅర్థం. [ఆచారాంగసూత్రం అనేగ్రంథంలో] గోర్ గావీ - [చండదేవునిప్రాకృతలక్షణం],

(౨) గోణీ:- గోణం వి ఆలావియ (గో రప్యాలాప్య - ఛాయ - గోవునుకూడా పలకరించీ- అని అర్థం;) ఏత్థం గోణీఓ దిత్తంతః [ఇత్థం గావః దృష్టాంతః] గోణిసరిచ్ఛో వు గురూ (గోసదృశోగురుః ఛాయ. అంటే గురువులు గోవులాంటి (అమాయికహృదయంగల) వారని అర్థం.) గోణీ చందణకంథా (గౌః చందనం కంథా - ఛాయ. ఆవు చందనం, కప్పుకొనేబొంత - ఇవి లోకోపకారంనిమిత్తమే పుట్టాయి అని అర్థం.) దశవైకాలికసూత్రాదిగ్రంథాల్లోనుండి.

(3) <u>గోతా</u>:- వచ్ఛ <u>గోతా</u>వుత్తా విస్సహ్యహిం - (వత్స గోతా వృత్తా విశ్రామ్యేహ - అని ఛాయ. బాబూ! ఆవును తోలితెచ్చి విశ్రాంతిపొందింపబడ్డదా? - అని అర్థం)- దత్తాఖ్యాయిక.

తంత్రవార్తికమనే మీమాంసాగ్రంథం రచించినకుమారిలభట్టుకూడా ఈపతంజలిచెప్పిన గావీగోతాది శబ్దాలు అనాచారత్వప్రాయశ్చిత్తాదిదోషాలు తెచ్చిపెట్టేటటువంటి అపభ్రంశాలు కావని అన్నాడు. చూడండి.

> ప్రాయేణ హి శిష్టానాం ధర్మాచారప్రణిహితచేతసాం కశ్చిదేవ ప్రమాదా దల్పోఽనాచారో భవతి. గావ్యాదిశబ్దప్రయోగేషు పునః న కేషామపి అనాచారబుద్ధిః. న చ కలంజాదిభక్షణవ చ్చికిత్సా గ్రహావా దృశ్యతే. న చాహితాగ్నిసహస్రేపి ఏక స్త్వదభిమత సాధుశబ్దై రేవ వ్యవహరమాణో దృశ్యతే. శ్లో. కల్పసూత్రస్మృతిగ్రంథ మీమాంసావ్యాఖ్యా కారిణః శిష్టా దుష్టాఃప్రయుంజానా అపశబ్దా ననేకశః — (తంత్రవార్తికం ౧ అధ్యా ౩ పాదం. పేజి ౧౯౨ కాశీముద్రణము.)

"తరుచుగా ధర్మాచారప్రణిహితచేతులూ శిష్టులూ అనుకొనేవాళ్లలో, ఎవడో ఒకడు మాత్రమే ప్రమాదంవల్ల (అంటే పొరపాటుగా) కొలదిగా అనాచారుడుగా వుండడంఅంటూ సంభవిస్తుంది. గావీ (గోణీలాంటి)శబ్దాలని ప్రయోగించినప్పుడు ఎవ్వరికికూడా వారు అనాచారంగా వర్తిస్తూవున్నారన్న బుద్ధి కలగడం లేదు కలంజం (ఉల్లిలాంటినిషేధవస్తువులు) భక్షించడంలోవలె దోషాపనయనమునకై చికిత్సచేసికోవడంగానీ, లేక లోకులు వారిని దుయ్యబట్టుకోవడంగాని కనపడడం లేదు. పైగా ఆహితాగ్నులలో వేయింటికి ఒక్కడిలోగూడా మీరు (వైయాకరణులు) చెప్పినసాధుశబ్దాలతోనే వ్యవహరించేవాడంటూ కనపడడంలేదు. కల్పసూత్రాలువ్రాసినవారూ స్మృతిగ్రంథాలు వ్రాసిన వారూ మీమాంసాగ్రంథకర్తలూవ్యాఖ్యాతృకర్తలూ - ఈ మొదలయిన శిష్టులందరున్నూ అనేకంగా (ఒకటిగాదు రెండుకాదు - అనేకం!) దుష్టములయిన అపశబ్దాలు ప్రయోగించేవున్నారు" అని పై కుమారిలగ్రంథానికి తాత్పర్యం. కుమారిలభట్టుగారు ఇల్లా చెప్పడమేకాకుండా, గావీగోణీలాంటి శబ్దాలు ప్రయోగించినందుచేత ధర్మహాని లేదనిన్నీ, అది ప్రత్యవాయజనకంకాదనిన్నీ చెప్పి - కల్ప సూత్రాలుమొదలయినవాట్లలోనుండి అపశబ్దాలను ఒకపట్టికగా ఉదాహరించాడు. ఆవిషయం ముందు వస్తుంది.

ఇల్లాగా పతంజలివారు అపభ్రంశాలన్నవి చాలావరకూ ఆనాడు ప్రాకృతజనులూ నాటిశిష్టులూ కూడా వ్యవహరించే వ్యవహారభాషలోనివనీ, వాటిని గ్రంథాల్లో ప్రయోగించడం వుందనీ, అంత మాత్రంచేత మ్లేచ్ఛోహవా ఏష యదపశబ్దః - అన్నప్రత్యవాయం రాదనీ, ఆర్యావర్తనివాసి ప్రయుక్తములయినగావ్యాదులందు మ్లేచ్ఛితధాత్వర్థానుగమమంటూ లేదనీ, గావ్యాదులవంటిశబ్దాలు వైదికమతాలవారూ అవైదికమతాలవారూ సమంగానే వ్యవహరించేవారనీ, ప్రాకృతప్రకాశకర్త అయినవరరుచీ, ప్రాకృతలక్షణశాస్త్రాదిగ్రంథాలువ్రాసిన ఇతరవైదికులూ వాటికి అనుశాసనం

చేసి గ్రంథప్రయోగార్హత కలిగించారనీ తెలుస్తుంది. ప్రాకృతవ్యాకరణాలలో ఈగాథీగోణ్యాదులే కాక, భోజరాజు చెప్పినట్లుగా.

శ్లో. ధీమత్ప్రోక్తాని వాక్యాని విద్వద్వక్త్రేషు శేరతే, గోణీతిరించరించోళీతల్లతూహా విచల్లిదాః -

అనుక్తాన్యశబ్దాలున్న దాఢాదయోబహులం - అని ఇత్యాదిగా అక్కడికీలొంగనిదేశీశబ్దాలను గణపాఠాలుగా కూర్చినసూత్రాలున్నా అనేకంగా మనకు గోచరిస్తూ వుంటవి. గాథాసప్తశతివ్యాఖ్యలో ఆవ్యాఖ్యాత దాదాపు ౫౦ం శబ్దాలను పైగా దేశీశబ్దాలని నిరూపించాడు. హేమచంద్రుడు తనదేశీనామమాలలో ౪౦౦౦ దేశిపదాలకు అర్థాలూ ప్రమాణాలూ ఉదాహరించాడు. గాథాసప్తశతిలో శాతవాహనుడు ౩౦౦ ప్రాకృతకవులగ్రంథాలల్లోనుండి కవితలను నామనిర్దేశసహితంగా ఏర్చికూర్చాడు. అభిమానచిహ్నుడు అవంతిసుందరి భట్టగోపాలుడు దేవరాజు ద్రోణాచార్యుడు పాదలిప్తాచార్యులు త్రిభువనేశ్వరుడు రాహులకుడు సాంబుడు శీలాంకుడు మున్నగువారు దేశికోశాలను వ్రాసినట్లు ఆయాగ్రంథకర్తలు వుదాహరించినవుదాహరణాలవల్ల తెలుస్తుంది. ధనపాలుని ప్రాకృతలక్ష్మీనామమాల ఇంకా లభిస్తూనే వుంది. భామహుడు ప్రాకృతప్రకాశవ్యాఖ్యలో - దాఢాదయోబహులం - అనే సూత్రం వ్యాఖ్యానిస్తూ అన్నాడుగదా.

(౧) తథాపి - సంస్కృతభాషాం శిక్షేతే త్యేవమాదిస్మృత్యనుసరణేన హిమవద్వింధ్యాంతరాళకృష్ణమృగసంచారాద్యుపలక్షితధర్మాధికృతార్యావర్తనివాసివ్యతిరిక్తబర్బరాదిభాషాగతస్య మ్లేచ్ఛితత్వసమానాధికరణాపశబ్దత్వజ్ఞానాత్తేన భాషాం ప్రతిషిధ్యతే. యుక్తం చ తస్యాశేషతదీయాచరణాత్ పరిహరణీయత్వం, న త్వార్యావర్తనివాసిప్రయుక్తేషు గావ్యాదిషు మ్లేచ్ఛితత్వాగ్నానుగమః కశ్చిత్. (తంత్రవార్తికం - పేజి ౧౯౦.)

శ్లో. ఏషా మపరిమేయత్వా ద్దాఢాదీనాం పదం ప్రతి,
న శక్యా గణనా తేషాం కో వీచీ ర్గణయే త్సుధీః.
యా స్సర్వలోకసామాన్యా స్సంస్కృతానన్వితా గిరః
అట్టమట్టాప్రభృతయః తా శ్చైషైవ ప్రదర్శయేత్.
సంస్కృతప్రకృతిత్వేన యే న సిధ్యంతి కేవలం,
తేషాం లక్ష్యేషు శబ్దానాం దాఢాదిత్వం ప్రకల్ప్యతాం.

"ఈప్రాకృతశబ్దాలకు అంతు అంటూ లేదు కాబట్టి, దాఢాదులలో ఇవే చేరుతవి - అని ఒక్కొక్కపదంచొప్పున లెక్కపెట్టడం శక్యంకాదు. ఏమంటే - తరంగాలన్నింటినీ లెక్కపెట్టగలబుద్ధిమంతుడున్నాడా ! కనుక ఏయేశబ్దాలు లోకులందరికిన్ని ప్రయోగంలో సర్వసామాన్యాలుగా ఉన్నవో, ఏవి సంస్కృతంతో పొందికలేకుండా అట్టమట్టా - లాంటిమాటలుగా వున్నవో, వాటినన్నిటినీ ఈగణపాఠంలో చేర్చుకోవాలె. మరిన్నీ ఏమాటలు సంస్కృతమూలాలున్నట్లుగా సిద్ధించవో, వాటికిన్నీ, లక్ష్యాలలో కనిపించే ఇల్లాంటిఇతరశబ్దాలకున్నూ దాఢాదిత్వమే గతిగా కల్పించవలసివుంటుంది" - అని పైమాటలకు తాత్పర్యం.

కాబట్టి దేశాలలో ప్రాకృతులూ సంస్కృతులూ వ్యవహరించేభాష జీవద్దశాస్థిత మవడంచేత, ఆనాటిదేశీశబ్దాలు వందలూ వేలూగాక, కోట్లసంఖ్యగా వుండేవనీ, అనుశాసనికులు వాటికి శాస్త్రీయ సంస్కారం చేయడానికైనా [అంటే వ్యాకరణం ఏర్పఱచి గ్రంథప్రయోగార్హదశ వచ్చిందని నిరూపించడానికైనా] సాధ్యపడనంతటి వైపుల్యం వాటికి ఏర్పడ్డదనీ తెలుస్తుంది. ఇంతటివిపులావస్థతో ప్రజలు వ్యవహారంలోనూ గ్రంథాలలోను వాడుతున్నవాటిప్రాకృతభాషనే సంస్కృతాభిమానులు అపభ్రంశమనీ గ్రామ్యమనీ నానావిధాలపేర్లతో వాడి గ్రంథస్థంచేసినప్పుడూ, నేటిమన వ్యావహారికభాషను వాఙ్మయజంఘాలురు మొదలయినవార్లు గ్రామ్యాదులగు పేర్లుపెట్టినారంటేనూ నానావిధాల తిరస్కరించి దూషిస్తూవున్నారంటేనూ, అది వక ఆశ్చర్యమా? ఏమీ ఆశ్చర్యంలోది కాదు. అనూచానమయిన ఆచారముచేత ప్రాప్తమే !

* అపభ్రంశం - గ్రామ్యం - అంటే ఏమిటి? *

అపభ్రంశం అనేమాటకున్నూ గ్రామ్యం అనేమాటకున్నూ ఆయాశబ్దాల వ్యుత్పత్తినిబట్టి క్రమంగా - భ్రంశమైనది (అంటే సంస్కారం లేనిది) అనే అర్థమున్నూ, గ్రామవాసులగువారు వాడేది అనే అర్థమున్నూ వున్నది. అయినా ఈ రెండుశబ్దాలున్నూ అశ్లీలార్థంలోనే తరుచుఉపయోగిస్తూ వుంటారు. శబ్దకల్పద్రుమంలాంటి పెద్దపెద్దనిఘంటువులలోనూ ఈఅర్థాలే వ్రాయబడినవి. కాని అప - అనే వుపసర్గకలప్రతిశబ్దం ముప్పాతికపాళ్ళు అశ్లీలాద్యర్థాలనే వెల్లడిస్తూ వుంటుంది. చూడండి:- అపవాదం, అపహాస్యం, అపార్థం, అపరాధం, అపచారం, అపకారం, ఇత్యాదులు.

అపభ్రంశః - (అప + భ్రంస్ + ఘఞ్) గ్రామ్యభాషా, అపభాషా, తత్పర్యాయః - అపశబ్దః. అపభ్రంశోఽపశబ్దస్స్యా దితి కోశః, యథా - అత్యారూఢి ర్భవతి మహతా మప్యపభ్రంశనిష్ఠా (కాకు)

అపశబ్దః - (అసంస్కృతశబ్దః, కర్మధారయః) అసంస్కృతశబ్దః, అశాస్త్రీయశబ్దః, లౌకికశబ్దః గ్రామ్యభాషా. యథా - త ఏవ శక్తివైకల్య ప్రమాదాలసతాదిభిః, అన్యథోచ్చారితా శ్శబ్దా అపశబ్దాః ప్రకీర్తితాః ఆభీరాదిగిరః కావ్యే ష్వపభ్రంశతయోదితాః శాస్త్రేతు సంస్కృతా దన్య దపభ్రంశ ఇతీరితః (దండి).

గ్రామ్యమ్:- భండాదివచనం. "హాలికశాకటికప్రధానత్వాత్ గ్రామే భవం గ్రామ్యం - ఇతి భరతః, తత్పర్యాయః అశ్లీలం - ఇత్యమరః, కావ్యస్యదోషవిశేషః, స చ శబ్దగతః అర్థగతశ్చ. తత్రశబ్దగతో యథా - (సాహి. దర్ప) దుశ్శ్రవత్రివిధాశ్లీలానుచితార్థప్రయుక్తతాః, గ్రామ్యాప్రతీతసందిగ్ధనేయార్థనిహతార్థతాః. అస్యోదాహరణం యథా - తత్రైవ - కటిస్తే హరతే మనః, అత్ర కటిశబ్దో గ్రామ్యః. అర్థగతో యథా - అపుష్టదుష్క్రమగ్రామ్యవ్యాహతాశ్లీలకష్టతాః, ఉదాహరణం యథా - తత్రైవ. స్వపిహి త్వం సమీపం మే స్వపిమ్యేవాధునాప్రియ - అత్రార్థో గ్రామ్యః (శబ్దకల్పద్రుమః)

ఈశబ్దకల్పద్రుమంలోని అర్థాలను విచారించి చూస్తే - అపభ్రంశంఅన్నా అపశబ్దంఅన్నా వ్యాకరణసంస్కారవిహీనమైన వాడుకభాషఅనిన్నీ దాన్నే లౌకికభాష అనీ గ్రామ్యభాష అనీ అంటూ

వృన్నాగనిన్నీ నిజంవిచారిస్తే వ్యాకరణసంస్కారం లేకపోయినంతమాత్రంచేత లౌకికభాషను, లేదా అపభ్రంశాపశబ్దాదులను పేర్లతో వ్యవహరించే వాడుకభాషను గ్రామ్యమనడం అనుచితమనిన్నీ తోస్తున్నది.

ఏమంటే—అశబ్దకల్పద్రుమమే గ్రామ్యాన్ని నిర్వచిస్తూ - గ్రామ్యదోషం, శబ్దగతార్థగతభేదాలతో ద్వివిధమనీ, కటిగల్లాదులలాంటివి శబ్దగతగ్రామ్యానికిన్నీ, "నాను దగ్గరసా పడుకోవే "- అన్నప్పుడు "పడుకొంటున్నాను"-అన్నలాంటివాక్యాల్లో స్ఫురించే అశ్లీలత్వాదులు గలవాక్యాలు అర్థగ్రామ్యానికిన్నీ ఉదాహరణాలని చెప్పడంచాత, నాటి ప్రాకృతంలోగానీ నేటి వ్యావహారికభాషలోగాని ఉన్నదనుకొనే అసంస్కృతత్వత నిజానికి గ్రామ్యమన్నశీర్షికకిందికి రాదనిన్నీ అది అవిచారణచేతా అసూయచేతా ఏర్పడినదే అనిన్నీ చాలాస్పష్టంగానే అవగతమౌతున్నది. ఆచార్యదండి గ్రామ్యదోషాన్ని ఏమని నిర్వచిస్తూ ఉన్నాడో చిత్తగించండి.

శ్లో॥ కన్యే కామయమానం మాం న త్వం కామయసే కథం, ఇతి గ్రామ్యోఽయమర్థాత్మా వైరస్యాయైవ కల్పతే, కామం కందర్పచండాలో మయి వామాక్షి నిర్దయః, త్వయి నిర్మత్సరో దిష్ట్యా ఇత్యగ్రామ్యోఽర్థో రసావహః, శబ్దేఽపి గ్రామ్యతాస్త్యేవ సా సభ్యేతర కీర్తనాత్, యథాయకారాదిపదం రత్యుత్సవనిరూపణే, పదబంధానువృత్త్యా వా వాక్యార్థత్వేన వా పునః, దుష్ప్రతీతికరం గ్రామ్యం యథా యా భవతఃప్రియా, ఖరం ప్రహృత్య విశ్రాంతః పురుషో వీర్యవానితి, ఏవమాదీని శంసంతి మార్గయో రుభయో రపి. (దండి-కావ్యాదర్శము.)

* పతంజలిభాష్యమూ - అపభ్రంశదోషవిచారణా. *

పతంజలి వ్యాకరణమహాభాష్యంలో మొట్టమొదటిదే పస్పశాహ్నికం అనేభాగం. వ్యాకరణప్రయోజనాలు సాముదాయికంగా విచారణద్వారా స్పృశించినందుచేత దానికి ఆపేరు వచ్చింది. అందులో వ్యాకరణప్రయోజనాలను ఆయనవర్ణిస్తూ ప్రసక్తానుప్రసక్తంగా అపభ్రంశస్వరూపాన్ని కూడా పేర్కొనవలసి వచ్చింది. దీన్ని ఆధారంచేసుకొని తఱచు గ్రాంథికశిరోమణులు తాండవిస్తుంటారు. కనుక పస్పశాహ్నికంలోనుండి సంక్షేపించి కొన్నిభాగాలు ఉదాహరిస్తున్నాను.

I. అథ శబ్దానుశాసనం. అథేత్యయం శబ్దోఽధికారార్థః ప్రయుజ్యతే. శబ్దానుశాసనం నామ శాస్త్రమధికృతం వేదితవ్యం. కేషాం శబ్దానాం లౌకికానాం వైదికానాం చ. తత్ర లౌకికాస్తావత్ గౌరశ్వః పురుషో హస్తీ శకుని ర్మృగో బ్రాహ్మణఇతి. వైదికాః ఖల్వపి—శన్నో దేవీ రభిష్టయే, ఇషేత్వోర్జేత్వా, అగ్నిమీళేపురోహితం. ♦ ♦ ♦ కాని పున శ్శబ్దానుశాసనస్య ప్రయోజనాని? రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజనం (1) రక్షా-రక్షార్థం వేదానా మధ్యేయం వ్యాకరణం. లోపాగమవర్ణవికారజ్ఞోహి సమ్యగ్వేదా న్పరిపాలయిష్యతీతి (2) ఊహః- ఊహః ఖల్వపి న సర్వై ర్లింగై ర్నచ సర్వాభి ర్విభక్తిభి ర్వేదే మంత్రా నిగదితాః-తే చాఽవశ్యం యజ్ఞగతేన పురుషేణ యథాయథం విపరిణమయితవ్యాః, తా న్నాఽవైయాకరణ శ్శక్నోతి విపరిణమయితుం. తస్మా దధ్యేయం వ్యాకరణం. (3) ఆగమః - ఆగమఃఖల్వపి బ్రాహ్మణేన నిష్కారణో ధర్మ ష్షడంగో వేదోఽధ్యేయో జ్ఞేయ శ్చేతి. ప్రధానం చ షడంగేషు వ్యాకరణం. ప్రధానే కృతో యత్నః ఫలవాన్భవతి (4) లఘు - లఘ్వర్థంచ అధ్యే

యం వ్యాకరణం: బ్రాహ్మణేనావశ్యం శబ్దా జ్ఞేయా ఇతి. న చాంతరేణ వ్యాకరణం లఘునోపాయేన శబ్దాః శక్యా విజ్ఞాతుం (౫) అసందేహః - అసందేహార్థం చాధ్యేయం వ్యాకరణం. యాజ్ఞికాః పఠంతి - స్థూలపృషతీ మగ్నివారుణీ మనడ్వాహీ మాలభేతేతి తస్యాం సందేహః, స్థూలా చాసౌ పృషతీతి స్థూలపృషతీ ? స్థూలాని వా పృషంతీతి స్థూలపృషతీతి. తాం నా ఽవైయాకరణ స్స్వరతో ఽధ్యవస్యతి. యది పూర్వపదప్రకృతిస్వరత్వం తతో బహువ్రీహిః. అథాంతోదాత్తత్వం, తత స్తత్పురుష ఇతి. (పతంజలి వ్యాకరణభాష్యం-పస్పశాహ్నికం)

దీని తాత్పర్యం ఇదీ:—అథ శబ్దానుశాసనం చేస్తాం. అథ అనే శబ్దం అధికారార్థం ప్రయోగింపబడుచున్నది. శబ్దానుశాసనం అని శాస్త్ర మధికృత మవుచున్నదని తెలిసికోవాలె. ఏశబ్దాలకూ? (అనుశాసనం?) లౌకికాలకున్నూ వైదికాలకున్నూ. అందులో లౌకికాలనగా - గోవూ గుఱ్ఱమూ మనుష్యుడూ ఏనుగూ శకునీ మృగమూ బ్రాహ్మణుడూ (అనేలాంటివి.) వైదికాలుకూడా - శన్నోదేవీ. ఇషేత్వోర్జే-అగ్నిమీళే - లాంటివి. ♦ ♦ మఱి ఏమిటివి శబ్దానుశాసనానికి ప్రయోజనాలూ ? రక్షోహాగమలఘ్వసందేహాలు ప్రయోజనం. (౧) రక్ష:— వేదాలరక్షణకోసం వ్యాకరణం చదవతగ్గది. (శబ్దాలలోవుండే) లోపాలను ఆగమాలను వికృతులనూ ఎఱిగినవాడేకాదా చక్కగా వేదాలను పరిపాలింపకలుగుతాడు! (౨) ఊహ:— ఊహకూడా కారణమే. వేదంలో మంత్రాలు అన్నివిభక్తులతోటీ అన్నిలింగాలతోటీని గదితములు కాలేదు. అవి యజ్ఞగతుడైనపురుషుడు ఆయాసందర్భానుసారంగా విపరిణామం (మార్పు) చేసికోవాలె. వాటిని అవైయాకరణుడు విపరిణామం చేయలేడు. కాబట్టి వ్యాకరణం చదవవలసి వుంటుంది. (౩) ఆగమము:— ఆగమంకూడా ప్రయోజనమే. బ్రాహ్మణుడు నిష్కారణంగానే ధర్మమూ షడంగ (సహితమైన) వేదమూ చదవవాలె. తెలిసికోవాలె కూడా (అని ఆగమంవున్నది.) షడంగాలలో వ్యాకరణం ప్రధానమైందికూడాను. ప్రధానంలో చేసినయత్నమే ఫలిస్తుంది. (౪) లఘువు:- సులభంకోసంకూడా వ్యాకరణం చదవాలి. బ్రాహ్మణుడు తప్పక శబ్దాలు తెలిసికోవాలెగనక. వ్యాకరణం మినహాగా సులభోపాయంగా శబ్దాలు తెలిసికోవడానికి వీలుకాదుగదా (౫) అసందేహం:—సందేహము లేకుండా వుండేటందుకుగూడా వ్యాకరణం చదవవాలి. యాజ్ఞికులు పఠించుతూ వుంటారుగదా! స్థూలపృషతీ అగ్నివారుణీ అయిన అనడ్వాహినీ ఆలంభం చెయ్యాలె - అని. ఆవాక్యంలో సందేహం కలగవచ్చు. స్థూలమైన పృషతికాబట్టి స్థూలపృషతిఅనా? లేక స్థూలములయిన పృషత్తులు (చుక్కలు) గలది స్థూలపృషతిఅనా? అని. దాన్ని అవైయాకరణుడు స్వరంచాత నిశ్చయింపలేడు. పూర్వపదప్రకృతిస్వరం వుంటే-అప్పుడు బహువ్రీహి అవుతుంది. లేక అంతోదాత్తస్వరం వుంటే అప్పుడు అది తత్పురుషగా అవుతుంది. కాబట్టి అసందేహార్థమై వ్యాకరణం చదవవలసి వుంటుంది.

పతంజలులవారు వ్యాకరణానికి ఇల్లాగా అయిదుప్రయోజనాలను చెప్పినారు. ఆయన అంతతో తృప్తిపొందలేదు. ఇంకా వ్యాకరణానికి వేదాంగత్వం దృఢపఱేందుకోసరమయిన్ని వ్యాకరణప్రయోజనాలు విస్తరించి స్థాపించేకొఱకున్నూ ఈక్రింద నుదాహరించే మఱి పదమూడు ప్రయోజనాలను కూడా చెప్పినాడు. అవి ఏమిటంటే-

II. ఇమాని చ భూయః శబ్దానుశాసనస్య ప్రయోజనాని:— (౧) తేఽసురాః. (౨) దుష్టశబ్దః. (౩) యదధీతం (౪) యస్తు ప్రయుంక్తే. (౫) అవిద్వాంసః. (౬) విభక్తిం కుర్వంతి. (౭)

యోవా ఇమాం. (౮) చత్వారి. (౯) ఉతత్వః. (౧౦) సక్తుమివ. (౧౧) సారస్వతీం. (౧౨) దశమ్యాం పుత్రస్య, (౧౩) సుదేవో అసి వరుణ.

ఈచెప్పినవాట్లల్లో (౧) తేసురాః అనేదానివల్ల రాక్షసులు పూర్వం హేఽరయః హేఽరయః— అనడానికి బదులు హేఽలయః హేఽలయః అని పరాభవింపబడ్డారు కాబట్టిన్నీ అపశబ్దభాషితంకంటే మించిన మ్లేచ్ఛత్వం మఱోటిలేదు కాబట్టిన్నీ — మ్లేచ్ఛులం అవకుండా వుండేటందుకు వ్యాకరణం చదవాలని చెబుతాడు. (౨) వ్యాకరణంచాత సాధువులని అంగీకరింపబడనిశబ్దాలను స్వరతఃగానీ, వర్ణతఃగానీ దుష్టంగా ప్రయోగిస్తే ఆశబ్దాలు మిథ్యాప్రయుక్తములు అవడంమూలాన ప్రయోగించే వాడు అభిలషించినఅర్థాన్ని వ్యక్తం చేయకపోవడమే కాకుండా - ఇంద్రశత్రుర్వర్ధస్వ- అన్నచోట అపస్వరప్రయోగంమూలాన వాగ్వజ్రమై యజమానుణ్ణి హింసించినట్లే హింసిస్తుందని - దుష్టశ్శబ్దః - అనేదానిచాత సూచిస్తాడు. (౩) యదధీతం - అన్నదానిమూలంగా, చదివింది అర్థతః తెలియబడ కుండా వుంటే అది కేవలం కంఠశోషగా పరిణమించి, ఎందుకట్టైను అగ్నికానివస్తువులలో వుంచి నప్పటిమల్లే జ్వలింపకుండా వుంటుంది. అధ్యయనం అనర్థకంగా వుండకుండగలందులకై వ్యాకరణం ఆవశ్యకమని చెప్తాడు. (౪) నమస్కారానికి ప్రతినమస్కారం చేసేప్పుడు శాస్త్రీయంగా ప్రయోగించ వలసిన ప్లుతస్వరం తెలియనివారికి స్త్రీలకుమల్లే నమస్కారం చెయ్యవలసిందని ధర్మశాస్త్రం చెబు తూ వుందికాబట్టి పురుషత్వం నిలుపుకోడానికిన్నీ ఆడంగిరేకులు అనిపించుకోకుండా వుండడానికిన్నీ వ్యాకరణం ఆశ్యకం అంటాడు. (౬) ప్రయాజలు సవిభక్తికంగా చేయాలె అంటారు కాబట్టి వ్యా కరణంవినాగా విభక్తిజ్ఞానం కలగదు గనకా, వ్యాకరణం ముఖ్యమని అంటాడు. (౭) ఋగాదివాఙ్మ యాన్ని పదశః స్వరశః అక్షరశః వివేచించి ప్రయోగిస్తే ఆర్త్విజీనుడవుతాడు (ఖ్యాతిగల ఋత్విక్కు అవుతాడు) కాబట్టి ఆర్త్విజీనులం అయ్యేందుకై వ్యాకరణం కావాలె అంటాడు. (౮) నామాదిశబ్దాల్లు రకాలశబ్దభేదాలను భూతభవిష్యద్వర్తమానకాలాలను నిత్యకార్యరూపానవుండేశబ్దాలను - ఇత్యాదుల సెటింగినవాడు శబ్దబ్రహ్మమనే మహాదేవుడుకాబట్టి మహాదేవసామ్యం పొందేటందుకై వ్యాకరణం ఆవశ్యకమట. (౯) సువాసయుగుభార్య తన్నుతాను ప్రీతిచే భర్తకు వివరించుకొన్నట్లుగా వాక్కు వివరించుకోనేటందుకై వ్యాకరణం ఆవశ్యకం అంటాడు. (౧౦) జల్లెడలో ధాన్యం శుభ్రించేసినట్లు గా ధీరులు (వైయాకరణులు) అసాధుశబ్దాలనుండి సాధుశబ్దాలను విడదీస్తూ తన్మూలాన సమానఖ్యా తినీ సాయుజ్యము పొందుతారు. ఇల్లాంటివారివాక్కుల్లో సెలకొనివున్నది గనుక సాధ్వసాధుశబ్ద వివేచనకై వ్యాకరణం చదవాలి. (౧౧) యాజ్ఞికులంటారు;—ఆహితాగ్ని అపశబ్దాన్ని ప్రయోగిస్తే ప్రాయశ్చిత్తీయేష్టిని చెయ్యాలె-అని. కనక ప్రాయశ్చిత్తీయులం కాకుండా ఉండగలందులకు వ్యా కరణం చదవాలి అనిసూచిస్తాడు. (౧౨) యాజ్ఞిక లంటారూ - పిల్లడు పుట్టిన పదుకొండోరోజు ఆదిని ఘోషవర్ణవత్తుగా మధ్యన అంతస్థసహితంగా అనరిప్రతిష్ఠితంగా త్రిపురుషానూకముగా పేరు పెట్టాలి-అనీ, అది కృదంతంగానే ఉండాలనీ, తద్ధితాంతంగా వుండరాదనీ. వ్యాకరణం వినా ఈకృత్తద్ధితాదులు తెలియవుకదా! (౧౩) సత్యదేవులమయ్యేటందుకు వ్యాకరణం చదవాలె వనీ అంటారు.

ఇందులో ౧-౨-౩-౪-౬-౭-౮-౯-౧౨-౧౩ ప్రయోజనాలు చాలవఱకు [మొదటి ౪ ప్రయోజ నాలతో సహా] కేవలం వైదికవాఙ్మయంతో సంబంధించినవి. ౧౦-౧౧ ప్రయోజనాలు లౌకిక వైదికాలకు రెంటికీ జోడించడానికి వీలుకలిగించేవి. కాని ౧౧ వది స్పష్టంగానే అపశబ్దోచ్చారణ

ప్రాయశ్చిత్తం కేవలం యజ్ఞకాలానికి మాత్రమే సంబంధించినదని ఋజువు అవుతూనే వున్నది- ౧ంవది సుశబ్దాపశబ్దజ్ఞానాన్ని అర్థవాదమూలకంగా స్తుతినిందాపరంగా సూచించేది కాబట్టి ఒక్క లౌకికభాషకు చెందినదే కాదని తెలుస్తూనే వుంది. పాణినిమహర్షి వ్యాకరణం లౌకికసంస్కృతానికి గదా ! మరి భాష్యంలో ఇన్ని వైదికప్రయోజనాలు ఏకరువు పెట్టడం ఎందుకూ అంటే పాణినీయవ్యాకరణానికి వేదాంగత్వం రూపించేందుకున్నూ, తతాపి తక్కినవేదాంగాలయిన శిక్షానిరుక్తచ్ఛందోజ్యోతిషకల్పాలకంటె వ్యాకరణానికే ప్రాధాన్యం కూర్చేందుకున్నూ అని స్పష్టం అవుతుంది.

పతంజలిచెప్పిన వ్యాకరణప్రయోజనాలు మొత్తం పదమూడింటిలోనూ ఒక్కటితప్ప [అంటే 4 గోది, యస్తు ప్రయుంక్తే- అనేదితప్ప] తక్కినవన్నీ మనకిచ్చట అప్రస్తుతాలయినా సంగ్రహంగా చూపాలిసి వచ్చింది. కనుక వదిలిపోయినదాన్ని ఇప్పుడు చూడాలె. అదే మన యీ అపభ్రంశవాదానికి మూలంగా ఉన్నది. పతంజలి అన్నాడు —

III. యస్తు ప్రయుంక్తే కుశలో విశేషే శబ్దా న్యథావ ద్వ్యవహారకాలే, సోఽనంత మాప్నోతి జయం పరత్ర వాగ్యోగవి ద్దుష్యతి చాఽపశబ్దైః. కః ? వాగ్యోగవిదేవ. కుత ఏతత్ ? యోహి శబ్దాన్ జానాతి అపశబ్దా నప్యసౌ జానాతి. యథైవ హి శబ్దజ్ఞానే ధర్మః ఏవ మపశబ్దజ్ఞానేఽధర్మః. అథవా భూయా నధర్మః ప్రాప్నోతి. భూయాంసోఽపశబ్దాః అల్పీయాంస శ్శబ్దాః. ఏకైకస్య హి శబ్దస్య బహవోఽపభ్రంశాః. తద్యథా - గౌరిత్యస్యశబ్దస్య గావీగోణీగోతాగోపోతలి కేత్యేవమాదయో బహవోఽపభ్రంశాః. అథ యోఽవాగ్యోగ విత్ ? అజ్ఞానం తస్య శరణం. విషమ ఉపన్యాసః. నాత్యంతాయాజ్ఞానం తస్య శరణం భవితు మర్హంతి- యోహ్యజాన న్వై బ్రాహ్మణం హన్యా త్సురాం వా పిబే త్సోఽపి మన్యే పతిత స్స్యాత్. ఏవంతర్హి - సోఽనంత మాప్నోతి జయం పరత్ర (అ) వాగ్యోగవి ద్దుష్యతి చాఽపశబ్దైః. కః ? అవాగ్యోగవిదేవ. అథ యో వాగ్యోగవిత్ ? విజ్ఞానం తస్య శరణం. క్వపునరిదం పఠితం ? భ్రాజానామ శ్లోకాః. కిం చ భో శ్లోకాఅపి ప్రమాణం భవితు మర్హంతి ? కించాతః ? యది ప్రమాణం, అయమపి ప్రమాణం భవితు మర్హతి - శ్లో. య దుదుంబరవర్ణానాం ఘటీనాం మండలం మహత్, పీతం న గమయే త్స్వర్గం కిం త త్క్రతుగతం నయేత్ ? - ఇతి (పతంజలివ్యాకరణభాష్యం - పస్పశం) ♦

దీనిఅర్థం ఇది - నేర్పరిఅయినవా డెవడు లోకంలో వ్యవహరించేసమయంలో ఆయాశబ్దాలను వైశిష్ట్యం గుర్తెరిగి యథావత్తుగా ప్రయోగిస్తాడో, వాడు [ఈలోకంలోనే కాకుండా] పరత్ర - అంటే పరలోకంలోనూ అనంతంగా జయాన్ని పొందుతాడు. వాగ్యోగవేత్త అపశబ్దప్రయోగంచాత దోషాన్ని పొందుతాడు. [కనక పరసాధనంగా వ్యవహారకాలంలో యథావత్తుగా ఆయావిశేషాలనెరిగి శబ్దాలు ప్రయోగించేందుకై వ్యాకరణం చదవాలి - అని తాత్పర్యం] ఎవడు (జయం) పొందుతాడు ? వాగ్యోగవేత్తే! ఎందువల్లఇదీ ? ఎవడైతే సుశబ్దాలు తెలిసికొంటాడో వాడే అపశబ్దాలనుకూడా తెలు

---

♦ ముచ్చటైనసంస్కృతం మాట్లాడేరీతిలబ్జులతో ఉండేది నేర్చుకోదలిస్తే అల్లాంటివారికి పతంజలి భాష్యం తరగనికాణాచి. ఇందులో ఉదాహరించిన భాష్యంపంక్తులు ప్రశ్నోత్తరరూపంగా ఉంటాయి. కాబట్టి చదువరులు అభావం మఱచిపోకుండా విషయం గమనించాలని ప్రార్థన చేస్తాను భాష్యపంక్తులను కావలసినచోట్లనే వుదాహరిస్తున్నాను. కనక క్రమభంగానికి మన్నించండి.

నుకుంటాడు. సుశబ్దజ్ఞానమందు ధర్మలాభం కల్గినట్లే అపశబ్దజ్ఞానంలో అధర్మప్రాప్తికూడా వుంది. (తప్పదు). అథవా చ్వాలా అధర్మమే వస్తుందనవాలె. (ఏమంటే) అపశబ్దాలు చాలానూ సుశబ్దాలు కొద్దిన్నీ. ఒక్కొక్క శబ్దానికి గూడా అనేకంగా అపశబ్దాలు. ఎల్లాగంటే - గౌః అనేశబ్దానికి, గావీ, గోణీ, గోతా గోపోతలికా-అని ఇలాగంటివి అనేకం అపభ్రంశాలు. మరి అల్లాగైతే వాగ్యోగవేత్త కానివా డేమిటి? అజ్ఞానమే వాడికి దిక్కు. వికటంగా వుంది వాగ్ధోరణి! పూర్తిగా అజ్ఞానమే వాడికి శరణంకావడానికి వీలు లేదు. (ఏమంటే) అజ్ఞానిఅయే బ్రాహ్మణున్ని చంపుతాడు. లేదా సురాపానం చేస్తాడు (అనిఅనుకోండి) వాడుకూడా పతితుడవుతాడు అనుకుంటాను. ఇల్లాగయితే - వాడే పరత్ర అనంతంగా జయం పొందుతాడు. ఎవడు? వాగ్యోగవిదుడు కానివాడే. మరి వాగ్యోగవిదుడో? విజ్ఞానం వాడికి దిక్కు అవుతుంది. ఇది ఎక్కడ చెప్పబడివుంది? భ్రాజలనే శ్లోకాలు. మరి - అయ్యా! శ్లోకాలు కూడా ప్రమాణమేనా? కాకమరేం? [శ్లోకంకూడా] ప్రమాణం అయ్యేట్టుంటే మరి ఇది కూడా ప్రమాణం కావలసివుంటుంది. ఏదీ-అంటే - "(యదుదుంబర) వేడిపండు రంగుగల చాలాకుండలు (మద్యం) త్రాగినా, స్వర్గాన్ని పొందించలేదుగదా. మరి యజ్ఞగతమైన యీస్వల్పం పొందిస్తుందా?" అని.—ఇందులో పతంజలివారిభావం అపభ్రంశం అన్నదాన్లో-స్పష్టమైంది. పతంజలిమహర్షి మహాభాష్యంలోని మరికొన్ని భాగాలనుకూడా చదువరులు చిత్తగించాలి.

IV. శబ్దానుశాసన మిదానీం కర్తవ్యం, కింశబ్దోపదేశః కర్తవ్యః, ఆహోస్విదపశబ్దోపదేశః, ఆహోస్వి దుభయోపదేశః? అన్యతరోపదేశేనకృతం స్యాత్. తద్యథా భక్ష్యనియమే నాభక్ష్యప్రతిషేధోగమ్యతే ♦♦ అభక్ష్యప్రతిషేధేనవా భక్ష్యనియమః ♦♦ ఏవమిహాపియదితావచ్ఛబ్దోపదేశః క్రియతే గౌరిత్యేతస్మిన్నుపదిష్టే గమ్యతే ఏతద్గావ్యాదయోపశబ్దాఇతి. అథాప్యపశబ్దోపదేశః - గావ్యాదిషూపదిష్టేషు ఏతద్గౌరిత్యేషశబ్దఇతి. కింపునరత్రజ్యాయః లఘుత్వాచ్ఛబ్దోపదేశః. లఘీయాన్ శబ్దోపదేశః, గరీయా నపశబ్దోపదేశః. ఏకైకస్య బహవోఽపభ్రంశాః, తద్యథా గావీగోణీగోతాగోపోతలికేత్యేవమాదయః ♦♦ అథైతస్మిన్ శబ్దోపదేశే కిం శబ్దానాం ప్రతిపదపాఠః కర్తవ్యః? ♦♦♦ అస్త్యప్రయుక్తః, సంతివైశబ్దా అప్రయుక్తాః, తద్యథా - ఊష తేర చక్ర పేచఇతి. కిమతః? యత్సంత్యప్రయుక్తాః ప్రయోగాద్ధి భవాన్ శబ్దానాం సాధుత్వ మధ్యవస్యతి. య ఇదానీమప్రయుక్తానామీ సాధవస్స్యుః, ఇదం విప్రతిషిద్ధం - యదుచ్యతే సంతి వై శబ్దా అప్రయుక్తాఇతి యదిసంతి నాప్రయుక్తాః అథాప్రయుక్తానసంతి సంతిచాప్రయుక్తాశ్చేతి విప్రతిషిద్ధం. ప్రయుంజానఏవ ఖలు భవా నాహ సంతి శబ్దా అప్రయుక్తాఇతి. ♦♦♦ నబ్రూమోస్మాభిరప్రయుక్తాఇతి. కథంతర్హి? లోకే అప్రయుక్తాఇతి. ననుభవానప్యభ్యంతరో లోకే? అభ్యంతరోఽహం లోకే న త్వహం లోకః ♦♦♦ అప్రయోగఃఖల్వపి ఏషాం న్యాయ్యః. కుతః? ప్రయోగాన్యత్వాత్ - తేరేత్యస్యార్థే క్వయూయం తీర్ణవంతః, చక్రేత్యస్యార్థే క్వయూయం కృతవంతః, పేచేత్యస్యార్థే క్వయూయం పక్వవంతః ♦♦♦ సర్వేఖల్వపి ఏతేశబ్దా దేశాంతరేషు ప్రయుజ్యంతే నచై

> నోపలబ్ధః. ఉపలబ్ధౌ యత్నః క్రియతాం. మహాన్ శబ్దస్య ప్రయోగవిషయః సప్తద్వీపా వసుమతీ (త్యాది) ♦ ♦ ♦ ఏతస్మింశ్చాతిమహతి శబ్దస్య ప్రయోగవిషయే తే తే శబ్దాస్తత్ర తత్ర నియతవిషయా దృశ్యంతే - శవతి ర్గతికర్మా కాంభోజేష్వేవ భాషితో భవతి. వికార ఏన మార్యా భాషంతే శవఇతి. హమ్మతిస్సురాష్ట్రేషు రంహతిః ప్రాచ్యమగధేషు గమిమేవ త్వార్యాః ప్రయుంజతే. దాతి ర్లవనార్థే ప్రాచ్యేషు దాత్ర ముదీచ్యేషు. యేచాప్యేతే భవతోఽప్రయుక్తా అభిమతా శబ్దా స్తేషా మపిప్రయోగో దృశ్యతే. క్వ ? వేదే. తద్యథా సప్తాస్యే రేవతీ రేవదూష. (ఇత్యాది. - పస్పశం)

దీనితాత్పర్యం ఇదీ:—ఇక శబ్దానుశాసనం చెయ్యాలె. (కాబట్టి) సుశబ్దోపదేశంచెయ్యాలెనా ! లేక అపశబ్దోపదేశం చెయ్యాలెనా ? లేక ఉభయోపదేశం చెయ్యాలెనా ? ఏదోఒకఉపదేశంతో గతం అవుతుంది. ఎల్లాగాఅంటే - భక్ష్యపదార్థములను నియమించడం చేత అభక్ష్యప్రతిషేధం తోస్తుంది ♦ ♦ అభక్ష్యప్రతిషేధంచాత గానీ భక్ష్యనియమం ఏర్పడుతుంది. ♦ ♦ ఇల్లాగే ఇక్కడ కూడా శబ్దోపదేశంచేస్తే - గౌః అనేదాన్ని ఉపదేశిస్తే తక్కినయీగావ్యాదులు అపశబ్దాలు అనీ, లేక అపశబ్దోపదేశంచేస్తే - గావ్యాదులు ఉపదేశిస్తే ఈ గౌః ఇత్యాదులు సుశబ్దాలు అనీ (ఏర్పడుతుంది). ఏది ఇందులో మేలు ? లఘువుకాబట్టి శబ్దోపదేశమే. శబ్దోపదేశము లఘువు. అపశబ్దోపదేశం గురువు. (భారమన్నమాట) ఒక్కొక్కశబ్దానికి అనేకఅపభ్రంశాలు. గావీగోణీలాంటివి. ♦ ♦ తర్వాత మరి శబ్దోపదేశమే చేస్తే శబ్దాలను ఒక్కొక్కటిపేర్కొనిచెయ్యాలెనా ? (కూడదు. ఇది దారికాదంటారు) ♦ ♦ అప్రయుక్తమైనశబ్దరాశి (అనంతంగా) వుంది. ఊష తేర చక్ర పేచ - అనిఇల్లాగా. (ఉంటేఏమి ? ) ఏమిటిదీనివల్ల ? అప్రయుక్తాలు ఉంటే - ప్రయోగాన్నిబట్టికదా నీవు శబ్దాలకు సాధుత్వం వస్తుందంటున్నావు ? నేడు అప్రయుక్తాలుగా ఉన్నవి సాధువులు కాకుండాపోతవి. ఇది విరుద్ధం! ఏమనంటే - శబ్దాలుఉన్నవి అప్రయుక్తాలు అనడం. ఉన్నవా ? అప్రయుక్తాలు కావు. అప్రయుక్తాలా? లేవు. కనక ఉన్నవనీ అప్రయుక్తాలనీ అనడం విరుద్ధం. (ఒకవేపు) ప్రయోగిస్తునే నీవంటున్నావు - ఉన్నవిశబ్దాలు అప్రయుక్తాలు అని. ♦ ♦ ♦ మా చేత అప్రయుక్తాలని మేము అనడం లేదు. లోకంలో అప్రయుక్తాలని (అంటున్నాం.) మరినీవున్నలోకంలోవాడివే కాదా ? నేను లోకంలో వాడినే! కాని లోకమంతా నేనేకాదు ♦ ♦ ♦ అప్రయోగంకూడా వీటికి న్యాయమే! ఎందువలనా? బదులుమాటలు ఉన్నవికాబట్టి (ప్రయోగాన్యాలు) తేర - అనేఅర్థంలో వ్యాయాయం తీర్ణవంతః - అనీ, చక్ర-అనేఅర్థంలో వ్యాయాయం కృతవంతః-అనీ, పేచ-అనేఅర్థంలో వ్యాయాయం పక్వవంతః-అని. ♦ ♦ ♦ ఈశబ్దాలన్నీ దేశాంతరాలలో ప్రయోగింపబడుతున్నాయి. లభించడంమాత్రం లేదు. లభించేటందుకు యత్నంచెయ్యండి. శబ్దాలకు ప్రయోగాధారంగావుండేదేశం చాలావుంది. ఏడుదీవులభూమండలం (ఇత్యాది) ♦ ♦ ♦ ఇంతటి విపులంగావున్న ప్రయోగవిషయంలో ఆయాశబ్దాలు ఆయాఅర్థాలలో ఆయాదేశాలలో నియతాలైవున్నవి. శవధాతువు గమనార్థంలో కాంభోజదేశాల్లోనే వుంది. దీన్ని ఆర్యులు వికారార్థంలో వాడుతున్నారు శవం-అని. హమ్మధాతువు ఆ అర్థంలోనే సురాష్ట్రదేశాల్లోనూ రంహధాతువు ప్రాచ్యదేశాల్లో మగధదేశాలల్లోనూ వుంది. ఆర్యులు గమ్‌ధాతువునే వాడుతున్నారు. దా ధాతువు లవనార్థంలో (కోయడం - అనేఅర్థంలో) ప్రాచ్యుల్లోను, దాత్ర మని ఉదీచ్యుల్లోనూ వుంది. మరిన్ని

అప్రయుక్తాలుగా మీచెప్పినటువంటి తేరాదులకున్నూ ప్రయోగం కనిపిస్తున్నది. ఎక్కడ ? వేదంలో. ఎల్లాగాఅంటే - సప్తాస్యే రేవతీ - (ఇత్యాదివాక్యాలలో) - (పస్పశం)

V. కిం పునః శబ్దస్య జ్ఞానే ధర్మః ఆహోస్విత్ప్రయోగే ? కశ్చాత్ర విశేషః ? జ్ఞానే ధర్మ ఇతి చే త్తథాఽధర్మః, జ్ఞానే ధర్మ ఇతి చే త్తథాధర్మోఽపి ప్రాప్నోతి. యోహి శబ్దాఞ్జానాతి అపశబ్దా నప్యసౌ జానాతి (ఇత్యాది) ♦ ♦ ఆచారే నియమ ఇతి. ఆచారే పునః ఋషి ర్నియమం వేదయతే - తేఽసురాః ♦ ♦ ఇతి. అస్తు తర్హి ప్రయోగే. ప్రయోగే సర్వలోకస్య. యది ప్రయోగే ధర్మ స్సర్వో లోకోఽభ్యుదయేన యుజ్యేత. కశ్చేదానీం భవతో మత్సరః ? నఖలు కశ్చి న్మత్సరః. ప్రయత్నానర్థక్యం తు భవతి ♦ ♦ ననుచ యే కృతప్రయత్నా స్తే సాధీయః శబ్దాన్ ప్రయోక్ష్యంతే ♦ ♦ వ్యతిరేకోఽపిహి దృశ్యంతే-కృతప్రయత్నాశ్చ అప్రవీణాః అకృతప్రయత్నాశ్చ ప్రవీణాః. తత్రఫలవ్యతిరేకోఽపి స్యాత్. ఏవం తర్హి నాఽపి జ్ఞానఏవ నాఽపి ప్రయోగఏవ ధర్మః. కింతర్హి - శాస్త్రపూర్వకే శబ్దప్రయోగేఽభ్యుదయ స్తత్తుల్యం వేదశబ్దేన. (పస్పశం)

ఈపంక్తులభావం - ఇదీ ! — మరిఏమిటి శబ్దజ్ఞానంలో ధర్మ ముందా ? లేకశబ్దప్రయోగంలోనా ? ఏమిటి ఇందులో (ఈప్రశ్నలో) తేడా ? జ్ఞానంలో ధర్మం వుందంటే అధర్మంకూడా వున్నది. శబ్దజ్ఞానంవల్ల ధర్మం ఎల్లా కలుగుతున్నదో అధర్మంకూడా అల్లాగే కలుగుతుంది. ఎవడు సుశబ్దాలు తెలిసికొంటాడో వాడే అపశబ్దాలుకూడా తెలిసికొంటాడు (ఇత్యాది) ♦ ♦ ఆచారంలో నియమం-అనేది. ఆచారంలో మరి మహర్షి నియమం బోధిస్తున్నాడు - తేఽసురాః అనేదాని వలన ♦ ♦ అల్లాగుంటే ప్రయోగంలోనే అంటాము. ప్రయోగంలోనే అంటే - అందరికీ వస్తుంది. అంటే - ప్రయోగంలోనే ధర్మం - అనేట్టయితే సర్వలోకం అభ్యుదయంతో కూర్పబడుతుంది. ఇప్పుడు మరి నీమత్సరం ఏమిటి ? మత్సరం ఏమీ లేదు. ప్రయత్నానికి (వ్యాకరణావశ్యకత్వం రూపించేప్రయత్నానికి) వ్యర్థత్వం కలుగుతుంది...పోనీప్రయత్నంచేసినవారే మంచిశబ్దాలను ప్రయోగిస్తారు ♦ ♦ వ్యతిరేకఫలంకూడా కనిపిస్తూ వుంది. ప్రయత్నంచేసినవారు (సుశబ్దప్రయోగవిషయంలో) అప్రవీణులుగా కావడమూ, ప్రయత్నము చేయనివారు ప్రవీణులు కావడమూ కనుక అందులో వ్యతిరేకఫలంకూడా రావచ్చు. అలాగయితే - కేవలంజ్ఞానంలోనూ ధర్మం లేదు. కేవలంప్రయోగంలోనూ ధర్మం లేదు. మరి ? శాస్త్రపూర్వకమైనశబ్దప్రయోగంలోనే అభ్యుదయం వుంది. కాబట్టి వేదంతో వ్యాకరణం తుల్యం — అనిభావం. (పస్పశం)

VI. యదప్యుచ్యతే ఆచారే నియమ ఇతి. యాజ్ఞే కర్మణి స నియమః ఏవంహి శ్రూయతే - యర్వాణ స్తర్వాణో నామ ఋషయః.... తే తత్రభవంతో యద్వాన స్తద్వాన ఇతిప్రయోక్తవ్యే యర్వాణ స్తర్వాణ ఇతి ప్రయుంజతే. యాజ్ఞేకర్మణి పున ర్నాఽపభాషంతే. తైః పున రసురైః యాజ్ఞేకర్మ ణ్యపభాషితం తత స్తే పరాభూతాః ♦ ♦ ♦ అనుకరణం హి శిష్టస్య సాధు భవతి. అశిష్టాప్రతిషిద్ధస్య వా నైవ తద్దోషాయ వా నాభ్యుదయాయ. యథా లౌకిక వైదికేషు. యఏవమసౌ దదాతి ♦ ♦ అనుకుర్వన్ దద్యాద్యజేతచ సోఽప్యభ్యుదయేన యుజ్యతే. అశిష్టాప్రతిషిద్ధం యథా, యఏవమసౌ హిక్కతి....తస్యానుకుర్వన్ హిక్కేచ్చ...నైవ తద్దోషాయ స్యా న్నాభ్యుదయాయ. యస్తుఖల్వేవమసౌ బ్రాహ్మణం హంతి.

తస్యానుకుర్వన్ బ్రాహ్మణం హన్యాత్ ◆◆ సోపి మన్యే పతితస్స్యాత్. ఏవమత్రోపన్యాసః యశ్చైవం హంతి యశ్చానుహంతి ఉభౌ తౌ హతః ◆◆ యస్తు ఖల్వేవమసౌ బ్రాహ్మణం హంతి ◆◆ తస్య అనుకుర్వన్ ◆◆ కదలీస్తంభం ఛింద్యాత్ ◆◆ న స మన్యే పతిత స్స్యాత్. ఏవ మిహాపి య ఏవ మసావపశబ్దం ప్రయుంక్త ఇతి తస్యానుకుర్వ న్నపశబ్దం ప్రయుంజీత సోప్యపశబ్దభాక్ స్యాత్? అయంత్వన్యోపశబ్దపదార్థకశ్శబ్దో యదర్థ ఉపదేశః కర్తవ్యః నచ అపశబ్దపదార్థక శ్శబ్దోఽపశబ్దో భవతి. అవశ్యంచ ఏతదేవం విజ్ఞేయం - యోహి మన్యతే అపశబ్దపదార్థక శ్శబ్దోఽపశబ్దో భవతి ఇతి. అపశబ్ద ఇత్యేవ తస్యాపశబ్దస్స్యాత్. నచైషోఽపశబ్దః. (పస్పశం)

దీనిఅర్థం ఇదీ—ఆచారంలో నియమం అన్నమాటవుండే అది యజ్ఞకర్మలోనే ఆనియమం. ఇల్లాగని వింటాము. యర్వాణుడనీ తర్వాణుడనీ ఋషు లు......అభ్యాజ్యులు యద్వానః - తద్వానః అని ప్రయోగించవలసి వుంటే యర్వాణః - తర్వాణః అని ప్రయోగిస్తారు. కాని యజ్ఞకర్మలోమాత్రం అపభాషించరు. మరి అరాతునులంటేనో యజ్ఞకర్మలో అపభాషించారు. అంచేతే వారు పరాభవింపబడ్డారు. ◆◆◆ శిష్టానుకరణం సాధువే అవుతుంది. శిష్టానుకరణం కాకుండా ప్రతిషిద్ధం కాకుండా వుండేది దోషాన్నిగానీ అభ్యుదయాన్నిగానీ చెయ్యలేదు లౌకికవైదికాల్లోలాగే. ఇల్లా ఇతనిస్తాడూ ◆◆ అని అనుకరిస్తూ ఇచ్చినా యజించినా వాడుకూడా అభ్యుదయం పొందుతాడనుకొంటాను. అశిష్టాప్రతిషిద్ధం ఎలాగంటే - ఇల్లా ఇతడు తొక్కుతాడు ◆◆ అని అతన్ని అనుకరిస్తూ తొక్కినా ◆◆ అది దోషంకోసం కాదు. అభ్యుదయంకోసమూ కాదు. ఎవడైతే ఇల్లా బ్రాహ్మణ్ణి చంపాడు ◆◆ అని అతన్ని అనుకరిస్తూ బ్రాహ్మణ్ణి చంపుతాడో, వాడుకూడా పతితుడే అవుతాడనుకొంటాను. ఉపన్యాసం (వాగ్ధోరణి) వికటంగా వుంది. ఎవడు చంపుతాడో, ఎవడు వాణ్ణి అనుకరించి చంపుతాడో వారిద్దరూ హతులే అవుతారు ◆◆ ఎవడైతే వీడు ఇల్లా బ్రాహ్మణ్ణి చంపుతాడు ◆◆ అని అతన్ని అనుకరిస్తూ◆◆అరటిబోదె నరుకుతాడో ◆◆ వాడు పతితుడు కాడని తలుస్తాను. ఇల్లాగే ఇక్కడకూడా ఎవడేనా - ఇల్లా అపశబ్దం ప్రయోగిస్తాడంటూ వాణ్ణి అనుకరిస్తూ అపశబ్దాన్ని ప్రయోగిస్తే వాడుకూడా అపశబ్దభాజనుడు అవుతాడా? ఎందునిమిత్తం ఈఉపదేశం చెయ్యాలిసి వచ్చిందో, ఆ అపశబ్దపదార్థకమైనశబ్దం వేరేకాదా! అపశబ్దపదార్థకశబ్దం అపశబ్దం అంటూ కాజాలదు. తప్పకుండా ఇల్లా జ్ఞాపకం వుంచుకోవాలె - (ఏమంటే) అపశబ్దపదార్థకమైనశబ్దం అపశబ్దం అవుతుందీ అనుకొనేవాడుంటే - అపశబ్దం అనే ఆమాటే వాడికి అపశబ్దంకావాలె గాని అపశబ్దము అది ఎంతమాత్రం కాదు - అని (పస్పశం)

ఇప్పటికే చాలాగ్రంథం వుదాహరించాను. ఇప్పుడు ఒకమారు సింహావలోకనం మనం చెయ్యాలె. మహాభాష్యంలోనుండి ఆరుఖండాలుగా గ్రంథం వుద్ధరించానుకదా! అందులో మొదటిదీ రెండోదీ మూడోదీకూడా పతంజలులవారు వ్యాకరణప్రయోజనాలని వివరించినవాటిని తెలుపుతూ వున్నవి. వాటిని పరిశీలిస్తే ఈ పాణిని సంస్కృతవ్యాకరణం అనేది [తాను లౌకికవైదికాలకు ఉభయానికీ చెందేదిగా నిర్దేశించినా,] వేదాంగంగానూ, వేదరక్షార్థముగానూ, వైదికప్రచారవ్యవస్థచేసేదిగానూ వున్నట్టు నిరూపించడమే పతంజలివారికి ముఖ్యోద్దేశమైనట్టు స్పష్టపడుతున్నది. ఆయన కాదు లోకవ్యవహారంలో ఒక్కొక్కశబ్దానికి అనేకఅపభ్రంశా లున్నవని చెప్పడంవల్లా ఋజువు చేయడం

వల్లానూ ఆయనదృష్టిలో-అపభ్రంశత్వం అనేది - నేడు గ్రామ్యం అనిచెప్పే అపభ్రంశత్వం [అశ్లీలార్థకం] లాంటిది కాదనీ,అపశబ్దరూపంగామాత్రం వుండేదనీ వ్యక్తపడుతున్నది. ఫలానాది సుశబ్దమా! లేక అపశబ్దమా!-అంటే, లోకంలోని శిష్టజనులు మున్నగువారి గ్రంథప్రయోగాలనూ, వ్యావహారికప్రయోగాలనూ బట్టే అది నిర్ణయించవలసి వుంటుందనే విషయం కాలుగోడు దాహరణం తెలపడమే కాకుండా, సర్వదేశాలవారీ, సర్వవిధాలవారీభాష శిష్టంగా వుంటే దానికి అనుశాసనం చెయ్యడమనేది వైయాకరణుల ధర్మమనికూడా ఋజువుపరుస్తూ - గ్రాంథికులయినవారు ఏకదేశంతో అపశబ్దంగా కొట్టివేయరాదనీ, లోకంవాడుకలో ఆధారంవుండేమో వెదకి వెదకి కూర్చవలసి వుంటుందనీ స్పష్టంగా చెబుతూనే వున్నది. అయిదోది ఏకశ్శబ్దః సమ్యక్ప్రయుక్తః స్వర్గే లోకే కామధుగ్భవతి - అనుదాన్ని చర్చిస్తూ సుశబ్దజ్ఞానంలో ధర్మమా! ప్రయోగంలో ధర్మమా! అనే అంశాన్ని చక్కగా విచారణ చేసిచేసి శాస్త్రపూర్వకమైన శబ్దప్రయోగంలోనే ధర్మమని నిశ్చయిస్తూ, తనవ్యాకరణం అందుకొఅకే ఆరంభమైనట్లు చెప్పకుండానే చెప్తూవున్నది. ఆరోది శాస్త్రపూర్వమైనశబ్దప్రయోగం - అనే ఆవిషయాన్ని గురించిన ఆచారనియమాన్ని చర్చిస్తూ యర్వాణతర్వాణులకథ నుదాహరించి యజ్ఞకాలంలో మాత్రమే అపశబ్దప్రయోగజనితమైన ప్రత్యవాయమనీ తక్కినకాలాల్లో వారుకూడా వ్యావహారికంగా అపశబ్దాలు వాడేవారనీ చెబుతున్నది. ఇంకా-నాటకాలూ, లోకవృత్తాన్ని చెప్పే కథలూ కావ్యాలూ నవలలూ - మొదలయినఅనుకరణప్రధానమైన వాఙ్మయంలో అపశబ్ద మనేది దోషంకాకుండా వుండడమే కాక గుణమనికూడా వ్యక్తం చేస్తూనే వున్నది. కాబట్టి శిష్టవ్యవహారంలోవుండే శబ్దజాతం ప్రమాణమైనదే అనీ, వారివ్యవహారం లోకవ్యవహారకౌశల్యంపైని ఆధారపడుతూ వుంటున్నదనీ, దానికి గ్రంథప్రయోగార్హత వుందనీ, ప్రత్యవాయం అనేది సర్వకాలసర్వావస్థలయందూ ప్రజలవెన్నంటేది కాక, క్వాచిత్కంగా యజ్ఞగతమైందనీ, కాబట్టే ఆనాటివ్యావహారికభాష అయినప్రాకృతం గ్రామ్యంకాదనీ, దానితోనే మహామహులు అనేకులు గ్రంథాలు వ్రాసే వ్యాకరణాలు ఏర్పరచీ అభ్యుదయం చేకూర్చారనీ, అట్టిలక్షణాలు కలదేకాబట్టి నేటిమనవ్యావహారికభాషకూడా నిస్సందిగ్ధంగా గ్రంథప్రయోగార్హదశను కలిగిఉన్నదనీ, శాస్త్రీను గమరీతి ఇల్లా వున్నా, కాదనేవారికి, పతంజలిఅన్నట్లు (అపశబ్దఇత్యేవ తస్యాపశబ్ద స్స్యాత్) వారి గ్రామ్యభాష అన్నమాటే గ్రామ్యం అవుతున్నదనీ నిరూపిత మవుతూ ఉన్నది. ఈచర్చవల్ల వ్యావహారికభాషను గ్రామ్యంగా నిర్దేశించి పతంజలే గ్రామ్యం అన్నాడూ ! - అనే తాండవరాయుల వాదం తలక్రిందువాదం - అని తేలుతూ వుంది.

* పతంజలిశబ్దానుశాసనమూ - భట్టుకుమారిలుని మతమూ. *

ఈచర్చకు ఇంతతోస్వస్తిచెప్పడానికి ముందు మరోసందర్భం స్పష్టపరచవలసి వున్నది. పతంజలి పాణినీయవ్యాకరణానికి ఇంతసంరంభంతో వేదాంగవ్యాకరణత్వం నిరూపించడానికి పూనుకొన్నా, మీమాంసకులు ఈవాదాన్ని ఏమీ అంగీకరించలేదు. మీమాంసకులగు పండితులలో కుమారిలభట్టు అగ్రసరుడు. ఆయన తంత్రవార్తికం అనేగ్రంథంలో ఈపతంజలి వ్యాకరణప్రయోజనాలుగా చెప్పిన పద్దెనిమిదికారణాలూ ఖండించివేశాడు మొగమాటం లేకుండానే. ఆయవగ్రంథంలో నుంచి, స్థాలీపులాకన్యాయంగా ఒకటిరెం డుదాహరణాలిస్తాను.

I. శ్లో. ఏవం చాఽవేదమూలత్వా న్న ధర్మనియమార్థతా, యుక్తా శబ్దస్మృతే ర్వక్తుం న చాస్యా శ్శాస్త్రతా స్వయం । నహి వ్యాకరణాదీనాం వేదత్వేన స్వతంత్రతా, పురుషాధీనవృత్తే శ్చ సాపేక్షస్యాప్రమాణతా. ♦ ♦ ప్రాయేణ మనుగౌతమవసిష్ఠాదిప్రణీతాః సమానేష్వర్థేషు ధర్మసంహితా వర్తంతే, తేనాఽవిగానా త్తాభ్యఏవ శ్రుతయః స్వనుమానాః నచ వ్యాకరణస్య తాభి స్సమానార్థత్వం.

శ్లో. పరస్పరేణ చాచార్యా విగీతవచనాస్థితాః, సూత్రవార్తికభాష్యేషు కింతత్రాభ్యవసీయతాం । న తావ త్సూత్రకారేణ కించి దుక్తం ప్రయోజనం, కథంచైతావతిగ్రంథే స్యా త్ప్రయోజనవిస్మృతిః.

యేష్వపి తద్గ్రంథేషు విస్పష్టాన్యాదిత ఏవార్థస్య ప్రయోజనాని జ్ఞాయంతే. నచైషాం శ్రవణ గ్రహణధారణేషు మహాన్ ఖేదః, తేష్వపి జిజ్ఞాసూత్సాహార్థం పూర్వం ప్రయోజనా న్యేవ నిబధ్యంతే - ధర్మం వ్యాఖ్యాస్యామో యజ్ఞం వ్యాఖ్యాస్యామ ఇత్యేవమాదిభిః, ఇహపున రత్యంతకష్టం వ్యాకరణం ప్రణయతా సూత్రకారేణ ధర్మార్థకామమోక్షాణాం న కస్యచి త్ప్రయోజనత్వమాశ్రితం. నచ సర్వప్రధానే వస్తు న్యనాదరో యుక్తః, సుజ్ఞాతత్వం పున రీదృశం, యేనాద్యాపి వివదంతే —

శ్లో. ధర్మ శ్చ ఫలసంబద్ధం కర్మ యాగాది వర్ణ్యతే, న చ వ్యాకరణే కించి త్కర్మ యాగాది వర్ణ్యతే । ధర్మత్వం యచ్చ విజ్ఞానశాస్త్రపూర్వప్రయోగయోః, యథేష్టం వర్ణితం తచ్చ న శాస్త్రసదృశం మతం.

శాస్త్రార్థోహి నిరూపితరూపో భవతి. ఇహ చ జ్ఞానధర్మత్వ ముపన్యస్య అధర్మప్రసంగ భీతేన శాస్త్రపూర్వప్రయోగేఽభ్యుదయ ఇతి వార్తికకారేణోక్తం. భాష్యకారఆహ - అథవా పున రస్తు జ్ఞానేధర్మ ఇతి. నచైవ పునిరుమేనధర్మత్వావధారణ ముక్తం. [తంత్రవార్తికం, ౧ అధ్యాయం 3 పాదం 196 పేజి]

దీని తాత్పర్యం ఇదీ:-ఇది ( వ్యాకరణం ) వేదమూలం కాదు కాబట్టి ధర్మనియమార్థత్వమంటూవుం దని చెప్పడానికిగానీ స్వతః శాస్త్రత్వంవుందనడానికిగానీ వీలులేదు వ్యాకరణాదులకు వేదత్వాన్ని బట్టి స్వతంత్రత లేనే లేదు. పురుషాధీనవృత్తి కాబట్టి సాపేక్షమైనదానికి ప్రమాణత్వంలేదు. ♦ ♦ తఱుచు మనువు గౌతముడూ వసిష్ఠూ మొదలయినవారు రచించినస్మృతులు (ఎచ్చటనైనా అభిప్రాయ భేదాలు వున్నా ) సమానాలయిన అర్థాలలో ధర్మసంహితాలు ఉంటున్నవి. అందుచేతనే విగాన మంటూ లేకుండా, వాటినుండి శ్రుతులు స్వనుమానాలు కావడానికి వీలుంది. వ్యాకరణానికి వాటితో సమానార్థత్వం లేనే లేదు. మఱిన్నీ ఇందులో [ వ్యాకరణంలో ] ఆచార్యులు వకరితో వకరు విరుద్ధ వచనాలవారుగా వుంటే - మఱి చెయ్యవలసిందేమి ? పైగా సూత్రకారులు ( పాణిని ) తనవ్యాకర ణానికి ఫలమేమో చెప్పాడుకాడు. అంతగ్రంథంలో ఫలవిస్మృతి ఎల్లాగు కలుగుతుందీ ? అగ్రం థాలు ఎట్టివిగా వున్నాసూ తొలుతనే వాటిప్రయోజనాలు స్పష్టంగానే గోచరిస్తూ వుంటవి. శ్రవ ణంలోనూ గ్రహణంలోనూ ధారణలోనూ అంతహెచ్చు ఖేదంలేనివాటిల్లోగూడ జిజ్ఞాసువులకు వుత్సాహం కలిగేటందుకై మొదటే - ధర్మం వ్యాఖ్యానిస్తాము, యజ్ఞం వ్యాఖ్యానిస్తాము అని ఇల్లా గా - ఫలాలు నిర్దేశింపబడతవి. ప్రకృతం ఇక్కడ అత్యంతకష్టమైన వ్యాకరణాన్ని రచిస్తూవున్న

సూత్రకర్త ధర్మార్థకామమోక్షాలలో ఏప్రయోజనాన్నీ ఆధారంగా చేపట్టలేదు. సర్వప్రధానం - అనిచెప్పుకొనేదానివిషయంలో అనాదరం మంచిదికాదుగదా! నేటికీ వివదించుకొనే వీరిసుజ్ఞాతత్వం ఇల్లా వుంది. తక్కినట్టి - ధర్మశాస్త్రములలో ఫలసంబద్ధమైనధర్మమో యాగాదికర్మో వర్ణింపబడుతుంది. వ్యాకరణంలో అల్లాంటిది వర్ణింపబడలేదు. ఇక వర్ణిత మైందనుకొనే విజ్ఞానశాస్త్రపూర్వప్రయోగములకు సంబంధించినధర్మంకూడా యథేష్టంగా వర్ణిత మైనదే కాని అదేనా శాస్త్రప్రయోగ్యంగా చెప్పబడలేదు. శాస్త్రార్థమనేది నిరూపితరూపంగా వుండాలెకదా! ఈ వ్యాకరణంలో జ్ఞానధర్మత్వాన్ని వుపన్యసించి అధర్మప్రసంగంకస్తుందేమోయని భయపడినవాడై వార్తికకారుడు "శాస్త్రపూర్వప్రయోగంలో అభ్యుదయం" అని అంటే ( విరుద్ధంగా ) భాష్యకారుడంటాడు - అథవా జ్ఞానంలో అధర్మమే ఉండదనీ - అంటాడు. ఈ రీతిగా ఓనియమంలేకుండా ధర్మత్వనిశ్చయం చేశాడు.
[ తంత్రవార్తికం ౧ అధ్యా 3 పాదం 196 వ పేజీ. ]

II. శ్లో. యత్త్వైవ లోకసిద్ధత్వాత్ కృష్యాదేర్లక్షణం వృథా, తథైవ వేదసిద్ధానాం శబ్దానాం లక్షణం వృథా। రక్షాద్యపి యదత్రోక్తం మన్వాఖ్యాకప్రయోజనం నతదప్యన్యతస్సిద్ధేరల్పసిద్ధేస్తతోపి వా। నిరాకాంక్షీభవేల్లక్ష్యం యేన తస్మాన్మలక్షణం, శతాంశమాత్రసిద్ధౌతు తేన మందం ప్రయోజనం। సమామ్నాయప్రసిద్ధోఽపి సామవేదేఽస్తి లక్షణం, తద్వ్యక్తీంకృతస్స్వసిద్ధత్వాత్ కృతార్థ్యేన చార్థవత్। అక్షయోద్యస్సమామ్నాయాత్పదవాక్యక్రియాః బహూః, స లక్షయేత్తరామల్పం ప్రకృతిప్రత్యయక్రమం.

కించ—ఇది వ్యాకరణాద్రక్షాం మన్వీర న్వేదవాదినః, వైయాకరణగేహేషు ఛిందుర్వేస్తే వేదసంశయాః। లోకే యస్య యదర్థత్వ మాప్తా వా యత్ర యే మతాః, తేన తేభ్యశ్చ తద్వస్తు యథావ దవగమ్యతే। ఆయుర్వేదం చికిత్సా తు ప్రాయేణ వినియుజ్యతే, వ్యాధితత్త్వావధజ్ఞానం వైద్యేభ్య శ్చోపలభ్యతే। సహాధ్యాయిభిరేవాత్ర వేదః కార్త్స్న్యేన రక్ష్యతే, స్వరాక్షరవినాశోఽపి ద్వేషా దన్యైర్న దృశ్యతే। తస్మాత్ త్రిభి రుపాధ్యాయై ర్ద్విష్టై ర్వ్యాకరణాదిభిః, న వినాశయితుం వేదో లభ్యతే తేన రక్ష్యతే.

తస్మాద్వేదరక్షార్థం తావ న్నాధ్యేయం వ్యాకరణం.

లోకే తు సర్వభాషాభి రర్థా వ్యాకరణాదృతే, సిధ్యంతి వ్యవహారేః। కావ్యాదిష్వప్యసంశయం। కావ్యశోభాస్వపి త్వేతస్మిన్నవాతీవోపయుజ్యతే, వైయాకరణదోషాద్ధి కష్టాః శబ్దాః ప్రయుంజతే। నచ లక్షణ మస్తీతి ప్రయోక్తవ్య మలౌకికం, లోకసిద్ధప్రయోగేతు లక్షణం స్యాదనర్థకం। ఊహార్థ మపి శబ్దానాం నవ్యాకరణ మర్థవత్, ఊహస్యాప్యన్యతస్సిద్ధే రూహ్యానూహ్యవిభాగవత్। వేదఏవహి సర్వేషా మాదర్శస్సర్వదాస్థితః, శబ్దానాం తత ఉద్ధృత్య ప్రయోగస్సంభవిష్యతి। అథవా యోపి గావ్యాది ర్లోకేనార్థే ప్రయుజ్యతే, సోప్యర్థద్వారతః ప్రాప్తప్రయోగః కేన వార్యతే? నచ వేదాంగభావోఽపి కశ్చి ద్వ్యాకరణం ప్రతి, తాదర్థ్యావయవాభావా ద్బుద్ధాదివచనే ష్వివ। శ్రుతిలింగాదిభి స్తావ త్తాదర్థ్యం నాఽస్య గమ్యతే, అశ్రుతిశుస్యవా కశ్చి త్కృతిరోమోఽవయవః కథం? । తత్త్వావబోధశబ్దానాం నాస్తి వ్యాకరణాదృతఇతియత్ - తదూరిపరసగంధస్పర్శేష్వపి వక్తవ్యమాసీత్ । కోహి ప్రత్యక్షగమ్యేర్థే శాస్త్రాత్తత్త్వావధారణమ్, శాస్త్రలోకస్వభావజ్ఞ ఈదృశం వక్తు మర్హతి। అతఏవ శ్లోకస్యోత్తరార్థం ఏవం వక్తవ్యం —

తత్త్వావబోధ శ్శబ్దానాం నాస్తి శ్రోత్రేంద్రియాదృతే - ఇతి. నహ్యేత్రికశ్చి ద్విప్రతిపద్య తే, బధిరేష్వేవ మదృష్టత్వాత్ (ఇత్యాది)

ఈవాక్యాల తాత్పర్యం ఇదీ:- “ లోకసిద్ధంగా వుండడంచాత కృష్యాదులకు (వ్యవసాయం మొదలయినవాటికి) లక్షణం ఏర్పరచడం ఎంత వ్యర్థమో వేదసిద్ధాలయినశబ్దాలకు లక్షణం ఏర్పరచడం కూడా అంతే వ్యర్థమైనకార్యం. వ్యాకరణం చెప్పడానికి వేదరక్షణం మొదలయినవి కారణాలని చెప్పినమాటకూడా, మరోదానివల్ల సిద్ధిస్తూండడం వల్లా, (వ్యాకరణంవల్లకూడా సిద్ధించినా) అత్యల్ప సిద్ధికలగడంవల్లాకూడా ఈవ్యాకరణప్రయోజనం వృథా అవుతున్నది. లక్ష్యం మరోదానిఅపేక్ష లేకుండా దేనివల్ల పూర్తిగా సిద్ధిస్తుందో, అదే లక్షణం అనిపించుకొంటుంది. అంతేకాని నూరోవంతు మాత్రమే సిద్ధించేలక్షణంవల్ల ఆట్టే ప్రయోజనం లేదు. సమామ్నాయప్రసిద్ధంగా తీసికొన్నా సామవేదంలో వైదికశబ్దాలకు లక్షణం వుండనే వుంది. కావలసినలక్షణం అంతా దానివల్ల సిద్ధిస్తూండడం చాత అదే అర్థవత్తు అవుతుంది. సమామ్నాయాన్నిబట్టి అనేకంగా పదవాక్యాలరీతులు లక్షింపబడుతూనే వుంటే, ఇక ఈవ్యాకరణంవల్ల వచ్చే కొద్దిపాటిప్రకృతిప్రత్యయవిధానం ఏంలాభం ? మరిన్నీ వైయాకరణులనుకొన్నట్టుగా వ్యాకరణంమూలాన్నే వేదరక్షణం జరుగుతూందీ - అనే వేదవేత్తలు తలచివుంటే, ఈపాటికి తమకుతమకు కలిగినవేదంలోనిసందేహాలు అన్నింటినీ వైయాకరణులయిండ్లకు పోయి తీర్చుకొని వుండేవారే. లోకంలో ఏవస్తువుకోసరం ఎవరు ఎవరికి ఆప్తులుగా వుంటారో, వారు ఆవస్తువులను వారిమూలంగా పొందుతూ వుంటారు(ఉదాహరణం చెప్తాను ) ఆయుర్వేదం తరుచువ్యాధులకు చికిత్సచేయడంలో ఉపయోగపెట్టబడుతుంది. దాన్ని ఉపయోగపెట్టే వైద్యులనుండే ప్రజలు వ్యాధితత్వాన్నీ దానికి తగినమందునూ పొందుతూ వుంటారు. కూడా చదివేవారివల్లనే వేదం సర్వం రక్షింపబడుతుంది. స్వరనాశనంగానీ అక్షరలోపాన్నిగాని ద్వేషంవల్ల అన్యులు సహింపరు కాబట్టి సంప్రీతులయిన ఉపాధ్యాయులద్వారానే వేదం నశింపనీయకుండా కాపాడబడుతుండే కాని వారికి ద్వేష్యకోటిలోనివైయాకరణులచేత ఎంతమాత్రం వేదం రక్షింపబడదు. ఒకవేళ అద్వేషులు వేదాన్ని వినాశనం పొందించడానికేనా గానీ సాధ్యంకానిది ఆవేదం. కనకా వేదరక్షణం కోసరమని వ్యాకరణం చదవనక్కర లేదు. ”

“ లోకంలో అన్నిభాషల్లోనూ వ్యాకరణం లేకుండానే లోకవ్యవహారంచేతనే శబ్దార్థాలు పొందబడుతున్నవి. కావ్యాలుమొదలయినలౌకికభాషలో కూడా నిస్సంశయంగానే ఇల్లాగే అర్థం ఏర్పడుతున్నది. పైగా కావ్యశోభలవిషయంలోనేనా ఉపయోగిస్తుందేమో అంటే - అది (వ్యాకరణం) అంతగా ఉపయోగించడం లేదుసరిగదా వైయాకరణులదోషంచాత అతికష్టము లయినశబ్దాలను కూడా లోకులు ప్రయోగించవలసి వస్తున్నది. లక్షణం (వ్యాకరణం) వుందిగదా అని లోకంలో వాడుకలో లేనిశబ్దాలు ప్రయోగించరాదు. లోకసిద్ధాలయినశబ్దాలే వ్యాకరణంలోనూ వున్నవంటారా ? - అల్లాగైతే ఈలక్షణశాస్త్రం వ్యర్థమే అవుతుంది. ఇల్లాగే ఊహార్థంకూడా వ్యాకరణం పనికిరాక నిరర్థకం అవుతున్నది. ఈఊహ మరోదానివల్లనేసిద్ధిస్తూ వుంది. వేదమే అందరికీ అన్నికాలాల్లోనూ ఆదర్శంగా వుండడంచేత (వ్యాకరణపుజోక్యం లేకుండానే) ఆవేదంనుండే ఉద్ధరించిప్రయోగించుకోవడం కలుగుతుంది. అథవా (పోనీ - పక్షాంతరంగాచూచినా) లోకులు ఆయా అర్థాల్లో గావ్యాదిశబ్దాలను ప్రయోగిస్తూనే ఉన్నారు. అర్థాన్నిబట్టే దానికి ప్రయోగప్రాప్తికలుగుతూంటే

అడ్డుకోగలిగినవైయాకరణు డెవడు ? ఇల్లాగే తాదర్థ్యావయవత్వం అంటూలేకపోవడంచాత, దీనికి (వ్యాకరణానికి) బుద్ధాదులవాక్యాలకువలెనే వేదాంగత్వంకూడా ఉండనే ఉండదు. కృత్రిమంగాదు లతో దీనికి తాదర్థ్యం పొందించడానికి వీలులేదు. ఏమంటే అకృత్రిమమైనదానికి (వేదానికి) కృత్రిమమైన (వ్యాకరణం - అనే) ది అంగంగా ఎల్లా ఉండగలదు ? "వ్యాకరణం లేనిదే శబ్దాలకు తత్వావబోధం సిద్ధింపదనేది చూతాము. అది వస్తువుల రూపరసగంధస్పర్శలవిషయంలో కూడా అనవలసిన మాటేకాదా ? కనుక ప్రత్యక్షంగా కంటికి కనిపిస్తూ అర్థంతెలిసేవానివిషయంలో శాస్త్రంవల్లే తత్వార్థం ఎవరు నిర్ణయించి తెలిసికోగల్గుతారు ? శాస్త్రాలా లోకులస్వభావం ఎఱిగినవాడెవ్వడూ ఇల్లా అనడానికి సిద్ధపడడుగదా ! " - అని.

ఈవిధంగా కుమారిలభట్టు పతంజలిగ్రంథయుక్తులు ముక్కముక్కలుచేసి నురిమి గాలికి చల్లినాడు. ఆయుక్తులన్నీ ౫౦ లేక ౬౦ పేజీలగ్రంథంగావుంది. స్థలసంకోచంచేత కొంచెం మచ్చుమాత్రమే చూపించాను. కాని ఒక్కవిషయంమాత్రం పూర్తిగా అనువదించక తప్పనిసరి. అది ఏదంటే - పతంజలులవారు నిరూపించిన అపశబ్దచర్చ. అందులో ఆయన విచారణ చాలా దీర్ఘంగా చేసిచేసి చివఱకు ప్రతిజ్ఞాపూర్వకంగా కల్పసూత్రస్మృతిగ్రంథమీమాంసాగ్రంథకారులగ్రంథాలలోనుండి అపశబ్దాలను ఏర్చి ప్రదర్శిస్తాడు. ఆహితాగ్నులనుకొనేవారి అపశబ్దవాదం పట్టి డాంబిక మని ఋజువుచేస్తాడు. నేడు రామమూర్తిపంతులుగారు గ్రాంథికాగ్రేసరులగ్రాంథికవాదం పట్టి డాంబిక మని ఋజువుచేశారు. కనుక ఇందులో కూడా ప్రాకృతభాషావాదానికి నేటివ్యావహారికభాషావాదంతో పోలిక ఏర్పడుతున్నది. ఆ కారణంచేతే దాన్నిపూర్తిగా అనువదింపక తప్పినది కా దని మనవిచేస్తున్నాను. అది అపశబ్దవ్యవస్థకూడా అవుతుంది కాబట్టి చదువరులు కొంచెం శ్రమకు సహింపక తప్పదు. కనుక దయతో చిత్తగించండి:-

* ఆహితాగ్నిగ్రంథకర్తల అపశబ్దా లని కుమారిలభట్టు వ్రాసినభాగములు *

కుమారిలభట్టు - ధర్మాచారప్రణిహితచిత్తులగు శిష్టులలో తరుచు ఎవడో ఒకడే - నూటికీకోటికీ ప్రమాదవశాన అల్పమైన అనాచారుడుగా వుంటాడనీ, గావ్యాదిశబ్దాలను ప్రయోగిస్తే ఎవడికీకూడా అనాచారబుద్ధి కలగడం లేదనీ ఆపైని ధర్మశాస్త్రంద్వారా ప్రత్యవాయజనకాలన్నబుద్ధితో నిషేధం పబడిన కలంజభక్షణాదులు చేసినప్పుడు తత్ప్రాయశ్చిత్తార్థంగా చేసే గర్హమైనచికిత్స (ఈగావ్యాది శబ్దాలను ప్రయోగిస్తే) చేస్తున్నట్లు గోచరించడం లేదనీ వెలకొలదీఆహితాగ్నులను పరీక్షించిచూచినా-అందులో ఒకడేనా భాష్యకారులభావానికి సరిపోయేట్టుగా సాధుశబ్దాలతో వ్యవహరింపగలవాడంటూ తనకు కనపడడం లేదనీ చెబుతూ ప్రస్తావవశాన ఆహితాగ్నులయినగ్రంథకర్తలు వాడిన అపశబ్దాలను ఇల్లా ఉదాహరిస్తున్నాడు. చూడండి.

III. శ్లో॥ కల్పసూత్రస్మృతిగ్రంథమీమాంసాగృహ్యకారిణః శిష్టాదుష్టాః ప్రయుంజానా అపశబ్దా ననేకశః, (౧) 'సమాన మితర చ్ఛ్యేనేన'-ఇత్యాదిష కారాంతనపుంసకప్రయోగేషు మకారేణ తత్ర తత్ర చప్రయుక్తం -సమాన మితరం జ్యోతిష్టోమే నేతి. సమాన మితరం గవా ఐహికేనేతి సూత్రకారేణాపి అభిహితం. (౨) 'అహీనే బర్హిష్పవమానే స్పదపి స్తుతీర న్వితి' - కర్తృఫిహాయక్రియాఫలవర్జితేఽపి త్విత్విర్భ్యః స్తువతే యజంతి యాజకాఇతివ త్వరత్మైపదే

ప్రయోక్తవ్యే వ్యాకరణ మనపేక్ష్యైవ ఆత్మనేపదం ప్రయుక్తం. (3) తథాఽఽశ్వలాయనేన - ప్రత్యసిత్వా ప్రాయశ్చిత్తం జుహుయా దితి సమాసేఽపి ల్యబ్న ప్రయుక్తః. (4) తథా శిక్షాయాం నారదేన - ప్రత్యూషే బ్రహ్మ చింతయే దితి గావ్యాదితుల్య ఏవ ప్రయుక్తః. (5) తథా మనునాఽపి - జ్ఞాతార స్సంతి మేత్యుక్త్వా త్రి సంతిమఇత్యుక్త్వాతి వక్తవ్యే వ్యాకరణ మనపేక్ష్యైవ సంహితా కృతా. (6) తథా మీమాంసాయా మపి గవ్యస్య చ తదాదిష్వితి గోద్వికారావయవవిషయసాధుశబ్దప్రయోగయోగ్య శ్శబ్దోఽన్యత్రైవ గవా మయనే ప్రయుక్తః. (7) తథా ద్యావో స్తథేతి చేదితి ద్యావాపృథివ్యో రితి వక్తవ్యే లక్షణహీనమేవ బహు ప్రయుక్తం. (8) తథా గృహ్యకారేణ మూర్ధన్యభిఘ్రాణమితి వక్తవ్యే మూర్ధన్యభిజిఘ్రాణమితి జిఘ్రాదేశః ప్రయుక్తః (9) శాస్త్రేష్వపి వ్యాకరణస్యాఽపి నిరుక్తే హీన లక్షణాః ప్రయోగా బహవః, యద్వత్ - బ్రాహ్మణో బ్రవణాదితి. (10) సంవత్సరం శశయానా - ఇత్యేతన్మంత్రగతం మండూకవిషయబ్రాహ్మణశబ్దనిర్వచనే క్రియమాణే వచనశీలత్వనిమిత్తతాం దర్శయతా బ్రువో వచి రితి వచ్యాదేశ మకృత్వైవ బ్రవణా దిత్యుక్తం (11) అతో నాస్త్యపశబ్దానాం ఇతిహాసపురాణయోః, తథోభాభ్యోద్విరూపాణాం హస్తిశిక్షా దికారిణాం. యుగపదుభాభ్యాం దంతాభ్యాం యః ప్రహారః స ఉభాభ్యః - ఇతి సర్వైః పాలకాప్యరాజపుత్రాదిభి ర్వ్యాకరణ మనపేక్ష్యైవ ప్రయుక్తం. (12) వేదేష్వపి ప్రయోగా స్తే భూయాంసోఽధ్యేతృ సంమతాః. సామాన్యం ఛాందసం వాఽపి యేషాం నాస్త్యేవ లక్షణం. నహి తే సుప్తిఙుపగ్రహాదివ్యత్యయేన, నాఽపి కతిపయాధికారదృష్ట్యేన, బహుళం ఛందసీత్యనేన సిద్ధ్యంతి. తద్యథా - (13) మధ్యం అపస్య తిష్ఠతి. (14) నీచీనవారం వరుణః కబంధం ఇతి. నవ్యాపామి త్యస్య నిత్యస్త్రీలింగబహువచనవిషయవ్యంజనాంతప్రాతిపదికవిషయపరమ స్త్యవ్యాఖ్యానాదాపస్యే త్రేధాఽపి రూపం లక్షణానుగతం దృశ్యతే, నాఽపి ద్వారశబ్దస్య స్థానే లాటభాషాతో న్యత్ర వారశబ్ద స్సంభవతి. తేన అవారభ్య ఏవాయం విషయవ్యాప్త్యసంభవాత్.

శ్లో. శబ్దానుగమరూపోఽర్థో యత్ర వ్యాకరణం కృతం, యేఽపి వ్యాకరణస్యైవ పరే పారే ప్రతిష్ఠితాః । సుతరాం తేఽపి గావ్యాదితుల్యా నేవ ప్రయుంజతే, సూత్రవార్తికభాష్యేషు దృశ్యతే చాఽపశబ్దనం । అశ్వారూఢాః కథం చాశ్వాన్ విస్మరేయుః సచేతనాః.

(15-16) సూత్రేతావత్ - జనికర్తుః ప్రకృతి రిత్యత్ర హి ద్వావపశబ్దౌ. జనిశబ్దేనహి ఇక్శ్తిపౌ ధాతునిర్దేశః ఇత్యనేన లక్షణేన అన్వితో ధాతురేవ నిర్దిశ్యతే. నచ జనికర్తుఃప్రకృతిరిత్యత్రహి కర్తుఃప్రకృతే రపాదానసంజ్ఞా ఇష్యతే. జాయమానస్య పునరర్థస్య జనిశబ్దో వాచకతయా నైవ లక్షణేన అనుగమః. తేనాఽయందరిద్రిఇవ అశ్వశబ్దో జనిమాత్రవాచిత్వా త్తదర్థం ప్రత్యసాధురేవ విజ్ఞాయతే. (17) తథా తృజకాభ్యాం కర్తరిచేతి ప్రతిషిద్ధమప్తి సమాసప్రయోగా ద్వ్యాకరణఫలపరిత్యాగః. ఏవం తత్ప్రయోజక ఇతి ప్రతిషిద్ధఏవ సమాసః (18) తథా వార్తికేఽపి దంష్ట్రేర్హ్యగ్రిహాణస్య జాతివాచకత్వా త్సిద్ధమితి. (19) తథా అవ్యభావ్యం తు కాలశబ్దవ్యవాయా దితి అత్రిక్లిశేన సమాసం కల్పయిత్వా తత స్సమాససంజ్ఞయా గుణవచనసంజ్ఞాయాం బాధితాయాం గుణవచనబ్రాహ్మణాదిభ్యఇతిలక్షణేనాసంస్పృష్ట ఏవ ష్యఞ్

ప్రయుక్తః. (౨౦) భాష్యేఽపి - అవిరవికన్యాయేనేతి ద్వంద్వగర్భతత్పురుషే పూర్వసమాస పూర్వపదస్థాయాః సుపః-సుపో ధాతుప్రాతిపదికయోరితి ప్రత్యక్షోపదిష్టోపి లుక్ న కృతః (౨౧) తథా - అన్యథాకృత్వా చోదిత మన్యథాకృత్వా పరిహారఇతి (౨౨) అన్యథైవం కథం - ఇత్యన్వాఖ్యాతసాధుత్వోఽపి ణముల్ న ప్రయుక్తః. నచైషాం నిపాతనై స్సాధుత్వసిద్ధిః. యతః

శ్లో. యేషా మనుగమో నాఽస్తి తే సిధ్యేయు ర్నిపాతనైః, అన్యథానుగతానాంతు ప్రయోగం బాధతే స్మృతిః । స్మృత్యాచారవిరోధే హి స్మృతి రేవ బలీయసీ, ప్రత్యక్షప్రతిషేధా చ్చ జనికర్త్రాద్యసాధుతా.

ప్రత్యక్షస్మృతివిరోధే తు లక్షణరహితస్యాఽపి ప్రయోగాదేవ శిష్టాచారభూతా దవయవానుగమస్మృతి మను - మాయ నిపాతనా త్సాధుత్వసిద్ధిః. న చ లక్షణశబ్దానాం స్వాత్మని క్రియావిరోధా దాత్మాశ్రయత్వాభావా ద్వా లక్షణానుగతి రనాదరణీయాం శ్లో. ప్రదేశాంతరసిద్ధేన లక్షణేనానుగమ్యతే, దేశాంతరస్థిత శ్శబ్దో లక్ష్యభూతోఽన్యశబ్దవత్.

[ తంత్రవార్తిక, ౧ అధ్యా 3 పాదం, పేజి 199 — 202 ]

ఈవాక్యాలతాత్పర్యం ఇల్లాగు వున్నది:—కల్పసూత్రకర్తలూ స్మృతికర్తలూ మీమాంసాశాస్త్రకర్తలూ గృహ్యసూత్రరచయితలూ ఈ మొదలయినశిష్టులు తమతమగ్రంథాలల్లో అనేకంగా అపశబ్దాలు ప్రయోగిస్తూ దుష్టతను పొందినవారే! [ఎల్లాగంటే - ] (౧) మశకుడనే కల్పసూత్రకర్త 'సమానమితరచ్ఛ్యేనేన - అనేలాంటి తకారాంతనపుంసకలింగాలను ప్రయోగించేటప్పుడు, అక్కడక్కడా 'సమాన మితరం జ్యోతిష్టోమేన' అని అకారాంతంగానే ప్రయోగించాడు. ఇల్లాగే - సమానమితరం గవా ఏకాహికేన - అని సూత్రకారులున్నూ ప్రయోగించారు. (౨) అహీనే బహిష్పవమానే స్సదసి స్తువీరన్ - అని కర్త్రభిప్రాయక్రియాఫలవర్జితంగా వున్నా ముఖ్యసుబుత్విక్కులు కర్తలుగాగల స్తవనమందు యజంతి యాజకాః - అన్నట్టుగానే పరస్మైపదం ప్రయోగించవలసివున్న ప్పటికిన్నీ వ్యాకరణాన్ని అపేక్షించకుండానే ఆత్మనేపదం ప్రయుక్తమైంది. (3) అల్లాగే ఆశ్వలాయనులుకూడా తమసూత్రగ్రంథంలో - ప్రత్యసిత్వాప్రాయశ్చిత్తం జుహుయుః-అని సమాసవాక్యంలోకూడా ల్యప్పు ప్రయోగించకుండా వదలినారు. (౪) అల్లాగే నారదశిక్ష అనేగ్రంథంలో నారదులు ప్రత్యూషే బ్రహ్మచింతయే త్తని ఉషసి - అని అనకుండానే గావిశబ్దంతో సరిపోయిన అపశబ్దమే ప్రయోగించారు. (౫) అల్లానే మనువుకూడా క్షాతారస్సంతిమేత్యుక్త్యా అనేచోట సంతి మఇత్యుక్త్వా-అని ప్రయోగింపవలసి వుండగా వ్యాకరణాన్ని లెక్కచేయకుండానే ప్రయోగించాడు. (౬) ఆవిధంగానే మీమాంసాశాస్త్రంలో గూడా, తదాదిషు - అని గోశ్వకారావయవ విషయంలో సాధుశబ్దంగా ప్రయోగించుటకు అర్హమైన గవ్యశబ్దాన్ని గవామయనం - అన్న అర్థంలో ప్రయోగించారు. (౭) అదేరీతిగా ద్యావో స్తథేతిచేత్తని ద్యావాపృథివ్యోః - అని అనవలసినందులకు బదులుగా చాలాచోట్ల హీనలక్షణంగానే ప్రయుక్తమైంది. (౮) అప్రకారమే గృహ్యసూత్రకారుడు మూర్ధన్యభిఘ్రాణం - అని చెప్పవలసినందులకు బదులుగా మూర్ధన్యభిజిఘ్రాణం - అని జిఘ్రాదేశంతో ప్రయోగించాడు. (౯) వ్యాకరణపు నిరుక్తమందంతటానూ లక్షణహీనాలయిన ప్రయోగాలు అనేకం చేశారు. ఎల్లాంటి వంటే - బ్రాహ్మణో బ్రవణాత్ అని. (ఇచ్చట వచ్యాదేశం చేయలేదు.) (౧౦) సంవత్సరం శయానా - అనే మంత్రంలోని మండూకవిషయమైన బ్రాహ్మణ

శబ్దాన్ని నిర్వచించేటప్పుడు వచనశీలత్వ కారణాన్ని సూచిస్తూ నియుక్తకారుడు, బ్రూఞ్ ధాతు వునకు బ్రువో వచిః - అనేసూత్రంవల్ల రావలసినవచ్యాదేశం చేయకుండానే బ్రవణాత్ (అనిఅప శబ్దంగా) ప్రయోగించారు - (౧౧) కాబట్టి లక్షణగ్రంథాలే ఇల్లావుంటే మరి తక్కిన ఇతి హాస పురాణాలలో అపశబ్దాలుండవా ! (అనేకంగా ఉంటవని తాత్పర్యం) ఆవిధంగానే ద్వివచనరూ పములు గలశబ్దాలకు వాస్త్రీశిక్షాదిగ్రంథకర్తలగ్రంథాలల్లో ఉభాభ్యః అని వాడడం కనిపిస్తూ వుంది. ఒక్కమాటుగా రెండుదంతాలతోను అయినప్రహారము ఉభాభ్యః - అనబడుతుందని వాస్త్రీశిక్షాగ్రం థాలువ్రాసినపాలకాప్యరాజపుత్రాదులందరున్నూ ప్రయోగిస్తూనే వున్నారు. మరిన్ని (౧౨-౧౪) వేదాలలోకూడా అనేకప్రయోగాలు వాటిని అధ్యయనంచేసేవారు ఒప్పుకోని ప్రయోగించినవి వున్నవి. అవి సామాన్యంగా వున్నా ఛాందసంగా వున్ననూ వాటికి లక్షణమే లేదు. సుప్పులను తిఙ్ఙు లను ఉపగ్రహములనూ ఈమొదలయినవాటిని వ్యత్యయంచేయడంవల్లకానీ, లేదా (గణపాఠాదుల లాగా) ఏదో ఒక అధికారంలో కనిపిస్తూంటవి - అనే కారణంవల్లగానీ, లేదా బహుళం ఛందసి - అనే సూత్రంవల్లగాని - అవి ఏమాత్రమూ రూపసిద్ధిని పొందేవి కావు. ఎల్లాగంటే - మధ్యం అపస్య తిష్ఠతి - అనీ, నీచీనవారం వరుణః కబంధం అనీ ఉన్నవైదికవాక్యాలలో అపాం-అని నిత్యస్త్రీలింగ బహువచనంగానూ, హలంత (అప్) ప్రాతిపదికగానూ ఉండవలసిన అప్‌శబ్దానికి అపస్య - అని ప్రయోగించడమనేది లక్షణానికి అనుగతంగా వున్నట్లు కనిపించడం లేదు. అల్లాగే ద్వారం - అనే మాటకు బదులుగా లాటదేశపువారిభాషలోతప్ప మరియెక్కడానూ వారం - అని ప్రయోగించడం లేనేలేదు. కాబట్టి [ఈవ్యర్థమైన] వ్యాకరణాన్ని ఆరంభించకుంటేనే మంచిదని తోస్తున్నది, విషయ వ్యాప్తిఅంటూ లేదుకాబట్టి. అర్థం అనేది శబ్దానుగమంగా వుండాలెకదా. అందుకే కదా వ్యాకర ణం ఏర్పడ్డది. వ్యాకరణ (మనేసముద్ర) మును ఈది అవతలిగట్టుకు చేరామని అనుకొనేవారుకూడా ప్రయోగించవలసివస్తే, సుతరామూ గావ్యాదిశబ్దాలతో సమానమైన (అంటే-అపాటివిలువగల) శబ్దాలనే ప్రయోగిస్తూ వున్నారు. [పోనీ తక్కినఆహితాగ్నులగ్రంథాలలోని అపశబ్దాలు ఎల్లా వున్నానూ] వ్యాకరణశాస్త్రానికి సూత్రాలువ్రాసినవారిసూత్రాల్లోనూ, దానిపైని వార్తికాలు రచిం చినవారివార్తికాలలోనూ, ఆయుభయాన్నీ చర్చించి నిరూపించే భాష్యకారుడి భాష్యంలోనూ కూడా అపశబ్దదోషం స్పష్టంగా కనిపిస్తూ వున్నదికదా ! అశ్వారూఢులయినసచేతనులూ - (అంటే మేము గుఱ్ఱాలనెక్కామూ అని అనుకొనే ప్రజ్ఞాధికులూ) ఆఅశ్వాలను ఎల్లా మరచిపోతారోకదా ! (౧౫-౧౬)సూత్రగ్రంథంలో చూతాం. జనికర్తుః ప్రకృతిః-అనే వ్యాకరణసూత్రంలో రెండుఅపశబ్దాలు ఒక్కమొత్తంగా ప్రయోగించారు. జనిశబ్దంచాల, "ధాతువులను నిర్దేశించేటప్పుడు ఇక్కుతో చేర్చి గాని తిప్పుతోచేర్చికాని ప్రయోగించాలనేకాని కేవలధాతువును ప్రయోగింపరాదు" - అనే నియ మాన్ని బట్టిచూస్తే లక్షణవిరుద్ధంగానే ఇక్కడ జనిధాతువే నిర్దేశింపబడ్డది. జనికర్తుః ప్రకృతిః - అనే అర్థంలో ప్రకృతిశబ్దానికి అపాదానత్వం (పంచమీవిభక్తి) లక్షణశాస్త్రంవల్ల (వ్యాకరణంద్వారానే) రావలసి వుంటుంది. జాయమానమయిన అర్థానికి జనిశబ్దం వాచకంగా వుండడంచాల ఈసూత్రంలోని ప్రయోగం లక్షణంలో అనుగతమే కావడంలేదు. అంటే లక్షణవిరుద్ధంగా వున్నదని అర్థం. కాబట్టి ఈ వరరుచిలాంటిఅశ్వశబ్దం జనిమాత్రాన్నే చెప్పతుందిగనక అసాధువే అని స్పష్టమే.(౧౭)అల్లాగే తృజ కాభ్యాంకర్తరి-అని అనుశాసనం నిషేధించినషష్ఠీసమాసాన్నే వ్యాకరణసూత్రకర్తలు ప్రయోగించారు. [illegible] (౧౮) ఇలాగే [illegible]

స్త్రీప్రాణస్య జాతివాచకత్వాత్సిద్ధం అంటాడు వార్తికకర్త. (౧౯) అన్యథాభాష్యంతు కాలశబ్దవ్యవా యాత్ - ఇందులో అతికష్టంగా సమాసకల్పన చేసి దానిచేత గుణవచనసంజ్ఞ బాధితంకాగానే, గుణవచనబ్రాహ్మణాదిభ్యః - అనేలక్షణాన్ని తలవకుండానే ష్యఞ్ చేస్తాడు. (౨౦) భాష్యంలోనూ- అవిగవికన్యాయేన అనేద్వంద్వగర్భమైనతత్పురుషలో సుపోధాతుఅనేలోపం చెయ్యనే లేదు. (౨౧) అన్యథాకృత్వాచోదిత మన్యథాకృత్వాపరిహారః - కూడా ఇల్లాంటిదే (౨౨) అన్యథైవంకథం- అనేచోట ణముల్ ప్రయుక్తం కాలేదు. పోనీ నిపాతలనుకొని సాధుత్వం చెప్పడానికేనా వీలులేదు. ఏమంటే వ్యాకరణలక్షణం లేనివిమాత్రమే నిపాతలవుతవి. ప్రకారాంతరంగా అనుగతాలయ్యేవి నిపాతలు కావు. అయినా లక్షణం ప్రయోగాన్ని బాధిస్తుందికూడా. లక్షణం - శిష్టప్రయోగం అనేరెంటికీ విరోధంవస్తే లక్షణం బలీయమనడంచాతానూ, ప్రత్యక్షంగా ప్రతిషేధిస్తూవుండడంచాతానూ జనికర్తుఃప్రకృతిః - ఇత్యాదులు అసాధుత్వాన్ని పొందుతూ వున్నవి. ప్రత్యక్షంగా లక్షణవిరోధమైతేనో అంటే - లక్షణరహితాలనుగూడా శిష్టాచారంగా ఏర్పడ్డప్రయోగంచాతే అవయవానుగమలక్షణంవుండేదని అనుమానించి, తద్ద్వారా నిపతించడంచాతనే సాధుత్వం ఏర్పడుతుంది. అంతేకాని లక్షణవాక్యంలోనిశబ్దాలను కాదు. అల్లాంటి లక్షణవాక్యంలోనిశబ్దాలను లక్షణానుగమనం వుండేటట్టుచూడవలెనే కాని అనాదరం చెయ్యరాదు. ప్రదేశాంతరసిద్ధమైనశబ్దంతో అనుగమనం - అని చెబుతారా ? అల్లాయితే ప్రదేశాంతరస్థితమైన శబ్దరాశికూడా, తక్కినవాటిలాగనే లక్ష్యభూతంగా ఏర్పడవలసి వుంటుంది" - అని భావం.

ఈవుదాహరించిన గ్రంథభాగాలూ అందులోనిచర్చలూ గమనిస్తే - పతంజలి వుద్దేశించిన అపభ్రంశం అనేది అశ్లీలార్థకం అయిన అపభ్రంశం కాదనీ, అపశబ్దరూపమైనదనీ, అంతటిలక్షణవేత్తలూ ఆహితాగ్నులూ కూడా మహాఘోరము లని దండూరావేస్తూవున్న గావ్యాదిశబ్దాలలాంటి అపభ్రంశాలె వాడుతూ వుండేవారనీ, లక్షణం - శిష్టప్రయోగం - అనేవాటిలో, అనుశాసనంలో తావులేకున్నవేళల్లో (తప్పకుండా శిష్టులప్రయోగాలను వెదకి అనుశాసనంలో చేర్చుకోవలసినబాధ్యత - వైయాకరణులదని మఱచిపోరాదు.) శిష్టప్రయోగాలను అనుసరించి, అనుగమనలక్షణం కల్పనచేయక తప్పదనిన్నీ, కనుక "పతంజలులవారే అపభ్రంశాలన్నారూ" - అని తాండవించే ఆహితాగ్నుల ఆచారఘోష - గుఱ్ఱాలనెక్కి అసంతోషంలో తమ్ముతాము మఱచిపోయి దొర్లడంతో సమానమే అనీ, అపభ్రంశం - లేక గ్రామ్యం అనేది కేవలం తమదృష్టిదోషమే గాని శబ్దదోషంకాదనీ స్పష్టపడుతున్నది. ఇప్పటికే చాలాదూరం చర్చలో జరిపినందుకు క్షమింపగోరుతూ అసలు కథను ఎత్తుతూ వున్నాను.

### * ప్రాకృతపఠనంకూడా ఒకప్రత్యేకమైనకళ *

ప్రాకృతంలో గ్రంథాలు వ్రాసినగ్రంథకర్తలున్నూ వాటికి లక్షణంవ్రాసి యోగ్యస్థితిని కల్పించిన వైయాకరణులూ, అందులో అలంకారగ్రంథాలూ నీతిగ్రంథాలూ కథలూ కావ్యాలూ వెలయించిన ఇతరులున్నూ ప్రాకృతంలో రచనచెయ్యడాన్నిమాత్రమే కాకుండా, దానిని చదవడమూ వినడమూ కూడా ఒకకళ అని అంటూ వచ్చారు. ఉదా:- అమిఅం పాఇఅకవ్వం పఢిఉం సోఉం చ-అంటాడు గాథాసప్తశతీకర్త హాలావాహనుడు. ఇల్లాగా చాలామంది అన్నారు. అయితే ప్రాకృతం

రచనచేయడం అయితే ఒకకళ కావచ్చుగానీ, చదవడమూ వినడమూకూడా కళ ఎల్లాగా అవుతుందీ? అంటే దానిలో ఒకరహస్యంవుంది. ప్రాకృతంలో - శ్లో. కగచాజాం జకారస్య తదపాజాం యవౌ రపి, కగదాజాం తకారస్య దపషాణాం చ సస్య చ - అని పదమధ్యంలో వచ్చే కగచజతదప - అనే అక్షరాలను లోపింపచేసి, అవి లోపించినందువల్ల కలిగేలోటు తెలియకుండా, తేల్చి అనతిస్పష్టంగా అతిమృదువుగా చదవవలసి వుంటుంది. ఇల్లాగే సంయుక్తవర్ణాలు పలికేటప్పుడు(నేటిఇంగ్లీషున ఫర్ స్టు పలికినట్టుగా) పైఅక్షరాలు లోపించీ లోపించనట్లు వినిపింపచెయ్యాలె. కణ్ణః - ఇత్యాది సంస్కృతాలు వచ్చినప్పుడు మధ్యనున్న అనునాసికాక్షరపు స్వరూపం నశించకుండా, బిందుత్వం ద్యోతకం అయ్యేట్టుకూడా పలకవలెను. తత్సమతద్భవదేశ్యాలను ఉచ్చరించేసమయాలందున్నూ మహారాష్ట్రిశౌరసేన్యాదిభాషావిభాగాలను విశదపరిచేటప్పుడున్నూ ఆయాదేశీసంప్రదాయాలను జాతీయాలను చెదరకుండా ఉచ్చరించవలసి వుంటుంది. (స్వర్గీయులు సముద్రాల అప్పలాచార్యులూ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, పూజ్యులూ వర్ధమానులూ అయిన రాళ్లపల్లి అనంతకృష్ణశర్మా చక్కగా ప్రాకృత పఠనం చేస్తారని ప్రతీతి. తొలివారివి నేను విన్నాను. చాలా అందగా వుంటవి.) ఇంతేకాకుండా మరి వక విశేషంకూడా వుంది. ప్రాకృతం చదివేకాలంలో ఛందస్సునకు భంగం కలగకుండా కొన్ని చోట్లను గురువులుగా వుండేఅక్షరాలను లఘువులుగా చేయాలి, మరికొన్నిచోట్ల లఘువులను గురువులుగా చేయాలి. రెండోపాదంచివరనూ నాల్గోపాదంచివరనూ లఘువులుంటే తెనుగులోలాగానే గురువులుగా చదవాలి. నకారాదులగుకొన్నికొన్ని అక్షరాలను ణకారాదులుగానే పలకవలె. ఋకారం-ఉచ్చరించేప్పుడు పాణినిచెప్పినట్లు అజ్ భక్తినీ హల్భక్తినీ విశదంగా వినిపించేట్టు చూడాలి. ప్రాకృతచ్ఛందస్సు రచించినపింగళిమహాముని కాబట్టే ఇల్లాగా —

శ్లో. ఇయి దీహోవియ వణ్ణో లహు జీహా పఢయి హోయి సోయి లహూ
వణ్ణోవి తురియపఢిఓ దోతిణ్ణి వి ఏక్క జాణేహు.

అంటాడు. ఇక వినడం ఎల్లా కళ అవుతుందీ అంటే - ఛందఃపాఠ్యాన్ని అనుసరించి త్వరత్వరగా చదువుతూ వుంటే రెండేసిమూడేసి అక్షరాలయ్యేట్టు చదువుతుంటారు. శ్రోత వాటిని పారిషదపు విఱుపులని జ్ఞాపకం వుంచుకోవాలె. సామవేదపాఠంలోని - ఊహాప్ ఊహావ్ లాగా. ఒక్కొక్క చోట రెండేసీ మూడేసీ వర్ణాలుగా విరిచినా వాటిని ఏకపదంగా అర్థంచేసికోవాలె. మరికొన్నిచోట్ల-ఆలాపమాధుర్యంగా కత్తుకలోనిపల్లటీకూతలవలె అతిఅంతర్వాణిగా చదువుతారు. వాటిని బోధపరచుకొనేసారస్యం తెలిసివుండాలి. ఇల్లాంటివి శ్రోతలవిషయంలో కళలు.

### * ప్రాకృతం - అష్టాదశదేశీభేదాలు *

ఈరీతిగా దాదాపు రెండూ, లేక మూడూ వేలయేండ్లక్రింద భారతవర్షప్రజలకు వ్యవహారభాషగా ఉన్నప్రాకృతం క్రమంగా ప్రజలు అభివృద్ధిచెంది భిన్నభిన్నదేశాలలో భిన్నభిన్నజాతులుగా నెలకొని, ఆయాదేశాలవారు ఆయాదేశకాలపరిస్థితులకనుగుణము లయిన మార్పులు పొందుతూ వచ్చిన కారణంచాత, వారిభాషలున్నూ విభిన్నంగా వృద్ధిపొంది ఆయాదేశాలపేరుతోనే వ్యవహరింపబడుతూ వచ్చినవి. అల్లా వచ్చినవివిధములయిన దేశభాషలలోనూ విజ్ఞానపు ఆధిక్యాన్నిబట్టిన్నీ నాగరకతలోని ప్రాశస్త్యాన్నిబట్టిన్నీ కొన్నికొన్నిభాషలు విశేషఖ్యాతిని గడించడమే కాకుండా, అసలుప్రాకృతపు మూలం అభాషే యేమో అనేంత ప్రాముఖ్యాన్నికూడా పొందినవి. కాబట్టే ప్రాకృతవ్యాకరణ

కర్తలలో కొందరు - ప్రకృతిశ్శౌరసేనీ, (వరరుచి ప్రా. ప్ర కాశ.) అని అనేవారు. దానికి వ్యాఖ్యాతగా వున్న భామహాచార్యుడు - అస్యా మాగధ్యాః ప్రకృతి శ్శౌరసేనీతి వేదితవ్యం - అని వ్యాఖ్యానం వ్రాశాడు. హేమచంద్రాచార్యుడు -

శ్లో. అకృత్రిమస్వాదుపదాం పరమార్థాభిధాయినీం, సర్వభాషాపరిణతాం జైనీం వాచ ముపాస్మహే । (గ.)ఏకరూపా హి భగవతో౽ర్ధమాగధీభాషా వారిదవిముక్తవారిధారావదాశ్రయానురూపా పరిణమతి. (కావ్యానుశాసన)

తమ్హా అణాయిపాయియపయట్టభాసావిసేసఓ దేసీ - (దేశీనామమాల.)

అని అర్ధమాగధీభాషను (దీనినే నేడు పాలీ అంటున్నారు) సర్వభాషా (ప్రాకృత) మూలమని అంటాడు. ఆచార్యభరతుడు నాట్యశాస్త్రంలో - శ్లో. మాగధ్యవంతిజా ప్రాచ్యా శూరసేన్యర్ధమాగధీ బాహ్లికా దాక్షిణాత్యా చ సప్త భాషాః ప్రకీర్తితాః - అని ఎనిమిదిభాషలను ప్రాకృతభాషలలో ముఖ్యంగా పేర్కొంటాడు. జినదాసగుహత్తరుడు అనే పండితుడు - మగహద్ధవిసయభాసానిబద్ధం అద్ధమాగహం, అహవా అట్ఠారసదేసీభాసాణియయం అద్ధమాగహం - అని, మగధార్ధవిషయభాషానిబద్ధమైనది అర్ధమాగధమవుతుందనీ, లేదా అష్టాదశదేశీభాషానియతమైందికాన అర్ధమాగధం - అవుతుందనీ అంటాడు. విష్ణు ధర్మోత్తరంలో కావ్యాలంకారంలోనూ

శ్లో. దేశేషు దేశేషు పృథగ్విభిన్నం న శక్యతే లక్షణత స్తు వక్తుం, లోకేషు యస్స్యా దపభ్రష్టసంజ్ఞం । జ్ఞేయంచ త ద్దేశవిదో౽ధికారం.(ఖం ౩. అ ౭) అపభ్రంశస్తు యచ్ఛుద్ధం తత్తద్దేశేషు భాషితం. (కావ్యాలంకారం)

అని అంటారు. సంస్కృతం ప్రాకృతం అపభ్రంశం - అని మూడేభాషలుగా సూచిస్తవి కొన్ని శాసనాలు (ఇండియన్ అంటిక్వేరీ. ౧౦-౨౮౪, వలభీరాజుచేసినవిశేషణం.) సంస్కృతం ప్రాకృతం చాన్యదపభ్రంశ ఇతి త్రిధా - అంటాడు కావ్యాలంకారకర్త. దండిపండితుడు కావ్యాదర్శంలో-

తదేత ద్వాఙ్మయం భూయః సంస్కృతం ప్రాకృతంతథా

అపభ్రంశశ్చ మిశ్రం చేత్యాహురార్యా శ్చతుర్విధం.

నాలిగింటికి పెంచాడు. వాగ్భటుడు దండిమాటలోని మిశ్రశబ్దానికి బదులు భూతభాషితాన్ని (పైశాచిని) చేర్చి నాలుగుభాషలంటాడు. భోజరాజు రెంటినీ ఉంచుకొని అయిదుభాషలంటున్నాడు. చండసేనుడు త్రివిక్రముడు సింహరాజు లక్ష్మీధరుడు (ఆంధ్రుడు షడ్భాషాచంద్రికకర్త.) క్రమదీశ్వరుడు మార్కండేయుడు హృషీకేశుడు - మొదలయిన వారి వ్యాకరణాలు చూస్తే ఆరుభాషలుగా స్పష్టపడుతుంది. ఈరీతిగానే కావ్యాలంకార కర్త రుద్రటుడు అమరచంద్రుడు జినదత్తుడు భోజుడు ఆచార్యహేమచంద్రుడు ఈ మొదలయిన ఆలంకారికులు కూడా ఆరుభాషలనూ పరిగణించినవారే. కాని ఇందులో చాలామంది సంస్కృతప్రాకృతమాగధీశౌరసేన్యపభ్రంశపైశాచీభాషలనే ఆరుభాషలనీ కొందరుమాత్రం భూతభాష వేరనీ అంటారు. వీనిఅన్నింటిలోకీ అర్ధమాగధీభాషకునూ పైశాచికి అపభ్రంశభాషకునూ మహారాష్ట్రభాషకునూ విపులంగా వాఙ్మయం కనిపిస్తూ వున్నది. దండికవి మెచ్చుకొన్న సేతుబంధం మహారాష్ట్రప్రాకృతభాషలో వ్రాయబడినది. ఔపపతికసూత్రం భగవతీసూత్రం ప్రజ్ఞాపనాసూత్రం జ్ఞాతసూత్రం విపాకశ్రుతం ఔపపతికసూత్రం మొదలయినజైనవాఙ్మయగ్రంథాలున్నూ బౌద్ధగ్రంథాలయినత్రిపిటకాదులున్నూ ఈభాషలోనే వ్రాశారు అంటారు. రాజప్రశ్నసూత్రం మొదలయినవికూడా

ఇందులోవే. ఆలంకారికగ్రంథకర్తోదాహరణంచేత తెలియబడే అబ్ధిమథనం భీమకావ్యం మొదలయిన వన్నీ బృహత్కథా సంగ్రహం మొదలయినవన్నీ పైశాచీభాషకు ఉదాహరిస్తూంటారు. ఆచార్యపుష్పదంతునిత్రిషష్టిగుణాలంకారం నాగకుమారయశోధరచరిత్రలూ శ్రీచంద్రునికథాకోశం ఆచార్యధవళునిహరివంశపురాణం మొదలయినవి అపభ్రంశవాఙ్మయంలో వ్రాయబడినవే. ఇవిగాక పైభాషలన్నింటిలోనూ నాటకాలంకారప్రబంధకథాచరితోపదేశస్తోత్రచ్ఛందోగ్రంథాలు అనేకంగా కనిపిస్తూ ఉన్నవి. ఉత్తరాధ్యయనసూత్రం దశవైకాలికసూత్రం పరమాత్మప్రకాశం ఆవశ్యకనిర్యుక్తి - మొదలయినగ్రంథాలు అనంతంగా కూడా ఉన్నవి. ఇల్లాగా ఈప్రాకృతం ఆరుప్రధానభాషలుగా మాత్రమే గాకుండా అష్టాదశ (౧౮ రకాలుగు) దేశీభాషలుగా కూడా పరిణమించింది. ఒక్క పరిణమించడమే కాదు. వైదుష్యప్రశస్తిను చాటునప్పుడు కవులు అష్టాదశదేశీభాషావిజ్ఞానం అనేది ఒక యోగ్యతగా కూడా పేర్కొన్నారు. వాత్స్యాయనాదులు చతుష్షష్టికళలలో దీనినే దేశీభాషావిజ్ఞానమని ఒకకళగా పేర్కొన్నారు. కౌటిల్యుడుకూడా రాజ్యాంగంలోనయితం రాజులకూ మంత్రులకూ మాత్రమే కాకుండా గూఢపురుషులకునైతం (అష్టాదశ) దేశీభాషావిజ్ఞానము ఆవశ్యక మనుచున్నాడు. గ్రంథములను పరివర్తులలో పఠించేకాలంలో - దేశీపాఠ్య మని ఒకరీతి కలదు. ఇది గాంధర్వకళతో పొత్తుకలిపికొన్నది ఇటీవల. కాబట్టిప్రాకృతమనేది క్రమంగా సమిష్టికుటుంబములు చీలి వ్యష్టిగా పెరిగి అనంతత్వాన్ని పొందినవిధంగానే ఆయా దేశభేదాలతో నెలకొని అనంతత్వ ప్రధన మైంది. అనంతత్వాన్ని పొందింది. చివఱకీనాటికి పూర్తిదేశభాషలుగా పరిణమించింది.

* కువలయమాలకథ - పద్దెనిమిదిదేశభాషలూ. *

విక్రమశకం ౯ వ శతాబ్దినాటిగ్రంథం కువలయమాలాకథ - అని ఒకప్రాకృతకావ్యం వున్నది. అది ఒకచిత్రమైన గ్రంథం. దీన్నిరచించినవాడు జాబాలిపురపువాడు. క్షత్రియరాజకులోత్పన్నుడైన ఉద్యోతనుడు, కాని ఇతనికి దాక్షిణ్యచిహ్నసూరి అని మఱో పేరుకూడా వుంది. ఇది సకలకథ ఖండకథ ఉల్లాపకథ పరిహాసకథ వరకథ - అనే అయిదురకాల కథాలక్షణాలూ గుదిగుచ్చి శ్రీనాథమహాకవివీథిలాగానో, లేదా వల్లభరాయలక్రీడాభిరామకథలాగానో దీనిని రచించాడంటారు భగవాన్దాసూ మొదలయినవారు. అందులో అతనికాలంలో ప్రచారంలోవున్న పద్దెనిమిదిదేశాలవారూ వారిదేశభాషలూ అతను పేర్కొన్నాడు. చదువరులు పరికింపవలసి యున్నది. ఈ గ్రంథకర్త ఈకథలో:

* కువలయమాలలో వుదాహరించిన ప్రాచీనులగు ప్రాకృతగ్రంథకర్తలు *

I. (౧) పాదలిప్తాచార్యుని తరంగవతీకథ (ప్రా)
(౨) ఛప్పణ్ణకుని-ఛేకపణితి (ప్రా)
(౩) గుణాఢ్యుని-బృహత్కథ (ప్రా)
(౪) వ్యాసుని-భారతం (సం)
(౫) వాల్మీకి-రామాయణం- (ప్రాకృతసూత్రం)
(౬) బాణకవి-కాదంబరి (సం)
(౭) శాతవాహనుని-గాథాకోశం, లేక గాథాసప్తశతి (ప్రా)
(౮) విమలాంకుని-ప్రాకృతనిబంధం (ప్రా)
(౯) దేవగుప్తుని (లేక ద్రోణుని) త్రిపురుషచరిత్రం (ప్రా)
(౧౦) హరివంశకారుని-హరివంశపురాణం(ప్రా)
(౧౧) సులోచనాకర్త-సులోచనాకథ (ప్రా)
(౧౨) ప్రభంజనకవి-యశోధరచరిత్ర (ప్రా)
(౧౩) ఆచార్యరవిషేణుడి-పదుమచరియ(ప్రా)
(౧౪) ధవలరహాంకుని-సమరమృగాంకకథ(ప్రా)

అనేకగ్రంథాలనూ గ్రంథకర్తలనూ పేర్కొన్నాడు. ఆయన ఉదాహరించినదేశాలు-దేశభాషలు ఈక్రిందివి పద్దెనిమిది.

II. (౧) గొల్లదేశం-గొల్లభాష
(౨) మజ్ఝదేశం (మధ్యదేశం) మజ్ఝభాష (మధ్యదేశభాష)
(౩) మాగహం (మాగధం) మగధభాష
(౪) అంతవేతే (అంతర్వేది) దేశం, అంతవేతేభాష.
(౫) కీరదేశం-కీరదేశభాష.
(౬) టక్క-దేశం-టక్క-దేశభాష
(౭) సింధుదేశం - సింధుదేశభాష
(౮) మారుయా (మార్వాడీ) దేశం - మారుయా భాష
(౯) గుజ్జర (ఘూర్జర) దేశం - భాష
(౧౦) లాడదేశం (లాట) భాష
(౧౧) మాళవదేశం-మాళవభాష
(౧౨) కణ్ణాడయ (కర్ణాటక) దేశం-భాష
(౧౩) తాయిదేశం-తాయిభాష (తమిళమా?)
(౧౪) కోసలియదేశం (కోసలియ) భాష
(౧౫) మరహట్ఠ(మహారాష్ట్ర) దేశం-భాష
(౧౬) ఆంధ్రదేశం - ఆంధ్రభాష
(౧౭) ఖసదేశం - ఖసభాష
(౧౮) పారస్‌దేశం - పారసిభాష
ఇంకాబర్బరాదిదేశాలని అన్నాడు.

♦ III. (౧) జావ ధోయంతరే దిట్ఠం ఇమిణా అణేయవణియప్పసారయాబద్ధకయవిక్కయపఉత్త వడ్ఢమాణకలయలరవం హట్టమగ్గంతి. తత్థయ పవిసమాణేణ దిట్ఠే అణేయదేసభాసాలక్ఖియే దేసవణియే జహా (౨) కసిణే ణిట్ఠురవయణే బహుకసమరభుంజయే అలజ్జే య, అరరే త్తి ఉల్లవంతే అహ పేచ్ఛయిగొల్లయే తత్థ. (౩) ణయణీదిసంధివిగ్గహపడుయే బహుజంపిరే య పయఇయే తేరే మేరే ఆఉ త్తి జంపిరే మజ్ఝదేసేయ. (౪) ణీహరియపొట్టదువ్వణ్ణమడహయే సురయకేలితల్లిచ్ఛే, ఏగేలే జంపుల్లే అహ పేచ్ఛయ మాగహే కుమరో. (౫) కవిలే పింగళణయణే భోయణకహామేత్తదిణ్ణవావారే, కిత్తో కిమ్మొ జియ జంపిరే య అహ అంతవేతే య. (౬)ఉత్తుం

♦ III తత్ర యావ త్త్రోంతరే దృష్టోఽనేన అనేకవణిక్ప్రసారితాబద్ధక్రయవిక్రయ ప్రవృత్తివర్తమానకలకలరవో హట్టమార్గఇతి. తత్రచ ప్రవిశతా దృష్టా అనేకదేశభాషాలక్షితా దేశవణిజః తద్యథా - (౨) కృష్ణాన్ నిష్ఠురవచనాన్ బహుకసమరభుంజానాన్ నలజ్జాంశ్చ, అరరే ఇత్యుల్లపతోఽథ ప్రేక్షతే గొల్లకాం స్తత్ర, (౩) నయనీతిసంధివిగ్రహపటూన్ బహుజల్పకాంశ్చ ప్రకృత్యా, తేరే మేరే ఆఓ-త్తి జల్పతో మధ్యదేశ్యాంశ్చ, (౪) నిష్క్రాన్తోదరదుర్వర్ణవామనాన్ సురతకేలిప్రియాన్, ఏగేలే - జల్పతో నథ ప్రేక్షతే మాగధాన్ కుమారః, (౫) కపిలాన్ పింగళనయనాన్ భోజనకథామాత్రదత్తవ్యాపారాన్, కిత్తో కిమ్మొ జియ - జల్పతో నథాంతర్వేద్యాంశ్చ. (౬) ఉత్తుంగస్థూలఘోణాన్ కనకవర్ణాంశ్చ భారవాహాంశ్చ, సరిపారి - జల్పతః కీరాన్ కుమారః ప్రలోకయతి, (౭) దాక్షిణ్యదానపౌరుషవిజ్ఞానదయావివర్జితశరీరాన్, ఏహం తేహం బ్రువాణాన్ టక్కాన్ పునః ప్రేక్షతే కుమారః. (౮) సలలితమృదుమందపదాన్ గాంధర్వప్రియాన్ స్వదేశగతచిత్తాన్, చఉడయమే - భణతః సుభగా నథ సైంధవాన్ దృష్టవాన్. (౯) వక్రాన్ జడాంశ్చ జాడ్యే బహుభోజినః కఠినపీనస్థూలాంగాన్, అప్పాతుప్పా - భణతోఽథ ప్రేక్షతే మారవాంస్తతః (౧౦) ఘృతలోలితపుష్టాంగాన్ ధర్మపరాన్ సంధివిగ్రహే నిపుణాన్, ణవుకేభల్లవుభణతోఽథ ప్రేక్షతే గార్జరా నపరాన్ .(౧౧)స్నాతోల్లిప్తవిలిప్తాన్ కృతసీమంతాన్ సుశోభితసుగాత్రాన్.

గథూలథూఁణే కణయవణ్ణే య భారవాహే య సరిపారి - జంపిరే కిరే కుమారో పలోయేయి (౭) దక్షిణ్ణదాణపోరు సవిణ్ణాణదయావివజ్జియసరీరే, ఏహంతేహంచవతే ఉక్కుఉణ పేచ్ఛయి కుమారో (౮) సలలియమిదుమందపయే గంధవ్వపిరయే సదేసగయచిత్తే, చవుడయమే -భణిరే మహావు అహ సేంధవే దిఠ్ఠో. (౯) వంకే జడేయ జడ్డే బహుభోయీ కఠిణపీణథూణంగే, అప్పాతుప్పా - భణిరే అహ పేచ్ఛయి మారుయే తత్తో. (౧౦) ఘియలాలి యపుఠ్ఠంగే ధమ్మపరే సంధివిగ్గహం ణివుణే, ణవురే భల్లవు - భణిరే అహ పేచ్ఛయి గుజ్జరే అవరే, (౧౧) ణ్హాహాలిత్తువిలితే కయసీమంతే సుసోహియసుగత్తే, అహమ్హ కాయి తుమ్హ మిత్తు - భణిరే పేచ్ఛయి లాడే. (౧౨) ఉక్కుడదప్పే ప్పియమోహణే పయగోద్దే పయంగవత్తీనే, అదిరి పాందిరిమ వెరే-భణిరే పేచ్ఛయి కణ్ణాడయే అణ్ణే. (౧౩) కుప్పాసపాఉఅంగే మాసరుయీ పాణమయణతాల్లిచ్ఛే, ఇసి కిసిమిసిం భణమాణే అహ పేచ్ఛయి తాయిరే అవరే. (౧౪) సత్తకళాపత్థత్థే మాణీ పియకోవణే కథిణదేహే, జలతలరే - భణమాణే కోసలయే పులహియే అవరే (౧౫) దఢమఢహసామలంగే సహిరే అహిమాణకలహసీలేయ, దిణ్ణల్లే గహిల్లే - ఉల్లవిరే తత్థ మరహఠ్ఠో, (౧౬) పియమహిళాసంగామే సుందరగత్తే య భోయణే రోద్దే, అటు పుటు రటుం-భణంతే అంధ్రే కుమారో పలోయేతి. (౧౭) ఇయ అఠ్ఠారసదేసీభాసాఉ పులయియూణ సిరియత్తో, అణ్ణాయిం య పులయేది ఖసపారసబబ్బరాదీయే.

(కువలయమాలాకథా. ౧౩౧ పేజి)

దీనితాత్పర్యం ఇదీ(౧) కొంచెందూరంలో ఈయన (ఉత్సవాన్ని సందర్శించే వత్సరాజు అనే రణహస్తిరాజు) అనేకులగువర్తకులతో నిండి కొనుగోలు అమ్మకంచేయడంలో బయలుదేరిన కలకలధ్వని గల అంగడివీధిని చూస్తూరుగదా-అక్కడ అనేక దేశభాషాలక్షితులయినవర్తకులు ప్రవేశిస్తూ వున్నారు. ఎల్లాగంటే - (౨) కృశించినశరీరాలున్నూ నిష్ఠురమైనమాటధోరణీ అనేకంగా ఒట్టులూ తిట్టులున్నూ లజ్జలేనిరూపులున్నూగలవారై - అరరే - అని మాట్లాడుకొనే గొల్లదేశంవారిని కుమారుడు అక్కడ చూచాడు. (3) నయంలో నీతిలో సంధివిగ్రహచాతుర్యంలో నేర్పుగలిగి, సహజంగానే వాచాలకులుగా వుండే మధ్యదేశాలవారిని - తేరే, మేరే, అవు - అని మాటలాడుతూవుండగా చూచాడు

---

అహమ్హ కాహిం తుమ్హం మిత్తు - భణతః ప్రేక్షతే లాటీయాన్ (౧౨) తనుశ్యామలఘుదేహాన్ కోపనాన్మానజీవినో రౌద్రాన్, భాయవు బహిణీ తుమ్హే భణతోథ మాలవీయాన్ ద్రవవాన్, (౧౩) ఉత్కటదర్పాన్ప్రియమోహాన్ వదరౌద్రాన్ పతంగవృత్తీంశ్చ, అదిరిపాండి మనిరే భణతః ప్రేక్షతే కర్ణాటకీయానన్యాన్, (౧౪) కూర్పాసప్రావృతాంగాన్ మాంసరుచీన్ పానమదనరతిప్రాన్, ఇసికిసి మిసింభణంతోఽథ ప్రేక్షతే తాయికానపరాన్, (౧౫) శాస్త్రకలాకుశలాన్మానినః ప్రియకోపనాన్ కఠినదేహాన్, జలతలరే - భణతః కోసలికాన్ప్రలోకతేఽపరాన్. (౧౬) దృఢలఘుశ్యామాంగాన్ సహమానాన్ నభిమానకలహశీలాంశ్చ, దిణ్ణల్లే గహిల్లే ఉల్లపత స్తత్ర మహారాష్ట్రీయాన్. (౧౭) ప్రియమహిళాసంగ్రామాన్ సుందరగాత్రాంశ్చ భోగినో రౌద్రాన్, అటుపుటురటుం భణంతః ఆంధ్రాన్ సుకుమారః ప్రేక్షతే. (౧౮) ఇత్యష్టాదశ దేశీభాషాః ప్రలోక్య శ్రీదత్తః, అన్యాంశ్చ ప్రలోకయతి ఖస - పారస - బర్బరాదీన్. (అని సంస్కృతచ్ఛాయ.). (కువలయమాలాకథ పేజి ౧౩౧.)

(౪) పొట్టలు పైకుబికి, పొట్టిగా కురూపులుగాను సురతకేళిలోలురులుగాను వున్నమగధదేశంవారిని
ఆ రాచబిడ్డడు – ఏగేలే అని మాట్లాడుతూ వుండగా చూచాడు. (౫) కపిలవర్ణంగలిగి పచ్చనికన్ను
లతో భోజనకథామాత్రవ్యాపారంగల అంతర్వేదిదేశపుజనులను–కిత్తే కిమ్మె జియ–అని అనుకొంటూ
వున్నవారిని వీక్షించాడు. (౬) పొడుగ్గా లావెక్కినముక్కులూ అపరంజివంటిమేనిచాయలూ గల్గి
బతువులను అనాయాసంగా మోయగలకీరదేశపుప్రజలను – సరి - పారి అనుకొంటూవస్తూవున్నవారిని
కుమారుడు నిరీక్షించాడు. (౭) దాక్షిణ్యంగానీ దానంగానీ పౌరుషంగానీ విజ్ఞానంగానీ దయగానీ –
లేనేలేనిశరీరాలతో – ఏహం తేహం–అనుకుంటూవున్నఉక్క దేశస్థులను విలోకించాడు. (౮) సుకు
మారంగానూ మృదువుగానూ మెల్లగానూ నడకలు సాగిస్తూ సంగీతమంటే ప్రియపడుతూ స్వదేశం
పైనే మనసుపెట్టుకొని – చఉదయమే అనుకొంటూ వచ్చే అందమైనసింధుదేశపువారిని దర్శించాడు.
(౯) వంకరలు వంగి, దుక్కలుగా కదలలేకుండావుండి, విస్తారంతిండిపోతులవడంచాత, గట్టిగాకొవ్వె
క్కినస్థూలశరీరాలతో అప్పాతుప్పా అనుకొంటూ వస్తూన్న మారువదేశంవారిని కన్నెత్తి పరికించాడు.
(౧౦) నెయ్యిగారుతూ పుష్టిఅయినఅవయవాలతో ఒప్పినవారై, ధర్మంవిషయంలో ఆసక్తి సంధి
విగ్రహాలు పొసగించడంలో నేర్పుకలిగి – ణవు – రే భల్లఉ ! – అటూవస్తూన్నగూర్జరదేశీయు
లను చూచాడు. (౧౧) చక్కగా స్నానంచేసి గంధాలు పూసికొని తలలు దువ్వుకొని, అందంగా
అలంకరించుకొన్నశరీరాలతో – అహ్మా కాయి తుహం మిత్తు – అనిచెప్పుకొంటూవస్తూన్న లాట
దేశీయులను ఆ రాచబిడ్డ వీక్షించాడు. (౧౨) సన్ననివీ శ్యామలవర్ణంగలవీ తేలికదనంగలవీ అయినదే
హాలతో ముకోపులుగానూ అభిమానశాలులుగానూ కోపవస్తే రౌద్రాకృతులుగాను ఒప్పుతూభావు
అబహిణీ తుమ్హే అనుకుంటూవస్తూన్న మాళవదేశంవారిని కన్నారా కాంచినాడు. (౧౩) హద్దుమీరిన
దర్పంతో ప్రియమై మోహనంగావుండేశరీరాలుగలిగి, మాటల్లో రౌద్రం కొల్లడిస్తూ పతంగవృత్తులుగా
(గాలిపడగల్లాగా) వుంది – అదిరి పాండి మనిరే – అని మాటాడుకొనే కర్ణాటకదేశీయులను చిత్త
గించాడు. (౧౪) కుప్పసంతో ఒళ్లంతా కప్పేసికొని, మాంసం – అంటే లొట్టలువేస్తూ పానం మన్మథ
విహారం అంటేంగాలసపడుతూ – ఇసి కిసి మిసి – అని చెప్పుకొంటూ వచ్చే తాయికదేశస్థులను విలో
కించాడు. (౧౫) శాస్త్రాలూ కళలూ – వీటిల్లో ప్రసిద్ధికెక్కి, మానవంతులూ కోపప్రియులూ గట్టి
శరీరాలుగలవారూ అయి – జల తల లే – అనుకుంటూ వస్తూన్న కాసలికులను (కోసలదేశంవారిని)
కూడా విలోకించాడు. (౧౬) గట్టిదనమూ లఘుత్వం (లాఘవం-తేలికా) గల శ్యామలశరీరాలతో
మానవంతులూ అభిమానవంతులూ కలహశీలురూ గా వుండే మహారాష్ట్రదేశీయులను దిణ్ణలే గహిల్లే –
అనుకొనేవారిని కన్నారా చూచినాడు. (౧౭) అందగత్తెలన్నా అథవా యుద్ధరంగమన్నానూ సమా
నంగా ప్రేమించేవాళ్ళున్నూ అందమైన శరీరాలు గలవాళ్ళున్నూ తిండిలోదిట్టలున్నూ అయినఆంధ్రు
లు–అటూ పుటూ (పెట్టూ – కోబోలు ! ) రటూ (రట్టూ – ఏమో) అనుకొంటూ వస్తూండగా చూ
చాడు. (౧౮) ఇల్లాగా అష్టాదశవిధాలయిన (పద్ధెనిమిదిరకాలయిన) దేశిభాషలను మాటలాడే [అష్టా
దశదేశాల] వారినీ ఆ శ్రీదత్తుడు చూచి, ఇంకానూ తక్కిన ఖసపారసీబర్బరాది దేశభాషలను మాట్లా
డే వారిని చూస్తూ వున్నాడు – అని భావం.

ఈ పైనిచూపినసందర్భంవల్ల ౧౮ రకాలదేశభాషలవారు ప్రసిద్ధంగా వుండేవారని మనకు బోధ
పడుతుంది. కువలయమాలాకథను వ్రాసినదాక్షిణ్యచిహ్నసూరి తనజీవితకాలాన్ని స్పష్టంగానే –

శ్లో. సగకాలే వోలీణే వరిసాణ సయేహిం సత్తయిం గయేహిం (వి. శ. ౮౩౫) ఏగదిణేణూణేహిం ఏస సమత్తా వరణ్హమ్మి – అని చెప్పుకొన్నాడు. కాననాటికాలంలో ఈపద్ధెనిమిదిభాషలూ ప్రాముఖ్యం పొంది ఉన్నవి – అనడంలో ఏమాత్రమూ సాహసవచనం లేదనవచ్చును.

* ఆలంకారికులు – భాషాభేదప్రయోగనిబంధనం *

సంస్కృతంలో మహర్షి భరతుడు (నాట్యశాస్త్రకర్త) మొదలుకొని విశ్వనాథకవిరాజుదనుకను గల ఆలంకారికగ్రంథకర్తలలో – చాలామంది దృశ్యకావ్యలక్షణములను నిర్వచించేటప్పుడు ఆయా పాత్రల గుణశీలగౌరవాల ననుసరించి ప్రయోగింపదగ్గ భాషాభేదంకూడా నిబంధించారు. అందులో నాట్యశాస్త్రం వ్రాసిన భరతమహర్షి –

శ్లో. ధీరోద్ధతే ధీరలలితే ధీరోదాత్తే తథైవ చ, ధీరప్రశాంతే చ తథా పాఠ్యం యోజ్యం తు సంస్కృతం, ఐశ్వర్యేణ ప్రమత్తస్య ఐశ్వర్యేణాఽప్లుతస్య చ, దారిద్ర్యేణ ప్రయుక్తస్య దారిద్ర్యేణాప్లుతస్య చ, ఉత్తమస్యాపి బ్రువతః ప్రాకృతం సంప్రయోజయేత్, వ్యాజలింగప్రతిష్ఠానాం శ్రమణానాం తపస్వినాం భిక్షుచక్రచరణానాం చ ప్రాకృతం సంప్రయోజయేత్, బాలే గదోపసృష్టే చ స్త్రీణాం చ ప్రకృతౌ తథా, నీచే మత్తే సలింగే చ ప్రాకృతం పాఠ్యమిష్యతే, పరివ్రాణ్మునిలింగేషు వాక్యేషు శ్రోత్రియేషు చ, ద్విజా యేచైవ లింగస్థా స్సంస్కృతం తేషు యోజయేత్.

అని ధీరోద్ధతాదినాయకులకు నల్వురకున్ను వర్ణాశ్రమచిహ్నాలు గల బ్రాహ్మణులు పరివ్రాజకులు తపస్వులు శ్రోత్రియులు మున్నగువారికిన్నీ సంస్కృతం ప్రయోగించవలయు ననీ, ఐశ్వర్యమత్తులు ఐశ్వర్యప్లుతులు దారిద్ర్యంచేత ప్లుతులు మత్తులూ అయినవారు – వీరు ఉత్తమపాత్రలుగా వున్నా ప్రాకృతమే ప్రయోగించాలనీ ఇత్యాది నియమం ఆయన చేస్తున్నాడు. ఇంతమాత్రమే కాకుండా ఆయనే – ఆ నాట్యశాస్త్రంలోనే –

శ్లో॥ మాగధ్యవంతిజా ప్రాచ్యా శూరసేన్యర్ధమాగధీ, బాహ్లీకీ దాక్షిణాత్యా చ సప్త భాషాః ప్రకీర్తితాః, మాగధీ తు నరేంద్రాణాం అంతఃపురనివాసినాం, చేటానాం రాజపుత్రాణాం శ్రేష్ఠినాం చాఽర్ధమాగధీ, ప్రాచ్యా విదూషకాదీనాం ధూర్తానా మప్యవంతిజా, నాయికానాం సఖీనాం చ శూరసేనావిరోధినీ, యోధనాగరకాదీనాం దాక్షిణాత్యాథ దీవ్యతాం, బాహ్లీకభాషోదీచ్యానాం ఖసానాం చ స్వదేశజా, శబరాణాం శకాదీనాం తత్స్వభావశ్చ యోగణః, శకారభాషా యోక్తవ్యా చండాలీపుల్కసాదిషు, అంగారకారవ్యాధానాం కాష్ఠయంత్రోపజీవినాం, యోజ్యా శబరభాషా తు కించి ద్వానౌకసీ తథా గవాశ్వాజావికోష్ట్రాదిఘోషస్థాననివాసినాం, ఆభీరోక్తి శ్శాబరీ వా ద్రావిడీ ద్రావిడాదిషు, సురంగాఖనకాదీనాం శౌండీకారాగ్రరక్షిణాం, వ్యసనే నాయకానాం స్యా దాత్మరక్షాసు మాగధీ, న బర్బరకిరాతాంధ్రద్రవిడాద్యాసు జాతిషు, నాట్యప్రయోగే కర్తవ్యం కావ్యం భాషాసమాశ్రయం.

మాగధి అవంతి ప్రాచ్య శూరసేని అర్ధమాగధి బాహ్లీకి దాక్షిణాత్య – అని ఏడుభాషలున్నవనిన్నీ రాజులు అంతఃపురనివాసులూ వీరికి మాగధీభాషా, చేటులు రాచబిడ్డలు శ్రేష్ఠులు – వీరికి అర్ధమాగధీ భాషా ప్రయోగించవలెననిన్నీ, విదూషకులకు ప్రాచ్యభాషానూ ధూర్తులకు అవంతిన్నీ, నాయికలకు వారిచెలికత్తెలకూ శూరసేనిన్నీ, యోధనాగరకాదులకున్ను జూదరులకున్నూ దాక్షిణాత్యభాష

యున్న బాహ్లీకులు ఉదీచ్యులు ఖసదేశస్థులకు వారిదేశభాషా, శబరులు శకపహ్లవులూ అలాంటి యితరులూ వీరికి చండాలురు బోయలూ వీరికి శబరభాషా (చెంచులు బోయలుమున్నగువారిభాష)నూ బొగ్గులుచేయువారు వేటరులు గుఱ్ఱపువారు, కట్టెలు యంత్రాలు జీవికగా కలవారూ గొల్లలు ఒంటెలవారు మేకలమందలవారు వీరికి ఆభీరభాషయున్నూ [శబరభాషయైననుకానీ] ఒడ్డెలు ఉప్పర్లు కసాయివారు తలారులు ద్రావిళ్ళు - వీరికి ద్రావిడభాషానూ, ఉత్తమనాయకులకు వ్యసనకాలంలో ఆత్మరక్షలో మాగధినీ వాడవలయు ననిన్నీ - బర్బరులు కిరాతులు ఆంధ్రులు (ఇంకా అప్పటికి నాగరకత రాలేదేమో) ఇల్లాంటి జాతులభాష వాడరాదనిన్నీ అన్నాడు. సాహిత్యదర్పణకర్త విశ్వనాథకవిరాజు సైతమూ,

శ్లో. పురుషాణా మనీచానాం ప్రాకృతం సంస్కృతాత్మనాం, శౌరసేనీ ప్రయోక్తవ్యా తాదృశీనాం చ యోషితాం, ఆసా మేవతు గాథాసు మహారాష్ట్రీం ప్రయోజయేత్, అత్రోక్తా మాగధీభాషా రాజాంతఃపురచారిణాం, చేటానాం రాజపుత్రాణాం శ్రేష్ఠానాం చార్ధమాగధీ ప్రాచ్యా విదూషకాదీనాం ధూర్తానాం స్యాదవంతిజా, యోధనాగరకాదీనాం దాక్షిణాత్యా హిదీవ్యతాం, శబరాణాం శకాదీనాం శాబరీం సంప్రయోజయేత్ బాహ్లీకభాషోదీచ్యానాం ద్రావిడీ ద్రావిడాదిషు, ఆభీరేషు తథాభీరీ చాండాలీ పుక్కసాదిషు ఆభీరీ శాబరీచాఽపి కాష్ఠ పాత్రోపజీవిషు, తథైవాంగారకారాదౌ పైశాచీ స్యా త్పిశాచవాక్, చేటీనా మప్యనీచానామపి స్యా త్సౌరసేనికా,, బాలానాం షండకానాం చ నీచగ్రహవిచారిణాం ఉన్మత్తానాం ఆతురాణాం సైవ స్యా త్సంస్కృతంక్వచిత్, ఐశ్వర్యేణ ప్రమత్తస్య దారిద్ర్యోపద్రుతస్య చ భిక్షువల్కధరాదీనాం ప్రాకృతం సంప్రయోజయేత్, సంస్కృతం సంప్రయోక్తవ్యం లింగినీ షూత్తమాసు చ, దేవీమంత్రిసుతావేశ్యా స్వపి కైశ్చిత్తథోదితం యద్దేశ్యం నీచపాత్రం స్యా త్తద్దేశ్యం తస్య భాషితం, కార్యతశ్చోత్తమాదీనాం కార్యో భాషావిపర్యయః, యోషిత్సఖీబాలవేశ్యాకితవాప్సరసాం తథా, వైదగ్ధ్యార్థం ప్రదాతవ్యం సంస్కృతం చాంతరాంతరా-

[సాహిత్యదర్పణం, ౬ పరిచ్ఛేదం, కారిక ౧౫౮-౧౬౮]

అని భరతాచార్యునిమాటలనే కొద్దిభేదాలతో అనుకరిస్తాడు. అచ్చం ప్రాకృతపాఠ్యాలతో వుండే సట్టకాదులుకూడా ఆకాలంలో వుండేవి. గ్రంథకర్తలు ఇన్ని భాషలలో పరిశ్రమం చేయడం సాధ్యం కాదనికాబోలు భరతమహర్షి అచ్చం ఒక్క సాధారణప్రాకృతాన్నే మార్చుకొని ప్రయోగించడానికి సూత్రంకూడా చెబుతున్నాడు చూడండి.

* ప్రాకృతం దేశభేదానుసారంగా మార్చుకొనేవిధంకూడా వుండేది. *

శ్లో. జాతిష్వేతాసు సర్వాసు శుద్ధాసు చ ద్విజోత్తమాః, శౌరసేనీం సమాశ్రిత్య భాషా కార్యా తు నాటకే, అథవా ఛందతః కార్యా దేశభాషాప్రయోక్తృభిః, గంగాసాగరమధ్యేతు యే దేశా స్సంప్రకీర్తితాః, ఏకారబహుళాంతేషు భాషాం తజ్ఞః ప్రయోజయేత్, వింధ్యసాగరమధ్యే తు యే దేశా స్స్మృతి మాగతాః, నకారబహుళాంతేషు భాషాం తజ్ఞః ప్రయోజయేత్ హిమవత్సింధుసౌవీరా న్యే చ దేశా స్సమాశ్రితాః, ఉకారబహుళాం తజ్ఞః తేషు భాషాం ప్రయోజయేత్, - సురాష్ట్రావంతిదేశేషు వేత్రవత్యుత్తరేషు చ, యే దేశా స్తేషు కుర్వీత

చకారబహుళా మిహ చర్మణ్వతీనదీపారే యేచార్బుదసమాశ్రితాః, తకారబహుళాం నిత్యం తేషు భాషాం ప్రయోజయేత్, ఏవం భాషావిధానం తు కర్తవ్యం నాటకాశ్రయం, అత్ర నోక్తం మయా యచ్చ లోకాద్గ్రాహ్యం బుధైస్తు తత్.

"ఈచెప్పినవివిధజాతులందు శౌరసేనిని ఆశ్రయించి కానీ, లేదా ఆయాదేశభాషాప్రయోక్తల యభిరుచిని పట్టిగానీ భాషాభేదమును కూర్చవలెను. గంగాసాగరమధ్యమున్న దేశాలపాత్రలకు ఏకారబహుళమైనప్రాకృతాన్నీ, వింధ్యసాగర మధ్యదేశాలవారికి నకారబహుళమైనభాషనూ, హిమవత్సింధుసౌవీరదేశాలవారికీ వారికి చుట్టుప్రక్కలనున్న వారికీ ఉకారబహుళమైనభాషనూ, సురాష్ట్రావంతి దేశాలవారికీ వేత్రవతీనదికి ఉత్తరపువైపునగల దేశాలవారికీ చకారబహుళమైనభాషనూ, చర్మణ్వతీ నదికి అవలనుండేవారికీ అర్బుదదేశవాసులకూ తకారబహుళమైన ప్రాకృతభాషనూ వాడవలెను. ఈరీతిగా భాషానిబంధనం నాటకాలలో చేసికోవాలె. నేను చెప్పకుండా వదలింది ఏదైనావుంటే, లోకంలోనివాడుకా మర్యాదా అనుసరించి పండితులు తెలిసికోదగును" అని పైబంతులకు తాత్పర్యమేర్పడుతున్నది. సంస్కృతాలంకారశాస్త్రంలో రీతులు ఈదేశభేదాలవల్లే ఏర్పడి వుంటాయి.

* పూర్వం పండితులు ప్రావీణ్యం కొఱకేనా దేశభాషలు చదివేవారు – అనడానికి నిదర్శనం. *

ప్రాచీనపండితులు కొందరు ప్రాకృతాదిదేశభాషలను ఈసడించుకొన్నా కొందరుకొందరు చక్కగా చదివేవారు. రాజులఆస్థానాలలో చారులూ గణికులూ వాగ్జీవకులూ కుశీలవులూ తప్పకుండా పఠించేవారు. పాఠశాలలూ కళాశాలలూ మొదలయిన విద్యాసంస్థలలో కూడా దేశభాషలలో బోధించే ఆచార్యులుండేవారు. సమస్తదేశభాషలూ సమస్తదేశలిపులూ నేర్చుకుండడం వాటిలో కావ్యగోష్ఠిప్రసంగాదులు సభలు జరిపి సత్కరించడాలున్నూ ఉండేవి. భారతావనిభాగధేయం విపరీతంగా వుండడంవల్ల అన్నీ మారిపోయినవి. ఈవిషయాలు నిరూపించే ఉదాహరణాలను కొన్నింటిని మనవిచేస్తాను.

(౧) వ్యాసమహర్షి–మహాభారతంలో శాంతిపర్వం ౪౬ అధ్యాయంలో – శ్లోకం ౧౦౬–నానాచర్మభిరాచ్ఛన్నా నానాభాషాశ్చ భారత, కుశలా దేశభాషాసు జల్పంతోన్యోన్యమీశ్వరాః.

(౨) భరతమహర్షి–నాట్యశాస్త్రం, అధ్యా ౧౭. శ్లో. ౪౬–౪౭ – అథవా చ్ఛందతః కార్యా దేశభాషాప్రయోక్తృభిః, నానాదేశసముత్థం హి కావ్యం భవతి నాటకే.

(౩) వాత్స్యాయనమహర్షి – కామసూత్రంలో [౧–౪–౫౦] – నాత్యంతం సంస్కృతేనైవ నాత్యంతం దేశభాషయా, కథాం గోష్ఠీషు కథయన్ లోకే బహుమతో భవేత్.

(౪) బృహత్కల్పము:—నాణాదేసీకుశలో నాణాదేసీకయస్స సుత్తస్స, అభిలావేయత్థకుశలో హోయీ తయోణేణ గంతవ్వం.

(౫) విష్ణుధర్మోత్తరము:—సంస్కృతైః ప్రాకృతైర్వాక్యైః యశ్శిష్యమనురూపతః, దేశభాషాద్యుపాయైశ్చ బోధయేత్స గురుస్మృతః.

(౬) విపాకసూత్రము:— అ ౨, సూ. ౧. తత్థ ణం వాణియగామే కామజ్ఝయా ణామ గణియా బావత్తరికలాపండియా చవుసట్ఠిగణియా గుణోవేయా ఏగూణతీసవిసేసేరమమాణీ * * అట్ఠారసదేసీభాసావిసారయా.

(౭) శూద్రకకవి - మృచ్ఛకటిక:- అంకం ౬. చందనకః - అరే ! కో అప్పచ్చయో తుమ్హే వయం దక్షిణాత్యా అవ్యక్తభాషిణో ఖస - ఖత్తిఖడ - ఖడత్తో - కిలయ - కర్ణాట - కర్ణప్రావరణయ - దవిడ - చోల - చీణ - బర్బర-ఖేర - ఖానముఖ - మధుఘాతప్రభృతీనాం మ్లేచ్ఛజాతీనాం అనేకదేశభాషాభిజ్ఞాః యథేష్టం మంత్రయామో - దిట్ఠో దిట్ఠా దిట్ఠంవా అజ్జో అజ్జావ కిం శబ్దవిచారః.

(౮) బాణకవి - కాదంబరి (పుట ౧౦౨) శిక్షితాశేషదేశభాషావిశేషేణ సర్వలిపిజ్ఞేన ఇత్యాది.

(౯) విశాఖదత్తుడు - ముద్రారాక్షసంలో - ప్రయుక్తాశ్చ స్వపక్షపరపక్షయో రనురక్తాపరక్తజనజిజ్ఞాసయా బహువిధదేశభాషావేషాచారసంచారవేదినో నానావ్యంజనాః ప్రణిధయః. (౧-౯)

(౧౦) దశరూపకమునందు - శ్లో. దేశభాషాక్రియావేషలక్షణాః స్యుః ప్రవృత్తయః, లోకా దేవావగమ్యైతా యథౌచిత్యం ప్రయోజయేత్, యద్దేశం నీచపాత్రం స్యాత్తద్దేశం తస్యభాషితం - ఇత్యాది.

* మిశ్రభాషలతో కవిత్వం చెప్పడం ఒక గొప్పగా భావించడం కూడా ఆకాలంలో వుండేది *

కొందరుకొందరు కవులు రెండేసి మూడేసి భాషలు కలిపి కవిత్వం చెప్పడం కూడా ఒకకళ అనిన్నీ తెలుస్తుంది గ్రంథాలవల్లను. రాజశేఖరమహాకవి తాను రచించిన కావ్యమీమాంసలో ప్రాచీనులశ్లోకం ఒకటి ఉదాహరించి ఈవిషయాన్ని ఋజువుచేసినాడు. చూడండి:-

శ్లో. ఏకోర్థ స్సంస్కృతోక్త్యా స సుకవిరచనః ప్రాకృతేనాపరస్మిన్, అన్యోపభ్రంశగీర్భిః కిమపర మపరో భూతభాషాక్రమేణ, ద్విత్రాభిః కోఽపివాగ్భిర్భవతి చతసృభిః కించ కశ్చిద్వివేక్తుం య స్యేత్థం ధీః ప్రసన్నా స్నపయతి సుకవే స్తస్య కీర్తి ర్జగంతి.

ఈరీతిగానే విశ్వనాథకవిరాజుకూడా దర్పణంలో అంటున్నాడు చిత్తగించండి - శ్లో. సంస్కృతే నైవ కేఽప్యాహుః ప్రాకృతే నైవ కేచన, సాధారణ్యాదిభిః కేచి త్కేచన మ్లేచ్ఛభాషయా-అని. మఱిన్నీ రాజశేఖరకవీ, భోజరాజు మున్నగు ఆలంకారికులు మఱికొందరూకూడా - సంస్కృతే నైవ కోఽప్యర్థః ప్రాకృతే నైవ చాపరః, శక్యో రచయితుం కశ్చి దపభ్రంశో న జాయతే. అన్నారు. ఉదాహరించారుకూడా మఱికొందరు అల్లాగంటి శ్లోకాలను అనేకంగా; మచ్చుకువక్కటి మాత్రమే -

శ్లో. అకట కుమటీచంద్రజ్యోత్స్నాకళంకియకోయిలో, లవయియ మునాంర్యామ్యోవాయుర్నివారయవాయియా అవి సఖి అలా రక్తాశోక స్తవాఽపి మనోముదే నకజనకజం మానేత్యాద్య ప్రియంప్రతి జాహుదా.

* వివిధదేశాలవారూ వివిధంగా భాషల్లో పరిశ్రమించేవారు వారివారి అభిమానానుసారం *

సంస్కృతప్రాకృతాలలో సాధారణంగా అందరూ పూర్వకాలాన పరిశ్రమం చేస్తూవచ్చినా ఆయాదేశాలవారికి కొందరికొందరికి కొన్నికొన్ని దేశభాషలందే అభిమానం వుండేదని, [అంటే ఒక్కొక్కదేశంవారు ఒక్కొక్కభాషాపాండిత్యాన్ని హెచ్చుగా గౌరవించేవారని] కూడా గ్రంథాలను పట్టి తెలుస్తుంది. రాజశేఖరమహాకవి - గౌడాద్యాః సంస్కృతస్థాః - అనేశ్లోకంలో, గౌడదేశీయులు సంస్కృతంలోనే హెచ్చుగా కృషిచేస్తారనిన్నీ లాటదేశంవారు ప్రాకృతంలోనే మిక్కుటంగా పరిశ్రమచేస్తారనిన్నీ, మరుదేశంవారున్నూ టక్కదేశంవారున్నూ భాదానకులున్నూ అపభ్రంశంతో మిశ్రమమైనభాషాపరిశ్రమను చేసేవారనిన్నీ, అవంతిదేశస్థులూ పారియాత్రదేశీయులూ

దశరూపకాలతోసహా - వీరందరున్నూ పైశాచీభాషలోనే పరిశ్రమించేసేవారనిన్నీ మధ్యదేశానికి చెందినకవి, అన్నిభాషలకూ మధ్యగా అన్నిభాషలలోనూ సమానంగానే కవితావ్యవసాయం చేసేనేర్పు కలవాడనిన్నీ - సూచిస్తాడు. మరిన్నీ ఆయన అందే (అంటే కావ్యమీమాంసలో-) సంస్కృతంతో కలిపి అపభ్రంశవాఙ్మయాన్ని అతిలలితంగా ఉచ్చరించు నేర్పు అలవరచుకోవలె ననీ, ప్రాకృతభాషనున్నూ పైశాచీభాషనున్నూ అంతకంటేనూ ఇనుమడించిన సౌష్ఠవంతో (మార్దవంతో) చదువవలసి వుంటుందనీ ఇత్యాదివిషయాలు చక్కనిధోరణితో తెలుపుతున్నాడు. ఎంతచక్కని అనుభవమూ!!

## * జైనబౌద్ధమతాలవారూ - ప్రాకృతాభివృద్ధీ *

విదేశస్థులూ స్వదేశస్థులూ అయినచరిత్రకారులు అంటూవుంటారు - భారతవర్షం ఒక చమత్కారమైనం దేశం అనీ, అందులో ఏఉద్యమం వృద్ధిపొందినా మతసంబంధం తప్పకుండా వుంటుందనీ. సంస్కృతప్రాకృతభాషల ఉత్పత్తివికాసాల దశాపరిణామాలను వర్ణించేవారుకూడా ఈమాటలే సెలవిస్తూ ఉంటారు తరుచుగా. ఆర్యసంప్రదాయంవారి మతపునీడను సంస్కృతం వివిధశాఖలతో రూఢమై బ్రహ్మాండమైనఆకారంతో ఎల్లానెలకొన్నదో, ప్రాకృతంకూడా జైనబౌద్ధమతాలవారి అండను అంతటిసుస్థితిని పొందింది. ఆమతాలవారిని నేటికిగూడా ఆర్యమతంవారు విగానానికి పాలుచేస్తూ వున్నా, ఒకప్పుడు వారు అచ్చం భారతవర్షంలోనేగాక ఖండఖండాంతరాలలో గూడా తమతమ మతసంప్రదాయాలను వ్యాపింపచేశారు. ఆర్యమతాలవారు సంస్కృతాన్ని చేపట్టి సంస్కృతప్రజ్ఞులను కూడగట్టికొని రాగలిగితే, వారు ప్రాకృతభాషలను చేపట్టి ప్రాకృతప్రజ్ఞులను అనుగ్రహించి ఉద్ధరించారు. ఒకరిది కలవారికే కలిగించడం ధర్మమైతే, రెండోవాడికి లేనివారి లేమిని తొలగించడమే పరమార్థంగా ఏర్పడ్డది. నామట్టుకు నాకు-ఒకమహానుభావుడు చెప్పినట్లుగా-

శ్లో. పక్షపాతో న మే వీరే న ద్వేషః కపిలాదిషు,

యుక్తిమ ద్వచనం యస్య తస్యకార్యః పరిగ్రహః - (రాజేంద్రకోశకర్త.)

జైనబౌద్ధమతాలూ వారభివృద్ధిచేసినప్రాకృతభాషా అంటే పక్షపాతంగానీ, ఆర్యసంప్రదాయంవారూ వారు అభివృద్ధిచేసిన సంస్కృతభాషా - అంటే ద్వేషంగానీ లేదు. ఉభయమూ భారతవర్షానికీ భారతీయులకూ అమోఘంగా సేవచేసినట్టివే. ఒకప్పుడు అపరిమితంగా అభివృద్ధి కాధారభూతములుగా ఉన్నవే కాని మరోటికాదు. విషయం యొక్క-ఉత్పత్తివికాసాదిదశలను వివరించేబాధ్యతతో వున్నందుననే ఉన్నస్థితిని తెల్పవలసి వస్తున్నది. కాబట్టి జైనబౌద్ధమతాలవారు ప్రాకృతానుగ్రహంకోసం- చేసినప్రశాసేవను దిఙ్మాత్రంగా చూపుతాను.

(i) జైనమతమువారిలో :- గ్రంథవ్యాఖ్యాతలు గ్రంథకర్తలూ - కవులూ మున్నగువారు-

(౧) మలయగిర్యాచార్యుడు:- ఈయన ఆచార్యహేమచంద్రునికి సమకాలికుడు. అనేకంగా జైనగ్రంథాలకువ్యాఖ్యానాలు సంస్కృతంలోనూ ప్రాకృతంలోనూ కూడా వ్రాసి ఆకాలంలో చాలా ప్రశాసేవ చేసినవాడు. ఆవశ్యకబృహద్వృత్తి. క్షేత్రసమాసటీక, చంద్రప్రజ్ఞప్తివ్యాఖ్య, జీవాభిగమవృత్తి, జ్యోతిష్కరండటీక, నందిటీక- మొదలయిన మహావ్యాఖ్యానాలను గ్రంథకః అర్థతశ్చ విపులమైనవాటిని ౧౫ గ్రంథాలను వ్రాశాడు. విక్రమశకం ౧౨ వ శతాబ్ది ఆరంభంవాడు. చాలా ప్రామాణికుడు.

(౨) హరిభద్రసూరి:- ఈయన్ను విరహాంకహరిభద్రసూరి అనికూడా అంటారు. విక్రమశకం ౯వ శతాబ్దివాడు. అనుయోగద్వారటీక ఆవశ్యకబృహద్వృత్తి ఉపదేశపదం మొదలయిన గొప్పగ్రంథాలకు ౧౪౪ టికి మహాప్రజ్ఞతో వ్యాఖ్యానాలు వ్రాసి ప్రజలకు సౌకర్యం కలిగించి విజ్ఞానాన్ని ఇచ్చినాడు. ఈయనగ్రంథాలలో సమరాయిచ్చకహా (సమరాదిత్యకథ) బాణునికాదంబరిని కూడా గ్రంథవిస్తృతిలో గుణగౌరవంలో మించుతుంది అనడం అతిశయోక్తికాదు. గొప్ప నైయాయికుడూ శాబ్దికుడూనూ.

(౩) అభయదేవసూరి:- ఈయన మహాతార్కికుడు. అనేకాంతజయపతాకకు వ్యాఖ్య వ్రాశాడు. దాదాపు ౧౦ వేలగ్రంథం. వాదమహార్ణవం అని ఒక మహాగ్రంథంకూడా ఈయనది ఉండేదంటారు. ముంజరాజుసభలో ఈయనశిష్యుడు ధనేశ్వరసూరి వాదివిజయంచేశాడు. కాబట్టి ౧౦ శతంలో (విక్రమశకంలో) వుండినవాడంటారు. జ్ఞాతవృత్తి మొదలయిన పదిగ్రంథాలు ఈయన వ్రాశాడు.

(౪) తిలకాచార్యుడు:- ఈయనా అనేకగ్రంథాలకు వ్యాఖ్యలు వ్రాసి మతప్రచారం సాగించాడు. ప్రసిద్ధుడు.

(౫) యశోదేవసూరి, శ్రీచంద్రుడు సంగ్రామసింహుడు, సాధారణసిద్ధసేనసూరి పూర్ణభద్రగణి దేవభద్రసూరి హేమప్రభసూరి మొదలయినవారు అనంతంగా వున్నారు మహావ్యాఖ్యాతలుగానూ పరమప్రామాణికులుగానూ పేరు పొందినవారు అనేకులు.

(౬) హేమచంద్రసూరి - మలధారి - ఈయనవ్యాఖ్యాతా మహాకవీ కూడానూ. ఆవశ్యకవృత్తి టిప్పణం నేమిచరితం భవభావనావృత్తి శిష్యహితా - మున్నగుగ్రంథాలు అనేకం వ్రాశాడు.

(౭) హేమచంద్రాచార్యుడు:- ఈయన కలికాలసర్వజ్ఞుడనీ కవికులపతి అనీ కీర్తిగాంచాడు. ఈయనగ్రంథాలు శతాధికంగా వున్నవి అంటారు. ఈయన స సంస్కృతప్రాకృతాలలో సమంగా లేఖిని నడిపి, అనేకగ్రంథాలు స్వయంగా రచించి, అనేకకృతులకు వ్యాఖ్యాతయై శిష్యకోటికి అనంతరీతిని గురువై యుగపురుషుడుగా తేజరిల్లినవాడు. మహాప్రామాణికుడు. జైనమతానికన్నీ సంస్కృతప్రాకృతాలకున్నూ ఈమహాపురుషుని ప్రాదుర్భావం ఒకమహాజీవాతువు. ఈక్రిందివి ఈయనగారిగ్రంథాలలో కొన్ని. పేరునుబట్టే వాటిగౌరవం వెల్లడి అవుతుంది. కుమారపాలమహారాజుగారికి గురువు. విక్రమశకం ౧౧౪౫ మొదలు ౧౨౩౦ వరకు వెలిగినవిజ్ఞానమూర్తి.

(1) ప్రమాణమీమాంస
(2) మహార్ణవన్యాసం
(3) అయోగవ్యవచ్ఛేదద్వాత్రింశికా
(4) అన్యయోగవ్యవచ్ఛేదద్వాత్రింశికా
(5) అర్హన్నీతి
(6) త్రిషష్టిశలాకాపురుషచరిత్ర
(7) యోగశాస్త్రం
(8) కావ్యానుశాసనం
(9) ఛందోనుశాసనం
(10) లింగానుశాసనం
(11) వాదానుశాసనం
(12) ధాతుపారాయణం
(13) అభిధానచింతామణి
(14) అనేకార్థసంగ్రహః
(15) హైమనిఘంటు
(16) దేశినామమాల
(17) పరిశిష్టపర్వం
(18) ద్వ్యాశ్రయకావ్యం

(19) సప్తసంధానకావ్యం
(20) వీతరాగస్తుతి
(21) భువనకోశః
(22) శిష్యానుశాసనం ఇత్యాది

N. B. ఇందులో 8 మొదలు 19 వఱకూగల గ్రంథాలు నేటిఆంధ్రపండితులూ విమర్శకసుధీవరులు పఠించి విమర్శించి వెలయింపతగినవి. ఇవి అన్నీ అచ్చైలభించేవే కాని మఱోటి కాదు.

(౮) వీరుగాక - అభయతిలకోపాధ్యాయుఁడు అమరచంద్రుడు ఆజ్ఞాసుందరకవి ఋషభదాసు క్షమాకల్యాణుడు క్షేమకీర్తి గుణచంద్ర - గుణపాల గుణవినయులు, గోవిందగణి చక్రేశ్వరుడు చంద్రతిలకోపాధ్యాయుడు జంబూనాగ - జంబూకీర్తి - జయతిలక - జయవిజయ - జయసాగర జయసింహులు, జినచంద్రజినపతిజినపాలజినభద్రజినరత్నజినవల్లభజినేశ్వర - దేవగుప్తదేవచంద్ర దేవప్రభదేవభద్రదేవసాగరదేవేంద్రసూరిధనదేవధనపాలధనేశ్వరవన్నసూరులున్నూ నమిసాధునయ రంగనరచంద్రనేమిసూరిపద్మప్రభపరమానందపుణ్యసాగరపూర్ణభద్రపృథ్వీచంద్రులున్నూ ప్రద్యుమ్న ప్రబోధమూర్తి బుద్ధిసాగర బ్రహ్మదేవమహేంద్ర మహేశ్వరమాణిక్యచంద్రమాణిక్యసూర్యాదికవులున్నూ సంస్కృతప్రాకృతాలలో గ్రంథాలు వ్రాసినవారు పరశ్శతాలున్నారు. వీరినిగుఱించి వ్రాయడం ఆరంభిస్తే వక మహాగ్రంథమే అవుతుంది.

(ii) బౌద్ధమతమువారిలో - గ్రంథవ్యాఖ్యాతలూ గ్రంథకర్తలూ కవులూ పండితులూ మున్నగువారు.

(౧) శాంతిరక్షితుడు దిఙ్నాగుడు ధర్మకీర్తి ధర్మోత్తరుడు అనంతవజ్రుడు - మొదలయిన మహాప్రామాణికులున్నూ, ధమ్మపదం - అర్థశాలినీ రచించినబుద్ధఘోషుడూ ఆచార్యవసుబంధుడూ మహాపండితరాహులసాంకృత్యాయనుడూ బోధిసత్త్వమైత్రేయుడూ క్షేమేంద్రుడు (అవదానకల్పలత గ్రంథకర్త) ప్రజ్ఞాపారమితసూత్రకర్తా ఆర్యదేవుడు మహాయానాదిసూత్రాలు రచించినవారూ జాతకమాలరచించినఆర్యశూరుడూ తథాగతగుహ్యకసమాజగ్రంథకర్త దాఢావంశగ్రంథకర్త దివ్యావదానదీపవంశగ్రంథకర్తలూ అశ్వఘోషుడూ ఈ మొదలయిన మహాపండితులూ కవులూ గ్రంథకర్తలూ వ్యాఖ్యాతలూ తార్కికులూ శాబ్దికులూ కథాఖ్యాయికాగ్రంథకర్తలూ మొదలయినవారు అనంతంగా అనంతగ్రంథాలకు కర్తలై వున్నారు.

* ఉత్తమమైన ప్రాకృతసాహిత్యమునుండి కొన్ని వాఙ్మయరత్నాలు మచ్చుకై చూడండి *

జైనులూ బౌద్ధులూ ప్రాకృతంలో ప్రాకృతులయాత్మల కున్నతిని కలిగించుటకై శాస్త్రాలూ వ్యాఖ్యానాలూతత్త్వగ్రంథాలూ ఉపదేశగ్రంథాలూ కథలూ కావ్యాలూ నాటకాలూ అనంతంగా రచించారు. ఈవ్యాసంపేరునుబట్టి వాటిని పూర్తిగా వివరించవలసినబాధ్యత కలిగివున్నా స్థలసంకోచంచేత ఆపనిని చేయలేకపోయినందుకు పాఠకులు మన్నించవలె. అయినా ఆవాఙ్మయంపైని వుండేప్రేమవల్లా రసతృష్ణచేతా సరసములయినకొన్ని కొన్ని భాగాలు ఆయాగ్రంథాలనుండి వుదాహరించి, దీనితో సంతృప్తులు కాండి - అని చదువరులను అంజలిపూర్వకంగా వేడుకొంటూ వున్నాను. చిత్తగించండి.

(౧) అంజనాసుందరీచరితం - దీనిని రచించింది గుణసమృద్ధిమహత్తర అనే జైనసన్యాసిని. ఈమె ౧౪ వ శతాబ్దివాడైన జినచంద్రసూరికి శిష్యురాలు. శ్లో. సిరిజేసలమేరుపురే విక్కమచవుదహసఉత్తరే వరిసే, వీరజిణజమ్మదివసే కియ మంజణిసుందరీచరియం, ఇతి శ్రీఅంజనాసుందరీ

మహాసతీకథానకం కృతి రియం శ్రీజినచంద్రసూరిశిష్యణీ శ్రీగుణసమృద్ధిమహత్తరాయాః-అని ఈమే స్పష్టంగా గ్రంథాంతంలో చెప్పుకొన్నది. చక్కనిప్రాకృతరచన అంటారు. నేను కంటితో చూడలేదు ♦ ప్రాకృతంతో రచించినగ్రంథమే. దాదాపు వేయిశ్లోకాలగ్రంథం అంటున్నారు.

(౨) అతిముక్తచరితం - పూర్ణభద్రగణి వ్రాశాడు. ఈయన జినపతిసూరిశిష్యుడనీ దశశ్రావకచరిత్ర ధన్యశాలి భద్రచరిత్ర - మొదలయినగ్రంథాలు కథలు సంస్కృతిప్రాకృతాలలో సమంగానే వ్రాశాడు. విక్రమశకం ౧౩ లో ఉన్నాడంటారు.

(౩) అలంకారదప్పణం - ఈగ్రంథకర్త పేరేమో తెలీదు. ప్రాకృతభాషలోనే ఈయన అలంకార శాస్త్రం రచించాడు ప్రాకృతకవులకూ ప్రాకృతపాఠకులకూనూ. మచ్చుకు ఒకటిరెండుశ్లోకాలు ఇస్తున్నాను. శాస్త్ర మార్గంలోకూడా ధారాళత చూపుతుంది ఈయనశైలి:-

శ్లో. సుందరపయవిణ్ణాసం విమలాలంకారశోహియ శరీరం, సుయదేవియం చ కవ్వం పణవియం పవరవణ్ణడ్ఢం। సవ్వాయిం కవ్వాయిం, సవ్వాయిం జేణహోంతి భవ్వాయిం, తమలంకారం భణి మోలంకారం సుకవికవ్వాణం, అచ్చంతసుందరం పి హు నిరలంకారం జణమ్మి కీరంతం, కామి ణిముహం వ కవ్వం హోయి పసణ్ణంపి విచ్ఛాయం, తా జాణిఊణ నిఉణం లక్ఖిజ్జహ బహువిహా మలంకారం, జేహం అలంకరియాహం బహుమణ్ణిజ్జంతి కవ్వాయిం.

(౪) ఆదినాథచరియం - దీనిని వర్ధమానుడనే జైనాచార్యుడు వ్రాశాడు. ౧౧ వేల శ్లోకాలు గల్గి ఐదు అవసరాలుగా విరచింపబడ్డ ప్రాకృతకావ్యం ఇది. ఇంతవిపులమైన జినచరితం ప్రాకృతభాషలోనే కాదు ఏభాషలోనూ వ్రాయబడలేదని వివరణపట్టిక వ్రాసినవారు ఆశ్చర్యపడ్డారు. మధ్య మధ్య - అపభ్రంశభాష మొదలయినభాషలు వివిధరీతులవాడాడు ఈయన. ఇతనిశైలికి మచ్చు ఈక్రింద రెండుపద్యాలు చాలి వుంటవి. విక్రమశకం ౧౧ వ శతాబ్దివాడు ఇతడు.

శ్లో. విక్కమనివకాలాఉ సయేసు ఏక్కారసేసు సగ్గేసు, సిరిజయసింహనరిందే రజ్జం పరిపాలయం తమ్మి, ఖంభాయిత్థనియేసిహిం సియపక్ఖే చిత్తవిజయదసమీయే పుస్సేణం సురగురుణో సమత్తియం చరియ మేయంతి - ఇత్యాది.

(౫) కయిసిద్ధం :- ప్రాకృతభాషలో వ్రాసిన గొప్పఛందశ్శాస్త్రగ్రంథం ఇది. ఆరు నియమాలుగా గ్రంథభాగాలుగా ఇది విభక్తమై వుంది. మాత్రావృత్తవర్ణవృత్తాదులను చక్కని ఉదాహరణాలతో ప్రదర్శిస్తుంది. రచించినకవిపేరు లేదు. కాని కయిసిద్ధం కవిసిట్టం కృతసిద్ధం ఛందోవిచితి-మొదలయినపేర్లు దీనికి గ్రంథకర్తే వ్యవహరిస్తూ వున్నాడు. దండికవి కావ్యాదర్శంలో తానొక ఛందోవిచితి వ్రాసినట్లు చెప్పుకొన్నాడు. ఈకవి - సద్భావలాంఛనుడు గంధహస్తి అవలేహాచిన్నాడు అనేకవులనూ పింగళమహర్షినీ స్మరించి నమస్కరిస్తాడు. దీనికి భట్టగోపాలుడు అనే అతడు వృత్తి వ్రాశాడు. ఈవ్యాఖ్యాత కాత్యాయనుడిని భరతుడిని కంబళాశ్వతరాదులను ఉల్లేఖిస్తాడు. దలాలు మొదలయినవారు ఇది విరహాంకుడి దని ఉల్లేఖించారు. మచ్చుకు-ఆగ్రంథంలో

♦ ఇక్కడ దిక్ప్రదర్శనంగా వివరించేగ్రంథాలన్నీ - శ్రీలాల్చంద భగవాన్ దాసుగారి గ్రంథ వివరణపట్టికనుండియే యిస్తున్నాను. కొన్ని నాసాంతాలుకూడా వున్నవి. వానిని అక్కడే ప్రస్తావిస్తాను.

శ్లో. దేయిం సరస్సయిం పణమిఊణ గరుయాకయి గంధహత్థిం యు, సబ్భావలంఛణం పింగళం చ అవ లేకయిణ్ణాం యు, కామిణికవోలపప్ఫపరితణుయ బుద్ధివిహవోది, దయియాయే సాహాయి సముచ్చయం విరహాలంఛణో వి త్తిజాయియాణ, తం జియలోయే దువిహాం మత్తావిత్తం చ వణ్ణ వి త్తం చ తస్స మయే తుహా లఖ్ఖణేణ లక్ఖణం సీసయి నయంగీ.

(౭) కాలకాచార్యకథ :— ఇది చతుర్థపర్యూషణాపర్వ చరిత్రకారుడికథ. పంచమీప్రబంధం పర్యూషణాకల్పం మొదలయివాట్లల్లోనూ కూడా ఈకథే వస్తుంది. కర్త ఎవ్వరో ? గ్రంథం చిన్నది.

(౮) కువలయమాల :— దీనిని దాక్షిణ్యచిహ్నుడనే మారుపేరుగల ఉద్యోతనాచార్యుడు రచించాడు. ప్రసంగసందర్భంగా ఇదివఱకే కొంత వుదాహరింపబడ్డది. చాలా చమత్కారమైనగ్రంథం. వీధి నాటకం - ప్రహసనం - ప్రబంధం-చంపూ మొదలయినవాటిలక్షణాలు కనిపింపజేస్తూ హాస్యంగా సరసంగా వర్ణిస్తాడు. హాస్యం సంభాషణశైలిగా గల భాగాలనుండీ కొంచెం ఉదాహరిస్తాను. కవి స్వయంగానే దీనిని తాను మహారాష్ట్రం ప్రాకృతం మొదలయిన నానాప్రాకృతాలలోనూ మధ్యమధ్య - సంస్కృతంలోనూ కూడా రచిస్తున్నాననీ తాను చంద్రకులంవాడననీ విక్రమశకం ఏడవశతాబ్దిచివరవాడననీ చెప్పకొంటాడు. ఉదా:—

రేరే అరోట్టు ! భణ రే జావ ణ పమ్హుసయి, జనార్దన పుచ్ఛయి కత్థ తుఝ్జే కల్ల జిమిల్లియా ? (తేణ భణివు) సాహిఉం జే తేణఉత్తస్స వలఖ్ఖియియేల్లయహా తణయే జిమిఅల్లయా. (తేణ భణివు) కిం సా విసేసమహిళా వళఖ్ఖిఇయేల్లిక ? (తేణభణివు) సా య భడారియ సంపూర్ణ్ణా సలక్షణ గాయత్తి యాద్దసియ. (అణ్ణేణ భణియం) వణ్ణి ! కీదిశం తత్థ భోయణం వాసుయియా (పుణ అణ్ణేణ) చాయియా భట్టో ! మయే భోయణం వుట్ఠం తఖ్ఖోహాం న వాసుయియా ! (అణ్ణేణ ఉణ) కత్తు ఘుడయి తఉ హాద్ధయ ఉల్లావ. భోయుణం పుట్ఠం సోణామ సింఘుసి ? (అణ్ణేణ) అరెరే వడ్డో ! మహాముఖ్ఖ జే పాడలిపుత్త మహానయరవత్థవ్వే తే ఖుత్థా సమ్మసుత్తి వుఝ్ఝాణం ? (అణ్ణేణ) అమ్హాని ఇఅం ముఖ్ఖత్తి. (అణ్ణో) కాయింకజ్జ ? (తేణభణివు) అని ఉణనివుణతత్థుత్తిప్ప జుగ ! (తేణఉణ) భట్టో సచ్చం త్వం విదత్థో కింపుణు భోయణే సుస్థుపుత్థం. మామ కహియం ? (తేణభణిఉ) అరే మహాముఖ్ఖ వానుయియావయనహాస్సం కజ్జేయి. కుత్వా కుమారేణ చింతితం-అహో అసంబద్ధఖరాలాపత్తణం బాలదేసి అణం అహవా కో అణ్ణో వావారో ఇమాణం పరపిండపుట్ఠందేహాణం - విజ్ఞావిణ్ణాణణాణా విణయవిరహియాణం చట్టరసాయణం మోత్తుణ" - ఇతి. ♦

---

♦ ఛాయ:- రేరే అరోట్టు ! భణరే ! యావన్న విస్మరతి. జనార్దన పృచ్ఛామి కుత్రయూయం కల్యే జిమితవంతః ? (భోజనం కృతవంతః !) (తేనభణితం-) సాధితం, యః స్న తేతపుత్రస్య బలక్షయి గృహస్యతనయా, తత్ర భుక్తం. (తేనభణితం) కిం సా వైశ్యమహిళా బలక్షయికస్య గృహే ? (తేనభణితం) సాచ భట్టారికా సంపూర్ణసలక్షణా, గాయత్రి యాదృశీ తాదృశీ. (అన్యేన భణితం) వర్ణిన్, కీదృశం తత్ర భోజనం ? వా సుఖీ ? (పునరన్యేన) త్యాగిణ భట్ట! మయా భోజనం స్పృష్టం. తక్షణో౽హం న వాసుకిః. (అన్యేన) కుతో ఘటతే తవ హార్దిక్ ఉల్లాపః ? భోజనే స్పృష్టే స్వ నామ కథయసి ? (అన్యేన) అరెరె వడ్డా! మహామూర్ఖ! యే పాటలిపుత్రమహానగరవాస్తవ్యాః

దీని అర్థం ఇదీ:- "ఓరీఓరీ అరట్టా - చెప్పరా మరచిపోకముందే. జనార్దనా! అడుగుతున్నాను - ఎక్కడ నీవు పొద్దుటే భోంచేశావు? (వాడు) చెప్తాను. వాడు ఉండలేడూ శేతపుత్రుడూ - బలతుయీ - వాడికూతురు! అక్కడ భోంచేశాను. [వాడు - అంటే రెండోవాడు] ఏమీ? అకోనుటి ఆవిడా! బలతుయి ఇంట్లో వుంటుందీ? (వాడు.) ఆమెకూడా మహాఇల్లాలు. సంపూర్ణలక్షణ గాయత్రి యేల్లాంటిదో, అల్లాంటివీ? (ఇంకోడు) అక్కడ భోజనం ఎల్లావుంది? (వా) సుకవేసా? (మఱల ఇంకోడు) త్యాగీభట్టా నేను భోయనమే స్పృశించాను. తతుకుణ్ణినేను. వాసుకిని గాను. (వాసుకీ - అని సంస్కృతం సుఖంగానే వుందా అని ప్రశ్న. ఆప్రశ్న విరవకుండా ప్రాకృతంలో ఒకే మాటగా ఉచ్చరిస్తే వాసుకి - అని వినిపిస్తుంది.) (ఇంకోడు) ఎక్కడనుంచి వస్తుందోయీ నీకు సంభాషణచాతుర్యం? భోజనం అడిగితే పేరు చెప్పకొంటున్నావూ? (వాడు) ఓరీ! బద్ధూ మహామూర్ఖుడా! పాటలిపుత్రనగరంలోవుండేవారికి సమాసోక్తి (తెలిసికోనే) నేర్పు ఎక్కడిదిరా? [ఇంకోడు - కోపంలో మొదటివాణ్ణిచూపిస్తూ] మాకంటే ఈఅమ్మ ఇంకా మూర్ఖురాలు. (ఇంకోడు) ఎందుచేతా! (వాడు) అనిపుణులమాటల్లో నిపుణార్థపుమాట సొంపు చూపుతానంటుంది కాబట్టి. (మఱలవాడు) భట్టా! నీవు నిజంగానే నేర్పరివేలే! ఎందుకంటే భోయనం బాగుందా? అని అడిగింది. మఱి మామా! జవాబు చెప్పావా? (వాడు) ఓరీ మహామూర్ఖుడా చెప్పలేదూ? వాసుకివియ్యనోళ్ళు చెప్పాలెననీ? - ఈమాటలు విని రాజకుమారుడు అనుకున్నాడు - ఓహోహో! మహామూర్ఖాగ్రేసరుల అసంబద్ధసంభాషణం!! అధవా, వీరికీ ఎత్తుడుకూళ్లతో పొట్టపెంచేవారికీ - విద్య విజ్ఞానం జ్ఞానం వినయం - లేనివారికి ఇంతకంటే పనేముందీ? చట్టరసాయనం (బాతాఖానీ) వదలిపెడితే - అని భావం.

మఱో ఘట్టంలోంచి మఱికొంచెం చూపుతున్నాను చదువరుల ఉల్లాసంకోసం-

* భోభో భట్టఉత్తా! తుమ్హేణ యాణహ రేరా రాఉఉలే వుత్తంతే? (తేణ భణిఅం) భణ హే వ్వగ్ఘసామీ! కా వార్తా రాజఉలే? (తేణ) కువలయమాలాయే పురిసద్దేసిణీయే పాఅరేరా లంబిదో, [ఇమం చ సోఊణ అఫ్ఫోడియఏక్కఉత్థియ చట్టో, భణిఅం చ ణేణం] - యది పాండిత్తేణా తదో పరిణేతవ్వ మయింకువలయమాల. (అణ్ణేణభణిఅం) అరే

---

రే కుతో సమాసోక్తిం విజానంతి? (అన్యేన) అస్మాదపి ఇయం మూర్ఖతరీ? (అన్యో) కస్మాత్కారణాత్? (తేనభణితం) అనిపుణ! నిపుణార్థోక్తిప్రచురా. (తేన) భట్ట! సత్యం త్వం విదగ్ధః. కింపునః భోజనం సుష్ఠు పృష్టం! మామ! కథితం? (తేనభణితం) అరే మహామూర్ఖ! వాసుకివదనసహస్రం కథయతి. కుమారేణ చింతితం - అహో! అసంబద్ధాక్షరాలాపిత్వం బాలదేశ్యానాం. అథవా కః పున రన్యోవ్యాపారఏషాం పరపిండపుష్టదేహానాం విద్యావిజ్ఞానజ్ఞానవినయవిరహితానాం చట్టరసాయనం ముక్త్వా - ఇతి.

• భోభో భట్టపుత్రా యూయం నజానీథ రేరా రాజకులే వృత్తాంతః? (తైర్భణితం) భణ హే వ్యాఘ్రస్వామిన్ కా వార్తా రాజకులే? (తేన) కువలయమాలయా పురుషద్వేషిణ్యా పాదో లంబితః (ఇదం చశ్రుత్వా ఆస్ఫోట్యఏకఉత్థితశ్చట్టః భణితంచ తేన) యదిపాండిత్యేన తతో మయా పరిణేతవ్యా కువలయమాలా? (అన్యః) అరే కీదృక్తవపాండిత్యం? (సః) షడంగం పఠామి త్రిగుణం మంత్రం పఠామి. కిం న పాండిత్యం? (అన్యః) అరే న మంత్రైస్త్రిగుణైః పరిణీయతే, యః పాదాక్ష

కవణు తఉ పండిత్తు! (తేణ)పడంగు పఢమి త్తిగుణమంత్త పఢమి, కిం ణ పండిత్తు!(అణ్ణేణ) అరే ణ మంతేహిం త్తిగుణేహిం పరిణిజ్జయి, జో సహిాయే పాయే ఖిందయి సో తం పరిణేఢి. (అణ్ణో) అహం సహితఉజ్జో గాధీ పఢమి. (తేణ) కయిసీరే వాఘ్రుస్వామి గాధో! (తేణ) ఇవి రే గాధో - సా తే భవతు సుప్రీతా అబుధస్య కులో బలం!, యస్య యస్య యదా భూమిస్సర్వత్రి మధుసూదనః, (అణ్ణో) అరేరే ముఖ్ఖ కంధగోావి గాధాణం భణిసి! అమ్హ గాధం ణ పుచ్ఛహ తేణ తుం పఢ భట్టో యజుస్వామి! గాధో, (యజు) సుట్ఠు పఢమి-ఆరయే కప్పే మత్తాగయా గోదారి ణ ముంచయి, కో తహా దేసహా ఆవయది కో వ పరాణధి వాత్త.(అణ్ణో) అరే! సిలోగో అమ్హే ణ పుచ్ఛయ గాధో. (అణ్ణో) పఠహో (తేణ) సుట్ఠు పఢమి - తంబోలరయియరావు అహారో కామిణిం దిట్ఠా, అమ్హంచియ క్షుధయి మణో దారిద్దగురూ ణివారేయి. (సర్వే) అహో! భట్టయజు స్వామి విద్ధో పండిత్తు. విద్ధావంతు. గాధోపఢయి. ఇమిణం సా పరిణిజ్జా (అణ్ణో) అరే కేరిసో సో పాఠఉ. సో సే విస్మృతు., సవ్వ లోకు పఢతి త్తి - ఇమంచ సోఊ౦ చింతేయం రాయ ఉత్తేణ - అహో అణాహావట్టి యాణం అసంబద్ధప్రిలావత్తిణం చట్టాణం చట్టరసాయణం త్తి.

దీనిఅర్థం ఇదీ:- ఓయ్ ఓయ్ భట్టపుత్రిల్లారా! మీరువినలేదా ఏమిటోయి రాజకులంలో కబురు? (వారు) చెప్పోయి వ్యాఘ్రస్వామీ! ఏంవిశేషం రాజకులంలో? (వాడు) కువలయమాల మగవాడంటే ద్వేషిస్తూ పాదం పట్టుకొని వుందిట. (ఈమాట విని వకడు చప్పట్లు చరుస్తూ లేచాడు భట్టువాడు) పాండిత్యం పనికివొస్తే నేనే పెళ్లాడాలి కువలయమాలను. (ఇంకోడు) ఎల్లాంటిపాండిత్యం వుంది నీకు? (వాడు) షడంగం (వేదం) చదివాను. త్రిగుణంగా (సంధివిగ్రహాదిరూపంగా) వుండే మంత్రం చదివాను. ఇది పాండిత్యం కాదా? (ఇంకోడు) అరే మంత్రాలతో త్రిగుణాలతో పెళ్ళాడదురా! ఎవడు ఆపాదం విడదీస్తాడో వాణ్ణే పెళ్ళాడుతుంది. (ఇంకోడు) నేను సరసుడనేరా! గాథలు బాగా చదవగలను.(వారు)ఏదిరా వ్యాఘ్రస్వామీ! గాథ (వాడు) ఇదిగో ఇదిరాగాథ-సాతేభవతు (చదువుతాడు.) దాన్నివిని ఇంకోడు కోపంతో-అరేరే మూర్ఖుడా! స్కంధకాన్నికూడా గాథ - అంటున్నావురా? నన్నడగ్గూడదూ? గాథ? (వాడు) నీవు చదవరా భట్టయజుస్వామీ! గాథా? (వాడు) ఓ. బాగా చదువుతానూ -" తొల్లింటికల్పంలో చచ్చినవాళ్ళు గోదావరిని వదలడం లేదు. అక్కడనుంచి తిరిగి వచ్చేవాడెవడూ? వార్త చెప్పేవాడెవడూ?- (అని అర్థం) మరోడు-

---

ఖివత్తి స తాం పరిణయతి. (అన్యః) అహం సహృదయా గాథాం పఠామి. (త్రైర్భణితం)కీదృశీ రే వ్యాఘ్రస్వామిన్ గాథా? (తేన) ఇయంగాథా - సా తే భవతు...మధుసూదనః. (అన్యస్సకోపం) అరే మూర్ఖ స్కంధక మపి గాథాం భణసి? అస్మాన్ గాథాం న పృచ్ఛథ? (త్రైః) త్వంపఠ భట్టయజుస్వామిన్ గాథాం? (తేన) సుష్ఠు పఠామి - ఆదౌ కల్పే మృతింగతా గోదావరీం న ముంచతి, కస్తస్మాద్దేశా దాపతతి కో వా పర్యాణయతి వార్తాం. (అన్యః) అరే! శ్లోకః! అస్మాన్ను పృచ్ఛథ గాథాం పఠామి. (అన్యః) పఠ (సః) సుష్ఠుపఠామి - తాంబూలరచితరాగమధరంకామిన్యా దృష్ట్వా, అస్మాక మపి క్షుభ్యతి మనో దారిద్ర్యగురు ర్నివారయతి. (సర్వే) అహో భట్టయజుస్వామీ విదగ్ధపండితః విద్వాన్ గాథాః పఠతి. ఏతేన సా పరిణేతవ్యా. (అన్యః) అరే కీదృశో పాఠకః తే కీయం లంభితః? (తేన) రాజాంగణే మయాపఠితఅపిత్ సకలవిస్మృతః, సర్వోలోకః పఠతీతి. ఇదం శ్రుత్వా చింతితం రాజపుత్రేణ - అహో అనాథవృత్తికానా మసంబద్ధప్రలాపిత్వం!

అరే! శ్లోకంరా! మమ్మల్ని అడగ్గూడదూ? గాథ చదువుతామూ? (వాడు) చదువూ మరి (రెండటి వాడు) ఓ, చక్కగ్గా చదువుతాను:- తాంబూలంతో ఎర్రబడ్డ కామినీఅధరం చూచి మామన్ను కూడా శోభిస్తూ వుంది. అయితే దారిద్ర్యమనే గురువుగారు వారిస్తూ వున్నారు. [అని అర్థం. అందరూ-] ఓహోహో! భట్టియజాస్వామి విదగ్ధపండితుడూ. విద్వాంసుడూ. మహాచక్కగా గాథలు చదువుతాడు. (ఇంకోడు) ఆవిడ పట్టుకొన్న ఆపాదం ఏమోయ్? (ఇంక వకడు.) రాజాంగణంలో నేనూ చదివాను. మరిచాను. లోకంఅందరూ చదవగలరు-ఈమాట విని రాజపుత్రుడు అనుకొన్నాడు- ఓహో పనిలేనిసోమరుల అసంబద్ధప్రలాపం !! - అని.

(౯) ఆవశ్యకనిర్యుక్తి:- భద్రబాహుసూరి అనే జైనాచార్యుడు జైనగ్రంథకర్తల్లో గొప్పప్రసిద్ధిగాంచిన వ్యాఖ్యాత. ఆయన తాను రచించిన వ్యాఖ్యాగ్రంథాలలో ప్రాకృతవాఙ్మయంలోనుండి ఆనాడు ప్రసిద్ధంగా వున్నవుదాహరణాలను చాలా ఇస్తుంటాడు. ఆయన ఉదాహరించిన ప్రాకృతపద్యాలు చక్కనివి:- మచ్చుకు,

* శ్లో. లద్ధిల్లియం చ బోహిం అకరింతో అణాగయం చ పత్థంతో, దచ్ఛసి జహా తం బిచ్ఛల ఇమం చ అన్నం చ చుక్కిహిసి. (గీతికా) సుట్ఠు వాయియం సుట్ఠు గాయియం సుట్ఠు నచ్చియం సామ సుందరి! అణుపాలియ దీహరాయియఓ సుమిణంతే మా పమాయఏ. (గాథా ౧౦౯౯, ౧౨౯౦) ఏఉ సగడాలో భణయి జం సగడాలు కరిస్సయి, నందరాయా మారే వీణు సిరియవు రజ్జే ఠవిస్సయి. (కథావళి పే ౨౬౦)

◆ వరరుయీ డింభరూవాణి మోయగే దాఊణ ఇమం పాఢేయి -
రాయనందు నవి జాణయి జం సగడాలో కాహీయి, రాయ నందం మారేత్తా తో సిరియం రజ్జేఠవేహీయసా భణయి:- నదుక్కరం తోడియ అంబయింబియా న దుక్కరం నచ్చిఉంసిక్ఖియా యారోతం దుక్కరం తం చ మహాణుహావం జం సో ముణీ పమయవణం మి వుచ్ఛో.

(౧౦) ఉత్తరాధ్యయనసూత్రం:- దీనిపైని వాదిబేతాళసూరి గొప్పవ్యాఖ్యకూడా వ్రాశాడు. జైనుల ఆగమగ్రంథం కాబట్టి దీనికి కర్త ఎవరో చెప్పలేము. ఇందులోనూ బేతాళసూరివ్యాఖ్యలోనూ అక్కడక్కడా చాలా ప్రాచీనపు ప్రాకృతగాథలూ వాటిలక్షణాలూ వుదాహరిస్తూంటారు. ఇల్లాంటివి ఉపదేశపదంపైవ్యాఖ్యల్లో టీకాల్లోకూడా చాలా వుదాహరింపబడ్డాయి కూడా. ఒకటి రెండు మచ్చుకు:-

* ఛాయ :- లబ్ధం చ బోధి మకుర్వన్ అనాగతం చ ప్రార్థయమానః, ద్రక్ష్యసి యథా త ద్విహ్వల! అస్మాచ్చాన్యస్మాద్ భ్రంశిష్యసి; సుష్ఠు వాదితం సుష్ఠు గీతం సుష్ఠు నర్తితం శ్యామసుందరి! అనుపాల్యదీర్ఘరాత్రిః. స్వప్నాంతే మాప్రమాదీః (ఆవశ్యకనిర్యుక్తి.) ఏష శకటాలో భణతి య చ్ఛకటాలః కరిష్యతి. నందరాజో మారయిత్వా శ్రియకం (చంద్రగుప్తం) రాజ్యే స్థాపయిష్యతి.
◆ వరరుచిః డింభరూపేభ్యో మోదకాన్ దత్వా పాఠయతి-శ్లో.రాజా నందో నైవ జానాతి య చ్ఛకటాలః కరిష్యతి, రాజానం నందం మారయిత్వా శ్రియకం రాజ్యేస్థాపయిష్యతి. సా భణతి - శ్లో. న దుష్కరం తోట్రితా ఆమ్రలుంబికా న దుష్కరం నర్తితం శిక్షితయా, త ద్దుష్కరం త చ్చ మహానుభావం య న్న మునిః ప్రమదావనఉషితః. (ఆవశ్యకసూత్రవృత్తి.)

* శ్లో. అధువే అసాసయంమి సంసారంమి దుక్ఖపఉరాఏ, కిం ణామ హోజ్జ తం కమ్మయం జేణాహం దుగ్గయిం న గచ్ఛేజ్జా. జం గిజ్జయి పువ్వం ధువం చియ పుణపుణో సవ్వకవ్వబంధేసు, ధువయం తి త మిహా తివియం ఛప్పయం చఉపయం ధువయం[ఏవం చ భగవతోద్గీతే తే ప్యేవ మేవ ధ్రువకం ప్రత్యుద్గాయంతి.] జహా లోహమయా చ్చేవ్వ చాలేయవ్వా సుదుక్ఖరం, జహా దుక్ఖం భరేఉం జే జే హోయి వాయస్స కోత్థలో, భాయరా మే మహారాయ సగా జిత్థ కణిత్థగా, పుత్తేవ ముత్థి జహా సే అసారే (ఇత్యాది)

ఉత్తరాధ్యయనసూత్రం ఆరంభం ఇల్లా వున్నది:-

శ్లో. సంజోగా విప్పముక్కస్స అణగారస్స భిక్ఖుణో, విణయం పాఉ కరిస్సామి అణుపువ్విం సుణేహమే. అణాణిద్దేసకరే గురూణ ముణవాయకారయే, ఇంగియాగారసంపన్నే సేవిణీయేత్తి వుచ్చయీ, జహాసుణీ పూయికణ్ణీ నిక్కసిజ్జయి సవ్వసో, ఏవం దుస్సీలపడిణీయే ముహారీనిక్కసిజ్జయీ, కణకుండగంచయిత్తాణం విత్థం భుంజయి సూయరే, ఏవం సీలం చయిత్తాణం దుస్సీలే రమయీ మిఏ.

(౧౦) గాడవహో (గౌడవధ):- ఇది ౧౨వందలశ్లోకాలకు పైబడిన మహాకావ్యం. చక్కని (అంటే నిర్దుష్టం - అయిన) ప్రౌఢరచన గలకావ్యం. కవి సుప్రసిద్ధుడు. కావ్యంకూడా అల్లాంటిదే. మానియారు విలియం - మొదలయినపాశ్చాత్యపండితులూ పండిట్ శంకరపాండురంగ పండితులవంటి ప్రాచ్యపండితులూ కూడా అత్యధికంగా విమర్శించి ప్రశంసించిన మహాగ్రంథం. శైలికై ఒకటిరెండు పద్యాలిచ్చి విరమిస్తాను అల్పమతిని కనుక.

ఇయ తే జయంతి కయిణో జయిమిణమో జాణ సయల పరిణామం వాయాసుట్ఠియం దీసయి అమోఘఘుణం వ తుచ్ఛంవా. ణియయా యే వచ్చియ వాయాయే అత్తణో గారవం నివేసంతా, జేయేంతి వసం సంచియ జయంతి ఇహా తే మహాకయిణో. (62-68) మహుమహవిజయపవుత్తా వాయా కహణామ మఉయలీఇమప్పి, పఢమకుసుమాహితలిణం పచ్ఛాకుసుమం వణలయాణం. (69) అణుకంపా వా హాసో వా హోయి అవహీరణవ్వ గరుయాణ, ఇయరేసు అణాయగుణం తరేసు నఉణో హీయయుదుక్ఖం. (94) అప్పా ఏత్తియమేత్తేం వరవిరసోయి జస్స పడిహోయి, సిరకమలాఉహా చలణేహిం కహావి జం గహియ బహుమాణో. భవభూయి జలహిణిగ్గయకవ్వామయరసకణావ్వ, ఫురంతి జస్సవిసేసా అజ్జవి వియడేసు కహాణివేసేసు, భాసమ్మి జలణమత్తే కంతి దేవేయ ఉస్స రహుయారే, సో బంధవేయబంధమ్మి హారియం దేవ అణందో. (789-800) - గాడవధకావ్యం.

* అధ్రువే అశాశ్వతే హి సంసారే దుఃఖప్రచారకే, కిం నామ భవతి తత్ కర్మకం యేనాహం దుర్గతిం నగచ్ఛేయం; యద్ గ్రిధ్యతే పూర్వం ధ్రువం చైవ పునఃపునః సర్వకావ్యబంధేషు, ధ్రువకమితి తమిహ త్రివిధం షట్పదం చతుష్పదం ద్విపదం, [ఇల్లాగే ప్రాజ్యుడు ధ్రువకాన్ని చదివితే వారూ దీనినే పాడేవారు.] యథా లోహమయా శ్చైవ చర్వయితవ్యా స్సుదుష్కరాః, యథా దుఃఖం భర్తుం భవతి వాతస్య కోష్ఠః భ్రాతరో మే మహారాజ స్వకా జ్యేష్ఠకనిష్ఠకాః, రిక్తేవ ముష్టి స్సోఽసారః (ఇత్యాది)

(౧౦) చందప్పహచరియం - ఇది ధనదేవుడనే ప్రాకృతనామమూ యశోదేవుడనే దీక్షానామమూ గల ఒక జైనపండితుడు రచించినప్రాకృతకావ్యం. విక్రమశకం ౧౧౭౮ వాడు. నవపదప్రకరణం వ్యాఖ్య మొదలయిన ఇతరగ్రంథాలు రాశాడు. సిద్ధరాజజయసింహరాజ్యకాలంలో అణహిల్ల నగరాన ఉన్నాడంటారు.

ప్రారంభం-శ్లో. జస్సాగుణచరణనహ పహాణరత్తా నమంత అమరవహూ, అంతో అమంతసీహారియ భత్తిరాగవ్వడీసంతి. (చివఱ) - సిరిదేవగుత్తసూరీ తస్స వి సీసో అహేసి పచ్చరం్సో, తస్స వి సీసేణ ఇమం అయిమధణదేవణామేణం, ఉజ్జాపయరో పత్తంమి జాయ జసదేవ నామ హేణ సిరిచందప్పహచరియం మయే కియం మందమయిణా వి, సిరిధవలభండ సాలియ కారియ రే పాససామిజిణభవణే, అసాపల్లిపురీయే ఠియేణ ఏయం సమాణత్తం, అణహిల్లవాడ పత్తణే తయ ణు జిణవీరమందిరే రమ్మే, సిరిసిద్ధరాయజయసింహదేవరజ్జే విజయమాణే, ఏక్కారసవాససయేసు అయిగయేసు య విక్కమనివారియో, అడసత్తరీయే అహియేసు కప్తాతేరి పరయే పోసస్స.

(౧౧) చఉప్పంచాశన్మహాపురుషచరిత్ర :- ఇది శీలాంకాచార్యుడనే నామాంతరంగల విమలమతి అనే జైనపండితుడు రచించిన చరిత్రగ్రంథం. శీలాంకాచార్యుణ్ణి శీలాచార్యుడూ అనికూడా పిలుస్తారు. ఈయన ఆచారాంగానికి వృత్తి వ్రాశాడు. చఉప్పంచాశన్మహాపురుషచరిత్రను మహాపురిసచరియం - అని కూడా అంటారు. కాని గ్రంథకర్త నిర్దేశించినపేరు చఉప్పన్నమహాపురిసాణ చరియం - అని. శ్లో. చఉప్పన్నమహాపురిసాణ ఏత్థ చరియం సమప్పయే ఏయం, సుయదేవయారే పయాకమలకంతి సోహణుహావేణ. ఈయన నిర్వృతికులీనమానదేవసూరిశిష్యుడు. కుమారపాలుని రాజ్యంలో వున్నాడు. విక్రమశకం ౯ వ శతాబ్దివాడు.

శ్లో. అని జనుజ్జజోహ్లధవలియ నేవ్వుయకులంబరాభోయో, తుహిణ కిరణోవ్వసూరీ ఇహాయిం సిరిమాణదేవోత్తి. సీసేణ తస్స ఒయియం సీలాయరియేణ పాయడపుడత్థం, సయలజణబోహణత్థం పాయియభాసాయే సుపసిద్ధం. ♦ ♦ సయణు పరియణు బంధువగ్గం పి ఖిచ్చయణు, సుహి సజ్జణు వి ఘరి కలత్తు అణాఅడిజ్జఉ, అత్థుష్మ కిల ఘురిఘురయి జావ, తావ ఫుణ్ణోహిం సమగ్గలు-(చఉప్పంచాశన్మహాపురుషచరిత్ర.)

(౧౨) చాఉరంగిజ్జం - చత్తారి పరమంగాణి దుల్లహాణీహ జంతుణో. మాణుసత్తం సుయీ సద్ధా పంజమం మియవీరియం, సమావన్నాణసంసారే నాణాగోత్తాసు జాయిసు, కమ్మా నాణావిహాకట్టు పుత్తో విస్సం భియా, పయా, సముద్దగంభీరసమా దురాసయా అచక్కియా కేణవి దుప్పహంసయం, మయస్స పుణ్ణా విఉలస్స తాయిణో ఖవిత్తు కమ్మం గయి ముత్తమం గయా.

ఇది ఏగ్రంథకర్తదో తెలియదుగాని, రెండువేలశ్లోకాలూ 40 కథలూ గలగ్రంథం. చాలా ధారాళమైనరచన. ఎన్నో లోకోక్తులు. చక్కనివాక్చాతుర్యం కలిగి వున్నది. ఇంతకంటెను దీన్ని గురించినవివరం తెలియదు.

(౧౩) జంబూచరియం - కర్త ఎవ్వరో తెలియదు. కాని ప్రద్యుమ్ననాది పట్టధర వీరభద్రాచార్యుల శిష్యుడట.

శ్లో. నమిఊం దుక్ఖరంతసమత్థసత్థసత్థభవజలహితారణసమత్థే పాయే చక్ఖుంకుసకులిసలంఛియే జిణవరిం దాణం. ♦ ♦ భవ్వకుమోవనోహపడిబోపంపచ్ఛలో పావతిమిరనిత్థవణో ఆసీ ససివ్వపరలో సూరీ పజ్జున్నవరణామో జో దంసణణాణచారిత్తసీలతవసంజమేను కుసలమయిా, జయియణ గుణగణకవిరయా ముత్తిధమ్మో య అవయరియో, తస్స య పయంమి జాయా ఆయరియో వీరభద్దణామోత్తి, పరిచింతియదిన్నఫలో ఆసీ సో కప్పరుక్ఖోత్తి. జస్స య సీసో పయడో పయడియమూఢత్తపరమత్థో, దంసణచారిత్తధరో సూరి పజ్జున్నణామో త్తి, అన్నేవి జస్స బహవే సీసా జయియణగుణేహిం పరికలియా, సంజాయా ధమ్మరయా సద్దంసణణాణచరణ పావడ్డా. గుణపాలణేక్కణిత్తేణ సాహుణా పవయణభత్తేణ సీసేణ తస్స రయియం చరియ మిమం జంబుణామస్స.

(౧౪) జినదత్తాఖ్యానం — సమతిగణి రచించిన ప్రాకృతకావ్యం, జినదత్తకథ అని జినదత్తచరితఅని మరిరెండుగ్రంథాలు కూడా వున్నవి. కాని అవి సంస్కృతములు. సుమతిగణి నేమిచంద్ర సూరిశిష్యుడు. గొప్పజ్ఞాని.

శ్లో. జయఊ విణిజ్జియదుజ్జయ దురంతకందప్పదప్పమాహప్పం దుత్తకమ్మదోగట్టకేసరీ జిణవరో వీరో ఆసీ అసేసమేయిణిఅస్సంతభమంతకిత్తిపబ్భారో, సిరినేమిచందసూరీపాడిచ్ఛయగచ్ఛకప్పద్దుమో, చందోవ్వఅమలముత్తీ సూరోఇవ సత్తవాయిసంపణ్ణో, సింధువ్వవివిహరయణోవశోహిరయా నీరసహిహిరయాయజో సో ఉత్తమగుణరయణవిఉలనిద్దోసకోసభూయేహిం, సిరిసవ్వదేవసూరి థావిరయాఉత్తమపయంమి.

(౧౫) ధమ్మవిహి :— దాదాపు 12వందలఏళ్ల కాలకు తక్కువలేనిప్రాకృతగ్రంథం. జినధర్మం వెల్లడిస్తూ వ్రాసినగ్రంథం. అతిసులభమైనరచన, అనేకగ్రంథాలను సంగ్రహించి చెబుతున్నానని చెప్పుకొంటాడు. కర్త ఎవరో ?

శ్లో. కిణ్ణావారనరకిన్నర...వయిసిరమఉడఘుట్టపయపీఢం. సిరివచ్ఛం కియవచ్ఛం పణమామి జిణేసరం రిసభం, వోచ్ఛమహం ధమ్మవిహిం సమత్థసత్థాణ ఉద్ధరేఊణ, భవియజణబోహణత్థం సుసంచయా నన్నసూరీహిం. ♦ ♦ ధమ్మవిహిప్పగరణ మిమం విసోహగం ణాణదంసణగుణాణం, దసదిత్థంతేహిం జుయం సమ్మత్తం దేవు సివసోక్ఖం.

(౧౬) దాఢావంశో :- ఇది సుప్రసిద్ధగ్రంథం. రిచ్చర్డు మోరిసు (M. A.) మున్నగు పాశ్చాత్యపండితులూ, భాండార్కరు మొదలయిన ప్రాచ్యపండితులూ దీనిపైని ఎన్నెన్నో చర్చలు సలిపారు. 1884 లో మొదటిసారి అచ్చు పడ్డది. కవితాశైలి చూపడమే నాపని. గనుక మచ్చుకు ఒకటిరెండు పద్యాలు :-

శ్లో. వికారయం వాయపవాతివత్తినం తిలోయపుజ్జం తమసవ్వకాహినం. అసేసనేయావరణప్పహాయినం నమామి సత్థార మణంతగోచరం, తిలోయణాహప్పహవం భయావహం విసుద్ధవిజ్జాచరణేహిం సేవియం పపంచసణ్ణోజనబంధనచ్ఛిదం నమామిధమ్మం నిపుణం సుదుద్దసం, పసాదమత్తేవియ జత్థ పాణినో ఫుసంతి దుక్ఖక్ఖయం అనచ్చుతం పదం తమాహనేయం సుసమాహితేంద్రియం నమామి సంఘం మునిరాయసావకం. విభూసయం కాలకనాగరాన్వయం పరక్కమో కారుణికోయా చమూపతి, గవేసమానో జినసాసనస్స రయా విలోకియమత్థానజనస్సవత్తయం.

(౧౭) నేమిచరియం:- ఇది మలధారిహేమచంద్రునికృతి. ఈయన భవభావనావృత్తి మొదలయిన గ్రంథాలు వ్రాశాడు. దాదాపు వేయిశ్లోకాలుగలగ్రంథం. ౧౧ వ శతాబ్దిదని కొందరూ ౧౦ వ శతాబ్దిదని కొందరూ అంటారు.

శ్లో. అజ్జవి జస్స పవత్తయి ధమ్మో నీయీ య భరహవాసమ్మి తం పణమ జిణవరం పణివయామి ణిద్దలియదురిరోహం.

ఇందులో నేమినాథుడు తొమ్మిదిభవములలో చేసినవృత్తాంతములు సరసంగా కూర్చబడి వున్నవి.

(౧౮) నర్మదాసుందరీచరియం :- ఇది మహేంద్రసూరి రచించినది. ప్రాకృతభాష. ఇందులో శీల మాహాత్మ్యం హెచ్చుగా వర్ణితమై వున్నది. శీలోపదేశమాలావృత్తి మొదలయిన గ్రంథాలలో ఈకథ వస్తుంది.

(౧౯) నేమినాథచరిత్ర:- హరిభద్రసూరి రచించినది. ఈయనే ప్రాకృతంలో - చఉవీసజిణపుంగ వచరియరయణాభిరామసింగారో-అని తాను చతుర్వింశతిజిన పుంగవచరిత్ర వ్రాశానని చెప్పు కొంటాడు. ఎనిమిదివేల శ్లోకాలు గల గొప్పకావ్యం. చాలా రసవత్తరంగా వుంటుంది అంటారు. అచ్చుపడలేదు. లయతాళం - వడక విచిత్రంగా నడుపుతూ ఇప్పటికీ జైనపండితులు గానంచేస్తారు ఇందులోనిగీతాలను.

మచ్చుకు- (ఆరంభంలోనే) (౧) దుహవివయడియ కరణ ఆయారు, దుహదంసియ ధమ్మనిహి

దుహనమంతవిమయపారణు

దుమకమణాణందయరు, దుహసువణ్ణరయణప్పహావణు

మహానుహా వియరియ విమలగుణరాసి జలహిరయణిందు

పణయనురాసురవరనియరకయథుయి రిసహ జిణిందు.

(౨౦) నలాయణం - మాణిక్యసూరి రచించింది. కుబేరపురాణం - అని కూడా ఇంకో పేరు వుంది. ౧౨ శతాబ్దివాడు. ఇది పదిస్కంధాలున్నూ ఒక్కొక్కదానికి పదేసిసర్గలున్నూ గల మహాగ్రంథం. యశోధరచరితం అనుభవసారం మొదలయినగ్రంథాలు వ్రాసినట్లు చెప్పుకొన్నాడు. ఇది ఇంకా ముద్రితం కాలేదు.

(౨౧) పంచమీకహా:- మహేశ్వరసూరిది. అచ్చైంది. భవిస్సయత్తకహా (భవిష్యద్దత్తకథ) అనికూడా మరోపేరున్నది. అపభ్రంశప్రాకృతంలో వ్రాయబడిన మహాగ్రంథం. చక్కని శైలి. మంచి కథాగ్రంథము కూడాను. గ్రంథకర్త తననుగురించి కేవలం - సజ్జనోపాధ్యాయశిష్యుణ్ణి అను కోవడం తప్ప మరేమీ చెప్పుకోడు. ప్రాకృతభాషలో ౨౦౦౦ శ్లోకాలకు మించినగ్రంథం. పది పెద్దకథలు ఇందులో వున్నవి.

శ్లో. దోపక్ఖుజ్జోయకరో దోసాసంగేణ వజ్జిరో అమరో, సిరిసజ్జణఉజ్ఝాయో అవ్వుచ్చంద్దువ్వ అక్ఖత్థో, సీసేణ తస్స రయియా దసవి కహాణాయి మేఉ పంచమిరో, సూరిమహేసరేణం భవియాణం బోహణట్ఠారో.

(౨౨) పంచమీకహా:- ధనపాలమహాకవిది. ఇదిన్నీ దాదాపు అంతటిగ్రంథమే. వాఙ్మయపరిశ్రమి కులకు ఇందులో ఎన్నెన్నో వింతలూ విశేషాలూ కనిపిస్తవి. కథ మహేశ్వరసూరిగ్రంథంలోదే. పాకం వేరు.

(౧) అహిణవరంభగబ్భసోమాలఉ
ధణవయుషురిబరిబద్ధయిబాలఉ
కమలసిరిహేపీణుణ్ణయసట్టయం
పిల్లివిహోకుపియయి ధణవట్టహిం

(౨) హత్థి హత్థు భమయిం జణకిందవహో
చరియసుహావహు సుత్థు ణరిందహో
ణరణాహిం సయిం అంకిలయిజ్జయి
చామరగాహిణీహిం విజ్జజ్జయి.

పరమ విలాసిణీ హిం చుం బిజ్జయి అణ్ణహిం పాసిదు అణ్ణహిం విజ్జయి.

(౨౩) కుమారపాలప్రతిబోధ:- సోమప్రభాచార్యరచితం. చక్కని రచనం. గద్యపద్యాలలో రచన పరుగు లెత్తుతూవుంటుంది. ముద్రితమైంది. బరోడావారి సంస్కృతగ్రంథమాలలో. ఉదాహరణం (నలునికథనుండి)-

రణ్ణా భణియం - కో ఏసో నళో ? గురుణా వుత్తం - సుణు! శ్లో. అత్థి ఇహ భరయఖిత్తే కోసలదేసమ్మి కోసలాణయరీ, జాయాంతిగుణావసణస్స హేయాణో జత్థ అచ్ఛరియం, శ్లో. ఇక్ష్వాగుకులుప్పణ్ణో నిరువమనయచాయలిక్కముప్పళ్ళో, అరిపత్థియదువ్విసహో నిసహో నామేణ తత్థనివో.

తస్స సుందరీదేవీకుక్షిసంభూయా జణమణాణంద హేదుణందణా నలో కూబరోయ. విదబ్భ దేసమండణం కుండిణం నయరం, తత్థ అసంఘసింహాసరవో భీమరవో రాయా. తస్స సయలం తేవురతరుపుప్పం పుప్పదంతీదేవీ !

(౨౪) పృథ్వీచంద్రచరియం - దీనిని శాంతిసూరిపండితుడు విక్రమశకం ౧౧ శతాబ్దిలో రచించాడు.
శ్లో. జగతీసాహియసోలసమయేహిం వాసాణనివ్వుయేవీక త్తియచరమతిహియే కిత్తిఉక్ఖేపరినమత్థం.

(౨౫) పార్శ్వనాథచరియం - దేవభద్రసూరి రచించాడు. ౯ వేల శ్లోకాలుగల ప్రాకృతగ్రంథం ఇంకా అచ్చుకాలేదు.

(౨౬) లీలావయీకహా:- దీనినే లీలావతీ అనికూడా అంటారు. ఇది ౧౯౨౩ గాథలు ఉన్నదని చాలా మంది ఎరగరు అందులో తెలుగువారికి దీనిని ఎరుకపఱచింది శ్రీయుతులు మానవల్లి రామకృష్ణ కవిగారు. ఇందులో శాతవాహనమహారాజు సింహళద్వీపపు రాజకుమారిక సంయోగము ఉపవర్ణిత మైనది. దీనిని రచించినకవి తనపేరు చెప్పుకొనలేదు. అసారమతి యని తన్ను గా చెప్పుకొన్నాడు. కవి తాత బహళాదిత్యుడనీ, తండ్రి భూషణభట్టు అనీ, వారిద్దరు నాల్గువేదముల నధిగమించినవారనీ యజ్ఞయాగాదిక్రియాకర్మఠులనీ చెప్పుకొన్నాడట. హేమచంద్రాచార్యుని కావ్యానుశాసనమునందున్నూ వల్లభాచార్యునివ్యాయలీలావతియందున్నూ భోజదేవుని దొత్యప్రకాశం లోనూ - ఈలీలావతి పేర్కొనబడినదట. రామకృష్ణకవిగారు గ్రంథకర్తకాలం షుమారు క్రీ ౬-౭ శతాబ్దులమధ్యనై యుండునవనిన్నీ, లాల్చందుభగవాన్ దాసు గాంధిగారు ౧౨వ శతాబ్దిలోనో అంతకుపూర్వమో అయి వుంటుందనిన్నీ నిర్ణయిస్తూ వున్నారు. కథావస్తువు మిక్కలీ మనోహరంగాను శోకకరుణారసాలు వెల్లివిరిసేట్టున్నూ వర్ణింపబడ్డది అంటారు. గ్రంథం నేను చూడలేదు. రామకృష్ణకవిగారు కాపీచేయించి తెప్పించారని వింటున్నాను. ఈక్రింద ఉదాహరించే శ్లోకాలు కవిగారివ్యాసంలోనూ గాంధిగారిపుస్తకసూచిలోను ఉద్ధరించి ప్రదర్శించినవి అని చదువరులకు మనవి.

(ప్రారంభంలో) శ్లో. నమహ సరోససుందరియ సణసవ్వవియం కరరుహావలీజాయలం, హరిణక్కసవియడోరత్థలత్థిదలగబ్భిణం హరిణో (౧) తం ణమహ జస్స తయియా తయియాదయం తిహువాయణం తులంతస్స, సాయారమణాయారే అప్పణ మప్పచ్చియ నిసణ్ణం. (౨) తస్సేవ పుణో పణమహ నిహాయం హావిణా హసిజ్జమాణస్స, అపహుత్తదేహకిలంథుణద్ధరహాసం శియం చలణం. (౩) సో జయఉ జస్స పత్తో కంఠేరిత్థాహురస్స ఘణకసణో, ఉప్పాయపవడ్ఢియకాలవాలకారిణీ భుయప్పవిహో. (౪) రక్ఖంతు వో మహోవహిసయణే సేసస్స ఫణిమణిపయీవా, హరిణో సిహిసిహిణోత్థయకోత్థహంకందంకురాయారా. (౫) హరిణో జమలజ్జుణరిత్థకేసికంసస్స కురింద సేలాణ, భంజణవళణవియారణకట్టణధరణే భుయే ణమహ. (౬) కక్కసభుయకోప్పరభూరియాణణో కఢిణకయకరాలేసో, కేసికిసోరకయత్థణకఉజ్జమో జయయి మహుమహణో, (౭)సో జయఉ జేణ తయలోయకవలణారంభగబ్భియముహేణ, ఓసావణి వ్వ పీయా సత్త వి చులయత్థియా ఉవహియా. (౮) ♦♦♦ అహవా - (శ్లో) సో జయఉ జేణ సుయణా వి దుజ్జణా ఇహ వినిమియా భుయణే, న తమేణ వినా పావంతి చందకిరణా వి పరిహోవం. (౧౩) దుజ్జణసుయణాణ ణమో ణిచ్చం పరకజ్జ వావడమణాణ, ఏక్కే భసణసహావా పరదోసపరంముహా అణ్ణే. (౧౪) అహవా న కోవి దోసో దీసయి సయలంమి జీవలోయమ్మి, సవ్వో చ్చియ సుయణయణో జం భణిమో త్తం నిసామేహ. (౧౫) ♦♦ ఆసి తివేయతిహోమగ్గిసంగసంజాయణి యతియసపరిగోసో, సంపత్తతివగ్గఫలో బహులాయిచ్చోత్తి ణమేణ. (౧౯) అజ్జవి సహగ్గిపసురియధూమసిహాకలుసియం వ వచ్ఛయలం, ఉవ్వహయి మయకలంకచ్ఛలేణ మయలంఛణో జస్స. (౨౦) తస్స య గుణరయణమహోవహీయే ఏక్కో సుఓ సముప్పణ్ణో, భూసణభట్టో ణామేణ నియయకులణహయలమయంకో. (౨౧) జస్స పియబంధవేహిమ్మి చఉవయులిణ్ణగయేహిం వేయేహిం, ఏక్కవయణారవిందట్ఠియేహిం బహుమణ్ణిఓ అప్పా తస్స తణయేణ ఏయం అసారమయిణా వి విరయియం సుణహ, కోఊహలేణ లీలావయి త్తిణామం కహారయణం (౨౩)

ఈక్రింది శ్లోకాలు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు - (క్రోధనమాఘమాసపు) భారతిలో లీలావతీ కావ్యాన్ని గురించి పుష్పాంజలి అనే పేరుతో వ్రాయుచు ఉద్ధరించి వ్యాఖ్యానించినవి. శ్రీవారు లీలావతీకావ్యాన్ని కాపీచేయించి తెప్పించారనీ దానిని ఆంధ్రంలోకి తర్జుమాకూడా చేయించారనీ తెలిసింది కొందఱుమిత్రులద్వారా. ఎప్పుడు వస్తుందో. వీనిలో (౧౭వది) శాతవాహనుని గ్రంథం చివఱ పేర్కొన్నది. 2, 3, 4, 5 లు భోజదేవుడు అనురాగపత్రికలో - 821, 485, 487 గా పేర్కొన్నారనీ, వారే చెప్పారు. ఆరోది ప్రాకృతప్రాశస్త్యాన్ని తెలిపేది లీలావతిలోనిదే. ఏడువది లీలావతిలో 777 వ పద్యమట. 8, 9, 10, శాలివాహనవర్ణనసందర్భమువి. 11 వది లీలావతిలోని మధుపానవర్ణనలోనిదట. 12, 13, 14 - లు ఆంధ్రదేశంలోని చారిత్రకప్రాంతాలను వర్ణించేవన్నీ అసలు లీలావతిలో - 190, 242, 1147, సంఖ్యగల శ్లోకాలున్నా, 16, 17 శాలివాహనుని హాలత్వస్ఫోరకాలు. 18, 19 లు నాగార్జునప్రశంసాకములు. 20-21 సింహళవర్ణనపరములు. చదువరులు ఈ ప్రతీతులు మనసువందుంచుకొని ఈక్రిందిపద్యములు చదువవలయును అని ప్రార్థితులు.

(౧) శ్లో. జయి వఢయి సాయళాయణ గంధవ్వకళంజ...తుంబురుణా, సరయవిణోదేణ కిదం ణాడయగేయం సలక్ఖణం యేదం, (౨) తా కిం బహు యేహింమ్హి చింతియేహిం వళణాయణో వణో హోయి, విత్తాహివస్స తణయా గయముహ మహతుహపసాయేణ. (౩) జం అణుయియం కుమారిఅణస్సలజ్జాయే సాహియకులస్స, తం సవిసేసం పియసహి మహ హాయహియయేణ పారద్ధం. (౪) తం సిద్ధకుమారం పేచ్ఛియూణ ఏయేహిం సహియణక్ఖేహిం, అవిణయమగ్గో హాయలోఅణాహిం సీయమ్హ కిం భణిమో. (౫) ణ సహాయి కాలక్ఖేవో హియయయం మహ మయణవాణ ఆవహాపత్తిత్తం, తస్స వి సందేహగయం నిసుయం చియ తయే వి. (౬) భణియం చ పియయమాయే రయియం మరహట్టభాసాయే, అంగాయిం ఇమా కహాయే సజ్జణా సంగజోగాయి. (౭) అహ కహ వేయజడస్స తస్స విసయాహిలాసవిముహస్స, నిప్పజ్జులోయపియామహస్స ఏవంవిహం రూపం. (౮) జో సో అవిగ్గహో వి హు సవ్వంగావయవసుందరో సుహయో, దుద్దంసణో వి లోయణలోయణాణం దసంజణో. (౯) కువయా వి వల్లహో పణయి యాణ తహ నయవరో వి సాహసియో, పరలోయభీరుయో వి హు వీరకక్కరసో తహచ్చేయ. (౧౦) సూరో వి సత్తాసో సోమో వి కలంకవజ్జియో నిచ్చం, భోయీ వి న దోజీవో తుంగో వి సమీవదిన్నఫలో. (౧౧) పవిహోయిం వివిహవణ్ణుజ్జలాయిం సహయావసురహివాసాహిం, నీలుప్పలపరిమళ వాసియాయిం దిజ్జంసి పాణాయిం. (౧౨) తం సత్తముహవిహత్తంబునివహనిద్ధోయ కలిమలుప్పంకం, కహకహవి దేవ సుయిరేణ సత్తగోయావరీభీమం. (౧౩) ఇయతస్సకణయదేవాలయస్స దాహిణదిసాయి అణులగ్గం, గోలాణయివయణవినేసయం వరమ్మం మతాయయణం, (౧౪) ఏవం భణికూ సో తేణ నరవయియాకణియేహిం దియహేహిం. సంపత్తో కమలదళచ్ఛి సత్తగోయాయరీభీమం. (౧౬) తో గురువయణేణ ఏసా తం చియవహుమన్నిఊణ తహ భణియం, సవ్వాయరేణ హాలస్స పేసియావచ్ఛవహో పవహో. (౧౭) బహుమన్న తో తం చియ మరణం సంతో సదిన్ననియహియయా. (౧౮) సాయజ్జుణోవరోహేణ నిగ్గయో నియపురాహిం తో. (౧౯) సాయజ్జుణ భిక్ఖుపురస్సరేణ సరిలీరసంతియో రాయా, విజయాణం దేణసమం వివరాహత్తం పరిక్కంతో. (౨౦-౨౧) లక్ఖిజ్జయి అజ్జవి గుంజరాళికులవలయవాయులలఆహిం, మహణుత్తిణ్ణో రావణ్ణమగ్గో సత్తిచ్ఛయతరూహిం, సేవిజ్జయి సరసో హంసకణయభవణేసు సిద్ధమిధుణేహిం, జమ్మిలవంగేలావణ పరిమళవాసియా పవణో. (ఇత్యాది)

(౨౭) వసుదేవహిండీ:- ఇది సంఘదాసవాచకులు రచించినది. ప్రాకృతభాషలో అతివిస్తృతములుగా వ్రాయబడ్డ వసుదేవచరిత్రల్లోకి ఇది మిన్న. ఈయన హరిభద్రసూరికంటెనూ ప్రాచీనుడనిన్నీ మహాప్రపంచకల్పభావ్యం మొదలయినగ్రంథాలు ప్రాకృతంలోనే వ్రాశాడనిన్నీ అంటారు.

(౨౮) విలాసవతీకథ:- ఇది ౧౧ సంధులుగల గొప్ప అపభ్రంశభాషాకావ్యం అనీ, సమరాయిచ్చకహ-లోనుండి ఉద్ధరించి పెంపుచేయబడ్డదనీ, కనే చెప్పుకొన్నాడు. కావ్యంవు అరంభం అంతం ఇల్లావున్నది :—

(ఆరంభం) బహురయణమణోహారు నిమ్మలపయహారు సగుణు సువణ్ణాహిత్తియవు
భణ కస్స న సోహాయి నయణు మోహాయి కవ్వహారుకంఠట్ఠియహు
ఘడియం పణమేవిణు ఉసహసామి పుణు అజిఉవి వినిజ్జియభయయుధుణామి
సంభవు భావేవిణు భవవిణాసణు వందిలి అభినందణు గుణనిహాణు.

(అంతం) పాణిజ్జమాలయూాలే కోడియగణవిఉలవయిరసాహాయే, విమల మియచందఉలే వంసమ్మియ కవ్వకలాణం, సంతానేరాయసహ నిహారిసిరిభప్పభట్టిసూరిస్స, జసభద్దసూరిగచ్ఛే మహు రాజేసే సిరోహాయే, అసి సిరిసంతిసూరీ తస్స వి సీసో జడమయిరూ, సాహారణో త్తిణామం సుప సిద్ధో అత్థి పుర్వణామేణం.

(మధ్య) జణ ఏక్కఖణంతరు ఖంతు దేవు అఖ్ఖంమి ధమ్మఖ్ఖరు తం సుణేవు, జాయ దూమిజ్జయి అణ్ణు లోఉ తా వరి కిఉ ధమ్మకహావిణోవు. జావయ పరిదత్తిహిం జాయి కాలు తావరి పరిభావిఉ కమ్మజాలు, సవ్వహో పరదోసుప్పాడణేణ గుణు కవయు హోయి చింతహు మణేణ.
(ఇత్యాది.)

(౨౯) వ్యవహారవివరణం - ఇది ఎవరుచేశారో తెలియదు. ప్రాకృతంలో వ్రాయబడినగొప్పభాష్య గ్రంథం. వ్యవహారమార్గభాష్యం అనికూడా దీనికి మరో పేరు. చాలాశాస్త్రచర్చ గల గ్రంథం.

(౩౦) వజ్జాలగ్గం - ఇది చక్కని అలంకారగ్రంథం. సరసమైనకృతి. కవిత పరుగెత్తుతూ పోయి అనిపిస్తుంది. కావ్యశోభలూ లక్షణశోభలూ రెండూ ఉన్నవి. దాదాపు వేయిశ్లోకాలకు పైగాగల గ్రంథం. అన్ని కావ్యభాగాలు (వ్రజ్య) వజ్జలలో విభక్తాలు అయినవి. వజ్జాలగ్గగ్రంథకర్త జయవల్లభసూరి అంటారు. మచ్చుకు సోయారవజ్జ (శ్రోత్రృవ్రజ్య) లోనుండి కొన్నిశ్లోకాలు. దీన్ని ఏఅనంతకృష్ణశర్మగారో ఆంధ్రీకరిస్తే ఎంతో ముచ్చటగా ఉంటుంది. కవి ఏకాలంవాడో నేను చెప్పలేను.

శ్లో. దుక్ఖం కీరయి కవ్వం, కవ్వమ్మి కిఏ పఉంజణా దుక్ఖం, సంతే పఉంజమాణే సోయారో దుల్లహా హోంతి. సక్కయం అసక్కయం పిహు అత్థో సోయారసంగమవసేణ, అప్పువ్వరస విసేసం జణేయిజం తం మహచ్ఛరియం. ముత్తాహాలం వ కవ్వం సహావవిమలంసువణ్ణసంఘడియం సోయారకణ్ణకుహరమ్మి పయడియం పాయడం హోయి, [కవ్వవజ్జనుండి-అంటే కావ్యవ్రజ్యనుండి-మరికొన్ని]-సద్దావసద్దభీరూ పయేపయే కింపి కింపి చింతంతో, దుఃఖేవి కహవి పావయిచోరో అత్థం కయిా కవ్వం, సద్దపలోత్తం దోసేహిం వజ్జియం సులలియం ఫుడం మహురం, పుణ్ణేహివి కహ పావయి ఛందే కవ్వం కలత్తం చ. అణవరయబహులరోమంచకంచుయం జణియజణమణాణం విదం, జం ణ ధుణాణయి సీసం కవ్వం పేమ్మం చ కిం తేణ ?

దీనిఅర్థం ఇదీ:- కవి అతికష్టపడి కావ్యం చేస్తాడు. చేసింతర్వాత దాన్ని లోకంలో ప్రచారానికి తీసికోరావడానికి చాలా కష్టపడతాడు. ఒకవేళ ప్రయోగించినా (ప్రచారానికి తెచ్చినా) వినేవాళ్లు దుర్లభం అవుతారు. సంస్కృతంకానీండి అసంస్కృతకావ్యం కానీండి, అర్థస్ఫూర్తి అనేది వినేవారు లభించడంపైని ఆధారపడివుంటుంది. అట్లాంటిశ్రోతలు దొరికే, అది అపూర్వరసవిశేషాన్ని గలిగించడం అనేది చాలా వింతఅయినవిషయం. ముత్యాలకోవలాగా కావ్యం

సహజంగా విమలంగానూ స్వర్ణసంఘటితంగానూ ఉంటుంది. శ్రీకలకణ్ఠకుమారాల్లో ప్రవే శించి ప్రకటం అవుతుంది. (కవ్వవజ్జ) శబ్దమే వస్తుందో అపశబ్దమే వస్తుదో అని భయపడుతూ వున్నవాడై మాటమాటకూ ఏమేమో ఆలోచించుకొంటూ ఎల్లాగో [కవిత] దొంగ సొమ్ముకోసరం కవి కవిత్వంకోసరం కష్టించి పొందగలుగుతారు. పదాలపొందికా- దోషవర్జనం - లాలితమూ విస్పష్టతా, తీయందనమూ అనేవిగల భార్యానూ కావ్యమునూ ఎంతో పుణ్యంచేతనే లభిస్తాయి. సదా రోమాంచాన్ని గల్గిస్తూ విన్నవారికి ఆనందాన్ని వెల్లివిరియిస్తూ, తల పంకింపచేస్తూ వుండనట్టి కావ్యమున్నూ ప్రేమా కూడా నిష్ప్రయోజనాలు - అని తాత్పర్యం ఏర్పడుతుంది.

(3౧) శాంతినాథచరియం - దీన్ని ప్రాకృతంలోనే పన్నెండువేలశ్లోకాలగ్రంథంగా రచించాడు దేవచంద్రసూరి. సుప్రసిద్ధుడై సంస్కృతప్రాకృతాలలో ఆచార్యుడని పేరుపొందిన హేమచంద్రాచార్యునికి ఈయన గురువు. ఇంతవఱకూ అచ్చుకాలేదు ఈ గ్రంథం. ప్రాకృతపరిశ్రమికులకు నిధి. జేసల్మేరు భాండాగారంలో వున్నది.

(3౨) శత్రుంజయోద్ధారం:- బుషభదాసు. ఈయన రాజపుత్రుడని కొందరూ, కాదు సాంగణ శ్రేష్ఠివంశంవాడనికొందరూ వివదిస్తారు. అతిప్రాచీనమైన ఘూర్జరప్రాకృతంలో ౧౦ వేల గ్రంథంగా దీన్ని ఈయన వ్రాశాడు. ప్రాకృతం పరిశ్రమచేసేవారికి అమోఘములయిన ఎన్నో దేశిపదాలూ వృత్తాలూ అద్భుతంగా ఇందులో లభిస్తవి.

(33) సమరాయిచ్చకహా - సాధారణాంక సిద్ధసేనసూరి రచించాడని కొందరూ, హరిభద్రుడిదని కొందరూ వాదిస్తారు. అచ్చైంది. చాలా గొప్పగ్రంథం. శైలి ఉయ్యాలలు ఊగుతూ వుంటుంది గద్యంలో పద్యంలోకూడా శైలినిబట్టి హరిభద్రుడిదే అనడం న్యాయ మనిపిస్తూ వుంది. కొంచెము మచ్చుచూడండి కవిత. ఎల్లాంటిదో.

(ప్రారంభం) పణమహ విజియసుసుజ్జయ నిజ్జియసురమణుయవిసమసరపసరం, తిహుయణమంగళనిలయం వసహగయిగయం జిణం ఉసహం, (౧) పరమసిరివద్ధమాణం పణ్డమాణం విసుద్ధవరణాణం, గయజోయం జోయీసం సయంభువం వద్ధమాణం య, (౨) సేసేవి య వాసీసే జాయిజరామరణబంధణవిముక్కే తేలోక్కగుత్థయత్తేతి తిత్థకరే భావమోణమహా, (3) దేహానుహం వో సురసిద్ధమణుయవందేహిసాయరం నమియా, తిత్థియరవయణపంకయవిణిగ్గయా మణుహారా వాణీ. (౪) అలం పవిత్థరేణ !, సుణహ సోయవ్వాయిం. పసంసహ పసంసయియవ్వాయిం, పరిహారహ పరిహారియవ్వాయిం ఆయరిహ ఆయరియవ్వాయిం, తత్థ, శ్లో. సోయవ్వాయి ణరామరసివసుహజణయాయి అత్థసారాయిం, సవ్వన్నుభాసియాయిం భువణంమ్మి పయత్తియజసాయిం (శ్లో) తాయిందియవిజుహాణం పసంసణిజ్జాయి తహాయజాయిం చ, తేహిం చియ భణియాయిం సమ్మత్తన్నాణచరియాయిం.

(3౪) సముద్దపాలీయం - గ్రంథకర్త పేరేమో తెలీదు. కాని చక్కనిఅనుష్టుప్పుల్లో ౫౦౦ శ్లోకాల. గ్రంథం ఉన్నది. చక్కనికథలు. శైలి ప్రశస్తమైనదే. రెండుశ్లోకాలు ఉదాహరణార్థం.-

శ్లో. చంపాయే పావియేణామ సావయే ఆసి వాణియే, మహావీరస్స భగవయో సీసే సో ఉ మహప్పణో, నిగ్గంథే పావయణే సావయే సేవి కోవియే, పోయేణ వవహారం తే పిహుండం నగరం

మాగయే. పిఅంద్దే వవహారంతస్స వాణిరో కేయి ధూయరం, తం సమత్తం పయిగ్జిసకేస పత్థిరో.

(౩౫) సుమతినాథచరిత్ర:- గ్రంథకర్త ఎవ్వరో తెలియదు. కాని ౯౫౦౦ శ్లోకాలుగల మహాగ్రంథం.

(౩౬) సూక్తిముక్తావళి - లేక సిందూరప్రకరం - దీనికే సోమశతకం అనికూడా మరోపేరు ఉంది. చక్కనిశయ్యా ధారాశుద్ధీ గల కవిత్వం, అతి సరసంగా వున్నది.

(౩౭) హితోపదేశామృతం:- ౫౦౦ గాథావృత్తాలతో ౬ కథాభాగాలుగా వ్రాయబడినది. అచ్చు కాలేదు. కాని చక్కనిరచనగల గద్యపద్యమయమైన ప్రాకృత కథా గ్రంథం.

(చివర) సిరిఅభయదేవమునివయి వినేయసిరిదేవభద్దసూరిణం, అనివుణమయాహిం సీసేహిం సిరిపగమాణంద సూరీహిం. గాహాణం సంఖాయే పంచసయా పంచవీసహియా (౫౨౫) నమియ సురాసురసిరల్హా సిరసరసమందారకుసుమరేణూహిం, నిమ్మజ్జియపయవాదప్పణే పణమిమో సిరసా.

(౩౮) సేతుబంధకావ్యం - ప్రవరసేనుడిది. దండిపండితుడని కీర్తిగన్న దండిపండితుడి ప్రశంసగన్న కావ్యం ఇది. ఉత్తమప్రాకృతమయిన మహారాష్ట్రిప్రాకృతంలో వ్రాయబడ్డది. గ్రంథం అచ్చై సులభసాధ్యంగా వున్నందున ఒకటిరెండు శ్లోకాలే ఉదాహరిస్తాను. జగమెరిగిన బ్రాహ్మడికి జందెం ఎందుకూ ! ౧౫ ఆశ్వాసాల గ్రంథం, శాస్త్రాకూస్తా కాదు. కావ్యమాలలో ప్రకటిమైంది. ఈగ్రంధానికి కవిపెట్టిన అసలుపేరు రావణవహా మని. అయినా సేతుబంధమనే లోకంలో విఖ్యాతి పొంది వున్నది.

శ్లో. ణమహ అవఢ్ఢియతుంగం అవసారియవిత్థయం అణోణయగహిం, అప్పలహుయ పరిసంగం అణాయపరమత్థపాఉడం మహుతుఉణం, దణుయేందరుహిరలగ్గే జస్స ఫురం తేణాఫుహావిచ్ఛడ్డే గుప్పం, తీవివలాయా గలియవ్వధణంసుయే మహాసురలచ్ఛీ. ♦♦ అహిణవరాయారద్ధా చుక్కఖలిరేసు విహాతియపరిగ్గవియా, మేత్తిన్వపముహారసియా ణివ్వోఢుంహోయి దుక్కరం కవ్వకహా. ♦♦ తం తిదసబందిమోక్ఖం సమత్తతేల్లోక్కహియయసల్లుద్ధరణం, సణయి అణురాయఇణ్హాం సీయా దుఖఖయం దహముహస్సవహం, ♦♦ గమియా కలంబవాయా దిట్ఠం మేహంధయారియం గయణయలం, సహిరోగజ్జియసద్దో తహ వి హుసేత్థి జీవియా ఆసంగో, ♦♦ దిట్ఠత్తిణ సద్దహియం సచావామంథరం తీసనీయం. సోయయి తుయం తిరణ్ణం పహుణా జీయయిత్తి మారుయా ఉవహోఢో.

* కవిరాజు - ప్రాకృతాదికవులస్థానం *

ఈల్లా వుదాహరించడం సాగిస్తే అంతుముట్టడం కష్టం, కాబట్టి ఈవిషయం ఇంక కొంచెం కట్టిపెడతాను. ఇంతవఱకూ ప్రాకృతం అంటే నాటివ్యవహారికమైన శిష్టభాష అనీ, అది తొల్లిటికాలంలో లాక్షణికులూ ఆచారపరులూ మున్నగువారిచేత తిరస్కరింపబడ్డా, అతర్వాత శిష్టులూ ప్రమాణభూతులూ అయిన పండితులూ కవులూ గ్రంథకర్తలూ దార్శనికులూ కథకులూ అభాషలోనే గ్రంథాలు వ్రాసీ, లక్షణాలు అలంకారశాస్త్రాలు ఏర్పరచీ వుండడంచేతనున్నూ, మతప్రచారకులున్నూ మతకర్తలున్నూ దానికి అగ్రస్థానం ఇచ్చి పోషణాహం చూపడం చేతనున్నూ, అప్రాకృతానికి గ్రం

ధప్రయోగాగ్నతా గ్రంథసమృద్ధీ లక్ష్యలక్షణసంపదా ఇత్యాదులన్నీ యేర్పడ్డవి. కేవలం ఇంత మాత్రమే కాక కవిరాజులు రాజులూ తమతమ సారస్వతసభల్లో దానికి ఒక ప్రత్యేకమైనస్థానమున్నూ ఆభాషలో కవిత చెప్పేవారికి సంస్కృతకవులతో పాటుగా సమానాలయిన గౌరవప్రపత్తులూ కలిగించి పెంచి పోషించారు. ఇది రాజశేఖరకవిరాజు మాటలనుబట్టి విశదమవుతుంది. రాజశేఖరమహాకవి రాజకవిరాజసభలను వర్ణించే ప్రస్తావనలో ౧౦ వ అధ్యాయంలో అంటున్నాడు. వినండి.

> పూర్వేణ ప్రాకృతాః కవయః, తతః పరం నటనర్తకగాయనవాదనవాదకవాగ్జీవనకుశీలవతాల వచారః, అన్యేపి తథావిధాః, పశ్చిమేనాఽపభ్రంశినః కవయః, తతః పరం చిత్రలేప్య కృతో మాణిక్యబంధకాః...దక్షిణతో భూతభాషాకవయః...ఉత్తరత స్సంస్కృతాః కవయః నివేశేరన్. [రాజశేఖర కావ్యమీమాంస ౧౦. పే ౫౪-౫౫]

ఇల్లా అనడమే కాకుండా, ఆమహారాజే ఆయాదేశాలలో ప్రాకృతభాషలయుచ్చారణసౌష్ఠవము చెడకుండా వాడుకలోనుంచికొని పోషించినమహారాజులను కూడా కొందరిని వుదాహరిస్తూవున్నాడు చిత్తగించండి.

> (౧) శ్రూయతే హి మగధేషు శిశునాగో నామ రాజా. తేన దురుచ్చారా నష్టౌ వర్ణా నపాస్య స్వాంతఃపుర ఏవ ప్రవర్తితో నియమః. టకారాదయ శ్చత్వారో మూర్ధన్యాః తృతీయవర్జ మూష్మాణః త్రయః క్షకారశ్చేతి. (౨) శ్రూయతే చ శూరసేనేషు కువిందో నామ రాజా తేన పరుషసంయోగాక్షరవర్జ మంతః పుర ఏవ ప్రవర్తితో నియమః (3) శ్రూయతే చ కుంతలేషు సాతవాహనో నామ రాజా తేన ప్రాకృతభాషాత్మక మంతః పుర ఏవేతి సమానం పూర్వేణ, (౪) శ్రూయతే చ - ఉజ్జయిన్యాం సాహసాంకో నామ రాజా, తేన చ సంస్కృతభాషాత్మకం అంతఃపుర ఏవేతి సమానం పూర్వేణ.

ఈవాక్యాలనుబట్టి రానురాను ప్రాకృతభాషలు తొలుత తెగడబడ్డవే అయినా, తర్వాత ఎల్లా పొగడబడ్డవో, శిశునాగకువిందకుంతలసాతవాహనాదిరాజులు ఆభాషలకెంతటి ఉన్నతిని ఇచ్చారో, పండితులూ కవులూ శాస్త్రవేత్తలూ నిరంతరమూ ఏరీతి శ్రమించి, గ్రంథాలువ్రాసి ప్రబోధం కల్గించారో, స్పష్టము అవుతూనే వుందికద. కనుక ఈచెప్పిన - లేక - వ్రాసినగ్రంథసందర్భం ప్రాకృతగ్రంథకర్తలూ-వారిప్రజాసేవా-అనే విషయాన్ని నిరూపించడమునకు పర్యాప్తమనే తలుస్తున్నాను. ఇందులో స్థలసంకోచంచేతా, నాతెలివితక్కువచేతా నేను పేర్కొనని గ్రంథాలు వందలూ వేలూ ఉన్నవని చదువరులు జ్ఞప్తిఉంచుకో ప్రార్థితులు.

### * అంతవృద్ధిపొందిన ప్రాకృతభాషలు నేడు ఏమైనవి ? *

ఇక ఈవిషయం ముగిస్తున్నాను. ప్రకృతం ఇక్కడ శేషించిన రెండుమూడువిషయాలు చెప్పవలసి వున్నది. కొందరికి ప్రాకృతం నిజంగా ఇంతయభివృద్ధి పెరిగివుంటే-మరి ఆవాఙ్మయం ఎదీ?-అనే ప్రశ్న కలగడం సహజం. కాబట్టే అల్లా చాలామంది ప్రశ్నిస్తూ వుంటారుకూడాను. వారికి నాది ఒక్కటే మనవి. వాఙ్మయం నాటిది నేడూ వున్నది. ఇక లేనిదేమంటే ఇప్పుడు ప్రాకృతం మరి ప్రచారంలో లేకపోవడమే. ఈదోషం సంస్కృతానికి కూడా నేడు వుంటూనే వున్నది. ఆనాటి ప్రాకృతం నేడు వివిధములయిన దేశభాషలక్రిందమారి వృద్ధిపొంది గుర్తింపలేనంతటివిభిన్నతను పొం

దింది. విభక్తులయి దేశదేశాలకు చెదరిపోయిన సోదరకుటుంబాలులాగానే. ప్రత్యేకించి దేశభాషా రూపులతో వికాసం పొందడం ఆరంభం గావడంతోటే అతొల్లటి గ్రాంధికభాషా - వ్యావహారిక భాష (అంటే ప్రాకృతం) అల్లాగే స్తంభించిపోయినవి. అంటే వున్నంతవరకూ ఆనాటిగ్రంధరూపం గానే నాటిసంస్కృతప్రాకృతాలు స్తంభించిపోయినవి. దేశభాషలు అంటే వున్నంతవరకు ఆనాటి గ్రంధరూపంగానే నాటిసంస్కృతప్రాకృతాలు స్తంభించిపోయినవి. దేశభాషలు దేశకాలపరిస్థితుల ననుసరించి పెరుగుతున్నవి. పెరిగినవి. ఇంకా పెరుగుతవికూడా. ఇదే కారణం అంటాను.

వివరింపవలసిన ప్రధానవిషయం వివరించాను. ఉపాదేయంగా వుంటే గ్రహించండి. అనుపాదేయ మైయితే త్రోసిపుచ్చండి. నాకుపట్టుదల లేదు. నిగ్రూఅభిమానం అంతకన్నా లేదు. తెలిసిందికొంచెం. తెలియవలసింది హెచ్చు. నాకుగల ప్రాయంలోనూ ప్రాజ్ఞతలోనూ వుపయోగించనిది హెచ్చు, లోకానికి వుపయోగించేది తక్కువ. అయినా ఏదో గోలపెడుతూనే వుంటాను. అది నాస్వభావమై నట్టే ఇష్టం లేకుంటే వినకండావుండటం మీకున్నా.

* ఆంధ్రులు - అందులో నేటిపండితులు ప్రాకృతపరిశ్రమం

చెయ్యవలసిన అవశ్యకం చాలా విస్తారంగా వుంది! *

నేడు ఆయుష్మంతులై ఆదర్శమణులై వున్న ఆంధ్రదేశవుగ్రాంధికవాదులపైని నేను చాలా గౌరవాదరాలు చూపేడాదనే. తిరుపతివేంకటేశ్వరకవులు, వేంకటరాయశాస్త్రులు మండపాక పార్వతీశ్వరులు కవిరాజులు, (సారస్వతంలోగాకున్నా సంపదలోనైనా) గొప్పవారుగావుండే జయంతివారూ, త్రిపురానదొరలు ఆచంటలు జనమంచిపీఠాలు ఈ మొదలయిన వారందరికీ ప్రాతస్స్మరణులు సమర్పిస్తూనే వుంటాను. కాలం మారినది. ప్రవృత్తులూ అభిరుచులూ మారినవి. సారస్వత క్షేత్రం విస్తరించింది. ప్రాతవి కల్పవృక్షాలుగాకున్నా, కలకాలం వుపయోగించే సంజీవనీమహౌషధులే. కాని కొత్తమొక్కలు నాటేకాలం సమీపించింది. యువకవర్గంవారిది నేటికాలం రాబోయే కాలంకూడా. వారు వెనుకటివారికి కృతజ్ఞతచూపుతూ వారివ్యవహారాన్ని మఱవకండా జ్ఞాపకం వుంచుకొని, ముందుకాగలవారికి మార్గదర్శకులు కావాలని నాకోరిక. (భాష కట్టుదిట్టం చెడవలెనని నేను అనను. శిష్టవ్యవహారం గ్రంథస్థంగా అంగీకరిస్తేచాలు.) వివిధదేశాలవారూ తమతమ సారస్వతోద్యానాలు బాగుచేసికొంటున్నారు. ఆంధ్రుల్లో అట్టిప్రయత్నం జరగాలి. కొంత ఆరంభమైంది కూడా. నేటిపండితులు శక్తిగలవారు కొందరైనా ప్రాకృతాలలో పరిశ్రమించవలె నని ప్రార్థన. ప్రాకృతవాఙ్మయపరిశ్రమచేయగలపండితులు - అయిదుఆరుగురుకంటేలేరు. శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ, తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, చిలుకూరి నారాయణరావు, మారేపల్లి రామచంద్రశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, పింగళి లక్ష్మీకాంతం, మేదేపల్లి వెంకటరమణాచార్యులు ఇత్యాదులు కొందరున్నారు. ఈసంఖ్య చాలదూ. నేడు వాఙ్మయవిమర్శనంకోసం పరిశ్రమించే వారూ, చరిత్రకోసం వెదకేవారూకూడా ప్రాకృతం గాలించాలి. ఎన్నో దేశ్యాలు, ఏన్నో కల్పనలు ఏన్నెన్నో వాక్చమత్కారాలు, సరసభణితులు, ఎన్నో చరిత్రాంశాలు - ప్రాకృతం ఇస్తుంది. తక్కువవాటిని వదలుకొనవలె నని నామతవికాదు. దీన్నిన్నీ ప్రధానంగా ఎంచండి-అనే.

* ఉపసంహారం - నేటి వ్యావహారిక భాషా-గ్రాంథిక భాషావాదుల కొక మనవి. *

ప్రాకృతాన్ని గురించే ఈవ్యాసంలో వ్రాయదలచివున్నా, సాదృశ్యాన్నిహితసంబంధాలనుబట్టి నేటిగ్రాంథిక వ్యావహారిక వాదాన్నికూడా, ఆద్యంతాలూ జతచేశాను. పుర్రెకొకబుద్ధి. ఇది నాబుద్ధి. క్షమించి ఈప్రార్థనచిత్తగించండి. భాషమారగూడదనీ నన్నయతిక్కన్నలనాటిరూపమే వుండాలి అనడం భాషాభివృద్ధికి సాధనం కాదని మనవి. కనుక నేడుశిష్టులని వ్యవహరించే ప్రామాణికుల ప్రయోగాలకూ వ్యవహారానికిన్నీ తాము అనుశాసనం ఇస్తే చాలు. వ్యావహారిక వాదులు తృప్తి పొందుతారు. కాదని తెగిందాకా బిగదీయడం గ్రాంథికమునకుగూడా ముప్పే. ఇది గ్రాంథికవాదులకు మనవి. అష్టదిగ్బంధాలూ చేయడం తన్మూలాన - అలో అనిపించడం ఎంతతప్పో, వ్యావహారికంలో పైగా న్యాయములగు నీతినియమాలకు బద్ధులై సంచరించడమూ గ్రంథాలు వ్రాయడమున్నూ లేకుండా ఉత్పథవిహారం చెయ్యడం కూడా అంతే తప్పు. నేడు కొందరుకొందరు నవసంప్రదాయంవారి గ్రంథాల్లో వ్రాతల్లో కూడా ఈనవ హెచ్చుతూంది విశృంఖలత్వం అనేది స్వాత్మపరత్వానికి కారణం. కాబట్టి లోకవ్యత్యయం కలగకుండా ఆవశ్యకములయిన కట్టుబాట్లను చేసికొని నడవడం వ్యావహారిక భాషాసంప్రదాయంవారికి ముఖ్యకర్తవ్య మని సవినయంగా మనవిచేస్తున్నాను.

వ్యావహారిక భాషావాదపు అగ్హాతా ప్రామాణ్యం స్థాపించడం అయిపోయింది. ఇప్పుడందులో అభివృద్ధిగ్రంథరచనా ధారళంగా ఏర్పడాలె. అందుకై శ్రీరామమూర్తిపంతులుంగారూ వారియనుయాయివర్గం కృషిచేసి రస్తాలూ రోడ్లూ మేడలూ మిద్దెలూ తోటలూ దొడ్లూ తీర్చి పామరజనాలను అనుగ్రహించాలని ప్రార్థన. ఈప్రార్థనతోనే న్యాయములూ ధర్మ్యములూ అయినకోర్కెలు కొనసాగించే దేవికి అనంతంగా నమోవాకాలు సమర్పించుకుంటాను. శ్రీరామమూర్తిపంతులుగారు-శేషించినవారిజీవితంలో వ్యావహారిక భాషాకల్పవృక్షపు దివ్యపరిమళములను తనివిదీర గ్రోలగలుగునట్లు భగవానుడనుగ్రహించుగాక. స్వస్తి -

# అర్థవిపరిణామపద్ధతి

దువ్వూరి వేంకటరమణశాస్త్రి

ఒకరియభిప్రాయము లొకరికిఁ దెలియుటకై మనుష్యులు కల్పించుకొనినసువ్యక్తము లగుధ్వనివిశేషములే భాషలని చెప్పఁబడుచున్నవి. ఇట్టిభాషలను గల్పించుకొనకపూర్వము మనుష్యు లేవో యవ్యక్తము లగుధ్వనులచేఁ దమయాశయముల వెల్లడించుచు నితరులయాశయములఁ దెలిసికొనుచు మూఁగవారివలె నెట్టులో లోకయాత్ర నడపుకొనుచుండెడివారని భాషాశాస్త్రజ్ఞులసిద్ధాంతము. “భాష్యతే అనయేతి భాషా; భాష వ్యక్తాయాం వాచి” స్పష్టముగా మాట్లాడఁబడునది భాషయని దీనియర్థము. దూర మాలోచించినచో నీవ్యుత్పత్తియే పైసిద్ధాంతమును గొంతవఱకు స్థాపింపఁజాలియున్నది. ఇట్టిభాషలు లోకములోఁ బలువిధములుగా వ్యాపించియున్నవి. ఈభాషలు వ్యవహరింపఁబడు దేశములభేదములనుబట్టియు వీనిని వ్యవహరించుజాతులభేదములనుబట్టియు లేదా వీనికిఁగల యేదోయొకయసాధారణధర్మమునుబట్టియు వీనికి జర్మన్, ఇంగ్లీషు, సంస్కృతము, హిందీ, అఱవము, ఆంధ్రము, కన్నడము, మళయాళము మున్నగుననేకము లగుసంజ్ఞ లేర్పడియున్నవి. ఇట్టివానిలో మనయాంధ్రభాషకూడ నొకటియై యున్నది. దీనిలోనికొన్నిపదముల యర్థము కాలక్రమమున నెంతవిచిత్రముగా మార్పునందినదో యావిషయ మొకింత చూపుటయే యిపుడు నాకర్తవ్యము.

మనదేశములోఁ జిరకాలమునుండి సంస్కృతభాష వ్యాపించియున్నది. కావుననే యాంధ్రమునకును సంస్కృతమునకును ననేకవిషయములలో సంబంధము హెచ్చుగానున్నది. ప్రస్తుతకాలమున నాంగ్లభాషాసంబంధముచే రోడ్డు, కార్డు, మనియార్డరు, ఫులిస్టాపు (Fullstop) కిరస్తానులు (Christians) అఫారము (Halfarm) సబ్బు (Soap) (ఇది దేశ్యమని శబ్దరత్నాకరమునఁ గలదు. ఉదాహరణము చూపఁబడలేదు. ప్రాచీనప్రయోగ మగపడునంతదనుక నిది (Soap) శబ్దభవ మనియే నా నిశ్చయము) మున్నగు నింగ్లీషుపదము లనేకములు తత్సమ

రూపమునను దద్భవరూపమునను మనభాషలోనికిఁ జొరఁబడుచున్నట్లే సంస్కృతము నుండి వేలకొలఁదిశబ్దములు తెలుఁగులోఁ బ్రవేశించియున్నవి. ఇట్లు ప్రవేశించిన వానిలోఁ బ్రాతిపదికములో విశేషముగ మార్పు లేకున్నచో నవి తత్సమశబ్దము లనియుఁ బ్రాతిపదికముగూడఁ గొంతవఱకు మాఱినచో నయ్యవి తద్భవములని యు లాక్షణికులు వ్యవహరింతురు. ఈరెండుజాతులశబ్దములలోను నర్థముకూడ మాఱుచుండును. శబ్దముమాఱినను నర్థముమాఱినను నట్టిమార్పు సామాన్యముగాఁ బ్రకృతికి సంబంధించినదే యైయుండును. పండితులనక పామరులనక యందఱును నిరంతరముగ దీనిని వ్యవహరించుచుండుటయే యిట్టిమార్పులకుఁ గారణము. అందును బామరజనవ్యవహారమే ముఖ్యకారణ మనఁదగును. ఇట్టిమార్పులు గలుగుచున్నభాషయే సజీవముగుభాష యని చెప్పఁబడును. పైనిజూపిన రెండువిధములలోఁ దత్సమపదములయర్థ మెట్లు విపరిణతమగును? అట్టి విపరిణామమునకు సరియగుహేతు వేమి? అనువిషయమును గొంతవఱకిట సోదాహరణముగ నిరూపింతును.

1. అవధ్యులు:- సంస్కృతము; అవధ్యాః = చంపఁదగనివారు. తెనుఁగులో నీశబ్దము కుంటివాండ్రు, గ్రుడ్డివాండ్రు మున్నగునంగవికలులనుమాత్రము బోధించుచున్నది. ఇట్టియంగవికలులను హింసింపరాదు. కావున వీరి కీపేరు రూఢమైయుండును.

2. అసహ్యము:- సం; అసహ్యమ్ = సహింప శక్యముగానిది. "అసహ్యా శిరోవేదనా = తలనొప్పి సహింపనలవిగాక మిక్కుటముగా నున్నదని దీనియర్థము. తెలుఁగులో మాత్రము తలనొప్పి యసహ్యముగానున్నదని సామాన్యముగా వ్యవహరింపరు. ఏవగింపు, రోఁత యను నర్థమున నీశబ్దమును వాడుదురు. ఇదిగూడ సహింపశక్యముగానిదే యగుటచే నిట్టివాడుక వచ్చియుండును. ఉదా: వానిదుశ్చేష్టలు చూచినకొలఁదిని నా కసహ్యము కలుగుచున్నది. సామాన్యవాచి కిట విశేషపరత్వము.

3. గీర్వాణము:- సం; గీర్వాణాః=దేవతలు. "గీ రేవ వాణః బాణః యేషాం తే" అని దీని వ్యుత్పత్తి. బాణమువంటిమాట గలవారని దీనిభావము. దేవతలు శపించుటకు సమర్థులుగదా! తెనుఁగున నౌద్ధత్యము, గర్వమునని దీనియర్థము.

పైనిజూపినట్లు శాపదానసామర్థ్య మున్నపుడు గొంతమంది కౌద్ధత్య ముండుటగూడ నైసర్గికము గావున నిట్టియర్థము క్రమముగా వచ్చియుండును. ఉదా. "ఏవో నాలుగుముక్కలు చదువుకొన్నను నంత గీర్వాణము పనికిరాదు."

**4.** అనుమానము:- సం; అనుమానమ్=పరోక్షనిశ్చయము. ధూమా ద్వహ్న్యనుమానమ్=ధూమమునుబట్టి వహ్ని గలదని నిశ్చయించుట. తెలుఁగున నిట్లుగాక సంశయ మనునర్థమున వాడుదురు. లౌకికవ్యవహారమే కాక కవులుగూడ నిట్లే వాడియున్నారు. ఉదా.

(1) కం. మనవీటన కా దయ్యా
ర్జునునకు సరివింటివానిఁ జూడఁగ లోకం
బున నెందు లేమి దెల్లం
బనుమానము లేదు తొడరనగునే వానిన్.

భా. ఉద్యో. 2 ఆ. 166 ప.

(2) చ. పిలసితధర్మచారిణి వివేకవతీమణి సీత; సుస్వభా
వులు యమలార్భకు ల్గుశలవుల్ గ్రహియింపుము పిరి మువ్వురన్
వల దనుమాన మొంద నిటువంటిమహాసభఁ జేరి కల్ల లేఁ
బలుకుదునయ్య బొంకినఁ దపంబు ఫలించునటయ్య మానికిన్.

ఉత్తరరామాయణము. 8 ఆ. 38 ప.

ఇట్టిపరోక్షనిశ్చయములకు సంశయము మూలమైయుండును గాన ననుమాన శబ్దము క్రమముగా సంశయ మనునర్థమును బోధించుట సోపపత్తికమే యనఁదగును.

**5.** కర్మ:- సం; కర్మ=పని. ఏపనిని బోధించుటకైనను సంస్కృతభాషలో దీనిని బ్రయోగింతురు. కాని తెలుఁగున శ్రాద్ధకర్మమునుమాత్రమే బోధించుచున్నది. ఉదా= కర్మ చేయుట కొకకుమారుఁడైన దగ్గఱ లేకపోయెను. సామాన్యవాచి కిట విశేషపరత్వము.

**6.** ఫలహారము:- సం; (ఫలాహారః)ఫలహారః=ఫలరూప మగునాహారము. ఏదేని నియమసమయమునం దెల్లపుడును భుజించునన్నమును విడిచి వేఱొకపదార్థమును దేనిని భుజించినను నయ్యది ఫలహారమనియే తెలుఁగున వ్యవహరింతురు. ఉదా= "అమావాస్యనాఁటిరాత్రి శిష్టులు మినుపరొట్టిగాని పిండిగాని ఫలహారము చేయు

దురు." నియమసమయములందు ఫలములకు బదులుగా భుజించునవిగావున వీని కిట్టి వాడుక వచ్చియుండును.

7. సంభావన:- సం; సంభావనా = గౌరవము. మర్యాద. శుభాశుభము లందు బ్రాహ్మణులు మున్నగువారి కిచ్చుస్వల్పమగుధనమని యాంధ్రుల వాడుక. పూర్వకాలమున నేవేని శుభాశుభకర్మములందు విప్రులయాశీస్సును గోరువారు యోగ్యులని తమకుఁ దోఁచినవారి నాహ్వానించి వారికిఁ గొంతధన మిచ్చి గౌరవించి వారియాశీస్సును బొందుచుండెడి సందర్భమునఁ బైయర్థమం దీశబ్దమును వాడుటకు మొదలిడి యుందురు. అప్పటివాడుక గొంతవఱకుఁ బ్రకృత్యర్థసంబద్ధమే యనఁదగును.

8. సంతర్పణ:- సం; సంతర్పణమ్-తృప్తిపఱుచుట. ఏవిధమునఁ దృప్తిపఱచిన సందర్భమునసైనను సంస్కృతమున దీనిని వాడుదురు. కాని తెలుఁగున నట్లుగాక యన్నదానముచేఁ దృప్తిపఱుచుసందర్భమునమాత్రమే దీనికి వాడుక గలదు. ధనాదులచేఁ దృప్తికలిగించినను నపుడు సంతర్పణ చేసిరనువాడుక లేదుగదా! ఈసంతర్పణకు సమారాధన మనియుఁ గొన్నియెడల వ్యవహారము గలదు. వచ్చినవారి నారాధించుట యనఁగాఁ బూజించుటయే యప్పటికర్తవ్యము గావున నీవ్యవహారముగూడ నుపపన్నముగనే యున్నది.

9. ప్రారబ్ధము:- సం; ప్రారబ్ధమ్=పూర్వ మారంభింపఁబడినది. అనఁగాఁ జేయఁబడినది. అది పుణ్యకర్మముఁ బాపకర్మముఁగూడఁ గావచ్చును. కాని తెనుఁగులోఁ బూర్వము చేయఁబడినపాపకర్మ మనిమాత్రమే యర్థము. కావుననే పాపకర్మఫలములగుకష్టముల నొందునపుడే "వానిప్రారబ్ధ మట్లున్నది. ఏమిచేయఁ గలము" అని యందురు. అంతియకాని యొకమనుజుఁడు సుఖియై యానందించుచుండ వాని నభినందింపఁ దలంచి "నీప్రారబ్ధము బాగుగా నున్నద"ని యెవ్వరును బ్రయోగింపరు. (సామాన్యవాచి కిట విశేషపరత్వము)

10. దాహము:- సం; దాహః=కాలుట, తాపము. తెలుఁగులో నిట్లుగాక తాపశాంతిసాధన మగునీరు మున్నగువానికి వాచకమై యున్నది. ఉదా = "కొంచెము దాహ మిప్పింపుఁడు." ఆతపతప్తుఁడై వచ్చి దప్పిచేఁ బ్రాణావశిష్టుఁడై యున్న మనుజుని నిట్టివాక్యమందలిదాహశబ్దమునకు సంస్కృతములోనియర్థమే దీనికిని గల

దనుకొని మఱింతతాపమును గలిగించుట కెవ్వరును సిద్ధపడుటలేదుగదా ! మఱియు నీశబ్దము తాపము, దప్పి యనునర్థమునఁగూడ "నాకు దాహ మధికముగా నున్నది" మున్నగువాక్యములలో నగపడుచున్నది.

**11.** ఉచితము:- సం; ఉచితమ్= తగినది. తెనుఁగున ధనమును స్వీకరింపకుండఁ గనే యొకవస్తువు నిచ్చినచో నద్దాని నుచితముగా నిచ్చినట్లు వాడుదురు. ఉదా= "ఒక్కసారియే డజనువస్తువులు కొనువారి కొకవస్తు వుచితముగా నీయఁబడును." ఒకసారిపండ్రెండువస్తువులు కొని తన కెంతో లాభము గలిగించినపు డావర్తకుఁడు కొన్నవారి కొకవస్తువును ధనమును స్వీకరింపకుండఁగనే యిచ్చుట యుచితము. అనఁగా న్యాయ్యము. తగినది. కావుననే యుచితశబ్దమున కిట్టివాడుక కలిగినది. "కోటలా గుచితముగాఁ బంపఁబడును." అని యిట్లువార్తాపత్రికలలోఁగూడ నీశబ్దమిట్టియర్థమునఁ దఱుచుగా నగపడుచుండును.

**12.** గగనము:- సం; గగనమ్= ఆకాశము.(శూన్యము) తెనుఁగులో నప్రాప్యము; అసాధ్యమునని దీనియర్థము. ఉదా= "ఆతఁడు చేసినట్లు చేయుట యేమి గగనమా?" అనఁగా శూన్యమా ?= ప్రపంచమున నెచ్చటను లేనిదా?= (అట్టిది చేయుట కష్టముగాన) అసాధ్యమా? అనుసీక్రమమున దీనియర్థము విపరిణతమై యుండును. లేదా "ఆకాశమంతయాఁకలి సూదిబెజ్జమంతనోరు" మున్నగుకొన్నియాంధ్రలోకోక్తులలో నాకాశమును బెద్దదానినిగా భావించుచుండుట గలదు. దానినిబట్టి గగనమా?= పెద్దదా= (పెద్దపనిని సాధించుట కష్టముగాన) అసాధ్యమా? అనునదియైనను దద్విపరిణామమునకు మార్గము కానోపును. దీని నీయర్థమున రామరాజభూషణకవిగూడఁ బ్రయోగించియున్నాఁడు. "... ... ...గగనఘంటాపథక్రమణశీలున కెంత గగనమయ్యె లతాంగికొనుచదలు......" (వసుచరిత్రము-౩ఆ. 99ప.) ఇట నెంత గగనమయ్యె ననఁగా నెంతపొందరాని దయ్యె ననియర్థము.

**13.** జిజ్ఞాస:- సం; జిజ్ఞాసా=తెలిసికొనవలయు ననుకోరిక. దేనినేని దెలిసికొనఁ దలఁచినపుడు హృదయము తదేకచింత నాయత్తమై వ్యాకులమై యుండుట సహజము. ఏదేని కష్టదశలోఁగూడ హృదయ మిట్లే యుండును గాన నీసామ్యమునుబట్టి జిజ్ఞాసగానున్నదని కష్టసమయమునఁగూడ మనవారు వాడుదురు.

**14.** దక్షత:- సం; దక్షతా = సామర్థ్యము. "ఈవస్తువులు పొదుపుగా వాడు కొనుటకు మాయింట దక్షత లేదు" అనఁగా మాకు సామర్థ్యము లేదనియే దీనికి మొదటియర్థము. ఎందువలన సామర్థ్యము లేదు? పెద్ద లెవరును నింట లేకుండు టవలన. కావున సామర్థ్యాభావమునకుఁ బెద్ద లింట లేకుండుట హేతువైనది. ఇట్టి హేతుహేతుమద్భావసంబంధమునుబట్టి కాలక్రమమున దక్షతలేకుండుట యనఁగా నింట వృద్ధులు లేకుండుట యనునర్థము వచ్చినది. ఈరీతిని దక్షతయనఁగా నింట నుండుపెద్ద లనునర్థము తేలినది. ఈయర్థమునఁ గవులుకూడ నీశబ్దమును వాడి యున్నారు.

> " దక్షతలేనియింటికిఁ బదార్థము వేఱొకచోటనుండి వే
> లక్షలు వచ్చినేనియుఁ బలాయనమై చనుఁ గల్లగాదు ప్ర
> త్యక్షము ... ... " (భాస్కరశతకము.)

**15.** కైంకర్యము:- సం; కైఙ్కర్యమ్=భృత్యభావము, శుశ్రూష, సేవ. తెలుఁగున దొంగిలించుట యని యీశబ్దమున కర్థము. విష్ణుభక్తాగ్రేసరు లగు తిరుమంగ యాళ్వారు పెరుమాళ్ళకు నిరంతరసేవ (కైంకర్యము) యొనర్చుచు నొకప్పుడు స్వామియంగుళీయకమును హరించినట్లు ప్రసిద్ధిగలదు. ఈ తిరుమంగయాళ్వారుల చోరప్రక్రియయే కైంకర్యశబ్దమున కపహరణ మనునర్థము వచ్చుటలో మూలమై యుండును. మఱియు దేవాలయములందలి యర్చకులు పెక్కుమంది దేవస్థానాధి కృతులచేఁగాని తదితరులచేఁగాని భగవద్వినియోగమునకై సమర్పింపఁబడిన వస్తువు లను స్వామికి వినియోగింపక తా మపహరింతురని దేశములోఁ గింవదంతి గలదు. అది సత్యమో కాదో పెరుమాళ్ళ కెఱుక. ఇట్లు వారు వస్త్వపహరణము చేయుచుఁ గైంకర్యము చేయుచున్నారమని చెప్పుదురు. కావున నీమార్గమునఁగూడఁ గైంకర్య మనఁగా దొంగిలించుట యనునర్థము వచ్చుట కవకాశ మగపడుచున్నది. ఉదా. "అచట నేను నాలుగువస్తువు లుంచితిని. అందు రెండువస్తువు లెవరో కైంకర్యము చేసినారు."

**16.** ఛాందసుఁడు:- సం; ఛాన్దసః=ఛందస్సు తెలిసినవాఁడు. అనఁగా వేదపండి తుఁడు. " శ్రోత్రియచ్ఛాందసౌ సమౌ " శ్రోత్రియచ్ఛాందసశబ్దములు రెండును బర్యాయములని నామలింగానుశాసనము. తెలుఁగులో నీరెండుశబ్దములయర్థముల

కును జాలభేదము గలదు. శ్రోత్రియుఁడనఁగా సదాచారసంపన్నుఁడు, శిష్టాగ్రేసరుఁడు. ఛాందసుఁడనఁగా లోకజ్ఞానశూన్యుఁడు, మందుఁడు. మనదేశములోఁ జిరకాలమునుండి, యనఁగాఁ గాళిదాసుకాలమునుండియు వేదపండితు లనేకులు నాగరకతాశూన్యులై మాంద్యములో నుండెడివారని "వేదాభ్యాసజడః కథంను విషయవ్యావృత్తకౌతూహలః, నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం రూపం పురాణో మునిః." (వేదాభ్యాసమువలన మాంద్య మలవడినబ్రహ్మ యిట్టిమనోహరరూపమును సృజింపఁజాలఁడు) అనువిక్రమోర్వశీయవాక్యమువలన మనకు స్పష్టముగాఁ దెలియుచున్నది. నాఁటికిని నేఁటికిని వేదవేత్తలవిషయమున నీయభిప్రాయమే దేశములో నాటుకొనియున్నది. వేదవేత్తలలోఁ జాలమంది చెప్పినమాటయే పలుమాఱు చెప్పుచుఁ జేసినపనియే పలుమాఱు చేయుచు నిట్లుండుట స్వాభావికము. దీనిని బట్టియే ఛాందసశబ్దము చా(చే) దస్తము గలవా రనునర్థమునందు రూఢమైనది. చా(చే) దస్తమనుశబ్దమైనను ఛాందసత్వశబ్దభవమే కాని క్రొత్తది గాదు. ఛాందసశబ్దమును బైనిజెప్పినయర్థములో రామకృష్ణకవిగూడ వాడియున్నాఁడు.

ఉ. "సారథి ఛాందసుండు బడిసాగదు చక్రియుగంబు......

.........తానట మానరియంచుఁ దత్పురీ

దేరులు నవ్వ శంకరుని తేరిని గేతనకింకిణీధ్వనిన్"

పాండురంగమాహాత్మ్యము - 1 ఆ. 115.

17. ముష్టి:- సం; ముష్టిః=పిడికిలి. దీనికిఁ గ్రమముగా బిచ్చగాండ్రకుఁ బెట్టు పిడికెఁడుబియ్యమనియు ధాన్యమనియు వాడుక వచ్చినది. లేదా బియ్యముగాని ధాన్యముగాని గలపిడికిలి యనియైనను జెప్పవలయును. ముష్టికి వచ్చిరి, ముష్టి వేసితిని మున్నగువాక్యములలో సంస్కృతమునఁ గలవట్టిపిడికిలి యనునర్థము చెప్పుట పొసఁగనేరదుగదా !

18. దండము:- సం; దణ్డః=కఱ్ఱ. ఆంధ్రభాషలో నిది నమస్కార మనునర్థమున వాడఁబడుచున్నది. వినీతుఁ డగువాఁడు పెద్దలకు నమస్కరించునపుడు కఱ్ఱవలె భూమిపైని బడవలయునని నియమము. దీనికే దండప్రణామమని పేరు. దీనినిబట్టి క్రమముగా దండశబ్దమునకు నమస్కారపర్యాయత్వము సిద్ధించినది. ఉదా. "పెద్దలు కనఁబడినతోడనే దండము పెట్టవలయును." ఈవాక్యములోని దండమనుదానికి

సంస్కృతములోని యర్థమే చెప్పినచోఁ బెద్దలు పిన్నవారి కగపడుటకే భయపడ వలసియుండును.

**19.** చిత్తము:- భాగ్యము:- సం; చిత్తమ్=మనస్సు. తెనుఁగులో నెవరేని యొకవిషయము చెప్పుచున్నపుడు శ్రోతలు 'ఊ, ఊ' అని యూఁకొట్టుచు విను నలవాటు గలదు. అట్లు పెద్దలు చెప్పుచున్నచో 'అయ్య, అయ్య' యనుచు విం దురు. ఈసందర్భముననే 'చిత్తము, చిత్తము' అనియు ననుచుందురు. అది తమ చిత్తములో నున్నట్లే యనఁగాఁ దమయభిప్రాయము సరియైనదే యనీ యెప్పటి కప్పు డంగీకరించుచు వినుచుండుసందర్భమేమోయని స్ఫురించుచున్నది. ఇదిగాక పెద్ద లేదేనికార్యము నియోగించినప్పుడు 'చిత్తము' అని యందురు. అనఁగాఁ దమ చిత్తము ననుసరించి తప్పక యాకార్యము నెఱవేర్తు నన్నంతయర్థము దానిలో స్ఫురించుచున్నది.

మఱియు నిట్టిసన్నివేశములలో, ననఁగాఁ బెద్దలు ప్రసంగించుచున్నయెడ వైష్ణ వులు 'భాగ్యము, భాగ్యము' నుచు వినునాచారము గలదు. కటాక్షించి దేవరవా రీసంగతి సాయించుట దాసునిభాగ్యము. అనఁగా నదృష్ట మనునూహతో నీవాడుక పుట్టియుండును. వీరిలోఁ బ్రవృత్తి మిక్కుటముగా నుండును గావునఁ బైవాడుక కిట్టి యభిప్రాయమును గల్పించుట యుపపన్నమని తోఁచుచున్నది.

**20.** స్వయంపాకము:— సం; స్వయంపాకః= స్వయముగా వండుకొనుట. క్రమ ముగా నీశబ్దము స్వయముగా వండుకొనుట కిచ్చెడిసామగ్రిని బోధించినది. ఇంకను రానురాను స్వయముగా వండుకొనుటకుఁగాక యింటికిఁ దీసికొనిపోయి విక్రయించు కొనుటకయినను సరే యొకమనుష్యుఁడు స్వయముగా వండుకొన్నచో సరిపడున ట్లిచ్చెడిభోజనసామగ్రికి వాచకమైనది. ఉదా= నేఁడు ద్వాదశిగావున నిద్దఱకు స్వయంపాకము లిచ్చితిమి.

**21.** ప్రియము:— సం; ప్రియమ్= ఇష్టమైనది. ఏవస్తువైనను బదిమందికి నిష్టమై నపు డందఱును దానినే కోరుట నైసర్గికము. అట్లు పలువురు కోరుచున్నవస్తువునకు విలువ హెచ్చుగుటయు స్వాభావికమే. కావుననే ప్రియమనఁగా హెచ్చుధర గల వస్తు వనునర్థము తెలుఁగున రూఢమైనది. "శీతకాల మగుటచేఁ గాఁబోలును బజా ర్లునఁ గంబళ్లు మిక్కిలి ప్రియముగా నున్నవి.

22 స్వస్తి:— సం; స్వస్తి = మంగళము. తెలుఁగులో స్వస్తియనఁగా గొందఱు వైదికులు రెండుపక్షములుగా విభక్తులయి వేదములో నేదోయొక భాగము నందుకొని యొకరివెంబడి నొకరందలివాక్యముల నేకరువుపెట్టుట యనునర్థమువచ్చినది. శుభకార్యములలోను మఱికొన్ని యుత్సవాదులలోను వేదమును బఠింపవలయు ననియు నయ్యది శుభప్రదమనియు మనవారిసిద్ధాంతము. ఇట్లు వేదమును నవిశ్రాంతముగా నొక్కరే చెప్పుటలో శ్రమ యధికమగును గావున నట్లుభయపక్షముల వారు సద్దుకొని చెప్పువాడుక పుట్టియుండును. ఇట్లుచెప్పుట మంగళమునకు హేతువగుచున్నది. హేతుహేతుమత్తులకుఁ గ్రమముగా నభేదాధ్యవసాయము చేసికొని యిట్లువేదము నేకరువుపెట్టుటనే స్వస్తియని వాడుచున్నారు. లేదా యావేదమంత్రములలోఁ గొన్ని "మంగళ మగుఁగాక" యనునర్థముగలవికూడ నుండునుగావున నా మంత్రములమూలమున స్వస్తిచెప్పుచున్నా రనువాడుక వచ్చినను రావచ్చును.

23. అన్యోన్యము:- సం; అన్యోన్యమ్=పరస్పరము ఆంధ్రమునఁ బ్రేమ మను నర్థమున దీనిని వాడుదుము. ఉదా: "వారిద్దఱును నెంతో యన్యోన్యము" ప్రేమ మనుభావ మెప్పుడును నొకరిపై నొకరికిఁ బరస్పరము నుండవలసినది గావున నిట్టి యర్థమువచ్చుట సమంజసమే యనఁదగును.

24. అవసరము:- సం; అవసరః=సమయము. తెనుఁగులో నావశ్యకత యను నర్థమున వ్యవహరింతురు. ఉదా: "నేను రావలసినయవసరము లేదు." "ఎవరియవసరము వారిది" ఇత్యాదులలో నవసరశబ్దమునకు సమయార్థకత్వము చెప్పినచో వాక్యార్థము పొసఁగియుండదు. ఆవశ్యకత యనునర్థమే యిట్టిచోట్ల వక్త్రభీష్టమై యుండును. నీ కీవస్తువు కావలెనా? నా కవసరము లేదు. అది కావలసినసమయము నాకు లేదు= అది కావలసినసమయ మిది కా దనుట. ఇట్టి కొన్నివాక్యములలో మొట్టమొదట సమయార్థకత్వమే యుండి క్రమముగా నయ్యది యన్వయసారళ్యాపేక్షు లగువారిచే నావశ్యకత యనునర్థము గలదిగా మార్పఁబడియుండును.

25. ఆగ్రహము:- సం; ఆగ్రహః=పట్టుదల. "అనేనైవ పక్షేణ విజయినా భవితవ్యమితి నాస్మాక మాగ్రహః"=ఈపక్షమే నెగ్గవలయునని మా కేమియుఁ బట్టుదల లేదు. అని సంస్కృతములో దీని వ్యవహారము. ఏదేనియొకవిషయమును

బట్టుదలతో వాదించుచున్నపు డాసందర్భమునుబట్టి యా పట్టుదల కోపసమ్మిశ్రిత మగుటయుఁ గలదు. దీనింబట్టియే యాగ్రహమనఁగాఁ గోప మనునర్థము తెనుఁగులో రూఢమైనది. ఉదా. "తప్పుచేసిన భృత్యునిపై రాజున కాగ్రహము జనించును"

26. ఆలయము:- సం; ఆలయః=ఉనికిపట్టు, స్థానము, ఇల్లు. గ్రంథాలయము, దేవాలయము, వస్త్రాలయము, కార్యాలయము, హిమాలయము, విద్యాలయము మున్నగుసమాసములలోని యాలయశబ్దమునకు స్థానమనిమాత్రమే యర్థము. రానురా నిది తెలుఁగులో దేవాలయ మనువిశిష్టార్థమును బోధించుచున్నది. ఉదా: "సాయంకాలము తఱుచుగా నందఱును నాలయమునకు వెళ్ళుదురు." కేవలమగు (దేవాదిపదసమభివ్యాహారము లేని) నాలయశబ్దమునకు సంస్కృతమున నిట్టివిశిష్టార్థ మెచ్చటను గానరాదు. సామాన్యవాచి కిట విశేషపరత్వము.

27 కుశలము:- సం; కుశల= నేర్పుగల (విశేషణము) కుశలమ్= క్షేమము. "అయ మతీవ కుశలః "=ఇతఁడు మిగులనేర్పరి.- 'ఉభయకుశలోపరి'లోనికుశల శబ్దము క్షేమార్థకమని యందఱును నెఱుఁగుదురు. ఇట్లుండ నాంధ్రభాషలో 'ఇఱుకటము, ఇఱుకు,' అనునర్థములో వ్యవహరింపఁబడుచున్నది. ఇది ప్రకృత్యర్థమునకు సంబంధించియున్నట్లు పైకి గోచరించుట లేదు. కాని చిన్నయింటిలోఁ గాపురముచేయువారిని మీకు సదుపాయముగా (వసతిగా) నున్నదాయని ప్రశ్నించినచో "నేదో యందులోనే కుశలముగాఁ గాలక్షేపము చేయుచున్నా"మని చెప్పుదురు. స్థలము తక్కువగా నున్నపు డింట నుండువస్తువులను యథేచ్ఛముగా నెచ్చటివాని నచ్చట విడువక నేర్పుతో వాని నన్నిటిని సరుదుకొనవలసియుండును. కాఁగా నిఱుకుగా నున్నస్థలమున నేర్పుగానుండవలయునని తేలినది. ఇట్టివాక్యములలో "నిఱుకటము, నేర్పు'అనువాని కిట్టిసంబంధము కలిగియుండుటచేఁ గ్రమముగాఁ గుశలశబ్దము వ్యవహారమున నిఱుకటమనునర్థమునందు రూఢమై యుండునేమోయని తోఁచుచున్నది.

28 పథ్యము:- సం; పథ్యమ్= హితము, మేలు గలిగించునది. "అప్రియస్యచ పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః="అప్పటికి శ్రోత కిష్టము గాకపోయినను భావికాలమున మేలుగలిగించుమాటను జెప్పువాఁడును నట్టిమాట వినువాఁడునుగూడ నరుదుగా నుందురని దీనియర్థము. ఇట్లది మాటనుగాని కార్యమునుగాని మఱి దేనినైననుగాని భావికాలమున మేలుగలిగించుసర్వమును సంస్కృతములో బోధింపఁజాలియున్నది.

కాలక్రమమున నిట్లన్నిటిని బోధింపక తెనుఁగువ్యవహారమున మేలుకలిగించునాహార మునుమాత్రమే బోధించుచున్నది. అదియైనను సామాన్యముగా రోగనివృత్త్యనంత రము రోగి కిచ్చునాహారమునేకాని తదితరులయాహారమును బోధింపదు. ఏదేని రో గము సంభవించునపుడే యాహారనియమముగాని లేనపుడుగూడ నిత్యము నుండవల సినయానియమము మనవారియభ్యాసములో లేనట్లుగూడ నీశబ్దముయొక్క యర్థ విపరిణామరీతియే సూచింపఁజాలియున్నది. ఉదా= "నిన్ననే పథ్య మిచ్చితిమి."

**29.** తద్దినము:- సం; తద్దినమ్ = (తద్ + దినమ్) ఆదినము. తెనుఁగులో నీశబ్ద ము నాబ్దిక మనునర్థమున వాడుదురు. లజ్జాకరమును జుగుప్సాకరమును నమంగళ ద్యోతకమును నగునర్థము గలశబ్దముల నుచ్చరింపక వానికిఁ గొంచెము సంబంధిచిన యేవోపదములను బ్రయోగించుచు నాయర్థమును వ్యక్తీకరించుట మనవారికి స్వ భావము కావుననే (1) యింటిలోఁ బసపు నిండుకొన్నది. (అయిపోయినపుడు) (2) దీపము పెద్దదయినది. (ఆరిపోయినపుడు) (3) మంగళసూత్రము పెరిగిపోయి నది. (తెగినవుడు) మున్నగువాడుకలు వచ్చినవి. ఇట్లే చనిపోయిన దినమని చెప్పు టకు సంకోచించి 'ఆ దినము=చనిపోయినదినము' అనునర్థము స్ఫురించునట్లు తద్దిన మనుశబ్దమును వాడుచున్నారు.

**30.** మంగళసూత్రము:- సం; మఙ్గళసూత్రమ్= వివాహములో వరుఁడు వధు వుయొక్క మెడలోఁ గట్టెడు పుస్తెలు గ్రుచ్చిన మంగళకరమగు (త్రాడు) సూత్ర ము. పుస్తె లెప్పుడును నీమంగళసూత్రముతో సంబంధించియే యుండునుగావున వీనికిఁగల యవినాభావసంబంధముచే నీరెంటిని నభిన్నములుగా భావించుటవలనఁ గావలయును మంగళసూత్రమనగాఁ బుస్తె లనునర్థముగూడ వాడుకలో రూఢమై నది. ఉదా= "మంగళసూత్రములు రెండిటికిని గొంచెము సొట్లు (నొక్కులు) పడు టచే బాగుచేయుటకై కంసాలి కిచ్చిరి." "ఆరెండుమంగళసూత్రములును నొక్కొ క్కటి తులము తులము బంగారముతోఁ దయారయినవి." ఇత్యాదులలో సూత్ర మనఁగాఁ ద్రాడని యర్థము చెప్పుట యెంతమాత్రమును బొసఁగియుండదు.

**31.** మధుపర్కము:- సం; మధుపర్కః= తేనె, నేయి, పెరుగు, నీరు, చక్కెర యనునీమైదిటిని గలిపి యతిథి కిచ్చు మిశ్రితద్రవ్యవిశేషము - కన్యాదానసమయ మున వరునికిఁగూడ దీని నిచ్చి సత్కరించువాచారము గలదు. అల్లుని నిట్లు సత్క

రించినపిదప నూతనవస్త్రములఁగూడ నిత్తురు. కావునఁ గ్రమముగా నల్లునికిఁ గన్యాదానసమయమున నిచ్చువస్త్రము లను నర్థమునమాత్రమే వ్యవహరింపఁజొచ్చిరి. అతిథిసత్కారస్వరూప మెట్టిదో యట్టిసత్కార మెందుల కావశ్యకమో తెలియని యీ కాలమున మధుపర్కశబ్దమునకుఁ గల ప్రకృత్యర్థమును మనవారు మఱచుట వింతకాదు. ఇఁక వివాహములో వరునికిఁ దేనె మున్నగువానిని గలిపియిచ్చునాచారమున్నను నయ్యది యీవైవాహికకృత్యముల తొందరలో నందఱకును దెలియక దానిని సంబంధించి యిచ్చునూతనవస్త్రములు మాత్రము స్పష్టముగాఁ బ్రేక్షకుల కందఱకును నగపడునుగాన మధుపర్కమనఁగా వరుని కిచ్చు నూతనవస్త్రములే యనునర్థము నాటుకొన్నది. ఉదా. "అల్లునికి జరియించుఖద్దరుమధుపర్కములు తెచ్చినారము."

32. అయోమయము:- సం; అయోమయమ్= ఇనుపది.- సర్వసామాన్యముగా మనవారికిఁ దెలిసియున్న ప్రసిద్ధలోహములలో నినుము మిక్కిలిసాంద్రమై దిట్టముగా నుండునది; అయ్యది దుష్ప్రవేశము=దూరరానిది. ఈయర్థమును బట్టియే తెనుఁగులో నేదేనిదుష్ప్రవేశముగఁగాని యసాధ్యముగఁగాని దుర్బోధముగఁగాని యున్నదని చెప్పవలసి వచ్చినపుడు 'మిక్కిలి యయోమయముగా నున్న'దని యందురు.

33. పూజ్యము సం; పూజ్యమ్=పూజింపఁదగినది, (విశేషణము). ఇది తెనుఁగులో శూన్యము (లేనిది) అనునర్థములో వాడఁబడుచున్నది. ఆబాలునకిఁ దెలివి దేటలు గలవా యని ప్రశ్నించినపు డాపిల్లవాఁడు తెలివితేనివాఁడయినచో "నన్నియు నున్నవిగాని తెలివితేటలుమాత్రము పూజ్య"మని సమాధానము చెప్పుదురు. ఈసందర్భమున, 'తెలివితేటలుమాత్రము సున్న' యనియుఁ జెప్పుట గలదు. ఈ సున్నశబ్దము శూన్యశబ్దభవమేకాని క్రొత్తది గాదు. కాన దీనింగూర్చి యంతగా విమర్శింపఁబనిలేదు. ఈయర్థము పూజ్యశబ్దమున కెట్లువచ్చినదో యామార్గము మనస్సున కంతగా సరిపడకున్నది. పూజ్యశబ్దమునకు శూన్యమనునర్థము లౌకికవ్యవహారమునందుమాత్రమేకాక గ్రాంథికభాషలోఁగూడ నున్నట్లు,

శా. "భక్తుం డెవ్వఁడు ముక్తికౌశికపయఃపానంబు గావించి ని
ర్ముక్తక్లేశకు ముక్తకేశికిఁ గరంబుల్ మోడ్చి సత్యామన
స్సక్తుం గన్గొను వాఁడు గన్నయదివో జన్మంబు మేఁదాల్చియుఁ
ముక్తుం డాతఁడు భావికాలజననంబుల్ వానికిం బూజ్యముల్."

అను పాండురంగమాహాత్మ్య (2ఆ-155ప.) ప్రయోగము చెప్పుచున్నది. కన్నుల నడ్డుకొని సంగ్రహింపవలసిన యీశబ్దమును శబ్దరత్నాకరకారులు మఱచికాఁబోలు విడచినారు. మఱియు దీనికి సున్న యనునర్థము కన్నడభాషలోఁగూడ సురూఢమైయున్నట్లు కర్ణాటకపండితులు చెప్పుదురు. ఇట్లిన్నిరీతుల వ్యాప్తమైయున్న యీయర్థము దీనికి వచ్చుటలో నేదేని జక్కనిమార్గ ముండితీరవలయును. ఇంకను విమర్శించినఁగాని నిరూపింపవలనుపడదు.

34. దేవతార్చనము:- సం; దేవతార్చనమ్ = దేవుని బూజించుట. తెనుఁగున "తాము మాయింటికి దేవతార్చనమునకు దయచేయవలయును." మున్నగువాక్యములలో దేవతార్చనమనఁగా భోజన మని యర్థము. ఈవాడుక స్మార్తులలో నధికముగా నుండును. పూర్వము స్మార్తు లెల్లరును భోజనమునకు ముందుగా దేవతార్చనముచేసి వెంటనే భోజనముచేయు నభ్యాసముండెడిది. ఇట్లు భోజనము దేవతార్చనానంతరభావి గావున దేవతార్చనమనఁగా భోజన మనునర్థము రూఢమైనది. అదిగాక యేగృహమందు దేవతార్చనము చేయుదురో యచ్చటనే వండినపదార్థములను దేవునికి నివేదనచేయవలయుననియు నట్లు నివేదనచేసినపదార్థములనే తాముగూడ భుజింపవలయుననియు నియమము గావున నెచ్చట దేవతార్చనముచేయుదురో యచట భోజనము తప్పనే తప్పదు. ఇప్పటిస్మార్తులలోఁ జాలమంది దేవతార్చనావిధానమునైన నెఱుంగకున్నను వెనుకటివాడుకయే యనుస్యూతముగా వచ్చుచుండుటచే నందఱును నీశబ్దమును నైయర్థమున వాడుచున్నారు.

35. భద్రము :- సం; భద్రమ్ = మంగళము. తెనుఁగున నిది జాగ్రత్త యను నర్థమున వ్యవహరింపఁబడుచున్నది. ఎప్పుడైనను జాగరూకతతో నుండుట శ్రేయస్సునకు, మంగళమునకు హేతువగును. క్రమముగా హేతుహేతుమత్తుల కభేదమును గల్పించుకొనుటచే నిట్టివాడుక వచ్చియుండును. ఉదా = " నేను దిరిగివచ్చువఱకు నింటివద్ద భద్రముగా నుండవలయును. "

మనదేశములో సంస్కృతసమములై వ్యవహరింపఁబడుచున్నయాంధ్రపదముల యర్థవిపరిణామపద్ధతిని స్థాలీపులాకన్యాయమున నిటఁ జూపినాఁడను. ఇంకను సన్న్యాసి, అవస్థ, సంగతి, వర్తమానము, అద్వైతము,సదుపాయము, దురంతము, అభిజాత్యము, ఉద్యోగము, భ్రమ = ( ఆశ ) రాద్ధాంతము, విపరీతము, గ్రహచా

రము, తీర్థము, వాచకము, మర్యాద మున్నగునిట్టిశబ్దము లెన్నియో కలవు. పైని జూపినశబ్దము లన్నిటికిని నర్థవిపరిణామము తెలుఁగులో జరిగినదేకాని సంస్కృతము లోనిది గాదు. సంస్కృతములోఁగూడ సామాన్యవాచకము లగుపంకజాదిశబ్దము లకు విశేషవాచిత్వమును విశేషవాచకము లగుతైలాదిశబ్దములకు సామాన్యవాచ కత్వమును రూఢమగుటయు నిట్లింకను ననేకరీతుల నర్థము మాఱియుండుటయు సుప్రసిద్ధము. ఇట్లే దేశ్యాంధ్రములోఁగూడ వాయుసామాన్యవాచియగు 'గాడుపు' శబ్దము వాడుకలో వేఁడిగాలినిమాత్రము బోధించుచున్నది. ఉదా: "ఘాళుపు హెచ్చుగా నున్నది." ఇట శబ్దరూపముగూడఁ గొంతమాఱియున్నది. ఏదైనను హెచ్చుగా నున్నదని చెప్పునప్పు డాశబ్దములో వత్త్యక్షరములను (వర్గద్వితీయచతుర్థములను) బ్రయోగించుట మనవారి కలవాటైయున్నది. కనుకనే "ఘట్టిగా వల్లించితిని" "మెత్థగా నలిగిపోయినది" ఇత్యాదివ్యవహారములలో వత్త్యక్షరము లుచ్చరింపఁబడు చుండును. ఇఁక వివాహమగుచున్నవరుని బోధించుపెండ్లికొడుకు కనుపదమును వడక (వడుగు) పెండ్లికొడుకనియు, గర్భాధానపుఁ బెండ్లికొడు కనియుఁ జివరకు బాలసారె పెండ్లికొడు కనియుఁ గూడ నతివిచిత్రముగా వాడుచున్నారు. ఇట్టి మార్పులన్నిటికిఁ బ్రవాహరూపమున నుండువ్యవహారమే కారణము. ఈమహాప్రవాహమును నివారింప శక్యముగాదు. నివారింప యత్నించుట సమంజసమును గాదు. ఇట్టియర్థవిపరిణామము గలశబ్దములు లోకమున రూఢములై క్రమముగా మహాకవులచేఁ బ్రయుక్తములగుటయుఁ గొంతవఱకుఁ జూపియుంటిని. ఇప్పటికింకను గవులచే నాదరింపఁ బడని శబ్దములుగూడఁ గాలక్రమమున గ్రంథములందుఁ బ్రవేశింపకతీఱదు. ఇట్లు మాఱుచున్నశబ్దములను వానియర్థములను గ్రహించుచు దీనినిబట్టి వ్యవహారబలమన నెట్టిదో పరిశీలించుచు నిట్టిశబ్దార్థముల పరిగ్రాహ్యతను లోకమునకు బోధించుచు నానందించుచుండుటమాత్రమే భాషాతత్త్వజిజ్ఞాసువులకుఁ గర్తవ్యము.

పైనిజూపినవానిలో నర్థములవిపరిణామక్రమమును సరిగా గుర్తింపఁజాలక నే నేమేనితబ్బిబ్బుగా నిరూపించియుంటినేమో! అట్టివానిని సూక్ష్మదృష్టితో విచారించి సవరించుభారము భాషాచరిత్రపరిశోధకులవంటి నుంచి యిప్పటి కింతటితో విరమించుచున్నాఁడను.

# గ్రామ్యాపవాదనిరసనము

వాసా సూర్యనారాయణశాస్త్రి

---

రావ్ సాహేబ్ శ్రీగిడుగు వెంకటరామమూర్తిపంతులుగారితో నాకు విశిష్టపరిచయము కలదు. వారు చేసిన తెలుగుభాషాసేవా విధానవిశేషములను కనులార చూచి చెవులార విని యున్నాను. వారు భాషాసముద్రమును పూర్ణముగా మథించి దానిసారమును లోకమునకు ప్రసాదించినారు. వారు విమర్శకదృష్టితో పరిశీలింపని తెనుగుగ్రంథముగాని, తెనుగుపదముగాని, లేదనుటలో నతిశయోక్తి లేదు. కొందరు పండితులు పంతులుగారు గ్రాంథికభాషావిద్వేషులనిన్నీ, గ్రామ్యవాదులనిన్నీ, అపవాదములను లోకములో వెల్లడించారు. ఈయపవాదములు నిరాధారములు అన్యాయములని నాయల్పజ్ఞతతో నిరూపిస్తున్నందులకు ప్రాజ్ఞులను మన్నింపవేడుతున్నాను.

పాణిన్యాదులు అపభ్రంశము అపశబ్దపర్యాయముగా చెప్పిరి. తెనుగువ్యాకర్తలు అపభ్రంశగ్రామ్యములు పర్యాయములని చెప్పి లక్షణలక్ష్యములను చూపిరి.

ఆచార్యదండి. శ్లో॥ "శాస్త్రేషు సంస్కృతా దన్య దపభ్రంశత యేరితం."

శాస్త్రములయందు సంస్కరింపబడినదానికంటె వేరయినది యపభ్రంశమని చెప్పెను. శౌరసేని, మాగధి, మున్నగుప్రాకృతభాష లన్నియు సంస్కృతభాషాపరిణామములే. తెలుగుభాషకూడా వాటిలోనే యంతర్భవించును.

"సకలజగజ్జంతూనాం వ్యాకరణాదిభి రనాహితసంస్కార స్సహజో వచన వ్యాపారః ప్రకృతిః తత్రభవం తతఆగతంవా ప్రాకృతం."

సకలజంతువులకు వ్యాకరణాదులచే అసంస్కృతమై సహజమైన వచనవ్యాపారమే ప్రకృతి. దానియందు పుట్టినదికాని, దానివలన వచ్చినదికాని, ప్రాకృతము అనబడును. ఈవచనమును పరికించిన ప్రాకృతభాషలు వ్యాకరణనిరపేక్షములని విశదమగును. ప్రాకృతభాషలు వ్యవహారములో తరుచుగా మారుచుండుటచే అర్వాచీనులసుబోధమునకై వాటికి వ్యాకరణములు పుట్టియుండును. ఇట్టిస్థితిలో ప్రాకృత

భాషాసామాన్యమంతయు అపభ్రంశమే యగును. ఇది శ్రీరామమూర్తిపంతులు గారివాదమునకు అత్యంతము సాధకముగానె యున్నది. ఆంధ్రశబ్దచింతామణి నన్నయ భట్టవిరచితమని యంగీకరించినను ఆలక్షణము వారిభాషాప్రపంచములో శతాంశము నయినను సంస్కరింపలేదు. నన్నయభారతముకంటె ప్రాచీనమైన తెనుగువ్యాకరణ మొక్కటిన్నీ కానరాదు. నేటికిన్నీ ప్రాచీనప్రయోగములను నిశ్శేషముగా సంస్కరించిన తెనుగువ్యాకరణము లేదు. కాబట్టి అసంస్కృతము గ్రామ్యము (అపభ్రంశము) అంటే భారతాదులకే అదుర్గతిపట్టును. "ప్రయోగమూలం వ్యాకరణం" "సిద్ధిర్లోకాద్దృశ్యా" అనుప్రమాణములచే శబ్దసిద్ధి శిష్టలోకైకశరణ్యమనిన్నీ; సిద్ధశబ్దములకు వ్యాకర్తలు ప్రకృతిప్రత్యయవిభాగమును చూపి వర్ణాగమ, వర్ణలోప, వర్ణవ్యత్యయాదిరూపసంస్కారమును చేయుదురనిన్నీ తెల్లమగును.

ఆచార్యదండి - శ్లో. "ఆభీరాదిగిరః కావ్యే ష్వపభ్రంశత యేరితం."

కావ్యములయందు గొల్లలు మున్నగువారిపలుకులు అపభ్రంశములు అని చెప్పెను. "ఏటొ్" "అటొ్" ఇట్టిపదములను గ్రామ్యులు వాడుదురు. అట్టిపదములను వాడండని పంతులుగారు ఎన్నడున్నూ చెప్పియుండలేదు. కావున ఈయపభ్రంశలక్షణమున్నూ పంతులుగారివాదమును స్పృశింపదు.

ఉక్తలక్షణవంతమైయుండునట్టి కావ్యము నెఱుంగవలయు సంస్కారమనుచు
హీనలక్షణకావ్యంబు నెఱుఁగవలయు గ్రామ్యమనుచునుమఱియపభ్రంశమనుచు.
చులకఁగా గ్రామ్యజనములుపలుకునట్టి తెనుగుమాటలు గ్రామ్యంబులనఁగఁబడియె
వర్ణలోపంబునొంది కావ్యములఁజొరవు పరులఁదెగడెడుచో నొప్పుఁజాలదొంగ.
వస్తాడా హరి సొమ్ములు తెస్తాడా గొల్లడంట దిట్టక కరుణన్ ... ఇత్యాది
(అప్పకవీయము.)

అప్పకవి 'లక్షణవంతమైనకావ్యము సంస్కారము; లక్షణహీనమైనకావ్యము గ్రామ్యము లేక యపభ్రంశము;' అని నిర్వచించెను.

నన్నయభారతమునకు పూర్వము లక్షణము లేదుగదా! సమకాలీనులు తన్ను ప్రశ్నించినచో నన్నయ యేలక్షణమును చూపి తనభారతమును సమర్థించుకొని యుండును ? అర్వాచీనకవులయినను తమప్రయోగములకు ప్రాచీనలక్షణములను చూపజాలరు.

"సిద్ధే శబ్దార్థసంబంధే" అని శబ్దసిద్ధియు అర్థసిద్ధియు లోకమువల్లనే కలుగవలయు నను న్యాయము నంగీకరించవలయును. లేదేని ప్రాచీననవీనాంధ్ర వాఙ్మయమంతయు లక్షణహీనమగుటచే నప్పకవిగారిగ్రామ్యతాదోషమునకు లక్ష్యమగును.

గ్రామ్యజనులు చులకగా పలుకుటచే వర్ణలోపమును పొందినపలుకులు గ్రామ్యములని యప్పకవి రెండవలక్షణమును చెప్పి "వస్తాడా" "తెస్తాడా" ఇత్యాది లక్ష్యములను చూపెను. వర్ణలోపము సంస్కారైకదేశము. చూచినవారు, చూచినారు; ఇందు వకారము లోపించినది. ఇట్టివి భాషలో వేవేలున్నవి. గ్రామ్యాలే కాదు. నాగరికులయినను అర్థప్రతీతి కాకుండా విరూపముగా నుచ్చరించినచో నవి గ్రామ్యములె కావచ్చును. వస్తాను తెస్తాను ఇత్యాదిపదములు భాషాశిష్టులచే సభలయందు అనేక శతాబ్దములనుండి ధారాళముగా నుచ్చరింపబడుచున్నవి. గ్రంథాదులయందుకూడా వ్రాయబడుచున్నవి. తెనుగువ్యాకర్తలు సిద్ధశబ్దములను సంస్కరింపవలసినదే కాని గ్రామ్యములని త్రోసిపుచ్చరాదు. అప్పకవి గ్రామ్యలక్షణములున్నూ పంతులుగారిభాషను అణుమాత్రము స్పృశింపవు.

### పంతులుగారి వాదస్వరూపము

పాణిన్యాదులు దేవభాషను విపులముగా సంస్కరించి అందు వైదికభాష వ్యవహారభ్రష్టమగుటచే ప్రయోగార్హము కాదనిరి. ఆయాదేశములలో నాయాకాలములలో శిష్టవ్యవహారమం దున్నపదముల నన్నిటిని సంగ్రహించి సంస్కరించిరి. వలయుచోట పెక్కురూపాంతరముల నిచ్చిరి. వైదికభాషవలె నన్నయాదులభాష ప్రాయికముగా వ్యవహారభ్రష్టమైనది. వారికాలములో నాభాష వ్యవహారమునకు సన్నిహితముగా నుండుటచే అర్థస్ఫూర్తిని శీఘ్రముగా కలిగించియుండేది. ప్రకృతకాలమున నట్లుకాదు. భావప్రకాశనమును చేయుటయె భాషయొక్క ముఖ్యప్రయోజనము. అట్టిప్రయోజనము సంకుచితమగుటచే నాప్రాచీనభాష ప్రయోగార్హము కాదు. ఇంతే కాదు. నన్నయాదులు తమకాలపు శిష్టవ్యవహారములో నున్నభాష నంతను తమకృతులలో సంగ్రహించియుండలేదు. అట్టిసంగ్రహణమున్నూ అశక్యము; అసంభవము. వారు ప్రయోగించిన సుబన్తతిఙన్తపదములలో వారు ప్రయోగించని యితరరూపములు నేడు మనకు దురూహములు, ఆనాటికారకస్వరూ

షము మనకు సువిజ్ఞేయము కాదు. ఆధునికకవులు వాటి ననుకరింప ప్రయత్నించి భ్రమప్రమాదములకు లోనయిరి. ఈయనుకరణముచే ప్రాచీనము, వ్యావహారికము, కాని యొకకృతకభాష దేశములో పొడచూపినది. కాబట్టి వైదికభాష వలెనే ప్రాచీనపు తెనుగు మన కత్యంతపూజ్యమే యయినను ప్రయోజ్యము కాదు.

ఇస్తివి, చేస్తివి, ధారవోస్తివి, ఇచ్చేవారు, హెచ్చేది, అయితే, ఏలా, అంతా, అనిన్నీ, వాళ్లు, వాటికి, ఇత్యాదిపదములు వేలకువేలు తెనుగువ్యాకర్తలచే గ్రామ్యములని నిషేధింపబడినవి. ఈపదములు రామస్తవరాజీయము, భట్టాభిరామాయణము, శతకములు, శాసనములు, ధర్మశాస్త్రాదిగ్రంథములవ్యాఖ్యానములు, మొదలగువాటియందున్నూ, శిష్టవ్యవహారమందున్నూ, అనేకశతాబ్దములనుండి యఖండవ్యాప్తి కలిగియున్నవి. ఇట్టిప్రయోగమహితము లయినపదములను గ్రామ్యములని నిరాకరించుట భాషాసంప్రదాయవిరుద్ధము. వలయుచో వాటిని సంగ్రహించి సంస్కరించుటయే వ్యాకర్తలధర్మము. జీవద్భాషలు నిత్యము పరిణమించే స్వభావము గలవి. వాటిపరిణామమును, అభివృద్ధిని, నిర్బంధించుట కెవ్వరికి నెన్నడు శక్యము కాదు. వ్యావహారికభాషలో తమభావముల చక్కగా వెల్లడించుటకు పలువుర కవకాశముండును. దానిచే లోకములో విజ్ఞానము, భాషయున్నూ, మిక్కిలి యభివృద్ధిని పొందును. నిరోధము యభివృద్ధికి భంజకము; భాషలమూలసూత్రమునకే విరుద్ధము. వ్యవహారభ్రష్టమైన భాష నానాటికి క్షీణించుట జగద్విదితమే. తెలుగు వ్యాకరణములు పరస్పరవిరుద్ధములు; పరిమితములు; ప్రాచీనభాష నైనను సమగ్రముగా సంస్కరింపజాలక కుంఠితములైనవి. వాటిపై నాధారపడి భాషను నిర్బంధించుటకాని, అపమార్గమునకు త్రిప్పుటకాని ప్రమాణసంప్రదాయముల కనుగుణమార్గము గాదు. ఒకక్రొత్తపదము భాషలో ప్రవేశించి శిష్టామోదమును బడసినచో నది గ్రాహ్యము, సంస్కార్యమే యగును కాని త్యాజ్యము కాదు - అని శ్రీరామమూర్తిపంతులుగారు సర్వదా ప్రబోధమును చేయుచుందురు. ఇది వారి వాదస్వరూపము. తమవాదముయొక్క సత్యతను వెల్లడించుటకై ఆధునికవిద్వత్కవులగ్రంథములనుండి దోషములను ఎత్తిచూపి ప్రాచీనభాష యెవ్వరికిన్నీ సులభము కాదని రుజువుచేయుదురు. ఈదోషప్రకాశనము ద్వేషముచే కాని ఈర్ష్యచే కాని కాదు. వ్యవహారభ్రష్టమైన వైదికభాష ప్రయోగానర్హ మని చెప్పి శిష్టవ్యవహార

సిద్ధమైన దేవభాషా సామాన్యము నంతను సంగ్రహించి సంస్కరించినపాణిని మున్నగు వారు గ్రాంథికభాషావిద్వేషులున్నూ, గ్రామ్యవాదులున్నూ, అయినచో పంతులు గారున్నూ, అట్టివారే యగుదురు.

ప్రకృతవాదము రామమూర్తిపంతులుగారితలపైన మొలవలేదు.

సునందినీపరిణయము; సుఖమంజరీపరిణయము; తారాశశాంకనాటకము; ప్రతాపరుద్రీయము; నాగానందము; శ్రీనివాసకల్యాణము; మున్నగునాటకములయందు విద్వన్మహాకవులు పాత్రోచితముగా గ్రామ్యము నుపయోగించి వాడుకభాషకు నాటకములలో స్థానము నొసంగిరి. నాటకములలో గ్రామ్యభాషాప్రయోగవిషయమై "అముద్రితగ్రంథచింతామణి" అనేపత్రికలో పండితప్రవరులకు ఘోరతరమైన వాదోపవాదములు పెచ్చుపెరిగినవి. అందు శ్రీ. ఎరుగుడిపాటి వెంకటాచలము గారు "నాటకములు రసప్రాధాన్యములు రసపోషణకై పాత్రోచితమైనభాష నాటకములయం దవశ్యము ప్రయోగింపఁబడవలసినది" అని పెక్కుయుక్తులను ప్రమాణములను చూపిరి, పత్రికాధిపతులయిన శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు మున్నగువారు పైవాదమునె సమర్థించిరి. దీనిచే మన మొకయంశము నూహింపవచ్చును. రసపోషణకై నీచపాత్రలయందు స్వాభావిక మైనగ్రామ్యభాష నుపయోగింపవచ్చునని నిరూపించినపుడు ఝుడితియర్థస్ఫూర్తిని కలిగించి తన్మూలమున వ్యవహారవిజ్ఞానమును రసాస్వాదాదులను కలిగించేవాడుకపదములను భాషాకావ్యములలో నేలప్రయోగింపరాదు? కావున పంతులుగారివాదమునకు పలువురు విద్వత్కవులు బీజములను పూర్వమే నాటియున్నారు. అట్టిబీజములకు పంతులుగారు ప్రమాణములు, ప్రయోగములు, సంప్రదాయములు, ప్రయోజనములు, మున్నగువాటిని విశ్వతోముఖముగా చూపి మహాపోషణము కావించిరి. ప్రారంభావస్థలో ప్రతిపక్షులయినపలువురు పండితప్రవరులు సత్యార్థమును గ్రహించి వారివాదమునకు చేయూత నొసంగిరి.

నేను వారివాదమునకు నవీనవాఙ్మయమందున్నూ, పత్రికాప్రపంచమందున్నూ, అనుకొన్నదానికంటె నూరింతలు ప్రచారము చేకూరినది. నేనున్నూ ప్రారంభములో వారివాదమును ప్రతిఘటించి యాంజనేయునిముందర కుప్పిగెంతులు వేస్తిని. నాయుక్తులు వాదములు నిర్వీర్యములు కాగానే వారిశిష్యకోటిలో చేరితిని. మాండలికప

దములు అన్యమండలములవారికి దుర్బోధములుగాన సర్వసాధారణమైనగ్రాంధిక భాషయె గ్రాహ్యముకాని వ్యావహారికము కాదని కొందరు ఆక్షేపింతురు. ఇది నిస్సారము. దీనికి సమాధానముగా అముద్రితగ్రంథచింతామణిపత్రికలో శ్రీ॥ ఎరుగుడిపాటి వెంకటాచలముగా రొకనిదర్శనమును చూపిరి- "1898సం॥ డిసెంబరు నెలలోఁ జెన్నపురిలో జరిగినకవిపండితసంఘమునకు రాజమహేంద్రవరమునుండి మ॥ వడ్డాది సుబ్బారాయఁడుగారును, బళ్లారినుండి మ॥ ధర్మవరము కృష్ణమాచార్యులుగారును, ఆత్మకూరునుండి మతిరెయొకయాచార్యులుగారును; చిత్తూరునుండి మ॥ నాగపూడి కుప్పసామయ్యగారును వచ్చి అచ్చట వీరందఱు నిజదేశీయపదభూయిష్ఠం బైనగ్రామ్య భాషతో నెగడా ప్రసంగించిరి.

"అట్లుండియు నక్కడికి వచ్చియుండినవారికి వీరిప్రసంగములయందలి రసభావములు చక్కగా విశదములు కాలేదా? పైకారణములనుబట్టి వెంకటసుబ్బయ్యగారివాద మనుభవవిరుద్ధమై యుక్తిశూన్యమై యున్నది" అనివ్రాసిరి. పైన నేను పేర్కొన్న నాటకములను రచించినవారందరు ఇట్టియభిప్రాయముచేతనే తమనాటకములలో గ్రామ్యము నుపయోగించిరి. నేఁడు రైళ్లు, బస్సులు, తీర్థములు మున్నగుతావుల యందు కలుసుకొన్న అన్నిమండలములవారు తమతమవాడుకభాషలో ధారాళముగా ప్రసంగించుకొనుచున్నారు. వ్యవహారసిద్ధి యగుచునెయున్నది. కావున పైయాక్షేపణము నిస్సారము. పంతులుగారివాదము నరికట్టుటకు చూపబడినయాక్షేపము లన్నియు నిస్సారములయినవి. వారిమతము భాషావిజ్ఞానాభివృద్ధులకు త్రోవచూపుచున్నది. వారు గ్రాంధికవిద్వేషులున్నూ గ్రామ్యప్రియులున్నూ కారు. వారిపై మోపినయపవాదములునిరాధారములు అన్యాయములని విన్నవించి విరమిస్తున్నాను.

# స్త్రీల సారస్వతము

చింతా దీక్షితులు

---

"ఏడవకు నాతండ్రి ఏడవకు తండ్రీ ఏడిస్తె నిన్నెవ్వ రెత్తుకుంటారు"

ఒక తెలుగుబిచ్చగత్తె చంకను జోలి వేసుకొని, శిశువు నెత్తుకొని ఇంటింటికీ తిరిగి ఈపాట పాడుతోంది. చంకనున్నశిశువు ఒకమారు పాలుతాగుతోంది; ఒకమారు తల్లిపాట వింటోంది. కిన్నరీకంఠముతో పాడుతున్న ఈపాటకు ఆమె కక్కడక్కడ గుప్పెడుబియ్యము దొరుకుతున్నవి.

"ఏడవకు కుశలవుడ రామకుమార, ఏడిస్తె నిన్నెవ్వ రెత్తుకుందూరు"

పాపము ఎత్తుకోడానికికూడా ఎవరూలేని ఈకుశలవులస్థితి విన్న తెనుగుతల్లులంద రికీ హృదయములో శూలము గుచ్చుకున్న ట్లయింది. ఈపాట పాడినతల్లి సీతాదేవి, 'సిరిగల్గు ఋషిపల్లెవీధుల పందిళ్లలో,'

"నారచీరెలతోను ఉయ్యాలవేసి, జానకి తనయులకు జోలలుపాడె"

సంతోషముతో జోలలుపాడి కొడుకులను నిద్రపోగొట్టవలసినసీత కంట నీరుపె ట్టుకొని గద్గదస్వరముతో పాడుతోంది. బంగారుతూగుటుయ్యాలాల్లో పవళించవల సినచక్రవర్తికుమాళ్లు నారచీరలఉయ్యాలాల్లో పండుకొని నిద్రపోకుండా అల్లరి చేస్తూ తల్లిచేత పాటలుపాడించుకొంటున్నారు. ఈచిన్నపిల్లలకు కట్టుకునేటందుకు మంచిబట్టలు లేవు, నగలు లేవు, అందెలు లేవు, గజ్జెలు లేవు, పురిగోరు లేదు, ఉంగ రాలు లేవు, ఉయ్యాలా లేదు. సీతాదేవి "మీవాళ్లందరూ అన్నివస్తువులూ మీకు తెచ్చిపెడతారు ఏడవకండి" అని కొడుకులను ఊరడిస్తోంది.

"ఏడవకు కుశలవుడ రామకుమార, ఏడిస్తె నిన్నెవ్వ రెత్తుకుందూరు;
ఉంగరమ్ములు గొనుచు ఉయ్యాలగొనుచు, ఊర్మిళాపినతల్లి వచ్చె నేడవకు;
పట్టు టంగీ గొనుచు పులిగోరు గొనుచు, భూదేవి అమ్మమ్మ వచ్చె నేడవకు;
రావిరేకలు గొనుచు రత్నాలు గొనుచు, లక్ష్మన్న పినతండ్రి వచ్చె నేడవకు;
ఏడవకు కుశలవుడ రామకుమార, ఏడిస్తె నిన్నెవ్వ రెత్తుకుందూరు"

ఈపాట విన్నమనకు హృదయము తరుక్కుపోతోంది.

ఈపాట పాడిన తెలుగుబిచ్చకత్తెకు గుప్పెడుబియ్యము పెట్టి ఆదరిస్తున్నారు కొందరు ప్రజలు. ఈఆదరణకన్న తాను పాడేపాట యిచ్చే అనునయము ఆమెకు అతిశయము.

ఈపాట విన్నప్పుడు సీతా, కుశలవులూ జ్ఞాపకము రాలేదు. పామరులకూ, స్త్రీలకూ, బాలురకూ బాలికలకూ వినియోగించుటకై పూర్వులు కూర్చిన పదములూ, యక్షగానములూ, పాటలూ, ఆటలూ-వీటిస్థితి జ్ఞాపకమువచ్చింది. ఆంధ్రసరస్వతి ప్రజాసారస్వతాన్ని ఉద్దేశించి ఈపాట పాడినట్లు స్ఫురించింది.

"ఏడవకు నాతల్లి ఏడవకు తల్లీ, ఏడిస్తే నిన్నెవ్వ రెత్తుకుందూరు"

ఒకమూల పండితులసారస్వతము దీనిపీకె నొక్కివేస్తోంది. కవిచరిత్రకారులూ, వాఙ్మయచరిత్రకారులూ ప్రజాసారస్వతాన్ని నిరసించారు. పండితకవులు నిరసిస్తున్నారు. ఈవిధముగా ఇది నశిస్తుందేమో అనిపిస్తోంది.

ఇంకోమూల పాశ్చాత్యనాగరికం దీన్ని పీకె నొక్కివేస్తోంది. చదువుకొన్న-అంటే ఇంగ్లీ చదువుకొన్న - పురుషులూ, స్త్రీలూ ఇట్టిసారస్వతాన్ని ఆదరిస్తే తమ నాగరికతకు ఎటువంటిభంగము వస్తుందో అని భయపడుతున్నారు. ''నేటినాగరపు స్కూళ్లలో జదువుకొనుబాలిక లిట్టివాటిని (పాటలు మొ॥) ఎరుగరుగదా! వీరు తల్లులైనపుడు తనయుల కిక నెట్లు తెలియును." ఇవి వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మాటలు.

వీరు తల్లులైనపుడు "డికరీ డికరీ డాక్"అనిగాని "జాక్ అండ్ జల్ వెంటప్ ది హిల్" అనిగాని ఇంగ్లీషుపాటలు పాడతారని తోస్తుంది. అవేగదా బళ్ళల్లో చెప్పుచున్నది! తెలుగుపాటలకీ, పదాలకీ, యక్షగానాలకీ బళ్ళల్లో చోటు లేదుగదా. ఇంక వాటిగతి ఏమిటి ?- ఆంధ్రసరస్వతి అందుకనే జోలలుపాడుతోంది వాటి నుద్దేశించి-

" ఏడవకు నాతల్లి ఏడవకు తల్లీ, ఏడిస్తే నిన్నెవ్వ రెత్తుకుందూరు "

ఎవ్వరూ ఎత్తుకోకుండానే కుశలవులు పెద్దవాళ్లై రాజ్యము సంపాదించుకొన్నట్లు ఎవ్వరూ ఎత్తుకోకపోయినా ఈసారస్వతశాఖ దినదినాభివృద్ధి చెంది కొంతకాలానికి మళ్లీ తెలుగు హృదయాలను ఏలుకోగలుగుతుంది.

సీతాదేవి కొడుకులకు జోలపాటలు పాడి మనకు జాలిపుట్టించింది.

గోపికలు శ్రీకృష్ణుడికి లాలిపాటలు పాడుతున్నారు వినండి ఉత్సాహముతో -

"లాలనుచు పాడరమ్మా, ఈబిడ్డలక్ష్మీవిలాసు డమ్మా
పాదమున చక్రి మమ్మా, ఈబిడ్డ వేదాంతవేద్యు డమ్మా
వేణునాదంబుతోను, ఈబిడ్డ వేదములు పాడునమ్మా"

♦ ♦ ♦

వేణునాదముతో వేదములు పాడే శ్రీకృష్ణుణ్ణి పోతన్నగారి శ్రీకృష్ణుడిక్రిక్కను కూర్చోపెట్టడానికి సందేహిస్తారెందుకో ఈపండితులు ? వీళ్ళకు హృదయా లున్నా యంటారా ?

శ్రీరాముడికి లాలిపాటలు మనతల్లులు పాడుతుంటే మనము విన్నాము. మళ్ళీ విందాము -

"రామా లాలీ మేఘశ్యామా లాలీ, తామారాసానయనదశరథతనయా లాలీ
అద్దాలతొట్లలో నీవు ఆడుకొందూవు, ముద్దుపావడంచునిన్ను మురిసిచూచేరు"

మళ్ళీ మనశైశవమందలిమాధుర్యము మనము అనుభవించి ఆనందిస్తున్నాము.

ఆదిభిక్షువై బూడిదబూసుకు తిరిగే శివునకుకూడా లాలిపాటలు పాడారు. సర్వజ్ఞణ్ణిగూర్చి పాడినలాలిపాట యిదిగో.

"లాలి శంకర సదాలాలితకుమారా, లాలి పటుతాండవోల్లాసఘనధీరా
లాలి పంచాస్య కైలాససంచారా, లాలి మధురాలాప లాలి గంభీరా
పతితపావన రుద్ర ఫణిరాజభూషా, జితకాలకూట వర్ణితభవ్యవేషా"

కుయ్యూరిగ్రామమండలి సీతారామదాసు వ్రాసినపాట యిది.

"లాలి బంగరుబొమ్మ లాలి మాయమ్మ, లాలి ముద్దులగుమ్మ లాలి సీతమ్మ"

ఇత్యాది సీత నుద్దేశించినలాలిపాట.

"జోజో చిదానంద జోజో ముకుందా, జోజో కృపాపాంగ జో సుందరాంగ"

ఇది ముకుందునిగూర్చి. ఇంకా ఎందరెందరో దేవతలనుగూర్చి, మహాపురుషులను గూర్చి లాలిపాటలు పాడి శైశవమందే తల్లులు తమపిల్లలకు ఆనందమును కూర్చుతున్నారు. సత్సంగము నిస్తున్నారు. స్త్రీలసారస్వతములో జోలపాటలకు ముఖ్యస్థానము కద్దు.

రామాయణము, భారతము, భాగవతము - ఈగ్రంథములలోని వివిధానవిష యము లన్నింటిమీదా పాటలు స్త్రీలు పాడుకొంటూ ఉంటారు.

పతివ్రతలవివాహగాథలు గేయరూపకముగా స్త్రీలసారస్వతమునందు విరాజిల్లు తున్నవి. సీతవివాహము, సుభద్రకల్యాణము, ద్రౌపదివివాహము, రుక్మిణిపెండ్లి, పార్వతిపాణిగ్రహణము, శశిరేఖ పెండ్లి ఇత్యాది ఎన్నో ఉన్నవి.

"సీతాకల్యాణమహోత్సవసమయము చూతామురారే చెలీ" అనిముత్తైదువుల నందరినీ తీసుకొని బయలుదేరుతున్నారు స్త్రీలు. వారివెనుకకే వెళ్లి మనమూ చూద్దాము రండి-

"బంగారుమంటపాంతరమున, నవరత్నశృంగారపీఠమందు
రంగుగా చేమంతివిరుల, రంగుదండలు కాంతిపై
నుప్పొంగిచూడగ రఘుకుల, పుంగవుడు వేంచేసె నేడిక"-

భేరీమృదంగకాహళములు మ్రోగుతున్నవి. ముత్యాలహారతి నివ్వాళి యిస్తు న్నారు. "కల్యాణమహోత్సవము కన్నుల చూడగా కౌతుకమగుచున్నది." "చెం గావిచీరగట్టి చెరగులు జారగను శృంగారవతు లిచ్చిరి శ్రీమణిమంగళహారతులు" "ముత్తయిదువ లందరూ ముదముతో బంతులు కూర్చుండగ పూబోణులెల్ల భక్ష్య భోజ్యము"లు వడ్డిస్తున్నారు. సీతారాములకు నలుగులు పెట్టారు.

"నలుగిడ రారమ్మ నలినాయతాక్షికి, చెలువుడా శ్రీరామచంద్రున కిపుడు
మృగనాభిఘనసారమిళితగంధమున, పసిడినిగ్గులు గుల్కుపసుపు లందముగ
కుసుమరజము కేలగొని కూర్మితోను"

బూజంబంతిపాటలుకూడా పాడారు.

"వింతబొమ్మలు పెట్టేవారు, ముంతమూకుడు లుంచేవారు
మంతనంబులు దెలిపేవారు, సంతోషంబున నవ్వేవారు
ఎంతరుచియని చెప్పుదును, రవ్వంత చవిగొనుమని రాముడు
వింతభక్ష్యము తీసి సీతా, కాంత కొసగెను చూడరే సఖ"

ఈవిధముగా వైభవముగా సీతారాముల వివాహమైనది.

ఈసందర్భమున శ్రీకృష్ణుని బూజంబంతిపాట చూడండి-

"పచ్చంగ కట్టిన పందిళ్లకింద, శ్రీకృష్ణుకమర్చిరీ బూజమ్మొబంతి
తాళమేళముల సంగీతాలవారూ, సత్యభాగవతులు తమరు కూర్చుంద్రి
తోటయరిటాకులే పమిడిపళ్లెములు, వెండిగిన్నెలతోను వెలసె బూజమ్మ
రాజనాలన్నమూ కందిపప్పులునూ, వెన్నగాచిననేత వెలసె బూజమ్మ
అరువై కూరలూ పిండివంటలునూ, అమర విద్వాంసులతో అమరె బూజమ్మ"

♦ ♦ ♦

వివాహసందర్భములలో స్త్రీలు వేడుకగా చేసే కార్యములన్నీ దేవతల కారోపించి వారినిగూర్చి పాటలు పాడతారు. సువ్విపాట యిదిగో :

"సువ్విసువ్వి రామచంద్రి సువ్విసువ్వి కీర్తిసాంద్రి,
సువ్వి సీతమ్మ మాకు శుభము లిమ్మా;
మోదమునను పెండ్లిపీటమీద శ్రీరామునరస
అదిలక్ష్మి యైనసీతమ్మ నునిచిరీ;
వాటమైనకుందసంపు మేటికుండెయందు నిల్పి
గాటమైనపసిడిరోకళ్లు బట్టుకొ;
రాజనములు యిప్పపువ్వ రాజనములు మంచిపునుగు
మేలుకొండరాజనములు మేలువంకెలూ;
కుందియందు నిండ నునిచి కొట్నమూలు దంచిరపుడు
కుందరదనలెల్ల నవ్వుకొనుచు జెలగుచు"

ఈవిధముగానే పూలబంతులపాటలు, గంధంపాటలు, వగైరా.

స్త్రీలసారస్వతములో కరుణారసభూయిష్ఠమైనపాటలు అప్పగింతలపాటలు. ఆడ పిల్లల గన్నతల్లులూ తండ్రులూ అప్పగింతలప్పుడు పొందే ఆవేదన ఆపాటలలో ప్రతిబింబిస్తూ ఉంటుంది. చూడండి. జనకమహారాజుగారు తనకుమార్తె సీతమ్మని రామాదులకు అప్పగిస్తున్నాడు. కవి కరుణారస మెట్లు ఒప్పించాడో! జనకుడు సీతను రమ్మనిపిలుస్తున్నాడు.

"మామిడిపండురావె మాణిక్యమా రావె, మత్స్యావతారులదేవి రావమ్మ;
గుమ్మడిపండు రావె గుణధామ రావె, కూర్మావతారులదేవి రావమ్మ;

♦ ♦ ♦

పసుపు పండు రావె బంగారుబొమ్మ , పట్టాభిరాముల దేవి రావమ్మ
జనకుడు జానకిని తొడలపై నుంచి , ఆనంద బాష్పములు కన్నుల నింపె..."

జనకుడు సీతకు బుద్ధులు చెప్పుతున్నాడు.

,, విభుడు కోపించెనని వింత చేయకుమ , భ్రమగల్గి ప్రాణేశుపాదానుండు
విభుడు మన్నించెనని విర్రవీగకుమి, భ్రమగల్గి ప్రాణేశుపాదానుండు
రాములచిత్తమ్ము ఎరిగుండవమ్మ, మామీద భ్రమ తల్లి మరచుండవమ్మ;"

తరవాత పేరుపేరువరసని దశరథాదులను పిలిచి జానకిని జనకుడు వప్పగిస్తున్నాడు.

దశరథుని చేతిలో చెయి యొప్పగించినపిమ్మట

♦ ♦ ♦

"కైకమ్మ చేతిలో చెయి యొప్పగించి, చేడెరో మీసేవ చేయించుకొండి
ఆడబోయి తాను అట్టె ఉంటేను, మెల్లగా నేర్పుతో పిలుచుకోరమ్మా
మాపట్టి గాదుసుమి మీపట్టిసుమ్మి, అది శాంత ఇది సీత సమముగా జూడు"

కౌసల్యకు జానకిని ఒప్పగిస్తూ తల్లిప్రేమ ఎట్లా పలుకుతోందో చూడండి

"నీకిస్తి పాలలో ముంచెత్తవమ్మ, పాలనే ముంచెత్తు నేతముంచెత్తు
పాలు గాచనేరని పడతిసుమి వదెన, నెయ్యి గాచనేరని నెలతసుమి వదెన
ఆకలని యెన్నడు అడగనేరదు, వేళ యెరిగి పెట్టుమి వెలది మావదెన"

సీతను ఒప్పగించే వేళ సీత చెలికత్తెలందరూ వచ్చారు-మామూలుప్రకారం ఆడు కోడానికి కాబోలు. అప్పుడు అన్నమాట లివి :

,, మాసీత లేదుగా మీతోటి ఆడ , అమ్మలారా మీర లేలవచ్చెదరే;
బొమ్మరిండ్లున్నవి బొమ్మలున్నవి , ఆట యెవరాడెదరు అమ్మ మాయింట;
బొమ్మరిండ్లు గట్టి బొమ్మలను బెట్టి , ఆటయెవరాడెదరు అమ్మ మాయింట;
బొమ్మలకు సొమ్ములు కోరి తెమ్మనుచు , నన్నెవ్వ రడిగెదరు నాతల్లి సీత;
ఇంట గుజ్జెనగూళ్లు అట్టె వండుచును , అల్లెవ్వరొండెదరు అమ్మ మాయింట;
ఆడుచు పాడుచు అట్టె రమ్మాని , నన్నెవరు పిలిచెదరు నాతల్లి సీత;
వేకువజామున వెలదులను బిలచి , తద్దెవ్వ రుండెదరు తల్లి మాయింట;
ఊగుదము రమ్మని ఉవిదలను పిలిచి, ఇంకనూగెడివార లెవరు మాయింట;
బంతి నారుబోసి మాదొడ్డినిండ , చెల్లెవరు వేసెదరే చేడెరో సీత"

సీతను తీసుకువెళ్ళిపోతున్నారు. తల్లిదండ్రుల ప్రాణం ఉండబట్టడంలేదు. ఒక మారు తిరిగిచూడవే అమ్మా అని సీతను పిలుస్తున్నారు.

"ముత్యాలమాణిక్య మల్లాడగాను, ముదితరో మాసీత తిరిగిచూడావే
పచ్చలభాషికం అల్లాడగాను, పడతిరో మాసీత తిరిగిచూడావే
నీలాలభాషికం అల్లాడగాను, నెలతరో మాసీత తిరిగిచూడావే."

సీత వెళ్ళిపోయింది అత్తవారింటికి.

♦ ♦ ♦

సుభద్రాకల్యాణమనేపాట వేంకటకవి విజయవిలాసమునను సరించి వ్రాసిన ట్లున్నది. దీనిని వ్రాసినకవి తాళ్ళపాక తిమ్మక్క. మచ్చుకి రెండుముక్కలు:

"ఉమ్మెత్తపువ్వువంటి ఉలికినమడత, సఖియలు కొనితెచ్చి నాతి కిచ్చినను"

♦ ♦ ♦

"తరళాక్షి తలపోసి అడిగె కీరమును, ఎచ్చోట నున్నాడు ఎలమి నర్జునుడు
ఏపుణ్యభూములకు ఏగియున్నాడు, ఎచ్చోట తీర్థంబు లాడుచున్నాడు
అనుచు కీరము నడుగ విని అర్జునుండు, కోమలీ యిద్దరం గోకర్ణమందు
కూడిపాడుంటిమి కొన్నాళ్లు అచట, శయనభోజనములు ఒకచోట మాకు."

♦ ♦ ♦

స్త్రీలసారస్వతములో జననములుకూడా ప్రధానమై ఉన్నవి. శ్రీకృష్ణజననం, మేనకనోమ్ములు అనగా పార్వతిజననం, రుక్మిణివేవిళ్ళు అనగా మన్మథజననం, కుశ లవులపుట్టుక, సీతపుట్టుక, మార్కండేయజననం మొదలైన వెన్నో ఉన్నవి. ఇద్దరు అడుక్కునేస్త్రీలు శ్రీకృష్ణజననం గొంతుకలు కలుపుకొని ఒకనాడు వీధిలో పా డారు. నాహృదయం హరించిన దాపాట. మొదటినుంచీ పాడమన్నాను. సగంవర కూ వచ్చునని పాడారు. మీ కేమి ఇవ్వమన్నా రన్నాను. మీయిష్టం తండ్రీ మే మేమైనా ముల్లె దాచామా ఏమిటి మీదగ్గిర అన్నారు. గుప్పెడు బియ్యముతో సంతోషించే హృదయము వారిది. మీ కాపాట రుచిచూపిస్తున్నాను. కాని వారి కలకంఠము, సౌకుమార్యము, జీవము ఈఅక్షరాల్లో మీరు చూచుకోండి, చూచు కోకపోయినా పాటమాధుర్యానికి లోటులేదు. ఇంక వినండి భిక్షుకస్త్రీలు మొదలు శ్రీమతులవరకూ పాడుకొనే శ్రీకృష్ణజననం,

కస్తూరిరంగరంగా నాయన్న కావేటిరంగరంగా
శ్రీరంగరంగరంగా నినుబాసి యెట్లు నే మరచుందురా
కంసుణ్ణి సంహారింపా సద్గురుడు అవతారమెత్తె నపుడు
దేవకీ గర్భముననూ కృష్ణావతారమై జన్మించెను.

♦ ♦ ♦

ఆదివారముపూటను అష్టమీ దినమందు జన్మించెను.

♦ ♦ ♦

నెత్తురుతో ఉండి అపుడు ఆబాల కావుకావున ఏడ్చుచు
నన్నేల ఎత్తుకొనవే నాతల్లి దేవకీ వందనంబు.
ఒళ్లెల్ల హీనంబుతో ఈరీతి నున్నాను కన్నతండ్రి
నిన్నెట్లు లెత్తుకొందు నీ వొక్క నిమిషంబు తాళురన్నా.
గంగనూ పార్థించెను జలనిధులు గంగ తా నుప్పొంగెను
గంగనదిలో నప్పుడు దేవకీ జలకంబులాడె తాను.
ఇకనైన ఎత్తుకొనవే ఓతల్లి దేవకీ వందనంబు
కానిబాలునిరీతిని నన్నిట్లు ఎడబాసి యుండతగునా.
నీపుణ్యమాయె కొడకా ఇంకొక్క నిమిషంబు తాళుమనుచు
కామధేనువు నప్పుడు దేవకి మదియందు తలచగాను
పాలవర్షము గురిసెను అప్పు డాబాలపై జల్లగానే
తడివస్త్రములు విడిచెను దేవకీ పొడివస్త్రములు కట్టెను.
పొత్తులమీద నపుడు బాలుండు చక్కగా పవళించెను
తనరెండు హస్తములతో దేవకీ బాలుణ్ణి ఎత్తుకొనెను
అద్దాలపై వేసుకు ఆబాల చక్కదనమూ చూచెను.
వసుదేవపుత్రు డమ్మా ఈబిడ్డ వైకుంఠవాసు డమ్మా
నవనీతచోరు డమ్మా ఈబిడ్డ నందగోపాలు డమ్మా
సీతాకళత్రు డమ్మా ఈబిడ్డ శ్రీరామచంద్రు డమ్మా
శిరమున చింతామణి నాతండ్రి నాలుకను నక్షత్రము
వండ్లను వరసవేది భుజమందు శంఖుచక్రములు గలవు
నీరూపు నీచక్కన అబ్రహ్మ ఎన్నాళ్ళు వ్రాసె తండ్రి॥

పుట్టినపిల్లవాడు శ్రీకృష్ణుడు అల్లరిపిల్లవాడు. ఏడవడం మొదలుపెట్టాడు. తల్లి బూచివాడనీ, జోగివాడనీ, పామనీ భయపెట్టుతుంది. నాకేమీ భయములేదంటాడు, చూడండి.

"నీపుణ్యమా యెకొడకా నీవొక్క నిమిషంబు తాళురన్నా
అలదిగో పామొచ్చెను నాతండ్రి గోపాల కవళించరా
పాములకు రాజైనా శేషుడు పానుపై ఉండగాను
పామేమి చేసునమ్మా నలినాక్షి భయము నీ కేల నమ్మా"

ఈసందర్భములో గుమ్మడిపాట జ్ఞాపకంవస్తోంది. మనోహరమైన ఆపాట ఈకాలాన అంతగా వినిపించడంలేదు. బాలకృష్ణుడు యశోద పెరుగుతరుస్తూంటే కుండలో చెయ్యి పెట్టపోతాడు. కుండలో గుమ్మడున్నాడు, కరుస్తాడుసుమా చెయ్యి పెట్టబోకంటుంది తల్లి. గుమ్మడెవరే అమ్మా నే నెత్తిన అవతారాలలో ఎప్పుడూ ఆపేరే వినలేదు అంటాడు శ్రీకృష్ణుడు.

"ఘుమ్మ ఘుమ్మన పెరుగుతరచగ, కోరివిని పార్థించి కృష్ణుడు
అమ్మ వెన్నా యనుచు కవ్వము, నణచి పట్టగనూ
నమ్మరా కృష్ణమ్మ పెరుగులో, నడుమ గుమ్మడు తిరుగులాడును
నమ్మకున్నను ఘుమ్మఘుమ్మను, నాద మిటు వినుమీ - కృష్ణాగుమ్మ డిడుగో

♦ ♦ ♦

కాటబోయినవారి పాపడు, కడవలోపల చెయ్యి ముంచెను
తూటుబొడిచీ కరచె గుమ్మడు, తొలగిపోవగనూ
మాటలేటికి విడువు కవ్వము, అన్న నీకును వెన్న బెట్టెద
యేటికీ యిందున్నగుమ్మడు, ఎగిరి కరచెడిని - కృష్ణా గుమ్మా డిడుగో !

తల్లిమాటలు విని శ్రీకృష్ణు డంటున్నాడు.

గుమ్మడేడే గోపిదేవి, గుమ్మడేడే కన్నతల్లీ
గుమ్మడిని పొడచూపగదవే, అమ్మ గోపెమ్మా - అమ్మా గుమ్మా డేడే ?
ముచ్చటనమున వేదములు గొని, తెచ్చి పెరచుచు జలధిలోపల
జొచ్చియున్నా వాని వెంబడి, జొచ్చి జలనిధిలో
మత్స్యమై సోమకుని దుంచితి, మగుడ చదువులు బ్రహ్మకిచ్చితి

ఆక్షణంబున గుమ్మడనియెడి, మాట నే నెరుగా - అమ్మా గుమ్మా డేడే ?"
ఈవిధముగా పది అవతారములగాథ చెప్పి చివరకు నోరు తెరిచి బ్రహ్మాండ
మంతా తల్లికి నోట్లో చూపిస్తాడు. అప్పుడు తల్లి అంటుంది-

"కన్న బలిమిలి గుమ్మడంటిని, కరుణజూడుమి దేవమణి నను
చిరుతతను వెరపించుచందము, చేస్తి నోతండ్రీ"

బాలకృష్ణుణ్ణి ఆటపాటలలో పెరగనిచ్చి కంసవధకు తయారుకానియ్యండి.
మేనకాదేవి నొప్పులుపడుతోంది. పాపము! జగజ్జననిని కనబోతోంది. వెడదాం
రండి. భయపడకండి- మేనక చెలికత్తెలు,

" వనజాక్షి ఉనికిజూచీ, అలసట , సొలసెనని మదిని గాంచి
అమ్మరో రాగదమ్మా, భుజించు, వమ్ము యేదిష్ట మమ్మా
వద్దనగూడ దమ్మా, వినవమ్మా, ఎరాల్రపుపాలుసుమ్మా
ఎర్రగా గాచి రమ్మా, మాయమ్మ, జుర్రవే ముద్దుగుమ్మా
సుదతి భుజియించలేకా, నిజప్రసవ వేదనకు నిలువలేకా
నొప్పులని జెప్పలేకా, చెప్పకను, చెలులకను గప్పలేకా
నగపతికి జెప్పరమ్మా, వేల్పులకు, నగ మీదుగట్టరమ్మా
మగువలకు గండమమ్మా పీలైన, తగువారి నడుగరమ్మా."

ఎలాగైతేనేమి చెలికత్తెలు కిందామీదాపడ్డారు. కష్టపడి కష్టపడి మేనక ప్రసవిం
చింది. పార్వతి పుట్టింది. ఆమెచక్కదన మెట్లున్నదంటే

"తమ్మిలను బోలుకనులు, ముంగురులు, తుమ్మెదలబారు మిగులు
అమ్మ యీబాలహాయులు, జగమెల్ల నెమ్మదిని బ్రోవజాలూ
ముఖము వీక్షింపరమ్మా, యీబాల కామారి సొమ్మసుమ్మ
అమ్మరో వినగదమ్మా, శివునికి పట్టంపురాణి సుమ్మా"

ఇక జననములసంగతి వదిలిపెట్టి రాయబారా లెత్తుకుందాము. శ్రీకృష్ణుడికి
రుక్మిణి చిలకచేత రాయబారం పంపింది. నలుడు హంసచేత రాయబారం నడిపిం
చాడు. రుక్మిణి చిలకచేత రాయబారం పంపడం భాగవతంలో లేదు. పాటలలో
ఉంది. హంసరాయబారం భారతానికీ పాటలకీ సమానమే. రామాయణములో
సీత రాముడికి రాయబార మంపినట్లు లేదు. కాని పాటలలో కోకిలచేత రాయ

భారం వంపినట్లుంది. రాయబారం ఎటువంటిదైనా కోకిలచేత పంపడమనేది కవి హృదయానికి తాకేవిషయం. ఆరాయబారం ఎట్టిదో రెండుముక్కలు ఉదాహరిస్తున్నాను.

"భూదేవికూతుర్ని కోయిలారో, జనకునికూతుర్ని కోయిలారో
దశరథులకోడల్ని కోయిలారో, శాంతకు మరదల్ని కోయిలారో

♦ ♦ ♦

రాఘవులదేవిని కోయిలారో, నల్లనయినవారి కోయిలారో
నవ్వుచునుందురే కోయిలారో, శ్రీరామచంద్రులే కోయిలారో

♦ ♦ ♦

భర్తను విడిచుంటి కోయిలారో, ఆహారనిద్రలేకుంటి కోయిలారో
రాము రమ్మని చెప్పు కోయిలారో, మెడది హారం యిస్తు కోయిలారో
ప్రాణేశు కోడైమ్ము కోయిలారో, పక్షి చేసినపనులు కోయిలారో
ఉపకారమై యుండు కోయిలారో."

♦ ♦ ♦

స్త్రీలసారస్వతములో రామాయణకథ ఎన్నివిధాలుగా నడిపించడానికి వీలుగాఉందో అన్నివిధాలా నడిపించారు. ఈక్రిందిరామాయణం ఎత్తుగడ చూడండి-ఈపాటకు శ్రీరామదండములని పేరు.

పాలసముద్రంమీద పవళించురామ, శేషునిపయినిద్ర సేవించురామ
వటపత్రశాయివై పవళించురామ, శ్రీలక్ష్మితో స్థిరంబుగ నుండురామ
దండాము దండాము
దండాము కోదండపతివైనరామ, దండకారణ్యాన చరియించినరామ
దండిగా నసురుల చెండినరామ, దయతోటి మమ్మేలు దశరథరామా
దండాము దండాము.

ఈవిధముగా రామాయణకథ అంతా చెప్పబడ్డది.

ఉత్తరరామాయణమునకు సంబంధించిన కుశలవుల కథ అనేకవిధములుగా గేయరూపముగా చిత్రింపబడ్డది. కుశలవుల యుద్ధమనీ, కుశలవ కుచ్చెలచరిత్ర అనీ, కుశలాయకమనీ మూడుపెద్దపాటలు గలవు. అందు కుశలాయకములో రామచంద్రరాజనుకవి ఈవిధముగా తనభావమునుగురించి చెప్పుకొంటున్నాడు.

పరగ మూఢులకైన బాగుగా తెలియగా, అతివేడుకపుమాటలన్ని యుంచెదను
పదగుంభనముచాయ పరగజాలనటంచు, గేలిశాయగ మీకు వీలుకాదయ్యా
కఠినంబులుంచితే కాపులకు తెలియదని, మరుగులుంచుటమాని మాటలుంచితిని"

అపరిమితప్రయోజనము కలదనీ అందరికీ అందుబాటులో ఉంటుందనీ వ్యవహార భాష వాడమని చెప్పేది యిందుకనే.

ఈచిన్న వ్యాసములో ఈపెద్దకథలను గురించి చెప్పడంవల్ల గ్రంథం పెరిగిపోతుందని వదలివేస్తున్నాను. కాని కుశలవకుచ్ఛలచరిత్రలో ఒకవింతకథపట్టు ఉంది. దానినిమాత్రం చూపుతాను. దశరథుడు కైకమ్మయింటికి వచ్చాడు. అతగాడికి ఆవిడ ఎంతచెప్పితే అంత. జంతుజాలంకూడా ఈసంగతి గ్రహించింది. తలంటినీళ్ళు పొయ్యడానికి కైకమ్మ పీటవేసి దశరథుణ్ణి కూర్చోబెట్టింది.

"పీటకుకోళ్ళు మూడే ఆనె, నాలుగోకోటను చీమలబారు
వెళ్ళుతుండగా చీమలరాజు, సేనతో జెప్పెను చోద్యముగాను
సపరివారము చక్కగ విడుడి, పెక్కుమక్కువతో చక్కనిసతిచే
జిక్కి రాజు మోహంపడియు, అభ్యంగనము అమరగ చేసె
కళ్ళుజూడడు కరుణయు లేదు, చత్తుమొ ? పుత్తుమొ ? కడతేరుదుమొ ?
కోడు వదలి ఈకొననే రండి"

ఆవిధంగా చీమలరాజు పరివారాన్ని నడిపించుతూ వెళ్ళిపోయాడు. రాజుకు చీమల భాష తెలుసు. తెలిసినా కైకకు దాసుడే. మరిన్నీ ఒకచీంబోతు ఒకమేకను ఒకకోరిక కోరింది. ఆమేక అందిగదా - పదినిల్వులబావిలో పచ్చనిపూరి ఉన్నది, అది తెస్తే కోరిక చెల్లిస్తా-నని. అప్పుడు చీంబో తంటోంది.

"పూరికి పోయి చావగనేలా, భువిలో ప్రాణము ఒడలిని ఉంటే
బలుసుకూర దిని బ్రతుకగవచ్చు, శిరస్సుపైని శిగ ఉంటేను
పట్టెడుపువ్వులు చుట్టగవచ్చు, వెర్రివాడు రారాజు గనుకను
భార్యమాటలకు భ్రమసీ రాజు, అర్థం ప్రాణం ఆలికి నిచ్చె"

అంటూ రాజును ఈసడిస్తుంది. దశరథుడికీమాటలు తెలిసినా లాభం లేకపోయింది.

♦ ♦ ♦

సీతమ్మ ఒకనాడు రామునిపై అలిగింది. అలిగి కోపగృహములో పడుకొంది. రోజులు గడచిపోతున్నవి. మాసములు గడచిపోతున్నవి. అలక తీర్చేవా రెవరూ దొరకడం లేదు. పెంపుడుచిలకను రాముడు సీతదగ్గిరికి రాయబారం పంపుతాడు. పంపుతూ అంటున్నాడు

"చిలకరో ఓచిలక మారామచిలక, ఎర్రనిముక్కుకు వెండి పొదిగిస్తు
పచ్చనిరెక్కలకు పయిడి పూయిస్తు, నీవు పోయెడిత్రోవ నెలగవేయింతు
నెలగ దిని చెయికడగ చెలమ తీయింతు, నీరుత్రాగి నిలుచుండ నిమ్మవేయింతు
అలసిపోయి కూర్చుండ అరుగు వేయింతు"

ఇవన్నీ చేస్తాను సీతఅలక తీర్చమని పంపుతాడు. చిలక వెడుతుంది. చిలకను చూచి సీత వదరకే, పోవే, లేకుంటే తల పగలగొడతానని బెదిరిస్తుంది. భయపడి చిలక పారిపోతుంది. చివరకు ఎలాగైతేనేమి చిలకే అలకతీర్చింది. లక్ష్మన్నసలహా మీద చిలక సీతదగ్గిరికి వెళ్లి ఆమెకు వినబడేటట్టు "ఆరునెలలబట్టి సీత అలిగి కూర్చుండడంవల్ల రామునికి స్వస్థత తప్పింది పాపం "అంటుంది. ఆమాట వినగానే సీత భయంపడి దిగ్గున లేచి రాముడిదగ్గిరికి పరుగెత్తుకు వెడుతుంది.

♦ ♦ ♦

శ్రీరాముడు హనుమంతుణ్ణి సీతదగ్గిరికి పంపుతూ ఆనవాళ్ళెన్నో చెప్తున్నాడు. ఈపాటలో చెప్పినఆనవాళ్ళు చాలామట్టుకు మూలములో లేనివి. అందులో ఒక ఆనవాలు వినండి:

మరిఒక ఆనవాలు కలదుసుమ హనుమా, మరువక చెప్పుమా మాసీతతోనూ
కొత్తగా కట్టిన మేడలోపలను, శ్రీరాములు సీత మాట్లాడుచుండె
నాకు పొద్దుపోదు నలినాయతాక్షి, సొగటాలు ఆడుదామని సీత వడిగ
బంగారుపాచికలు పట్టుకొనివచ్చి, తిత్తికి తీదుంచమిధిచక్కభారా
అష్టారదష్టోక అది భారయనుచు, సరియనుచు దుగయనుచు సారివేయుచును
మాటమాటకు సీత రాము నోడించె, ఇంత రూడింతురా ఇందీవరాక్షి?
సీతమీద కోపించి శ్రీరాఘవులు, పట్టుశాల్వ ముసుగుపెట్టుకొనె నంత
తప్పుగలదూ దేవ ధరణీశ్వరాద, అని పద్మనాభునిపాదములు మొక్క
నవ్వుతూ లేచెనే నారాయణుండు, ఇది ఒక ఆనవాలని చెప్పు హనుమా"

♦ ♦ ♦

ఇక సీత అగ్నిప్రవేశం అనేపాట ఎత్తుగడ పరిశీలించండి :

"సీతాంగననియేటి పరమపతివ్రతకూ, చిత్రించి కట్టిరే చిరిపర్ణశాల
అమర్చి కట్టిరే అడిదంపుశాల, ఆపర్ణశాలకు పచ్చలా తలుపు
తలుపు తీయగనుండా బంగారుగద్దె, శృంగారగద్దెపయి చిటిచాప పరిచి
సీతయు రాముండు జూదమాడంగ"

అప్పుడు పైడిలేడి వచ్చింది. దానిని సీత చూచి తెమ్మన్నది.

"లేడివెంబడి నేగె దశరథాసుతుడు, పుడకలు కొరుకుతూ పూరిమేయుచును
ఆకులు కొరుకుతూ గంతులేయుచును, చెంగునాదాటుతూ చౌకళించుచును
అడవులన్ని తిరికి అలసటను చెంది"

చివరకు రామబాణముచేత హతమయింది. ఈవిధంగా అగ్నిప్రవేశంవరకూ రామాయణకథ నడిచింది. సీత అగ్నిప్రవేశం చెయ్యడానికి హనుమంతుడు చితి పేర్చాడు. అడవిలో చెట్లన్నీ పీక్కువచ్చి పేద్దచితి పేర్చాడు. ఆచితిమీద నెయ్యి పోశారు.

"భగభగమంటలతో పావకుడు వెలుగ, వచ్చిరీ వానరులు వైదేహికడకు
రామచంద్రునిసతీ లక్ష్మణునివదినె, అగ్నిగుండానికే వేంచేయవమ్మా
కౌసల్యకోడలా కడుబుద్ధిశాలి, అగ్నిగుండానికే వేంచాయవమ్మా
భూదేవికూతురా భూలోకమాత, అగ్నిగుండానికే వేంచేయవమ్మా"

అని యిట్లువానరులు పిలువగా సీతమ్మ తొలకరిమెరుపువలె వచ్చింది. ఆమెరాకను చూచి లక్ష్మణుడు గడగడ వణకినాడు. అతన్ని చూచి సీత అంటోంది,

"అడలకుమి లక్ష్మణా జడుపేల నిపుడు, మిన్నున్నమాటలు అనుభవంబయ్యె
చేసినపాపమ్ము వండినచద్ది, కుడువక పోదయ్య కొంతకాలముకు"

అని లక్ష్మణున్ని ఊరడించి సీత ప్రతిజ్ఞచేస్తోంది వినండి ఆపతివ్రతప్రతిజ్ఞ-

"అగ్నిజొచ్చి నేను ఓడితినయినా, ఇంకును జలనిధులు ఇల నుండబోవు
అగ్నిజొచ్చి నేను ఓడితినయినా, నెల మూడువర్షాలు కురవ వెన్నటికి
అగ్నిజొచ్చి నేను ఓడితినయినా, శ్రీరాముసతి గాను నేను లక్ష్మణుడ
అగ్నిజొచ్చి నేను ఓడితినయినా, భూలోకమాతనరు ఈపృధివియందు"

ఈ ప్రతిజ్ఞ విని బ్రహ్మరుద్రాదులు హడలిపోయారు. భూమి గడగడ వణికింది. ఆకాశ మదిరింది. దశదిక్కులూ కంపించినవి. పిమ్మట సీతాదేవి అగ్నిగుండాని కెదురుగా నిలబడి,

"గుండమున కెదురుగా సీత ఏతెంచి, ముమ్మారు ప్రదక్షిణంచేసి నిలుచుండి
దోసెడుముత్యాలు గుండాన బోసి, ముందు శ్రీరాములను హృదయాన దలచి
వెయికోట్లజన్మములు ఎత్తినా గాని, గోవిందుడే నాకు పతిగ గావలెను
పదివేలజన్మాలు ఎత్తినా గాని, లక్ష్మణుండే నాకు మరిది గావలయు"

♦ ♦ ♦

ఈవిధంగా తనకోర్కెలు చెప్పి

"అనిపల్కి అగ్నికి వందనం చేసి, కొలను జొచ్చినట్లు అగ్నిలో జొచ్చె."

అప్పుడు జరిగినవింత చూడండి.

"కుప్పలనిప్పులూ కుంకమ్ము లాయె, పరిచిననిప్పులూ పన్నీరు ఆయె
దాపిననిప్పులూ చందనం బాయె, మండేటినిప్పులూ వడగళ్లు ఆయె
చిలకలూ కోవిలలు హంసలూ గుమిగ, సీతకు తోడుగా కొలనాడుచుండె"

ఇదేమిచోద్యమని లక్ష్మణుడు రామునితో ననగా రాముడి కింకా నమ్మకం కలగక అంటున్నాడు,

" ఆడవారికి గలవు అగ్నిమంత్రములు, అలికేరు తుడిచేరు ముగ్గుపెట్టేరు
మండేటిమంటలకు మారుమసిలేరు"

అనిఅంటే అగ్నిహోత్రుడికే కోపంవచ్చింది. భూదేవికి కోపంవచ్చింది. సీతను ఏల కుంటే లోకాలు నశించిపోత వన్నారు. ఆకాశవాణికూడా పలికింది. రామునిసందేహం తీరింది. అప్పుడు

"దుందుభులుమోగెనుతుంబురుడుపాడె,రంభ ఊర్వసులపుడునాట్యములుచేసె
పుష్పవర్షము కురిసె పృథివిపై నపుడు, సీతను భూదేవి శీఘ్రముగ ఎత్తి
శ్రీరాముతొడలపై సీతనే ఉంచె. "

♦ ♦ ♦

రామాయణానికి సంబంధించినగాథ లెన్నోపాటలుగా ఉన్నవి. అందు కొన్ని పాటలే యిందు మచ్చుచూపించాను. అచ్చుపడ్డవి కొన్నిమాత్రమే ఉన్నవి. అచ్చుపడనివి అనేకమున్నవి. అచ్చుపడ్డ ఒకపాటనుండి ఒకవిషయమును చెప్పి రామా

యణగాథలు కట్టిపెట్టుకొను. ఆ పాటపేరు లక్ష్మణదేవరనవ్వు. శతృవిజయము అయినవెనుక శ్రీరాముడు సోదరులతో, బంధువులతో, సామంతులతో, సేనలతో కొలువుదీరి ఉన్నాడు. లక్ష్మణునకు బద్ధకం వచ్చింది. కునుకు వచ్చింది. సభలో అతడు నవ్వాడు. ఆనవ్వు అందరూ చూచారు. ఎవరిమట్టుకువారు తనను చూచి లక్ష్మణుడు నవ్వాడని అనుకొన్నారు. జాలారికన్నను తలమీద ధరించి నానని కాబోలు నవ్వుతున్నాడని శివు డనుకొన్నాడు. దశకంఠునింట నుంటినని కాబోలు యీనవ్వు అని సీత అనుకొన్నది. రామునికి కోపంవచ్చి ఖడ్గంతీసి తల నరకబోయాడు. లక్ష్మణుడు నవ్వుకు కారణం చెప్పాడు: అడవులలో రామునితో పాటు సంచారం చేసేటప్పుడు లక్ష్మణస్వామికి నిద్రాదేవి దర్శనమిచ్చింది. "నేను రామసేవ చేయవలసి ఉన్నది. ఇప్పుడు నన్ను ఆవహించకు. నాభార్య ఊర్మిళ పురములో ఉన్నది. ఆవిడను పూర్తిగా నీవు ఆవహించు నన్ను వదిలిపెట్టు. వనవాసమైనతర వాత ఆవహింతువుగానిలే నన్ను" అన్నాడు. నిద్రాదేవి వప్పుకొంది. వనవాస మైనది. ఇంటికి అందరూ వచ్చారు. రాముడు సభతీర్చి ఉన్నాడు. ఇప్పుడు నిద్రాదేవి లక్ష్మణున్ని సభలో పట్టుకొంది. జరిగినసంగతి జ్ఞాపకంచేసుకొని లక్ష్మణుడు నవ్వాడు. రాము డీసమాచారం విని శాంతించాడు. చెప్పదలచుకొన్నవిషయం ఏమిటీ అంటే బంధువులతో, మిత్రులతో, పరివారముతో రాముడు విందునారగించదలచాడు. అరవై కూరలూ, పచ్చళ్ళూ, పిండివంటలూ సమస్తమూ వడ్డించారు. అంతాభోజనానికి కూర్చున్నారు. కాని ఒకపొరపాటు వచ్చింది. మొదటనుంచి చివరవరకూ హనుమంతుడు పడ్డకష్టమూ, చేసినసేవా యింతా అంతా కాదు. ఇంట్లో ఏమికావలసినా హనుమంతుడుడే యివ్వాలి. ఎవరికి ఏవర్తమానం తీసుకుపోవలసివచ్చినా హనుమంతుడే తీసుకుపోవాలి. ఏచాకిరీచేయవలసివచ్చినా హనుమంతుడే చేయాలి, ఇటువంటిహనుమంతుణ్ణి ఆదినము పంక్తిభోజనానికి పిలవడం మరిచారు. మిగిలినకథ హాస్యరసముపోషిస్తూ కవి చెప్పుతున్నాడు వినండి.

"ఆనాడు లంకలో ముచ్చటాలన్నీ, చెప్పుకొనుచు వారు భుజియింపుచుండిరి
ఆనాడు రావణునిముచ్చటా లన్నీ, చెప్పుకొనుచు వారు భుజియింపుచుండిరి
అప్పుడూ హనుమను మరచి ఉండిరి, పులుతుపులుతూమని వచ్చె హనుమానుు,
ఇంటివాడవుగనుక ఊరకుంటిమి, పొత్తున కూర్చొమ్మి ఉత్తమాపురుష
నీవుండగాగదా సీత దెచ్చుకొని, అయోధ్యపట్నమ్ము ఏలగలిగితిసి

నీవుండగాగదా తమ్ములవంక్తి, భుజియింపగలిగితిని హనుమన్న వినుమ
పొత్తునా కూర్చొమ్మి ఉత్తమాపురుష."

హనుమంతుడికి కోపంవచ్చింది. సర్దిచెప్పితేమాత్రం కోపం తీరుతుందా. రామ భక్తికి లోపం రాకూడదు. కోపం తీర్చుకోవాలి. మానవజన్మ ఎత్తిఉంటే కోపం ఎలాగతీర్చుకొనేవాడో. ఎత్తింది కోతిజన్మగనక కోపం ఎట్లా తీర్చుకొన్నాడంటే- ''పొత్తునా గూర్చుండ ఉత్తముడగాను" అనిసమాధానం చెప్పి, రాముడిప్రసాదం భక్తుడు తాను అనుభవింపవలెను కాబట్టి,

"సర్వేశుభోజనం తా గాగ చూచి, ముందారపళ్లెమ్ము ఎత్తుకొనిపోయె
తా బోయి హనుమన్న అవిసిచెట్టెక్కె, ద్వాదశికి ఒకముద్ద కొమ్మపై నుంచె
అందుమీద పళ్లెమ్ము అంది పడవేసె"

శ్రీరాముడు లేచి వెళ్లి అవిసిచెట్టు మొదట నిలబడి హనుమన్నని బతిమాలుతున్నాడు,

"వృక్షమున కెదురుగా రామచంద్రులు, చెయిజాచి హనుమన్న రమ్మనిపిలచె"

అప్పటికి హనుమన్న కోపం పోయింది. రాముడు పిలుస్తే రాకుండా ఉండగలడా ఆపరమభక్తుడు ? రాముడుచెయిచాపి రమ్మంటే,

"రామచిలకావలెను చేతికయి వాలె, చేతిపై హనుమన్న ధరణిపై దింపి
ముత్యాలహారమ్ము మెచ్చి మెడవేసె"

హారము మెడలో పడ్డంతోనే హనుమన్న యథాప్రకారం రాముడినోట్లో నాలికైనాడు.

♦ ♦ ♦

మహాభారతానికి సంబంధించినకథలు చాలాఉన్నవి. ప్రశస్తమైనపాట ధర్మరాజు జూదము. కీచకవధ ఇంకొకపాట. రెండున్నూ రసవంతముగానే ఉన్నవి. శ్రీల వాఙ్మయమున కవి భూమలవలె నున్నవి. గ్రంథవిస్తరమునకు వెరచి వాటిని వదిలివేస్తున్నాను.

♦ ♦ ♦

ఇక యితరకథలగురించి కొంచెం చెబుతాను. శ్రీలసారస్వతములో సారంగధర చరిత్రపాటలు రెండున్నవి. ఒకటి చాలాపెద్దది. వెంకటకవికావ్యముకన్న పెద్దది. రెండవది చిన్నది. రెండున్నూ వెంకటకవికావ్యానికి భిన్నముగానే ఉన్నవి. వెంకట

కవి మతములో చిత్రాంగి రోవెలది. పాటలలో చిత్రాంగి రాజు రెండవ భార్య. పెద్దపాటనుగురించి చెప్పడం వదిలిపెట్టి చిన్నపాటనుగురించి కొద్దిగా మనవిచేస్తాను.

స్త్రీలసారస్వతములో ఒకవిశేషం ఏమిటీ అంటే చెప్పదలచుకొన్నవిషయం సూటిగా హృదయానికి తగిలేటట్లు చెప్పడమే. అందువల్లనే రసము చిలుకుతూ ఉంట వవి. అఖండకావ్యాలు చేద్దామనిగాని అర్థముచేసుకోలేనికావ్యా లల్లుదామని గాని వారు తలపెట్టరు. అందుకనే ఆకవులు అనవసరము లగువర్ణనకు తావియ్యరు. ప్రబంధలక్షణములను ఎదుట బెట్టుకొని వరవడి దిద్దుకొనే ప్రబంధకవులకావ్యాల కంటె సహజమై సెలయేళ్లవలె ప్రవహించే ఈపాటలలోనే గుణము అతిశయముగా ఉన్నది. కొద్దిగ్రంథములను వదిలిపెట్టి పండితసారస్వతాన్ని స్త్రీలసారస్వతముతో పోల్చి నిష్పక్షపాతముగా చూస్తే స్త్రీలసారస్వతమే గుణబాహుళ్యము కలదిగా కనబడుతుంది. సారంగధరచరిత్రపాట ఎత్తుగడ ఎంతసూటిగా ఉన్నదో పరికించండి. శివుని వరప్రసాదమున సారంగధరుడు కలిగినాడని చెప్పబోతున్నాడు కవి :

"పర్వతాలమల్లన్న భమిడిమేడలమీద, మెరిపించె జోగిరూపు
పులితోలువస్త్రమ్ము పునుకగణముల పేరు, చంకజోలెయు కట్టుకు
ముఖమునా వీబూధి మెడనిండ రుద్రాక్ష, తావళంబులు మెరయగా
బంగారుకిన్నెరా రత్నంపుమెట్లాది, వాయింపుచుండగాను
కిన్నెరానాదముకు కిటికీలు తెరచుకొని, రత్నాంగి పారజూచె
ఈశ్వరా నీవంటిపుత్రునీ ఇమ్మని, శంభుణ్ణి తా గోరెను
రత్నాంగి కోరిక రంజిల్లునట్లుగా, రజతాచలేశు డిచ్చె"

ఈవిషయమునే ప్రబంధమర్యాదను పండితకవి చెప్పవలసివస్తే అధమపక్షం రెండాశ్వాసాలైనా వ్రాసిఉంటాడు. ఇక కథ. సారంగధరుడు చిత్రాంగిమేడకు పావురముకొరకై వెళ్లాడు.

"బాలరాకలు చూచి కలికి తా నెదురుకొని, యేకనివ్వాళు లిచ్చె
అమ్మ కట్నం బివ్వ అన్యులమా మేము, అమ్మ నీ సుతుడగాడా
ఆకలితో ఉంటివో అన్నమ్ము వడ్డిస్తు, ఆరగించుము అల్లుడా
ఆకలయినా లేదు అన్నము నాకొద్దు, అమ్మ నాపక్షి నిమ్మా
అమ్మనన్న నోటికి కమ్మనిఖజ్జాలు, కాముడా నే బెడుదును"

సారంగధరుడు చిత్రాంగికి వశుడుగాక తప్పించుకు పోబోతాడు. అప్పుడు చిత్రాంగి అంటుంది.

"కాముడా నీ వింత కఠినంబు జేస్తివి, కాంతునకు నే దెల్పుదు
కట్టిస్తు కొట్టిస్తు కాల్పిస్తు నిన్నయిన, కండలే గోయిస్తును".

కధ అంతా ఈవిధంగా రసవంతంగా నడిపించాడు కవి. సారంగధరుడు బ్రతికి ఉన్నాడని రత్నాంగి విన్నప్పుడు తల్లిని కవి ఒక్కమాటలో ఎట్లా చిత్రించాడో !

"ఫణివార్త దెచ్చినా, పలుకులూ వినగానె, వణతికి పాలు గురిసె"

♦ ♦ ♦

అనంతామాత్యుడు వ్రాసిన భోజరాజీయములో కామధేనువుకథ ఉన్నది. తెలుగువారికి కన్నడులకూ ఈకథ అభిమానకథ. అనంతామాత్యుడు గోవుకథ విరివిగా రసవంతముగా వ్రాశాడు. స్త్రీలసారస్వతములో గోవుపాట అనేపేరుగల ఈకథే అంత విరివిగా కాకున్నా రసవంతముగా వర్ణింపబడ్డది- శ్రీకృష్ణుడు పాలు పితకడానికి గోవుల్ని పేరుపేరున పిలుస్తున్నాడు. పండిత సారస్వతములో మను చరిత్ర, శృంగారశాకుంతలము మున్నగు గ్రంథములలో వేటకుక్కలకు పేళ్లున్నవి. స్త్రీలసారస్వతములో గోవులకు పేళ్లు - శ్రీకృష్ణుడు పిలుస్తున్నాడు ఆలకించండి.

"పెద్దకాలపు ఆవులారా, పేరుపడ్డ మందలారా
కపిలయావు దూడలారా, కర్రియావుదూడ రావె
తెల్లయావుపిల్ల రావె, బొల్లియావు నీవు రావె
కామధేనువ కల్పతరువా, శ్రీలక్ష్మి పేరిందేవి
అన్నపూర్ణ విశాలాక్షి, తెల్లమచ్చాగోవు రావె
నల్లమచ్చాఆవు రావె, చిన్నిఆవుదూడ రావె"

పిలిస్తే ఆవులన్నీ వచ్చినవి. వచ్చినగోవులన్నింటినీ పాలుపిదికి యింటికి పంపివేసి తాను చెట్టెక్కి వేణువూదుకొంటున్నాడు. గోవులన్నీ మేతకు పోయినవి. అవి మేత మేస్తుంటే,

"గొప్పనాదము చెవుల బడగా, అదరుకొంటూ బెదరుకొంటూ
మేతమాని ఎదురుచూడగ, గాండ్రుగాండ్రు మనుచు వేగమె
పెద్దపులి ఒక టొచ్చి నిలిచి"

నాపొలములో మీరు వచ్చి మేస్తున్నారు. పారిపోకండి అంటూ పెద్దపులి,

"దాటిపోవా జాతురేమి, పారిపోవా జాతురేమి
కురుచకొమ్ముల చిన్న ఆవుల, నిడుపుకొమ్ముల పెద్దఆవుల
పేరుపడ్డా ఆవులాను, కోట్లకొద్దిగ తిన్నదానను"

అనివాటితో చెప్పి భయపెడుతుంది. మిగిలిన ఆవులను వెంటబెట్టుకొని ముసలి ఆవు ముందుకు వచ్చి పెద్దపులితో చెప్పుతుంది,

"ఒక్కమనవి చిత్తగించు మూడుదినములకింద నేను
కవలదూడల కన్నదానను, నన్ను పెంచినదాత లెల్లా
పాలు పిదుకక యుండగాను, రెండుదూడల పెంచుచుంటిని
నాదురాకకు దూడలెల్లా, ఎదురుచూచును బెంగతోను
శెలవుయిచ్చిన పాలు యిచ్చి, మళ్ళివచ్చి నీదుయాకలి
తీర్తు ననుచు బల్కగాను"

ఎన్నో ఒట్లు పెట్టుకొన్నమీదట పెద్దపులి "జాలిగలిగి" వెళ్ళి రమ్మంది, ఆవు దూడల దగ్గిరికి వచ్చి పాలిచ్చి బుద్ధులు చెప్పుతోంది.

"బుద్ధిగలిగి మసలుచుండుడి, పచ్చిచేనులో మేయబోకా
కాపుచేతిలో చిక్కబోకా, పొదలచాటున మేయబోకా
పులులనోటి కందబోకా, ఇండ్లలోనా తిరుగబోకా"

కడుపునిండా కసవుతిని దొడ్లో నిద్రపొందని చెప్పింది. పిమ్మట మందలో ఆవుల్ని పిలిచి వాటికి తనదూడల్ని అప్పజెప్పుతోంది.

"పేరిందేవి మీనాక్షి, ఆదిలక్ష్మి అన్నపూర్ణా
కామధేనూ కల్పతరువా, పేరుపడ్డా గోవులారా
నాదుకొడుకుల మీరు జూచి, ముందుకొచ్చిన పొడువబోకా
వెనుక కొచ్చిన తన్నబోకా, మందజేర్చుక బుద్ధి గరపుడి"

అని తాను పెద్దపులిదగ్గిరికి వెడుతుంది. దానిని గట్టిగా పిలుస్తుంది. పులి గొప్పను మెచ్చుకొని వదిలిపెడుతుంది.

♦ ♦ ♦

స్త్రీలసారస్వతములో ప్రధానస్థాన మాక్రమించే చిల్లరిపాట లనేక మున్నవి – మంగళహారతులు, మేలుకొలుపులు, కోలాటంపాటలు, గొబ్బిపాటలు, పాటవేట

పదాలు, విసురురాతిపదాలు, మువ్వగోపాలపదాలు, దంపుళ్ళపాటలు, తుమ్మెద పదాలు, పిల్లలనాడించేపాటలు మొదలైనవి.

ఈవ్యాసములో ఎత్తుకోని పెద్దపాటలుకూడా చాలా ఉన్నవి- తులసీమాహాత్మ్య మనే తులాభారము, ఊర్మిళనిద్ర, శ్రీకృష్ణునిచల్దులు, పంపుపాట, వేదాంతకుచ్చెల కథ, లక్ష్మణమూర్ఛ, లంకాయాగము, సీతసురటి, సవతులకయ్యము (పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు గంగాగౌరీసంవాద మనేపాటమీద మంచివ్యాసము వ్రాసి ప్రకటించిఉన్నారు) పారిజాతపల్లవి, కుచేలోపాఖ్యానము, చెంచీతపాట, శాంతగోవిందనామములు, గోపికలజలక్రీడలు, గుహాభరతుల అగ్నిప్రవేశం మొదలైన ఎన్నో ఉన్నవి. ఏలూరిలో నందిరాజు చలపతిరావుగారు, కాకినాడలో మంగు వెంకటరంగనాథరావుగారు చాలాపాటల నుద్ధరించి అచ్చువేశారు. ఇప్పు డక్కడక్కడ కొద్దిమంది అచ్చువేస్తున్నారు. అచ్చుపడనివి చాలా ఉన్నవి. బిచ్చగాళ్ళ నోళ్ళల్లో ఎన్నో ఇంకా ఆడుతున్నవి. మనతల్లులనోళ్ళల్లో కొన్ని ఆడుతున్నవి. వీటి నుద్ధరించవలసిఉన్నది. స్త్రీలసారస్వతానికి ప్రాముఖ్యము రావలసిఉన్నది. దీనితోపాటు బాలురసారస్వతానికీ, పామరులసారస్వతానికీకూడా ప్రాముఖ్యము రావలసిఉన్నది. ఇప్పటికవులచరిత్రలూ వాఙ్మయచరిత్రలూ సంపూర్ణముకావు. ఆంధ్రదేశములో పుట్టి పెరిగి ప్రచారములోనున్న ప్రతిసారస్వతశాఖకూ కవుల చరిత్రలో స్థానమున్నప్పుడే అది సంపూర్ణ మనిపించుకుంటుంది. లేనినాడు కాదు. స్త్రీలసారస్వతములో భాష జీవద్భాష. అందరికీ తెలిసేది. హృదయానికి గుచ్చుకొనేది. సహజము కాబట్టి సుందరమైనది. వ్యాకరణాని కిది బానిసకాదు. ఇదే వ్యాకరణాన్ని బానిసగా చేసుకోకలదు.

ఇందలిఛందస్సు వేర్వేరుగతులుగా ఉంటుంది. పదకవిత్వమని తిట్టేవారు తిట్టుకోవచ్చు. పద్యముగాని పాటగాని ఒక సాధనమే అవుతుంది. నిర్దుష్టముగా పద్యము చెప్పినంతమాత్రాన కవిత్వ మూడిపడదు. దుష్టముగా పాట వ్రాసిన ట్లూహించినంతమాత్రానకవిత్వముకొఅవడదు. స్వారస్యము పోదు. ఈపాట లెక్కువగా ద్విపదవలె నుంటవి. ప్రాస ఉంటే ఉండ వచ్చు. యతులుపడ్డచోట పడతవి. గణము లలో ఒక్కొక్క మాత్ర తగ్గవచ్చు హెచ్చవచ్చు, ఛందస్సుకు గాని వ్యాకరణా

నికిగాని కవి జానిసకాడు. వీటిని వెనక్కి నెట్టివేసి కవి తనభావాన్ని హృదయాన్ని దూసుకుపోయేటట్లు వదులుతాడు.

మనదేశములో కళవలెనే కావ్యమున్నూ నిత్యజీవితాన్ని ఆక్రమించి అలముకొంది. కట్టు, బొట్టు, జుట్టు గుమ్మము, గోడ, పీట, అరుగు, ఇంటికప్పు, పాత్రలు, ఆభరణాలు- అంతటా కళ ప్రవేశించింది. కూలిపనికి, పడవలాగుటకు, దంపుళ్లకు, పిండి విసరడాలకు, ఆటలకు, అన్నిటికీ కవిత్వ మూతఇస్తోంది. పండితసారస్వతానికి నిత్యజీవనాన్ని అలముకొనేశక్తి లేదు. ప్రజాసారస్వతానికున్నట్టు కన్ను తెరిచి చూచే వారికి స్పష్టము. ఇట్టిసారస్వతాన్ని నిరసించేపండితులు చిన్నప్పుడు తల్లులపాటలకు పులకరించినవారే సుమండీ. రాజావలంబనంవల్లనే పండితసారస్వతం వృద్ధిచెందింది. ప్రజాసారస్వతము ప్రజావలంబనంవల్ల వృద్ధిజెందక తప్పదు.

ఆమధ్య భారతిలో చిన్నపిల్లలపాటలూ కథలూ వేశారు. ఈవిధముగానైనా ఇవి ఉద్ధరింపబడుతున్నవని సంతోషిస్తూంటే ఏకారణంవల్లనో వారు వాటిని ప్రకటించడం విరమించుకొన్నారు. భారతివంటి పత్రికలోనే ప్రాచీనపదములకూ కథలకూ చోటులేకుండా పోయిందిగదా అని విచారించవలసిఉన్నది.

ఇక చిల్లరపాటలనుగురించి కొద్దిగా వ్రాసి విరమిస్తున్నాను.

మేలుకొలుపులు జోలపాటలకువలెనే హృదయమును హరింపశక్తిగలవి.

"బంగారుచెంబులో పన్నీరు పట్టుకొని, పణతి రుక్మిణి వచ్చె మేలుకో"

ఈవిధముగా అష్టమహిషులూ ఉపచారము చెయ్యవచ్చారు మేలుకొమ్మని కృష్ణుని పిలుస్తున్నారు.

> కేశవ యని నిన్ను వాసిగ భక్తులు, వర్ణింపుచున్నారు లేరా
> వాసవవందిత వసుదేవనందన, వైకుంఠపురవాస లేరా
> కృష్ణా తెల్లవారవచ్చెను".

ఇంకోరకం-జీవుణ్ణి ఉద్దేశించి వేదాంతపరంగా చెప్పినమేలుకొలుపు:

> "మేలుకొనవే రాజహంసా, మేలుకొను చైతన్యమా
> మేలుకొనవే శుద్ధనిలయా, మేలుకోగదవే, జీవా మేలుకో.

శృంగారపరంగా శ్రీకృష్ణునిగూర్చి,

"తెల్లవారవచ్చె తెలియక నాసామి, మళ్ళీ పరున్నావు లేరా
వేణునాదము విని వేగ పరుగిడివస్తి, వేళాకోళామేల లేరా"

♦ ♦ ♦

పారువేటపదాలు రాయలసీమలో నేడు ప్రచారములో ఉన్నవి. ఆయూరిదేవాలయములో స్వామి ఏటి కొకతూరి వేటకు వెళ్లుతాడు. వేటనుండి తిరిగివచ్చాక దేవి తలుపు తియ్యదు. వారిద్దరికీ వాదం జరుగుతుంది. ఈవాదమే పాటలుగా పాడతారు. తలుపులదగ్గిర పాటలు యివిగో.

"శ్రీతరుణిరో నే శ్రీరఘురాముడ, జేరి కవాటము దీయవే"
అని రాముడంటే సీత అంటోంది.

"ఖ్యాతిగ శ్రీరఘురాముడ వైతే, కోతుల జేరగదోయి
ఘనసేతువు గూర్పగదోయి"
అని హాస్యముచేస్తుంది.
మళ్ళీ

"క్షీరాబ్ధితనయరో శ్రీలక్ష్మి వాకిలి, తియ్యావె సీతాదేవి తియ్యావె"
అని రాముడు తలుపు తియ్యమంటే

"వాకిట నిలచుండి వాకిలి తట్టుచు, వాదించేవు నీవే రేమి రామా"
అని అడుగుతుంది.

మత్స్యావతారుడను నే నంటే మడుగులో ఉండక యిక్కడి కెందుకువచ్చావంటుంది. ఈవిధముగా పది అవతారములపేళ్ళూ చెప్పితే పదింటినీ ఆక్షేపిస్తుంది. చివరకు నాపేరు రాముడంటె తలుపు తీస్తుంది.

విసరురాతిపదాలు - పెద్దతిరగళ్ళలో జొన్నలుపోసి ఇద్దరు స్త్రీలు విసరుతూ పాటలు పాడుతారు. తిరగలికిందరాతిమీద పయిరాయి తిరిగేటప్పుడు శబ్దము పుడుతుంది. దాన్ని శ్రుతిగాజేసుకొని ఈపాటలు పాడతారు. కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకాలో ఈపాటలు నేను విన్నాను. పాటలలో స్వారస్య మంతగా లేకున్నా విసరురాతిశబ్దముతో శ్రుతికలిగి ఇద్దరుస్త్రీలు మధురకంఠములతో పాడినప్పుడు మాత్రము త్రోవనుపోయేమనిషి నిలిచి వినకమానడు. మచ్చుకి ఒకపదంచూడండి.

"ఈయూరికుమ్మరీయిల్లు నే నెరగ, చెయ్యాలి కుమ్మరీ గజ్జెల్ల కడవ
గజ్జెల్లకడవాకి ఏబావినీళ్లు, పేరైన 'యిసుకాల' పెదబావినీళ్లు"

బుడుగుబుడుగున ముంచి మోకాట పెట్టి, అక్కడిక్కడ చూచి కట్టపై చూచి
కట్టమీద పొయ్యేది ఎవరమ్మ మీరు, కట్టమీద పొయ్యేది గాజుల్లసెట్టి
నే నొచ్చి తడవాయె కడ వెత్తవయ్యా, కడవపేరు ఏంపేరు నీపేరు ఏమి
కడవపేరు గంగమ్మ నాపేరు సీత, అయిపోయె గౌరమ్మ అయిపోయెనమ్మ
ఐపైనగిరిమీద ఆడి రావమ్మా, మాజొన్న లయిపోయె మేము పోతాము
మళ్ళొచ్చి నీపాట ఎల్ల పాడేము."

కోలాటంపాటలూ గొబ్బిపాటలూ ఆనాటి కానాడు ఆదరణలేక నీరసిస్తున్నవి. శ్రీకృష్ణలీలలూ రామకథా కోలాటంపాటలుగా పాడతారు. రెణ్ణెలక్రితం మోడర్న రెవ్యూలో "బెంగాలు ఫోకుడాన్సు" అంటూ బొమ్మలతోకూడా వ్యాసము పడ్డది. ఇట్టినాట్యాలు బెంగాలుకేకాదు భారతదేశానికంతకీ సమానమే. మనలో కోలాటమప్పుడు నృత్యముంటుంది. పూర్వము పిన్నలూ పెద్దలూ ఈవినోదములో పాల్గొనేవారనుకొంటాను. ఇప్పుడు పిన్నలుమాత్రమే పాల్గొంటున్నారు. పురుషులూ స్త్రీలూ పిన్నలూ పెద్దలూ పూర్వకాలమందువలె ఆటలూ పాటలూ పండుగులకీ పబ్బాలకీ వీధుల్లో ఆడుతూ పాడుతూ మళ్ళీ ఎప్పుడు వినోదిస్తారో! స్త్రీలుగాని పురుషులుగానీ కొంతవయస్సు రావడంతోనే ఆటలూ పాటలూ కట్టిపెట్టుతున్నారు. చదువుకొన్నవారుమాత్రము కించిత్తు దొరలఆట లాడుతున్నారు. మనఆటలూ పాటలూ అడుగంటుతున్నాయి.

"చిన్నిబిన్నికి ఎన్నో ఏడు, చెంగలగారికి ఎన్నో ఏడు
తాడీమేడికి ఎన్నో ఏడు, తామరసమొగ్గల్లూ"

అంటూనున్నా,

"చినచినదొంతుల్ చిటారిదొంతుల్, లక్కామేడల్ లవంగమొగ్గల్
చిన్నీ మీ రేటివారే, చిలకా మీ రేటివారే
తాయీ మీరేటివారే, తామరమొగ్గల్లూ తామరమొగ్గల్లు"

అంటూనున్నా బాలికలు ఆడేఆటలు ఒకమోస్తరు నాట్యమే, కోలాటంవలెనే. ఈనాట్యకళనుకూడా సారస్వతముతో ఉద్ధరించవలసిఉంటుంది.

గుజరాతుదేశములో గర్భనృత్యమని స్త్రీలు నృత్యముచేస్తారుట. ఒకమారు ఈ "గర్భడాన్సు"మీద పైపత్రికలోనే ఒకవ్యాసము బొమ్మలతో పడింది. గొబ్బిపాటలు పాడేటప్పుడు స్త్రీలు చేసేనృత్యము గర్భనృత్యమే. "గర్భ" అనేపదము "గొబ్బి"అ

యినదని అనుకొంటాను. సంక్రాంతి నెలఅంతా గొబ్బిపిడకలు చేసుకొని సాయంకాలం దీపాలుపెట్టి గొబ్బిపాటలు పాడుతూ స్త్రీలూ బాలికలూ నృత్యముచేస్తారు.

"సుబ్బి గొబ్బెమ్మా, మొగలిపు వ్వంటి
మొగుణ్ణి యియ్యా వే, చామంతిపు వ్వంటి
చెల్లెలి నియ్యా వే, తామరపు వ్వంటి
తమ్ము ణ్ణియ్యా వే, పనసపం డంటి
బాలు ణ్ణియ్యా వే, . . ఇత్యాది.

ఈగొబ్బిపాటలు అనేకవిధాలుగా ఉన్నవి.

♦ ♦ ♦

స్త్రీలసారస్వతములో మంగళారతుల కున్న ప్రాముఖ్యమూ ప్రచారమూ ఇకదేనికీ లేదు. సమస్తశుభ కార్యములకూ ఇవి అవసరముకాబట్టి సమస్తదేవతలకూ అనేక వరసలలో మంగళహారతులు రచించియున్నారు కవులు. ఇతర భాషలలోనిమంగళారతులుకూడా తెనుగులో ప్రచారములో ఉన్నవి. ముఖ్యముగా సంస్కృతభాషను రచించినవి.

"రామచంద్రాయ జనకరాజజామనోహరాయ
మామకాభీష్టదాయ మహితమంగళమ్" ఇత్యాది.

ఒకమంగళహారతితో ఈవ్యాసము ముగిస్తున్నాను. పార్వతి సర్వజ్ఞుణ్ణి చూడబోతోంది. ఎక్కడికి వెడుతున్నావని చెలికత్తె లడుగుతారు. పార్వతి సమాధానం చెప్పుతుంది.

ఘల్లుఘల్లున పాదగజ్జె లందెలు మ్రోయ, కలహంసనడకల కలికి యెక్కడికే
జడలోను గంగను ధరియించుకున్నట్టి, జగము లేలేసాంబశివునిసన్నిధికే
మంగళం మంగళం;
తళతళమను రత్నతాటంకములు మెరయ పసిడికుండలములపడతి యెక్కడికే,
కరియోగచర్మము కటిధారుడైనట్టి గురుడైన శంభుశంకరుని సన్నిధికే,
మంగళం మంగళం;
చెంగావిచీరలకొంగులు జారంగ, రంగైననవమోహనాంగి యెక్కడికే
పులితోలు వస్త్రాలు భూతి ధరియించిన, బ్రహ్మాండ మేలుజగదీశుసన్నిధికే
మంగళం మంగళం.

* * *

# ప్రాకృతభాషాచరిత్రము

వేదాల తిరువేంగళాచార్యులు

లోకమున జన్మించినప్రతిమానవుడూ దనతోడిమానవునితో సంబంధమునకై ప్రయత్నించుట సహజము. అట్టిసంబంధమును కల్పేసాధనము లన్నిటిలోనూ ఉత్తమమును సులభమును సహజమునునైనది భాష. ఇది మానవులలోమాత్రమేకాక మృగములు, పక్షులు, వీటిలోగూడ గన్పడుచున్నది. చేష్టలుగూడ గొంతసహజములగుసాధనములేకాని అవి యొకరికొకరు కనబడుచున్నపుడే తాత్కాలికముగానే ప్రత్యక్షములగువానివిషయముననే ఉపయోగించును. భాషసంగతి అట్లుకాదు. కనుకనే ఇది సకలమానవులకున్ను సహజముగా నేర్పడి విస్తరించి మారుపుల నొందుచున్నది.

ఈతీరున నార్యజాతిలో మొట్టమొదట బుట్టినది ప్రాకృతము. ఇపుడు మనము చూచుచున్నప్రాకృతము చాలతరువాత నేర్పడినది. మొదటిప్రాకృతము పుట్టిన నాటికి వేదములుకూడ ఇంకా పుట్టియుండలేదు. అప్పటిసంఘపుసామాన్యవ్యవహారమునందున్నభాషయే వైదికభాషకును, ఇరెనియన్, గ్రీకు, లాటిన్, మొదలగు భాషలకున్ను మూలమైనది. ఆభాష మాటాడువారిలోనికొంతమంది అందు శుద్ధముగా, అనగా సంఘమునం దెక్కువగాబ్రసిద్ధములగుపదములనేర్చియే వేదమంత్రములు రచించిరి. సంఘమునందు శిష్టులగువారు మాటాడునవియు, సంఘములో నెక్కువగా వ్యవహారవ్యాప్తి నొందినవియు నగుపదములే వేదములం దెక్కువగా వాడబడినవి. అప్పటిజనసామాన్యవ్యవహారమునందు ప్రాకృతమే నిలచియుండినది. ఈవిషయము "హేలయో, హేలయ" ఇతి। అనువైదికగ్రంథభాగమువలన మనకు బోధపడును. అచ్చటి విషయ మిది: 'అసురులు' అనునొకతెగవారు "హే అరయః" అనిపలుకవలసియున్నచోట "హేఽలయః" అనిరట. అనగా "హే- అరయః" అని విసంధిగాను, రేఫతోను నుండవలసినదానికి, "హేఽలయః" ససంధిగాను, లకారముతోనూ ఉచ్చరించిరన్నమాట. అందుచే వారు పరాజితులైరట." ఇందువలన మనకు తెలియవచ్చువిషయ మిది. శిష్టులైనవారు సరిగా భాష నుచ్చ

రిస్తూఉండిరనియు సామాన్యులుమాత్రము భాష నతథావిధముగా నుచ్చరిస్తూ ఉండే వారనియు అప్పుడుకూడ నిప్పటి * ప్రాకృతమువంటి వ్యావహారిక భాషయే యొకటి యున్నదనియు మనము స్పష్టముగా గ్రహింపవచ్చును. అపుడు సామాన్యులు మాటాడునది ప్రాకృతమేకదా! దానికిని అప్పటిశిష్టులభాషకును నెక్కుడంతరము లేదు. ఈషదంతరమే. "హేఽరయః" అనుదానికిని "హేఽలయః" అనుదానికిని నెక్కుడుభేదము లేదుకదా! ఇప్పటిసంస్కృతప్రాకృతములకు అనగా శిష్టభాషకును సామాన్యవ్యావహారికభాషకును గలయంతరము వేదోద్భవకాలపుభాషలకు లేదనుటకే యింత చెప్పితిమి.

ఇదొక్కటే కాక ఇంకోసంగతికూడా అప్పటిశిష్టాశిష్టభాషల కెక్కువంతరము లేనట్టు తెలియజేస్తుంది.

ఆంజనేయుడు లంకలో సీతతో మొదట మాటాడదలచినపుడు "వాచం చోదాహరిష్యామి మానుషీ మిహ సంస్కృతాం" అనెను. "మానుషీం" అనడంలోగల భావ మిది. "తాను వానరుడగుటయు, ఇక్కడివా రందరు రాక్షసులగుటయు కారణంగా మనుష్యజాతిలోనిదైన సీతాదేవికి నమ్మకం కలిగేటందుకుగాను మనుష్యులు మాటాడుకొనే గైర్వాణిని మాటాడుతాను" అని. "సంస్కృతాం" అంటే "గైర్వాణి" అనే వ్యాఖ్యాతలుకూడా రాశారు. అంటే ఇది జనసామాన్యము మాటాడుకొనే ప్రాకృతగైర్వాణియనే యర్థము గ్రహించాలిక్కడ; లేకపోతే ముందు గ్రంథము కుదురదు. ఏమంటే వెంటనే "యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతాం రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి" అని, "అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్య మర్థవత్" అనిఅంటాడతడే. సంస్కృతమును అంటే గైర్వాణిని ద్విజాతివలె అనగా బ్రాహ్మడివలె ప్రదాస్యామి-అధికముగా వ్యవహరిస్తే - అనగా చక్కగా సంస్కారయుక్తమైనభాషను బ్రాహ్మణుడు మాటాడినట్లు నేనుకూడా మాటాడితే సీతకు అనుమానం కలిగి

* ఆకాలమున వ్యావహారికభాషకు "ప్రాకృతము" అనుపేరు కాని, జనసామాన్యమునకు "ప్రాకృతము" అనుపేరుకాని లేదు. ఈరెండుపేరులును చాలతరువాత బ్రాహ్మణాదివర్ణవ్యవస్థ దృఢమై వర్ణాధిక్యము లేర్పడినతరువాత వచ్చినవి. కావున నిచట "ప్రాకృతము" అనుపదమును కొంత వ్యాపకమగు నర్థమున గ్రహింపవలయును. అనగా "జనసామాన్యపుభాష" యని యర్థము చెప్పకొనవలెను.

భయపడుతుంది. ఏమని అనుమానం? "వానరుడికి ఇంతసాపుగా వున్న సంస్కృతం (గైర్వాణి) మాటాడ్డం కుదురదు. కాబట్టి బ్రాహ్మణుడైనరావణుడే ఈరూపంతో వచ్చి నాతో మాటాడుతూండాలి" అని. "వ్రిదాస్యామి" అనేచోట ప్రకర్ష మేమిటో తెలుసునా? సంస్కారాధిక్యమే. ఈశ్లోకంలో "సంస్కృతాం" అనేదానికి 'సంస్కరింపబడినది' అనేఅర్థమే చెప్పుకోవాలి. అట్లా కాకుండా వెనుకటిశ్లోకంలో మల్లె "గైర్వాణి" అని అర్థం చెప్పకూడదు. ఏమంటే "ద్విజాతివలె సంస్కృతమైన మాటను మాటాడితే" అనడంలో 'సంస్కరింపబడినది' అనే అర్థమే ఉచితంకాని గైర్వాణి అనేది కాదుకదా! అది అందరికి సామాన్యమేగా! బ్రాహ్మడివలె ననడంలో గలవిశేష మేముం దప్పుడు? ఇంతేకాకుండా "గైర్వాణి" అనే అర్థానికి ముందు చెప్పిన "అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్య మర్థవత్" అనేది అడ్డుతుంది. మానుషసామాన్యభాష గైర్వాణే కాబట్టి దానిని మాటాడితే రావణు డనే అనుమానం సీత కెట్లాపోతుంది? పోదు. వెనుకటిశ్లోకంలో గైర్వాణిని మాటాడితే సీతాదేవికి రావణుడనే అనుమానం కలుగుతుం దనిచెప్పి ఇపుడు మళ్ళీ గైర్వాణిని మాటాడుతాననడంలో పూర్వోత్తర విరోధం రాలేదా? మానుషభాష గైర్వాణేనని "వాచం చోదాహరిష్యామి మానుషీ మిహా సంస్కృతాం" అనేచోట స్పష్టంగా చెప్పే ఉన్నాడు. కాబట్టి పైశ్లోకాలకన్నిటికీ భావం ఇట్లా చేరయాలి. "నేను సీతతో మాటాడేటప్పుడు మనుష్యులు వాడుకచేసే గైర్వాణినే (సామాన్యభాష ఐనప్రాకృతగైర్వాణినే) మాటాడుతాను. అట్లా కాకుండా ద్విజాతివలె - బ్రాహ్మడిమల్లే సంస్కరింపబడినభాష నుపయోగిస్తే (వానరస్య విశేషేణ కథంస్యా దభిభాషణం) "ఈవానర మింతచక్కగా బ్రాహ్మలు మాటాడేటంతపరిశుద్ధంగా సంస్కృతం భాషను మాటాడడం అసంభవం కాబట్టి రావణుడే నాతో సల్లాపసౌఖ్యంకోసం ఈవేషంతో ఇట్లా వచ్చివుండాలి" అని అనుమానించి సీత భీతిల్లుతుంది, కనుక మనుష్యసామాన్యం వాడుకచేసే గైర్వాణినే (ప్రాకృతగైర్వాణినే) నేను మాటాడుతాను." అని ఇట్లా అర్థంచేసుకుంటేనే తర్వాత హనుమంతుడు దూతలను నిందించే ప్రకరణంగూడా సరిపోతుంది. అంటే "నేను (ఆంజనేయులు) బాగా సంస్కృతం మాటాడగలను గదా యని మాటాడితే అసలుపని పాడవుతుంది; సీత అసలు మాటాడనే మాటాడదు భయపడి. పండితమ్మన్యులైన దూతలు తమగొప్పదనమునే చూచుకొంటారుకాని కార్య

సాఫల్యం విషయం గమనించరు. ఇంకా వాళ్ళు చాలాతప్పులు చేస్తారు. నేనుకూడా పండితుణ్ణనేగర్వంతో అట్లామాట్లాడితే చివరకు పని పాడుచేసి చెడ్డదూత ననిపించు కొంటాను. కాబట్టి తప్పకుండా సీతతో మనుష్యసామాన్యభాషలోనే ప్రాకృత గ్రైర్వాణిలోనే మాటాడడం ఉచితం. అపుడు రాక్షసులు అనే అనుమానంకాని రావణుడు అనే శంకకాని సీతమనసుకు గలుగదు” అనినిర్ణయిస్తాడు. అదికూడా సరిపోతుం దన్నమాట.

ముందు సీతతో మాటాడినతరువాతకూడా సీత ఈతనిభాషనుగురించి అను మానపడలేదు. “యథాయథా సమీపం స హనూమా నుపసర్పతి। తథా తథా రావణం సా సీతా తం పరిశంకతే'' అనగా ఆంజనేయుడు సీత శోకంతో వందురడం చూచి ఆమెచేరువకు ఓదార్చడానికై పోతూండెను. అతడు దగ్గరకు వస్తూన్నతీరు జూచి సీతకు ‘‘రావణు డేమో” అని సందేహము కలిగెను. అంతేకాని భాషావిష యంలో హనూమంతుణ్ణి శంకించినట్లు లేదు.

నిజంగా ఆంజనేయుడు సంస్కరింపబడినభాషనే మాటాడిఉంటే అత డూహిం చినట్లు సీత తప్పకుండా అనుమానంపడనేపడేది. కనుక మనుష్యసామాన్యం మా టాడే గ్రైర్వాణిలోనే సీతతో ఆంజనేయుడు మాటాడాడని స్పష్టము. ఆభాష రామాయణపుభాషే నని మనం గ్రహించాలి. అంటే జనసామాన్యము వ్యవహరించే భాషయందే శ్రీమద్రామాయణంవ్రాయబడిందని భావం. అయితే ఈభాష కేవలం పామరులు మాటాడేదికాదు కాని సామాన్యంగా శిష్టులు మాటాడేదీ జనసామా న్యానికి సాధారణంగా బోధపడేదిన్నీ అయినభాష అని మనం అర్థంజేసుకోవాలి. చూడండీ శ్లోకాన్ని :

“ప్రశస్యమానే సర్వత్ర కదాచి త్తత్ర గాయకౌ
రథ్యాసు రాజమార్గేషు దదర్శ భరతాగ్రజః”

(కుశలవులు శ్రీమద్రామాయణమును రథ్యల్లోను రాజమార్గాల్లోను పాడుతూ వినేవారందరికీ విందు కల్గిస్తూ వారందరిచేతనూ కొనియాడబడుతుండగా శ్రీరామ చంద్రుడు చూచెను.) శ్రీమద్రామాయణము రథ్యలవారికిన్నీ రాజమార్గములవారి కిన్నీ చక్కగా బోధపడేట ట్లుంటేనేగదా వారందరు కుశలవులను కొనియాడడం

సంభవిస్తుంది. పట్టిపాటకే అట్లా జరిగిందనుకుంటారేమో ? కాదు. 'విశ్రుతార్థ మ
గాయతాం' అని ఉంది ముందు. ఇంతెందుకు అసలు శ్రీమద్రామాయణానికి మూల
మైన 'మానిషాద' శ్లోకం పుట్టినస్థితిని కొంచెం పరిశీలించండి. వాల్మీకి యాదాలా
పంగా అన్నమాటకదా అది. మనం సహజంగా ఎట్లామాటాడుతూంటామో ఆ భా
షే. అటువంటిసమయాల్లో అప్రయత్నంగా మననోట వస్తుందికాని మనం మాట్లా
డాలని పట్టుదలతో కల్పించుకొన్న భాష రాదుకదా; ఈవిషయం అందరికీ అనుభవం
లోదేకదా ! దీన్ని బుచ్చుకొని ఆలోచించినాకూడా శ్రీమద్రామాయణం జనసా
మాన్యం మాటాడేప్రాకృతగీర్వాణంలోనే ఉంది అని మనకు సులభంగానే
తెలుస్తుంది.

అయితే అప్పటిజనసామాన్యపుభాషకున్నూ గ్రాంథికభాషకున్నూ భేద మేమీ
లేదని మనం గ్రహించాలి. అంటే అప్పుడు గ్రంథాలు జనసామాన్యం మాటాడే
భాషలోనే రాస్తున్నారన్నమాట. ఆభాషే మే మిప్పుడు ప్రాకృతం అనేది. జనసా
మాన్యం మాటాడేది ప్రాకృతంఅనేఅంటారుకదా ! బ్రాహ్మలు పండితులు సభల్లో
గాని ఎవరైనా దేశాన్తరం శిష్టులుకానీ వ్యవహరించేది సంస్కృతమే. అనగా వ్యా
కరణసంస్కారాలతో సానదీరిందే. కనుకనే కిష్కింధాకాండలో శ్రీరామలక్ష్మణు
లతో మొట్టమొదట హనూమంతుడు మాటాడ్డాన్ని గురించి శ్రీరామచంద్రుడిట్లా
అంటున్నాడు.

"నూనం వ్యాకరణం కృత్స్నం అనేన బహుధా శ్రుతం
బహు వ్యాహరతాఽనేన నకించి దపశబ్దితం
సంస్కారక్రమసంపన్నా మద్రుతా మవిలంబితాం
ఉచ్చారయతి కళ్యాణీం వాచం హృదయహారిణీం" అని.

మనంకూడా సామాన్యంగా ఎవరైనా పెద్దమనుష్యులతో మాటాడేటప్పుడుగాని
సంస్కృతపండితు లితరపండితులతో ఏదైనా విషయాన్ని చర్చించేటప్పుడుగానీ
సంస్కృతమైనభాషలోనే జాగ్రత్తగా మాటాడ్డం అలవాటు. అట్లాగే ఇదిన్నీకూడా
నని భావిస్తే ఏకకాలిక మైనవ్యవహారభాషకున్నూ సంస్కృతమైనభాషకున్నూ
ఎక్కువఅంతర ముండబోదని మనకు స్పష్టపడుతుంది.

ఈవ్యవహారం భారతం కాలానగూడా ఉందనడానికి సూచనలున్నవి. కర్ణ పర్వంలో కర్ణుడు శల్యుడిదేశాచారాలను నిందించడంలో " హేహా తే హేహా తే త్యేవం స్వామిభర్తృహా తేతిచ ఆక్రోశన్త్యః".

(" ఓచచ్చిందానా! ఓచచ్చిందానా!" అని "అనాథా!" అని "మగడు చచ్చి నముండా" అని ఇట్లా పెద్దగా కేకలువేసి పిలుస్తుంటారు)

ఆదేశంలో ఆడవాళ్ళు ఒకరినొకరు పిలుచుకొనేతీరు లుదాహరించాడు.

మరిన్నీ భగవద్గీత సంస్కృతంలో వుండడము, అందులో కొన్నిశ్లోకాలు సంభాషణ రూపానవుండి ఛందోభంగంకలిగివుండడంకూడా ఇందుకు సూచకాలే.

ఈసందర్భాలన్నీ గమనించి చూస్తే ప్రాచీనకాలపుప్రాకృతానికిన్నీ సంస్కృతానికిన్నీ భేదం ఎక్కువగా లేదని మనం సిద్ధాన్తంచెయ్యవచ్చు. రానురాను కాలం గడిచినకొద్దీ సంఘంతాలూకు ఆచారవ్యవహారాలనుబట్టీ ప్రాకృతం శిష్టులు వ్యవహరించేభాషకు చాలాదూరమైపోయింది. ఏమంటే వేదకాలానికి పూర్వంగానీ ఆకాలంలోగానీ ఆర్యసంఘంలో బ్రాహ్మణాదిజాతుల కింతటివిభేదాలు ఒకరినొకరు అంటుకోకూడదనేంతవరకూ లేవు. అపుడు సంఘమంతా ఒకటిగానే ఉన్నది. "దస్యులు" అనే అనార్యజాతివారుతప్ప కడమ అందరూ పరస్పరం భోజనశయనాసన కన్యాదానస్వీకారాదుల్లో ఒక్కటిగానే ఉన్నారు. కాబట్టే అపుడు భాషలో ఇంతటి విప్లవం రాలేదు. కాని కాలక్రమేణా బ్రాహ్మణాలు, కల్పసూత్రాలు, స్మృతులు, మొదలైనవి పుట్టిపెరిగేనాటికి బ్రాహ్మణాదిజాతులవర్ణవిభాగం స్థిరపడి వర్ణవ్యవస్థ ఏర్పడి ఉత్తమాధమభావములు, స్పర్శ్యాస్పర్శ్యాదులు, భోజ్యాన్నత్వాభోజ్యాన్నత్వాదులు, దృఢంగా ఏర్పడినవి. ఇంతేకాక సంఘం పెరిగి నానాదిక్కులా చెదిరికూడా పోయింది. 'దస్యులు,' 'మ్లేచ్ఛులు,' మొదలైన అనార్యజాతివారు ఆర్యసంఘంలో ప్రవేశించిరి. చిరకాలసహవాసంవల్ల వారికీ సంఘంలో వారివారికనువైనతీరుల ప్రవేశం ఏర్పడ్డది. ఇట్టివారినుండి జాతిసాంకర్యం తొలగించాలననే తలంపుతోనే వర్ణవ్యవస్థ దృఢంగా చేయబడ్డది. అందువల్లనే జాతులమధ్య దృఢతమాలైన విభేదా లేర్పడ్డవి.

అంటరానివారు, దూరస్థులు, చూడరానివారు, అసంభాష్యులు, మొదలగు నానారకాలు విభేదాలు ఏర్పడడం స్మృతులను జూస్తే తెలుస్తుంది. ఇది అంతా

కూడా అపుడు దూరదర్శులు లోకక్షేమాభిలాషులున్నూ అయినమనపూర్వపు పెద్దలు మహర్షులు జాతిసాంకర్యం మళ్ళీకలుగకుండా జాతియొక్క ఉత్తమగుణాలు మంచి సాంప్రదాయాలున్నూ నశించిపోకుండా జాతి నిత్యశుద్ధంగా చిరస్థాయి కావాలెననేకోరికతో చేసినయేర్పాటేకాని ఇప్పటివారు కొందరనుకొనేట్లుగా ఒక జాతిమీద అన్యాయాద్వేషాలతో చేసిందిమాత్రం కాదు. వేదకాలంనాడెట్టివర్ణాలున్నవో ఆసాంప్రదాయాలు చెడిపోకుండా నిలుపడమే ముఖ్యంగా తలచారు కనుక మహర్షులపరిషత్తుల్లో అనేకపర్యాయాలు పర్యాలోచింపబడ్డవిషయాలు వేదాన్ని సాంప్రదాయశుద్ధంగా అవలంబించినవాటిని మనువు భృగువునకు బోధించి అతనిద్వారా స్మృతి నిబంధించినాడు. ఈభావమే "యద్వై మను రవద త్తద్భేషజం" అనేమాటకు. అది వేరేవిషయం - అది అట్లావుండనీయండి.

అయితే వారు జాతిసాంకర్యం వారించడాని కెంతటిప్రయత్నాలు చేసినా అది తప్పనట్లే భాషాసాంకర్యంకూడా తప్పిందికాదు. వారిమాటలు వీరికీ వీరిమాటలు కొన్ని వారికిన్నీ సంభవించినవి. గైర్వాణిలోని చాలాపదాలు తదితరభాషల్లోకి సంక్రమించి ఆర్యులనాగరకతాసామర్థ్యముచేత వారిభాషలను జాలవరకు రూపుమాపివేసినవి. ఎచ్చటెచ్చటనో కొన్నిపదములుమాత్రము అనార్యజాతివారివి వినబడుతూఉంటవి. చూడుడు. అవిద, పిశచ్ఛ, హాల్లఫలం, రుమ్నః, చిరడిం, పదోహారం, పితృమ్వసః, కదుష్ణజలం, త్యత్, వర్ణావలీ, పశ్చాద్గృహం) — ఇట్టివే యింకనూ అనార్యజాతివారివికూడ కొన్నిపదములు గైర్వాణియందు సంక్రమింపకపోలేదు. అనగా గైర్వాణిపదములుగానే వ్యుత్పత్తిసహితంగా స్వీకరింపబడ్డవి. చాలమంది కవి ఈభాషాపదములు కావని తెలియనే తెలియదు. "తామరసం, పికః, విమ్బంభః, కిష్కుః" ఇత్యాదు లిట్టిపదములే. కొన్నికొన్నిపదము లార్య్య లోకయర్థమునందున్నూ అనార్య్య లోకయర్థమునందున్నూ వాడుతూండిరి. ఇట్టివే "ప్రియంగుః, పీలుః, వరాహః" మొదలైనవి. పూర్వమీమాంసలో మొదటి అధ్యాయం సాంగంగా పరిశీలిస్తే ఈవిషయం మనకు స్పష్టంగా రుజువౌతుంది.

ఇట్లా వర్ణవిభాగాలు దృఢంగావడం సంఘం నానాదిక్కుల వ్యాపించడం భాషాసాంకర్యం అన్నీ కలిసి జనసామాన్యం మాటాడేమాటకూ బ్రాహ్మణాద్యుత్తమజాతులు మాటాడేమాటకూ కనుక్కోదగినంతభేదాన్ని ఏర్పరచినవి. కాని అది

వరలో గైర్వాణినే వాడుచున్న జనసామాన్యంమాత్రం వర్ణలోపవర్ణాగమవర్ణవ్యత్య యాదులతో వెనుకటిగైర్వాణినే భాషా న్తరసంకీర్ణమైనదాన్ని వాడుచుండిరి. అందు వలన ఆభాష చాలవఱకు గైర్వాణీభవశబ్దాలతోనే (100 కి 80 వంతులు) కలసి వేరేభాషగా ఏర్పడింది. బ్రాహ్మణాద్యుత్తమజాతులుమాత్రం గైర్వాణి కితరభాషా సంపర్కం కలుగుటవల్లను తమసంఘం దూరదేశగత మగుటవల్లను తమసంఘాని కంతటికీ నిస్సందేహంగా బోధపడేటట్టుగా భాష తమకుండవలెనని తలపెట్టారు. అంతే కాకుండా వేదములనుబట్టి యేర్పడినయజ్ఞయాగాదుల్లో కొన్ని కొన్ని మాటలు మంత్రాలు ఆవెనుకటిరూపాలతోనే వుండాలి కాని మారు పేమీ వుండరాద నేకట్టుదల కూడా వారికుంది. అవికనుక మారితే అసలు ప్రాచీనమైనవైదికసాంప్రదాయం చెడి పోతుందని వారివిశ్వాసం. కాబట్టి వారందరూకూడా వెనుకటివైదికసాంప్రదాయం ఏమాత్రంకూడా చెడిపోకుండా నిలవబెట్టగలిగినట్టిన్నీ దూరదేశాలలో వున్నప్పటికీ కూడా వారిసంఘాని కంతటికిన్నీ అర్థంకాగలట్టిన్నీ వీలుకలిగేటట్టు వెనుకటి గైర్వాణినే సంస్కరించి సంస్కృతమనే పేరుతో దానిని వ్యవహరిస్తుండిరి. ఈవిష యమే "సంస్కృతంనామ దైవీ వా గన్వాఖ్యాతా మహర్షిభిః" అనేదండివాక్యం వల్ల బోధపడేది. అయితే అందులోగూడా దేశభేదాన్ని అనుసరించి "వర్తికా శకునే ప్రాచాం, ఉదీచా మాత్స్థానేయకపూర్వాయాః" అని యీతీరుగా భేదాలు మార్పులు రాకపోలేదు. కాని ఆవిషయం మన కప్రస్తుతం. ఇట్లా విస్పష్టభేదమైన భాషకే ఈనాడు ప్రాకృతమనేపేరు కల్గింది. నిజాని కిది మొదట "పాలీ" అనేపేరుతో బయలుదేరి దేశంలో వ్యవహరింపబడ్డది. మొదట - అంటే గైర్వాణికి సంస్కారంజరిగి జనసామాన్యభాష గైర్వాణినుండి విడివడ్డరోజుల్లో-ఇంకా యెక్కువమార్పులు లేకపోవడంవల్ల ఈపాలీకిన్ని సంస్కృతానికిన్ని ఎక్కువభేదం లేకపోయింది. కాబట్టే అప్పటిభాష ఇంచుమించుగా సంస్కృతమల్లేనే వుంటుంది; చూడండి.

"సుఖకామాని భూతాని యో దండేన విహింసతి, అత్తనో సుఖమేసానో పెచ్చసో న లభతే సుఖం" పాలీభాష.

"సుఖకామాని భూతాని యో దండేన విహినస్తి, ఆత్మన స్సుఖ మిచ్ఛన్ ప్రేత్య న లభతే సుఖం" సంస్కృతభాష.

అశోకచక్రవర్తి శిలాశాసనాలల్లో ఈపాలీభాష ఇంతకంటేకూడా సంస్కృతా నికి దూరమైనట్టిసిలి మనకు కనపడుతూ ఈభాషయందు వెంటవెంటనే ఎటువంటి పరిణమా లేర్పడినవో మనకు స్పష్టపరుస్తుంది. అదికూడా చూడండి.

(1) దేవానాంపియే పియదసిలాజా ఆహా (2) జనే ఉచావుచం మంగలం కలేతి ఆబాధసి అవాహసివివాహసి పజోదానేపవాససి ఏతాయే అంనాయే చాఏదిసాయే జనే బహుమంగలం కలేతి. (3) హేతచు అబకజనియో బహుచా బహువిధం చాఖుదాచానిలధియాచా మంగలం కలంతి. ( కాల్సీ, శిలాశాసనం. )

(1) దేవానాంప్రియః ప్రియదర్శీ రాజా ఆహ (2) జన ఉచ్చావచం మంగలం కరోతి. ఆబాధే ఆవాహే వివాహే ప్రజోత్పాదే ప్రవాసే ఏతస్మిః అన్యస్మింశ్చ ఏతా దృశే బహుమంగలం కరోతి (3) ఇహాతు అర్భకజనన్యో బహుచ బహువిధంచ క్షుద్రించ నార్ధకంచ మంగలం కుర్వన్తి. (సంస్కృతం) దాన్నిగమనించేవారికి పాలీ భాష ఎట్లా రోజుకురోజుకూ మార్పుపొందుతూన్నదిన్నీ స్పష్టపడకపోదు. ఇది ఇంకా చాలామారి నానారకాలమార్పులతో జనసామాన్యం వాడుకలో వుండి దేశనా మాలతో "శౌరసేని" "మహారాష్ట్రి" "మాగధి" అని యీతీరుగా కొంతపేరు పడ్డది. మరికొంత, వ్యవహరించే మనుష్యులను బుచ్చుకొని "ఆభీరి" "పైశాచి" అని అయింది. దానిస్వరూపాన్ని అనుసరించి మరికొంతకు "అపభ్రంశము" అని యీతీరుపేరు వచ్చింది. అంతేకాని ప్రాకృతం అనేపేరుతో ఇందులో ఏఒక్కటీకూడా మొదట చెప్పబడలేదు. అయితే ఈపేరు రావడానికి కారణం ఏమంటే ఉత్తమజాతి వారమనీ వివేకులమనీ అనుకొనే బ్రాహ్మలు మొదలైనవాళ్ళు పైభాషలు మాటా డేవాళ్ళనందరినీ ప్రాకృతులు - వివేకహీనులు అనిన్నీ వాళ్ళు వాడేభాష సరియింది కాదనిన్నీ ఎట్లా నోటికి వస్తే అట్లా సహజంగానే మాటాడుతారనిన్నీ ('ప్రకృతే రాగతం' అని వ్యుత్పత్తి) ప్రాకృతులు మాటాడుతారనిన్నీ కారణాలు ఏర్పర్చుకొని పైభాషల మొత్తాని కంతటికీ "ప్రాకృతము" అని పేరుపెట్టిరి. వారు బొడ్డుకోసి పెట్టి నపేరే ఇది. వారినామకరణమాహాత్మ్యమో వారికి సంఘంలో గలపలుకుబడిసామ ర్థ్యమో కాని వారిమాటే ఇప్పటివరకూగూడా ఆభాషలమీద చెల్లుతున్నది. ఈభా షలనుగురించి వారికి ఎంతెంతో నిరసనభావం ఉంది. భాషాకావ్యం రచింపరాదనిన్నీ దానిని ముట్టి చూడరాదనిన్నీకూడా వారు వ్రాసిరి. ఈబ్రాహ్మణాదిజాతులకు ప్రా కృతభాషలవిషయమునగల నిరసనభావాని కుదాహరణంగా, బృహత్కథనుగురించి

సర్వవర్మ మాటాడినమాటలున్నూ దానివిషయంలో జరిగిన అనాదరణమున్నూ మనం చెప్పకోవచ్చు. అయితే ఈ ప్రాకృతాన్ని అందరున్నూ నిరాకరించలేదు. నిరాకరించనూ లేకపోయిరి.

"మహారాష్ట్రాశ్రయాంభాషాం ప్రకృష్టంప్రాకృతంవిదుః యన్మయం సేతుబంధాది" అనేదండిమాటలవల్ల 'మహారాష్ట్రి' అనేప్రాకృత విభాగాన్నిమాత్రం చాల మంది ఆదరిస్తుండేవారని తెలుస్తుంది. ఈఆదరణకు కారణమేమని విచారిస్తే ఇది సంస్కృతభాషకు చాలచేరువగా వుండడమూ అందులోనే "సేతుబంధము" మొదలైన మంచిమంచిప్రబంధాలు నిర్మింపబడడమున్నూ కారణమని తెలుస్తుంది. ఈ భాషకూ సంస్కృతానికిన్నీ ఇంతదగ్గిరచుట్టరిక మేమంటే ఈ భాష వ్యవహారములో వున్న మహారాష్ట్రదేశం పూర్వం ఉజ్జయినీపాలకు డైనవిక్రమార్కునిపాలనలోది. అంతే కాకుండా అతనినివాసదేశమైన మాలవదేశము నంటిపెట్టుకొనియున్న దీదేశము. అంటియుండడమేమిటి బాగాపరిశీలిస్తే మాలవదేశంలోని కొంతభాగం ప్రస్తుత మహారాష్ట్రదేశంలోనే ఉంది. పూర్వకాలపుఎల్లలు మారిపోయినవి కనుక ఇప్పు డిది స్పష్టంగా అందరికిన్నీ తెలియరావడంలేదు. అది అట్లా వుండనీయండి. అయితే అపుడు మాల్వాదేశం పాలించే విక్రమార్కుడు తనరాజ్యంలో అందరూకూడా సంస్కృతమే మాటాడితీరాలెనని నిర్బంధంచేసి అందరిచేతాకూడా సంస్కృతమే మాటాడించితీరెను. జనసామాన్యంకూడా మామూలు లోకవ్యవహారాలల్లోకూడా సంస్కృతమే మాటాడుతూండేవారు. 'కాలే శ్రీసాహసాంకస్య కే న సంస్కృత భాషిణః" అనేభోజునిసరస్వతీకంఠాభరణోక్తిని గమనిస్తే అప్పటికాలపుసంస్కృత భాషావ్యాప్తి మనకు బోధపడితీరుతుంది. ఇట్లా జనసామాన్యంకూడా మాటాడక తప్పనికారణంవల్ల ఎక్కువవ్యాప్తిజెందినసంస్కృతభాషసంబంధంచేత పరిష్కృత మైనమాహారాష్ట్రికి అట్టివిశేషం సంభవించడానికి తగినఅవకాశం కలిగింది.

ఈఒక్కభాషేకాక "భూతభాషామయీం ప్రాహు రద్భుతార్థాం బృహత్కథాం" అని మిగిలినప్రాకృతభాషావిభాగాలకుగూడా గౌరవం ఉంది. పైమాటనుబట్టి పర్యాలోచిస్తే ఈభూతభాషకు(పైశాచికి) కలిగినగౌరవం దానిలోవుండే వాఙ్మయం చేత, అంటే మంచిమంచిగ్రంథా లందులో వుండడంచేత, కలిగిందని తోస్తుంది. కాని మహాకవి నానాభాషారహస్యవేత్తా గొప్పశాస్త్రజ్ఞుడూ అనుభవరసికుడున్నూ అయిన రాజశేఖరుడు తనకర్పూరమంజరిలో నటీసూత్రధారసంభాషణగా ఇట్లన్నాడు:

"సంస్కృతవాక్కులు కఠినాలు. ప్రాకృతవాక్కులు సుకుమారాలు. పురుషులకు కాంతలకు మార్దవం విషయంలో నెంతటి అంతరమున్నదో అంతటి అంతరము వాటిరెండిటిమధ్యనూ ఉన్నది"

ఈమాటలనుబట్టిచూస్తే ప్రాకృతభాష మొత్తమంతా అత్యంతసుకుమారం గనక సకలజనాదరమును పొందడానికి అవకాశం కలిగింది అని మనం విశ్వసించవచ్చు. ఈరాజశేఖరు డొకడేకాక ఇంకా చాలామందిమహాకవులు ప్రాకృతభాషను విశేషించిరి. నిజమేకాని ఇది ఇట్టిస్థితికి వచ్చేటప్పటికి చాలాకాలము పట్టింది అనేవిషయం మనం మరచిపోకూడదు. ఏమంటే బ్రాహ్మణులవైదికమతప్రభావం విశేషించి అత్యచ్ఛస్థితిలో వుండేటప్పుడు జనసామాన్యపువ్యవహారంలో వున్నయీభాషను ఇంతింతా అనరాని నిరాదరణచేసేవాళ్ళు. అంతేకాదు. అన్యులితరజాతులనుకూడా ఎక్కువ ఆదరింపక తామే సర్వోత్కృష్టులనేభావంతో ఇతరులనందరినీ ఒకవిధమైన అనాదర బుద్ధితో చూచేవారు. పశ్వాదిహింస చేసి యజ్ఞయాగాదులు చేయడం వానికి సంబంధించినయితరకర్మకలాపం నిర్వర్తించడమూ ఇవే అతిగౌరవంగా గణింపబడేవి. అందుకు బ్రాహ్మలే ప్రవర్తకులుగా వుండాలెననీ దానిలో చెప్పే మంత్రాలన్నీ బ్రాహ్మణాధీనంగానే వుండాలనీ ఆమంత్రాలను ఎవరికైనా చెప్పడానికిగానీ యజ్ఞయాగాదుల్లో చదవడానికిగానీ బ్రాహ్మలకేగాని ఇతరులకెవ్వరికీ అధికారంలేదనీ అందువల్ల తామే అందరికన్న గొప్పవాళ్ళనీ బ్రాహ్మలు చెప్పడం మొదలుపెట్టిరి. నీతి, ధర్మము మొదలగునవి అన్నీ బ్రాహ్మలు శాసించినతీరునే ఉండాలసిందేకాని వేరే తోవలేదు. దయ, పశ్చాత్తాపము, అహింస, మొదలైనమంచిగుణాలన్నీ వెనుకబడ్డవి. వాని కాదరమే లేదు. జన్మచేతనే మనుష్యులహెచ్చుతగ్గులు నిర్ణయింపబడేవి. ఇవి అన్నీకూడా ఆకాలంలో వుండేజనసామాన్యానికి కంటగింపుగానుండేవి. వేదములలోను ఉపనిషత్తులలోనూ ఉన్నధర్మము, సద్గుణములు నిరాడంబర మగు భగవత్సేవ, మతము, యోగానుష్ఠానము, ధర్మచింత, తత్త్వవిజ్ఞానము మొదలైనవి అన్నీ వెనుకబడ్డవి. కొద్దిమందిబ్రాహ్మణులచేతిలో సంఘానికిసంబంధించినఅధికారాలన్నీ వుండిపోయి వారే సంఘానికి సర్వాధికారులైరి. ఇతరులకు వైదికభాష దుర్జ్ఞేయమై అందలిరహస్యములు తెలియరా వయ్యెను. అధ్యాపనాధికారము బ్రాహ్మడికేతప్ప ఇతరులకు లేదయ్యెను. అందువల్ల బ్రాహ్మ డాడిందాట పాడింది పాట అయ్యెను. అతడికి రాజ్యశాసకుడగు క్షత్రియుడు తోడయ్యెను. ఇక నతడిఅధి

బ్రాహ్మడికేతప్ప ఇతరులకు లేదయ్యెను. అందువల్ల బ్రాహ్మణు డాడిందాటా పాడింది పాటా అయ్యెను. అతడికి రాజ్యశాసకుడగు క్షత్రియుడు తోడయ్యెను. ఇకనతడిఅధికారానికి అడ్డుతగిలేదేముంది? నిజాని కాకాలంలో బ్రాహ్మలకేమి తదితరులకేమి యజ్ఞయాగాద్యనుష్ఠానాలవల్లనే సమస్తకోరికలూ నెరవేరుతవనీ మోక్షంకూడా సిద్ధిస్తుందనీ బలమైననమ్మకం ఉండేది. కాబట్టే నానారకాలఫలాల ననుసరించి నానారకాల కర్మ లేర్పడ్డవి. వివిధాలైనయాగాలు పుట్టినవి. ఇంతెందుకు అశ్వమేధయాగం చేస్తే మోక్షంకూడా లభిస్తుందని యేర్పడ్డది. ఈతీరుగా విజృంభించినబ్రాహ్మణాధికారంతో ప్రవర్తించే బ్రాహ్మణమతం జనసామాన్యానికి అసూయాద్వేషాలను కల్గించింది.

ఇటువంటిపరిస్థితిలోనే గౌతమబుద్ధు డవతరించి ధర్మబోధ చేయ నారంభించెను. బ్రాహ్మణమతంమీద విరక్తులై అసూయాద్వేషాలతో వున్నప్రజాసామాన్యాని కాధర్మబోధ అమృతాయమానమై వారినందరినీ బుద్ధునివంక కాకర్షించెను. ప్రజాసామాన్య మట్లా ఆకర్షింపబడడానికి రెండుకారణా లున్నవి. మొదటిది బ్రాహ్మణు లదివర కేర్పరచిన జన్మమాత్రలభ్యమైన ఆధిక్యాన్ని తోసివేసి "సర్వవర్ణాలున్నూ సమానాలే, హెచ్చుతగ్గు లేమీ లేవు"అని సిద్ధాన్తించడం. రెండోది, ఇదివరలో జనసామాన్యానికి బోధకాని వైదికభాషలో బ్రాహ్మలు గుప్తంగా దాచుకొన్న రహస్యాల నన్నింటినీగూడా బయల్పెట్టి జనసామాన్యానికంతకూ సులభంగా తెలిసేదీ వారు నిత్యమూ వాడుకగా మాటాడేదీ అయినభాషలో మతాన్ని సులభంగా బోధపరచడము. ఈరెండోకారణంవల్ల జనసామాన్యం బుద్ధుడియం దెక్కువగా అనురాగంతో వుండి అతడిబోధలను అతిశ్రద్ధాభక్తులతో వింటూ ఇతడు చెప్పినట్లు నడుస్తుండెను. అతడు తనఉపదేశాల నన్నిటినీ జనసామాన్యభాషలో చేస్తూ అదివరకు బ్రాహ్మణమతానికి వైదికభాష అసాధారణచిహ్నమైనట్లుగా తన మతానికి గూడా ఈప్రాకృతభాషను (ఆకాలపువాడుకలో నున్నదానిని) చిహ్నముగా నొనర్చెను. కనుకనే అప్పటిభాషకు పాలి యనిపేరు కల్గింది. పాలి-గుర్తు. "పాలిః కేతు ర్ధ్వజో లింగం నిమిత్తం వ్యంజనం పదం" అని అమరుడు. సర్వమండలవ్యాపియున్నూ సంస్కృతభాష కత్యంతదూరము కానిదిన్నీ అయిన ఈపాలిభాషలోనే అతనిమతగ్రంథాలన్నీ వున్నవి. మహాధార్మికుడైన అశోకచక్రవర్తిశిలాశాసనాలుకూడా ఈ భాషలోనే వుండి జనసామాన్యాని కత్యంతము ఆస్వాద్యాలై ఆదరపాత్రాలైనవి.

తరువాతవారుకూడా చాలామంది మహారాజులు బౌద్ధమతాన్ని అవలంబించి దానిని వృద్ధిచేయడంవల్ల ఆమతచిహ్నమైనపాలిభాషకు గౌరవం హెచ్చింది. ఈ సందర్భం లో మనం సవిమర్శంగా గ్రహింపవలసినవిషయం ఒకటుంది. అది యేదంటే సరిగా గౌతమబుద్ధుడు తన మతాన్ని ఉత్తరదేశాన వ్యాపింపజేసేటప్పుడే దక్షిణదేశాన మహావీరుడుకూడా జైనమతాన్ని వ్యాపింపజేశాడు. ఇతడు తన ఉపదేశాలనన్నింటిని పాలిభాషలో జేయలేదు. తదితరప్రాకృతంలో చేశాడు. అందుకు కారణం అప్పటి కదీకూడా జనసామాన్యభాష కావడమే. అంటే దీనిభావ మిది :

ఉత్తరదేశంలో మొదట గీర్వాణవాణీప్రచారం అధికంగా వుండడమూ ఆర్య జాతి చాలావరకు హెచ్చుగా ఆదేశంలోనే నివాసం చేయడమూ కారణంగా అచటి మొదటిప్రాకృతానికిన్నీ సంస్కృతానికిన్నీ భేదం హెచ్చుగా రాలేదు. అంటే దక్షి ణదేశంలో ప్రాకృతానికిన్నీ గైర్వాణికిన్నీ ఎంతటిభేదం వున్నదో అంతటివిభేదం రా లే దన్నమాట. దక్షిణదేశంలో ఇంతటి విభేదానికి కారణం ఏమా? యని విచారిస్తే ఇచట ఆర్యజాతి ఉత్తరదేశమునం దంతహెచ్చుగా నివసింపకపోవడమూ అనార్య జాతులైన ద్రావిడాదిజాతుల సంపర్కము హెచ్చుగా కలగడమున్నూ కారణంగా కన్పిస్తవి. ఇందువల్ల సంస్కృతానికి కడుదూరమైన ప్రాకృతభాషలో జైనోపదేశా లున్నవి. వారిమతానికిగూడా ప్రాకృతం చిహ్నమేకాని ఆమతకర్తకాని తత్ప్రవర్త కులుకాని గ్రంథాల విషయంలో ఎక్కువ ఆదరం చూపలేదు. అయితే జనసామాన్యా న్నాకర్షించి వారికి ధర్మశ్రద్ధ కల్గించుటకున్నూ వర్ణవిభేదం తొలగించి అందరిమనసులందున్నూ సమానత్వబుద్ధిని కలిగించి ఇదివర కొకరిమీద ఒకరికున్న అసూయా ద్వేషాలను తొలంగించడానికిన్నీ వారు చేసినప్రయత్నం వ్యవ హారభాషమూలముననే కనుక అప్పటిదక్షిణదేశపుప్రాకృతంకూడా విస్తరించి ఆదర పాత్రమైంది. ఉత్తరదేశములం దిట్టిప్రాకృతం వ్యాపించేవరకు దక్షిణదేశములందలి ప్రాకృత మింకా చాలాహెచ్చుగా మారి సంస్కృతంతోడి సాజాత్యం గ్రహించ డమే కష్టమైపోయినస్థితిలోకి వచ్చింది. అట్లావేర్పడ్డ ప్రాకృతవిభాగాలే "ఆభీరి" "అప భ్రంశము" "పైశాచి" "చూళి" అని పేరుపడ్డవి. సంస్కృతభాషతో ఈభాష లకున్నంత అంతరము లేక పాలికన్నమాత్రం ఎక్కువఅంతరము కల్గిఉన్న ప్రాకృత విభాగాలు 'శౌరసేని' 'మాగధి' 'మాహారాష్ట్రి' ఇత్యాదినామాలతో వున్నవి.

ఈ ప్రాకృతవిభాగా లన్నికూడా జైనబౌద్ధమతా లేర్పడిననాటినుండిన్నీ లోకులకత్యంతం ఆదరపాత్రాలైనవి. కేవలం ఒక్కసంస్కృతంలోనే సారస్యమంతా మూటగట్టి ఉండలేదనిన్ని తమతమభాషల్లోకూడా సారస్య ముందనిన్నీ అసలు నిజానికి ప్రాకృతంకంటె సంస్కృతమే పరుషంగా వుంటుందనిన్నీ ప్రాకృతం అట్లాకాక చాలా మృదువైనదనిన్నీ వ్యవహారభ్రష్టమైన సంస్కృతంలోకంటే వ్యవహారంలో ప్రస్తుతం వున్నదికనుక సజీవభాష ఐన తమభాషలోనే గ్రంధంగాని ఉపన్యాసంగాని అత్యంత మధురమై జనుల కానందం కల్గిస్తుందనిన్నీ వారిఉద్దేశము. కాబట్టి ఈభాషలోనే గ్రంథాలు రచించడం మంచిదని జనసామాన్యాని కభిప్రాయం ఏర్పడ్డ తరువాత ఆభాష కాదరానికి లోప మేముంటుంది? పైయభిప్రాయానికి బ్రాహ్మలుకూడా లొంగి ఈభాషల్లో గ్రంథాలు రచింపసాగిరి. రాజులకుగూడా సజీవం గనుక చాలా మధురంగా వున్న దీనిమీదే మోజు ఎక్కువైంది. రాజాదరణను పొందింది కనుక యీభాషనే బ్రాహ్మణాది సర్వవర్ణాలూకూడా ఆదరించి నిత్యవ్యవహారం జరపడం సాగించినవి. కాలక్రమేణా ఈభాషలోనే మధురమధురాలైన చాటువులూ రసవంతాలైన గద్యపద్యగ్రంథాలున్నూ బయలుదేరినవి. సంస్కృతం ఉత్తమజాతులవ్యవహారంనుండికూడా క్రమంగా తొలగిపోయింది. ఏకొద్దిమందో మాత్రం ఏదైనా విశిష్టకర్మల్లో ( యాగాదుల్లో ) ను శాస్త్రచర్చల్లోను మాత్రమే సంస్కృతాన్ని ఉపయోగిస్తుండిరి. కాని మొత్తముమీద ప్రాకృతమే దేశమంతటా అల్లుకొనిపోయింది. రాజులుకూడా పరుషవర్ణాలులేక చాలామృదుమధురంగా వున్న యీభాషామాధుర్యానికి లొంగిపోయి తమతమ అంతఃపురాల్లోకూడా దీనినే వాడి తీరవలెనని శాసించిరి.

శ్రూయతేచ కుంతలేషు సాతవాహనోనామ రాజా తేన ప్రాకృతభాషాత్మక మన్తఃపురఏవేతి సమానం పూర్వేణ. (కావ్యమీమాంస - రాజశేఖరుడు)

(కుంతలరాజగు శాతవాహనుడు నిట్లే తనయంఃపురమునందు సంభాషణకాలమున ప్రాకృతభాషానియమమును చేసికొనెను)

అయితే అక్కడక్కడా కొందరు రాజులు పట్టుదలతో ప్రాకృతాన్ని నిషేధిస్తూ దేశీయులదైనందినవ్యవహారాల్లోకూడా సంస్కృతాన్నే వాడితీరవలెనని శాసించి తమకాలమంతా నడిపిరి.

"కాలే శ్రీసాహసాంకస్య కే న సంస్కృతభాషిణః" అనే భోజుని వాక్య మిట ప్రమాణము.

ఈ సాహసాంకుడు తన అంతఃపురంలో కూడా సంస్కృతం మాటాడవలసిన నిర్బంధం చేశాడు.

శ్రూయతే చోజ్జయిన్యాం సాహసాంకో నామ రాజా తేనచ సంస్కృతభాషాత్మక మంతఃపురఏ వేతి సమానం పూర్వేణ (రాజశేఖరుడి కావ్య మీమాంస).

(ఉజ్జయినీ రాజైన సాహసాంకుడు తన అంతఃపురంలో సంభాషణ కాలాన సంస్కృత భాషానియమం చేసెను.)

ఇట్టివా రింకా కొందరుంటారు. కాని వారందరున్నూ తమ తమ కాలాల్లో మాత్రం ఎట్లాగో యేటికి ఎదురీదారు. కాని మహాప్రవాహం అడ్డు లేకుండా అతివిస రుతో పొంగివచ్చేటప్పుడు ఆపడాని కవరితరమౌతుంది. కాబట్టే ఆ రాజుల కాలం తీరిన వెంటనే మళ్ళీ ప్రజలు మామూలుగా మాటాడుకొను భాష తలమెత్తి విజృంభించసాగింది. అందువల్ల సంస్కృతం ఉత్తమజాతుల్లో కూడా అందరికీ తెలియక పోయే స్థితి యేర్పడ్డది. కాబట్టే ఆంధ్రచక్రవర్తి అయిన సాతవాహనమహారాజుకు అతని రాణి పలికిన "రాజా! మామోదకైస్తాడయ" అనే మాట సరిగా బోధపడింది కాదు. అతడి రాజ్యంలో ఏ ఒకడూ గూడా ప్రాకృతం మాటాడని వాడే లేడట.

"కేభూవ న్నాఢ్యరాజస్య రాజ్యే ప్రాకృతభాషిణః" అని భోజమహారాజీవిష యమే తెలియజేశాడు. ఆఢ్యరాజం టే సాతవాహనరాజు అని అర్థము. మాలవదేశ పాలకుడైన విక్రమార్కుడికి సంస్కృతభాష మీదా కుంతలదేశపాలకుడైన శాత వాహనుడికి ప్రాకృతభాషమీదా ఉన్న మోహాన్ని చూచి సాహసాంకుడి రాజ్యం అతడి తర్వాత వెన్వెంటనే ఆంధ్రుడైన సాతవాహనుడిచేత విచ్ఛిన్నంచేయబడి ఆక్ర మింపబడడమున్నూ విక్రమార్కుడి కాలంలో వున్న సంస్కృతభాషావ్యాప్తిని వారించి ప్రాకృతభాషను వ్యాపింపజేయడమూ ఇవన్నీ చూచే జనసామాన్యం విక్రమా ర్కుణ్ణి శాలివాహనుడు చంపాడనే కథను కల్పించివుంటుంది. న్యాయానికి వారిద్దరు వొక కాలంలో లేరుగా. వాళ్ళ శక కాలాలు చూస్తేనే మనకు తెలుస్తుంది.

మరిన్నీ దేశీయులందరి ఇష్టానికి విరోధంగా వారిదైనందిన భాషను నిరాకరించి క్లిష్టభాషను వాడుకచేయవలసిందన్న విక్రమార్కుని నిషేధకం టే వారి అజానసిద్ధ

మైన భాషకే ప్రాధాన్యమిచ్చి దానినే ఎక్కువగా ఆదరించిన శ్రీశాతవాహనచక్రవర్తిమీదే ప్రజల కెక్కువగా ప్రేమాభిమానా లుండివుంటవి. ఈకారణంవల్లనే అదివర కత్యంతబలిష్ఠమైన చతురంగసైన్యం కలిగుండి శకాన్ని ఏర్పరచిన విక్రమార్కుడిరాజ్యం ప్రకృతికోపం కలగడంవల్ల ఇంతకన్న దుర్బలమైనప్పటికీ దుర్బలాలైన చతురంగబలా లున్నప్పటికీకూడా ప్రకృతుల అనురాగసంపత్తిచేత సాతవాహన మహారాజుకు సులభంగా లోబడి వుంటుంది. ఈవిషయమే "మట్టిగుఱ్ఱాలు మట్టి ఏనుగులు మొదలైన సాధనాలచేత సాతవాహనమహారాజు మంత్రబలంవల్ల విక్రమార్కుణ్ణి జయించాడు" అనేకట్టుకథగా పరిణమించివుంటుంది. కానీం డిది యెట్లా అయితే మనకేమి కాని శ్రీ శాతవాహనచక్రవర్తికాలంలో ప్రాకృతం అత్యంతవైభవంతో వెలసిందనేమాట సిద్ధం. అప్పుడే ప్రజాసామాన్యానికి అంటే, చండాలాది నీచజాతులకుకూడా సులభంగా, బోధపడేభాషలో అత్యంతవిచిత్రమైన కథాజాలం చేత శ్రవణానందం కల్గించే బృహత్కథను గుణాఢ్యుడనే గొప్పపండితుడు రాశాడు. ఈచక్రవర్తికూడా స్వయంగా గాథాసప్తశతి అనే గ్రంథా న్నొకదాన్ని సమకూర్చాడు. ఈఏడువందల పద్యాల్లోను కొన్ని యీచక్రవర్తి స్వయంగా రచించినవే మరికొన్ని ఇతరకవులు రచించివున్నవి ఈగ్రంథాన్నిచూస్తే ఆకాలంలో ఎంతగుంది భాషాకవులున్నారో ఎంతటిఅందమైనమార్గంలో ఈభాషాకవిత్వం నడిచిందో మనం తెలుసుకుంటాము.

తరువాత కొంత కాలానికి జైనబౌద్ధమతస్థులదుష్ప్రవర్తనలవల్లనూ అదివరలో జాతిగౌరవం నశించడంవల్ల అంతఃకుద్రులైనబ్రాహ్మణక్షత్రియులవల్లనూ జైనబౌద్ధమతాలగౌరవం నశించి ప్రజలలో దాని ఆదరం తొలగింది. అపుడే పౌరాణికమూ ఆగమానుసారీ అయినబ్రాహ్మణమతం బయలుదేరింది. అది తనశక్తియుక్తులవల్ల మతాంతరాలను నిరాకరింప వీలయినంతవరకూ నిరాకరించింది. వీలుగానివాటిని తనలోకి తీసుకొన్నది. ఇట్లా విజృంభించి ఆసేతుహిమాచలంగా వ్యాపించి జైనబౌద్ధమతాలను రెంటినీకూడా ఇంచుమించుగా నామావశేషాలను చేసింది. తమ మతానికి ఉపోద్బలంగా వుండడానికిగాను పురాణాలను సృజించింది. నిజానికి బౌద్ధమతం ఏర్పడకపూర్వమున్నవి రామాయణం మహాభారతం విష్ణుపురాణం కల్పసూత్రాలు ఏవో కొన్నిమన్వాదిస్మృతులున్నూ మాత్రమేకాని యీపౌరాణికకాలం

లో ఆదిత్యపురాణం మొదలుకొని తలామొలాలేని ఆగ్నేయపురాణంవరకు పుట్టి నవి. ఇవి అన్నీకూడా తమమతమునకు భంగం లేకుండా వుండడానికోసమూ మత దార్ఢ్యానికోసమూ గౌరవంకోసమున్నూ బ్రాహ్మణాదిజాతులు సంస్కృతభాష లోనే వ్రాశారు. కాని జనసామాన్య భాష ఐనప్రాకృతంలో వొక్కటికూడా వ్రా యలేదు. దీనిలో రాస్తే దీనికి గౌరవం అధికం అయిపోతుందేమోనని వారిభయం. కాబట్టే మతగ్రంధమంతా సంస్కృతంలోనే వుండాలెననీ శాస్త్రీయావైనవాదోపవా దాలన్నీకూడా సంస్కృతభాషలోనే జరుగాలెననీ అప్పటిశాసనికమైన సాంప్ర దాయం.

కానీ వీరిన్నింతతంటాలుపడినా దేశంలో జనసామాన్యానికి వ్యాపించినప్రాకృత భాషను నివారించడం కాలేదు. అది మిక్కిలి అధికంగానే వ్యాపిస్తూండేది. బ్రా హ్మణాదులు సమయవిశేషాల్లో సంస్కృతం మాటాడినా దైనందిన వ్యవహారంలో వున్న ప్రాకృతాన్ని వదలడానికి వీలుకాలేదు. అశోకుడిశిలాశాసనాల్లో ప్రాకృతం వుందని దానికి ప్రతిగా శాసనాలల్లో సంస్కృతగద్యపద్యాలు నింపారు. జైనులు బౌద్ధులున్నూ తమతమమతకర్మలందు ప్రాకృతాన్ని వాడతారని అది జనసామాన్యం లో వ్యాపించకుండడానికిగాను మతకర్మలన్నీకూడా సంస్కృతంలోనే జరుగవలెనని శాసించారు.

కాని ఎన్నివిధాలప్రయత్నించినా జనసామాన్యం తమ కందుబాటులో వున్నప్రాకృ తాన్నిమాత్రం విడువలేదు. అందువలన వారి నాకర్షించుటకై శ్రీరామాదిచరిత్ర ములను ప్రాకృతభాషలో రచించిరి. ఈకారణంవలననే అతిప్రవృద్ధమై బహుశాఖ మై వుండి లోకమనోరంజకముగా వున్నయీప్రాకృతభాషను నిరాకరింప వీలుగాక పోవడంవల్లనే దృశ్యప్రబంధాలల్లో రసస్ఫూర్తి కల్గుటకుగాను ప్రాకృతం కూర్పక తప్పిందికాదు. అయితే వారి కిందులో నిరాదరం పోలేదు కాబట్టి నీచపాత్రలకు ప్రాకృతం వుపయోగించాలెనని శాసనం వ్రాశారు. కాని రూపకాలలో మహారాజ భార్యలకు విదూషకుడికిగూడా ప్రాకృతభాషను వాడకతప్పకపోవడంవల్ల ఈసం స్కృతం వారిదొంగతనమూ వారికి ప్రాకృతాన్నిగురించి వుండే అసూయా ద్వేషాలు మాత్రమే బైటపడ్డవికాని ప్రాకృత గౌరవంమాత్రం పోలేదు. అయితే మహా రాజులు మొదలైనవారికిగూడా ప్రాకృతాన్నే వాడుకచేసి ప్రాకృతభాషయొక్క

సహజగౌరవాన్ని నిరూపించినగ్రంథాలుకూడా లేకపోలేదు. మహాకవి రాజశేఖరుడు "కర్పూరమంజరి" అనేసట్టకంలో అందరికీ ప్రాకృతాన్నే వాడి దానివిషయమై తనకుగల అసాధారణగౌరవాన్ని వ్యక్తీకరించాడు. నాటకాలల్లో ఉత్తమపాత్రలు బింకానికి సంస్కృతం మాటాడినా రాణులు విదూషకుడువగైరా ప్రాకృతంలో మాటాడితేనే సామాజికత స్ఫురించి సామాజికులకు రసాస్వాదం ఏర్పడుతుంది. ప్రకృతి కనుకరణాలై ప్రత్యక్షంగా కన్పట్టవలసినరూపకాల్లో అంతటా భాష పాత్రలకు సహజంగా వుండడం అత్యావశ్యకం. భాష సహజంగా వుండడమంటే వారు మామూలుగా ప్రతిరోజూ మాటలాడేదై వుండడమే. ఈవిషయం సంస్కృతనాటకకవులు గుర్తించే ప్రాకృతభాషను ఆకాలంలో దైనందిన వ్యవహారమునం దున్నదానిని రాణులు మొదలుకొని అందరికీ వాడారు. ఇందువల్ల ఆకాలంలో ప్రాకృతం అత్యధికంగా వ్యవహారంలో వున్నదనీ జనసామాన్యభాష గ్రంథాలల్లో ప్రవేశించడాని కేవిధమైన అభ్యంతరమూ వుండలేదనిన్నీ ప్రకృత కాలంలోకూడా వ్యావహారికభాష గ్రంథములలో ప్రవేశిస్తేనే పైగ్రంథాలవలె వీటికిగూడా జీవకళ ఏర్పడుతుందనీ అపుడే భాష సరిగా మంచిమార్గమునందు నడచి జనసామాన్యపుటభివృద్ధికి కావలసిన విజ్ఞాన సంపదలను సమకూర్పగలుగుతుందనిన్నీ మనము దృఢంగా నమ్మవచ్చును.

# తూర్పు గాంగరాజుల ఆరుక్రొత్తశాసనములు

రాళ్లబండి సుబ్బారావు

మహారాజశ్రీ రావుసాహేబు గిడుగు వెంకటరామమూర్తిపంతులు బి. ఎ. గారి సప్తతితమజన్మదినోత్సవసందర్భమున జ్ఞాపకచిహ్నముగ వెలువడు సంపుటమున కేదైన వ్యాసమును వ్రాయవలెనని శ్రీయుత తెలికిచర్ల వెంకరత్నం ఎం. ఏ., ఎల్. టి., గారు నన్ను కోరినందుకు వారి కెంతయు కృతజ్ఞుడను. శ్రీ పంతులుగారి జన్మదినోత్సవము జరుపనెంచడమూ, అట్టి సందర్భమున జ్ఞాపకచిహ్నముగ విద్యాధికుల వ్యాసరచనలు గలపత్రిక యొకటి వెలువరింపజేయడమూ కడు సంస్తవనీయములు. శ్రీ పంతులుగారు ఆంధ్రదేశమునగల సుప్రసిద్ధపరిశోధకులలో నొక్కరు. వారు తెలుగు, సవర, భాషావాఙ్మయములకు చేసిన సేవ లోకవిదితము. మరియు పురాణ వస్తు, శాసన శోధనములందును, భాషా, శిక్షాశాస్త్రములందును కడుసమర్థులు. అట్టితరి, వారి కభిమానముగలట్టివిన్నీ, వారిశిష్యులలో నొకరగు శ్రీయుత డాక్టరు చిలుకూరి నారాయణరావుపంతులు ఎం. ఎ., ఎల్. టి, పి. హెచ్. డి. గారు సంపాదించినట్టివిన్నీ, వారిదేశముకు సంబంధించినట్టివిన్నీ, నూతనచారిత్రకవిషయములను దెల్పునట్టిన్నీ, ఆర్గురుతూర్పుగాంగరాజుల తామ్రశాసనములనుగురించి వ్యాసమును వ్రాయనెంచితిని. ఇదివరలోనే శ్రీయుత డాక్టరు నారాయణరావుగారున్నూ, రావు సాహెబు వెంకటరామమూర్తిపంతులుగారున్నూ కలిసి హిందూదేశశాసనావళి యందు ప్రకటింపవలసియుండెనని శాసనాధికారుల 1918-1919 సం॥ నివేదికనుబట్టి తెలుస్తున్నది. ఏకారణముననో అట్లుగాకుండెను.

ఆరుశాసనములయొక్క పాఠములున్ను, వీలైనంతవరకు పాఠాంతరములును, సంక్షిప్తార్థములును ఇందు పొందుపరిచితిని. కాని ఒకశాసనమునందలిభాగములే, మరియొకశాసనమున జూపట్టునప్పుడు అట్టిభాగములను తిరిగివ్రాయక, అట్టివిషయమును సూచించి, వదలితిని. అట్లే, శాసనపాఠములు గలప్రతిబింబములయొక్క ఛాయాముద్రణములనుగూడ అందందే పొందుపరిచితిని. ఈప్రకటనకు అంగీకారమిచ్చిన ఆంధ్రేతిహాస పరిశోధకమండలివారి కెంతయు కృతజ్ఞుడను.

ఈ ఆరుతామ్రశాసనములున్ను, ఇదివరలో, అనగా 1918 సం॥ నకు పూర్వమే, శ్రీయుత డాక్టరు నారాయణరావుగారు గంజాంజిల్లా శ్రీకాకొళంగ్రామమున సంపాదించి, చెన్నరాజధాని సర్కారు శాసనాధికారికి పంపినట్లును, వారు వాటిని తమ 1918-19 సంవత్సరనివేదికపట్టీలో 3, 4, 5, 6, 7, 8 నంబర్లుగా సూచించి తిరిగీ వారికి ఇచ్చివేసినట్లును, తెలియవచ్చినది. నివేదికయందు 3 వ శాసనము తూర్పుగాంగరాజగు మూడవవజ్రహస్తమహారాజుదిగాను, 4 వది ఆతనికొడుకగు దేవేంద్రవర్మరాజరాజదేవునిదిగాను, 5 వది ఆతనిపినతండ్రియగు మధుకామార్ణవదేవునిదిగాను, 6 వది ఆతనికొడుకైన రాజరాజదేవునికొడుకు అనంతవర్మచోడగంగదేవునిదిగాను ప్రకటింపబడినవి. ఈ నాల్గుశాసనములున్ను సన్నిహితబంధువులగునాల్గుపురుషాంతరముల రాజులవి; కడపటితూర్పుగాంగవంశచరిత్ర వెలిబుచ్చుటకు చాల తోడ్పడగలవు. 7వది రాజేంద్రవర్మకుమారుడు దేవేంద్రవర్మశాసనము. 8వది దేవేంద్రవర్మకొడుకు అనంతవర్మదేవునిశాసనము. ప్రాయశః ఈఅనంతవర్మకొడుకే గాంగసంవత్సరము 51న ఒకదానశాసనము నిచ్చెను. 7, 8 నంబర్లు గల శాసనములలో తేదీలు ఇవ్వబడలేదుగాని లిపినిబట్టి చాలాప్రాచీనకాలపువి అని తేలుతున్నది. ప్రాయశః క్రీస్తుశకము ఆరవశతాబ్దమునాటివై యుండవచ్చును. పైఆరుతామ్రశాసనములున్ను డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు నాప్రోత్సాహమున ఆంధ్రేతిహాసపరిశోధకమండలివారికి ఇవ్వగా, వారును శ్రీడాక్టరుగారిని వారిమండలిగౌరవ, యావజ్జీవ, సభ్యులుగా నెన్నుకొనిరి. ఆంగ్లమున మండలివారి త్రైమాసికపత్రికయందు మే మిరువురమును ఈ ఆరుశాసనములను ప్రకటింపనిశ్చయించినాము. మొదటి ఐదుశాసనములను మే మిరువురము కలసి పాఠములను సంస్కరించినాము. ఆరవశాసనము నేనున్ను శ్రీయుత చిరాప్రూరి ఆత్మారాం, బి. ఎ., బి. ఎల్. గారును పరిశోధించి పాఠములు తయారుచేసినాము. ప్రాచీనలిపిస్వరూపమునుబట్టియేమి, శాసనప్రతిబింబములలోనిలోపములనుబట్టియేమి కొన్నిచోట్ల పాఠములలో స్వల్పభేదములు వచ్చియుండవచ్చును. ముందు ప్రకటింపబడు ఆంగ్లపత్రికయందు వీటినిగూడ సంస్కరించి సవరణచేయదలచినాను.

పాఠకులసౌలభ్యమునకై శాసనములలోని పాఠములకు క్లుప్తార్థములు అందే సూచింపబడినవి. మరియూ, శాసనముల ఛాయాముద్రణము లందందే యిమడ్చబడి

నవి. వీటినిబట్టి ప్రాచీనకాలపునాగరి, ఆంధ్ర, భాషాతత్వ, లిపిస్వరూపములు బాగుగ తెలియగలవు.

3, 4, 5, 6 నంబర్లు గలశాసనములు సంస్కృతభాషయందును, నాగరిలిపియందును వ్రాయబడినవి. 7, 8 నంబర్లుగలశాసనములు సంస్కృతభాషయందును, ప్రాచీనాంధ్రలిపియందును (అనగా కుటిలాక్షరములతోడను) వ్రాయబడినవి. కళింగదేశము నేలిన మొదటితూర్పుగాంగరాజుల శాసనములవ్రాత శైలి ఎట్లు రెండు మూడువిధములుగా నున్నదో అట్లే కొన్నిశాసనములలో (వీటియందును) అక్షరములుగూడ రెండుమూడువిధములపోలిక గల్గియున్నవి. ఆంధ్ర, నాగరి, గ్రంథ, చేర లిపులతో సమ్మేళనమై ఒప్పుచున్నవి. ప్రాచీనాంధ్రభాషాలిపితత్వసారము (స్వరూపము) వీటినిబట్టి బాగుగ గోచరమగుచున్నది.

3, 4, 5, 6 నంబర్లు గలశాసనములకాలములు వరుసగా శక సం॥లు 971, 998 గాంగ సం॥ 526, శక సం॥ 1006 నాటివై యున్నవి. 7, 8 నంబర్లు గలశాసనములలో కాలములే సూచింపబడలేదు. కాని, లిపిస్వరూపమును బట్టి, క్రీస్తు ఆరవశతాబ్ద మధ్యభాగమునకు జెందియుండునని ఊహింపదగి ఉన్నవి.

3 వ నంబరు శాసనమున, మూడవ వజ్రహస్తదేవుని వీరద విషయమందలి సత్తివాడగ్రామమును, కంచి దేశమందలి వలుతవ్రూరు గ్రామస్థుడైన గణపతి మనుమడగు గణపతినాయకున కిచ్చినట్లు గలదు.

4 వ నంబరు శాసనమున, మూడవవజ్రహస్తదేవుమహారాజునకును అనంగమహాదేవికిని గల్గినకుమారుడు దేవేన్ద్రవర్మ రాజరాజదేవు విష్ణుసంక్రాంతినిమిత్తమున కలిపురనివాసులగు వాసుదేవ, నారాయణశర్మలకు వరాహవర్తని విషయమందలి విహాత్కొడిలగ్రామమును దానముచేసినసంగతి గలదు. మరియు,రాజరాజు శకవర్షము 992 న జ్యేష్ఠ శుద్ధ అష్టమి గురువారమునాడు ఉత్తరఫల్గుని నక్షత్ర సింహలగ్నమున పట్టాభిషిక్తుడైనట్లు గలదు. దీనినిబట్టి రాజు క్రీస్తు సం॥ 1071 లో పట్టాభిషిక్తుడైనట్లు తేలుచున్నది.

5 వ నంబరు శాసనమున, అనంతవర్మ కుమారుడు మధుకామార్ణవదేవు గాంగవంశప్రవర్థమానవిజయరాజ్య సం॥ 526 లో రాజ్యమేలుచున్నట్లు తెలుపబడినది. అతని సామంతుడు శ్రీలక్ష్మణరామదేవు వైశ్యకులమునకు జెందిన మంచినాయకుని

కొడుకగు ఎరపనాయకునకు పటుగ్రామ పశొండరవడొ, మొరఖని యను మూడు గ్రామములు వైశ్యాగ్రహారముగా జేసియిచ్చెనని తేలుచున్నది.

మూడవవజ్రహస్తునిశాసనమున గలవంశావళి, కాలనిర్ణయములనుబట్టి, ఈశాసనమున గల గాంగ సం॥ శక సం॥ నకు సమానముగ మార్చగల్గితిని. (చూడుము కళింగదేశచరిత్ర - పుటలు ౫౮౬ - ౫౮౮.) మరియు, గాంగశకప్రారంభవత్సరము క్రీస్తు సం॥ 493 ప్రాంతమునందని నిర్ధారణజేసితిని. ఇదియే ఈ శాసనముఖ్యతకు గారణము. ఈ శాసనమున మధుకామార్ణవదేవుని ప్రశస్తికాలము ఇవ్వబడినను, నిజముగా అతనిసామంతుడగు శ్రీలక్ష్మణరామదేవునిదై యున్నది.

6 వ నంబరు శాసనమున, రాజరాజదేవునికిని రాజసుందరికిని గల్గినకొడుకే అనంతవర్మచోడగంగదేవు అనియు, అతడు శకవర్షము 1006 న సెల్లెదగ్రామదేవతయొక్క బలి, ధూప, దీపమునకును, ఆలయము బాగుచేయుటకును తలాగ్రామవాసియగు వల్లనీపాంగుమనుమడును సన్నిపాంగు కొడుకును అగు కొమారచంద్రునకు రూపవర్తనివిషయమందలి సెల్లదగ్రామమును దానముచేసెననియు, గలదు.

7 వ నంబరు శాసనమున రాజేంద్రవర్మకుమారుడగు దేవేంద్రవర్మ పుష్కరిణివిషయమందలి విరింటికగ్రామమును సూర్యగ్రహణకాలమున నల్గురు సోదరుల కిచ్చెనని తెలుపబడినది.

8 వ నంబరు శాసనమున దేవేంద్రవర్మకొడుకగు అనంతవర్మదేవు చంద్రగ్రహణకాలమున కంటకవర్తని విషయమందలి దానమిచ్చినవిషయము తెలుపబడినది.

## (1.) C. P. No. 3 of 1918 - 1919.

### తూర్పుగాంగరాజగు మూడవవజ్రహస్తదేవుని తామ్రశాసనము ( శక సం॥ 971 )

### పా ఠ ము లు.

### మొదటిరేకు - రెండవప్రక్క

1. ఓమ్ స్వస్తిశ్రీమతా మఖల భువన వినుత నయ వినయ దయాదాన
2. దాక్షిణ్య సత్య శౌచ శౌర్య్య ధైర్య్యాది గుణరత్నపవిత్రకాణామాత్రే
3. యగోత్రాణాం విమల విచారాచార పుణ్య [1]శలిల ప్రక్షాలిత కలికాలకల్మ

1. సలిల,

4. మమషీణాం మహా మహేన్ద్రాచల శిఖరప్రతిష్ఠితస్య సచరాచ
5. రగురోః సకలభువన నిర్మాణైక సూత్రధారస్య శశాఙ్క చూ
6. డామణే ర్భగవతో గోకర్ణ స్వామినః ప్రసాదాత్సమాసాదితై
7. కశఙ్ఖ భేరీ పఞ్చ మహాశబ్ద ధవలచ్ఛత్ర హేమచామరవరవృషభలాఞ్ఛ
8. న సముజ్జ్వల[1] సమస్త సామ్రాజ్య మహిమ్నా మనేక సమరసఙ్ఘట్ట సముప
9. లబ్ధ జయలక్ష్మీ సమాలిఙ్గి తోత్తుఙ్గ భుజ దణ్డ మణ్డితానాం త్రికలి

రెండో రేకు – మొదటిప్రక్క.

1. ఙ్గ మహీభుజాం గఙ్గానామన్వయమలఙ్కరిష్ణో ర్విష్ణోరివ విక్రమాక్రా
2. న్త ధరామణ్డలస్య గుణమహార్ణవ మహారాజస్య పుత్రః॥ పూర్వేషాం భూపతి
3. భిర్విన[2] జ్య వసుధా యా పఞ్చభిః పఞ్చధా భుక్తా భూరి పరాక్రమోభుజబ
4. లాత్తా మేక ఏవస్వయం ఏకీకృత్య విజిత్య[3] సతృనివహాన్ శ్రీవజ్ర
5. హ స్తశ్చతు శ్చత్వారింశత మత్యుదార చరితః సర్వా మరక్షీత్స
6. మాః। తస్యతనయో గుణ్డమరాజా వర్ష త్రయమపాలయత[4] మహీం॥
7. తదనుజః కామార్ణవదేవః పఞ్చ[5] త్రింశతమబ్దకాన[6]॥ తస్యానుజో విన
8. యాదిత్య[7] సమా స్తిస్ర[8]॥ తతః కామార్ణవాజ్జాతో జగతీకల్పభూరుహః॥
9. యో రాజదాత్రితః[9] చ్ఛాయో వజ్రహస్తోవనీపతిః॥ ప్రశోచ్ఛ్యేదస్మద గ

రెండో రేకు – రెండో ప్రక్క

1. న్ధ లుబ్ధ మధుప వ్యాలీఢ గణ్డా న్గజాన్నర్థిభ్యః సమదాత్సహస్రమతులా
2. యస్త్యాగినామగ్రణీ[10] సః శ్రీమాననియఙ్క భీమనృపతి గ్గఙ్గాన్వయో
3. త్తంసకః పఞ్చత్రింశత మబ్దకాన్సమభునక్పృథ్వీం సుతః పార్థివైః॥
4. తదగ్రసూనుః సురరాజసూనునా సమ స్సమస్తాం [11]సమితారి మణ్డ
5. లః స్సపాతి కామార్ణవభూపతి ర్భువం సమృద్ధిమానర్థజన
6. మాం సముజ్జ్వలః॥ తదను తదనుజన్మా చిత్రజన్మోపమానో గుణని
7. ధి రనవద్యో గుణ్డమాఖ్యో మహీశః[12] సకల మిద మరక్ష త్త్రీణి వర్షాణి

1. సమజ్జ్వల 2. భజ్య 3. శతృ 4. మపాలయద్మహీం 5. త్రింశత 6. మబ్దకాన్
7. విత్యః 8. సమాస్తిస్రః 9. దాత్రితచ్ఛాయో. 10. మగ్రణీః 11. శమితారి 12. మహీశః

8. ధాత్రీవలయ మలఘుతేజో నిర్జితారాతి చక్రః । త స్యాద్వైమాతురస్త
9. స్య మధుకామార్ణ్ణవోనృపః । అవతిస్మావనీమేతా మబ్దా[1]మేకాన్న

మూడోరేకు - మొదటిపక్క

1. వింశతిం ॥౦॥ అథ వజ్రహస్త నృపతి రగ్రసుతా దఖిలగుణి జనాగ్ర[2]
2. ణ్య[3] కామార్ణ్ణవా త్కలింద్రపుత్రీయమునావదాత శుభకీర్తిః॥ శ్రీయశ
3. వ ద్వైదుమ్యాన్వయ పయః పయోనిధి సముద్భవాయాశ్చ యః సమజని
4. వినయమహాదేవ్యాః శ్రీవజ్రహస్త ఇతి తనయః । వియద్రుతు
5. నిధి సంఖ్యాం యాతి శాకాబ్ద సఙ్ఘే దినకృత[4] వృషభస్థే
6. రోహిణీభేసులగ్నే ధనుషి చ సితపక్షే సూర్య్యవారే తృతీ
7. యాం యుజి సకలధరిత్రీం రక్షితుం యోభిషిక్తః॥ న్యాయేన
8. యత్ర సమమాచరితుం త్రివర్గ్గ మార్గ్గేణ రక్షతిమహీమ్మ
9. హితప్రతాపే నివ్యార్థ యశ్చ నిరయాశ్చ నిరాకదశ్చ శశ్వ

మూడోరేకు - రెండవపక్క.

1. త్ప్రజా భువిభవన్తి విభూతి మత్యః॥ వ్యాప్తే గఙ్గకులోత్తమస్య య
2. శసా దిక్చక్రవాలేశశి ప్రద్యోతామలినేన యస్యభువనః ప్ర
3. హ్లాదసంపాదినా సైన్ధూరై రతి [5]పాస్ద్రపఙ్కపటలై [6]కుమ్భస్థలీ పే[7]
4. ట్టకే [8]ష్వాలి[9]ఖ్యన్తి పునః పునశ్చ హరితా మాధోరణా వా
5. రణాః॥ అనురాగేణగుణినో యస్యవక్షో ముఖాబ్జయో(ః)
6. [10]రాశీనే శ్రీసరస్వత్యా వనుకూలే విరాజత[11] ॥౦॥ కలిఙ్గనగ
7. రాత్పరమ మాహేస్వర[12] పరమభట్టారక మహారాజాధిరాజ త్రి
8. కలిఙ్గాధిపతి[13] శ్రీమద్వజ్రహస్త దేవ[14]కూశలీ[15] సమస్తామాత్య ప్ర
9. ముఖ జనపదా న్సమాహూయ సమాజ్ఞాపయతి విదితమస్తు భవతా

---

1. మద్దానేకాన్న 2. జనాగ్రగణ్య 3. ణ్యః 4. దినకృతి. 5. పాద్రి 6. పటలైః 7, 8, 9. పట్టకేష్వాలిఖ్యంతి 10. రాసీకే 11. విరాజతః 12. మాహేశ్వర 13. పతిః 14. దేవః. 15. కుశలీ.

నాలుగో రేకు - మొదటిప్రక్క.

1. ం। పరదవిమయే। సత్తి వాడామ్ । చతుః[1]శమావచ్ఛిన్నం సజ
2. లస్థలం సర్వపీడావివర్జితం ఆచన్ద్రార్క క్షితిసమకా
3. లం యావన్మాతా పిత్రోరాత్మనః పుణ్యయశోవృద్ధయే । అ
4. జ గిరి నిధిశ కాబ్దే । కర్కటకమాశి శుక్లపక్ష
5. త్రియోద[2]శ్యా మాదిత్యవారే । కంచిదేశవలుత
6. పూరుగ్రామనివాసినః గణపత్యాఖ్యస్య సూనుః । కూతాడి నా
7. యకః । తస్యభార్యా శ్రీదేవి । తయోః సంజాతాయ । గణప
8. తినాయకాయ ఉదకపూర్వం తామ్రశాసనం కృత్వా । సత్తివా

నాలుగో రేకు - రెండోప్రక్క.

1. డాం । ప్రదత్త మస్మాభి ర్భావిభి ర్భూమిపాలై ర్మనునో ధర్మగా
2. రవాత్పరిపాలనీయమితి॥ తస్యైవగ్రామస్య [3]శీమా లిఖ్య
3. న్తే। పూర్వస్యాం దిశి కోప్పలి గ్రామ తటాకా న్తర్గతబన్ధోప
4. రి తి న్త్రిణీ వృక్షః । ఇన్ద్రాగ్నేయయోర్మధ్యే ధన్వాకార వక్రం
5. । ఆగ్నేయ్యాం దిశి తి న్త్రిణీవృక్షః । దక్షిణస్యాందిశి త్రికూ
6. ట ఆమ్రవృక్ష వాల్మీకా । నైరిత్యాం[4] దిశి త్రికూటే వాల్మీకయుగలం
7. పశ్చి మస్యాం దిశి తి న్త్రిణీ వాల్మీకా । వాయవ్యాందిశి పాషాణః
8. ఉత్తరస్యాం దిశి త్రికూటే విషవృక్షసమూహం । ఈసా[5]న్యాం దిశి త్రి
9. కూటే కోప్పలి తటాక బన్ధోపరి తి న్త్రిణీవృక్షః । షష్టివర్షసహస్రా

అయిదో రేకు - మొదటిప్రక్క.

1. ణి స్వర్గేమోదతి భూమిదః । ఆక్షేప్తాచానుమన్తా చ తాన్యేవ న
2. రకే వసేత్ । దత్త మిష్ట[6]న్త పస్తప్తం హుతంచైవ యుధిష్ఠిర । అ
3. ర్ధాఙ్గులేన సీమాయా హరణేన ప్రణశ్యతి ॥ స్వదత్తాం పరదత్తా
4. ం వా యో హరేత వసున్ధరాం । సవిష్ఠాయాం క్రిమి ర్భూత్వా

1. శీమా 2. త్రియోదశ్యా. 3. శీమాః 4. నైఋత్యాం; 5. ఈశాన్యాం, 6. ఇష్టం తపః.

5. పితృ[1] భిస్సహ పచ్యతి ॥ భూమిం యః ప్రతిగృహ్ణాతి య
6. శ్చ భూమిం ప్రియ[2]చ్ఛతి ఉభౌ తౌ పుణ్యకర్మాణౌ నియతం
7. స్వర్గ గామినౌ ॥ మహాకాయస్థ సన్ధివిగ్రహి మావురయసూనునా
8. సన్ధివిగ్రహి శ్రీదామోదరేణ లిఖితం । ఉత్కీలితమక్షశాలి వల్లే

అయిదోరేకు - రెండోపక్క.

1. మోజునా ఇతి॥

## (2.) C. P. 4 of 1918-19.

### దేవేంద్రవర్మరాజరాజదేవునితామ్రశాసనము ( శక 998 )

పా ఠ ము లు.

మొదటిరేకు - రెండవపక్క

1. ఓమ్ స్వస్తిశ్రీమతా మఖిల భువన వినుత నయ వినయ దయాదాన [3]దాక్షణ్య సత్యశౌ
2. చ శౌర్య్య ధైర్య్యాది గుణరత్నపవిత్రకాణామాత్రేయ గోత్రాణాం విమల విచారా
3. చారపుణ్య [4]శలిలప్రక్షాలిత కలికాలకల్మషమషీణాం మహామహేన్ద్రా
4. చలశిఖరప్రతిష్ఠితస్య సచరాచరగురోః సకలభువననిర్మ్మాణై
5. కసూత్రధారస్య [5]శసాఙ్కచూడామణే ర్భగవతో గోకర్ణ్ణస్వామినః
6. ప్రసాదాత్సమాసాదితైక శఙ్ఖభేరీపవిత్రమహాశబ్దధవలచ్ఛత్రహేమ
7. చామరవరవృషభలాఞ్ఛనసముజ్వల[6] సమస్తసామ్రాజ్యమహిమ్నా
8. మనేకసమరసఙ్ఘట్టనముపలబ్ధ విజయలక్ష్మీసమాలిఙ్గితో

రెండోరేకు - మొదటిపక్క.

1. త్తుంగభుజదణ్డ మణ్డితానాం త్రికళిఙ్గమహీభుజాం గఙ్గానా మన్వయ మ
2. లఙ్కరిష్ణోర్వ్విక్రమాక్రాన్తధరామణ్డలస్య [8]గుణమహార్ణవ[9]మహా

---

1. పితృభిః 2. ప్రయచ్ఛతి. 3. దాక్షిణ్య 4. సలిల 5. శశాఙ్క 6. సముజ్జ్వల 7. తుఙ్గ 8. మహార్ణవ 9. మహా.

3. రాజస్యపుత్రః॥౦॥ పూర్వ్వైంభూపతిభిర్వ్విభజ్యవసుధాయాపఞ్చభిఃపఞ్చధా
4. భుక్తాభూరివరాక్రమోభుజబలాత్తామేక ఏవస్వయం ఏకీకృత్యవిజి
5. త్య శత్రునివహాన్ శ్రీవజ్రహస్తశ్చతుశ్చత్వారింశత మత్యుదార
6. చరితఃసర్వ్వామరక్షీత్సమాః॥ తస్యతనయోగుణ్డమరాజావర్మాత్రియమపా
7. లయద్మహీం॥ తదనుజఃకామార్ణ్ణవదేవః పఞ్చత్రింశతమబ్దకాన్ తస్యా
8. నుజోవినయాదిత్య స్సమాస్త్రిసః॥ తతః కామార్ణ్ణవాజ్జాతో జగతీ

రెండోరేకు - రెండోపక్క.

1. కల్పభూరుహః । యోరాజ ద్రాజితచ్ఛాయో వజ్రహస్తోవనీపతిః॥ ప్రశోచ్ఛ్యద
2. న్మదగన్ధలుబ్ధమధుపవ్యాలీఢ గణ్డా న్గజా న్నర్థిభ్యస్సముదాత్తహాసమ
3. మతులో యస్త్యాగినా మగ్రణీస్సః శ్రీమానదియజ్ఞభీమన్రుపతి గ్గఙ్గాన్వయో
4. త్తంసకః పఞ్చత్రింశతమబ్దకా న్సమభునక్పృథ్వీం స్తుతః పార్థివైః
5. ॥ తదగ్రసూనుః సురరాజసూనునా సమస్సమస్తాస్త్రమితారి మణ్డ
6. లః [1] స్సపాతి కామార్ణ్ణవ భూపతిర్భువం సమృద్ధిమానర్ధ సమాం సము[2]జ్వల
7. ః॥ తదను తదనుజన్మా చిత్త్రజన్మోపమానో గుణనిధి రనవద్యోగుణ్డమాఖ్యో
8. మహీనః[3] సకలమిదమరక్షత్త్రీణి వర్షాణిధాత్రీ వలయమలఘు తేజో

మూడోరేకు - మొదటిపక్క.

1. నిర్జితారాతిచక్రః॥ తతోద్వైమాతురస్తస్యమధుకామార్ణ్ణవోన్నృపః।అవతిస్మావ
2. నీమేతా మబ్దానేకాన్నవింశతిం ॥౦॥ అథ వజ్రహస్తనృపతిరగ్రసుతాదఖల
3. గుణిజనాగ్రగణ్యః[4] కమార్ణ్ణవా త్కవీన్ద్రప్రగీయమానావదాత[5]సుభకీర్త్తిః॥శ్రి
4. య ఇవ వైదుమ్యాన్వయ పయః పయోనిధి సముద్భవాయాశ్చయః సమజని వి
5. నయమహాదేవ్యాః శ్రీవజ్రహస్త ఇతితనయః॥ వియదృతునిధి సంఖ్యాం యాతి
6. శాకాబ్దసంఘే దినకృతివృషభస్థే రోహిణీభే సులగ్నే ధనుషి చ సితపక్షే సూర్య
వారే
7. తృతీయాయుజి సకలధరిత్రీం రక్షితుం యోభిషిక్తః॥ న్యాయ్యేన యత్ర సమ
మాచరి

1. సపాతి 2. సముజ్జ్వల 3. మహీశః 4. కామార్ణ్ణవా 5. శుభ.

8. తుం త్రివర్గేణ మార్గేణ రక్షతి మహీమ్మహితప్రతాపే నివ్యావ్యర్ణధయశ్చనిర
యాశ్చ ని

మూడో రేకు - రెండో ప్రక్క

1. రావదశ్చ శశ్వత్ప్రజా భువిభవన్తి విభూతిమత్త్యః॥ వ్యాప్తేగజ్జకులోత్తమస్య
యశ
2. సా దిక్చక్రవాలే శశి ప్రద్యోతా మలినేన యస్యభువనః [1]ప్రహ్లాద [2]సమ్యాదినా
సైన్ద్రా
3. రైరతి సాన్ద్ర పఙ్క పటలైః కుమ్భస్థలీ పట్టకే ప్యాలిఖ్య న్తిపునః పునశ్చ హరితా
4. మాధోరణా వారణాః॥ అనురాగేణ గుణినో యస్య వక్షోముఖాబ్జయో
5. ః। ఆసీనే శ్రీ సరస్వత్యా వనుకూలే విరాజతః ॥౦॥ ఆగచ్ఛన్నురు విక్రమే
6. ణ సహసా శస్త్రాభియాతాద్దివో యేనావ్యాహత విశ్వవృత్తి మహిమా హేలా
నిర
7. స్తో శనిః। తేనేకారి నికామ కామ్య తనునారాజ్యం మహీమణ్డలే త్రింశద్వత్సర
8. మప్రభ [3]సుప్రభయశసా వర్షత్రయేణాధికం॥ తతోనఙ్గమహాదేవ్యాం వజ్రదస్త[4]
మహీ

నాలుగో రేకు - మొదటిప్రక్క.

1. పతిః గౌర్యామివహరస్యాభూత్కార్తికేయ ఇవాత్మజః॥ లక్ష్మీస్మవధూవదన
2. పఙ్కజమాకరస్ద సన్దోహపరిచుంబనచంచరీకః। యోమానినాంచగుణినాంచదురా
3. త్మనాంచ [5]సాన్త్వంచమోదమతులంచభయంచదత్తే॥ శాకాబ్దేనయనాబ్జగర్భ
నిధిగే
4. [6]జేష్ఠేష్టమీ[7]సజ్ఞకే లగ్నేచోత్తరఫల్గుణీగురుదినే పక్షేసు[8]సుభే
5. [9]సుభే లోకాలోకమహామహీధ్రవలయాలఙ్కారవత్యాభువస్సం[10]శిక్త
6. స్సకలిఙ్గరాజతిలకః శ్రీరాజరాజోనృపః॥౦॥ కలిఙ్గనగరాత్పరమమా
7. హేశ్వరపరమభట్టారకమహారాజాధిరాజ త్రికలిఙ్గాధిపతే [11]శ్రీమద్దేవేన్ద్రవ
8. ర్మ్మరాజరాజదేవః కుశలీసమస్తామాత్యప్రముఖజనపదాన్సమాహూయస[12]

1. భువనప్ర 2. సమ్యాదినా 3. సుభ్ర 4. దజ్రహస్త. 5. శాన్తిం 6. జ్యేష్ఠే 7. సంజ్ఞకే 8. శు శుభ్రే 9. శుభే 10. స్సంసిక్త 11. పతేః. 12. సమా.

నాలుగోరేకు - రెండోవ్రక్క.

1. జ్ఞాపయతి విదితమస్తు భవతాం వరాహవర్త్తన్యాం బృహత్కోడిలగ్రామః భి
2. స్సానవాట్టకేన సహాగ్రామగ్రాసం కృత్వా చతుస్సీమావచ్ఛిన్న స్సజలస్థలస్స
3. ర్వ్వపీడావివర్జిత మాచన్ద్రార్క్కస్థితిసమకాలం యావత్ మాతాపిత్రో
4. రాత్మనశ్చ పుణ్యాయశోభివృద్ధయే షడ్భాగాన్కృత్వా వసునిధినన్ద
5. గణితే శాకాబ్దే చైత్రమాసి విషువతి సంక్రాన్త్యాం కలిపురగ్రామ
6. నివాసి వత్సగోత్ర వాసుదేవశర్మ్మణే చత్వారోభాగాః కాస్యపగోత్ర
7. నారాయణశర్మ్మణే ద్వౌభాగౌచ అస్మాభిః ప్రదత్తా ఇతి॥

## (3) C P No. 5 of 1918-19

అనంతవర్మకుమారుడు మధుకామార్ణవదేవుని కాలమునాటి శ్రీలక్ష్మణరామదేవుని తామ్రశాసనము. (గాం॥ నం॥ 526.)

పా ఠ ము లు

మొదటిరేకు, రెండవప్రక్క

1. ఓమ్ స్వస్తి అమరపుర[1]నుకారిణ[2]సర్వ్వత[3]సుఖరమణీయా విజయవతో[4] కలిఙ్గన
2. గరవాసకాత్ ప్రసిద్ధసిద్ధ తాపసాధ్యాసితకన్దరోదరదరీ మహేన్ద్రాచలా మలక
3. నకగిరిశిఖరప్రతిష్ఠితస్య చరాచరగురో[5]సకలభువననిర్మ్మాణైక
4. సు[6]త్రధారస[7]శాఙ్కచు[8]డామణేర్భ్భగవతో గోకర్ణ్ణస్వామినశ్చరణక
5. మలయుగల ప్రణామాదపగత సకలి[9]కలంకో గఙ్గామ
6. లకులతిలక శ్రీమా[10]అన న్తవర్మ్మదేవః। తస్యసు[11]నువి[12]పుల
7. విక్రమానతానేకభూపాలమా[13]మణిమరీచిర[14]ఞ్జ[15] పాదపద్మయుగల
8. విమలచిత్తచిత[16]స్తరణేరివా శేష[17]దఙ్గగధ్యాయి ప్రతాపసురస

1. పురాను 2. కారిణః 3. బుతు 4 విజయవతః 5. స్సకల 6. సూత్ర 7. శశాఙ్క 8. చూడా 9. సకల 10. శ్రీమాన్ 11. తూ 12. నుః 13. మౌళి 14 చిరం 15. రఞ్జిత 16. చిత్త 17. శేష

రెండో రేకు - మొదటిపక్క.

1. రిత్ కులామల మహారాజాధిరాజ శ్రీమా[1]మధుకామణ్ణ[2]దేవ కుశలి[3]కలి
2. ఙ్గమణ్డలప్రతివధూతి[4]కలిఙ్గాధి[5]గత్యా[6] స్త్ర స్సిరిద్యలి పాణ్డ్యాపురవరమే
3. శ్వర సమధిగత పఞ్చమహాశబ్ద తిమిల పరశోమణ ప్రత్యస్త[7a]భైరవ శ్రీమా[8]
4. కుదలవణ కులతిలక శ్రీల్ల[9]క్ష ణరామదేవ[10]పదుణేగాంమే
5. యుసదస్తపురవాస్తవ్య వైశ్యకుల వఙ్గ శ్రీమఞ్చనాయక త
6. న్యసును పరమమాహేశ్వర మాతాపితృపాదానుధ్యాత ఏరకనాయక
7. న్యయదుశ్రీ మహాణరవల్లా మోరశిలే । త్రయగ్రాసమేత వైశ్య అ
8. గ్రహార క్రిత్వా[11]సప్రదత[12]మితి రాణకరాజదుత్రివిషయవతి సమ

రెండో రేకు - రెండో పక్క.

1. స్త రాజపాదోపజీవినా[13]చతుసీ[14]మావచ్ఛిన్న సజలస్థల సర్వ్వపీడాబాధ వివ
జిఁత[15]
2. అచటభటప్రవేశ చన్ద్రార్క క్షితిసమకాల॥అథసిమాలిఙ్గాని కథ్యన్తే
3. పూర్వ్వనైవడేలా[16]మాగగతా తిన్త్రిణితియం।ఆగ్నేయదిశాయాత్పుకుటే
రాజ
4. పథగతా శ్మశానగాడడఇచ్ఛ తిమిరవృక్షయేచివడ నన్దివృక్షరో
5. పితశిల తిన్త్రిణితియ వాపికాపాలి।దక్షిణేది[17]శాయా పవ్వతే[18]సి
6. ఖర నైరిత్య[19]దిశాయా గతా శిల।పశ్చిమదిశాయామధవినగతా
7. శిలా వాయవ్యదిశాయా చునగోడికూపో[20]ఉత్తరదిశాయా॥ఙుభులుభాగాడవ
8. వ్వతదోణి బృహత్పవ్వత ఉతర[21]దోణిద్వయపవ్వతమధ్యేదోణిగతా
9. వాపికాపాలి అశ్వథవృక్ష॥గతా నన్దివృక్షకదమ్బవృక్షతిన్త్ర (ణి)

మూడో రేకు - మొదటిపక్క.

1. వాల్మీక[22]రోపితశిలతిన్త్రిణిగతా వాల్మీక[23]తత[24]రోపిత శిలా
2. ద్వయతిత్రిణి ఈశాన దిశాయా రాజణవృక్ష వాల్మీక[25]గతాపవ్వతతల

---

1. శ్రీమాన్ 2. కామార్ణవ 3. కుశలీ 4. త్రికలి. 5. 6.
7. తుముల 7 (a) ప్రత్యుత 8. శ్రీమాన్ 9. శ్రీలక్ష్మణ 10. రామదేవః 11 క్రిత్వా 12. సమ్ప్రదత్తమితి 13. జీవినాం సమాహూయ సమాజ్ఞాపయతి 14. చతుసీ్స 15. వివర్జితః 16. డేలా 17. దక్షిణ 18. పర్వత 19. నైఋతి 20. కూపః 21. ఉత్తర 22. వల్మీక 23. వల్మీక 24. తతో 25. వల్మీకః

3. మూగాౕ॥సత్రిస్యభూమి।మురయుశతద్వయ౨౦౦।దోలిముగవేణ్ణా
4. షోడభో౹ఇ౹రేవనరానత్య గిలుపడణో॥అపచివడ।బహుభి
5. వఀసుధాదత్తా రాజానసగరాదిభి।యస్యయస్యయదాభూమి త
6. స్యతస్య తథాఫల।స్వదతపరదత[1]మ్మోవాయోహా రేతిసుధరా।వష్టి
7. వషఀ సహసా్రిణి।విష్టాయాంజాయతే కృమి।దాతుదేడశతరుష్య ౧౫౦
8. గఙ్గక్రివర్ధఀ విజయరాజ్య సమ్వత్సర అఙ్కే ణాపి౫౭౮కలిఙ్గనగరవాస్తవ్యమాధ
వసూనుమ
9. ధుసుదనేన లిఖితలేఖకస్య భుమి(ః)మురయుర౦అక్షుశాలి రణమేన ఉత్కిరిత[2]।

## (4) C. P. No. 6 of 1918–19.

రాజరాజదేవుని కుమారుడు అనంతవర్మ చోడ గంగదేవుని తామ్రశాసనము.

( శక. 1006 )

పాఠములు

మొదటి రేకు, రెండవపక్క.

1. ఓమ్ స్వస్తి(శ్రీ) మతామఖిల భువన వినుత నయవినయ దయాదాన దాక్షిణ్య
2. । సత్యశౌచ శౌర్యఀ ధైర్యాద్యఀదిగుణ రత్న పవిత్రికాణా మాత్రేయగోత్రా
3. ణాం విమల విచారాచార పుణ్యసలిల ప్రక్షాలిత కలకాలకల్మష మ
4. షీణాం మహామహేన్ద్రాచల శిఖర ప్రతిష్ఠితస్య సచరాచర గురో
5. ః సకల భువన నిమ్మాౕణైక సూత్రధారస్య శశాఙ్క చూడామణేర్భఀ
6. గవతో గోకర్ణస్వామినః ప్రసాదాత్సమాసాదితైక శఙ్ఖభేరీ ప
7. ఞ్చ మహాశబ్ద ధవలచ్ఛత్ర హేమచామరవరవృషభలాఞ్ఛన సము
8. [3]జ్వల సమస్త సామ్రాజ్య మహిమ్నామనేక సమరసఙ్ఘట్టసముపలబ్ధ

రెండో రేకు - మొదటి పక్క.

1. విజయలక్ష్మీ సమాలిఙ్గితోత్తుఙ్గ భుజదణ్డమణ్డితానాం త్రికలిఙ్గమహాభు
2. జాం గఙ్గానామన్వయమలఙ్క రిష్ణోర్వ్వఀష్ణోరివవిక్రమ[4]క్రాన్త ధరామణ్డలస్య
3. గుణమహార్ణవ మహారాజస్య పుత్రః॥ (శ్రీ)వజ్రహ స్తదేవశ్చతుశ్చత్వారిం

---

1 స్వదత్తా పరదత్తా 2 ఉత్కీరితమ్. 3 జ్వల 4 మాక్రాన్త.

4. శతమబ్దకాన్ క్షితిమరక్షీత్ । తత్తనయో గుణ్డమరాజా వర్షత్రియ
5. మపాలయత్ ॥ తదను తదనుజః కామార్ణ్ణవ దేవః పఞ్చత్రింశ
6. ద్వర్షాణి । తస్యానుజో వినయాదిత్యః సమాస్తిస్రః । తతః కామార్ణ్ణ
7. వతనయో వజ్రహస్తో మదగలిత గణ్డగజాన్ సహస్రమర్థిభ్యః
8. సముదాత్సఞ్చత్రింశతమబ్దకాన్ । తత స్తదగ్రసూనుః కామా

రెండో రేకు - రెండో పంక్తి,

1. ర్ణ్ణవ దేవోర్ధసమాం । తత స్తదనుజో గుణ్డమహీపతీ [1]స్త్రీణివర్షాణి । త
2. దను తస్య ద్వైమాతురో మధు కామార్ణ్ణవ ఏకోనత్రింశతి[2]వర్షాణి । తతః కా
3. మార్ణ్ణ వాద్వైదుమ్యాన్వయ సముద్భవాయాం వినయమహాదేవ్యాం జాతః శ్రీవజ్ర
4. హ స్తదేవో దివగ వత స్త మతిభీమణమశనిం శస్త్రా ర్ధభిజఘాన స
5. త్రియత్రింశతమబ్దకానవనిమపాలయత్ ॥ తతసుతస్యాత్మభవోరి
6. మర్ద్దన స్సరాజరాజక్షితిపః క్షితింసమాః అరక్షదష్టౌ వరుణాల
7. యామరాన్నిధి గ్గుణానాంనిధిపాలసన్నిభః తతో రాజేన్ద్రచోల
8. స్యతనయా రాజసున్దరీ రాజ్ఞ స్తస్యాగ్రమహిషీ । సతీసుత మసూయ

మూడో రేకు - మొదటిపంక్తి.

1. శాకాబ్దే నన్దరంధ్ర గ్రహగణగణితే కుమ్భసంస్థదినేశే[3]శుక్లపక్షే
2. తృతీయాయుజి రవిజదినే రేవతీభే నృయుగ్మే లగ్నే గఙ్గాన్వవాయాంబు
3. జవనదినకృద్విన్వ[4]విన్వ[5]ంభ రాయాః శ్చక్రం సంరక్షితుం సద్గుణ
4. నిధి రధి షిక్తోదగఙ్గాభిషిక్తః ॥౦॥ కళిఙ్గనగరాత్పర
5. మమాహేశ్వర షరమభట్టారక మహారాజాధిరాజ త్రికలిఙ్గాధి
6. పతిః శ్రీమద నన్తవర్మా చోడగఙ్గదేవ[6]కుశలీ సమస్తామాత్యప్రము
7. ఖ జనపదాన్సమాహూయసమాజ్ఞాపయతి విదితమస్తు భవతాం॥ యాపా వ
8. ర్తనివిషయే ॥ సేల్లదాఖ్య గ్రామః చతుస్సీమావ[7]చ్ఛిన్న[8]సజల

1. పత్రీణి 2. త్రింశద్వర్షాణి 3. దినేశే 4, 5. ద్విశ్వ విశ్వ. 6. దేవః 7, 8. సీమావచ్ఛిన్నం.

మూడో రేకు - రెండో ప్రక్క.

1. స్థలం సర్వ్వపీడా వివర్జిత మాచన్ద్రార్క్క క్షితిసమకాలం యావన్మాతాపి
2. తోరాత్మనశ్చ పుణ్యాయశోభివృద్ధయే[1] రుతుగగనవియత్ చన్ద్రగణితే శాకా
3. బ్దే తద్గ్రామస్థభగవత్యై పూజా నైవేద్య దీపాదికరణాయ దేవగృహంగణ కృ
4. ష్యాదిత సంస్థారాయ చాతలాగ్రామ నివా[2]శీ వల్లనపాంగుస్తస్య పు
5. త్రః నన్నిపాంగుస్తస్య పుత్రాయ। కోమరచన్ద్రాయ[3] మాదరంమనవ
6. త్తిర్ కాస్మాభిర్ద్దత్తేతిః[4] ॥

## (5) C P No. 7 of 1918-19

### శ్రీమహార్జునవర్మకుమారుడు దేవేంద్రవర్మతామ్రశాసనము

పా ఠ ము లు

మొదటి రేకు - రెండో ప్రక్క

1. ఓమ్ స్వస్తి అమరపురానుకారిణ సుఖరమణీయాద్విజయవతకలిఙ్గ
2. నగరాధివాసక మహేన్ద్రాచలామల శిఖరప్రతిష్ఠితస్య సచరాచర గు
3. రో సకలభువన నిర్మాణైక సూత్రధారస్య శశాఙ్క చూడామణేర్భగ
4. వతో గోకర్ణ్ణస్వామిన శ్చరణకమలారాధనైకతత్పరస్యానేకాహ
5. వ సంక్షోభజనిత జయశబ్ద ప్రతాపావనతసమస్తసామన్త చక్ర
6. చూడామణే ప్రభామఞ్జరీ పుఞ్జరఞ్జిత వరచరణయుగలో శ్రీమహా
7. ర్జునవర్మ సూను మహారాజాధిరాజశ్రీదేవేన్ద్రవర్మా పుష్కరిణీవిషయే విరి
8. ణికగ్రామవాస్తవ్య కుటుమ్బినా సమాజ్ఞాపయతి విదితమస్తు వో

రెండో రేకు - మొదటిప్రక్క.

1. యుడాయుగ్రామక వ్యాసకవిలచిసూను హేతిలోకయజ్వా ప్రదత్త
2. సర్వ్వ కరభరామపహృత్య చన్ద్రార్క్క తారక యావశాసనస్థిత్యా ప్రతి
3. పాదితేతి చతుర్ణామపి హ్యతరాణాసామాన్యభారి స్వకమధృత్య భ
4. గరికయాభూమిబహిష్కృత్యతి సుగ్రీసీమాలిఙ్గాని లిఖ్య

1. యుతు 2. నివాసీ 3 సాదరం 4 ద్దత్తేతి.

5. న్తే పూర్వస్యదిశి మారదగ్రామసీమా సేతువనరాజికా చ త
6. దక్షిణేనాపి పుష్కరిణీసీమావనరాజికాచేని పశ్చిమేణ
7. పుష్కరిణీగ్రామసీమా సేతువ (న) రాజకాచ ఉత్తరేణాపి కుమా
8. రికాభటగ్రామవనరాజికాచేతి సుగ్రిచవ్యాసగీతా

రెండో రేకు - రెండోపక్క

1. ని శ్లోకా మాభూదఫలశఙ్కవ పరదత్తేతి పా
2. ర్థివా స్వదానాపరమాన స్త్య పరదానాను పాల
3. నే ఇతి కమలదలామ్బు బిన్దులోలా శ్రియమనుచిన్త్య
4. మనుశ్య జీవితఞ్చ సకలమిదముదాహృత (ం) హి
5. బుద్ధ్వా నహిపురుషై పరకీర్తయా యేవిలోప్యా బహుభి
6. వసుధా దత్తా రాజభిసగరాదిభి యస్యయ

మూడో రేకు - మొదటిపక్క

1. స్యయదాభూమి తస్య తస్య తదా ఫల స్వదత్తా పర
2. దత్తా మ్వా యో హరన్తి వసుధరా స విష్టాయా కృమి భూ
3. త్వా పితృభి సహా పచ్యతే హిరన్య మేకం గామేకాం భూమి
4. రప్యేకమ జుల హార నరక మాయాతి యావదాభూ
5. తి సంప్లవం లిఖితమిదం సర్వ్వ చన్ద్ర శ్రీ సామన్తే నేతి
6. ఉత్కీర్ణతామ్రశాసనం శ్రీ సామన్త విణ్ణమలే నేతి ॥

## (6) C. P. No. 8 of 1918 - 19.

### దేవేంద్రవర్మ కొడుకు అనంతవర్మదేవుని తామ్రశాసనము.

పాఠములు

మొదటి రేకు - రెండవ పక్క.

1. ఓమ్ । స్వస్తి అమరపురానుకారిణ సర్వ్వర్తుసుఖరమణీయా
2. ద్విజయవత్కలిఙ్గనగరాధివాసకాత్ మహేన్ద్రా చ
3. లామల శిఖర ప్రతిష్ఠితస్య చరాచర గురోస్సక

4. ల భువనైక నిర్మాణక సూత్రధారస్య శకాబ్ద చూడాము
5. కే ర్భగవతో గోకర్ణస్వామి[1]న చరణకమల యు
6. గల ప్రభామూ[2]ద్విగత కలికలఙ్కో నేకాహవ సంక్షోభ
7. జనితజయశబ్ద[3] ప్రతాపనత[4] సమస్తసామజరీ[5] పుఞ్జర
8. ఞ్జితవరచరణకమలసితకుముదకున్దేంద్వావదాత
9. వినిర్గత యశోధ్వస్తారాతి కులాచలోనయవినయ

రెండవ రేకు, మొదటి ప్రక్క.

1. దయాదాన[6]క్షిన్యశౌర్యౌదార్యసత్యత్యాగాదిగుణ
2. సమ్పదాధార భూతో పరమమాహేశ్వర పరమభాగువరమట్ట[7]
3. రాజాధిరాజ గాఙ్గామల కులతిలకః దేవేన్ద్రవర్మ సూను
4. శ్రీ అనన్తవర్మ దేవకుశలీ కంటకవర్తనివిషయ రా
5. ష్ట్రకూట నాజెకరడ దాకృత్య సవాప్తవ్య దీనజనాపద
6. సర్వ్వసమాజ్ఞాపయతి విదితమస్తు భవతాం పరిదత్తం
7. ద్విషష్ఠిమద్ధిర్పణ భవతామామణ్డ అత్రిపుణ్యాశలేకవ
8. క్షశనాపొబువిభది తాలచన్వారి వ్రూడరోమవాహ[8]
9. లుదాబ్దలోమభభూరనా్వడచ్ఛమాణపభట్టచ
10. ర్వభట్ట నారదసగోత్రియ। కన్ద[9] సాఖాయ వేద్యనస

రెండవ రేకు, రెండవప్రక్క.

1. మానాయమట్కర్మాభిరతాయ। [10]సాగ్రహణపరాగ తా
2. లేన ధారా పూర్వకేన మాతాపితో్రరాత్మనశ్చ పుణ్యాభి
3. వృధయే[11]ఆచంద్రార్కతా వంతాశ్చు శాసనం కృత్వా ఆ
4. త్రిపద్రత వ్రూరసానామ్నా నికేనచి పరిపంతినాసవి
5. తథ్యం సముచిత ప్రచయాదశమానకా మిద
6. సమస్తపరిహారకేన భోక్తవ్య। అత్ర సీమాలిఖ్యా

1. స్వామినశ్చరణ 2. పరిణామా 3. శబ్ద 4. పావనత 5. మఞ్జరీ 6. దాక్షిణ్య 7. పరమభట్ట
8. ఈ పంక్తితర్వాత పంక్తి సరిగా తెలియవచ్చుటలేదు. 9. శాఖాయ 10. సోమగ్రహణ 11. వృద్ధయే

7. ని లిఖ్యంతే । చతుర్దిశ ప్రియాన్ని స్వాధ్యరలంకృత
8. గృహాద్భతి స్తద్దైవచా భూమి సహపరిగృహ్ణాతి వీచ
9. ప్రియచ్ఛతి అక్షైత్యతౌ పుణ్యకర్మణౌ నాయత పాసల
10. శామిన ॥ స్వదత్తా పరదత్తామ్వా యోహరీతి[1] వసుంధరా
11. సవిష్ఠాయాంకృమి

మూడవరేకు - మొదటిప్రక్క.

1. ర్భాత్వాపితృభి సహపశ్చతే । హిరన్య మేకంగా మేకాం
2. భూమి[2]మస్యేక మజ్గులం హరన్నరక మాయాతి । యావ
3. దాభూతసమ్ప్లవం । ఇతి కమల దళాంబు బిందునా శ్రీ
4. యఃసును చిన్యమనుష్యజీత[3]ఇ్చ సకల మి
5. హముపాగతం ఇ్చ వృధ్వానహి పురుషైపరకీ
6. ర్త యే వినాస్య । లిఖితం సన్ధివిగ్రహి వి
7. జ్ఞకేనేతి । వేలుగ్రామవాస్తవ్య విజ్ఞనసు
8. త మహిన్దపాక మారవిస్థిర్ల వృద్ధి.

## (1) C. P. No. 3 of 1918-1919.

### సంక్షిప్తార్థము.

ఆత్రేయగోత్రమునకు చెందినట్టియు, మహేంద్రగిరి గోకర్ణస్వామిపాదభక్తుడైనట్టియు, త్రికళింగేశ్వరుడైనట్టియు, గుణమహార్ణవుని సంతతివాడైనట్టియు, (రెండవ రేకు రెండుప్రక్కలను గుణమహార్ణవుని మొదలుకొని ఈమూడవ వజ్రహస్తునివరకు గల వంశావళి రాజ్యకాలములు ఇవ్వబడినవి) కామార్ణవుని కొడుకగు శ్రీవజ్రహస్తదేవు కళింగనగరము వాసకముగాగలవాడును, పరమమహేశ్వర పరమభట్టారక, మహారాజాధిరాజ త్రికళింగాధిపతి బిరుదములు గలవాడు - శకవర్షము 960 న పట్టాభిషిక్తుడై ఏరదవిషయమందలి సత్తివాడగ్రామమును శకవర్షము 971 న కంచిదేశమందలి వలుటపూరు గ్రామనివాసియైన గణపతినాయకునికి దానమిచ్చెను. మహాకాయస్థుడును, సంధివిగ్రహియు అయిన మాపూరయకొడుకు దామోదరుడు ఈ శాసనమును లిఖించెను. వల్లెమోజు దీనిని చెక్కెను.

---

1. రేత 2. భూమిమరస్యేక 3. జీవిత

## (2) C. P. No. 4 of 1918-1919.

### సంక్షిప్తార్థము.

పైశాసనముయొక్కయు దీనియొక్కయు రాగిరేకులపైగల మొదటినాల్గు పక్కల పాఠములు ఒక్కవిధముగానున్నవి. మూడవరేకు రెండోపక్క గంగ వంశములో శ్రేష్ఠుడైన వజ్రహస్తదేవు 33 సం॥ లు పరిపాలించినట్లు చెప్పబడినది. ఈతనితర్వాత ఈతనికిని ఈతనిభార్య అనంగమహాదేవికిని జన్మించిన శ్రీరాజరాజ నృపతి - కళింగరాజ తిలకుడు, కళింగనగరము రాజధానిగాగలవాడు, పరమ మాహేశ్వరుడు, పరమభట్టారకుడు, మహారాజాధిరాజు, త్రికళింగాధిపతి, శ్రీ మద్దేవేంద్రవర్మ రాజరాజదేవు శకవత్సరము 992 న పట్టాభిషిక్తుడై, సమస్త అమాత్య ప్రముఖజనపదుల ఎదుట, వరాహవర్తనియందలి బృహత్కోటిలగ్రామము (భిన్నాలవాట్టక గ్రామసహితముగా) గ్రామము ఆరుభాగములు శక,సం॥ 998 న, విష్ణు సంక్రాంతి సమయమున, కలిపురగ్రామనివాసులగు వాసుదేవనారాయణశర్మలకు ఇచ్చెను. రాజు, శక సం॥ 992 న జ్యేష్ఠ శుద్ధ అష్టమి గురువారం సింహాలగ్నమున ఉత్తరా ఫల్గుణి నక్షత్రసమయమున పట్టాభిషిక్తుడయ్యెను.

## (3) C. P. No. 5 of 1918-1919

### సంక్షిప్తార్థము.

అమరపురమును బోలిన విజయకళింగనగరమునుండి పరిపాలించుచున్న మహేంద్రగిరిపైనున్న గోకర్ణస్వామి పాదభక్తుడైనట్టియు, గాంగామలకులతిలకుడైనట్టియు, శ్రీ అనంతవర్మదేవ కుమారుడైన మహారాజాధిరాజ శ్రీ మధుకామార్ణవదేవు సుఖముగా నుండగా, కళింగమండలముయొక్క త్రిశాలకు పడమటనున్న త్రిస్థలిలోని పట్టాపురాధీశ్వరుడగు శ్రీ లక్ష్మణరామదేవు — ప్రత్యక్షభైరవ, పంచమహాశబ్ద సమధిగత, పరమేశ్వర, కుదల వణకులతిలక — పదుణగ్రామమునుండి వచ్చి దంతపురవాస్తవ్యుడుగానున్న మంచినాయకుని కొడుకును, వైశ్యకులోత్తముడును, అయ్యి శ్రీ ఎరపనాయకునికి కటుగ్రామ, హాండారవాడ, మొరాఖనిగ్రామములు మూడును కలిపి వైశ్యాగ్రహారముగా జేసి, సర్వకరపరిహారముగా దానమిచ్చెను. రాణకులు, రాజపుత్రులు, విషయపతులు, సమస్తరాజపాదోపజీవినులు, ఆచట్టు భటులు ఎవ్వరును ఎట్టి ఆటంకములు పెట్టకూడదు - దానము గాంగవంశప్రవర్ధమానవిజయ రాజ్య సం॥ 526 లో చేయబడెను. కళింగనగరవాస్తవ్యుడగుమధుసూనుడు దీనిని లిఖించెను. ఈతనికి 40 మురయుల భూమి దానమివ్వబడెను.

## (4) C. P. No. 6 of 1918-1919.

### సంక్షిప్తార్థము.

ఆత్రేయ గోత్రమునకు జెందినట్టియు, మహేంద్రాచల శిఖరముననున్న గోకర్ణ స్వామి పాదభక్తుడైనట్టియు, పంచమహాశబ్దాది సమస్తసామ్రాజ్యచిహ్నములుగలట్టియు త్రికళింగాధిపతి యైనట్టియు, గుణమహార్ణవుని వంశమునకు జెందిన (గుణమహార్ణవుని మొదలుకొని ఈ అనంతవర్మ చోడగంగునివరకుగల వంశావళి, రాజ్యకాలము లివ్వ బడినవి) రాజరాజ రాజసుందరుల కుమారుడు అయిన చోడగంగ, శక సం॥ 999లో కుంభసంస్థ దినశుక్లపక్ష తృతీయా రవివారమున రేవతీనక్షత్ర న్మీయుగ లగ్నమున పట్టాభిషిక్తుడయ్యెను. కళింగనగరమునుండి పరమమాహేశ్వర, పరమభట్టారక, మహారాజాధిరాజ, త్రికళింగాధిపతి బిరుదములుగల శ్రీమదనంతవర్మ చోడ గంగ దేవ సమస్తామాత్యాదివర్గము ఎదుటను రూపవర్తనివిషయమందలి సేల్లద గ్రామ మును, సర్వపీడాపరిహారముగావించి, తనయొక్కయు, తన తల్లిదండ్రులయొక్కయు పుణ్యమునకై శక సం॥ 1006 లో సేల్లదగ్రామ భగవతీదేవియొక్క పూజానైవేద్య దీపాది కర్మలకు దేవాగ్రహారముగాచేసి (చా) తలాగ్రామ నివాసియైన కొమర చంద్రునికిచ్చెను.

## (5) C. P. No. 7 of 1918-1919.

### సంక్షిప్తార్థము.

అమరపురమునకు సమానమైన కళింగనగరము రాజధానిగా గలమహేంద్రాచల గోకర్ణస్వామి పాదభక్తుడైనమహార్జునవర్మ కొడుకగు మహారాజాధిరాజ శ్రీదేవేంద్ర వర్మ పుష్కరణీవిషయమందలి విరిణికగ్రామ కుటుంబినుల కిచ్చిన ఆజ్ఞ :- యడాయ గ్రామనివాసియైన విలచికొడుకు హెతిలోకకు సదరుగ్రామము సర్వకర పరిహార ముగా ఇవ్వడమైనది - సర్వచంద్ర శ్రీసామంత దీనిని లిఖించెను. వింధిమలన శ్రీసామంత దీనిని చెక్కెను.

## (6) C. P. No 8 of 1918-1919.

### సంక్షిప్తార్థము.

అమరపురమును బోలిన సర్వఋతుసుఖరమణీయమైన విజయకళింగ నగరము రాజధానిగా గల్గినట్టియు, మహేంద్రాచల గోకర్ణస్వామి పాదభక్తుడైనట్టియు,

అనేకయుద్ధములందు జయము గల్గుటచేత వంచబడిన తలలుగల సామంతరాజులు గలట్టివాడును, నయవినయాది సత్ సంపన్నుడును, పరమమాహేశ్వర, పరమభాగు, పరమభట్టారక రాజాధిరాజ బిరుదములు గలవాడును, గాంగామలకులతిలకుడును అగు దేవేంద్రవర్మ కొడుకు అనంతవర్మదేవ కంటకవర్తని విషయమందలి నాజెకరడ గ్రామం మాణవభట్ట, చర్వభట్టలకు చంద్రగ్రహణసమయమున దాన మిచ్చెను. వ్యాసగీతలు దాన సంరక్షణకై ఇవ్వబడినవి. వినజక యనుసన్ధివిగ్రహి దీనిని లిఖించెను.

# పొట్లదుర్తి - మాలెపాడుశాసనము

మల్లంపల్లి సోమశేఖరశర్మ

నా మిత్రులు శ్రీయుత డాక్టరు వెంకటరమణయ్యగారితో కొన్ని దినాలు నేను కడపమండలములో పర్యటనం[1] చేసినప్పుడు సంపాదించిన శాసనమిది. అసలు ఈ శాసన మొకటి ఉన్నట్టు మాకు తెలిసినది మెకంజీ సంపాదించిన కైఫీయతుల వలన. మేము చూచిన యీ కైఫీయతు పుట్టి అప్పుడే దాదాపు నూటపాతిక సంవత్సరాలయింది. ఈ శాసనాన్ని గురించి మేము పొట్లదుర్తి గ్రామంలో చాలా వాకబు చేశాము. ఆ వూరు కరణంగారికిగాని, ఆవూళ్లోని యితర పెద్దమనుష్యులకుగాని ఇది వకటి ఉన్నట్టే తెలియదు. విచారించగా విచారించగా దీని ఉనికి మాకు గొర్రెలకాపరులవలన తెలిసింది. పొట్లదుర్తి మాలెపాడు తోవకుత్తరముగా పొట్లదుర్తి సరిహద్దులోచేరిన వెంకటాపురం గ్రామానకు దగ్గరగా ఒక శాసనపు రాయి వుందని తెలిపినాడు గొల్లబోయ డొకడు. కాని ఆ ప్రాంతాన దీన్ని వెదకితే కనబడలేదు. తుదకు మరొక గొల్లబోయడు కనబడి తోవకుత్తరంగా లేదు, దక్షిణంగా పొలిమేరలోనే వున్నదని మమ్మల్ని తీసుకవెళ్లి చూపించినాడు. ఈ ప్రాంతాల శాసనాలన్నీ యెర్రరాళ్లమీదే చెక్కడం వాడుక. ఇదికూడా యెర్రరాతి మీదే చెక్కి వున్నది. ప్రతిబింబం తీదామంటే ఈ రాతికి దగ్గరగా నీళ్లు దొరికినవికావు. దూరాన ఒక చెలమవుంటే దొరువు తవ్వి, కూడా దాహం త్రాగుటకని తీసుకవెళ్లిన గాజుగ్లాసుతో నీళ్లున్నూ రాయి కడగడానికని చెలమబురదనీటిలో తడిపిన తువ్వాలున్నూ తీసుకువెళ్లినాము. ఎట్లాగయితేనేమి ప్రతిబింబం తీసినాము. రాతిగ్గరకూర్చునే చదివి కొంతవరకు శాసనపాఠం సరిచూచుకొన్నాము. ప్రతిబింబమునుబట్టి తయారు చేసిన శాసనపు బొమ్మను వేరొకచోట చూడవచ్చును.

నాదగ్గరున్న ప్రాచీనాంధ్రభాషాశాసనాలలో ఇదే అతిప్రాచీనమయినదని నా నమ్మకము. ఇంతేకాదు; ఇప్పటివరకు కానవచ్చినప్రాచీనాంధ్రభాషాశాసనా లన్ని

1. నామిత్రులు శ్రీ వెంకటరమణయ్యగారి ఆర్థికసహాయమే లేకపోతే ఈపర్యటనమే జరగకపోను. ఇందుకు వారి కిందుమూలంగా నాకృతజ్ఞత తెలుపుకొంటున్నాను.

టిలోనూకూడా ఇదే అతిప్రాచీనమయినదేమో అనిపిస్తున్నది. ఇది రేనాటిని పాలించిన దినకరకులనందనులు, 'కాశ్యపగోత్రులు' అగు చోళవంశస్థులది.

కడపమండలములోని చాలాశాసనములలో రేనాడు ఏడువేలదేశమనివున్నది[2]. కడపజిల్లాలోని కామలాపురం, ప్రొద్దుటూరు, జమ్మలమడుగు తాలూకాలున్ను, కర్నూలు జిల్లాలోని కోవెలకుంట్ల, నంద్యాల తాలూకాలలో కొంతభాగమున్ను, బంగనపల్లిఎస్టేటున్ను పూర్వము రేనాటిలోనివి. కాలం గడచినకొద్దీ రేనాడు ఏడువేలదేశమల్లా పోయి డెబ్బయిదేశమయింది[3]. రేనాటికి దక్షిణపుసరిహద్దు పెన్నగా కనబడుతుంది. పెన్నకు దక్షిణానవున్నప్రదేశం ములికినాడయినది.

క్రీస్తుశకం ఏడవశతాబ్దినాటికే కడపమండలాన్ని చోళులు పరిపాలిస్తూ వున్నట్టు తెలుస్తుంది. బాదామి చాళుక్యభూపతి అయినరెండవపులకేశికాలములో దక్షిణ హిందూదేశమునకు వచ్చినయువాన్ చాంగ్ అను చీనాయాత్రికుడు ఈప్రాంతాన్నే చులియే అన్నాడు. దీనికి చోళులదేశమని అర్థముచెప్పినారు చరిత్రపరిశోధకులు. దీనినిబట్టి ఏడవశతాబ్ది కెప్పుడో పూర్వమే చోళులు ఈప్రాంతమును వశపరుచుకొని రాజ్యంచేస్తూవుండిరని స్పష్టమవుతున్నది. మాల్యఖేటపు రాష్ట్రకూటవంశస్థులయిన ధ్రువమహారాజున్ను, అతనికుమారుడు మూడవగోవిందభూపాలుడున్ను కాంచీపురపల్లవులతోడి వైరము సందర్భములో క్రీ.శ.800ల ప్రాంతాన ఈప్రాంతముపయి దండెత్తి వచ్చి వశంచేసుకోవడంవల్ల క్రీ. శ. 800 లనాటికి రేనాటిచోళుల స్వతంత్రపరిపాలన అంతరించినట్లే చెప్పవలెను. అందువల్ల చోళులస్వతంత్రపరిపాలనను సూచించే ఏ శాసనముదొరకినా అది 800 లకు పూర్వపుదే కావలసివుంటుంది.

రేనాటిచోళులవి శిలాశాసనాలేకాని రాగిశాసనాలు అట్టే బయలుపడలేదు. వీరి శిలాశాసనాలు పులివెందల, కామలాపురం, ప్రొద్దుటూరు, జమ్మలమడుగు తాలూకాలలో చెదరివున్నవి. వీటిలో గవర్నమెంటుశాసనశాఖవారు కొన్నిటికి ప్రతిబింబాలు తీసి పరిశీలించినారు. ఇంకాకొన్ని వారిదృష్టిలోనికి రాలేదు. అటువంటి వాటిలోనిదే ఇప్పు డీప్రకటించే శాసనం.

ఈశాసనం చోళమహారాజుకాలంనాటిది. దానిలో అతనికి ప్రభువులయిన మహారాజు లెవ్వరూ పేర్కొనబడకపోవడంవల్ల ఇది రేనాటిచోళులు స్వతంత్రు

2. Ep. Coll. No. 393 of 1904; No. 466 of 1906; No. 517 of 1906.
3. Ep. Coll. No. 350 of 1905.

టుగా పాలిస్తూవున్నప్పుడు వేసినదే అయివుండాలి. అందువల్ల ఇది క్రీ. శ. 800లకు పూర్వపుది. ఏవంశపురాజులనుగురించి అయినా తెలిసికోవాలంటే శిలాశాసనాల కంటె రాగిశాసనాలే ఎక్కువగా ఉపకరిస్తవి. పూర్వకాలమునాటివి రాగిశాసనాలిచ్చినన్ని వివరాలు శిలాశాసనాలియ్యవు. కాబట్టి రేనాటిచోళులరాగి శాసనాలు వెదకాలి.

రేనాటిచోళుల రాగిశాసనాలు ఇంతవరకు రెండే దొరకినవి; ఒకటి పుణ్యకుమారుని మాలెపాడుతామ్రశాసనం. దీనిని కొంతకాలంక్రితం 'ఎపిగ్రాఫియా ఇండికా' అనే గవర్నమెంటువారి త్రైమాసికపత్రికలో[4] కీర్తిశేషులయిన శ్రీరావుబహద్దరు హెచ్. కృష్ణశాస్త్రిగారు ప్రకటించినారు. రెండవది శ్రీకంఠచోళునిశాసనం. ఇది యింకా ప్రకటనకాలేదు. ఈశాసనం మద్రాసుగవర్నమెంటుమ్యూజియములో వున్నది. ఈ రెంటిలో పుణ్యకుమారునిశాసనమే పురాతనపుది. ఇంతవరకు దొరకిన రేనాటిచోళశిలాశాసనాలన్నీ సంపాదించి ప్రయత్నించినా వాటినిబట్టి అనుస్యూతమయిన రేనాటిచోళవంశావతారక్రమం ఏర్పరుచడము కష్టము. కుదరదు.

పుణ్యకుమారునిమాలెపాడు శాసనమునుబట్టి ఈచోళులవంశవృక్షం ఈక్రింద చూపినరీతిగా వేయవచ్చును.




ఈ శాసనకాలమునుగురించి 'ఎపిగ్రాఫియా ఇండికా' లో శ్రీకృష్ణశాస్త్రిగారున్ను, 'క్రిష్టియన్ కాలేజి మేగజీన్[5]' లో 'త్రైరాజ్యపల్లవ' వ్యాసం రచించిన సందర్భములో 'A note on the date of the Malepadu plates' అనుపేర ప్రకటించిన అనుబంధమందు నా మిత్రులు డాక్టరు ఎన్. వెంకటరమ

4. Ep. Ind., Vol. XI, p 339.
5. January, 1929.

ణయ్యగారున్నూ బాగా చర్చించినారు. ఇది ఎనిమిదవశతాబ్దం చివరిదని నిర్ధారణ చేసిన కృష్ణశాస్త్రిగారివాదం పూర్వపక్షంచేసి వెంకటరమణయ్యగారు ఏడవశతాబ్ది నడిమికాలమునాటిదని సిద్ధాంతంచేసినారు. ఇందుకుగల కారణాలు మళ్ళీ ఇక్కడ తెలుపడము అనవసరము. కావలసినవారిని ఆవ్యాసము చూచుకోవలసినదని కోరుతూ వెంకటరమణయ్యగారి సిద్ధాంతమునే అనుసరిస్తున్నాను. ఈ సిద్ధాంతము ప్రకారము చోళమహేంద్రవిక్రమవర్మ, అతనికొడుకులు పుణ్యకుమార, గుణముదితులున్నూ కాంచీపురపు రాజయిన పల్లవప్రభువు మొదటి మహేంద్రవర్మనాటివారయి వుంటారనవచ్చును.

ఇప్పుడు ప్రకటించేశాసనం చోళమహారాజుదని ఇదివరకే తెలుసును. కాని యీచోళమహారాజు అసలుపేరు ఏమిటోమాత్రం శాసనంలో విడిగా లేదు. చోళమహారాజు అన్నపేరుతో వున్నప్రభువుశాసనాలు కొన్నిటిని గవర్నమెంటు శాసనశాఖవారు సంపాదించినారు. ఇవన్నీ ఆరు[6]. మహేంద్రవిక్రమవర్మకు చోళమహారాజనీ ముదితశిలాక్షరుడనీ, నవరాముడనీ బిరుదు లుండినట్లు మాలెపాడు శాసనంవల్ల తెలుస్తున్నది. చోళమహారాజనేబిరుదు ఉండడంచేతనూ, లిపికూడా చాలాప్రాచీనమయినదిగానే కనబడడంచేతనూ కృష్ణశాస్త్రిగారు పైనిచెప్పిన ఆరుశాసనాలూ చోళమహేంద్రవిక్రమవర్మవే అయివుంటవని వూహించినారు[7]. కృష్ణశాస్త్రిగారు వాటిని ఏకారణంచేతనయితే మహేంద్రవిక్రమవర్మవిగా భావించినారో ఆకారణాన్ని పురస్కరించుకొనే నేనున్నూ విమర్శలోవున్న యీశాసనంకూడా ఆరాజుదే అని వూహిస్తున్నాను. అంతేకాకుండా శాసనభాష తెలుగయినప్పటికీ స్పష్టముగా అర్థముకాకుండాను కొన్నిమాటలు విలక్షణముగాను ఉండడముకూడా శాసనప్రాచీనతకు గొప్పనిదర్శనం.

రాతిని వెడల్పుగా వున్నప్రక్క, చతురస్రముగా మలిచి దానిమీద శాసనం చెక్కినారు. శాసనమంతా కలసి నాలుగు పంక్తులుమాత్రమే వున్నది. శాసనం చెక్కినవైపుకాక దానిప్రక్కవైపున శాసనం చెక్కినవారిపే రున్నది. శాసనపాఠంలో దానిని అయిదవపంక్తిగా వ్రాసినాను. ఈశాసనంలోని లిపి వేంగిని పాలించిన

6. Ep. Coll. Nos. 405 & 406 of 1904; Ep.Coll. No.408 of 1904; Ep. Coll. No.352 of 1905; Ep. Coll. No. 466 of 1906; Ep. Coll. No. 517 of 1906.

7. Ep. Ind. Vol. XI, P. 431

మొదటిచాళుక్యరాజులశాసనాలలలోని లిపీ ఒక్కమోస్తరుగా వున్నవి; అనగా ఈశాసనం ఏకాలపుదని చెప్పుతున్నామో ఆకాలపుశాసనాలలో మామూలుగా కనబడే తెలుగు - కన్నడలిపిలో వున్నది యీశాసనం. దీనిలో అచ్చులు అ (2-వ, 5-వ పంక్తులు), ఇ (2-వ, 3-వ పంక్తులు) లు వచ్చినవి. అరవంలోని 'ఙ్జ' వర్ణమూ, 'ల' 'ళ' వర్ణములూ స్పష్టంగా ఏర్పాటుగా వున్నవి. 'ఙ్జ' వర్ణమును మొదటి పంక్తిలో 'సోఙ్జమహారాజ' పదంలో చూడవచ్చును. ఈవర్ణానికి మొదటిపంక్తిలోని 'పుఙ్జోలి' పదంలోను మూడవపంక్తిలోని 'ఙ్జచ్చు' పదంలోను కొంచెం భేదముతో రూపాంతరాలు కనబడుతున్నవి. 'సోఙ్జమహారాజ' పదంలో వున్న 'ఙ్జ' వర్ణము పంటిగుర్తునకు మధ్య అడ్డంగా ఒకగీటు గీసినందువల్ల ఈశాసనంలో బండిర యేర్పడినది. ఈవిధమయిన 'బండిర' మూడపవంక్తిలో 'పెన్వాఱ' అన్నపదంలోను, అదే పంక్తిలోని "ఇశెఱేనికి' అన్నపదంలోను కనబడుతున్నది.

శాసనభాష అంతా తెలుగే. శాసనమంతా గద్యంలో వున్నది. కొన్నికొన్ని పదాలుమాత్రమే కాకుండా వాక్యరచనకూడా విలక్షణంగానే వున్నది. అణపోతులు రేవణకాలు, పుద్దణకాలు, పుఙ్జోలి మొదలయిన పదాలు చాలావిలక్షణంగా వున్నవి.

చేసిన భూదానమును గురించి తెలుపడమునకు ఈశాసనం పుట్టిందన్నమాట మాత్రము స్పష్టమేకాని ఆదానం ఎవరిచ్చినదీ, ఎవరికిచ్చినదీ అన్నవిషయం మాత్రం నిర్ణయించడం కొంచము కష్టమయినపని. దాన మిచ్చినది 'పన్నస' అని శాసనంలో కలదు. ఈ 'పనస్న' పదం ప్రాచీనశిలాశాసనాలు చాలావాటిలో వస్తుంది. భూమి భోగాలలో (Land Tenures )రూఢమయిన ఏదో ఒక భోగానికో[8] మనకిప్పుడు

8. చూడుడు ప్రాచీనాంధ్రభాషాస్వరూపము -రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక, పుటలు 62-68.

ఈ 'పన్నస' అనేమాట బహుశా ప్రాకృతంలోనుంచి ఏర్పడినట్టు కనబడుతున్నదని శామిత్రులు కాళ్లకూరి సూర్యనారాయణరావుగారు అంటున్నారు. వారన్నది ఇది : (ప్రా.) పణ + నస్ = డబ్బులేదు అని అర్థము ; అనగా ఈభూమిని అనుభవించినందుకుగాను రాజుకు పన్ను చెల్లించవక్కరలేదని భావము. ఈమాటలకు సరి అయిన మాతృకలగు సంస్కృతపదములు ఫణ + నఖా అనేవి ఫణ ప్రాకృతంలో పణగానూ, నహా ప్రాకృతంలో నస్ గాను మారి ఉండవలెను. ఈ వ్యుత్పత్తే సరి అయితే (ప్రా) పణ + నస్ - (తెలుగు) పణ్నస - పన్నసగా మారుతుంది. "మహారాజులుంగారు ఇచ్చినది పన్నస" : ఇది వాస్తవముగా రెండువాక్యములు. రానురాను 'పన్నస' వ్యుత్పత్తి తెలుగు

తెలియని ఏదో ఒకపద్ధతి భూమికొలతలో కొంతరూఢపరిమాణం గల క్షేత్రానికి పూర్వం 'పన్నస' అనివాడుతూవుండినట్లు తోస్తుంది. పూర్వపు శిలాశాసనా లేవి చూసినా అవి సాధారణంగా, చేసిన భూ దానమును 'పన్నస' అనే చెప్పుతూ వుంటవి. దాతలు 'రేవణకాలు, పుద్దణకాలు' అని అనుకొంటున్నాను. దానమిచ్చినది 'పెన్నాఱ ఇశెజేనికి.'

ఇక మనం శాసనంలోని పదాల కర్థం చూదాము.

'సోజ్ఞమహారాజుల్లొళన ఇన్పుజ్జోలి':- దీని కర్థంకావడంలేదు సరికదా 'ల్లొళన' అన్నది అసలు 'ల్లొళ'నో, 'ల్లిళ'నో, 'ల్లెళ'నో కూడా తెలియడంలేదు. కొన్ని కొన్ని ప్రాచీనచాళుక్యశాసనాలలలో 'ల' వర్ణానికి ఇత్వమూ, ఎత్వమూ, ఒత్వమూకూడా మనశాసనంలో వున్నట్టే వ్రాయడం కద్దు. కాని యిట్లా వ్రాయడం పూర్వకాలపు ప్రాచీనశాసనాలలో ఒత్వమునకే రూఢంగా వున్నట్టు కనబడుతుంది కనుక 'ల్లొళన' పాఠమునే నేను గ్రహించినాను. ఇక 'ల్లొళన' లోని 'న' ను నకారపుపొల్లుగా కూడా చదువవచ్చును. ఈశాసనంలో 'న' వర్ణంమీాది తలకట్టు కొన్నిచోట్ల స్ఫుటంగా వుంది; కొన్నిచోట్ల స్ఫుటంగా లేదు. 'ఇచ్చిన' అన్నపదంలో 'న' ఎట్లా వున్నదో, 'ఇశెజేనికి' అన్నపదంలో నకారపుపొల్లు ఎట్లావున్నదో 'ల్లొళన'లోని 'న' కూడా అట్లాగే వున్నది. కాబట్టి దానిని 'న' వర్ణముగానూ గ్రహించవచ్చును; నకారపుపొల్లుగాకూడా చదివి 'ఒళన్ ఇన్పుజ్జోలి' అన్నపాఠమూ గ్రహించవచ్చును. 'సోజ్ఞమహారాజు ల్లొళన ఇన్పుజ్జోలి' పాఠమే గ్రహిస్తే దీనిపదవిభాగ మిట్లా వుంటుంది : సోజ్ఞమహారాజుల్ల + ఒళన + ఇఱ్ఱ పుజ్జోలి.

'పుజ్జోలి':- 'ఒళన'పదాని కర్థముతీయడానికి ముందు 'పుజ్జోలి'పదము ను గురించి విచారిద్దాము. ఈపదము ప్రాచీనశాసనాలలోకూడా తరుచు కనబడదు. 'జ్జ' వర్ణం రానురాను కొన్నిపదాలలో 'డ' వర్ణముగానూ, మరికొన్నిటిలో 'శ' వర్ణం గానూ మరోకొన్నిటిలో 'హ' వర్ణంగానూ ఇంకా కొన్నిటిలో 'ఱ' వర్ణం

---

వారు మరచిపోగానే దానిని ఒక నామవాచకంగా రూచించినారు. అంతట అది మహారాజులుంగారు ఇచ్చిన పన్నస అనివాడుకలోనికి వచ్చినది. ఇట్టిమార్పు తెలుగుసంప్రదాయమును అనుసరించియున్నది. (చూ. రాజుగారు-వ్రాసినది-జాబు-ఏదీ? రాజుగారు వ్రాసినజాబు ఏదీ?) ఈ రెండింటికిని భావములో వ్యత్యాసము ఏమిన్నీ లేదు, నేటి 'పన్ను' అనేమాట (ప్రా.) పణ అను శబ్దమునుండే వచ్చినది.

గానూ మారింది; ఎట్లనగా, 'చోఴ' పదము 'చోడ' 'చోళ' పదములుగానూ, 'మేఴాంబ' 'మేహాంబ' గానూ, 'ఴోల్నాండు' పదము 'ట్రోల్నాండు' గానూ, 'చేంఴోలు' 'చేబ్రోలు' గానూ మారినవి. తరువాత ఈవర్ణం తెలుగు భాషలోనుంచే అంతరించి పోయింది. ఇది పొందిన యీమార్పులనుబట్టి చూడగా 'పఴకి' పదం 'పఱకి' 'పత్కి' 'పర్కి' 'ప్ర్కి' గా మారినట్లే 'పుఴోలి' పదంకూడా 'పుఱోలి' 'ట్రోలి' 'ప్రోలి' గా మారివుంటుందనుకొంటున్నాను. 'ప్రోలు' అంటే పట్టణము అన్నఅర్థం మనకు తెలిసినదే. 'ప్రోలి' అన్నఅర్థంలోనే 'పుఴోలి' పదానికి 'పుడోలి' అన్నరూపాంతరం కూడా కద్దు శాసనాలలో. 'ప్రోలి' అనగా పట్టణముయొక్క, పట్టనానికి సంబంధించిన, అని అర్థము చేయవచ్చును. 'ఇఞపుఴోలి' అనగా 'ఇన్ప్రోలి'. 'ఇన్ప్రోలు' అన్నది ఒక పట్టణముపేరయివుండవచ్చును. దానిఅసలురూపము 'ఇనుప్రోలు' అగునేమో. 'ఇనుప్రోలు' పదానికి 'ఇన్ప్రోలు' అన్నరూపం వ్యాకరణసిద్ధమేకదా!

'ఒళన' :- దీనిప్రాతిపదిక 'ఒళ' అయియుండవచ్చును. 'ఒళ' రూపాంతరమే 'ఒడ'. ఇవిరెండూ ప్రాచీనరూపాలే. 'ఒడఁబడు,' 'ఒడఁగూడు' రూపాలలో మాత్రమే సప్తమ్యంతమయిన 'ఒడ' రూపమిప్పటికీ నిల్చివున్నది. అసలు విశేష్యముకాదగు 'ఒడ' పదం అంతరించే పోయింది. 'ఒడఁబడు' అన్నదానికి సమ్మతించు, అనే అర్థం వున్నదిగనుక 'ఒడ' కు 'సమ్మతి,' 'అంగీకారము' అని అర్థంచెప్పవచ్చును. 'నెల' 'నెలవు,' 'ఇరు' (ఇర) 'ఇరవు' పదాలవలెనే 'ఒడ' 'ఒడవు,' 'ఒళవు' కూడా కాదగునేమో. 'ఒళవు' రూపం శబ్దరత్నాకరములోనికే ఎక్కింది. దీనికి 'మర్మము' 'వీణాదండము' 'లోఁకువ' అనే అర్థాలువున్నవి.వీటిలో మొదటిరెండర్థాలలోనూ ఆపదానికి ప్రయోగాలున్నవికాని 'లోఁకువ' అనే అర్థంలోమాత్రం ప్రయోగంకనబడలేదు కాబోలు శబ్దరత్నాకరకర్త ఇవ్వలేదు. బహుశా ఈయర్థంవాడుకలో వుండి వుంటుందనుకొంటాను. 'ఒడన' 'ఒళన' పదాలు పరస్పరము రూపాంతరాలు కావడంచేత 'ఒళన' కు సమ్మతినే, లేదా లోకువనే, లేదా అధీనతనే అని అర్థంచేయవచ్చునేమో. 'ఉడయ' (ఉడైయ) అనే అరవంలోనిషష్ఠీవిభక్తిప్రత్యయమూ, 'ఒడయుడు' అనే తెలుగువిశేష్యపదమూ, 'ఒడ,' 'ఒళ' పదాలూకూడా ఒక్కకుదురులోనుంచివచ్చినవే కావచ్చును. పుట్టుకలో జ్ఞాతిత్వంచేత మొట్టమొదట కొంత అర్థసామ్యం కలిగి

వుండినప్పటికీ, భాషాపరిణామంలో ఒక్కొక్క పదం ఒక్కొక్క ప్రయోజనం కలిగి వేరువేరర్థాలకు రూఢమయి వుండవచ్చును. 'చోళమహారాజుల్లొళనఇన్పుష్టోలి' అన్నదానిలో 'ఒళన' అన్నది 'అధీనతనే' 'సమ్మతినే' అనే అవధారణార్థకమయిన వ్యస్తపదమూ కావచ్చు; లేదా 'న' అన్నది సప్తమీప్రత్యయమయి (అధీనతయందలి అన్న అర్థమిస్తూ) అది సమాసభాగమూ కావచ్చు. 'రాజుల + ఒళన'= రాజుల్లొళన' అయినది. షష్ఠియందు ఈమాదిరి ద్విత్వము రావడం కొన్ని ప్రాచీన శాసనాలలోకూడా కనబడుతుంది. 'సోఢమహారాజుల్లొళన' అనగా 'చోళమహారాజు సమ్మతినే' లేదా 'మహారాజునధీనతనే' అనికాని; 'చోళమహారాజు నధీనతయందలి' 'చోళమహారాజు నధికారమునందలి' అనికాని అర్థమని తోస్తున్నది.

'అణపొతులు రేవణకాలుపుద్దణకాలు':—వీరే శాసనంలోని దాతలుగా కనబడుతారు. కాబట్టి యీమూడుపదాలూకాని, లేక కడపటిరెండూగాని మనుష్యుల పేరులయి వుండాలి. 'కాలు' అన్నది అరవంలోని బహువచన, గౌరవవాచక ప్రత్యయమయిన 'కళ్' 'గళ్' రూపవికారమని తోస్తుంది. అదేకనుక అయితే 'కాలు' అన్నది యిప్పటి 'గారు' పూర్వరూప మనుకోవాలి. అప్పుడు 'రేవణకాలు,' 'పుద్దణకాలు' పదాలను 'రేవణగారు' 'పుద్దణగారు' అని గ్రహించవలసివుంటుంది. 'రేవణగారిపుద్దణగారని అర్థంచెప్పడంకంటె 'రేవణకాలు' లోని 'కాలు' ప్రథమలోనే వుండడంవల్ల 'రేవణగారు,' 'పుద్దణగారు' అని దాతలిద్దరని చెప్పడమే సమంజసమేమో. 'అణపొతుల' కర్థం దానికి పూర్వమందున్న 'పుష్టోలి' పదాన్నిబట్టి నిర్ణయించవలసివుంటుంది. ఈశాసనకాలంనాటికి వ్రాతలో ఒ, ఓలకుభేదంలేకపోవడంచేత 'అణపొతుల'ను, 'అణపోతులు' గానూ చదువవచ్చును. కానినేను 'అణపొతు' లన్నరూపమునేగ్రహించినాను; ఎందుకంటే 'పుష్టోలి' (ప్రోలి)కి సంబంధించిన 'అణపొతులు' - ఇది ఒకపదవిపేరులాగాకనిపిస్తున్నది. అందువల్ల ఈపదం 'ఆజ్ఞాపతులు' అన్నదానికిగాని, 'అజ్ఞప్తులు' (Executors) అన్నదానికిగాని వికృతి అయివుండవచ్చును. ఈవూహ సరియయినదే అయితే 'రేవణకాలు పుద్దణకాలు' అనేవారు ఇన్పోలికి ఆజ్ఞాపతులు - అనగా ఆపట్టణానకు సంబంధించిన వ్యవహారాలు రాజాజ్ఞననుసరించి నిర్వహించేవారయివుంటారు. పూర్వకాలంలో రాజు దానంచేసినప్పుడు ఆదానము సమలుజరపడమునకు 'అజ్ఞప్తి' ఒకడు వుండ

డము వాడుక. ఈ 'ఇనుపొ్రలి అణపాతుల' పదవికూడా 'ఆజ్ఞప్తి' పదవివంటిదే కావచ్చును.

'పెన్వాలఇశెతేనిఱ్కి' :- దానమిచ్చినది 'ఇశెతేనికి' శాసనంలో 'ఇశెతేని' పదంలోని ర బండిరగకూడా వ్రాసివున్నది. 'ఇశెతే' డన్నది ప్రతిగ్రహీతపేరు. ఈతడు 'పెన్వాల' - 'పెను', 'పెన్', - పెద్ద, 'పాల' 'బ్రాహ్మణుడు (గారు)'. 'పాల' బహువచనంలోనే శాసనాలలో తరుచుకనిపిస్తుంది. అరుదుగామాత్రము ఏకవచనవిశేష్యానికి విశేషణంగానూ కనబడడముంది. అప్పుడు అది బహువచన రూఢమయినదే. అయితే దానిని గౌరవార్ధకముగా వాడివుండాలి, లేదా ఆపదాన్ని ఏకవచన, బహువచనాలు రెంటికీ సమానంగానయినా వాడుతూవుండాలి. 'పాల' పదాన్ని మనశాసనంలో 'ఇశెతేనికి' అన్నదానికే విశేషణంగా అన్వయించుకో వలసివుంటుంది.

'తేని' :- ఇదివరకటి ఈ శాసనంలో వచ్చిన విలక్షణపదాలలో. కొంచెమించు మించుగా ఇంతటి ప్రాచీనమయినవే మరికొన్ని తెలుగుశాసనాలు చూస్తే వాటిలోనూ ఈ 'తేని' పదం కనిపిస్తుంది. కాలం గడచినకొద్దీ శాసనాలలో క్రమంగా 'తేని' కి బదులుగా 'దేని' ని వాడినారు. ఇది సంస్కృతంలోని 'యత్' అనే ప్రయోగానికి సమార్ధకంగా కనబడుతుంది. ఈవిధమయిన ప్రయోగాన్నిబట్టే శాసనం చాలాపూర్వకాలపుది అయినదీ కానిదీ నిశ్చయంగా నిర్ణయించవచ్చును; ఎందుచేతనంటే ఈప్రయోగం రానురాను వాడుకలోనుంచి జారిపోయింది.

'ఙ్జచ్చినవాన్ఱు' :- 'ఙ్జచ్చు' పదము పూర్వకాలపు తెనుగుశాసనాలు చాలా వాటిలో వస్తుంది. ఇన్నిటిలోనూ దీనిని సకర్మకక్రియగానే వాడినారు. 'చెడగొట్టు, పాడుచేయు, భంగముచేయు, ధ్వంసముచేయు' అనేఅర్థంలోనే ఇది కనబడుతుంది. 'తేనిఙ్జచ్చినవాన్ఱు' అనగా దేనిని (యేదానమును) భంగపరిచినవాడు చెడగొట్టిన వాడుఅనిఅర్థం. 'ఙ్జ' వర్ణంకాలక్రమాన్ని తెలుగులో పొందినమార్పువల్ల 'ఙ్జచ్చు' పదం 'డచ్చు' అయిన దనాలి, 'డయ్యు' అన్నది కనబడుతున్నదిగనుక. కాని 'డచ్చు' రూపం గ్రంథాలలో మృగ్యం. 'కృశించు' అన్న అర్థం వున్న 'డయ్యు' పదం అకర్మకక్రియ. 'వ్రియ్యు' కు 'వ్రిచ్చు', 'గ్రియ్యు' కు 'గ్రిచ్చు' వలెనే 'డయ్యు' కు 'డచ్చు' రూపాన్ని ప్రేరణంగా గ్రహించి 'కృశింపజేయు', 'క్షీణింపజేయు', 'తగ్గించు' అని

న్ని అర్థం చెప్పకోవచ్చుననుకుంటాను. 'వాన్ధు' కాలక్రమమున 'వాణ్డు' గా పరిణమించినది.

'పఞ్చమహాపాతకున్డుకుఁ,' :- 'పఞ్చమహాపాతకున్డ + అకుఁ' వదనిభాగము. 'వాన్ధు' అన్నది 'వాణ్డు' వలెనే 'పాతకున్డు' అన్నది 'పాతకుణ్డు' అయినది. ఇప్పటి 'అగు' ధాతువు తొలిరూపము 'అకు' అని ఈ శాసనమునుబట్టి తెలుస్తున్నది. అసలు రూపము 'అకు' గనుకనే 'అగు' అని వ్యవహారంలో వున్నక్రియకు 'కాఁ' అనే తుమున్నంతరూపం ఏర్పడింది. 'అకుఁ' - 'అగును'

'అసివైరువులికితమ్':-అసివైరువనేదిశాసనం చెక్కినవానిపేరు. 'అసివైరువు వ్రాసినది' అని అర్థం. 'లిఖితమ్' అనేసంస్కృతరూపం తప్పుగా 'లికితమ్' అని వ్రాసివున్నది.

శాసనంలోని వాక్యరచన విలక్షణంగావుందని యిదివరకే వ్రాసినాను. శాసనపాఠంవున్నదున్నట్టు అర్థంచెప్పవలెనంటే "చోళమహారాజనధీనతయందున్న ఇనుప్రోలి అణపోతులు రేవణగారు పుద్దణగారు పెద్దబ్రాహ్మణుడుగారు 'ఇశైజేనికి' ఇచ్చినపన్నస (ఇది); దేనిని (ఏదానమును) చెడగొట్టినవాడు పంచమహాపాతకుడగునో - " అని అనాలి. దీనిబట్టిచూస్తే దానమిచ్చిన క్షేత్రంవద్దనే ఇట్టిశాసనాలు వేస్తూవుండేవారేమో అనితోస్తుంది.

### పొట్లదుర్తి - మాలెపాడు శాసనము. ♦

1. స్వస్తి [।*] శ్రీ సోఙ్గమహారాజు ల్లొళన ఇనుప్రోలి
2. అణపోతులు రేవణకాలు పుద్దణకాలు ఇచ్చిన ప
3. న్నసపెన్వాల ఇశైజేనికిఁ [।*] తేని ఙచ్చినవాన్డు [ప]
4. [ఞ్చ*] మహాపా [త] కున్డకుఁ [।*]
5. అసివైరువులికితమ్ [।*]

♦ నావద్దరున్న శాసనప్రతిబింబమునుబట్టి.

# పదకర్తలు

## తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి

౧

శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారి సప్తతితమజన్మవాసరోత్సవ సందర్భములో పదకర్తలనుగురించి వ్రాయడము సమంజసముగా తోస్తున్నది. ఆధునికుల్లో పదకర్త అని ప్రథమములో పేరు పొందిన గురజాడ అప్పారావుకు ఈయన కుడిబుజముగా ఉండి ప్రోత్సహాముచేశారు. చాలామంది నవీనకవులకు రామమూర్తిగారి రచనలవల్లా ప్రసంగాలవల్లా వ్యాకరణభయము తీరిపోయింది. రామమూర్తిగారికి చాలా యిష్టమైన వాడుకభాషగాని, ప్రయోగాలుగాని పదకర్తలరచనలలో ఎక్కువగా కనపడతవి. ఇంతే కాకుండా రామమూర్తిగారి హృదయానికి ఆహ్లాదము కలిగించే జాతీయభావాలు ఈపదకర్తలగేయాలలో ఎక్కువగా ప్రతిబింబిస్తున్నవి. అందుచేత పదకర్తల ప్రశంస చేస్తున్నాను.

ఆంధ్రభాషలో పద్యాని కున్న గౌరవము పదానికి లేదు. శ్రీనాథుడు ఆరోజుల్లో పదకవిత్వాన్ని నిందించాడు. ప్రథమమునుంచీ మనభాష పండితుల చేతుల్లో పడడమువల్ల పురాణప్రబంధపాకాలు గట్టిపడ్డవి. వీరశైవము ప్రబలినప్పుడు జానతెనుగులో పద్యాలూ పాటలూ బయలు దేరినవి; శైవమతవిజృంభణము తగ్గగానే అవీ మూలపడ్డవి. జనసామాన్యము మాత్రము జానతెనుగులోనే ఉన్న పాటలూ, కీర్తనలూ, పదాలూ, రగడలూ ఆదరిస్తూ వచ్చింది. మధ్యమధ్య ప్రబంధకర్తలుకూడా రమణీయత కనబడడముచేత రగడలను తమపుస్తకాలలో కొద్దిగా చేర్చుకొన్నారు. పండితాదరము లేకపోయినా ప్రజల అండవల్ల పాటలూ మొదలైనవి వృద్ధిపొందినవి. కాలక్రమేణా యక్షగానాలు బయలుదేరినవి.

త్యాగరాజకృతులకు, రామదాసుకీర్తనలకు, క్షేత్రయ్యపదాలకు, అధ్యాత్మరామాయణకీర్తనలకు మాత్రము కొంత ఆదరము ఏర్పడింది. పండితుల ప్రాబల్యము తగ్గినకొద్దీ పదకవిత్వము ప్రాభవము చెందింది.

ఆంధ్రభాషలో జరిగిన అన్యాయము తక్కినభాషలలో పదాలకు ప్రాప్తించలేదు. సంస్కృతములో భజగోవిందానికీ అష్టపదులకూ కృష్ణలీలాతరంగిణికీ అఖండ వైభవ మున్నది. హిందీలో సూరపదావలికీ, కబీరు కీర్తనలకూ కావలసినంత మర్యాద. వంగభాషలో పదకర్తలను మహాకవులుగా ఎంచుతారు. విద్యాపతి, చండీదాసు, గోవిందదాసు, రామప్రసాదు మొదలైనవారిపదాలు ఆదరానురాగాలతో పాడుతారు. మహారాష్ట్రములో తుకారాం ప్రభృతుల అభంగాదులను అత్యంతగౌరవముతో ప్రజలు పాడుతూ వుంటారు. ప్రపంచవిఖ్యాతి పొందిన రవీంద్రకవీంద్రుని రచనలలో ముప్పాతిక పదాలే.

పద్యముకంటె పదమే ముందుపుట్టిందని సాహిత్యమీమాంసకుల ఆశయము. నాగరకత పారంభంలో నాట్యము పుట్టింది. మనుషులు పగలంతా కష్టపడి రాత్రి వలు గురూ ఒకచోట ఉల్లాసముగా కాలముగడిపేటప్పుడు నాట్యముప్రారంభమవుతుంది. క్రమేణా కూనిరాగము బయలుదేరుతుంది. ఆ తర్వాత మనస్సులో మాటబయటికి అనేటప్పుడు లయ యేర్పడుతుంది. ఆశబ్దజాలమే పాట అవుతుంది.

కొద్దిమంది సాహిత్యతత్వవేత్తలమతము మరొకవిధముగా కనబడుతుంది. మనుషులు పనిపాటలు చేసేటప్పుడు కష్టము కనబడకుండా ఉండడము కోసము అప్రయత్నముగా కూనిరాగాలు తియ్యడమూ, ఏమో మాటలు లయతో అనడమూ సంభవిస్తుంది. పడవలాగేవాళ్ళూ, కళ్ళాలదగ్గర పనిచేసేవాళ్ళూ, బండ్లులాగేవాళ్ళూ, వడ్లుదంపే వాళ్ళూ, పిండివిసిరేవాళ్ళూ పాటలుపాడడము వింటూనే వున్నాము. ఆవిధముగా పాటలు ఏర్పడుతవి. ఏదిసిద్ధాంతమయినప్పటికీ, కవిత్వము కష్టనివారణకో, ఉల్లాసముకో ఉదయమవుతుంది.

ఛందోబద్ధమై ఉన్నా, వాల్మీకిరామాయణాన్ని కుశలవులు పాటవలె పాడేవారట. ప్రపంచములోకల్లా ప్రాచీనమని పరిగణించే వేదసంహితలు వివిధ ఛందస్సుల్లో ఉన్నప్పటికీ పాటలే అనవలసి వస్తుంది. స్వరము లేకుండా మామూలు పద్యాలలాగా వాటిని చదివితే పాపము వస్తుందని పూర్వులు భయపెట్టినారు. పాపము పట్టుకోకపోయినా స్వరహీనముగా చదివితే శ్రవణసౌఖ్యము లేనే లేదు. భగవద్గీతను విద్వాంసులు ఊరికే చదువుతారు. కొద్దిమంది పాడడము నాకు తెలుసును.

గీతా అనేనామము వల్లనే అది గేయగ్రంథమని స్పష్టమవుతున్నప్పటికీ అనేకులు గమనించకుండా ఉన్నారు.

పద్యముకంటె పదమే చప్పున ఆహ్లాదము కలిగిస్తుంది. పద్యములో బందోబస్తు ఎక్కువ ఉండడముచేతనూ, ప్రౌఢోక్తులవల్లనూ కవిసమయాదులవల్లనూ కాస్తకష్ట మనిపిస్తుంది. పాట పామరులకుకూడా ప్రమోదము కలిగిస్తుంది. జానపదసాహిత్యమనే జాతీయవాఙ్మయములో ఊర్మిళాదేవి నిద్ర, కుశలవకుచ్చలకథ, దేశింగుమహారాజు చరిత్ర, బొబ్బిలి పాట మొదలైనవిఎంతో హృదయంగమముగా ఉంటవి. పాటలలో పాకము ఇంచు మించుగా ద్రాక్షాపాకమే.

౨

ఆధునికులలో పద్యాలతోపాటు పదాలు చెప్పిన విద్యాధికు లున్నారు.అయితే పదకర్తలుగా పేరుపడ్డవారు గురజాడ అప్పారావు, బసవరాజు అప్పారావు, చింతా దీక్షితులు, అడవి బాపిరాజు, నండూరి సుబ్బారావు, కవికొండల వెంకటరావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, తురగా వెంకటరామయ్య ప్రభృతులు; వీరంతా ఇంగ్లీషు చదువుకొన్నవారు. ప్రౌఢోక్తి బాగా పట్టుపడ్డవాళ్ళయినప్పటికీ, సరళమైన ఉక్తే స్వాభావిక మనీ, సరస మనీ నమ్మినవారు కావడముచేత పదకర్తలైనారు. పద్యములో చెపితే ప్రమోదము చప్పున కలగని విషయాలు పదములో చెపితే బాగుంటుందని అదే అవలంబించి ఉండవచ్చును. వీరే కాకుండా ఇతరకవులు కొంతమందికూడా కొద్దో గొప్పో పదాలు చెప్పారు. విద్యావంతులై కీర్తి భాజనులైన కవిశ్రేష్ఠులు పదకర్తలు కావడముచేత పదానికి ప్రకృతకాలములో గౌరవము వచ్చింది. ఆధునిక కవిత్వాన్ని అవహేళనచేసి "యెంకిపాట" లను వెక్కిరించే దుగ్గిరాల గోపాలకృష్ణయ్య వంటివాడు కూడా పదకర్తలమీద పరిమితాదరము చూపుతూ వుండేవాడు.

పల్లవి, అనుపల్లవి మొదలైన కట్టుదిట్టాలు లేకపోయినా గేయగుణము వుంటే చాలుననే సామాన్యలక్షణము మనస్సులో ఉంచుకొని గేయాలుచెప్పిన "నవీన" కవులను పదకర్త లంటున్నాను. తుమ్మెదపదాలూ, చిలుకపాటివారి వచనాలూ, రగడలూ పాడినట్టే కొన్ని గేయాలు పాడవచ్చును. కొన్నిటికి "సాహిత్యము" కుదిర్చి పాడవచ్చును. లయమాత్రము ప్రధానము. బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు పద్యాలకు రాగతాళాలు ఏర్పరిచి పాడతారు. పౌరాణికులు చూర్ణికలూ దండకాలూ పాడతారు. కవికొండల వెంకటరావు వచనమే పాటలాగ పాడుతాడు.

కొంతమంది పదాలు దిఙ్మాత్రముగా ఉదహరిస్తున్నాను.

* రాగిణి *

చూడ జూడ నీరూపము
 సుందర మై యొప్పు దేవ !
సొక్కి సొక్కి నీ వలపున
 సోలి పరవశత కందును.
వినగ వినగ నీనామము
 వీనుల విందౌను నాథ !
చనగ చనగ నీజాడల
 సౌఖ్యము మునుముందె తోచు !
తలప తలప నీలీలలు
 తనువు పులకరించు స్వామి !
వలచి వలచి దేవ, నిన్ను
 వంత లెల్ల మరచిపోతి !

* నాట్యసుందరి *

ఆడవె ఆడవె అన్నుల మిన్నా,
ఆడవె లేనడు మల్లలనార్ణ !
ఆడెడు నీనడు మందము గాంచిన
అల్లాడవె ప్రేమను లోకంబుల్ ? ఆడవె
పాడవె పాడవె భామామణిరో
పాటలాధరము బాగులు గుల్కగ. ఆడవె
వలుపుజిల్కు నీపాటలు విన్నగ
పరవశగాదే ప్రకృతియెల్లగ ఆడవె

బసవరాజు అప్పారావు

* అభిసారిక *

గాలియడుగుల నెవరికోసరము
 ఓమోహాశీలా,
కదలి వచ్చితి వీ నిశీథమున ?
కాలియందెలు ఘల్లుమనుననియొ
 ఓవలపురాణీ,
కేలగైకొని మెల్లన నడచెదవు
పులుగుతుటుము లటాన కీచనుచు
 అరగూర్కి గూళుల
బలుక, వెరపున దెసలు గాంచెదవు
నిలిచి యే మని యాలకించెదవు,
 నీయడుగు నడికే
ఉలికిపడి యెవరనుచు మరలెదవు !
తెల్లవెన్నెల నీ దుకూలంబు
 మైపూతనిగ్గులు
తెలియరావని యూహసల్పెదవు.
నీవు నడచెడి బాట యెల్లెడల
 వ్యాపించు గంధపు
దావు లెట్టులు కప్పిపుచ్చెదవు
 ఓ ముద్దరాలా
నీ విహారము బయలు పరచెదవు.

దువ్వూరి రామిరెడ్డి

* నమిలీ మింగిన నా యెంకి *

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి
యెంకి నావం కింక రాదోయి రాదోయి !
 మెల్లో పూసలపేరు
 తల్లో పూవులసేరు
 కళ్ళైత్తి తేసాలు
 కనకాబిసేకాలు ! యెంకి...
 సెక్కిట సిన్నీ మచ్చ
 సెపితే సాలదు లచ్చ !

వొక్క నవ్వే యేలు
వొజ్జిర వొయిడూరాలు ! యెంకి...
పదమూ పాడిం దంటె
పాపాలు పోవాల !
కతలూ సెప్పిం దంటె
కలకాల ముండాల ! యెంకి...
తోటంతా సీకట్లు !
దొడ్డి సీకటి మయము !
కూటి కెళితే గుండె
గుబగుబమంటా బయిమె ! యెంకి...
రాసొరింటికైన
రంగు తెచ్చే పిల్ల !
నాసొమ్ము - నాగుండె
నమిలి మింగిన పిల్ల !
యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి !

నండూరి సుబ్బారావు

* గొల్ల చెల్లాయి కూతురు *

గొల్ల చెల్లాయి కూతురు
కడు చక్కం దని చూతురు !
దాని కళ్ళు నీలిగుళ్ళు
దాని పళ్ళు మొగలి ముళ్ళు
దాన్ని పలకరిస్తే వళ్ళు
మోహానా గగురు పుళ్ళు ! గొల్ల...
వెండి వడ్డాణం మొలకు
సన్నాగాజులు చేతులకు,
మెడను వేసిం దీ తీరు
పిల్ల కాసూలా పేరు ! గొల్ల...

కల్లు కన్నా రుసి కలుగు
దాని పెదిమె కెంపు వెలుగు
దాని చేతి నీలు కొంటే
సొర్గా సౌఖ్య మేమి టంటే! గొల్ల...
డబ్బు లిస్తూ వున్న వేళ
దిట్టరి వా డైన తాళ
లేక రాగిబిళ్ళ బదులు
వెండిడబ్బు లిచ్చి కదులు ! గొల్ల...

అడవి బాపిరాజు

* జీవనగీతి *

జీవన మొక సన్నజాజ
చిన్నమొగ్గ కదర !
దినదినమును జ్ఞాన మనెడు
తెలి రేకులు విడుచు !
జీవన మొకటిక్కైతోచు
చిట్టిమబ్బు కదర !
చిరు నగవను ఇంద్రధనసు
సింగారం బొసగు;
జీవన మొక తెరచాపను
బోవునావ కదర !
మోక్షమనెడు పారంబును
పొందజేయు తుదకు ;
మృదు మధురము దాని తేనె
సదమలంబు దానిచినుకు
వదలకుండు దాని గాలి
స్వచ్ఛందము జీవనంబు
సౌఖ్యదంబు జీవనంబు
సాధకంబు జీవనంబు
జీవనమది యేలా యని
చింత జేయబోకు.

కవికొండల వెంకటరావు

* భారతజనని *

ఓ భారతజననీ
విహాయసవీథివిహారిణీ ఓ॥
స్వతంత్రకిరణ స్వర్ణారుణ
కంకణకటక కలాపినీ !
భవదాశ్రిత వినయహృదయ
ప్రిమలానురాగ మేమొ.
ఉదయాచల సానూజ్జ్వల
పదపాటల తేజమేమొ. ఓ॥
తావకసేవకజనతా
వికసిత చిత్తామోదమొ.
ప్రభాతానిలశీతల
పక్షాంచల పరిమళమో ! ఓ॥
కవిగాయక వైతాళిక
కంఠకమ్రగాన మేమొ.
దిశదిశాంత నవ శకుంత
దివ్యగీతికామృతమో. ఓ॥
ఇదె స్వతంత్ర భరతశాంత
సమయ సమర శుభోదయమొ,
ఇదె జగతీ కళ్యాణో
త్సవతాండవ కలకలమో !
ఓ భారతజననీ.

దేవులపల్లి కృష్ణశాస్త్రి

*

ఓ మానవోత్తమా
ఓ వీరమూర్ధన్య
ఓ యమృతభాసమా
నోన్నతప్రేమసామ్రాజ్యైక చక్రవర్తి
స్నేహశీలి !
నీహృదంతికములో
నిరుపమానాఖాత
రత్నాకరామూల్య
రాగసంపద మెరయు
నీయాశయమ్ములో
నిర్మలోత్తుంగ ది
వ్యాకాశసంకాశ
భాగ్యరాసులు మెరయు !
ఈయశ్రుఝరులతో
ఇరులతో రొదలతో
సొదలతో ఈహాస
మృదులవాసనలతో
విసముతో సిగ్గుతో
కొసరు తేనియలతో
ఈపాట బ్రతుకు నీ
కేపాటిదోయి, నా
నచ్చెలీ
నచ్చెలీ !

దేవులపల్లి కృష్ణశాస్త్రి

* ఉషస్సు - సంధ్య *

ప్రొద్దెక్కకయ చిట్టి
బొట్టుపెట్టెడు బాల
మాయ మర్మము లేని
మంచు చల్లనిచూపు
కొసలం దుషఃకన్య కోర చూచింది
పసలం దుషఃకన్య పారుపోయింది
కొడుకు కోడండ్ర మ్రొ
క్కులు గ్రహించెడు చాన
మాతృమూర్తి కళాంత
మధువు లూరెడు కంటి
కొసల సంధ్యాదేవి కోరగించింది
పసల సంధ్యాదేవి భక్తిమోసింది

విశ్వనాథ సత్యనారాయణ

* అగ్ని కణాలు *

ఈమాయలోకమే
ఈశ్వరుని రాజ్యమా
మాయవాదీ కవీ
మాట బొంకోయి
కడుపుమంటల కింత
గంజియైనా లేని
చిరుత బిడ్డలగోల
భరియింపగా లేక
ఉరి పోసుకో నున్న
నిరుపేదయిల్లాలి
గుండెలోపలి యగ్ని
కుండమ్ము నీవీణ
చల్లార్చునా ప్రకృతి
చల్లార్చునా ? కవీ ! ఈమాయ...
కర్త లేనేలేని
కలుషప్రపంచమ్ము
ప్రణయ రాజ్యమ్ముగా
భ్రమసి పాడెద వేల ?
కరకుగత్తుల దాల్చు
నరహంతకుల యింటి
దానినై భూదేవి
పడియుండె నీవేళ
కష్టజీవుల మేని
యుష్ణరక్తము బీల్చు
ధనికునకు దైవమే
దాసు డయ్యెను నేడు ఈమాయ...

తురగా వెంకటరామయ్య

* విరహిణి *

ఈ పలుగు పాటలే
ఈ గాలి తేటలే
విరిసికొని పోవు నీ
విరజాజినవ్వులే
నాయెడద దహియించు
నను వేదురుల ముంచు
నెచ్చెలీ నెచ్చెలీ
నేనెటుల జీవింతు !
ఈయగమ్య పథాల
నిటులె రోదింతునా ?
ఎడలేక మ్రోగు నా
యెద నాపుకొందునా ?
అతని అడుగులజాడ
కై పరువు లిడుదునా ?
అంధకారము భావి
కై నిరీక్షింతునా ?
ఈ తలపు బరువుతో
ఎద కాల్చు కోర్కెతో
ఈ నిరాశైక ప్ర
వాసజీవితముతో
ఈ భాద్రపదరాను
లే రీతి వేగింతు !
నెచ్చెలీ నెచ్చెలీ !
నే నెటులు జీవింతు !

పురిపండా అప్పలస్వామి

* స్వప్నము *

నిదుర పోయే మొదట
బెదరుచూపుల గోసి
నినదించు జలదాల
నీలిమనే లేపి
అడుగుజాడల మార్ద
వానవమె వాసింప

మాయమైనావె నా
మధురస్వప్నంబా !
మునిచీకటుల తాడై
పెనచి యర్పించు నా
శర్వరీ గర్భాన
సలుపరించిన వెలుగ
మోగని గీతాల
మూగ పోయగంబ మాయ!
కూలి పోయే యెడద
కూనిరాగము తీయ
అడుగంటు ఆశయమె
యగరు ధూపము వేయ
నీడలో వెలుగునై
నిలువున పులకించి మాయ!
జీవితమె పుష్పించి
జిలుగు రేకులు విరియ
చెలియ కను మోడ్పునై
శర్వరీ శాంతినై
కదలు చీకటి యలల
శిథిలంపు నురగనై
మాయమైనావె నా
మధుర స్వప్నంబా !

శ్రీరంగం నారాయణబాబు

* గీతిక *

కెంజాయ కిరీటముగా
సంజ జగతి పాలించెడు
ఒరులే లేనిది ప్రశాంత
సరస్సముజ్జ్వలకీరము.
నాలుగు దిక్కుల గాలులు
బాలురవలె ఆటలాడు,
జిలిబిలి తేటల పాటల
వలె తరగలు మర్మ్మరించు.
ఈ సంజ పరిమళించు
ఇంచుక నీవే చాలును
నీలో నీవే గీతిక
లాలాపింపుము హాయిగ.
గాలులె విను లే, ఈ కెర
టాలును విను లే, చీకటి
లో నీపాట రగుల్కొన
తారలు జన్మించి వినును లే !

శ్రీరంగం శ్రీనివాసరావు

*

వెన్నెలలో బయలులో వెలుగు జాబిల్లినై
యెపుడు నిను బిలుచుకోన !
నెచ్చెలీ !
యెపుడు నిన్నాశించనే !
ముసిముసినవ్వు విరికొసల సందిళ్ళలో
సొక్కి సోలితిని నేను
కాంతినే
నొక్కి ముద్దాడినాను :
తలిరుజొంపముల లోపల మంచుచినుకునై
యల్లల్ల నాడినాను
మెల్లగా
నటు దొర్లి కలసినాను :
నాయెడుగు తోవనే నాటె నెన్నో మల్లె
లెలుగెత్తి పాడుకొనెను
పికములు
పిలిచె పాటల లోకము.

శ్రీరామచంద్ర అప్పారాయ బహద్దరు

*

పెందలకడ రారా !
సుందరుడా! సురపొన్న నీడలో
చందురునకు చాటుగ నిలుచుందును
పెందలకడ రారా !
సందెచీకటుల జడలో రిక్కల
జాజిమొగ్గలను తురుమకమునుపే
పెందలకడ రారా !
విందు గుడువ బరుగిడు విహంగపతి
వెనుక వెనుకగా వేచియుండెదను
పెందలకడ రారా !
పందిరిపై సంపెగలు కోసి నీ
పై జల్లుటకయి భద్రపరిచెదను
పెందలకడ రారా !
సుందరుడా ! సురపొన్న నీడలో
చందురునకు చాటుగ నిలుచుందును
పెందలకడ రారా !

కుందుర్తి నరసింహారావు

*

ఈ వేడినిట్టూర్పు
లెందాక మసలునో
ఈవిశ్వ మవ్వాని
నెందాక తొలుచునో
అంతవరకే నేన
నంత సామ్రాజ్యంపు
టానందరేఖలో
హరియించి పోగలను.
పోనిచో - విశ్వవీ
ణానిస్వనంబులో
నెనసి నానిట్టూర్పు
లెగయించి పొగలించి
మసృణసూనరసార్ద్ర
మాధురీలహరితో
ప్రాణవాయువుల వి
లీన మొనరించెదను.
నా కేల కాకున్న
ఈలోకపుం బాధ !

కామరపోలు నాగభూషణరావు

* గజ్జలందెల పిల్ల *

గజ్జెలందెల బాల రావే
రవ్వలై రంగైన పిల్లనగ నీవే. పల్లవి.
మేఘాల వన్నెగల దేహమే నీది
మెరుపుగల తళుకు మను
కళ్లు కలదానివి. అనుపల్లవి.
నామనసు మబ్బులో
మేఘమై కమ్మావు
నామనసు మెరుపులో
తీగవై పాకావు. నివృత్తి.
మబ్బులో మేఘాలై
మేఘాల నీడలై
మెరుపులో తీగలై
తీగలో తళుకులై
తెల్లతెల్ల వెలుగులై. ప్రవృత్తి.
గాలిలో వైకుంఠపాళిలో
నెత్తావి లాలిలో
పుష్పాలచాలులో
పుష్పాళ్ళ కేళిలో
మాధుర్యమున జారు
పైమంచుచినుకులై

పూనీరు సోనలై
కలకండవానలై
పీయూషవర్షములై
సెలయేండ్ల జంటలై
లాల్ల లల్ల లల్లల్ల
లాల్ల లల్ల లాలాల్లలల్లలా
పరుగెత్తుతూ పైకి
నురుగెత్తుతూ ఏక
జీవమై సాగరక్షీరమై
క్షీరసాగరశయన
మూర్తులై వాసంత
జీవులై చిరునవ్వు
పూతలై యుందాము గజ్జె...
చెంగల్వ నూగారు
నునుపులే చెక్కిళ్ళు!
సంజ కెంజాయలౌ
మందహాసాలు అనుపల్లవి
నామనస్సరసులో
కలువవై వెలిశావు
నాహృదయ సంజలో
కెంజాయ వైనావు నివృత్తి
కొలనులో కలువ లై
కలువల్లకన్ను లై

సంజలో కిరణాలై
కిరణాల చినుకు లై
నననన్న మిణుకులై. ప్రవృత్తి
కాటిలో శ్రీశైలవాటిలో
కైలాస పీటిలో
రాత్రిలో మిళితమై
ధూళిలో దహనమై
దేదీప్యమానమై
దివ్యమా జ్యోతిలో
జ్యోతులే పెద్దవై
కెంపారు జ్వాలలై
జ్వాలలే పైగమ్మి
వజ్రాల వెలుగులై
ఝుంఢకిట చిటపటల కదములతో
నృత్యాలు దొక్కుతూ
మృత్యువును మింగుతూ
ప్రణయశంఖాల గర్భమా
నోంకారాల నూదర్థ
నారీశ్వరుల యద్వైత మాదాము
గజ్జెలందెల బాల రావే ...

శిష్ట్లా ఉమామహేశ.

## 3

గురజాడ అప్పారావు రచించిన "నీలగిరిపాటలు" "పూర్ణమ్మకథ" మొదలైనవి ఆధునిక కవుల పదాలలో మొదటివి. తర్వాత బసవరాజు అప్పారావు చెప్పిన కీర్తనలవల్ల పదకవిత్వానికి ప్రతిష్ఠ హెచ్చింది. ఇతను శ్రావ్యకంఠంతో పాటలు పాడుతూవుంటే ఎంతో హాయిగా వుండేది. బిలహరి ఇతనికి అభిమానరాగము. ప్రేమ, స్వేచ్ఛ, భక్తి, దేశభక్తి - వీటిని గురించినపాటలు ఎక్కువగా చేశాడు. చింతా దీక్షితులు గేయాలలో చిన్నపిల్లల భావాలు, ప్రవర్తన, ఇష్టానిష్టాలు మొదలైనవి

ముచ్చటగా ప్రతిబింబిస్తవి. దువ్వూరి రామిరెడ్డి ప్రేమ, వైరాగ్యము, సంసారమును గురించిపాడినాడు. అడవి బాపిరాజు పదాలలో గ్రామీణుల జీవితము, కష్టసుఖాలు కనిపిస్తవి. నండూరి సుబ్బారావు "యెంకిపాటలు" విశిష్టమైనవి. యెంకి అనేపాత్రను సృష్టించడమే కాకుండా సుబ్బారావు పదానికి పట్టుగొమ్మ అయినాడు. పదకవిత్వములో యుగాంతరము వచ్చింది ఇతనివల్లనే. ఎన్ని "గాలిదుమారాలు" రేగినా యెంకి పాటలకు ఏమీ చలనము లేదు. మధురకంఠముతో ఇతనుపాడుతుండగా విన్నవాళ్ళంతా ముగ్ధులయిపోతారు. సంగీతవిద్వాంసులైన పారుపల్లి రామకృష్ణయ్యగారు స్వరలిపి కల్పించినందువల్ల యెంకిపాటలు "కృతులు"గా పరిణమించినవి. కవికొండల వెంకటరావుపాటలో ఒకటి ఉన్నది, ఒకటి లేదు అనడానికి వీలులేదు. సమస్తమూ కనబడుతుంది. మానవభావాలే కాకుండా పశు, పక్షి, నదీ, పర్వత, సముద్రసందర్భాలు కనబడతవి. దేవులపల్లి కృష్ణశాస్త్రి గాయకుడు, శిల్పి, కవి కావడముచేత ఇతనిపాటలు సానబెట్టిన వజ్రాలవలె ఉంటవి; దుఃఖము, భక్తి, ప్రేమ, దయ, దేశభక్తి మొదలైన విషయాల్లో ప్రకాశిస్తవి. "మహతి" అనేపేరుగల ఇతని పదసంగ్రహము గొప్పది. విశ్వనాథ సత్యనారాయణ పాటకుడు. ఇతని "కిన్నరసానిపాటలు" చాలా జనరంజకమైనవి. వీటిల్లో ప్రకృతిశోభ యెక్కువగా ప్రతిఫలిస్తుంది. శిష్లా ఉమామహేశ ప్రతిభావంతుడు. సంగీతజ్ఞానమున్నవాడు. పాటలలో కొత్త అంశాలు కల్పిస్తున్నాడు; ఆబ్రహ్మస్తంబపర్యంతమూ రచనలలో ఇముడ్చుతున్నాడు. సర్వతోముఖముగా పరుగెత్తుతున్న ఇతని బుద్ధికి లక్ష్యముకాని విషయము లేదు. ఇతని పదసముచ్చయము గొప్పది.

కవులు నవీనమార్గాలు కల్పించుకొని గీతికావ్యాలు, రూపకాలు, గీతాంజలులు రచించి, మన సాహిత్యానికి సంపదలు సమకూర్చుతారని నా విశ్వాసము.

# తెనుగుభాషలోని 'పదములు'

అడిదము రామారావు

పదమని పేరుతో ద్విపదకావ్యమువంటి కొన్నిగ్రంథములు ముఖ్యముగా శూద్ర జనముచే నిత్యము పాడబడుచు జనరంజకమై వెలయుచున్నవి. వాటిలో ౧. గంగా వివాహము ౨. కుసలాయకము 3. బాణాసురయుద్ధము అనునవి విశేషముగా జనాదరమును బొంది పేరుగాంచినవి. ఇవి కేవలము జానపదులకై వ్రాయబడినను, వీటియందు రచనావిషయమున పెక్కు లోపము లున్నను, కవిత్వమని చెప్పదగిన గుణవిశేషము లిందు, లేకపోలేదు. నిశ్చయముగ కవిప్రవరులనుగూడ దలయూచ జేయు మనోహరము లగు రచనలు నచ్చటచ్చట గాననగును. మీాద జెప్పిన గ్రంథములలో నొకటి యగు "గంగావివాహము" ను రచించినది బట్టలనేతయే వృత్తిగా గల సాలెకులస్థుడగు పసకాడ సన్యాసి యనునాతడు. విశాఖపట్టణమండలములోని మరువాడ గ్రామ మీాతని కాపురము. ఈతడు 18 వ॥ శతాబ్దములో నున్నవాడు. ఈతడే యీపదకవిత్వమునకు ప్రథమాచార్యుడుగ గనబడుచున్నాడు. తనకవితను పదముగా సాగించినందులకు గారణ మిట్లు కృతిపతికి విన్నవించుకొనుచున్నాడు:-

"సరసపద్యంబుల సత్కవుల్ నుతియింతు
పదముగా నేఁ జెప్పి ప్రార్థింతు నిన్ను
జగతిలోపల నరస్తవము సేయక నేను
నీ కంకితముఁజేతు నాకవిత్వంబు.
సారంగధరచరిత, శతకంఠయుద్ధంబు
పరగ నీకృతిఁజేసి పాట పాడితిని
కడుభక్తితో నిపుడు గంగావివాహంబు
పదముగా నేఁ గూర్చి పాట పాడెదను.

ఈతడు తన కవితచే విద్వల్లోకమును మెప్పింతునని కార్యమునకు బూనుకొన్నవాడు కాడు. కేవలము జానపదుల యుపయోగముకొఱకు శ్రీరామాంకితముగా పాటలుపాడి తరింపనెంచిన యల్పసంతోషి. ఆకారణముచేతనే యిందు కొన్నికొన్ని

పట్టులయందు ముద్దులొలుకు మాటలు గలచక్కని రచనలు గలవు. ఈ క్రింది పం
క్తులను జూచెదరు గాక:-

౧. రాజాధిరాజు నారాయణాంశుండు
సింహాసనమునందు రంజిల్లు ప్రభువు
మండలాధీశుండు మార్తాండతేజుండు
పరగ విజయపురీపరిపాలకుండు
భాసిల్లు శ్రీపూసపాటివంశాంభోధి
రాకావిహారకైరవబాంధవుండు
రాణించు శ్రీవిజయరామగజపతిమహారాజు.

౨. ఇంతి చక్కదనంబు నెంచ శక్యము గాదు
పదునారువన్నెల బంగారుతీఁగె
పతిని దైవంబుగా భావించు నేవేళ
పేరపతివ్రత విఖ్యాతచరిత!

... ... ...

3. గంగవైతే నీవు గగనమందుండక
మగనిశిర మెక్కుటా తగునటే గంగా?
చాపలమ్మ నీవు జాలారిదానావు
నిన్నెట్లు వలచెనే నీలకంఠుండు?
కుల మెంచితే లేదు గుణ మెంచి తెచ్చేను
జాతు లెన్నఁగబోకు సవతిగౌరవ్వ!
జాతితక్కువదాన జాలారి నాసవతి
నీతిమాలినదాన నెరజాణ గంగ!
ఎంతపని వచ్చెనే యింతలోనే నీకు
జాతితక్కువ లెంచ చెల్లదే గౌరవ్వ,
జాతేమి కారణము నీతె కారణము.

ఇంక నీ సన్యాసికవికవిత ననుకరించుచు నీ విశాఖపట్టణమండలములోనివాడే యగు నొక క్షత్రియకవి నీప్పూరి రామచంద్రరాజు "కుసలాయకము" వ్రాసెను. ఇందలి కవిత ఏవిధముననుగంగావివాహమునకు దీటు రాజాలదు. కథాగౌరవమే దీని జన రంజకత్వమునకు కారణముగా నోపును. కవితాధోరణి దెలియుటకునై కొన్ని చరణ క్కు లిందు జూపుచున్నాను:—

౧. అలనాడు రావణుం డా సీత గొనిపోయి
లంకలో నిడుకొన శంక లేకుండ
తిరిగి తెచ్చియు సీతఁ బురములో నుంచుకొని
మళ్లి యేలుచుండె మహారాజు గనుక
పెదచెరువునీళ్లకును పెద్దింటినడవడికి
తప్పులే దనుమాట ధరణిలో గలదు.

... ... ...

ఆలాగునే నేను నపకీర్తి నొందంగ
వెఱ్ఱిరాముడ గాను వినరయ్య మీరు.

౨. మావంశజునికాంత మరి యిటు దుఃఖింప
చూడలే ననుమాడ్కి సూర్యుడును గ్రుంకె;
కడుదుఃఖమున సీత కన్ను లెఱ్ఱగునట్లు
సాంధ్యరాగము గప్పె జగతిలోపలను;
సీత దుఃఖము నొంది చిన్నబోయినరీతి
పదిదిక్కులును గప్పె నపుడు చీకటులు.

3. కష్టసుఖములు రెండు కాలములు గలవు;
కడవెల్ల నొకలాగు గడువ దెవ్వరికైన
కానున్న పను లన్ని కాకపో వమ్మా
యెంతవారలకైన హెచ్చుతగ్గులు గలవు
మదిలోన చింతింప మానుమా తల్లి.

ఇంక మూడవదియగు 'బాణాసురయుద్ధము' పండితప్రవరుడును, కవియు, నగు నడిమింటి రామయోగిశాస్త్రి రచియించెను. ఈతడు శ్రీవిజయనగరప్రభువుల

యాస్థానపండితుడు. 19వ శతాబ్దారంభమున నున్నవాడు. ఉభయభాషలయందు గొప్పవైదుష్యము గలవాడు. కావుననే యీపదము లలితమగుశైలితో నొప్పి యెంతయు మనోహరముగ నున్నది. కవి గొప్పపండితు డగుటచేతను, ప్రబంధయుగ ప్రభావమునకు లోగినవాడగుటచేతను, ఈపదమునందుగూడ ప్రబంధరచనారీతులను జొనిపి కవిత సాగించినాడు. ఈకవిప్రవరుని కవితామాధురి దెలియుటకు నీ దిగువపంక్తులను జూపుచున్నాడను :—

౧. వారితోడను గూడి బాణాసురుడు తాను
ఆవెండికొండ యొయ్యారంబు జూచె.
పాలుపైనవజ్రాలు పోగుచేసినయట్లు
చందమామలకోట్లు సరివెలిగినట్లు
చుక్కలన్నియు గూడి యొక్కచో యున్నట్లు
పాలసంద్రముగట్టి పడవేసినట్లు
ఆణిముత్యపుకోవ లల్లి వేసినయట్లు
పాలసున్నముగచ్చు పారించునట్లు
ఆకొండ గనుపించె నతిసంభ్రమంబుగను.

౨. చెప్ప నలవికానిచీకటులు ముంచెను
మొల్లమొగ్గలలాగు మొలచె తారకలు
జారచోరుల్లకెల్ల జాల సంతసమాయె

... ... ...

౩. అంతింతయనరాని వింతయా కల గాంచి
గుండె ఝల్లని మేలుకొనియె సంతటను
చేతబడ్డఫలంబు చెదిరిపోయినలాగు
నెలత గొబ్బున నపుడు నిదుర మేల్కానెను

... ... ...

౪. కల్లగా దీమాట గట్టిగా నీమోము
వలపువాసన వేసె వనిత వింతగను

... ... ... ...

గుండె ఝల్లన వాని నిండారగా జూచి
తల యూచి సిగ్గుచే తల వంచుకొనెను
కలలోన నాతోడ కలసి భంగించిన
దుండగీ డీతండె దొరకినా డమ్మా
కొమ్మరో వీడె నాకొల్లలాడినవాడు
వీడె నాతల్లిరో వెదకి వ్రాసితివి
కల్ల మొగమునగాని కలగ నెవ్వరికైన
చేత కల్లున్నవే చెలియరో నీకు
చూడ నప్పటికైన శుద్ధముగ వ్రాసితివి
ఎంత నేర్పరివమ్మ వింతరో నీవు.

పాఠకులహృదయముల నాకర్షించి వారితలల నూపజేయు కవితాగుణ మీపదములయం దుంటచేతనే యివి జనరంజకములై యధికసంఖ్యాకులగు శూద్రజనములచే బఠింపబడుచు రామాయణాది గ్రంథములవలె పాఠకులభక్తి గౌరవములకు పాత్రములై యలరారుచున్నవని తెలుపుట కెంతయు సంతోషముగా నున్నది.

# హాస్యము

వేదుల సత్యనారాయణశాస్త్రి

---

హాసము ఆరోగ్యానికి లక్షణము. దుఃఖభూయిష్ఠమైన ప్రపంచములో నవ్వు అనేదే లేకుంటే విసుగూ అసహ్యమూ పుట్టి మానవజీవితము దుర్భర మైపోతుంది. అందువల్ల నిత్యానుభవములోకూడా ప్రతివాడూ ఏదో ఒకవిధముగా నవ్వడమునకు యత్నిస్తాడు. చమత్కారము స్ఫురించేటప్పుడుకూడా నవ్వలేనివాడు హృదయము లేనివాడో జబ్బువాడో అయి ఉంటాడు. అటువంటివాణ్ణి చూచి మనము జాలి పడతాము. కొందరు నవ్వడము దర్జాకు లోపమని ఎంచుకొంటారు. తెలివితక్కువను కప్పిపుచ్చుకోవడమునకు కొందరు నవ్వు తెచ్చిపెట్టుకొంటారు. వాళ్ళను చూస్తే మనకు నవ్వు వస్తుంది.

'నవ్వు నాలుగందాల నష్టము' అనేమాట మనలో ఉన్నది. తమదంతా ఒప్పేననే గట్టినమ్మకము ఉన్నవాళ్ళు కల్పించినమాటే కాని అది చమత్కారవిషయము కాదు. నవ్వగలవాడు ఒకవిధముగా ధీరుడని చెప్పవచ్చు. వాడు తన నవ్వుతో, కష్టాన్నిగాని దుఃఖాన్నిగాని నిర్లక్ష్యముచేసి, మనస్సుకు వికాసమూ, శీలానికి మార్దవమూ కలిగించుకొంటాడు. సంఘములో వాడికుండే పలుకుబడీ, పరిచయమూ, గౌరమూ మరొకరికి ఉండవు. హాసరుచి తెలియనివాడి బతుకు దీపపుసెమ్మా వంటిది. మనస్సు కులాసాగా ఉంచుకో తలచుకొన్నవాడూ, తనలో కలిగే బాధా, విసుగూ పోగొట్ట తలచుకొన్నవాడూ ప్రతివిషయములో చమత్కారము గ్రహించి నవ్వడమునకు పూనుకొంటాడు. కాని కొందరు తత్త్వము తెలియనివాళ్ళు అటువంటి వాణ్ణి వెకిలిమనిషిగా అదోమోస్తరు చూస్తారు. వాడిలో గాంభీర్య మనేదే లేదని వాళ్ళతలంపు. గాంభీర్యమూ లక్ష్యమూ లేనివాడు పిచ్చివాడు. వాడు తనచేష్టల వల్లా మాటలవల్లా ఎదటివాళ్ళకు నవ్వుపుట్టిస్తాడు. కాని వాడి నవ్వువల్ల వాడికేమీ ప్రయోజనము కలగదు. చమత్కారశీలుడి నవ్వు అటువంటిదా మరి ? పిచ్చివాణ్ణి గాని, స్థూలకాయుణ్ణిగాని, టీకుటాకుగా ఉండి పరాభవము పొందేవాణ్ణిగాని చూచినప్పుడు మనకు కలిగే నవ్వులో జాలి ఉంటుంది. ఆజాలి వెల్లడించడానికి

మరోదారిలేక మనము నవ్వుతాము. చమత్కారజన్యమైన నవ్వు అటువంటిదికాదు. మనస్సుకు వికాసము కల్గించే జీవశక్తి ఇందులో ఉంటుంది. అందుకనే గాంధీమహాత్ముడు "నవ్వుతోనే నేను బతుకుతున్నాను. అదే లేకుంటే నాప్రాణాలు ఇదివరకే ఎప్పుడో పోవలసిందే" అని అన్నాడు. వికాసశీలమైన చిత్తానికి నవ్వుకంటె విశ్రాంతీ, హాయీ, మరొకటి లేదు.

మనస్సును పట్టి ఇచ్చేది ముఖము. అందరికీ నవ్వుముఖము ఆకర్షకముగా, మనోహరముగా ఉంటుంది. ఇలవేల్పుముఖముకూడా మందహాసప్రసన్నమై ఉంటేనేకాని మానవుడికి తృప్తిలేదు. ఆనందమూ పుట్టదు. మనకవులు 'శరదిందువికాసమందహాసాం' అని భాషాదేవిని నుతించారు. చివరకు ఆంజనేయుడికీ, వినాయకుడికీ కూడా స్మితవదనము తగిలించకుండా మనవాళ్ళు ఊరుకోలేదు. కాబట్టి హాస మనేది మానవుడుమొదలు దేవుడివరకూ అవసరమనే పెద్దలతలంపు.

స్మితముమొదలు అట్టహాసమువరకూ హాసము అనేకవిధాలుగా ఉంటుంది. బౌద్ధులు ఎనిమిదివిధాలు పేర్కొన్నారు. మన లాక్షణికులు ఆరువిధా లన్నారు. "స్మిత మిహ వికసితనయనం, కించిల్లక్ష్యద్విజం తు హసితం స్యాత్, మధురస్వరం విహసితం, సశిరఃకంప మిద ముపహసితం, అపహసితం సాస్రాక్షం విక్షిప్తాంగం భవ త్యతిహసితం" అని ఆరువిధాల నవ్వుకూ ధనంజయుడు లక్షణము చెప్పాడు. వాటిలో మొదటిరెండూ ఉత్తమములు. కడపటిరెండూ అధమములు. ఇవికాక జాతినిబట్టి, మర్యాదనుబట్టి నవ్వు అనేకవిధాలుగా ఉండవచ్చు. జగత్కల్యాణము కాంక్షించే బుద్ధభగవానుడు ఎప్పుడూ మందహాసము చేసేవాడట! ప్రళయతాండవమాడే మహానటుడు అట్టహాసము చేస్తాడు. అట్టహాసము అంటే బొబ్బనవ్వు, భయము పుట్టిస్తుందిగాని వికాసము కలిగించదు.

నవ్వు పుట్టడమునకు కారణములు ఎన్నో ఉన్నవి. సంఘ మెప్పుడూ ఒకపద్ధతికి అలవాటు పడి ఉంటుంది. ఆపద్ధతి అతిక్రమించినా, అవకతవకగా అవలంబించినా నలుగురిలో నవ్వులాటపాలు కాక తప్పదు. ముఖ్యముగా, వేషభాషాలూ, ఆచారవ్యవహారాలూ వేషభాషలూ మొదలైన వాటిలో వైపరీత్యముగాని, వికారముగాని, కనబడినప్పుడు నవ్వుపుడుతుంది. పరుల పరిహాసానికి పాలుకాకుండా ప్రవర్తించగలగడము నిజముగా గొప్పనేర్పే. కాని ఇతరులు నవ్వినా ఉపేక్షించగలగా

ఉండడము నాజూకైన నాగరిక లక్షణము. ఒకొకప్పుడు తాను నవ్వులాటపాలై కూడా ఇతరులను నవ్విస్తాడు హాస్యచతురుడు. వేషభాషాదుల వికారమువల్ల హాసము పుట్టుతుందనీ, నిద్రాలస్యాదులు దానిని పోషిస్తవనీ రూపకలక్షణవేత్తల మతము. వేషములో, చేష్టలలో వికారము కనబరచి నవ్వించడము అంత కష్టమైన పనికాదు. నాటకాలలో, వీధిభాగోతాలలో, పగటివేషాలలో దీనిప్రభావ మెక్కువ. కాని ఇది తరిగినవంకాయవంటిది. చూస్తుండగానే కనరెక్కిపోతుంది. వికృతికీ చమత్కృతికీ తేడా చాలా వున్నది.

నవ్వు పుట్టించడానికి ఉక్తివైచిత్రి ప్రధానము. సరసోక్తి, ఛలోక్తి, నర్మోక్తి మొదలైన ఉక్తివిశేషాలు మనలో ఉన్నవి. మాటలతో నవ్వించడమునకు ఎంతో నేర్పు కావాలి. ఆనేర్పు అందరికీ ఉండదు. అందులో సహజపాండిత్యముగల వరప్రసాదులు కొందరు ఉంటారు. వీరు మాట్లాడుతుంటే హాస్యరస మొలుకుతుంటుంది. చమత్కారముగా మాట్లాడగలవారు చాలామంది వ్రాయవలసివచ్చినప్పుడు సహజమైన తమశక్తివైచిత్రి చూపలేరు. దానికి కారణము రచనకూ జీవితానికీ సంబంధము లేకపోవడమే. ఈకారణమువల్లనే తెలుగులో హాస్యవాఙ్మయము తక్కువైపోయింది. ఉన్నకొంచెమైనా మనస్సుకు వికాసము కలిగించడానికిబదులు వెగటుపుట్టిస్తున్నది.

నవ్వించడ మంటే వెక్కిరించడముకాదు. బుద్ధికీ హృదయానికీ గిలిగింతలు పెట్టేది నిజమైన హాస్యము. తెలుగులో సున్నితమైనహాస్యము తక్కువ. బూతులు మాట్లాడితేగాని నవ్వుపుట్టదని మనవారితలంపు. ఈతలంపు కవులకుకూడా తప్పింది కాదు. ఒక కవి 'బూతులంబూర్ణుడ" అని చెప్పుకొన్నాడు. 'బూతాడక దొరకు నవ్వుపుట్టదు' అని మరొకకవి అన్నాడు. తిట్టు కవుల మని విఱ్ఱవీగేవారు కూడా లేకపోలేదు. అనగూడదుగాని, 'పెడితే పెండ్లి పెట్టకుంటే చావు' కోరే కవులే తిట్లకు దిగుతారు. తిట్లకుకూడా మెచ్చుకొని సంతోషించేప్రజల అభిరుచికి మనము విచారపడవలసి ఉంటుంది. బూతు లంటే అసభ్యములైన మాటలు. నాగరికతా, సంస్కారమూ కలసంఘములో అసభ్యము అసహ్యము పుట్టిస్తుంది. పరిహాసములో అసంభావ్యమూ, అసందర్భమూ, అసహ్యమూ ఉంటవని కొందరంటారు. కాని నిజమైన పరిహాసము హేతువుపైనే ఆధారపడి ఉంటుంది. హేతువు సున్నితమైనకొద్దీ హాస్యానికి లాలిత్యము వస్తుంది.

లలితమైన హాస్యము జాతీయతకు వ్యాఖ్యానమువంటిది. అది లోకాన్ని విమర్శించి లోపాలు సర్దుతుంది. ఆచారవ్యవహారాలలో, వ్యక్తులనడతలలో, మర్యాదలలో, వేషభాషలలో కన్పించే అవకతవకలనూ, అక్రమములనూ తర్కదృష్టితో విమర్శించి బయలుపెట్టి ప్రతివిషయమునూ మరమ్మతు చేస్తుంది. పరస్పరము పోల్చి చూపించి తీర్పు చెప్పుతుంది. హాస్యమెప్పుడూ తెలివివల్ల పుట్టుతుందనీ, ఇతరులను కుంగదీసి చంపుతుందనీ, తనకు ఏమీ అనుభవములేకపోగా ఎదటివాళ్లకు కసిపుట్టిస్తుందనీ చాలామంది అంటారు. కాని నిజమైన సరసజీవితానికి తొలిగి ఉండి, బ్రతుకంతా ఒకయంత్రములాగున నడచుకొనేవారి మాట లవి.

లలితమైనహాస్యము ప్రియురాలి దంతక్షతమువలె ఉంటుంది. ఎవరిని ఉద్దేశించి హాస్యమాడుతున్నామో వారుకూడా నవ్వినప్పుడే హాస్యము సార్థక మవుతుంది. చూడండి విజయవిలాసములో, సన్యాసే అర్జునుడని గ్రహించి పారిపోయివచ్చిన సుభద్రను "క్రాగియున్నది మిగుల నంగంబు, చూడ కలవరించుచునున్నది కలదో యేమొ సోకు, డల్ల సన్యాసికే చూపవలయు" అని సత్యభామ మేలమాడుతుంది. ఎంత సున్నితమైన పరిహాసము !! ఆ మాటకు సుభద్రకూడా నవ్వితీరవలె. ఎదటి వాళ్ళ మనుస్సును గిలిగింత పెట్టే సరసోక్తి ఇది. ఇంకొకటి హరవిలాసములో విప్ర కుమార వేషముతో శంకరుడు వచ్చి, తనకోసమే తపిస్తున్న పార్వతితో వికవిక నవ్వుతూ "మేలు లెన్స వానికినయి రాగబంధమును నిల్పె మదిం దరళాయతాక్షి మీసకియు వివాహవేళ పురశాసనుపాణి పరిగ్రహించుచో మొకమున బుస్సుమంచు నహి మ్రోగిన నెట్లు భయంబు చెందునో" అని పరిహాసిస్తాడు. తన్ను తానే పరిహాసించుకొంటున్నందుకు శంకరుడు నవ్వుతాడు. ఈ మాటకారితనానికి నిజముగా పార్వతికూడా నవ్వక మానుతుందా! వివాహానంతరమైనా ఏకాంతముగా ఈ మాటలతోనే శంకరుణ్ణి హాస్యమాడి ఉంటుంది పార్వతి. లాలిత్యముతో ఒడుపుమీరిన పరిహాస మిది ; ఎవరు మరచిపోతారు ?

హాస్యోచితములైన సందర్భాలు ప్రతివిషయములోనూ చమత్కారశీలుడికి కని పిస్తవి. వాటిని వ్యంగ్యమర్యాదతో, అందమైన భాషలో అతడు వెల్లడిస్తాడు. లోపాలూ అవకతవకలూ వెల్లడించడమే హాస్యము కాదు. ఆ వెల్లడించే పద్ధతిలో చాతుర్యమూ పనివాడితనమూ ఉంటేనేకాని రసజ్ఞులు హర్షించరు. ఛందోబద్ధమైన

ప్రతిదీ కవిత్వము కానట్లే వెక్కిరింపు ప్రతిదీ హాస్యము కాదు. కళాదృష్టితో రూపకల్పనము చేసి జీవశక్తి కలిగించవలె.

లోపాలు వెల్లడించి సంస్కరించడమూ, నీతి ఉపదేశించడమూ హాస్యానికి ముఖ్యమైనా దానికి తగిన ఆలంబనోద్దీపనాలు ఉండవలె. హాస్యములో తరగతులు ఉన్నవి. కొంచెము సుతిమించిన హాస్యము 'ఐరనీ!' లోకి వెళ్ళుతుంది. ఇది రెండవరకము. 'ఐరనీ' అంటే 'ఎత్తిపొడుపు' అనవచ్చునేమో! లలితహాస్యమువల్ల అనురాగాదులకు భంగము రాదు. కాని ఈ ఎత్తిపొడుపు అనురాగాదులకు సంశయము పుట్టిస్తుంది. ఇది ఎదటివాడికి బాధకలిగించీ కలిగించనట్లు తగుల్తుంది. ఒక విధముగా ఇది వెనకనుంచి వీపుమీద గుద్ది పరుగెత్తడమువంటిది. నాజూకు తక్కువ. చూడండి భారతములో తనమూలాన కట్టుబడిన ద్రుపదుణ్ణి చూచి ద్రోణుడు " వీరెవ్వరయ్యా ద్రుపదమహారాజులె యిట్లు కృపణులయి కట్టువడ్డ వీరికి వలసెనె " అని ఉల్లస మాడుతాడు. బ్రాహ్మడి ఉక్రోషము తీరిందిగాని, ద్రుపదుడి మనస్సు చివుక్కుమని ఉంటుంది కసితీర్చుకోవడానికి ప్రయోగించిన వేళాకోళము మనసు నొప్పించదూ మరి!

హాస్యములలో తక్కువ తరగతిది 'సెటైరు'. 'సెటైరు' అంటే నింద లేక తిట్టు అనవచ్చు. ఇది బడితబాజారకపు హాస్యము. నాజూకూ సున్నితమూ ఇందులో ఉండవు. ఎంతవరకూ పిల్లిమీదనో ఎలుకమీదనో పెట్టి దూషించడమే గాని చమత్కారము శూన్యము. ఎవరిని ఉద్దేశించి ఈహాస్యము బయలుదేరిందో వారికి ఉపకారము చేయకపోగా హాస్యమాడినవాడిమీద అసహ్యమూ, ఆగ్రహమూ పుట్టిస్తుంది. మన ప్రహసనాలు చాలావరకు ఈ తెగలోవి. హాస్యవాఙ్మయములో ఈ 'సెటైరు' చాలా తక్కువరకముగా లాక్షణికులు పరిగణించారు. కొత్తగా బయలుదేరిన 'శుక్లపక్షము' ఈ జాతిలోదే. పుస్తకాల జాబితాలలో చేరడమునకే గాని మరొకప్రయోజనము వీటివల్ల ఉన్నట్లు కనబడదు.

సమానభావవ్యాప్తి ఉన్న నాగరికసంఘములోనే హాస్యమునకు సార్థకతవున్నది భావవ్యాప్తికి తోడు సంస్కారమూ అభిరుచీ ఉండవలె. సాహిత్యవిజ్ఞానమూ ఉండవలె. ఇవి లేనివారికి సభ్యమైన హాస్యము లేదు. దయ్యముపట్టినవాడూ నవ్వుతాడు లాభమేమిటి? అర్థమేమిటి? పచ్చిబూతుల శృంగారముతో, వెక్కిరింపులతో కర

వడిగా ఉండే హాస్యము నాగరికులకు ఇంపుకాదు. మోటుపారిన వీధినాటకాల హాస్యమువంటిది అది. అటువంటిదానికి వాఙ్మయములో చోటులేదు.

హాస్యప్రధానములైన కావ్యాలు మన తెలుగులో తక్కువకావడానికి కారణము సంప్రదాయదాస్యము. బానిసలకు స్వాతంత్ర్యరుచి ఎల్లా తెలుస్తుంది ? వేయేండ్ల నుంచి వస్తున్నా మన వాఙ్మయము వట్టి పోతదిమ్మెలతోనే దేవులాడుతున్నది కాని దేశకాలానురూపములైన పరిణామవిలక్షణతలు పొందలేదు. ప్రతిదానికీ సంస్కృతపు పరవడి మనకు తప్పదు. వస్తువులో, శిల్పములో, విశ్వాసములో, రూపములో, మనకు సంస్కృతము భిక్షపెట్టవలె. ఇతరత్రా సంపాదించుకోవడముగాని, కల్పించు కోవడముగాని మనకు పాపము. ఈ సంప్రదాయదాస్యము మన బుద్ధినీ, హృదయ మునూ, ఆక్రమించివేసింది. 'చిన్నప్పటిచొక్కా సరిపోకపోతే శరీరాన్ని కోసివేసు కోవలసిందే' అన్నంతమౌఢ్యము ఆవేశించింది. ఇందువల్లనే మన వాఙ్మయము కూడా వెఱ్ఱితలలువేసిన తోటకూరచెట్టు అయి పోయింది. దాస్యము లేకుండా బ్రతుకే లేదు మనకు. నవరసాలలో ఒకటిగా పరిగణించినా సంస్కృతములో హాస్యానికి ప్రాధాన్య మెప్పుడూ లేదు. ప్రహసనాలు ఉన్నప్పటికీ అవి వట్టిరోత పుట్టించే బూతుల బుంగలు. పచ్చిపచ్చి శృంగారానికి గట్టికోటలు. మరి హాస్యానికి శృంగార దాస్య మెప్పుడూ తప్పదు. దానికే ఒక విదూషకపాత్రము. ఆ విదూషకునికే తిండి దేవులాటా, భయమూ, దాసీలతో చెలగాటమూ తప్ప మరొకవిషయములేదు. మృచ్ఛకటికలో హాస్యము కొంచెము దూరము పోయింది. అంతే. అనుకరించే జీవితా నికి అలవాటుపడ్డ తెలుగు అంతకన్నా మంచి స్థితికి రావడము సాధ్యమా ?

తర్జుమాలతో తగాదాపడడము హాస్యానికే మంచిదికాదు. మనకూ మంచిదికాదు. సహారా ఎడారిలో చిన్నచిన్న పొదలలాగు మన ప్రబంధాలలో నవ్వుపుట్టించే ఘట్టా లు అక్కడక్కడ లేకపోలేదు. కాని ఎడతెగని ఈ జీవయాత్రలో కలిగే తాపశ్రాంతు లకు ఆమాత్రము సరిపోదు. సరసమైన హాస్యసృష్టి కావలె.

హాస్యాత్మకము లైన పద్యకావ్యాలు వ్రాసినవారు నే నెరిగినంతవరకు వీరేశ లింగముగారూ, దాసు శ్రీరాములుగారూ. వీరేశలింగంగారి అభాగ్యోపాఖ్యా నము ప్రబంధధోరణిని పరిహసిస్తూ వ్రాసిన వికటకావ్యము. అసలు ప్రబంధధోరణే నవ్వుపుట్టిస్తుంది. ఇక అభాగ్యోపాఖ్యానముమాట చెప్పడమెందుకు ? తెలుగువాళ్ళ

మతసాంఘికాచారముల ఉల్లసిస్తూ సున్నితమైన పరిహాసము దాసు శ్రీరాములుగారి 'తెలుగునాడు'లో దొరుకుతుంది.

'తెలుగునాడు' లోని పద్యమొకటి మచ్చుకు ఉదాహరిస్తాను.

"లేవరు లెండు లెం దనిన, లేచినవారయినం దటాలునం
బోవరు, పొండు పొం దనిన, పోదుము పోదుము త్రోయకుం డటం
చీవరు సందు, గేస్తు నలయింతురు పెండిలిలో సదస్యసం
భావనవేళ చూడవలె బావనసాముల సాముపోదుముల్."

శ్రీనాధుడిపేర చెలామణి అవుతున్న వీధినాటకము ఒకటి ఉన్నది. ప్రభుత్వము వారి ఆగ్రహానికీ, పండితుల ఆదరానికీ పాత్రమైన ఆ వీధినాటకములో స్త్రీప్రశంసా, బూతులూ, మొదలైనవి ఎక్కువ. లలితమైన హాస్యము తక్కువ. క్రీడాభిరామముకూడా ఈ తెగలోనిదే. ఉదాహరణములు అనవసరము. కూచిమంచి జగ్గకవిగారి 'చంద్రరేఖావిలాపము' మాట చెప్పకుంటే ద్రోహ మవుతుంది. ఇతనిని మొదట చెప్పడము మంచిది. "నాకృతికి సరిగా ఎవ్వడూ కృతి చెప్పలేడు" అని ఇతడు శపథము చేశాడు. నిజమే. ఇంతవరకూ ఎవ్వడూ చెప్పలేదు. ఇకముందు చెప్పతాడనే ఆశకూడా వద్దు. ఇదీ వికటకావ్యమనే చెప్పవచ్చు. ఇందులో మనకు లభించేది నికరమైన పాకానబడ్డ పచ్చిబూతు. కవిమాత్రము స్వతంత్రుడు. సరియైన దారి తొక్కితే హాస్యదేవతకు ఆలయము కట్టించవలసినవాడు. ఏమైతేనేమి అపమార్గములో పడ్డతర్వాత ?

మనశతకకర్తలు కొంచెము హాస్యప్రియులు. వీధిభాగవతోలగంతులకు అలవాటు పడిన హాస్యలక్ష్మికి ఛందోనాట్యము నేర్పారు. అయినా బండికి కట్టిన గానుగెద్దు వాలకము వచ్చింది. ఇవ్వలేదని తిట్లూ చేతగాదని వెక్కిరింపులూ, నవ్వం డనిగ్రామ్యోక్తులూ మొదలైన వాటితో ఈ శతకాలు పెగటు పుట్టిస్తవి. భక్తిప్రబోధానికీ నీత్యుపదేశానికీ ఈడుజోడుగాదు హాస్యము. వేమన్నలో హాస్యమున్నది. కాని చురుకుపాలెక్కువ. సంఘములో, మతాచారాలలో ఉన్న బూటకమూ, దొంగవేషమూ, కోపము పుట్టించి ఇతనికత్తికి పదునెక్కించినవి. దెబ్బకొట్టవలెననే కాని పరిహసించవలె నన్నదృష్టి ఇతనికి తగ్గిపోయింది. వాడుకభాషను తిట్టడానికి గ్రాంధికవాదులకు పనికివచ్చే గ్రామ్యోక్తులతో నిండిన శతకాలుకూడా ఉన్నవి.

చూడండి మచ్చు.

> "పెద్దలు చెప్ప గింటి బవు పెద్దట యెగ్గసామాదు లంట బల్
> గద్దరి తోడ యాటలును కంబము కాడ మరుండమెట్టి యా
> డిద్దరులోన ఓమమట యేకముగా రొదపెట్టి బాపనాం
> డెద్దులమోలె తిందురని యెన్నను మూఢుడు చంద్రశేఖరా

వేణుగోపాలశతకము, కవిచౌడప్పశతకము, సారంగపాణిపదములూ మొదలైనవి ఈ చంద్రశేఖరశతకానికి తీసిపోనివి. కవులశక్తిని దుర్వినియోగపరచిన ఈశతకాలు నవ్విస్తవో ఏడిపిస్తవో దేవుడికి తెలియవలె!

శృంగారప్రధానములైన నాటకాలలో హాస్యము అంగముగా ఉంటుంది. మనలో స్వతంత్రనాటకాలే తక్కువ. కొన్ని ఉన్నా వాటి విష్కంభాదులలో తప్ప హాస్యానికి చోటుండదు. తెలుగు నాటకాలలో హాస్యానికి పూజ్యస్థానమిచ్చినవారు ఇద్దరు. అందులో ప్రథమగణ్యులు పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు. సరస్వతీ, కంఠాభరణమూ, వృద్ధవివాహము, మొదలైనవి వీరి హాస్యప్రధాననాటకములు. వీరి కంఠాభరణమూ సరస్వతీ చదువుతున్నప్పుడు మృచ్ఛకటిక జ్ఞాపకము వస్తుంది. వీరిభాష ముదురుబెండకాయపాకపు గ్రాంథికము. వీరి హాస్యము అనుభవించినకొద్దీ అసందర్భమూ, ఆలోచించినకొద్దీ అసభ్యమూ తోపిస్తుంది. వస్తువూ, సంఘటనలూ చాలా హాస్యప్రతిపాదకములుగా ఉంటవి. జీవితానికీ వాఙ్మయానికీ ఉన్న సంబంధము వీరి రచనలో కనబడుతుంది. ప్రతిభా, లోకజ్ఞానమూ కలిసి మూర్తీభవించిన ఈ కవి రచనలు వాడుకభాషలోనే ఉంటే తెలుగువాళ్ళభాగ్యము పండి ఉండును. హాస్యమువల్ల ఈయనా, ఈయనవల్ల హాస్యమూ వాఙ్మయములో ఎదుట నిలబడతారంటే చాలును. వేదము వెంకటరాయశాస్త్రిగారిలో హాస్యమున్నది. కాని అది చాలా మడిగట్టుకొని ఉంటుంది. వీరేశలింగంగారి నాటకాలు తగ్గుమాలే. స్వతంత్రము లున్నా చెప్పుకో దగ్గవి లేవు. బళ్ళారివారి నాటకాలను నాటకాలనడానికే భయమువేస్తుంది. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు సహజముగా హాస్యప్రియులు. కాని ఆప్రియత్వము నాటకాలలో కనబడదు. మందపాలుడివంటి కొన్నిపాత్రలున్నా వాటి మూలపురుషుడు సంస్కృతనాటకాల విదూషకుడే.

తెలుగులో కొత్తదారి త్రొక్కిననాటకము గురుజాడ అప్పారావుగారి కన్యాశుల్కము. జాతీయమైన భాషావ్యవహారానికీ, జాతీయమైన చక్కని హాస్యానికీ ఉండే సంబంధము ఈకన్యాశుల్కములోనే అనుభవానికి వస్తుంది. ఇది నాటక మంటారు కొందరు. కాని నాబుద్ధికి ప్రహసనమనడమే మంచిదని తోస్తుంది. కథాకల్పనలో, వస్తువిన్యాసములో, హాస్యప్రతిపాదకములైన సంఘటనలుగాని, అంగప్రత్యంగముల ఐక్యము గాని కనబడలేదు. ఏరంగమున కారంగము ఒకప్రహసనముగా ఉంటుంది. తూర్పు యాసతో ఇంగ్లీషుమాటలు గుచ్చి వాక్యరచనచేయడమువల్ల మనకునవ్వుపుట్టుతుంది. తర్జుమాచేయడానికి అలవికాని సరసమైనవాక్చమత్కృతి మనను మోహింపచేస్తుంది. ఏభావమైనా వెల్లడికావాలంటే భాషలో ఉండే ఒదుపూ, నాజూకూ, కాకువూ, విరుపూ ప్రధానాలు. కృత్రిమమైన గ్రాంథికభాషకూ వీటికీ ఎదురుచుక్క. మాట్లాడేటప్పుడు హాస్యరసమొలికించే చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి చాతుర్యము గ్రాంథికభాష కౌగిట ఉక్కిరిబిక్కిరై అవసన్నమయిందంటే ఆశ్చర్యము ఎందుకు ?

ఇక మనప్రహసనాలు ఇప్పటినాగరికులకు వెగటుపుట్టిస్తవి. అవి చదివేటప్పటి కంటె చదివినతర్వాత మనకు నవ్వువస్తుంది. వీరేశలింగముగారూ, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారూ, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారూ, మంత్రిప్రగడ భుజంగరావుగారూ మొదలైనవారు ప్రహసనాలు వ్రాసినవారు. వాటిలో శిల్పచాతుర్యము కన్నా సంస్కరణాభిలాషా, వెక్కిరింపూ, లేవడీకొట్టడమూ ఎక్కువ. మతసాంఘికాచారవ్యవహారాలను నిందించడమే వాటిపరమార్థము. అందరూ తప్పులనుకొనే వాటినే నిందించడానికి పూనుకోవడమువల్ల వీటిలో తీవ్రత తగ్గిపోయింది. చదివి ఆనందించతగినవికూడా లేకపోలేదు. కాని పనిపెట్టుకొని ఎవరు వెతుకుతారు ?

వేళాకోళముతో నవ్వుపుట్టించే చాటుధారలు తెలుగులో చాలా ఉన్నవి. బండబారినా ఆహాస్యము కొంతమేలు. ఆహాస్యము వ్యక్తిపరముగా ఉండడమువల్ల మనస్సుకు కలిగే హాయి తక్కువ. చూడండి.

“ మాకలిదిండికామయకుమారకు డన్నిట తండ్రిపోలికే
కాక తదన్యుడెట్లగును గాడిదకుం దురగంబు పుట్టునే!”
“మా రామయమంత్రి భోజనపరాక్రమ మేమని చెప్పవచ్చు, ఆ
సామి మెరుంగు తక్కళచాతురి తాళఫలప్రమాణమూ.”

" కానరకూనరై మిగుల గందరగోళపు మూలమై రసా
భాసపు హేతువై వికటపద్ధతియై సిగపల్లగోత్రియై
దాసరిపాటయై బెహారదారన చేసిన యగ్రహార మా
కాశము ముట్టి తోక తెగి గాడిదవాలక మయ్యె చూడగా."

సారస్వతదృష్టితో వ్రాసేదీ, స్వానుభవమువల్ల కల్పించేదీ, సంప్రదాయసిద్ధమైనదీ, హాస్యము మూడువిధాలుగా మనకు చాటుధారలలో కనబడుతుంది. మర్యాదను అతిక్రమించని స్వాతంత్ర్యము చాటుధారలకు ఒకవిధమైన మాధుర్యము ప్రసాదించింది. దానిని వివరించవలసిన అవసరము ఉండదు.

వచనకావ్యము లంటే నవలలుకూడా. మనభాషలో స్వతంత్రము లైన నవలలు చెప్పుకోవలసినంతగా లేవు. మాలపల్లీ, రామచంద్రవిజయమూ మొదలైనవి ఉన్నా వాటికీ హాస్యానికీ సగ మెరుక. కావలసినంత అవకాశమున్న నవలలోకూడా హాస్యవాసన అసలే గిట్టకపోవడము ఆంధ్రజాతితత్వానికి నిదర్శనమేమో అనిపిస్తుంది. ఇతరభాషలలోని నవలలను గూర్చి చెప్పడము నిరర్థక మిక్కడ. ప్రత్యేకము హాస్యముకోసమే బయలుదేరిన వచనగ్రంథాలు మూడు. వీరేశలింగముగారి 'సత్యరాజాపూర్వదేశయాత్రలూ', చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి 'గణపతీ', మొక్కపాటి నరసింహశాస్త్రిగారి 'బ్యారిష్టరు పార్వతీశమూనూ.' వీరేశలింగముగారి దృష్టి ఎప్పుడూ సంస్కరణముమీదనే. భాష గ్రాంథికమే. 'సత్యరాజాపూర్వదేశయాత్రల' లో మతసాంఘికాచారాలమీద దండయాత్రతప్ప మరొకటి లేదు. దొరికిన ప్రతిసాధనమూ అందుకోసమే ఆయన ఉపయోగించాడు. ఇక చెప్పే దేమిటి? వాడుకలో ఉన్నకథలలోనుంచి నిగ్గుతీసి ఒకహాస్యపాత్రను సృష్టించారు లక్ష్మీనరసింహముగారు. ఆపాత్రే గణపతి. తిండీ, నిద్రా, తెలివితక్కువా, భయమూ, మూర్తీభవించిన ఆగణపతి, పక్కా గ్రాంథికభాషాభిమాని. ఇక నవ్వులాటగాక మరేమిటి? పైరెండుగ్రంథాలూ వాడుకభాషలోనే ఉంటేనా—

హాస్యప్రియత్వమెంతో అంత స్వాతంత్ర్య ప్రియత్వమున్న ఈకవు లిద్దరూ భాషావిషయములో అల్పసంతుష్టులు కావడానికి కారణాలు చాలా ఉండవచ్చు. "యజ్ఞోపవీతము చిలక్కొయ్యకు తగిలిస్తే లాభమేమిటి ? నమ్మకములేకుంటే తెంచిపారవేయడము మంచిది " అని మన మనుకోక తప్పదు. బ్యారిష్టరు పార్వతీశము ఆంధ్రుల ఆదరానికి పాత్రమయిన గ్రంథము. తీరుతీయాలవాడుకభాష. తన తెలివితక్కువను

కప్పిపుచ్చుకోవడానికి పార్వతీశముగారు పడేపాట్లు, చేసే అవకతవకలు మనకు నవ్వుపుట్టిస్తవి. కాని వాక్చమత్కారము కావలసినంత లేదు. ఆ అవకతవకలకు తోడు హాస్యోక్తులే ఉంటేనా ఆశ్చర్యమేమిటి? గర్వపడవచ్చు. ఈగ్రంథములో తలచుకొన్నప్పుడల్లా నవ్వువచ్చేది 'దొరసానిటోపీ తమాషా'. పోతే బాగుండుననుకొన్న కొద్దీ వెంటబడి వేటాడుతుం దది.

రామలింగడి పేరా, పరమానందయ్యగారి శిష్యులపేరా చెప్పుకొనేకథలు చాలా ఉన్నవి. కాని గ్రంథస్థములు కావడముతోనే వాటి మజా తగ్గుతున్నది. కారణము గ్రాంథికభాషే. ఇటీవలి వారిలో చాలమంది తెలుగులో హాస్యరచనలు లేవనే అపవాదము తొలగించడానికి పూనుకొన్నారు. చింతా దీక్షితులుగారూ, మునిమాణిక్యము నరసింహారావుగారూ, భమిడిపాటి కామేశ్వరరావుగారూ, బ్యారిష్టరు పార్వతీశము వ్రాసిన నరసింహశాస్త్రిగారూ, నందివాడ చిదంబరంగారూ, కొమరవోలు నాగభూషణముగారూ, వెలివల వీరరాఘవస్వామిగారూ, నండూరి బంగారయ్యగారూ మొదలైనవారు. వాడుకలో ఉన్న చక్కని తేనెతేటల తెలుగుభాషలో, హాస్యాత్మకములైన కథలూ, వ్యాసములూ, మొదలైనవి వ్రాస్తున్నారు. వీరి రచనలలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క ప్రత్యేకగుణము ఉన్నది. దీక్షితులుగారి 'మాయింట్లో పిల్లి, జాతకమూ, మొదలైనవి చదివినప్పుడు నిర్మలమైన మనోవికాసము కలిగించే నవ్వువస్తుంది. మొక్కపాటివారి 'పిలక' 'నేనూ మాఆవిడా' మొదలైనవి అనుభవించడానికేగాని వెల్లడించడానికి అలవి కాని ఆనందము కలిగిస్తవి. పడుచు దంపతుల కాపురములోని ప్రణయమాధుర్యాన్ని హాస్యసంపదతో అమర్చి బ్రహ్మచారులకుకూడా పరిణయవాంఛ కలిగించారు నరసింహారావుగారు. వీరి 'గంగాధరంగారి కోటు' హాస్యాని కలంకారప్రాయము. అద్దెకొంపల హంగామాతో ఆంధ్రులను బాగుబాగనిపించారు భమిడిపాటి కామేశ్వరరావుగారు. తక్కినవారి రచనలలోనూ లాలిత్యమూ, నిశితచమత్కారమూ ఉన్నవి. తెలుగులో చక్కని హాస్యము బయలుదేరడానికి ఒడుదొడుకులులేని దారిచూపినవారు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు. వాడుకభాష వాడుకోవడమునకు భయముతీరినతర్వాతనే రచయితలు చాలామంది బయలుదేరారు. ఇప్పుడు దేశములో గ్రాంథికభాషతో గంతులువేసేవారు కొద్దిమంది. ఇప్పుడు వ్రాస్తున్నవారినిబట్టి శ్రీరామమూర్తిపంతులుగారి శ్రమ సఫలమయిందని చెప్పవచ్చు. కన్యాశుల్కము, బ్యారిష్టరు పార్వతీశమువంటి గ్రంథాలు మనకు లభించడానికి శ్రీపంతులుగారి పరిశ్రమే కారణము. అందుకోసమే వారి సప్తతితమ వార్షికోత్సవానికి ఈవ్యాసము వ్రాయడము మంచిదని తోచింది.

# కాంక్ష

వేదుల సత్యనారాయణ శాస్త్రి

---

ఈ సుమజన్మ మెట్లొ ఘటియిల్లెను నాకొకనాటిపాటి దై
వాసనలీను సోయగము వాయని తీయని పోడుముల్, క్షణం
బో నగమో విచారపడబోనయినన్ విడివడ్డ నాయెదన్
మోసులువారు నొక్కటి మనోరథ మామని వేడిపొంగులన్.
పేదలరక్తమాంసముల పెంపువహించి దయారసామృతా
స్వాదదరిద్రులైన ధనవంతులపెద్దరికమ్ముకై మతో
న్మాదము పెంచు దేవునికి మారుగ నిల్చినరాతిబొమ్మలం
దూదరవోవుపాడుబ్రదు కొక్కనిమేషము నైన నెన్నడున్.
నాకు తలంపు లేదు లలనాజనతాకబరీభరైక భూ
షాకలనన్ సతీమృదుభుజాంతరతల్పకుచోపగూహబి
బ్బోకమునన్, వధూసితకపోలగళచ్ఛ్రవణావతంస హే
వాకమునన్ విలాసినులపాపటచందురుకావిపూతలన్.
తేనెలకోసమై కొదమతేటులదాటు లొనర్చునృత్యగీ
తానునయమ్ముగాని, మలయానిలుకౌగిట పుల్కరించుసౌ
ఖ్యానుభవమ్ముగాని, తరుణారుణరాగకదుష్ణచుంబన
శ్రీనవకమ్ముగాని, పరితృప్తి యొసంగదు నాకొకింతయున్.
కానుకనై ధరాధిపులకాళ్ళకడం బొరలాడి వాడిపో
లేను, ధరావరాగపటలీమలినమ్మగు ద్వారతోరణా
స్థానమునం దురింబడగజాలను, దోసిటిపేరి ఘోరకా
రానరకమ్మునం దుసురు రాల్పగలేను నిమేషరక్తికై.
నీచపుదాస్యవృత్తి మననేరనిశూరత, మాతృదేశసే
వాచరణమ్మునం దసువు లర్పణచేసినవారిపార్థివ
శ్రీ చెలువారుచోట, తదసృగ్ఝరులన్ వికసించి, వాసనల్
వీచుచు రాలిపోవగవలెం దదుదాత్తసమాధిమృత్తికన్.

# ఆంధ్ర నాటకములలో వాడదగిన భాష

శ్రీపాద కామేశ్వరరావు

కవి రచించినది కావ్యము. ఇం దనేకభావములు కూర్చబడిఉండును. ఈ భావములద్వారా తనకు కలిగిన ఆనందము ఉత్సాహమును ఇతరుల హృదయములందు పుట్టునట్లు కవి రచనకూర్చి వారికికూడా ఆనందము కలిగించును. కవితయొక్క ఉద్దేశ మిది ఒకటి.

కావ్యమును పఠించినందువల్ల కలిగే ఆనందమునకు రసమనిపేరు. రసోత్పత్తిసాధనములు భావగర్భితవాక్యములు; వాక్యము లనగా శబ్దసమూహములు. రసము శబ్దార్థములనూ, వాక్యార్థములనూ ఆశ్రయించిఉండును. అందుచేత రసస్ఫూర్తి సఫలము కావలెనంటే యోగ్యములైన శబ్దములు వాక్యములున్నూ ఉపయోగించి కవి కృతకృత్యుడు కావలెను.

శ్రవ్యములనీ దృశ్యములనీ కావ్యములు రెండు రకములు. దృశ్యకావ్యములు నాటకములు మొదలైనవి.

ఆంధ్రనాటకరచన ఏబది సంవత్సరములక్రిందట ప్రారంభమయి ఇప్పటికి మూడు నాల్గువందల నాటకములు ప్రచురింపబడినవి, కాని వీటిలో సర్వాంగరమ్యమై పన్నికెక్కినవి తక్కువ.

రసోదయమునకు అర్హమైన భాషాభావములు పొందుపరచి రచింపబడ్డ కావ్యములే ప్రశస్తి చెందుతవి. మనదేశమందు కావ్యరచన తొలుత సంస్కృతభాషను కావింపబడి ఉత్తమకావ్యము లనేకములు వెలువడినవి. వాటిని పరిశీలించి కొందరు విద్వాంసులు ఆయాకావ్యముల మంచిచెడ్డలు అలంకారశాస్త్రమనుపేర విశదీకరించినారు. రసమనవెట్టిదో, అది ఎట్లుదయించునో, అందుకనుకూలమైన రచన ఎట్టిదో, ఏయే నియమాలను పాటిస్తే ఎట్లు కృతార్థత చెందవచ్చునో ఆశాస్త్రపరిశోధనచేస్తే తెలియగలదు.

కాలక్రమమున ఆంధ్రమున కావ్యరచన ప్రారంభమైనది. అప్పటి కవులు సంస్కృతాలంకారశాస్త్ర నియమాలే పాటించిరికాని ఆంధ్రమునకు ప్రత్యేక నియ

మాల నేర్పరచలేదు. ఇప్పటి కవులలో చాలామంది సంస్కృతనియమాలజోలికిపోక, ఆంధ్రనియమాలు లేక, తమచిత్తమువచ్చినరీతిని కావ్యరచనచేస్తున్నారు. ఈగ్రంథముల లోటుపాటు లెవ్వరూ గమనించరు. క్రమమైన విమర్శ లేనందువల్ల పామరజనముల రుచులననుసరించి ధనార్జనమే ముఖ్యపురుషార్థమని యెంచి కవులు అధమ కావ్యములు రచిస్తున్నారు. కవిత కళ్లెములేని గుర్రమువలె పరుగెత్తుతున్నది. ఒకానొకప్పుడు దానితీవి ఇంపుగా నుంటుందికాని సాధారణముగా సర్వాసహ్యముగా ఉంటుంది. ఇది యోగ్యము ఇదయోగ్యమనే తెలివిపుట్టడానికి అసలు శిక్ష ఏదీ? రౌతు పరిజ్ఞానము కలవాడుకాడు, గుర్రానికి శిక్షలేదు; నడక బాగుండకపోతే తప్పెవరిది?

వాఙ్మయాభిమానులు తమభాషలో చెడుకావ్యములు చేరకుండా చేసుకోవలెను. లేకుంటే దేశానికీ తద్వాసులకూ అవమానము తప్పదు.

నియతి లేకుంటే ఏ కార్యమూ సఫలము కాదు. నియమరహితమైన నడవడి దుఃఖదాయకము; నిష్ఫలప్రయత్నము కాలవ్యయమునకు హేతువై క్రమముగా ఉత్సాహశక్తి నూడగొట్టుతుంది. నియమజ్ఞానములేనివాళ్లు తమ తప్పొప్పులు తెలుసుకోలేరు. ఇతరులు వాటిని చూపితే దిద్దుకోరు. మొదటిదానికి కారణము అజ్ఞానము. రెండోదానికి కారణములు రెండు:- మొదటిది ఉదాసీనత. ఈ పాటి తప్పేమి? "ఉర్విజనులకెల్ల నుండు తప్పు." ఈ భావముబలిసి దుస్సర్వజ్ఞత్వ మావహిస్తుంది. ఇది రెండోకారణము. తనంత వాడు లేడనే దురభిమానము తలకెక్కిన తర్వాత బాగుపడే బుద్ధిపుట్టదు, పాటుపడవలెననే కోర్కెపుట్టదు, పట్టుదల ఉండదు.

దుస్సర్వజ్ఞత్వములేక నయవర్తనపై కొన్నాళ్ళు ఉదాసీనత వహించి, అది తప్పుతోవ అని త్రికరణశుద్ధిగా నమ్మి, సన్మార్గమెట్టిదో తెలుసుకొని ఆదారిని పోదామనే ఉత్సాహము కలవారు బుద్ధిమంతులు, బాగుపడదలచేవాళ్లు. వీళ్ళని హెచ్చరిస్తే కొంతమేలు కలుగుతుందనే భావముతో నాటకభాషారచనకు చేయవలసిన కృషిని గురించి కొన్నివిషయము లిందు పొందుపర్చబడినవి.

ఆనందము కలిగించుట హితముపదేశించుట కావ్యమునకు ముఖ్యోద్దేశములు. వీటికి ముఖ్యసాధనము భావవ్యక్తత. ప్రయోగించబడిన వాక్యముల అర్థముచే ఇది కలుగును. వాక్యార్థము శబ్దార్థము ననుసరించి ఉంటుంది. కాబట్టి శబ్దములు వాక్య

ములున్నూ యోగ్యరీతిని కూర్చితే కవిభావము సరిగా బోధపడి రసస్ఫూర్తి కలుగుతుంది. కావున శబ్దములూ వాక్యములూ ఎట్లుప్రయోగించవలెనో తెలుసుకొనుట కవికి ముఖ్యమైన విధి. శబ్దముల వ్యుత్పత్తి, అర్థము, ఔచిత్యమున్నూ సరిగా గ్రహించవలెనంటే నిఘంటువు, వ్యాకరణము, అలంకారశాస్త్రమున్నూ జాగ్రత్తగా కలిస్తూ, ఉత్తమకావ్యములను సవిమర్శకముగా చదువుతూ, నిరంతరమూ సత్కవులతో సాంగత్యము చేయవలెను. విద్యావివేకములు లాభదాయకములు కావలె నంటే లోకవర్తన ముఖ్యముగా పరిశీలించవలెను.

ఈ విషయమున దండికవి మాటలు వినండి :—

" ఇది దోషం, బిది గుణ, మను
నది మనుజు డెరుంగగలుగునా శాస్త్రములం
జదువనిచో ? రూపంబుల
భిద లెరుగగ నంధుమం బ్రవీణుం డగునే?
" ప్రకృతిచే సిద్ధమగుచు నేర్పను ప్రతిభయు,
నమలినం బయి నమధికంబగు చదువును
గాఢమై యొప్పెడి యభియోగము ననునివి
కావ్యసంపద కగుచుండు కారణంబు.
ప్రతిభ లేకపోయినా,
" చదువుకొని యత్నమున నుపాసన సలిపిన
భారతి యనుగ్రహంబును బడయు నరుడు. "

ప్రస్తుతమున గ్రంథములకు కొదువలేదు. పత్రికలలో సాహిత్యవిషయిక మగు చర్చలు జరుపబడుతున్నవి. వాటిని చదివి తమకు అవసరములైన విషయములు తర్కించి జాగరూకతతో జ్ఞానము సంపాదించి కావ్యరచనకు గడంగవలెను. అట్లు చేయకుంటే తాము చెడడమే కాక ఇతరులను కూడా చెరుపగలరు. ఇందువల్ల వాఙ్మయమునకు హాని చేకూరుతుంది.

# ముద్రాక్షరశాల, గ్రామ్యభాషాభివృద్ధి

కందూరి ఈశ్వరదత్తు

ప్రపంచచరిత్రలో నుత్కృష్టవిషయము ముద్రాక్షరశాలాగమనము. ఇదివఱకు అనన్యసాధారణముగా ఉండి పండితాధీనమైనవిద్య, సర్వసాధారణము, పామరజనాధీనమై పోయింది. విద్యాపారంగతులమని చెప్పి, భాషానుశాసనమును చేతులో నుంచుకొని, భాషాపరిణామమునకు అడ్డుపడేవారి గర్వసంరంభమును కట్టిపెట్టినది ముద్రాయంత్రాలయమే. ఇదివఱకు మహాకవులు వ్రాసిన గ్రంథములన్నీ తాళపత్రగతములై, ఓపినవారు వ్రాసుకొంటూ ఎక్కడనో గుప్తముగా ఉండడంచేత భాషాభాగ్యము ఒక్కరికానాచియై ఉండేది. ఇప్పుడో! ఆపరిస్థితులు తాటాతూటములై తారుమారైనాయి. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, కావ్యాలు వాగ్రూపమును, లిఖితరూపమును వదలి ముద్రణరూపము దాల్చినవి. విజ్ఞానాంకురాలు సర్వమానవహృదయక్షేత్రాలలో ప్రభవిల్లి, పాండిత్యము ఒక్కరిపాలుగాకపోయినది. అక్షరాస్యులందఱూ గ్రంథమును ఒకరి అపేక్ష లేకుండా చదువుకొని పాండిత్యం సంపాదించుకోవడానికి వీలయింది.

ఆంధ్రకవితాసామ్రాజ్యంకూడా నిరంకుశ పండితప్రభుత్వాధీనము అయి ఉండేది. ముద్రాక్షరశాలాగమనము ఆ నిరంకుశ ప్రభుత్వములో గొప్పవిప్లవము కలుగజేసి ప్రజాపరిపాలనముగా మార్చివేసింది. ఈ నవ్యకవితా సామ్రాజ్యంలో అక్షరాస్యులెల్లా సర్వస్వామ్యములతో పండితులలో సమానంగా నూతనాధికారమును చెలాయిస్తున్నారు. ఇప్పు డెన్ని గ్రంథములు! ఎన్ని పత్రికలు! వాటిలో భాష ఎలా ఉంది? గ్రాంథిక భాష లేదే! గ్రామ్య భాషకే విరివిగా ప్రయోగము కలుగుతోంది! జనసామాన్యమునకు తెలిసేటట్టు పత్రికలలో వ్రాస్తున్నారు. గ్రామ్య భాష జీవభాషయై, నూతనవికాసముతో వెలుగుతోంది. దీనికి అడ్డువచ్చువా రెవ్వరు? ఇంగ్లీషు భాషలో హడ్సన్ (Hudson) పండితు డిట్లు వ్రాసినాడు :—

"Of the importance of the invention of the printing, it would be impossible to speak extravagantly ... ... The Print-

ing Press began the decentralization of scholarship by impairing the powers of universities ... ... The intellectual exclusiveness was destroyed once and for all, the humblest man who could read became a citizen of the new Republic of letters and a tremendous impulse was thus given to the spread of the lay spirit" Story of Renaissance Page 32-35.

పైవాక్యములే ఆంధ్రభాషకుకూడా వర్తిస్తాయి. భాష ఎప్పుడూ ఒక్కతీరుగా ఉండదు. ఆయాకాలముల రాజకీయ మతసాంఘిక పరిస్థితులనుబట్టి ఉంటుంది. భారతదేశములో ప్రజాయత్తపరిపాలనాంకూరములు మొలకలెత్తినప్పుడే, భాషకూడ పండితభుజాస్కంధములను వీడి పామరజనాధారమై పోయింది. ఆప్రజలు మాటలాడేభాషయే జీవభాషగా ఉండి, ఆచంద్రతారార్కము ఉంటుంది. ప్రజలలో నూతనోజ్జీవము కలిగి, రాజకీయముగా స్వరాజ్యోద్ధరణమునకు పూనుకొన్నప్పుడు ప్రజలమనోభీష్టములు నెరవేర్చుటకు, నాయకులు పూనుకొన్నప్పుడు, వారిమనస్సు ఉద్రేకపూరితము చేసేభాష గ్రామ్యభాషగాని మఱియొకటి కాదు. జిల్లాఅధికారిగ పనిచేస్తూఉన్న గేలెట్టి (R. Galletti) దొరగారు ప్రచురించనున్న తెలుగునిఘంటువునకు పీఠికలో ఈక్రిందివిధముగ నున్నది:-

ఈగ్రంథము Oxford University Press వారిచే ప్రకటితమవుతుంది.

"Perhaps inspiration will be lacking while the nation i in tutelage; but when the noble and puissant nation views it mighty youth, when the full tide of its inspiration begins t flood the land; it is surely the *Common People*, who woul hear and applaud. *It is their language that must be used therefore for its study this work is devoted*".

కావున గ్రామ్యభాష క్రొత్తవైభవములో రాజకీయభాషయై, ప్రజానాయకులయొక్కయు, ప్రభుత్వమువారి యొక్కయు నాదరణమును సంపాదించుకొని వెలుగొందెడు దినములు రానున్నవి.

# అభినందనము

## లక్ష్మీ - శారదలు

---

శ్రీరమణీమణీవిమలచిత్తసరోజమరందపాన ! బృం
దారకసేవ్యమాన ! భవతారణరామ ! భజింతు ; సాహితీ
వారిధి బోవుమీ ! గిడుగు వంశపయోనిధిసోము, రాము ! నిం
డారగ నాయురున్నతు లుదంచితకీర్తుల, నెల్లవేళలన్.

నీ చిఱుపాపవాగ్వనిత నీ కరపద్మములందు మేలు, కా
ణాచిగనాడగా దొడగె నవ్యమహాద్భుతభావసంపదన్ ;
జూచినమోదమాను ! కడుచోద్యము ! ఆంధ్రవచశ్ పయస్సుధా
వీచికలందు దేలెదవు వింత భవచ్చరితంబు, చూడగన్.

ఉదయపుమాటకు మున్నె మదినాటెనో యేమొ, స్వాతంత్ర్యశక్తి వా క్పటిమశక్తి!
కనులు విప్పకమున్నె గాయత్రి కాబోలు, మాతృభాషాసేవ మననమయ్యె !
జననియుగ్గునబోసి చవిజూపె గాబోలు, వాడుకభాషగాపాడినావు !
దేశోద్ధరణకెంత దీసిపోవనిభక్తి, చిననాడె వంటబట్టినది యేమొ !
కొండభాషకు బంగారు కొండవోలె, ఎలమిని నిఘంటువును వ్రాసి యిచ్చినావు
ఆంధ్రమాధ్యతమస్సుల నడపనెంచి, ధరకు దిగివచ్చినట్టి యా తరణివోలె.

దెబ్బదియేండ్లు నిండియు దృఢీకృతమైన త్వదీయధీబలం
బబ్బురమౌ దలంప భవదప్రతిమాన విశాలశోధనల్
నిబ్బరమైన మార్గముల నేర్పొనగూర్చును మాతృభాషలో
గబ్బములన్ రచింప సమకట్టెడు నాంధ్రుల కెల్లవారికిన్.

ఆంధ్రభాషాతత్వ మవ్వారిగానేర్చి, నిండువిఖ్యాతిమై నెగడినావు
కవులెందఱో, యాంధ్ర కవిశరణ్యుండ వీ వనియెడు ప్రఖ్యాతి నలరినావు
ఆంధ్రభాషాంబుధి నవలీల నెల్లరు, తరియింప దరణివై తనరినావు
ఆధునికాంధ్రభాషానుశాసనుడవై, నిత్యసత్కీర్తుల నించినావు

భావవిస్ఫూర్తి నలరారు జీవభాష, వ్యావహారిక భాషయే యానటంచు
సర్వవిధముల లోకాన జాటినావు, పండితశ్రేష్ఠు లాశ్చర్యవార్ధి మునుగ.

విద్యయే ముక్తికి విమలసాధనముగా, నిరతమ్ము గృషిసల్పు నీదువృత్తి
వాఙ్మయసేవయే భావిశుభోదయ, సాధనమ్మని యెంచు నీదుభక్తి
భాషాభివృద్ధి నీ పరమతపంబుగా, జేయుచుండెడి నీ యమేయరక్తి
నిండోలగమునందు పండితప్రకరముల్, సాధింపగలుగు ప్రచండ శక్తి
ఆంధ్రభాషాప్రవాహమ్ము నఖిలదిశల, ముంచితేలించె నీదు రసాంచలంబు
సాటివత్తురె నీదువాగ్ఘాటి కెనయ, తెనుగుతల్లికి మలికాన్పు టనుగుబిడ్డ !

నీవల్లనేగాదె ! నీవంశమెల్ల వి, ద్వద్వంశమనుకీర్తి బడయ గలిగె !
నీ కృషిచే గాదె ! మాకెల్లరకు నాంధ్ర, భాషయం దభిరుచి పరగ గలిగె
నీ ప్రజ్ఞచేగాదె ! సుప్రసిద్ధాంధ్రభా, షాయోష కెనలేని శక్తి గలిగె
నీ పాండితియె గాదె ! యేపండితులకైన, ప్రాపైన మార్గముల్ జూపగలిగె
ప్రాజ్యపాండిత్యసురభి సంపూజ్యమాన! తరుణి వాక్సతీగర్భముక్తాఫలంబ !
గిడుగువంశాబ్ధిచంద్ర! సత్కీర్తిసాంద్ర!, లక్షణోపేంద్ర! వేంకటరామచంద్ర!
చంద్రునకు నూలుపోగను చందమునను,నందుకొను మాదుభక్తి పుష్పాంజలులను
శ్రీమహావిష్ణు వెల్లప్పుడోముగాత, సేమములగూర్చి వేంకటరామ ! నిన్ను.

తమవిద్యామహనీయశేముషియె, త్వద్వంశమ్ము విద్వత్సువం
శముగా జేసెడి నందుకోడలగుటల్ జన్మించుటల్, మాన్యమా
తమభాగ్యమ్ముననే, పొసంగెనని, యత్యంతమ్ము సద్భక్తిమై
మిము బూజించుచు నుండువార లిదె, లక్ష్మీశారదాంబాసతుల్.

గౌతమీతీరవిఖ్యాతచారిత్రికా, ఘనపుణ్య మీ విట్లు గంటివేమొ !
మదనగోపాలసమ్మానసక్షేత్రంబ, వైయున్నఫల మిట్టు లందితేమొ !
ఎలమి మార్కండేయునిలయమ్మై యుంట ద, త్ఫల మివ్విధమ్మున బడసితేమొ !
కవితల్లజుల జేరి గౌరవించుదు వన్న, ఘనకార్య ఫలమిట్లు గాంచితేమొ !
ఆంధ్రభాషానుశాసనాధ్యక్షబిరుదు, "రామమూర్తి"ని నీవిట్లు ప్రేమజూడ ;
ఆంధ్రభాషావధూటీవిహారసీమ !, రాజరాజనరేంద్రపురాభిధాన !

# శ్రీరామమూర్తికి తొలి జోహారు

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ఆంధ్రు లిపుడిపుడు తమ మహాపురుషులను గుర్తించుచున్నారు. భాషాసేవకులపై పూలచెండ్లను రువ్వుచున్నారు. చెండ్లను, పండ్లను ప్రజలు రథముపై రువ్వుచుండ, భక్తిని, పూజను, అంజలిని అందునది రథమా, లోనివిగ్రహమా, నేలమీదిపాంశుపటలమా అని ప్రశ్నించి 'మాకు మా' కను వీనిపంతములకు జగదీశుడు నవ్వెనని తెలిపి చక్కని ఒకవంగగీతికయందు రవికవి అనుశాసనయోగ్యమగు తనహృదయమును జొనిపెను. పృథుకవీంద్రుని ప్రశ్నయందును, చెండునందును, పండునందును గలగభీర భావమును నే నిపుడు విమర్శింపనొల్లను. కాని నేడు తెలుగులచేతులనుండి ఎగురుచెండులను పండులను అందునది భాషయా, భాషాసేవయా, భాషాసేవను పురికొల్పిన వ్యక్తిశక్తియా, ఆంధ్రశక్తియా, అని ప్రశ్నించుచుంటిని. ఆంధ్రమునకు అధునాతనరూపము తెచ్చుటకై శ్రమించిన మహోపాధ్యాయుడు శ్రీరామమూర్తి నేడు చెండ్లను పండ్లను అందుపట్ల ముఖ్యముగ నీప్రశ్న తలయెత్తుచున్నది.

శ్రీరామమూర్తి ఆంధ్రభాషకు విశేషమైనసేవ సలిపెనని ఆంధ్రులకు మఱొక ఆంధ్రుడు అంతగా తెలుపనక్కరలేదు. ఆంధ్రభాషామహిమకు సేవసలిపినవారింకను అనేకు లున్నారు. వీరిలో కొందఱు జీవితములోనే ఉచితరీతిని సత్కారముల నందిరి. వారిసేవకును నేడు సన్మానమందు శ్రీరామమూర్తిసేవకును వ్యత్యాసమున్నది. ఇతడు బహుసంస్కృతగ్రంథములను—తప్పుగనేమి ఒప్పుగనేమి—తెలిగింపలేదు. అతుకవనమును, - ఇందు భావమును, జీవమును ఉన్నను లేకున్నను—గణయతులవర్షమును, సభలందు కురిపించి చక్కని శాల్వలను గప్పుకొనలేదు. రంగారుబంగారు అలంకారములను దాల్పలేదు. శ్రీరామమూర్తి నవలలు వ్రాయలేదు—నాటకములు లిఖింపలేదు. పఠనీయగ్రంథములను—ఏతీరుగ పఠనీయములైనను—వ్రాయలేదు. దోబూచికథలు వ్రాయలేదు. కాని, ఈతడు భాషాసేవ సలిపినాడు. అట్లనిన, సారస్వతమున నీతడు నిర్గుణోపాసకుడని తెలుపను. సాహిత్యబ్రహ్మమునే తలచి భావమననమున ధనంజయుడాయెనని తెలుపను. భాషలో లేనిసోయగము నీతడు తేలేదు. లేని భావము నీతడు అల్లుకొని రాలేదు. భాషయందుండి కప్పుపడిన సోయగమును వెల్లగించుటకును, ముసుగుతెరలందును, ముండ్లపొదలందును ఇరుకుకొనినభావమును వెలువఱచుటకును ఈతడు నడుము గట్టెను. ఒక్కడు గునపము చేబూని శతాబ్దములనుండి గుట్టయై నిలిచిన మూఢసంప్రదాయమును త్రవ్వుటకై పూనుకొనుటచే, ఈతడెంతేని శ్రమపడవలసివచ్చెను.

కాలవాహినియట్లు భాష చలింపవలెనని గుర్తించిన నేటిఆంధ్రులలో శ్రీరామమూర్తి ప్రథముడు. మనసీమలో విశేషముగా భాషకేగాని భావమునకు ఆదరము లభించినది కాదు. భావమునుండి చిరిగి చిందరయైనభాష కుట్టువిడినగుడ్డపేలికయట్లు నిరర్థకమైనదని ఎందఱో గుర్తింపలేదు. మానవజాతిని పునరుద్ధరింపగలభావములను వివిధభాషాసేవకులు పృథ్విపై వెదజల్లిరి. గొటేవలన (Goethe) జర్మనీ పునర్జన్మ మందినది. ప్యూరిటనుకవికలము ఇంగ్లాండునకు వేఱురూపు నిచ్చినది. వాల్టేరు రూసోలలేఖి

నులు ఫ్రాన్సునీయకు స్వాతంత్ర్య మిచ్చినవి. శంగీయులరచనములు రామమోహనునిస్యందనమునకు గుఱ్ఱములైనవి. ఆంధ్రులను లేపి నిలువబెట్టు భావములుగాని, మనుష్యహృదయమందును, సృష్టిచిత్రములందును అంతర్వాహినులట్లు ప్రవహించు ఉద్దేశములుగాని తెలుగు గంటములకు దృగ్గోచరము కాలేదు. బండెడుసమాసములందు కొంతశృంగారము నిరికించి ఎగుడుదిగుడు త్రోవలందు మనకవులు పల్లేరు ఆంధ్రసారస్వతమును నడిపిరి. సంస్కృతమందలి ఉద్గ్రంధములను తెలిగించిరి. తియ్యని స్వరమున "తందాన!" యనిరి. గంభీరస్వరమున "భళాభళి!" యనిరి. కాని స్వతంత్రమైనసొత్తును భావమందు కనుగొనరైరి. భాషాస్వాతంత్ర్యమునకు తా వొసగరైరి. ఎన్నియుద్యమములందైన ఆంధ్రులు "అల్లల్లబీరా!" యని ఎగిరి గంతువేసిరిగాని సారస్వతోద్యమమున హేమ్‌లెటులవలె ఊగిసలాడిరి. విభూతిరేఖలయొక్క వడిని కలములు త్రిప్పిరి ఒరవడివెనుక లేగదూడలట్లు చరించుటే గాని, ఒరవడిలో నున్నతత్వమును గ్రహింపరైరి. తల యెత్తి, నాది యనువాక్యము చెప్పరైరి. నిలిచి 'ఈభావము' నాహృదయపృథ్వియం దుద్భవించిన దనరైరి. ఛందశ్శాస్త్రమును, వ్యాకరణశాస్త్రమును దిగమ్రింగి లక్షణయుతముగ, కవితలేనిపంక్తులను, జీవములేని పద్యములను, విసరి 'తధికిణతోం!' అనిరిగాని బ్రహ్మాండమువంటిభావమును చదువరిమనసుకు చూపింపరైరి. పిండికట్లును, పంగనామములును భావబంధనములైనవే కావచ్చును. కాని యింతపిండిని, ఇంతనున్నమును-పూర్వ మెవరో పూసికొనిరని చెప్పి-భాషాసతికి పూసి "జే! జే!!" అనిన సారస్వతాంగన సర్వాంగసుందరియై చూపట్టునా? కాలము ననుసరించినస్వేచ్ఛ-ఇష్టావిహారమును కాదు-నీయక, భాషకు త్రిమ్మెగలెక్కించినచో, అది ఒకయడుగైన కదలజాలునా? ముండ్లపుంతలందే నడచుచు, పాతగాడియందే మనసు నిలుపుచుండుటచే, సర్వతోముఖమైన జాత్యుద్ధరణమునకు వలయుభావములను ఆంధ్రులు స్వీకరింపలేరు. ఈయుద్ధరణమునకు వలసినది సంచలనము, సమధికమగు గమనిక. స్వాతంత్ర్యమనిగాని, జాత్యుద్ధరణమనిగాని, భాషాస్వరాజ్యమనిగాని, భావములకాంగ్రెసనిగాని పెదబొబ్బలు పెట్టక, భాషయందలి సంచలనమునకై శ్రీరామమూర్తి చెమటలోడ్చెను.

భాషగానిభాషను తెగనఱుకుటకును, భావముయొక్క కుత్తుకబట్టి దురంతమున కొడిగట్టు మూలకాయుభాష మచ్చమాపుటకును, నిర్హేతుకముగ వెలివడినభాషను సంఘమందు పునరుద్ధరించుటకును, భాషయందు స్వాతంత్ర్యసిద్ధి జూపుటకును ఈతడు నిద్రాహారములకు తిలోదకములు వీడెను. తెవులును చంపికదా వైద్యుడు రోగిని నిలిపి, పిదప బలమునకు మం దొసగును. రుద్రునిపని ముగిసినగాని, విష్ణువునకుగాని, విధికిగాని పని యేముండును? యాతుధానవిజృంభణము ముగిసినపిదపగదా విరాటుప్రిష్ఠకుగాని, ద్రుపదశక్తికిగాని ధర్మక్షేత్ర మగుకర్మక్షేత్రమున పనియుండును! ఒంటరియై పాటుపడుచున్నందున, శ్రీరామమూర్తి రుద్రక్రియకే అర్ధశతాబ్దమును వెచ్చించెను. తక్కినరెండుపనులు ముగిసినగాని ఈతనిభాషాసేవ ముగియదు. నేడు భీష్ముడై యున్న ఈతనికి కంతవరకు మేమైన ఉండకపోదా?

శ్రీరామమూర్తిని రుద్రు డనుటకు ఎన్నెనికారణము లున్నవి. పోనుపోను మనకే కారణములు పొడగట్టుచునే యుండును. రుద్రుడు తపసి. శ్రీరామమూర్తివంటి శుద్ధదలగలతపసి తెల్గులందు మఱొక్కరుడు లేడు. ప్రపంచమునంతను నిదురవోవనిచ్చి, దిసంతులుగొట్టు దివిపీపమునకు గర్వభంగ మొనరించిన సౌధు డీతడు. శిలాశాసనములనుండియు, చెదపుర్వులపొట్టలనుండియు, బూజుగట్టిన

తాటియాకులనుండియు, శతాబ్దములలోతుగుండియలనుండియు తెలుగుమాటల ఉత్పత్తిని, తెలుగుతల్లి పెంపును, తెలుగుపదములప్రయోగమును, కాలక్రమమున నన్యభాషాసంపర్కమున తెలుగున గోచరించినమార్పులను చూపి నేటితెలుగుశైలి మారుపుగనుట అనివార్యమని నిరూపించుట కీతడు పడిన పాట్లు అనిర్వచనీయములు. తక్కినభాషలందలి సంచలనము నిరూపించుటకై ఇత డాయాసారస్వతములను తరిచి వానియందలిలక్ష్మిని తనభాగ్యలక్ష్మి జేసికొనకపోయినను, తనపూతకర్తవ్యనిర్వాహణమునకై వలయుపరిజ్ఞానమునకై ఒరులసాహాయ్యము నెఱుగక తీరిక నెఱుగక ఈత డెంతేనియత్నము సలిపెను. ఉచ్చారణమందు తప్పులను దాటిపోలేకపోయినను, ఈతడు వంగభాష చదువుట నే నెఱుగుదును. మూలశబ్దములు వాడుకమాట లెట్లగునో నిరూపించుటకు ఒప్పగుహిందీపదముల నీతడు పేర్చొనుట నే నెఱుగుదును. పాళీభాషలోకూడ పాండిత్యముసంపాదించి మంగళసుత్తము చదువుచుండగా నేను చెవులార వింటిని. ఆంగ్లభాషయందలి సంచలనవృత్తాంతము నీత డేకరువుబెట్టుట నే నెఱుగుదును. అక్షరములులేని సవరభాషను గూడెములందు దిరిగి శోధించి దానికి వ్యాకరణమును, నిఘంటువును నీతడు వ్రాయుట నేను కాంచితిని. నా అంతరంగమిత్రుడు శ్రీసునీతికుమారచటర్జీయును, నాకు మిగులగూర్పుగురువగు అమూల్యచరణ విద్యాభూషణుడును అన్యభాషల నేర్పుపట్ల కావించిన యత్నములం దించుకపాల్గొని వారికెనయైన ఆంధ్రుడు శ్రీరామమూర్తి యొక్కడే యని గ్రహించి అతనితో కొన్నిదినము లున్నపుడు నేను మిగుల మురిసితిని. హరినాథదేవతో నీతడు భాషారత్నాకరమున బుడుంగున తనమనసును నింపకున్నను, భాషయందలి బాల్యయౌవనముల నెఱుగుటకై అనల్పమైన శ్రమసలిపెను. ఈకృషియందు ఆంధ్రులలో ఈతనికి ఈతడే సాటియని నొక్కిచెప్పుదును.

“Style is the man” అని Newman ను “Style is psychological” అని Dequincy యును తెలిపినట్లు రచనతత్త్వమును భావహృదయమును, శైలి దృష్టియు నీతడు నిరూపించియుండినచో బాగుగ నుండెడిది. తన గమ్యస్థానమును చెప్పి, త్రోవలోని డొంకలను తెగనఱుకుటకై ఈతడు పయనమైయుండినచో, ఆంధ్రప్రపంచమంతయు నే డీతని ననుకరించుటేగాక, ఈతని అడుగులకు మడుగు లొత్తెడిది. తనగమ్యస్థానమును తెలుపక - ఈతని భాషావ్యాయామ మీతనిగమ్యస్థానమని నేను తలపను - ఈతడు పొదల నఱకుటకును, మూలబడియున్న ప్రాతయంటులను నాటుటకును, పూనుకొనినందున “ఏమితెగువ ?” ని పలువురు ఉలికిపడిరి. ఇంచుమించుగ అందఱి కవులవ్రాతలు ఈతనికత్తిపోటును చవిజూచినవి. “వేదమువారిగ్రంథములందే వేనవేలుతప్పు లుండ ఇక తక్కినవారి వ్రాతలమాటేమి !” అని ఇతడు జలదగంభీరస్వరమున పలికినపుడు పలువురుపండితుల గుండెలు దడదడలాడినవి ! శ్రీపాదవారికిని వీరికిని గలచుట్టరికము, కోఱచూపులందును కొసైనమాటలందును ఉన్నదని ఆంధ్రప్రపంచమెఱుగును. “ఈతనికి సంస్కృతముగాని, ప్రాచీనాంధ్రముగాని వచ్చినట్లు తోచదు. ఇటువంటిఅయ్యల విమర్శనలకు మీవంటివారు ఉపేక్షిస్తారు.” అని శ్రీరామమూర్తి మల్లాదివారికి వ్రాసిరి. ఈలేఖ మాడపట్టున తగిలినంత నే రెండవవారు, కొంతకాలము “వజ్రాయుధము” ఝళిపించిరి. శ్రీరామమూర్తి వెనుకకు తగ్గలేదు.-వాపోటమునకై దగ్గఱైన లేదు. ఆవలింతనైన తా వీయలేదు. శ్రీరాముడు అగ్గిరాము డాయెననియు, గిడుగు రాముడు పిడుగురాము డాయె ననియు ఎఱిగి ప్రతిపక్షులు ప్రక్కసందులో దూరి “బ్రతుకుజీవుడా !” అకొనిరి.

తప్పులను పట్టుటే పనిగలవాడు డొంకలను పట్టువానివలె అదలు పుట్టించును. కావ్యాత్రికుంచ

యందువలెనే సాహిత్యప్రపంచమున పోలీసుగిరి "అమ్మో!" అనిపించును. ఆదర్శప్రాయుఁ డగు భాషాసేవకుడు రాజువంటివాడుగాని హృదయమును బిగించుకొనిన పోలీసు కాడు. శ్రీరామమూర్తి భాషయొక్క jurisprudence (ధర్మశాస్త్రము) చదివి చదివి నమలి నమలి మ్రింగినాడు. "శిక్షణము, రక్షణము, పోషణములకు మూలకందమైన రాజన్యుడవు కమ్మని అతనికి తెలుపనక్కఱలేదు. రుద్రక్రియకై అతడు వెచ్చింపకూడని సమయము నెంతో వెచ్చించివైచెను. విమర్శ ఎన్నడును గొడ్డలి పెట్టగుచో, భాషకు మే లొదవుటకు మాఱు కీడు మూడును. భాషను మూల పడద్రోసి, మాటలకై సాగించిన పెనగులాటకును తీరికూర్చుని 'దూసుకొ'మ్మను అడువారి కయ్యమునకును భేద ముండదు. తనమాటల పెనగులాట ఒకయుద్దేశమునకు మార్గముకాని, తనయుద్దేశసిద్ధి కాదనియు, శోధక్రియమాత్రము తనపనిగాక తండ్రిక్రియ యగుపోషణమును, తల్లికర్తవ్య మగుభాషజీవనవృద్ధియు సారస్వతవసుంధరపై తాను నెఱపవలయుముఖ్యకృత్యమనియు, నేటి Destructive criticism తనగమ్యస్థానముకాదనియు, శ్రీరామమూర్తి చెప్పియుండినచో, ఈవలిలోనే తన కురుక్షేత్రమున తరువాతి యవతారమట్లు తోచి తనపాంచజన్యమును పూరించెడువాడు! తాజేరుతావును తెలుపక తనపూర్వపక్ష మేమో చూపక, శ్రీరామమూర్తి నడచుచుండుటచే, ఈతనిశిష్యులు పిప్పిగంతులు వైచుచు, భాషాప్రపంచమును కిష్కింధ జేసివైచుచున్నారు. తాను "భిషక్కు"ని ఈతడు తెలుపుకొనినాడు. ఈతడు భిషగ్వరుడని తొలినుండియు వక్కాణించుచునే యుంటిని. ఈతని అనుచరులు వైద్యమెఱుంగని వైద్యులు. రోగము వారింతుమని తెలిపి, తెలుగునకు వాతలు పెట్టిరి. అగిడి మంట లెత్తించి ఆంధ్రభాషచే "అమ్మో!" అనిపించిరి. ఒకఅంగమునకు కావలయు శస్త్రచికిత్స వేఱొక అవయవమునకు ముట్టినయెడల, రోగి నిముసములో మటుమాయము కాడా? అవయవశాస్త్ర మెఱిగిన వైద్యుని కత్తిపోటునకును, బండవైద్యము చేయు మంగలికత్తిపోటునకును భేదము లేదా? వెలిమాటలపట్టున కొంత ఆర్యసమాజకత్వమును వెల్లడించినను, వీరిశిష్యులు reform అని పేరున ఉన్నభాషను శూర్పణఖనుచేసిరో, ముక్కుచెవులు కోయకున్నను, వానికి వంకరటింకరలు దెచ్చిరో, దారుణ మగు వాతరోగమున భాషాసతిప్రెక్కలు వెనుకకు విఱిచిరో, తల క్రిందికిని, పదములు మీదికిని త్రిప్పి ముచ్చెమటలు కార్పించి గుండె లరచేత బట్టించి, ఆమెప్రాణములు లొటలొటలాడించుచున్నారు. భాష కున్నఛాందసరూపు మార్చుటకు మాఱు, వెఱ్ఱిరూపు దెచ్చి భాషాసేవకులకు చీకుగొలిపి వీరు "సమితింజయః" అనుచున్నారు. శ్రీరామమూర్తి ఈదృశ్యమును పరికించును గాక.

పూలచెండుపడునది శ్రీరామమూర్తి భాషాసేవమీదనా, శ్రీరామమూర్తిమీదనా అనికాదా తొలి ప్రశ్న? ఒకవిధమైన భాషాసేవయం దీతఁడు ఒంటరియై యున్నట్లే తక్కినగుణములందుగూడ నీత డించుమించుగ నొంటరియై యున్నాడు. సాహసము, ఇచ్ఛాశక్తి, దృఢనిశ్చయము, స్వాతంత్ర్యేచ్ఛ, నిరంతరపరిశ్రమ మున్నగుమహాపురుషలక్షణములు కలిసి శ్రీరామమూర్తి అయినవి. ఈత డేగురునొద్దను విద్య నభ్యసించ లేదు. తనంత దాను చదివి తుదికొమ్మ నెక్కెను. తనభాషాసంస్కరణోద్యమము నెంపొందుటకై నిస్సహాయుడై ఆంధ్రమందును, ఆంగ్లమందును ఈతడు కొంతకాలము పత్రికలు నడిపెను. తొలుత నీతడు సింహనాద మొనరించినపుడు, ఆంధ్రపండితులు గడలు చేబూనిరి. మతసంస్కరణమునకు కందుకూరిపంతులు తొడరినపుడు తోచినకొన్నిట్టులును, వెక్కిరింతలును, మూతివిఱుపులును, చేతిదెబ్బలును ఈతనిగూడ మూర్కొనినవి. మూర్కొనినపుడు పర్లాకిమిడిరాముడు

భార్గవరాము డాయెను! "హతోస్మి" అనుటగాని నీరు నములుటగాని ఈతనిప్రకృతికి విరుద్ధము. ఈ మహాయోధునిబోలిన పలువురు పండితప్రకాండులు జయుదగ్రులైరి. రామబాణముబోలిన ఖరదూషణులు నిలువజాలరైరి పిడివాదము లీతనిహేతువాదమును మార్కొని తుత్తునియలై నేలరాలినవి! శ్రీరామమూర్తి అమోఘమగు విజ్ఞానము! ఈ విజ్ఞానమున తళ్కొత్తునవి నిరపాయమైన వజ్రప్రమేయపులుకావు, ప్రతిపక్షిని వీడని వెనూవియస్ జ్వాలలు. సభాంగణమున నీతనియెదుట నిలిచినపండితుడు ఆంధ్రమండలమున లేడు. ఎదుటివాడెంతమొండిగాడైనను, ఒకమాటు చెంపపెట్టు పెట్టినట్లును, వేఱొకమాటు ముక్కునకు సూటిగా గ్రుద్దినట్లును, ఇంకొకతూరి చింతబరికె చేబూని మోదిదరికినట్లును, మఱొక్కపుడు కుత్తుకపట్టి చిత్తుచేసినట్లును ఈతడు వాదించును! ఈతని పంక్తిపటుపటు మందు వాడియైనతర్కమున్నది! ఈతనితీక్ష్ణ దృక్కులందు మిరుమిట్లు గొలుపుసాహసము మున్నది!! ఈతని బల్లెంపుటూక్తులందు కోసైన మీమాంస యున్నది!!! ఈతని పికిలియందు బలమైన ఆత్మవిశ్వాసమున్నది!!!! సభాంగణములం దీతనియంతరంగమందలిశక్తి ఈతని నీటె జేసివైచును. ఈతని 'బ్రహ్మచెముడు' ఎదుటివాని డాలు! చెల్లపిళ్లకవి నిశితగ్వంగ్య మీడాలు నంటి నిరపాయముగ నెన్నిమాఱులో సభలందు నిలువగలిగినది! ఈతని చూచి అడలనివారు చెవియొద్ద నీతని 'డ్రమ్' చూచి శోకముడుచుకొని పరారియగుదురు! సహవాసఫలమున నీతనిచెవియంత్రముకూడ చేతనశక్తి నందెను! "నీది తప్పు" అని కొమ్ములుతిరిగిన విద్వాంసులను నిలువంబెట్టి గూబకు బెత్తెడుదాచిన ట్లీతడు పలుమాఱు వాకొనెను! "నీదే తప్పు" అనిపరల-తెలో గాదు ఎదుట-పలికి ఈతనిముందీవలిలో నెవ్వరును నిలువలేరు. ఈతనివాదనయొక్క పోటును, వాక్కుయొక్క ధాటీయును ఎన్నో శాల్యాలను చింపి, మూటగట్టి మూల నుంచెను! ఎన్నో గోష్ఠిమండలములను అట్టిటు లాడించినవి!! గంటలకొలది చదువుట ఈతని కట్లలవాటో, గంటలకొలది ఉపన్యసించుట ఈతని కట్టే అభ్యాసము! ఈతని చదువుగదిలో ప్రవేశించి చూడుడు. ప్రపంచముయొక్క ఎన్సైక్లోపిడియాలు-ఎన్సైక్లోపిడియాను మించిన ఎన్సైక్లోపిడియాలు అందుండును. ఈతడుత్తరములనుగూడ కంఠస్థమొనరించును! కామా, ఫుల్ స్టాపులనైన ఈతడు వదల్పక ఉండడు. తాను వ్రాయు ముఖ్యలేఖలకు నకలుఫైలు నుంచుకొనును. రాయసంవారి కీతడు ఒకప్పుడు వ్రాసిన ఉత్తరముయొక్క కాపీ నేడును ఈతని షెల్ఫులో నున్నది! ఈతని యుత్తరపుటూక్తులకుగూడ నూవివెంట లుండును! ఈతనిచదువు, ఈతనివాసములను పెండెములను పట్టియున్నది! ఈతని దొడ్డిలోని ఆవుకూడ ఫైలాలజీ (philology) సూత్రములతో అంబా! అనును. శ్రీరామమూర్తివంటి భీమకర్ములు ఆంధ్రులందు మిక్కిలి తక్కువగ నున్నారు.

స్వాతంత్ర్యేచ్ఛయం దీతడు మిగుల దిట్టరి. ఎదుటిశక్తి విచ్ఛకత్తిరంటి రాజన్యుడైనను, ఈతడనాదరణమునకును, అవమానమునకును, దుర్నయమునకును, దౌష్ట్యమునకును తలయొగ్గి ఐశ్వర్యమును సంపాదింప నొల్లడు. నిరంకుశత్వమునకు దిగదుడుపనియు, బల్లిదునికోరమాపునకు బలాదూరనియు ఈతడు తనస్వాతంత్ర్యమును, తన ఆత్మగౌరవమును కాపాడుకొని, ఆత్మజయమున ఆర్థికకష్టములను కాలిక్రింద నొక్కిపెట్టును! శ్రీరామమూర్తి నిరోగులలో పక్కానిరోగి.

నేటిచెండుల నందున దీతనిశక్తియా, ఆంధ్రశక్తియా, అనికాదా తొలిప్రశ్న! ఆంధ్రనిపట్టుదల ఇతిహాసములవాటి దైనది. నేడది వెనుకగంతువైచినది. తనజాతిశక్తిని తనయందు ప్రస్ఫుటితమైన

రించిన కొలదిమంది ఆంధ్రవీరులలో శ్రీరామమూర్తి యొకడు స్వయంశక్తిపై నాధారపడి ఈతడు పైకి వచ్చెను. ఈతనిజిజ్ఞాస ఈతనియింట బుట్టినది కాదు. జిజ్ఞాససింధువున నీతనికి తెరువుజూపు ధ్రువనక్షత్ర మేమియు గిడుగునభమున లేదు. ఈతనికి దృష్టాంతరమైన వీరిదేకాని మఱొక్కరుడు లేడు. ఇందుపల్లినుండి మూటముల్లెలు కట్టిననాడే ఈతడు వేలుపురుషు డాయెను. నాడే అతనియెదుట ఎత్తైనకొండ తోచినది! బనియన్ తెలిపిన యాత్రికునివలె (Vide Bunyan's Pilgrim's Progress) పడుముట్టి ఈతడు కొండను పట్టెను. వెనుక లోయనుగాని, ప్రక్కపుంతనుగాని ఈతడు చూడలేదు. ఈయాత్మనిర్భరత్వమే భాషాసేవయం దీతనికి ధృతిని, విజయమును చేకూర్చినది ఈతనివిజయము ఆంధ్రజాతివిజయము !!

ఈతనికర్తవ్య మింకను పూర్తి కాలేదు. ఈగతిలో నీతడు తనసమయమునంతను భాషయొక్క Physiology కై వెచ్చించెను. భాషలోని Psychology కై ఈతడొకనిముసమైన నుపయోగిం లేదు. మానవునకు శరీర మాకర్షక మయ్యు, శరీరమునే పడగుద్దిన ఆత్మగతి యేమి? భాషలో technique భాషయొక్క ఆత్మ కాదు. అనవరతము నురుగుపై దేలియాడిన లోనిగతనము చూపు నా? బాహ్యనియమములకై అంగ్రములు కొట్లాడుకొనినట్లు మతైక్యమును పెనగులాడరు బాహ్యనియమములే సారస్వతమనియు, లక్షణయుక్తశబ్దజాలము కవిత్వమనియు, జెట్టిగొడ్డువంటి సమాసము భాషయనియు తలచు వాంధ్రులందు నేడు ఆత్మజ్యోతి మిణుకుమిణుకు మనుచున్నది. ఆదర్శసాస్వతము నేడాంధ్రులందు బండిసున్నయైనది! తెలుగుతల్లి కడుపునబుట్టిన మాటలను వెలిపెట్టు పండితులకు తగదు. పండితులవాక్యలను స్కేలుబద్దతో కొలిచి, ఎగుడుదిగుడులకు చెంపపెట్టిన శ్రీరామమూర్తికి తగదు. ఈతడు ఎగుడుదిగుడులను కూడదనడు. కూడదనినవారు దిగుడుబావి జొచ్చుటేలని శ్రీరామమూర్తివాదన. భాషను శాసించుసూత్రములు పాతక్రొత్తలుకావు. కట్టుక పెట్టినసూత్రములైనను సదాచారమునకు వంగి సలామొనరించును! ప్రాచీన భాషయందలి తేటం మును తెచ్చుటకును, అధునాతన భావశైవలిని ఆంధ్రసారస్వతమున ప్రవహింపనిచ్చుటకును, మే సంపదనేగాక హృదయవిభూతినిగూడ సాహితియందు జొరనిచ్చుటకును, నగలను దాల్చినదయు టార్ పీయుల కన్యవలె కదు - ఆత్మస్వరూపమును, ఆత్మజీవనమును, ఆత్మవిశ్వాసమును, ఆ గౌరవమును ఆంధ్రసాహిత్యము రక్షించుకొనుటకును ఆంధ్రులు నేడు శక్తివంచనలేక యత్నింపవలె

శ్రీరామమూర్తి సప్తత్యుత్సవము రాజమండ్రిలో జరుగుట శుభదాయకము. ఆంధ్రసారస్వత కీపురము పట్టుగొమ్మ. శ్రీరామమూర్తికిని అతని ప్రతిద్వంద్వులకును రణాంగణమైనది రాజమం నేటియుత్సవసమయమున నాంధ్రపండితులు తమపారపొచ్చెములను దిగద్రొక్కి ఆంధ్రభా క్రొత్తసొబగును, ఆంధ్రమాతకు నపూర్వానందమును గొలుపుదురుగాకని ఆశపడుచుంటిని.

ఈయుద్దేశము సిద్ధించుటకు సమయముపట్టును. ఆంధ్రభీష్ముడనదగిన శ్రీరామమూర్తికి కంత పొంసగజాలునది రాజమండ్రిగంగ. సహజధీశక్తి తేటపడ నీమహాపురుషుడు నూతనకర్తవ్య పాణమునకై నేడే కంకణము గట్టుకొనుగాక!

సారస్వతసేవయందును, బాంధవ్యమందును ఈతడు నాకు పూజనీయుడు. నేడు పట్టభద్రు చున్న శ్రీరామమూర్తికి తొలిజోహారు నిచ్చుటకు నాకే ఎక్కువహక్కు కలదు.

# అన్నీ తగాదాలే

భమిడిపాటి కామేశ్వరరావు

(రత్నశాస్త్రి యిల్లు. ఒకప్రక్క కృష్ణాజినం, రాగిచెంబు వగైరా. మరొకవేపున తాళపత్ర గ్రంథాలు, ఒకగ్రంథం చదవడం అప్పుడే ముగించి, శాస్త్రిగారు ఆలోచనలో పడతాడు.)

శాస్త్రి - (తనలో) ఏముందీ! వెనకటి కాలంకాదు, వెనకటి కథగాదు. రోగాలకి మాత్రలు లేవు ఇప్పుడు. గజ్జికురుపేసినా సరే, ప్రతీవాడూ సీసా చీటీ పుచ్చుకుని బయల్దేరుతాడు. తగాదాలు పైసలు చేసుగునే వాళ్ళు లేరు; ప్రతివాడూ వకాల్తీ, దావా, డామేజీ అనేవాడే గాని. చదువుల్లో అమరం వల్లెవేసే చవట ఎవ్వడూ కనపడ్డు, ప్రతివాడూ బి.ఎ.డి., యమ్. ఎ. డి. అంటూ యింగిలీషు. పోనీ పాతాల పుస్తకాలు చూద్దాం అంటే, "మంగలి తలగొరుగును" అంటూ మొదట్లోనే కుర్రాడికి వపనక్రియ బోధిస్తాయి శరీరానికి బలంగాని, మనస్సుకి వికాసంగాని, ఆత్మకి శక్తిగాని వెనకటికి మల్లే లేవు. కూరలూ అవీ వెనకే బాగుండేవి. గాభుపులు వెనకేసినవే గొప్పవి. అప్పటి వర్షాలే వర్షాలు. పూర్వపు దీపావళి పండుగలాంటిది ఇటీవల ఒక్కటీ రాలేదు. వెనక చెడుగుడి ఎల్లా ఆడేవారూ! వెనక ఒక్కొక్కడికి ఎన్నెన్ని తెలివితేట లుండేవి! వెనకటి వాళ్ళు తిన్నట్టు ఇప్పటి రకాలు తినలేరు. వాళ్ళకి మల్లే నడవలేరు, కష్టపడలేరు, ఆమాటకొస్తే ఏమీకూడా చెయ్యలేరు. ఆ తిండీ ఆ తిప్పలూ వెళ్ళాయి, ఆ తెలివీ ఆ తేటా నడిచాయి, ఆ నీతీ ఆ జాతీ చచ్చాయి! యుగధర్మం! ఒకర్ననవలసిన పనేమిటి! అంతా యిల్లా పాడైపోతుందని పురాణాల్లో స్పష్టంగా వివరంగా రాసేశారు. ఆ రాతప్రకారం జరక్కుండా బ్రహ్మరుద్రులు చేయగలా? అయ్యో! అడ్డమైన గడ్డీ కరిచి, సకలమైన అనుభవములునూ అయిన మీదట తాము గ్రహించగలిగిన జీవిత జీవితాంతరాలయొక్క రహస్యాలు ఇమిడిఉన్న జ్ఞానవిజ్ఞా

[ఇది నాలుగు తగాదాల గురించిన వాదోపవాదములు గలది. 2-9-24 తేదీని, మెట్కాఫ్ వసతి గృహవార్షికోత్సవసందర్భంలో, మ. రా. శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారి అధ్యక్షత క్రింద రాజమండ్రి ఆర్ట్సుకాలేజీలో జరిగిన సమావేశంలో, ఇది ప్రదర్శించడం అయింది. ఇచ్చట ప్రకటించినది, మూడవ తగాదా.]

వాళ్ని, అజ్ఞానులైన ఇప్పటివారికి శాశ్వతంగా ఆదేవభాషలో పూర్వులు ఇచ్చి పోలేదూ ! వాళ్ళకావ్యాలు ఇప్పటివారు చూడరుగదా ! చదువరుగదా! చదువలేరుగదా ! వినరుగదా ! వినలేరు గదా ! తప్పువిసరిగా వీళ్ళచేత చదివించే విద్యావిధానమేనా లేదుగదా ! ఆ నాగరవాక్సాగరం చాలావరకు, నాటకాలంకారాలూ, గణితతర్కాలూ, నిఘంటు వైద్యాలూ కూడా, పద్యమయం గదా! అందు విస్తరింపబడని జ్ఞానభాగమున్నూ ముచ్చటింపబడని విషయమున్నూ ఉండబోవుగదా ! పల్లమాలినన్ని శాస్త్రాలూ విద్యలూ చెరుకుపానకంవంటి ఆ సంస్కృతంలో చిరస్థాయిగా ఆకారం దాల్చి ఉంటూండగా, ఏదో తెలుగంటూ దేవుళ్ళాడతారు కొందరూ ! తెలుగులో ఏముందీ ? మృత్తిక ! తెలుగు వొట్టి పిప్పి, తేలిక, సంస్కృతంయొక్క బరువులో నాలుగోవంతేనా ఉండదు. అందుకనే నేను తెలుగుపుస్తకం అనేది ఇల్లా చూడలేదు, ఎన్నడూ చూడను. ఇందులో " బాగున్నా " యంటూన్న గ్రంథాలు, పూర్ణంగా తల్లిభాషలోని కావ్యనాటకాలంకారాలు జిహ్వాగ్రమందున్నవారివే. తెలుగులో ఉన్నజీవం అంతా ఆ సంస్కృతాందే ! తెలుగు రచనలో హాయిగా ఉండేవట్టులని జనం మెచ్చుకొని రొట్టలు వేస్తూండే ఘట్టాలన్నీ, ఆ సంస్కృత సమాసాలు జటిలంగా ఉన్నవే. కాని, ఆరోజుకారోజు అన్నిటితోపాటు భాషకూడా తగులడి పోతోంది. ప్రతీవాడూ భాషతో కలగచేసుగోడమే. ఈ అచ్చురావడం మరీ పుట్టిమునక అయిపోయింది ! ప్రతీవాడూ కవే ! పాండిత్యం లేదు, వీళ్ళ తలకాయా లేదు ! పాండిత్యం అంటే సంస్కృతంలో అన్నమాట, కడంవి పాండిత్యాలే కావు ! ఒక పత్రిక తాలూకు స్వకీయ విలేఖరి ఒక ఆయన్ని ఎవర్నేనా పట్టుకొని పత్రికలో " పండితుడు " అని అచ్చు కొట్టిస్తే, ఆయన అక్షణాన్నించి పండితుడుగా మారిపోనా ! " తెలుగు పండితుడు " అంటూంటారు, వారు నిజంగా, ఏకొంత వరకో, సంస్కృతపండితులే. తెలుగులో-అసలు తెలుగేదీ పాండిత్యానికి! అవశంగా, ఏదో రాశాం అంటూండడం, హైనరమజ్జా అని అచ్చుపడుతూండడం ! అచ్చుకి పంపేటప్పుడు, రచన, కాకితానికి ఒకవేపునే వ్రాయాలట. కాని, కొందరు పత్రికలు నడిపేవారు, ఒకవేపున రాసి ఉన్నదైతే చాలు, ఏమిష్టైనా సరే, అచ్చుకొట్టి పారేస్తారు. ఇక నన్నిచిత్రాలు ? కవిత్వం లేకుండా నాటకాలుట, సంగీతం లేకుండా పద్యంట, పద్యం ఛందస్సూ లేకుండా కవిత్వంట,

అర్థం తెలియకుండా కవిత్వంట! అయ్యొయ్యొ! ఏంచెప్పను! కాల్చుకు తినే స్తున్నారు, వీళ్ళముహం తీర్థానికెళ్ళ! తెలుగు వాఙ్మయంట, దానికి కొన్ని కొత్తకొత్త అలంకారాలుట. అందులో నవలలట-చెవలన్నట్టు, దాల్లో చక్కని కల్పన లుంటాయిట, వేడివేడివి. ఇప్పటి కారువాళ్ళు, వీళ్ళు ఏం కల్పించి ఏడవ గలరు వీళ్ళపిండాకుడూ! వీళ్ళపిండాకుడూ నా బ్రాహ్మణార్థమానూ! ఇదివరకే సర్వమూ వ్రాయబడి చక్కగా సంస్కృతంలో ఉంటూంటే, ఇహేముంది వ్రాయడానికి! మళ్ళీ వీళ్ళు ఏదో రాస్తూండడం ఎందుకో నాకు బోధపడలేదు. కొందరు ఆ దివ్యభాషలోంచి తర్జుమా చేశాం అంటూంటారు, పద్యానికి పద్యం, వచనానికి వచనం, ఫులిస్టాపుకి ఫులిస్టాపూను! ఛస్తే చెయ్యలేరు. ఆ సారస్యం చచ్చిపోదుమయినా రాదు. తెలుగు ముక్కలు రాలిస్తే, సంస్కృతంలో ఉండే మజాకా అంతా పూర్తిగా దిగదుట, అందుచేత, కొందరు అసలులో సమాసాలు అట్లానే ఉంచి డు, ము, వు, లు లాంటివి చివళ్ళకి తొడిగి తెలుగని పారేస్తారు. అది పద్యం కాకుండా వచనం కాకుండా, తెలుగు కాకుండా సంస్కృతం కాకుండా పలుకుఅన్నంలాగ పరిణమిస్తూంటుంది. పోనీ నిజంగా కొత్తవైతే ఊరుకోవచ్చు - కొన్ని కొత్తవి లాంటివి గోకేవాళ్ళున్నా, వ్యాకరణం చూట్టం లేదు వీళ్ళముహం యీడ్చా! ఆ నన్నయా, అధర్వణుడూ, వాళ్ళూ, ఆ తెలుగువ్యాకరణాన్ని సుబ్బరంగా నాగరంలో వ్రాసిపోలే, తెలుగులో రాస్తే అట్టే విలవుండదనీ! సంస్కృతప్రాకృతాలకూ, వేదాధ్యయనాదులకూ ఖనిమై ఒప్పినటువంటి ఆయొక్క నన్నయభట్టు ఆదిని వ్రాసిన చింతామణి మింగిన్నీ, మరియితరమైనవి గ్రోలిన్నీ, పైడిపాటి, అడిదం, కస్తూరి, గణపవరపు వారల నిఘంటువులు తినేసిన్నీ కాకపోతే, తెలుగులో అసలు 'కవి' అనేవాడు జనించి ఉండునా? (కుడి పక్కకి చూచి) ఎవరో వస్తున్నారు!

(సభాపతి వస్తాడు)

సభాపతిలా ఊరుకొన్నాడు, సభాపతేనా ఏమిటి? సభాపతే! సరే, గడ్డం పెంచడమైంది, పెదవికింద కొంత ఉంచడమైంది, దొరవేషమైంది, ఇప్పుడు మళ్ళీ ఇదొహ వేషంలోకి దిగావు! ఇతర హిందువుణ్ణి ఎవర్నైనా వీడు అరవ, వీడు పంజాబీ, వీడు బంగాళీబాబు, అని ఆనవాలు పట్టచ్చును కాని, మన తెలుగు

ఆసామీని చూచి పోల్చడానికి కొంతబుద్ధి ప్రయోగిస్తేగాని లాభంలేదు. తెలుగులో నూటికి తొంభైతొమ్మిది అనుకరణం. ఒకడు బియ్యంమరెడితే అంతా ఆఘరే; ఒకడు మోటారుకారు వేస్తే, అంతా ఆకారే; ఒకడు దివాలాతీస్తే, అంతా అదే. దండకారణ్యానికి దగ్గరవడంచేత రామసైన్యపు లక్షణం సంక్రమించి ఉంటుంది. ఈమాత్రం ఆలోచించలేరు, ఏమన్నా అంటే ప్రతీదానికీ "ఎందుకు? ఎందుకూ?" అంటూ నిశిందాగా కారణా లడుగుతారు. అయినా గానీ, నాకెందుకులే, నీవేషం జోలి! నీ కాఖాల్యపు తిక్క వదిత్తే నువ్వే తిన్న పడతావు! వేషాని కేమీ అనలేదు. గాని, భాష పాడుచెయ్యడానికి బయలుదేరావు ఏమిటి నువ్వుకూడాను!

స - మీ "ట" కారప్రయోగాన్ని బట్టి, మీరు ఏదోమోస్తరుగా విన్నారని తెలియబడుతోంది. ఈ భాషావ్యవహారం స్థిరపరచడానికి రాసి ఉన్నదాల్లో లేశమైనా మీ రెరుగరు. ఎరిగిఉంటే, పాడుచెయ్యడం పుణ్యం ఎవరు కట్టుకున్నారో గ్రహించి మరీ మాట్లాడి ఉందురు!

శా - సరిపోయింది! ధ్వంసంచెయ్యడం మొదలెట్టింది నువ్వూ! ఆమాట నిన్ను అని పోతారని, ఇతరులమీద ఆ అక్షతలు ముందే వేస్తున్నావ్? అయితేనూ, పండితుల్ని పట్టుకొని దులుపుతున్నావు ఏమిటి, మొహంఎదటే, ఏమీ అట్టే పెట్టకుండాను!

స - అందుకనే మీరు సత్యంచూడకుండా అభిప్రాయా లిస్తున్నారని చెప్పింది! అసలుముందు "పండితుడు" అంటే ఏమిటో నిర్వచించి, ఆతరవాత మరేమన్నా కానీండి. పండితుడికి నేను దాసోహం చేస్తాను.

శా - ఓహోహో! మతిగానీ పోతోందా ఏమిటి నీకు, సభాపతీ! ప్రతీదానికీ నిర్వచనం అంటూకూచుంటే ఎల్లా ఏడుస్తుందీ? పదాలయొక్క నిర్వచనాలు ఆయాశాస్త్ర సందర్భాల్ని బట్టి ఉంటాయి, పిరాస్తాయి. గోరంతలు కొండంతలు చెయ్యరాదు. మామూలుగా "పండితులు" అని మనం ఎవర్ని అంటామో నీకు తెలియనే తెలియదూ? అథమం సంస్కృతంలో పంచ... ......

స - తెలుగులో మాట నే అడుగుతూన్నది!

శా - తెలుగులో మాటే నే చెబుతూన్నది! ముందు సంస్కృతంలో పంచ......

స - అక్కడికి ఆపంచశిఖలూ ఏవరేనా తెలుగులో ధరిస్తే చాలదూ, ఆ ఒకర్ని తెలుగు పండితుడు అనడానికీ?

శా - ఏడిసినట్టేఉంది, ఏడుపు. ముందు దేవభాషలో కావ్యాలు చదివి, శాస్త్రైనా వ్యాకరణం, అలంకారం గొణిగి, నాటకాంతం చూచి, అప్పుడు తెలుగులో పంచ......

స - మీరు చెప్పేది సంస్కృతాభ్యాసానికి. పైగా, అన్నింటికీ శిఖరప్రాయంగా ఆనాటకాలు ఉద్భవించడం చేతనున్నూ, ఆనాటకాలు రాసినవాళ్లు తర్కవ్యాకరణాలంకారాదులలో మునిగి తేలి ఉన్నవాళ్లవడంచేతనున్నూ, చదివేవాడు కూడా ఆక్రమాన్నే చదువుకోవాలి. కాని, తెలుగులో నాటకాంతం అన్నా నాటకప్రారంభం అన్నా విశేషంతేడా ఉండదు. మనం మాట్లాడేది ఆచదువుకోడం ప్రశంసకాదుగా !

శా - బాగానేవచ్చింది, నీకోటికుతర్కం! నీతో మాట్లాడ భయం, ఎదటపడ భయం. నీకు ప్రతీదీ తప్పే ! అల్లాయితే, పంచ ...

స - ఉండవయ్యా, పంచాలేదు, ఉత్తరీయంలేదూ! అదా! తప్పులు కనపరచడమూ నీకు కోపంవస్తా! ఉన్నదిఉన్నట్టు చెప్పడమేనా, నువ్వొందాకా తిట్టడమన్నావ్! తప్పు అనేమాట నిర్వచించు. భాషలో తప్పు ఒప్పు నిర్ధారించగలవాడెవడు? "ఇతరులంతా తప్పులుపట్టుకునేవాళ్ళేను" అనుకునే వాళ్లా పండితులు !

శా - అదికాదు ! ఇల్లా లెక్కపెట్టి మాటల్లో తప్పులు ఏకరువుపెట్టడంలో నీఅభిప్రాయం ఏమిటి ? ఎన్నితే ఎవరికుండవు ? ఆయెన్నిక ఏమి అక్కరకు వచ్చేపని? "ఏకోహిదోషో గుణసన్నిపాతే" అనిలేదూ! "ప్రబంధము నా జలరాశి, దాని లోపలగల నెరుసుల్ గణింతురె, అపారములౌ మణులుల్లసిల్లగన్" అనిలేదూ! "కాళిదాసమయూరాదికవులకైన గలవు తప్పులనంగ, నన్యులకులేవె!" అన లేదూ అప్పకవి ?

స - అదా! నేను పండితుణ్ణికాను, విద్యార్థిని. పదస్వరూపం, పదప్రయోగం, కారకం మొదలుగాగలవి సూత్రానుసారంగా నిర్వహించిన వానికోసం ఆంధ్ర

వాఙ్మయం వలలువేసి వెతికి చూస్తున్నాను. ఇంతవరకు ఎవ్వరూ దొరకలేదు. అనుసరిస్తాం అన్నవి అనుసరించకపోడంవల్ల వారికి పదస్వరూపంలో కుప్పలు కుప్పలుగా తప్పులు. అవి యేరడంవల్ల తెలుస్తూన్నదేమిటంటే, పాండిత్యం వ్యాకరణం వ్రాయడం ఎడంఅనీ, వ్యాకరణం కవిత్వం వేరనీ, కవిత్వానికీ పాండిత్యానికీ దూరమనీను ! ఇప్పటిగ్రంథకర్తల్లో ఉన్నారు ఒకటిరెండు పుష్కరాల్నించి కృషి చేస్తూన్నవాళ్ళు. వాళ్ళతప్పులు 'ఏకోహిదోషో' అయితే ఇంకేం. నిత్షే షంలాగ ఎల్లానో అల్లా ఏడుద్దుం, వేనవేలుగా ఉన్నాయికర్మం. వాటితో మహా మహాగ్రంథాలు, మాకు ఆదర్శంగా రాసిపారేశారు. ఆతప్పులన్నీ వాళ్లు దిద్దుకోడం ఎప్పుడు? అవి రానీకుండా వారు గ్రంథాలు రచించడం ఎప్పుడు ? ఇంకా ఇన్నేళ్ళొచ్చి చదువుకోక మన్నుకొట్టుగోనా, అన్నట్టు ! మనల్ని ఒకరు అఖాతంలో దింపుతూంటే, ఆమాట అనుకోడం తప్పా ? వాఙ్మయంలో పర్వతాలుంటాయి, అఖాతాలూఉంటాయి. పర్వతాలమీదికెళ్ళి ఆనందించడం గురించి పామరులకి చెప్పడం విమర్శించేవాడిపని ఎల్లాగో, అల్లాగే అఖాతాల్లో వాళ్ళు పడిపోకుండా కాపుపెట్టడంకూడా వాడిపనే. తప్పులైతేనేం ? పెద్దవాళ్లతప్పులు గణ్యతలోకివచ్చి కీర్తివహిస్తాయి. వాటిని తప్పులుకాకపోతే, పోనీ, విశేషాలనండి.కనక, ఈగ్రంథకర్తలనెత్తిమీదే ఇన్ని ఎగుడుదిగుడులు ఊరేగుతున్నాయి కాబట్టి, అంతాకూడా, నన్నయ్య వెయ్యేళ్ళకింద రాసిన వ్యాకరణం అవతలెట్టి, ఉపయోగిస్తూన్నభాష పెరుగుతూన్నకొద్దీ గ్రంథస్థం చేస్తే చక్కగా ఉంటుంది.

శా - (తలగోక్కొని చెయ్యికడుక్కొని, ఆచమనంచేసి) అయ్యయ్యో, కర్మమా! కలియుగాదిని నన్నయ్య వ్రాసింది కాదంటున్నావు, కళ్ళోతాయయ్యా!

స - ఏమీ పోవు! నన్నయ్యే ఇప్పుడుంటే వెనక తను రాసింది కట్టిపెట్టి మరోదస్త్రం తీసి ఉండేవాడు. అంచేత ఇప్పుడు నన్నయ్యావద్దు, మరి చిన్నయ్యా వద్దు !

శా - వ్యాకరణం అక్కర్లేకపోతే ఎల్లాగయ్యా ఏడవడం ? ప్రతీ వ్యాకరణం రాని చవటకూడా, వ్యాకరణం వదిలేశి రాశానంటూ బయల్దేరుతాడు, వచ్చి మానేసినట్టూ !

స - బయల్దేరితే ఏం ? మీకెందుకు కోపం ? జీవభాషంటే మీకంత ఆగ్రహం యెందుకూ ఎంతమందినేనా రాయనీండి !

శా - మాల మాదిగ అష్టాదశవర్ణాలవాళ్ళనీనా ?

స - ఆ !

శా - ఆ రాతలన్నీ నేను చదవనా ?

స - ఎవరన్నారు ? అవి చదివేవాళ్ళు వాట్లకి ఉంటారు. రాయవద్దని అనటానికి మీ రెవరు ?

శా - నేనా ? పండితుణ్ణి ! నోటికొచ్చినట్టు రాసేవాడికి వాతెట్టేస్తా. ఆ రాత నాశనం చేయిస్తా !

స - రాతల్లో దేశానికి కావలసినవి నిలుస్తాయి, అనగా మనుష్యులకి. "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుష్యులోయ్ !" అని కవి అన్నాడు. మనుష్యులకి అక్కరలేనివి నశిస్తాయి. కాబట్టి, మీరే బొడ్డున మాణిక్యం పెట్టుగోని పుట్టలేదు. అందర్నీ ప్రయత్నించనీండి. యత్నానికేం? మనిషై మాటలొచ్చి, జన్మానికి శివరాత్రిలాగ చివరకి ఒక్కమాటైనాసరే ఎదో ఒకసందర్భంలో నేనా 'ఆహా!' అని అనుకోగలిగి ఉన్నవ్యక్తి అయిఉండేచాలు! రాయచ్చు! అల్లాచేస్తే, క్రమేపీ, ఈ అపారవాఙ్మయంలో విశేషపరిచయం పదాలతో గలిగిన అతడు ఒకడు బయలుదేరి, కవిశబ్దం సార్థకం అయిపోయినవారి రచనల్లోఉండే నిత్య ప్రయోగాలు చూసుగోని, వాటి ఆధారంతో లక్షణంగా వ్యాకరణం రాస్తాడు.

శా - అప్పుడెందుకు ఏడవనూ, ప్రతీ పనికిమాలినవాడూ హద్దులేకుండా పుస్తకాలు రాసి తగులడ్డాక! అది రాయడం పూర్తి అయేటప్పటికి మళ్లీ కొంత మార్పు మాట్లాడేమాటల్లో కలిగితే- కాకులలెఖ్ఖలోలాగ- ఆవ్యాకరణాన్నిబట్టి వ్రాసింది కృతకభాష అయిపోదు మరీ! చావొచ్చి పడిందయ్యా, వ్యాకరణం కాదుగాని! అందుకనే దివ్యాంశసంభూతులైన ఆపాణినీ, పతంజలీ.........సరేకాని, వ్యాకరణం ఎందుకంటావ్, అసలూ!

స - వ్యాకరణం ఎందుకంటే, సజీవమైన భాషాస్వరూపాన్ని సమర్థించి, సకారణంగా సోదాహరణంగా నిర్ణయించడానికి; పదాలచరిత్రలో ఉండే మార్పు గ్రహించి, వాటి దారి సూచించడానికీ; పెనక ఓపదం ఎల్లా ఉండేదో గ్రహించుకోడానికీ;

అనగా, పూర్వగ్రంథాలు చదువుకోటం వీలుగా ఉండడానికి; అన్యభాషవాడు ఈభాష నేర్చుకోడానికి;

శా - అల్లాయితే, వైయాకరణి తనకాలంలో ప్రచురమై ఉన్న అడ్డమైనచెత్తా చదవాలనా నీమాట? బాగుంది. జనసామాన్యం మూర్ఖులుగనక, వాడు శాసించి చేసిన వ్యాకరణప్రకారం వీళ్లు మాట్లాడడం నేర్చుకోవద్దూ !

స - ఇల్లా అసందర్భంగా భీష్మించుకొని కూచునేవాళ్లు భాషని తాము పెంచాలేరు ఇంకోర్ని పెంచానియ్యరు.

శా - లావైతే సరావిమిటీ, బలుపో వాపో చూసుగోవద్దు !

స - సజీవమై ఉందో లేదో చూసుగుంటే సరి......పెంచలేరు సరిగదా, పండితనామం తమరే జుట్టుకోవాలని వారి ఊహ. అందుకనే, అందర్నీ రాయనియ్యద్దంటారు. నూటికి చదువురానివాళ్లు తొంభై పైగా ఉన్నారు. ఇంతమాత్రానికే, ప్రతివాడూ చదువేనా అని కొందరు గోలెత్తుతున్నారు. ఇల్లా గోలెత్తేవాళ్ళు ఇతరభాషల్లో లేకపోవడంవల్లే అవి పెరిగి కొమ్మెక్కాయి.

శా - సరేలేస్తూ! నాకు తెలియదూ ఈమాత్రం! మూలసూత్రాలు వొదిలి లేనిపోని పరుగులెత్తమంటావ్? ఏమీ వ్యాకరణం లేకుండా ప్రతివాడూ రాయవచ్చుననా, నీఉపదేశం. ఆహాహా! మానాయ్న మానాయ్న! అప్పుడు ఒహడి మాట ఒహడికి బోధపడ్డం ఎల్లాగ?

స - అక్కడే ఉంది మీబోట్లవెర్రి! వ్యాకరణాలు ఈరోజున చింపిపారేస్తే, మనకందరికీ, భాష, బోధపడడం మానేస్తుందా? పంచాంగాలుండకపోతే గ్రహణం పట్టడం ఆటంకం పడిపోతుందా? భాషాభివృద్ధి సహజం. ప్రపంచములో చెవులెట్టుగొని విన్నప్రయోగాలతో, తెలుగు భాషాగ్రంథాలు కళ్లెట్టుగొని చూసిన ప్రయోగాలతో, ముందు తనకేమన్నా విశేషభావం ఉండి, అది నాప్రజకి అందిస్తాను అనుకునేవాణ్ణి ప్రతివాణ్ణీ రాయనీండి. మీకు అక్కర్లేకపోతే ఊరుకోండి. ఒకరచన ఊళ్ళోవాళ్ళకి ఎవళ్ళకో తెలియడం లేదేమో అంటూ మీరు పూసుగొని రాకండి, వాళ్ళ గుండెలన్నీ మీరు దూరి చూసినట్టు!

శా - అల్లాయితే, మనిషికో వ్యాకరణమా ?

స - ఎవడేనా అఖండుడై, వాడిఆలోచన జనానికి అవసరమైందయితే, వాడి భాష జనం నేర్చుకోవలసిన పనొచ్చి, వాడినిమిత్తం ఓవ్యాకరణం లేవదీయవలసివస్తుంది. అల్లా ప్రత్యేకవ్యక్తులకోసం పుట్టిన వ్యాకరణాలు ఇతరభాషల్లో ఉన్నాయి.

శా - ఎన్నట చెప్పు. తప్పులొస్తే రావచ్చు! ఎవరేంచేస్తారు వస్తాంటేనూ? "ప్రమాదో" అన్నారు పెద్దలు. అంతమాత్రాన్ని ఆదర్శం ఎల్లాపోతుందీ?

స - ఆదర్శం అంటే, ప్రపంచంలో లేనిదా? ప్రకృతి సంభవాలకి ఆదర్శం ఏమిటి? ఆదర్శం ఈదర్శమూను!

శా - ఏమైనాసరేగాని, మాట్లాడుతూన్నట్టు రాయడం వేళాకోళపు రాతల్లో ఒప్పుగోవచ్చు!

స - ఒప్పుగోవడం ఎవరు? ఎందుకు? మాట్లాడుతూన్నట్టు ఉంటే మానవులు వింటారు. లేకపోతే దేవతలు ఆలకిస్తారు, తీరుబడి చూసుగుని.

శా - మానవులు వినిపించుగోకపోయినాసరే, అవ్యాకరణంకంటె కువ్యాకరణం నయం.

స - మరిసెలవ్, ఒకేమాటకి వాదించేవారు వేర్వేరుగా నిర్వచనం చెప్పేటప్పుడున్నూ, లేనిపోనిచోట్లకూడా ఆదర్శాలు అంటూ మొదలెట్టేటపుడున్నూ, అహంభావత్వాలు బయలుదేరినప్పుడున్నూ, వాదనలు కూడదు.

శా - అల్లాఅయితే నువ్వు రాయవోయ్, వ్యాకరణం! నువ్వు శాసించు!

స - అబ్బ! అది కాదు వ్యాకరణం అంటే అని చెప్పలేదూ! పోనీలెండి. దీనికి అంతేమిటి తెంపేమిటి? సభట సాయింత్రం, ఆనందం సంగీతరావూవాళ్లూ వస్తారట మీరుకూడా రండి, వాదం అనేది మనతోనే ఉంటోంది ఎంచేతోగాని!

(అని కుడివేపుకి వెళ్లిపోతాడు)

శా - చూద్దాం!

# ప్రశంస

## సెట్టి లక్ష్మీనరసింహము

శ్రీరామమూర్తి పూర్తి కృప నార్తి
యుడుగు గిడుగు వేంకటరామమూర్తి
పంతులుగారికి; వారికి భువిపై
చాలా సౌఖ్యము సమకూరుఁ గాక !

వివిధవిద్యలందు విశేషంబగు
విజ్ఞానమునకును, జ్ఞానమునకూ,
మడుఁగు గిడుగు వేంకటరామమూర్తి
పంతులుగారని ప్రసిద్ధి గాంచిరి.

విద్య యెంత హెచ్చుగా వచ్చినా,
కీర్తి యెంత హెచ్చినా, వినయమే
తోడుగు గిడుగు వేంకటరామమూర్తి
పంతులుగారికి : పయి తోడువు లేల ?

డెబ్బయియేడులు, వారి యీడిపుడు ;
శిష్యు లన్ననో, వందలూ వేలు;
అయినా, ఇపుడూ చిన్నప్పటివలె
విద్యాసంపాదనమున మాత్రము
వడుగు గిడుగు వేంకటరామమూర్తి :
పంతులుగారే, బడిపిల్లఁ డహాహ !

తనకు తెలియనట్టి విషయ ముంటే,
తనకంటె చిన్నవాళ్లనైననూ
సంశయములెల్ల తీర్చేవఱకూ
అడుగు గిడుగు వేంకటరామమూర్తి,
పంతులు గారని ప్రజల్లు పలుకక.

ఏవిషయాలను బట్టుకొన్ననూ,
వాటిలోని కల్మషమెల్ల పోయి
సారాంశము తేలే వఱకూ జల -
గడుగు గిడుగు వేంకటరామమూర్తి
పంతులుగారి యపారవివేకము.

శాస్త్రచర్చ యంటూ పడినప్పుడు,
ఇతరపండితుల వాక్యసంచయము
పేక వంటిదైతే, యా నేతకు
పడుగు గిడుగు వేంకటరామమూర్తి
పంతులుగారెది పలుకుదురో యది.

ప్రజ్ఞ లేమిచే పరులకు వెలిచే
బడుగు గిడుగు వేంకటరామమూర్తి
పంతులుగారికి పరిచర్య చేసి,
పండితుండయి, సభారంజకుఁ డగు.

తెలిసీ తెలియని దంభపండితుల
పటపట వాఁగే నోరూ ముఖమూ
ముడుఁగు గిడుగు వేంకటరామమూర్తి
పంతులుగారొక పరిని గనంబడ.

ఆంధ్రవ్యాకరణజ్ఞతను బిట్ట -
పిడుగు గిడుగు వేంకటరామమూర్తి

పంతులుగారని బాగా యెఱింగి,
వారు కోరు భాషాసంస్కరణము
సమ్మతింపనట్టి వారలైనా,
వారితోడ వాదింప జంకుదురు.

నోటిలోనుండి వెలువడి వచ్చిన
నుడుగు గిడుగు వేంకటరామమూర్తి
పంతులుగా రతిపాత్రులని తెలుపు ;
ప్రాణము పోనీ, పవిత్రవాక్కైన
చెడుగు గిడుగు వేంకటరామమూర్తి
పంతులుగా రెప్పటికీ పలుకరు.

కుప్పగ పోయండీ ద్రవ్యము తల -
పాడుగు, గిడుగు వేంకటరామమూర్తి
పంతులుగా రొక పాపంబైనా
చేయుదురని నమ్మడమే పాపము. .

ఏ గాలివానలోనైనా తన
మంచితనమె తను సంరక్షించే
గొడుగు గిడుగు వేంకటరామమూర్తి
పంతులుగారికి : భగవంతుఁ డతని
శతవర్షజీవిగాఁ జేసి, మంచి
యారోగ్యమునూ, భాగ్యమూ, సుఖము
నొసఁగి, వంశాభివృద్ధి కలిగించుఁ
గాక !

# మాతృభాష - పరభాష

తెలికిచెర్ల వెంకటరత్నం

శిశువు, పుట్టగానే, శరీరములోని కొన్ని కండరములవ్యాపారమువల్ల ఏడుస్తాడు. మొదటిదినములలో ఆయేడ్పు తనకేదయినా కావలెనని తెలియజేసే ఉద్దేశముతో కూడుకొనిఉండదు. కాని క్రమముగా ఏడుపు ఎప్పుడు వినబడ్డా తల్లిగాని దాదిగాని బిడ్డవద్దకు పోయి తగినఉపచారములు చేసి, ఆహారము ఇచ్చి సంరక్షిస్తూ ఉండడము కనిపెట్టి, అటుపైని ఉద్దేశపూర్వకముగా ఏడ్చి తనపనులు సాధించుకొనుటకు శిశువు ఉపక్రమిస్తాడు. కొన్నాళ్ళకు ఆయేడ్పులోనివైవిధ్యము గమనించి బిడ్డ ఎందుకు ఏడుస్తున్నాడో తల్లి గ్రహించగలుగుతుంది; అనగా అప్పటికి ఆయేడ్పుయొక్క స్వరములో భావబోధకత్వము ఇమిడి ఉన్నదన్నమాట.

ఆరేడువారములప్రాయము వచ్చేదాకా బిడ్డకు ఊసులాడుట (babbling)రాదు. ఊసులాడుట భాషాభ్యాసప్రయత్నములోని ద్వితీయావస్థ. ఈసమయములో శిశువు తనవాగింద్రియములను ఉపయోగించడానికి నిరంతరప్రయత్నము చేస్తూఉంటాడు. ఆప్రయత్నమువల్ల మొట్టమొదట సాధ్యమయేవి సులభముగా ఉచ్చరింపదగిన ప, బ, మ వర్ణములు. బిడ్డ తల్లివద్ద పాలు తాగేటప్పుడు వానిపెదవులలోని కండరములు బలపడి వర్ణోచ్చారణమునకు శక్తిమంతము లవుతవికనుక ఓష్ఠ్యములు పలుకగలుగుతాడు. క్రమక్రమముగా ఇతరవర్ణములుకూడా ఉచ్చరించడము అలవాటవుతుంది.

శిశువు సహజశక్తిసంపన్నములయిన తనవాగింద్రియములు ఉపయోగించడానికి ప్రారంభించినప్పుడు అవ్యక్తాలాపములు చేస్తాడు. చేతులూ, కాళ్లూ ప్రయోజనమపేక్షించకుండా ఆడిస్తూ ఆడుకొంటూఉన్నట్టే, వాగింద్రియములతోకూడా ఆటలాడుకొంటాడు. ఆఆటసందర్భములో అమ్మమ్మమ్మ, అత్తత్త మొదలగుధ్వనులు వెలువడతవి.ఆధ్వనులకు పరిసరవర్తులగుపెద్దలు భావములు కల్పించి తల్లినీ అత్తనూ శిశువు పిలుస్తున్నాడని భావిస్తారు. ప్రతిశబ్దమునకూ నిర్దిష్టార్థ ముంటుందనే భావము భాషాపరిచయమువల్ల వారికి ఏర్పడిఉన్నది గనుక శిశువు ఉచ్చరించే పదములకు

ఈవ్యాసము రాజమహేంద్రవరములో 1938 వ సంవత్సరములో జరిగిన ఆంధ్రసాహిత్యపరిషన్మ్యాసికసభలో చదివినది.

కూడా భావబోధకత్వ మూపాదించి తమకుతోచిన అర్థములను ఆపదములకు అంట గడతారు. ఈవిధముగా ఏర్పడినవే ఒకవిశిష్టజాతిపదములు ప్రతిభాషలోనూ ఉంటవి. ఈపదములలో సంయుక్తాక్షరములుగాని, ఉచ్చరించుటకు కష్టతరములయిన హల్లులుగాని ఉండవు. కొన్ని భాషలలో ద్విత్వాక్షరము లుంటవి. ఒకేహల్లు తరుచుగా అకారసహితముగా పలుమారు వస్తుంది. కొన్ని భాషలలో ఇవి అజాదులు, కొన్నింటిలో హలాదులు. ఇట్లే కొన్ని భాషలలో ఇవి హలంతములు, కొన్నిటిలో అజంతములు. ఆయాభాషలతత్త్వమునుబట్టి ఏర్పడే ఇట్టిస్వల్పభేదములలోతప్ప తక్కిన విషయములలో ఈపదజాలములలో స్వరసామ్యము కనబడుతుంది.

అమ్మ అనేపదమును గురించి ఇక్కడ విచారింతము. నిర్దిష్టభావ మేమీ లేకుండానే 'అమ్మమ్మమ్మ'అని శిశువు ఉచ్చరిస్తూ వాగింద్రియములతో ఆటలాడుకొంటూ ఉండగా శిశువు తన్ను పిలుస్తున్నాడని ప్రేమపూరిత అయినమాత భావించుకొని వాని వద్దకు పోతుంది. ఆశబ్దము ఎప్పు డుచ్చరించినా తల్లి తనవద్దకు రావడము చూచి శిశు వాశబ్దమునకూ తల్లి వచ్చుటకూ సంబంధము గుర్తించి తొలుతటి అవ్యక్తాలాపమునకు భావబోధకత్వము కల్పించుకొంటాడు. పాశ్చాత్యభాషలలో Mamma, Mama,Ma అనుహలాదిపదములూ, ఆల్బేనియను భాషలో Ama, ప్రాచీననార్సు భాషలలో Amma, సెమిటిక్ భాషలలో Am, um, em అను అజాదిపదములూ అమ్మాఅనుఅర్థము బోధించునవి ఉన్నవి. ఇండోయూరోపియన్ భాషలలోనిమాతృ, Mother, Mutter, Mater, Meter అను పదములు తొలుతటి మా అనుపదమునకు ప్రత్యయసంయోజనమువల్ల కలిగినరూపములు. స్లెవోనిక్ భాషలోని Baba, టొంగాభాషలోని Bama అనుపదములుకూడా తల్లి అనుఅర్థమునే బోధిస్తవి.

తల్లి అను అర్థముగల పదములలో Mamma, Mama, Ma ఉన్నట్లే తండ్రి అనుటకు Pappa, Papa, Pa అనుపదములున్నూ పాశ్చాత్యభాషలలో కలవు. ఈ రెండువర్గముల పదములకూ గల స్వరసామ్యము గమనించవలెను. ఇండోయూరోపియను భాషలలో ter అను ప్రత్యయము అంతమందుగల మా అనుపదముయొక్క రూపములయిన మాతృ, Mother, Mutter, Mater, Meter వంటిపదములే, తండ్రి అనుఅర్థములో పితృ, Father, Fader, Vater, Pere మొదలయిన పా అను ప్రాచీనపదముయొక్క రూపములు. Pope అనుపదము Papa అను పదము

నుంచి జనించినదే. ఇటాలియనుభాషలోని 'Babbu' బల్గేరియను భాషలోని 'Baba', సెర్బియనుభాషలోని 'Baba', టర్కిష్ భాషలోని Baba అను పాలాది పదములున్ను సెమిటిక్ భాషలలో, Aba, Abu, Abba మొదలయిన అజాది పదములున్ను పితృశబ్దబోధకములే. ఈఅర్థములోనే తవర్ణముతో కూడుకొన్న పద ములు చాలాభాషలలో ఉన్నవి. సంస్కృతములో తాత, కాంగో మొదలగు ఆఫ్రి కన్ భాషలలో tata, నీగ్రోభాషలో tatta, రష్యన్ భాషలో tyatya, వెల్ష్ భాషలో tat— దానినుంచి ఉత్పన్నమయినదే ఇంగ్లీషుభాషలోని dad. ఈవర్గ ములో అజాదులగు పదములుకూడా కొన్నిభాషలలోఉన్నవి: గ్రీక్ భాషలో 'Atta', గాథిక్ భాషలో 'Attila', మాగ్యారుభాషలో 'Atya', టర్కిష్ భాషలో 'Ata' మొదలయినవి.

అమ్మ,అన్న,అప్ప,అక్క,అత్త, నాన్న మొదలగు బాంధవ్యార్థబోధకపదములలో మాత్రమే కాక శిశువునకు ఆసక్తిగలవస్తువులపేళ్లలోకూడా వివిధభాషలలో స్వర సామ్యము కనబడుతుంది. ఆహారము కావలసినపుడు శిశువు 'మ్ మ్ మ్' అని రోద నముచేస్తాడు. ఆయేడుపులో తనకాహారముకావలెనని తెలియజేసేఉద్దేశము ఉన్నట్లు నిర్ధారణచేయలేము. ఆవిధముగా ఏడ్చినపుడల్లా తల్లి వచ్చి ఆహారము ఇస్తూ ఉండడ ముగమనించి అటుపైని ఆహారముకావలెనని సూచించడానికి ఆవిధముగానే ఏడుస్తూ ఉంటాడు. దానినుంచి పుట్టినవే వివిధభాషలలోని మమ్మామ్, మామ్, మమ్, ఆమ్, హామ్ మొదలయిన పదములు.

శిశువు ఉచ్చరించినప్రతిశబ్దమునూ తల్లిదండ్రులెంతో ముద్దుముచ్చటలతో ఆల కిస్తూ, వాటికి భావములను కల్పిస్తూ, తాము శిశువువద్ద ఉన్నప్పుడు ఆమాటలే పలుమారు పలుకుతూ ఉంటారు. ఆపదములు దుష్టములనీ, అర్థరహితము లనీ తప్పులుపట్టి దండించక, ఆపదములు మరల మరల శిశువు ఉచ్చరించే టట్లు ప్రోత్సహిస్తూ, వాటిలోని దోషములను తమప్రేమచేత కప్పిపుచ్చుతూ, క్రమ క్రమముగా వాటిని సవరిస్తారు. తమ కదివరకు పరిచితమయిన శిశుభాషకున్ను తమపిల్లవాని భాషకున్ను సామరస్యము కలిగించి వానిభాష కొక స్వరూపము చేకూరుస్తారు. ఇట్లేర్పడిన శిశుభాష శిశువు తనకార్యములు నెరవేర్చు కొనడానికి సరిపోతుంది. ఇదిమాతృభాషాభ్యాస ప్రయత్నములోని మూడవ అవస.

శిశుభాష వ్యవహరించుకొంటూ ఉన్న కాలములో పిల్లవాడు తనతల్లిదండ్రులూ బంధువులూ వాడుకొంటూఉండే భాషను ఎల్లప్పుడూ వింటూ, సందర్భమునుబట్టి కొన్నికొన్ని మాటలఅర్థము గ్రహిస్తూఉంటాడు. ఆపదములను తాను స్వయముగా ఉచ్చరించడానికి కొన్ని దినములు, లేక మాసములు పూర్వమే వానిఅర్థము తెలుసుకొని ఉంటాడు. క్రమముగా గృహావరణమును కుటుంబావరణమును దాటి తోడి బాలబాలికలూ, ఇరుగుపొరుగువారూ, బంధువులూ మొదలయినవారితో కలిసిమెలిసి ఉండి ఆసంఘములో వ్యవహారములో ఉన్న భాష నేర్చుకొంటాడు. కొత్త ఆట పాటలు నేర్చుకొనడము, కొత్తవస్తువులు చూడడము, కొత్తభావములు ఏర్పడడము, కొత్తవారితో సహవాసముచేయడము మొదలయిన వ్యాపారములు నానాటికి వృద్ధిపొందడమువల్ల పిల్లవానిభాషకూడా వృద్ధిపొందుతుంది. ఈపరిస్థితులలో తా నదివరకు ఉపయోగిస్తూ ఉండే శిశుభాషాపదములు వ్యవహారచ్యుతములయి వాటిస్థానమును లౌకికభాషాపదములు ఆక్రమించుకొనడము తటస్థిస్తుంది. కొందరిపిల్లలభాషలో ఈ శిశుభాషాపదములు కొన్ని చాలాసంవత్సరములవరకూ నిలిచిఉంటవి. ఆపదములు ప్రయోగించేటప్పుడు తోడివారు పరిహాసిస్తుఉన్నా అవి విడవజాలనంతటిదృఢముగా నాటుకొనిఉంటవి.

లౌకికభాష నేర్చుకొనడములో పిల్లవాడు ఎన్నోతప్పులుచేస్తూ క్రమముగా వాటిని దిద్దుకొంటూ ఉంటాడు. కొన్నివర్ణముల ఉచ్చారణము అతిసులభముగా పట్టుపడుతుంది; కాని కొన్నివర్ణములు ఎంతప్రయత్నించినా సాధ్యము కావు. కొందరు పిల్లలు కకారమునకు బదులు టకార ముచ్చరిస్తారు. అట్లే గకారమునకుబదులు డకారమును వాడుతారు. నాలుగుసంవత్సరములపిల్లవా డొకడు "అమ్మా టండిడుండ ఏటుండలో ఉండే" అని ఉచ్చరించినాడు. తనఉచ్చారణలో లోపమున్నట్లు ఆపిల్లవా డెరుగడు. ఇతరులు ఉచ్చరించినరీతినే తానుకూడా ఉచ్చరిస్తూన్నట్లు భావించుకొనేవాడు. రకారము చాలామందిపిల్లలు పలుకలేరు. మూడేండ్లపిల్లవాడు 'రారానందకుమారక' అన్నపద్యము రకారమునకు బదులు లకారము ప్రయోగించి చదవగావిన్నాను. ఒక్కరకారముతప్ప తక్కినవర్ణములన్నీ వాడు సరిగా ఉచ్చరించినాడు. కొన్నివర్ణములుచ్చరించలేకపోవడము ఒకచిన్నపిల్లలవిషయములోమాత్రమే కాక వయోవృద్ధులలోకూడా కనబడుతుంది. 60 సంవత్సరములు దాటిన ఆంధ్రబ్రాహ్మణసమాజమత

వ్యాపకుడు అజ్ఞానము అనడానికిబదులు 'అగ్నానము' అనిపలకడము నేనెరుగుదును. క్రొత్తవర్ణములు నేర్చుకొనడములోనూ, తనఉచ్చారణలోని తప్పులు దిద్దుకొనడము లోనూ పిల్లవాడు ఎంతో శ్రద్ధవహిస్తూఉంటాడు. ఒకపిల్లవాడు గుఱ్ఱం అనుటకు బదులు గుయ్యం అనిఉచ్చరించేవాడు. కొంత కాలానికి సరిఅయినఉచ్చారణము నేర్చు కొని మిక్కిలి సంతోషముతో ద్విత్వరకారముతో ఉన్నమాటలు తనకువచ్చినవన్నీ సగర్వముగా పలుకుతూ, ఇతరబాలురు తనవలె ఉచ్చరించగలరో లేరో పరీక్షిస్తూ ఉండేవాడు. క్రొత్తపదము నేర్చుకొన్నప్పుడుకూడా ఎంతో సంతోషపడేవాడు. అయిదు సంవత్సరముల బాలిక స్వంతము అన్నమాట క్రొత్తగానేర్చుకొని 'ఈకారు నీస్వంతమేనా, ఈయిల్లు నీస్వంతమేనా, నాన్న నీస్వంతమేనా' అని ఈవిధముగా తల్లిని అడుగుతూవచ్చినది.

వర్ణోచ్చారణము అలవర్చుకోడానికి చేసేప్రయత్నముకంటె ఎక్కువప్రయత్నము అవసరమవుతుంది పదములను నేర్చుకొనడానికి. నాన్న అనేపదము ఉచ్చరించడానికి పిల్లవాడు ప్రయత్నిస్తూఉన్నసమయములో తల్లి 'నాన్న ఏరీ, నాన్నను చూపించు' అంటూ పిల్లవానితండ్రివైపు చూస్తుంది. పిల్లవాడుకూడా ఆవైపుచూడడానికి అల వాటుపడి క్రమముగా ఆపదముయొక్క అర్థము గ్రహిస్తాడు. మాటల సందర్భములో ఇంకెవ్వరినాన్ననుగురించి మాట్లాడుతున్నా ఆపిల్లవాడు తనతండ్రివంకకే చూస్తాడు. నాన్న అనేది తనతండ్రిపేరే అని వానిభావము. మీనాన్న పేరేమిటిఅని అడుగగా 'నాన్నే'అనిన్నీ, అమ్మపేరు 'అమ్మే'అనిన్ని అంటాడు. ఇతరబాలురు తమతల్లిదండ్రు లను అమ్మా నాన్నా అని పిలవడము విని మొదట వింతగా చూస్తాడు. కాని క్రమ ముగా ఆపదములఅర్థము ఇంకా కొంచెము బోధపడుతుంది. 'పిల్లిపిల్లా, వాళ్ళనాన్నా పోతున్నారు' అంటాడు. తనబంధువులపేళ్ళే కుక్కలకూ పిల్లులకూ చిన్నపిల్లలు పెడు తూ ఉంటారు. ఒకపిల్లవాడు కొన్నిపందులు పోతూఉండడము చూచి "అదిగో వాళ్ళకల్లదోగు (కళ్ళజోడు) నాన్న, వాళ్ళదొడ్డమ్మ, వాళ్ళచిత్తక్కయ్య" అని చూపించినాడట. 'వాళ్ళయింట్లో పాపిపేరేం-కన్నమ్మ' అని అనడములో పాపి అను శబ్దమునకు దాసి అనుఅర్థము కల్పించినాడు: తమయింట్లో దాసిపేరు పాపి. అమ్మ, నాన్న, దాసి మొదలగుఈపదములవాడుక సమగ్రముగా తెలియడానికి ఎంతోకాల ము పడుతుంది.

ఒకావిడ పిల్లవానితో "ఏడుపు మానేస్తే నీకొకతాయిలం పెడతా"నని చెప్పి తరువాత ఖర్జూరప్పండు వానికిచ్చినది. తాయిలం అంటే ఖర్జూరప్పండు అనేభావము ఆ పిల్లవానిమనస్సులో చాలకాలమువరకూ నిలచిపోయినది. ఒకపిల్లవాడు 'జుట్టు అనేమాట నేర్చుకొన్నాడు. ఆవుతోకకుచ్చుకీ, గడ్డములకూ, మీసములకూ, పిలకకూ, సవరమునకూ, కూడా జుట్టు అనేపదమే ప్రయోగిస్తూ ఉండేవాడు. ఈపదములకన్నిటికీ ఉన్నఅర్థభేదము ఎంతో కాలమునకుగాని, ఎంతో ప్రయత్నముమీద కాని బోధపడదు. పడుట, జారుట, కారుట ఓడుట, ఒలుకుట, చిందుట, మొదలయిన భావములు అన్నీ తెలపడానికి సరియైన పదములు వాడుట తెలియక వాటిలో ఏదో ఒకేపదమునే అన్నిఅర్థములలోనూ మొదట ఉపయోగిస్తాడు. వాటిలోని అర్థభేదము కొంతకాలానికి గుర్తించి క్రమముగ ఆయాపదములు ఉపయోగించ గలుగుతాడు.

పదముల స్వరూపము, వాటిఅర్థము, వాటిని ఉపయోగించవలసినవిధము పాఠశాలలో పరభాషనేర్చుకొనేటప్పుడు గురువుబోధించేవిధముగా మాతృభాష నేర్చుకొనేటప్పుడు పిల్లవానికి ఎవ్వరూభోధించరు. సందర్భమునుపట్టి మాటలఅర్థము తెలుసుకోవలసినదేకాని కొత్తపదము వినడము తటస్థించినపుడల్లా ఆపదముయొక్క అర్థము వివరించి చెప్పేవారుండరు. ఒకడు 'ఆవును తీసికొనిరా' అని పలుకగానే రెండవవాడు ఆవును తీసికొనివచ్చుట చూచి దగ్గరగా ఉన్నపిల్లవాడు మొదటివాడు ఉచ్చరించిన మాటలకూ రెండవవాడు చేసినపనికీ గలసంబంధమును గుర్తించి ఆ మాటలభావమును తెలుసుకొంటాడు. 'ఆవును తీసుకుపో' అని ఉచ్చరించగానే దానిని తీసుకుపోవుట చూచి ఆపదముల అర్థముకూడా తెలుసుకొంటాడు. తన చుట్టూ ఉన్నవస్తువులనుగూర్చి తెలుసుకోవలెనను కుతూహలముతో వాటిపేర్లు అడిగి నేర్చుకొంటాడు. దేశభాష ఈవిధముగానే అలవడుతుంది. చెయ్యి అనుపదమునకు బహువచనము చేతులు అనికాని, ఉన్నాడు అనుక్రియకు వ్యతిరేకార్థకము లేదు అనికాని పిల్లవాడికి, పిల్లవాడితో అనేవి పిల్లవాడు అనుశబ్దమునకు షష్ఠీతృతీయావిభక్త్యేకవచనరూపములనికాని పరభాషావిషయములో పాఠశాలలో వ్యాకరణకార్యములు నేర్పునట్లు ఎవరూ నేర్పకపోయినా ప్రతిపిల్లవాడును కొంతవయస్సు వచ్చేటప్పటికి వ్యాకరణాదిదోషములు లేకుండా మాతృభాష సలక్షణముగా ప్రయోగించగలుగుతాడు.

అమెరికాలో ఒకపిల్లవానికి 10 వ నెలలో 3 మాటలుమాత్రమే వచ్చునట. 11 వ నెలలో 12 మాటలు; 12 వ నెలలో 24; 13 వ నెలలో 38; 14 వ నెలలో 48; 15 వ నెలలో 106; 16 వ నెలలో 199; 17 వ నెలలో 232 అల వచ్చుకొన్నాడు. ఆపిల్లవానికి 6 సం॥ గడువగానే ఎన్నిమాటలు వచ్చునో తెలుసుకోవలెనని ఇంట్లోఉన్న వారందరూ ఆపిల్లవా డుచ్చరించినప్రతిపదము వ్రాసిపెట్టుట ఆరంభించినారు. వివిధవిషయములు పిల్లవాడు ప్రసంగించేటట్టుచేస్తూ తనకు వచ్చిన మాట లన్నీ ఉపయోగించేటట్టు వాని కవకాశము కల్పిస్తూ మూడునెలలు పనిచేయగా 2688 మాటలు లెక్కకువచ్చినవట. ఈ లెఖ్ఖలో సంఖ్యావాచకములు, వ్యక్తులపేర్లు (Proper Names) చేరలేదు. ఆపిల్లవానికి ఇంతకంటె ఎక్కువపదములు రావని రూఢిగా చెప్పుటకు వీలులేదు. వాడు ఉపయోగించలేకపోయినా, బోధపరచుకోగలపదములు వందలకొలది ఉండవచ్చు. స్వీడన్‌లో కర్షకులకు ఎన్నిమాటలు వచ్చునో తెలుసుకోవలెనని మిక్కలిశ్రద్ధతో లెఖ్ఖవేసిచూడగా 26,000 పదములు లెక్కకు దొరికినవట. విద్వాంసుల పదజాలములో 40,000 పదములవరకూ ఉండవచ్చును. షేక్స్పియర్ తననాటకములలోనూ పద్యకావ్యములలోనూ ఉపయోగించినపదములన్నీ ఇంచుమించు 20,000 ఉంటవి. మిల్టన్ ఉపయోగించినపదములు 8,000 మాత్రమే. నన్నయ ప్రయోగించినపదములన్నీ ఎనిమిదివేలకు మించి ఉండవు. కవులగ్రంథము లాధారము చేసుకొని భాష నేర్చుకోవలెనంటే లౌకికభాషలోనివి పదవవంతుపదములైనా దొరకవు. అట్లునేర్చుకొనేభాష అసమగ్రముగా ఉంటుంది. దానితో లోకవ్యవహారము సాగించడము అసంభవము.

ఒకగురుపువద్దకాని భాషాశాస్త్రపండితునివద్దకాని ఏదో యొకక్రమమగుపద్ధతి నవలంబించి నేర్చుకొనేదికాక సంఘమునుండి లోకవ్యవహారమువల్ల నేర్చుకొన్నదే లౌకికభాష-లేక మాతృభాష. ఉచ్చారణలోను మాటల నుపయోగించు రీతిలోను ఏయిద్దరిమనుష్యులపద్ధతీ ఒకేవిధముగా ఉండకపోయినా ఒకేసంఘమునందలి వ్యావహారికభాష ఇంచుమించు ఏకముఖముగానే ఉంటుంది. వ్యవహారహాని కలుగకుండా ప్రతిమనుష్యుడూ మాతృభాషను ఉపయోగించుకోగలడు. ఎంతచక్కగా నేర్చుకొన్నదైనాసరే పరభాష మాతృభాష వచ్చినంత సమగ్రముగా అలవడదు.

దీనికి కారణము మాతృభాషాభ్యాసమునకూ పరభాషాభ్యాసమునకూ ఉండే పద్ధతులలోని భేదము, మాతృభాష శైశవావస్థనుండి నేర్చుకొనేది. జ్ఞానము వచ్చిన కొద్దీ ఒక్కొక్క నూతనవిషయము తెలుస్తూన్నకొద్దీ భావములు వాటితోపాటు ఆభావములను వ్యక్తముచేయడానికి తగినభాషా అలవడతవి. ఈమాతృభాషాభ్యాసమునకు పూర్వము ఏవిషయముతోకాని, ఏఇతర భాషతోకాని పరిచయ ముండక పోవడముచేత మాతృభాష చక్కగా అలవడడానికి ఆటంకము లుండవు. పరభాషాభ్యాసము ఆరంభించేటప్పటికి పిల్లవాడు పెరిగి కొంతజ్ఞానమును సంపాదించి మాతృభాష మాట్లాడడము నేర్చిఉంటాడు. ఒకభాష వచ్చినవాడు ఇంకొకభాష నేర్చుకొనేటప్పుడు తనమాతృభాషకు విలక్షణములైన పోకడలను పరభాషలో ప్రవేశపెట్టడము వింతకాదు. ఎంతశ్రద్ధతో పరభాష అభ్యసించినా మాతృభాషయొక్క ప్రాబల్యము (Influence) లేశమైనా లేకుండా ఉండేటంతచక్కగా అది అలవడదు. గాంధీమహాత్ముడు దొరలకంటె బాగా ఇంగ్లీషు మాట్లాడగలడని ఆంగ్లభాషాపండితులైన దొరలే మెచ్చుకొన్నారు. ఆంగ్లభాషలో వారికి గొప్పపాండిత్య మున్నదని వారిభావము. అయితే వారు చేసిన కొన్నికొన్ని ప్రయోగములు ఆంగ్లభాషాసంప్రదాయమునకు వ్యతిరేకముగా నున్నవని, అట్టిప్రయోగములకు హిందీ, గుజరాతీ భాషలప్రాబల్యము కారణమని శ్రీనివాసశాస్త్రిగారు నిరూపించినారు. వ్యవహారములో నున్న మాతృభాషను పరిత్యజించి గ్రాంధికాంధ్రమే వ్రాతలో ఉపయోగించవలెనని దీక్షవహించినవారి గ్రంథములలోకూడా పూర్వకవులవాడుకలో లేని వ్యావహారికభాషారూపములు వేలకొలది అనివార్యములుగా ప్రవేశించినవి. అట్టివారికి నాయకులూ, ఆకార్యముల కొనసాగించడానికి ఏర్పడిన ఆంధ్రసాహిత్య పరిషదధిష్ఠాపకులూ, పూజ్యులూ అయిన శ్రీజయంతి రామయ్యపంతులువారు మొన్నమొన్న ప్రకటించిన ఆంధ్రీకృతోత్తరరామచరితములోనికి "విలపింప నైతిగాదు, లేనేలేదూ? అయినట్లూ, లేనట్లూ?" మొదలగు పచ్చిగ్రామ్యరూపములు ఎక్కినవి. అరువది సంవత్సరములనుంచి పరిశ్రమచేస్తూ ఉన్నదైనా "గ్రాంధిక" మని వ్యవహరింపబడు ఈపరభాష 72 సంవత్సరములనుండి నిత్యవ్యవహారములో ఉన్న వ్యావహారికభాషను అణచివేయజాలదని రూఢిగా దీనివల్ల తెలుస్తూన్నదిగదా!

మాతృభాష శైశవావస్థనుంచి లోకవ్యవహారమునుండి నేర్చుకుంటారు. పరభాష నేర్చుకొనుటకు కొన్నినియమితములైన పద్ధతుల ననుసరించి వ్రాసిన పాఠ్యపుస్తక

ములుమాత్రమే సహాయపడతవి. పరభాషను నేర్పుటకు ఆవృత్తిలో ప్రవీణులైన అధ్యాపకు లుంటారు. మాతృభాష ప్రజలు వ్యవహరించుకుంటూ ఉండగా గమనించి అలవరుచుకొనేదేకాని పరభాషవలె పాఠ్యపుస్తకములు, వ్యాకరణములు, కోశములు మొదలైన గ్రంథముల సాహాయ్యముతో ప్రయత్నపూర్వకముగా నేర్చుకొనేది కాదు.

పరభాష నేర్చుకోడానికి ఇన్ని సౌకర్యము లున్నా మాతృభాష అలవడినంత సమగ్రముగా అలవడదు. ఆపండితుడైనా మాతృభాష చక్కగా మాట్లాడగలిగే ఉంటాడు. ఏపద మెట్లు ఉచ్చరించవలెనో, ఏవిధముగా ప్రయోగించవలెనో ఎరిగి ఉంటాడు. ఎంతటి పండితుడైనా మాతృభాష ఉపయోగించుకొనేటంత చక్కగా పరభాష ఉపయోగించలేడు. మాతృభాషలో 'నీవెందుకు వచ్చావు' వంటితప్పు ప్రయోగ మెవరూ చేయరు. పరభాషలో 'మీ రిట కేల చనుదెంచిరి' వంటి ప్రయోగములు చేయనిపండితులు లేనేలేరని చెప్పవచ్చును.

గుంటూరు, చంద్రికాముద్రాక్షరశాలయందు ముద్రితము